# తెలుగు సాహిత్య చరిత్ర

## ద్వితీయ భాగము

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి

# తెలుగు
# సాహిత్య చరిత్ర

## ద్వితీయభాగము



ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం.ఎ., పిహెచ్.డి., డి.లిట్
విశ్రాంతాచార్యులు, తెలుగుశాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు.

రమణశ్రీ ప్రచురణ
విశాఖపట్టణము

# అంకితము

శ్రీవిద్వత్కవితావిభాకరశుభాశీర్వాదమోదమ్ముతో
జీవద్భక్తికళాసుధాకరసుఖశ్రేయోభిలాషమ్ముతో
భావప్రాభవతారకానివహసౌభాగ్యానుకూల్యమ్ముతో
దైవానుగ్రహదత్తమైనయది మత్సాహిత్యచారిత్రమున్, 1

శ్రీనాథయుగము కవితా
శ్రీనాథాశ్రితము భక్తిశృంగారరసా
న్యూనాతిరేకభరితము
నానారసచిత్రరంగనటరాజునకున్ 2

పంచాక్షరీమంత్రపారాయణము గదా
పేరు విన్నంతనే ప్రేక్షకులకు
అపరసంధ్యాతాండవాడంబరముగదా
ఆట కన్నంతనే అర్భకులకు
నాదానుసంధానమోదావహముగదా
మాట అన్నంతనే మార్మికులకు
పరమబ్రహ్మానందపారవశ్యముగదా
పాట ఉన్నంతనే భావుకులకు
ఇంత ఆరాధనాభావ మింత ఘనత
చిత్రజగదేకవీరుఁడై స్వీకరించు
అద్వితీయసద్వినుతమహానటునకు
అంకితము శ్రీ చిరంజీవిశంకరునకు 3

# తేటగీతి

తల్లి అంజనాదేవి ఆదర్శగృహిణి
తండ్రి "యస్.పి." వెంకటరావు ధర్మరాజు
భార్య అనుకూలమతి గుణవతి సురేఖ
సుగుణరత్నమాణిక్యముల్ సుతుఁడు, సుతలు. 1

కన్య నిచ్చిన మామ రంగస్థలమున
అందె వేసిన చేయి హాస్యరసదాయి
చిత్రసీమను ఉత్తమశ్రేణినటుఁడు
అల్లు రామలింగయ్య మహాయశస్వి. 2

తాను "సూపర్ మెగాస్టార్" ప్రధానమైన
సంజ్ఞ శివశంకరవరప్రసాద్- ప్రసిద్ధ
మైనపేరు చిరంజీవి స్వావలంబి
కొణిదెలకుటుంబి. సోదరుల్ కుడిభుజములు. 3

నిష్కపటనిరాడంబరనియమశీలి
దానధర్మపరాయణధైర్యశాలి
శతసహస్రసదభిమానసంఘముఖ్య
దైవమైన చిరంజీవి ధన్యజీవి. 4

నటన, సాహసోపేతసంఘటన, యుగళ
గీతగతిభేదములు నిత్యనూతనముగ
వేయివెలుఁగులై వెలయుచు వెండితెరల
సార్థకముగ చిరంజీవి అగునుగాత- 5

# భూమిక

పవనాందోళితనారికేళకదళీపత్రావళీనృత్యకో
నవనాంతవ్యవసాయజీవనవిధానప్రాప్తి చెట్టెక్కి, స
త్కవనోద్దీపితనారికేళకదళీద్రాక్షావరీపాకవ
ర్ణవితానవ్యవసాయజీవనవిధానధ్యాన సంప్రాప్తమై. 1

వరగురువాక్సుధారసము వాకలు కట్ట, నిసర్గలాలసాం
కురమును ప్రోది చేసి, నునుక్రొంజిగురాకిడ, పాదుకొల్పి, వం
దిరివయి నిల్పుకొంటి మది తీగలు సాగిన సాహితీలతన్
పరిణతపత్రపుష్పఫలభారగభీరసముజ్జ్వలాకృతిన్. 2

కన్నుల నిపు ఎలైన వడగాల్పుల ధాటికి వాడకుండఁగా
వన్నెల చిన్నెలైన జడివానల దాడికి వీడకుండఁగా
మిన్నుల మ్రోతలైన మిడిమేలపు పిడ్గుల మాడకుండఁగా
సన్నుతసాహితీలత వసంతవికాసము చెందు నిత్యమున్. 3

ప్రాకృతసంస్కృతాదిబహుభాషల భానుమయూఖమాలికల్
సాకినవైన వీ తెలుగు శారద శారదచంద్ర చంద్రికల్
వాకున కందరానివగు స్వాదురసామృతపూర సారశ
య్యాకమనీయముల్ సహృదయప్రకరానుభవైకవేద్యముల్. 4

సాహిత్యార్ణవ మంథనోత్థ చరితాంశస్వచ్ఛకావ్యామృత
గ్రాహిగ్రంథము వాంఛనీయమని పూర్వగ్రంథసంధానముల్
సాహాయ్యమ్ముగ నూతనాంశములతోడన్ తథ్యమిథ్యావివ
క్షాహృద్యమ్ముగ సంఘటింతును యథాశక్తిన్ త్రిథాభక్తమై. 5

# స్వాగతము

సరిగా పాతిక సంవ
త్సరములు ఎం.ఏకు తెలుగు సాహిత్యచరి
త్ర రమణ పాఠము చెప్పిన
పరిపాటిమెయిన్ రచింతు పరమార్థముగా- 1

ఆంధ్రవిశ్వకళాసంసదాంధ్రశాఖ
శిష్యమిత్రసహవ్రతుల్ చేసినట్టి
మామకపదవీవిరమణామంత్రణసభ
ప్రాసెదననిన ప్రకటన వాస్తవముగ- 2

విశ్వవిద్యాలయసహాయవిత్తసంఘ
మున్నతతమవిద్యార్హత, ఉజ్జ్వలపరి
శోధనము, ప్రచురణములు చూచి యిడిన
సార్థగౌరవపదవియు సార్థకముగ- 3

సంగ్రహములు సర్వస్వముల్ సకలవిషయ
కలితసిద్ధాంతగ్రంథముల్ కలవుగాని,
స్నాతకోత్తరతరగతిస్థాయిపాఠ్య
గ్రంథమగు చరిత్రము లేని కారణమున- 4

సహజము ప్రమాదపతితము
ప్రహసనసదృశము ప్రమాణరహిత ముపేక్షా
సహము కువిమర్శ కావున
సహృదయసముచితసమీక్ష సాపేక్షముగా- 5

# స్వవిషయము

జననము: శుక్లనామసంవత్సరాశ్వయుజము. 17-10-1929.

జననీజనకులు: రత్నమణి, మణ్యము.

జన్మస్థలము: కొర్లపాటి వారి పాలెము. కోనసీమ. తూర్పుగోదావరి జిల్లా.

అర్హతలు: ఎం.ఏ. 1957. పిహెచ్.డి. 1965. డి.లిట్. 1976.

ఉద్యోగములు: ట్యూటర్- 1953-55. పశ్చిమగోదావరి జిల్లాకళాశాల, భీమవరము.

ప్రభుత్వకళాశాల, రాజమహేంద్రవరము.

లెక్చరర్- 1959-66 తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్.

పార్ట్‌టైమ్ లెక్చరర్- 1965-66. నాటకశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్.

రీడర్ 1966-83; ప్రొఫెసర్ 1983-89. తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్.

హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు, ఎ.యు. 1979-82.

ఛెయిర్మెన్ బోర్డ్ ఆఫ్ స్టడీస్ (పి.జి.) 1979-80; 1983-86; 1988-89.

ఎమిరిటస్ ఫెలో, యు.జి.సి. 1990-92.

ప్రచురణములు: పరిశోధనపత్రములు 100; పరిశోధనగ్రంథములు 13, సృజనాత్మకగ్రంథములు 8.

పర్యవేక్షణములు: ఎం.ఫిల్ 8; పిహెచ్.డి 13.

స్వీకరణములు:

1. స్వర్ణపదకము. బి.ఏ. జనరల్‌తెలుగు. ఫస్ట్‌క్లాస్ ఫస్ట్‌రేంక్ 1953.
2. ప్రథమబహుమతి. ఉత్తమచారిత్రికనవల. చిత్రశాల. ఆంధ్రవిశ్వకళాపరిషత్. 1955.
3. ప్రథమబహుమతి. ఉత్తమనాటకరచన. సమత. విజయనగరము రాఘవనాటకోత్సవములు 1956.
4. ప్రథమబహుమతులు. బి.ఏ. ఆనర్స్ ఫస్ట్‌క్లాస్ ఫస్ట్‌రేంక్. 1957.
5. ప్రథమబహుమతి. ఉత్తమనాటకరచన. నటన. ఆంధ్రవిశ్వకళాపరిషత్. 1958.
6. ప్రథమబహుమతి. ఉత్తమనాటకరచన. పలనాటివీరచరిత్ర. ఆంధ్రనాటకకళాపరిషత్. 1985.
7. ద్వితీయబహుమతి. ఉత్తమనాటకరచన.

పలనాటివీరచరిత్ర. నాటకసప్తాహము - శివరంజని, కళాసాగర్, తెలుగుచలనచిత్రపరిశ్రమ. 1986.

8. ప్రథమబహూమతి. ఉత్తమనాటకరచన. పలనాటివీరచరిత్ర. భీమవరము నాటకసమితి. 1989.

9. పురస్కారము. ఉత్తమసాహిత్యవిమర్శ. సాహిత్య సమస్యలు. తెలుగు విశ్వ విద్యాయలయము.. 1992.

నియామకములు:

1. ఎక్స్‌పర్ట్ మెంబర్, హైపవర్ కమిటీ ఆన్ పబ్లిక్‌లైబ్రరీస్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్. 1969-74.
2. ఎక్స్‌పర్ట్ మెంబర్, సబ్జెక్ట్ కమిటీ ఆఫ్ బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ ఆఫ్ ఎ.పి.గవర్నమెంట్. 1974-76; 1981-84.
3. మెంబర్, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ. 1979-82.
4. మెంబర్, బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఆఫ్ అదర్‌యూనివర్సిటీస్ 1976-
5. ఎక్స్‌పర్ట్ మెంబర్ ఆఫ్ సెలక్షన్ కమిటీస్ ఆఫ్ అదర్‌యూనివర్సిటీస్ 1979.
6. డైరెక్టర్, యు.జి.సి. నేషనల్ సెమినార్ ఆన్ కంపేరిటివ్ లిటరేచర్, ఆంధ్రాయూనివర్సిటీ 1986.
7. మెంబర్, ఎక్స్‌పర్ట్ కమిటీ ఆఫ్ కామన్ కోర్స్ సిలబస్ ఆఫ్ డిగ్రీకాలేజెస్, ఎ.పి.గవర్నమెంట్ 1987-89.
8. మెంబర్, ఎకడమిక్ కౌన్సిల్, అటానమస్ కాలేజ్ 1988-89.
9. మెంబర్, బోర్డ్ ఆఫ్ స్టడీస్, అటానమస్ కాలేజ్ 1988-
10. మెంబర్, ఎకడమిక్ సెనేట్, ఎ.యు. 1988-89
11. చెయిర్మెన్ ఫేకల్టీ ఆఫ్ ఓరియంటల్ లెర్నింగ్, ఎ.యు. 1988-89
12. మెంబర్, ఎక్స్‌పర్ట్ కమిటీ, యు.జి.సి. 1988.
13. చెయిర్మెన్, ఎక్స్‌పర్ట్ కమిటీ ఫర్ ఇంటర్వ్యూసింగ్ పోస్ట్‌గ్రేడ్యుయేట్ డిప్లొమా ఇన్ ట్రాన్స్‌లేషన్ త్రూ కరస్పాండెన్స్ కోర్సెస్, ఆంధ్రాయూనివర్సిటీ. 1988-91.
14. కోఆర్డినేటర్, ఎకడమిక్ స్టాఫ్‌కాలేజ్. 1988.
15. విజిటింగ్‌ఫెలో, కాకతీయయూనివర్సిటీ. 1989.
16. సిండికేట్ మెంబర్, తెలుగు యూనివర్సిటీ 1989-91.

# పీఠిక

స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర వ్రాయవలయునని సంకల్పము. అందుకు స్నాతకోత్తరతరగతివిద్యార్థులకు సాహిత్యచరిత్ర పాతిక సంవత్సరములు నిరంతరముగ పాఠప్రవచనము చేసిన అనుభవము మూలధనము ముప్పదినాలుగు సంవత్సరములు పరిశోధనము చేసిన, పాతిక సంవత్సరములు పైగా పరిశోధనము చేయించిన అనుభవము చక్రవృద్ధి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో తెలుగుశాఖ 1931 వ సంవత్సరమునందు తేజరిల్లినది. ఆనర్స్‌తరగతులకు బోధన, పరిశోధన కార్యక్రమము ప్రారంభమైనది. అప్పటి తెలుగుశాఖ అధ్యక్షులు పింగళి లక్ష్మీకాంతముగారు సాహిత్య చరిత్రను, సాహిత్యవిమర్శను పాఠ్యప్రణాళికను ప్రవేశపెట్టి, వానికి రూపురేఖలు దిద్ది తీర్చిరి. 1931 వ సంవత్సరమునుండి 1949 వ సంవత్సరము వఱకును వారు పాఠప్రవచనము చేసిన సాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ శిష్యప్రశిష్యుల ద్వారా దేశమంతట దీధితులు ప్రసరించినవి. లిఖితరూపము నందినవి. అవి రూపాంతరము చెంది అచ్చయినవి. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి ఆంధ్ర సాహిత్యచరిత్ర అసమగ్రముగ 1974 వ సంవత్సరమునందు ముద్రితమైనది. లిఖిత ప్రతికి, ముద్రిత గ్రంథమునకు చాల అంతరము కలదు. ఆంతర్యము దురవగాహము. లిఖిత ప్రతియందు అజ్ఞాతయుగము మొదలు ఆధునికయుగము వఱకు కలదు. అందు చక్కని ప్రణాళిక కలదు. సమగ్రమైన సమ్యగవగాహనము కలదు. స్పష్టమైన ప్రతిపాదనము కలదు. కమనీయమైన కవితాశైలి కలదు. అది సమగ్రసుందరమైన అప్పటి సాహిత్యచరిత్ర. ముద్రితగ్రంథము సమగ్రము కాదు. సుందరమును కాదు. ప్రణాళిక సడలినది. అవగాహనము మారినది. ప్రతిపాదనము పలచ బడినది. శైలి శ్లథమైనది. ఉభయత్ర విషయమునకు కాలదోషము పట్టినది. కాఁబట్టి స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర సాపేక్షము.

స్నాతకోత్తరతరగతిపరీక్షలందును, ఉద్యోగార్హతానిర్ణయపరీక్షలందును వ్యాసప్రశ్నలు, వామనప్రశ్నలు అడుగుట సర్వసాధారణము. అవి పాఠ్యప్రణాళికానుసారములు. వ్యాసప్రశ్నలకు సంబంధించిన విషయములు సవిస్తరముగను, వామనప్రశ్నలకు సంబంధించిన విషయములు సంగ్రహముగను ఉండవలయును. ప్రముఖకవుల గుఱించి ప్రత్యంశవివరణము, ఇతరకవుల గుఱించి ప్రత్యేకాంశవివరణము తదనుకూలము. అది ఈ గ్రంథరచనాప్రణాళికకు

ప్రతిపాదిక. ఇది సాహిత్యచరిత్ర గ్రంథరచనాప్రణాళికను సంపదించునదియే.

పూర్వాభిప్రాయములను పునఃపరిశీలనము చేయునెడ, ప్రతిపాదకుల పేరులు తెలుపలేదు. అందుకు రెండు హేతువులు కలవు. 1. విద్యార్థులు, ఉద్యోగార్థులు పరీక్షలందు విపర్యయములకు పాల్పడు ప్రమాదము కలదు. అది వారికి నష్టము కలిగించును. 2. ప్రతిపాదనము ప్రధానము కాని, ప్రతిపాదకుడు ప్రధానము కాదు. అయిన రాగద్వేషములు అంకురించును. అవి కుశంకలకు, కువిమర్శలకు దారి తీయించును. ఉత్తమవిమర్శ వ్యక్తిపరము కాదు. వస్తునిష్ఠము. ప్రతిపాదకుల పేరులు వలయువారికి సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

ఇతరత్ర విపులీకరించిన విషయములు ఇందు సూచనప్రాయముగను, సంక్షేపరూపముననను కలవు. అందుకు రెండు కారణములు కలవు. 1. గ్రంథరచనాప్రణాళిక. 2. గ్రంథప్రయోజనము. జిజ్ఞాసువులకు విపులీకరించిన తావులను సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

ఇట్టి ప్రథమభాగము ప్రకటితపూర్వము. (1991) ఇట్లే ద్వితీయభాగము. (1992) అది స్థూలముగ కవిత్రయయుగము. ఇది సూక్ష్మముగ శ్రీనాథయుగము.

సాహిత్యచరిత్రలు సాధారణముగ పట్టించుకొనని వచనరచన, శ్రీనాథయుగము ప్రత్యేకాధ్యాయనమునకు సంస్కృతభీమఖండసంస్కృతీకరణము, కుమారసంభవాంధ్రీకరణము, సీసపద్యరూపాంధ్రీకరణము; సంశయరాహిత్యమునకు దేవకీనందనశతకమును అనుబంధములు.

అడిగిన పుస్తకములు అందిచ్చిన ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య, ఆచార్య వి. రామచంద్ర, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డాక్టర్ పల్లికొండ ఆపదరావు, డాక్టర్ యస్. గోపాల్, చి॥ యస్. మల్లేశ్వరరావు, చి॥ కొవెరపు వెంకట్రామయ్యలకు -

ముద్రణను సరిజూచుటయందు సహకరించిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, చి. కొవెరపు వెంకట్రామయ్య, చి. మీగడ రామలింగస్వామి, డాక్టర్ సజ్జా మోహనరావులకు

సర్వాంగసుందరముగ ముద్రించిన అక్షర గ్రాఫిక్స్‌వారికి- కృతజ్ఞతలు

- ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# పూర్వరంగము

ఆంధ్ర, తెలుగు శబ్దములందు ఆంధ్రశబ్దమే ప్రాచీనము. తెలుగు శబ్దము అర్వాచీనము. రెండును జాతివాచకములుగ, దేశవాచకములుగ, భాషావాచకములుగ కలవు. పదొకండవశతాబ్ది నుండి పర్యాయపదములు. ఆంధ్రసాహిత్యచరిత్ర అనినను, తెలుగుసాహిత్యచరిత్ర అనినను అర్థమొకటే. అది జాతివాచకముగ కాదు. దేశవాచకముగ కాదు. భాషావాచకముగ మాత్రమే. ఆంధ్రసాహిత్యచరిత్ర అనిన, ఆంధ్రభాషలోని సాహిత్యముయొక్క చరిత్ర. తెలుగు సాహిత్యచరిత్రఅనిన తెలుగు భాషలోని సాహిత్యముయొక్క చరిత్ర.

వాఙ్మయ, సారస్వత, సాహిత్యశబ్దములు సమానార్థకములుగ వ్యవహారమునందు కలవు. సర్వగ్రంథసముదాయము విస్తృతార్థమున వాఙ్మయము. సారస్వతమును విస్తృతార్థమున సర్వగ్రంథసముదాయమే. వాఙ్మయము, సారస్వతము పరిమితార్థమున కావ్యగ్రంథసముదాయము. విస్తృతార్థమున విస్మృతమై, పరిమితార్థము మాత్రమే ప్రసిద్ధమైనది సాహిత్యశబ్దము. అది కావ్యగ్రంథసముదాయము మాత్రమే. సద్యఃపరనిర్వృతి కలిగించునది, కాంతాసమ్మితోపదేశము కావించునది సాహిత్యము. చరిత్ర సప్రమాణనిరూపణాత్మకమైన యథార్థవిషయము. సంభావ్యమైన సమన్వయమును ఉపాదేయమే.

కవుల చరిత్రకు, సాహిత్యచరిత్రకు సామ్యభేదములు కలవు. కవుల చరిత్ర కేవలము కవుల చరిత్రమే. సాహిత్యచరిత్ర కావ్యముల చరిత్ర. ఒకవిధముగ కవుల చరిత్ర సాధనము. సాహిత్యచరిత్ర సాధ్యము. మఱొకవిధముగ కవుల చరిత్ర సోపానపరంపర. సాహిత్యచరిత్ర మహాసౌధము. కవుల చరిత్ర ఫలమే సాహిత్యచరిత్ర. సాహిత్యచరిత్ర దేశచరిత్రను దేదీప్యమానము సేయును. జాతి సంస్కృతిని జాగృతము సేయును. వ్యక్తిచైతన్యమును వ్యవస్థితము సేయును. కావ్యపఠనోత్తేజము కలిగించును. నూతనకావ్యసృష్టికి నూలుపట్టును. ఇది సాహిత్యచరిత్రకు ప్రయోజనము. ఇంత ప్రయోజనము కవుల చరిత్రకు అందని ఫలము. అయినను కవుల చరిత్ర ఫలమే సాహిత్యచరిత్ర

సాహిత్యచరిత్రకు పరిణామక్రమవికాసము జీవనాడి. అది కాలానుక్రమణికను అపేక్షించును. పరిణామకారకుడైన కవి పూర్వరంగప్రవర్తకులైన పూర్వకవుల పూజాఫలములను అందుకొని సూత్రధారియై, కవితాసరస్వతిని నూతనవేషాలంకృతను జేసి, సాహిత్యరంగమున ప్రవేశపెట్టి నృత్యామాడించును.

అట్టి కవి యుగకర్త. యుగకర్త అయిన కవిపరమైన యుగవిభాగమే ఆంధ్రసాహిత్య చరిత్రకు అనువైనది.

చరిత్రకు అందిన మొట్టమొదటి తెలుగు శబ్దము 'నాగబు'. రెండవ శతాబ్ది శాసనమునందు కలదు. మూడవశతాబ్ది నుండి ఆఱవశతాబ్ది వఱకు సంస్కృతప్రాకృతశాసనములందు తెలుగు గ్రామనామములు, మనుష్యనామములు కలవు. ఆఱవశతాబ్ది నుండి తొమ్మిదవశతాబ్ది వఱకు తెలుగు వచనశాసనములు కలవు. తొమ్మిదవశతాబ్ది నుండి పద్యశాసనములు కలవు. తరువోజ, సీసము, మధ్యాక్కర, కందము, చంపకమాల, ఉత్పలమాల పద్యములు కలవు. సంస్కృత శాసనములందు చంపకమాల, కందము, ద్విరదగతిరగడ తెలుగు పద్యములు ప్రతి ఫలించినవి. తరువోజకు పూర్వరూపము ద్విపద. అది, ఇది ప్రథమతః గేయము. ప్రతివాఙ్మయము ప్రాథమికదశను గేయరూపము. తుమ్మెదపదములు, ప్రభాత పదములు, పర్వతపదములు, శంకరపదములు, వాలేశుపదములు, నివ్వాళి పదములు, ఆనందగీతములు, శంకరగీతములు, మంగళగీతములు, శృంగార గీతములు, పండుగ పాటలు, స్త్రీల పాటలు, ఉయ్యేలపాటలు, రోకటిపాటలు మొద లైనవి ప్రాచీనమైన పదకవితాప్రభేదములు- పదకవితాపరిణామమే పద్యకవిత్వము.

నన్నయ ఆదికవి. ఆదర్శకవి. "ఆంధ్రకవిత్వవిశారదుండు" "మహాకవీంద్రుఁడు" "ఉపాధ్యాయసార్వభౌముఁడు, కవితాపట్టాభిషిక్తుఁడు." ఆంధ్రసరస్వతిని నన్నయ కవితామహాసామ్రాజ్యభద్రాసనాసీనురాలిని చేసెను. అందుకు సమధికముగ సంస్కృతసువర్ణాభరణములు కనులవిందుగ తైసేసెను. సంస్కృతకర్ణాటకావ్యసమాసకుసుమావళులను సముజ్జ్వలముగ గుబాళింపఁ జేసెను. దేశిచ్ఛందస్సుల కర్పూరమును, కన్నడఛందస్సుల కస్తూరిని కలిపి సంస్కృతచ్ఛందస్సుల మంగళనీరాజనము లొసగెను. వ్యాసమునీంద్రుని రసభావపదార్థములు కాచి వడపోసి, కరువు కట్టి, గండరువు చేసి, భారతబద్ధనిరూపితార్థచామరమును వీచెను. సర్వప్రామాణ్యచ్ఛత్రమును పట్టెను. వామనుని రీతిసిద్ధాంతము, ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము, కుంతకుని వక్రోక్తిసిద్ధాంతమును త్రివేణీసంగమము వలె తీర్థభూతము చేసెను. ఆంధ్రకవితాపట్టాభిషేకము కావించెను. కారణము, ప్రేరణము తూర్పు చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడు. ఆంధ్రజాతికి సాహిత్యసంపదను అందఁజేసిన రాజరాజనరేంద్రుడు, అందిచ్చిన నన్నయ ఆంధ్రులకు ప్రాతఃస్మరణీయులు.

నన్నయ భాష సలక్షణము. సంస్కృతభూయిష్ఠము. శివకవుల భాష విలక్షణము. సంస్కృతభూయిష్ఠరచన కాదాచిత్కము. జానుతెనుగు రచన అనగా

తేటతెనుగు రచన సార్వత్రికము. అందు వ్యాకరణవిరుద్ధప్రయోగములు బహుళము. నన్నయ ఛందస్సు వైవిధ్యసహితము. శివకవుల ఛందస్సు గ్రంథపరముగ వైవిధ్యరహితము. నన్నయ ప్రక్రియ చంపూకావ్యము. శివకవుల ప్రక్రియ నిర్వచనకావ్యము. అది బహువిధము. మహాకావ్యములు, లఘుకావ్యములు, మహాకావ్యములు ద్విపదకావ్యములు. లఘుకావ్యములు శతకములు, ఉదాహరణములు, రగడలు మొదలైనవి. నన్నయ తత్త్వము బ్రాహ్మణమతము. శివకవుల తత్త్వము వీరశైవమతము. నన్నయ బ్రాహ్మణమతప్రబోధము రుచిరమైనది. శివకవుల వీరశైవమతప్రచారము ప్రచురమైనది. నన్నయ ప్రబోధమునందు స్వమతస్థాపనము గూఢముగ కలదు. శివకవుల ప్రచారమునందు స్వమతస్థాపనము గాఢముగ కలదు. ఉపరి, పరమితనిరసనము పరమదుర్భరముగ కలదు. నన్నయకు కవిత్వము ప్రధానము. మతము గౌణము. శివకవులకు మతము ముఖ్యము. కవిత్వము ఔపచారికము. నన్నయ వస్తువు భారతదేశప్రసిద్ధము. శివకవుల వస్తువు దక్షిణభారతదేశప్రసిద్ధము. నన్నయ కృతి ఆంధ్రీకరణము. శివకవుల కృతులు స్వతంత్రరచనలు. నన్నయ కవిత మార్గకవిత. శివకవుల కవిత- భాష, ఛందస్సు, ప్రక్రియ, వస్తువు దేశీయములైన దేశికవిత.

నన్నయయుగములోని భాషయందు తెనుగు నుడికారము కంటె సంస్కృతప్రౌఢి పరిఢవిల్లినది. శివకవియుగములోని భాషయందు సంస్కృతప్రౌఢి కంటె తెనుగు నుడికారము తేజరిల్లినది. కాని సలక్షణమైన భాష విలక్షణమైనది. అది మఱల తిక్కన యుగమునందు సలక్షణమైనది. వ్యాకరణవిరుద్ధ ప్రయోగములు, వ్యవహార ప్రసిద్ధవైరిపదములు తొలగినవి. సంస్కృతప్రౌఢి కంటె తెనుగు నుడికారము మఱింత తేజరిల్లినది. అది మేలేర్చి కూర్చిన భాషాసమన్వయము. పూర్వయుగములలోని పెక్కు ఛందస్సులను గ్రహించి నూతనచ్ఛందస్సులను ప్రయోగించుట ఛందఃపరమైన సమన్వయము. పూర్వ యుగములలోని పెక్కు ప్రక్రియలను అనుసరించి, నూతనప్రక్రియలను నూల్కొల్పుట ప్రక్రియాపరమైన సమన్వయము. బ్రాహ్మణమతమునకు బ్రహ్మరథము, వైష్ణవమతమునకు క్రాంతిరథము పట్టిన కాలమది. హరుడే పరమదైవమని వీర శైవమతపరమార్థము. హరియే పరమదైవమని వీరవైష్ణవమతపరమార్థము. పరమత నిరసనము వలన వీరశైవ వీరవైష్ణవమతముల సంఘర్షణము సంఘమునందు మారణహోమసంఘటనలకు ఆలవాలమైనది. హరిహరాభేదభావము కల తిక్కన హరిహరనాథరూపమును ధరించు పరతత్త్వమును- హరిహరనాథతత్త్వమును

ప్రతిపాదించుట మతసమన్వయము. అల్పాక్షరముల అనల్పార్థరచన అను మహా కవితాసూత్రమునకు తిక్కన మహాకవిత్వదీక్షావిధి కవితాసమన్వయము.

నన్నయయుగమునకు, శివకవియుగమునకు సమన్వయము తిక్కనయుగమునందు జరిగినది. నన్నయయుగమునకు తిక్కనయుగమునకు సమన్వయము ఎఱ్ఱనయుగమునందు సాగినది. తిక్కన ప్రభావము కంటె నన్నయ ప్రభావము మిన్న. తెనుగు నుడికారము కంటె సంస్కృతప్రౌఢి పరిఢవిల్లినది. పూర్వయుగములలోని ఛందస్సులు చాలవఱకు పునరావృత్తములైనవి. దేశీయచ్ఛందస్సులకంటె సంస్కృతచ్ఛందస్సులు చాలవఱకు స్వకీయములైనవి. వచనమునందు గొలుసుకట్టు రచనము వచ్చినది. వచనములు వెలసినవి. ఉక్తివైచిత్రి కంటె శబ్దవైచిత్రి ఉజ్జ్వలమైనది. అంత్యానుప్రాసము అట్టహాసము చేసినది. స్వతంత్రకావ్యరచనకు స్వాగతము లభించినది. కథాప్రధానమైన పురాణమును రసప్రధానమైన కావ్యముగ రచించు ప్రయత్నము ప్రారంభమైనది. శతకోదాహరణప్రక్రియలు కొనసాగినవి. హరిహరనాథతత్త్వప్రభావము కలదు. అయినను వైష్ణవమతము వైజయింతిని ఎగురవైచినది. శైవమతమునెడ మొగ్గు కలదు. అది వీరశైవము కాదు. ఆగమశైవము. పరమతనిరసనము లేదు. సహనము కలదు.

ఇది పూర్వయుగములకు- స్థూలముగ కవిత్రయయుగమునకు- దిగ్దర్శనము. ఇక శ్రీనాథయుగమునకు సమగ్రదర్శనము-

# విషయసూచిక

## శ్రీనాథయుగము

# శ్రీనాథయుగము

## చారిత్రికనైపథ్యము

శ్రీనాథుడు యుగకర్త. శ్రీనాథయుగము సుదీర్ఘమైనది. సుసంపన్నమైనది కూడ. యావదాంధ్రదేశమును ఆవరించునది. కొండవీటిసామ్రాజ్యము, రాజ మహేంద్రవరరాజ్యము, దేవరకొండరాజ్యము, రాచకొండరాజ్యము, విజయనగర సామ్రాజ్యము తెలుగు సాహిత్యము రసవత్తరమగుటకు ఉద్దీపనవిభావములు.

## కొండవీటి సామ్రాజ్యము

అద్దంకి రాజధానిగా ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రరాజ్యమును స్థాపించెను[1]. "బహుభూము లాక్రమించి యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె"ను. (23ప.1ఆ. హరివంశము.) అనుజులు నలుగురు. అగ్రజుడు మాచారెడ్డి. అవరజులు అన్నారెడ్డి, దొడ్డారెడ్డి, మల్లారెడ్డి. మాచారెడ్డి ధనదపురీప్రభృతిశాఖానగరాధిపతి. (101పుట. వేమభూపాలచరితమ్.) ధనదపురి అన చందవోలు. మల్లారెడ్డి కందుకూరి దుర్గాధిపతి[2]. ప్రోలయ వేమారెడ్డికి పురుషసంతానము లేదు. పెద తమ్ముడు అన్నారెడ్డి పుత్త్రులు అనపోతారెడ్డిని, అనవేమారెడ్డిని తన పుత్త్రులుగ జేసికొనెను[3]. (స్వపుత్రీకృతవాన్.) అనపోతారెడ్డి కూరిమి పుత్త్రుడు. (30ప.1ఆ.హ.వం.) అతడు ప్రోలయవేమారెడ్డి అనంతరము రాజ్యాధిపతి. రాజ్యమును విస్తరింపంజేసి రాజధానిని అద్దంకి నుండి కొండవీడునకు మార్చెను[4]. కొండవీడు రాజధాని అయినది కొండవీటి సామ్రాజ్యము. అనపోతారెడ్డి తర్వాత అనవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి.

అనవేమారెడ్డి రాజ్యకాలము[5] 1364-1386. అతని కాలమునందు కొండవీటి సామ్రాజ్యము శ్రీశైలాదిసింహాద్రిపర్యంతము విస్తరించెను[6]. 1364 వ సంవత్సరము నందు విజయనగరాధీశ్వరుల అధీనమైన వినుకొండ దుర్గము, 1377 వ సంవత్సరమునందు అనవేమారెడ్డికి స్వాధీనమైనది[7]. అనవేమారెడ్డి మహాశివభక్తుడు. షట్కాలశివపూజాపరాయణుడు[8]. కులదైవము త్రిపురాంతకదేవుడు. కులదేవత

మూలఁ గూరమ్మ. 1376 వ సంవత్సరమునందు అనవేమారెడ్డి తన కులస్వామిని మూలగూరమ్మకు అంగరంగభోగసంసిద్ధికై, కోట భూమిలోని పడిదరము, మూల గూరము, పలకలూరు అను మూడు గ్రామములు దానమిచ్చెను[9]. 1377 వ సంవత్స రమునందు శ్రీశైలమున వీరశిరోమంటపము కట్టించెను[10]. 1381వ సంవత్సరము నందు దాక్షారామమున నందిదీపావళి, నాట్యకల్యాణహోమశనివారగయార్క మంటపములు, తిరుచట్టుమాలియ, దివ్యలింగముల గుళ్లు, వజ్రపు రాకోట, గోపు రములు, పాతాళగేహములు, భాండాగారములు, ధాన్యాలయములు, వంటయిండ్లు, చతుర్ద్వారకవాటములు నిర్మింపఁజేసెను[11]. ధాన్యవాటిలో అమృతేశ్వరుని పునః ప్రతిష్ఠించెను[12]. ధర్మవేమన్న అను ప్రసిద్ధినందెను[13].అనవేమారెడ్డి హేమాద్రి దాననిరతుడు[14]. వసంతరాయలు[15]. అంతేకాదు. కవితారసికుడు[16]. అతని ఆస్థాన మునందు బాలసరస్వతి, త్రిలోచనాచార్యుడు సంస్కృతకవులు[17]. ప్రకాశ భారతీయోగి తెలుగుకవి[18]. ఇతడు "సంస్కృతాంధ్రములయం దనేక కావ్యములను రచించెనని చెప్పుదు"రట[19].కాని, ఒక్క కావ్యమును ఉపలబ్ధము కాలేదు. వెన్నెలకంటి సూర్యుడు కూడ తెలుగుకవి[20]

చందవోలు శాఖానగరాధిపతి మాచారెడ్డి పుత్త్రుడు పెదకోమటీంద్రుడు. అతడు పృథ్వీపతిసార్వభౌముడని వేమభూపాలచరితమునందు కలదు. (పుట14.) అంతే కాదు. పెదకోమటీంద్రుడు "వసుధారమణిన్ .. బాహాపరిరంభగుంభసముదం చిత"ను చేసెనని లాక్షణికోదాహృతపద్యము కలదు[21]. మాచారెడ్డి అనంతరము పెద కోమటీంద్రుడు చందవోలు శాఖానగరాధిపతి. పెదకోమటి పుత్త్రుడు వేమారెడ్డి పెదకోమటి వేమారెడ్డి. ఇతడు పిత్ర్యమైన సింహాసనమును అధిష్ఠించెనని వేమభూ పాలచరితమునందు కలదు. (పుట14.) అంతేకాదు. "క్రమపరిప్రాప్తసామ్రాజ్యసింహ సనాధ్యాసియై ..... పెదకోమటన్నవేమాధీశుఁ డర్థిసులభుఁ డౌ కూర్మి పినతండ్రి యనవేమాభూపతి-" అని 1376 నాటి మూలగూరమ్మ శాసనమునందు కలదు[22] పెదకోమటి వేమారెడ్డికి పిత్ర్యమైన సింహాసనము కొండవీటిసింహాసనము కాదు. చందవోలుసింహాసనమే. క్రమపరిప్రాప్తసామ్రాజ్యము కొండవీటి సామ్రాజ్యము కాదు. చందవోలు రాజ్యమే. అది చతురర్ణవమేఖలావలయితమేదినీతలమని వేమ భూపాలచరితమునందు కలదు. (పుటలు104, 107.).అనవేమారెడ్డి మంత్రి మామిడి పెద్దన. (27ప.1ఆ.శృం.నై.) అతని కనిష్ఠపుత్త్రుడు సింగన పెదకోమటి వేమారెడ్డి మంత్రి. (44ప.1ఆ.శృం.నై.) ఇది అనవేమారెడ్డితోడి పెదకోమటివేమారెడ్డి కూరిమి అనుబంధమునకు కొండగుర్తు.

మామిడి సింగనామాత్యుడు నవరత్నోపలదివ్యలింగవరదానప్రీతదాక్షాయణీధ వుడు. అనవద్యద్వాదశీవాసరోత్సవరుక్మాంగదుడు. (144ప.2ఆ.) మందార

ద్రుమమంజరీమధురఝరీమాధుర్యమాధుర్యవాక్సందర్భాస్వదమానమానసకవిగ్రా ముడు. (192ప.5ఆ.) కవితాసిద్ధాంతసర్వజ్ఞుడు. (144ప.6.ఆ.) శ్రీహర్షసుకవికవితా వ్యాహార కథాసుధారసాస్వాదసుఖశ్రీహర్షోదయనిత్యసమాహితాంతరంగుడు. (1ప.3 ఆ.) మృదుమధురచిత్రవిస్తరకవితావిలాసవాగీశ్వరులగు కవీశ్వరుల, పతంజలికణా దాక్షచరణపక్షిలాదిశాస్త్రసిద్ధాంతకమలవనహంసులగు విద్వాంసుల, భరతమ తంగదత్తిలకోహలాంజనేయప్రణీతసంగీతవిద్యారహస్యవిజ్ఞానవైజ్ఞానికస్వాంతులగు కళావంతుల గోష్ఠి కలవాడు. (11వచ.1ఆ.శృం.నై.)

అనవేమారెడ్డి అనంతరము కుమారగిరిరెడ్డిని కాటయవేమారెడ్డి, ధర్మరాజును శ్రీకృష్ణుడు వలె సింహాసనాధ్యాసిని చేసినట్లు తొత్తరమూడి శాసనమునందు కలదు[23]. కుమారగిరిరెడ్డి అనపోతారెడ్డి కుమారుడు. కాటయ వేమారెడ్డి అనపోతారెడ్డి అల్లుడు. కుమారగిరిరెడ్డి తోఁబుట్టువు అన్యమాంబ భర్త[24].శ్రీకృష్ణుడు ధర్మరాజును సింహాసనాధ్యాసిని చేయుటకు మహాభారత యుద్ధము జరిగినది. అది దాయాదకలహము. కాటయ వేమారెడ్డి కుమారగిరిరెడ్డిని సింహాసనాధ్యాసిని చేయుటకును దాయాదకలహము కారణమగును. కుమార గిరిరెడ్డి, పెదకోమటి వేమారెడ్డి దాయాదులు. పెదకోమటి వేమారెడ్డికి అనవే మారెడ్డితోడి కూరిమి అనుబంధము, చందవోలు శాఖానగరాధిపత్యము కొండవీటి సింహాసనమునకు ప్రలోభము కలిగించును. మామిడివంశీయులు కుమారగిరిరెడ్డి మంత్రులు కాలేదు. కారణము వారు పెదకోమటి వేమారెడ్డి పక్షము కావలయును. కుమారగిరిరెడ్డి మంత్రులు కాటయవేమారెడ్డి[25] రాయసభాస్కరుడు[26] రాజ్య కాలము[27] 1386-1402. కుమారగిరిరెడ్డి ఉద్ధతులైన శత్రువులను ధ్వంసము చేయుపని కాటయవేమారెడ్డికి అప్పగించి, అభినవమైన అభినయముల అవలో కనముతోను, వసంతోత్సవముల నిర్వహణముతోను కాలము గడిపెను[28] అభి నవమైన అభినయములను ప్రదర్శించినది లకుమాదేవి[29]. వసంతోత్సవములను వైభవోపేతముగ నిర్వహించినది అవచి తిప్పయసెట్టి కుటుంబము. (హర విలాసము- అవతారిక.) కుమారగిరిరెడ్డికి వసంతరాజబిరుదము కలదు[30]. అతడు వసంతరాజీయమను నాట్యశాస్త్రగ్రంథమును రచించెను. కుమారగిరిరెడ్డి ఆజ్ఞను కాటయవేమారెడ్డి వసంతరాజీయలక్షణానుసారము కాళిదాసనాటకత్రయమునకు వ్యాఖ్యానము రచించెను.

అవచి తిప్పయసెట్టి కుమారగిరిరెడ్డి సుగంధిశాలాధ్యక్షుడు. (30ప.1ఆ.) నానా ద్వీపమహానౌకావ్యాపారి. (26ప.1ఆ.) ఆరాధితపరమేశ్వరుడు (1ప.2ఆ.) పరమే శ్వరీభక్తుడు. (143ప.2ఆ.) త్రిపురాంతకదేవభక్తుడు. (98ప.3ఆ.) శ్రీకాళహస్తీశ్వర భక్తుడు. (60ప.5ఆ.) శ్రీకాళహస్తిప్రాకారాంతఃప్రణీతపాతాళగుహుడు. (1ప.7ఆ.)

పరమమాహేశ్వరాచారభక్తిపరుడు. (11ప.1ఆ.) భారతరామాయణాదిభవ్యపురాణ పరిశీలకుడు. (1ప.2ఆ.) విద్యాపాండిత్యవివేకుడు. 195ప.7ఆ.) కవిసంఘమనో రథకల్పతరువు. (103ప.4ఆ.హర.వి.)

కుమారగిరిరెడ్డి అనంతరము పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి. అది క్రమపరిప్రాప్తము కాదు. భుజబలసంక్రాంతము. కుమారగిరిరెడ్డిని రాజ్యభ్రష్టుని చేసి సాధించినది[31]. రాజ్యకాలము[32] 1402-1420. పెదకోమటి వేమారెడ్డి ప్రధానముగ శివభక్తుడు. అతని గురువు శంకరమౌని. మంత్రి మామిడి సింగనామాత్యుడు. విద్యాధికారి శ్రీనాథుడు. సింగనామాత్యుని గురువును శంకరమౌనియే. (1ప.6ఆ.శృం.) బహుశః శ్రీనాథుని గురువును శంకరమౌనియే అగును. నలుగురును 1405 వ సంవత్సరమునందు శ్రీశైలయాత్ర చేసినట్లు, అచట శివరాత్రి నాడు పెదకోమటి వేమారెడ్డి గురుశంకరమౌనికి పినపాడు గ్రామమును దానమిచ్చినట్లును శాసనము కలదు[33]. పెదకోమటి వేమారెడ్డి ధర్మకీర్తిలత శ్రీశైలమునందు వేళ్లూని, త్రిపురాంతకమునందు తీగ సాగి, పంచారామములందు పందిరులపై ప్రాకి, సింహాచలశ్రీకూర్మపురుషోత్తమములందు పుష్పించి, కాశీవిశ్వేశ్వరుని సన్నిధిని నిత్యోపహారోచితముగ ఫలించినట్లు 1410 వ సంవత్సరము నాటి శాసనమునందు కలదు[34]. అదే సంవత్సరము పెదకోమటి వేమారెడ్డి భార్య సూరాంబ సంతానసాగరమను పెద్ద తటాకమును త్రవ్వించెను[35]. దానికి 1415 వ సంవత్సరమునందు వారి కుమారుడు రాచవేమారెడ్డి జగనొబ్బగండకాలువ సమకూర్చెను[36].

పెదకోమటి వేమారెడ్డి స్వయము పండితుడు. మహాపండితపోషకుడు కూడ.

పెదకోమటి వేమారెడ్డి సాహిత్యచింతామణి అను అలంకారశాస్త్రగ్రంథమును రచించెను. అందు తాను రచించిన వీరనారాయణచరితమను పేరిటి ఒక భాణమును మఱొక కావ్యమును ఉదాహరించెను. సంగీతచింతామణి అను సంగీతశాస్త్రగ్రంథమును కూడ రచించెను. అమరుకశతకమునకు శృంగారదీపిక అను వ్యాఖ్యను, గాథాసప్తశతి నుండి సప్తశతీసారమును సంకలనము చేసి భావదీపిక అను వ్యాఖ్యను రచించెను. ఇవియెల్ల సంస్కృతగ్రంథములు[37]. పెదకోమటి వేమారెడ్డి ఆస్థానమున వామనభట్టబాణుడుసంస్కృతకవి. శ్రీనాథుడు విద్యాధికారి. తెలుగుకవి.

పెదకోమటి వేమారెడ్డి 1404 వ సంవత్సరమున యజురామ్నాయవేది, నిత్యాన్నదానవ్రతి, మహాజ్యోతిష్కుడు అయిన పెద్దియజ్వకు కల్వపాముల గ్రామము[38]

భూలోకధన్వంతరి భాస్కరార్యునకు పొన్నుపల్లి గ్రామము[39]. ఎల్లేపల్లి లక్ష్మణ దీక్షితులకు షడ్దర్శనాల వల్లభసోమయాజికి పెద్దపూడి గ్రామము[40] దానమిచ్చెను. 1408 వ సంవత్సరమున యజనయాజనాధ్యయనాధ్యాపకదానప్రతిగ్రహ షట్కర్మనిరతుడు పిశిపాటి రామభద్రసోమయాజికి పొట్లపాడు గ్రామము[41] ఫణిరాజమహాభాష్యఫక్కికాపరమేష్ఠి కర్మబ్రహ్మపరామర్శమీమాంసామాంసలాత్మకుడు, కణభుగ్గ్రథితగ్రంథసింధుమంథానభూధరము, అక్షపాదమతప్రేక్షపక్ష్మలీకృతచేతస్కుడు సింగనార్యునకు పొన్నుపల్లి గ్రామము[42] దానమిచ్చెను. 1409 వ సంవత్సరమున మఱల పెద్దియజ్వకు నందమూరు గ్రామము[43] దానమిచ్చెను. 1413 వ సంవత్సరమున విద్యావినయాన్వితుడు విశ్వేశ్వరవిద్వాంసునకు ఆలపాడు గ్రామము[44] దానమిచ్చెను. 1415 వ సంవత్సరమున పెద్దియజ్వ కుమారుడు రామచంద్రజ్యోతిష్కునకు రుద్రవర గ్రామము దానమిచ్చెను[45]. ఈ దానములకు శాసనములు విద్యాధికారి శ్రీనాథుని కృతులే.

పెదకోమటి వేమారెడ్డికి పూర్వము చందవోలు రాజ్యము వలె, పెదకోమటి వేమారెడ్డి కాలమునందు కొండపల్లి రాజ్యము కలదు. కొండపల్లి శాఖానగరమైనది కొండపల్లిరాజ్యము. పెదకోమటి వేమారెడ్డి సహోదరుడు మాచారెడ్డి కొండపల్లి రాజ్యాధిపతి. అతని ఆస్థానమున భావయ నారన విద్వాంసుడు[46]. పెదకోమటి మాచారెడ్డి సకలభాషాకవితామూర్ధాభిషిక్తుడు, విద్వన్నిరూఢరాజాస్థానసుధాంభోధిపూర్ణచంద్రుడు, గద్యశ్రీబాణకవి, పద్యశ్రీకాళిదాసకవి అయిన పోతన అను విద్వత్కవికి పెదకోమటిపురమను పేర బల్యపల్లిపురము దానమిచ్చెను[47]. మాచారెడ్డి తర్వాత అతని కుమారుడు తిప్పారెడ్డి కొండపల్లి రాజ్యాధిపతి. ఇతని ఆస్థానమున నరహరి విద్వాంసుడు[48].

పెదకోమటి వేమారెడ్డి తర్వాత అతని కుమారుడు రాచవేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి. రాజ్యకాలము[49] 1420-1424. శ్రీనాథుడు అతని విద్యాధికారి అగును. రాచవేమారెడ్డి ప్రజోపయోగకరముగ జగనొబ్బగండకాలువ సమకూర్చినవాడే కాని, సామ్రాజ్యాధిపతిగ ప్రజాకంటకములైన పన్నులు విధించుటవలన ప్రజావిప్లవమునకు బలిపశువయ్యెను[50]. విజయలక్ష్మి విజయనగరాధీశ్వరుని వరించినది. అది కొండవీటి సామ్రాజ్యమునకు చరమాంకము.

## రాజమహేంద్రవరరాజ్యము

కుమారగిరిరెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమునందు, కాటయ వేమారెడ్డి సంపాదించినది రాజమహేంద్రవరరాజ్యము. రాజధాని రాజమహేంద్ర

వరము. తొలి రాజ్యాధిపతి కుమారగిరిరెడ్డి కుమారుడు అనపోతారెడ్డి. రాజ్యకాలము[51] 1390-1395. మలి రాజ్యాధిపతి కాటయ వేమారెడ్డి. రాజ్య కాలము[52] 1395-1414. కాటయ వేమారెడ్డి విష్ణుభక్తుడు. రాజమహేంద్రవరములోని మార్కండేయేశ్వరుని గాక, గోపీనాథస్వామిని మ్రొక్కిన వాడు[53]. కాటయ వేమారెడ్డి అనంతరము అల్లాడరెడ్డి రాజమహేంద్రవరరాజ్యాధిపతి. రాజ్యకాలము[54] 1414-1420. రాజ్యాధికారము కాటయ వేమారెడ్డి కూతురు అనితల్లిదయినను, అల్లాడరెడ్డి రాజ్యాధిపతి అగుటకు కారణములు ఆమె తరుణి అగుట, బలవంతులైన బహిశ్శత్రువు లుండుట అగును. కాటయ వేమారెడ్డి వంశగురువైన ఘోడెరాయభీమేశ్వరుడు అల్లాడరెడ్డికి రాజ్యమొసగెను. (32వచ.1ఆ.భీమేశ్వర పురాణము.)

అల్లాడరెడ్డి తర్వాత అనతికాలము రాజమహేంద్రవరరాజ్యము అల్లాడరెడ్డి అగ్రజుడైన అనప్రోలారెడ్డి కుమారులు కుమారగిరిరెడ్డికి, అనపోతారెడ్డికి వశమైనది[55]. అల్లాడరెడ్డి కుమారులు వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నయరెడ్డి. నలుగురును దాశరథులు. వేమారెడ్డి, వీరభద్రారెడ్డి రామలక్ష్మణులు. వీరభద్రారెడ్డి అనితల్లి భర్త. అన్యాక్రాంతమైన రాజమహేంద్రవరరాజ్యమును వీరభద్రారెడ్డికి స్వాధీనము చేసి, రాజ్యపీఠమెక్కించినది వేమారెడ్డి. (10ప.1ఆ.కాశీ ఖండము, 34ప.1ఆ.భీ.పు.,58ప.1ఆ.శివలీలావిలాసము.) అందువలన అల్లాడ వేమారెడ్డి, వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరరాజ్యసంయుక్తాధిపతులయిరి. రాజ్యకాలము[56] 1423-1445.

అల్లాడ వేమారెడ్డి మహాశివభక్తుడు. అతడు శంభువును అర్చించునపుడు రెండవ శంభువు అనిపించునట. (36ప.1ఆ.కా.ఖం.) అతని భార్య జియ్య మల్లసానమ్మ చళుక్యభీమవరములోని చాళుక్యభీమేశ్వరునికి భూదానము చేసెను[57]. అల్లాడ వేమారెడ్డి 1423 వ సంవత్సరమున వేమవరమను పేరుతో, వెదురుపాక, పినమహేంద్రవరము అను గ్రామములు కలిపి, వేదపండితులు, పదవాక్య ప్రమాణపరాయణులు, వ్యాఖ్యాతలు అయిన విద్వాంసులకు అగ్రహారము నిచ్చెను[58]. 1434 వ సంవత్సరమున స్వభుజార్జితమైన కలువపల్లి, ఒడ్డాది, పొట్నూరు మొదలైన స్థలములకు చెందిన దైవములకు, బ్రాహ్మణులకు యథాపూర్వముగ అగ్రహారములు పునరుద్ధరించెను[59] అంతేకాదు. వేమారెడ్డి పర్యవేక్షణములో వీరభద్రారెడ్డి ఆచరణమునందు అగ్రహారములు అగ్రహారములే అయినవి. (37ప.1ఆ.కా.ఖం., 41ప.1ఆ.భీ.పు) వేమారెడ్డి పోషించిన సంస్కృత కవితాబ్రహ్మ సరస్వతీభట్టు[60].

వీరభద్రారెడ్డి కూడ మహాశివభక్తుడు. త్రికాలశివపూజాపరాయణుడు. (49ప. 1ఆ.కా.ఖం.) రాజమహేంద్రవరములోని మార్కండేయేశ్వరస్వామికి అగ్రహారము లొసగెను. (42ప.1ఆ.భీ. పు.) వీరభద్రారెడ్డి భార్య అనితల్లి మార్కండేయేశ్వరుని సన్నిధిని ప్రథితపరహితాఖ్యులైన వైద్యులకు కలువచేఱు అను గ్రామమును దానమిచ్చెను[61]. వీరభద్రారెడ్డి కూడ కర్పూరవసంతరాయలు. (45వచ.1ఆ.కా.ఖం.) వీరభద్రారెడ్డి ఆస్థాన విద్వాంసుడు శ్రీనాథుడు.

అల్లాడ వేమవీరభద్రారెడ్ల మంత్రి బెండపూడి అన్నయామాత్యుడు. అతని తాత అన్నమంత్రి కాకతిప్రతాపరుద్రచక్రవర్తి గజసాహిణి. (48ప.1ఆ.) అతడు కొలను ప్రతాపరుద్రునిచే అరేడు అగ్రహారమును బడసెను. (50ప.1ఆ.) అన్నయామాత్యుని అన్న లింగన అల్లాడరెడ్డి మంత్రి. (63ప.1ఆ.) అతడు నవీనరుక్మాంగదుడు. (61ప.1ఆ.) అల్లాడ వేమారెడ్డిచే బోడసకుఱ్ఱు అగ్రహారముగ బడసెను. (65ప.1.ఆ.) అల్లాడ వేమావీరభద్రారెడ్ల మంత్రి అయిన బెండపూడి అన్నయమాత్యునికి అరబీ, తురుష్క, గజ, కర్ణాట, ఆంధ్ర, గాంధార, ఘూర్జర, మలయాళ, శక, సింధు, సౌవీర, బర్బర, కరహాట, పారసి భాషలు వచ్చును. (74ప.1ఆ.) అన్నయామాత్యుడు మహాశివభక్తుడు. త్రికాల శివపూజాపరాయణుడు. (80ప.1.ఆ) తమ తల్లి రామమ్మ పేర రాజమహేంద్రవరములోని మార్కండేయేశ్వరుని మ్రోల రామేశ్వరుని ప్రతిష్ఠించెను. సంగమేశ్వరమునందు శివలింగమునకు కల్యాణగర్భగృహము కట్టించెను. దాక్షారామమునందు భీమేశ్వరునికి మొగలి వాకిటి ధామము, సప్తగోదావరసోపానసరణియొద్ద భవనము నిర్మించెను. (75ప.1ఆ.భీ.పు.) అది 1428 వ సంవత్సరమునందు నిర్మించినట్లు శాసనప్రమాణము కలదు[62]. బెండపూడి అన్నయామాత్యుడు భాట్టప్రభాకరప్రస్థానసంవేద్యుల, ఉద్దండపండితుల, ఫణిఫభాషితభాష్యఫక్కికాభావజ్ఞుల, ఉత్తమప్రాగల్భ్యుల, కణభుజ్మతగ్రంథ గాఢార్థవిదుల, బాహుశ్రుత్యసంపన్నుల, వేదాంతవాసనావిశ్రాంతహృదయజ్ఞుల, ఉపనిషత్తత్త్వజ్ఞుల, ఉభయభాషాకవీశ్వరుల, గోష్ఠి కలవాడు. (21ప.1ఆ.భీ.పు.) భారవిసంకాశమహాకవీంద్రపరిషత్ప్రస్తూయమానోదయుడు. (211ప.4ఆ.భీ.పు.)

రాజమహేంద్రవరరాజ్యము 1444 వ సంవత్సరము వఱకు స్వతంత్రము. 1444వ సంవత్సరమునుండి 1448వ సంవత్సరము వఱకు పరతంత్రము. 1444వ సంవత్సరము నాటి దాక్షారామశాసనమునందు విజయనగరాధీశ్వరుడైన ప్రౌఢ దేవరాయల మహాప్రధాని మల్లెభూపాలుడు రాజమహేంద్రపురవరాధీశుడుగ కలడు[63]. శాసనాంతమునందు "-సర్వమాన్యంగాను అల్లాడ్రెడ్డి వేమారెడ్డిగారి ఆజ్ఞను సమర్పణ చేస్తిమి." అని కలదు[64] వీరభద్రారెడ్డి ప్రసక్తి లేదు. అనగా ఆ సంవత్సరము నాటికి రాజమహేంద్రవరరాజ్యము విజయనగర

సామ్రాజ్యవిధేయమైనట్లు, అల్లాడ వేమారెడ్డి నామకరాజైనట్లు, వీరభద్రారెడ్డి వీరస్వర్గ మలంకరించినట్లు అవగాహనమగును. 1448 వ సంవత్సరము నాటి పెనుగొండ శాసనమునందు పెనుగొండపురము (పశ్చిమగోదావరీమండలము) గజపతిక్షోణీశుని అధీనమైనట్లు కలదు[65]. గజపతిక్షోణీశుడన కపిలేంద్రగజపతి. ఆ సంవత్సరమునకు ముందే రాజమహేంద్రవరరాజ్యము కపిలేంద్రగజపతి కైవసమగును. అది రాజమహేంద్రవరరాజ్యమునకు చరమాంకము.

## దేవరకొండరాజ్యము

దేవరకొండ రాజధాని అయినది దేవరకొండ రాజ్యము. మొదటి దేవరకొండ రాజ్యాధిపతి మొదటి మాదానేడు. (99వచ. వెలుగోటి వారి వంశావళి) రాజ్యకాలము[66] 1360-1384 (?). అతని తర్వాత అతని పెద్ద కుమారుడు పెదవేదగిరినేడు, పెదవేదగిరినేని కుమారులు రామచంద్రుడు, కుమారమాదానేడు. (రెండవ మాదానేడు.). కుమారమాదానేని కుమారులు పినవేదగిరినేడు, లింగమనేడు. (99వచ. 103వచ.వె.వం.) మొదటి మాదానేని అనంతరము పెదవేదగిరినేడు, రెండవ మాదానేడు, పిన వేదగిరినేడు, లింగమనేడు క్రమ పరిపాలకులు. పినవేదగిరినేడు, లింగమనేడు పెదకోమటి వేమారెడ్డికి, పెదకోమటి మాచారెడ్డికి సమకాలికులు. (104-110ప.వె.వం.) లింగమనేడు అల్లాడ, వేమవీరభద్రారెడ్లకును సమకాలికుడు. (114-118ప.వె.వం.) లింగమనేని కాలమునందే దేవరకొండ రాజ్యము బహమనీసులతాను వశమైనది[67].

## రాచకొండరాజ్యము

రాచకొండ రాజధాని అయినది రాచకొండరాజ్యము. మొదటి రాచకొండ రాజ్యాధిపతి మొదటి అనపోతానేడు. (99వచ.వె.వం.) అతడు మొదటి మాదానేని అన్న. (65ప.వె.వం.) మొదటి అనపోతానేని రాజ్యకాలమును[68] 1360-1384 (?). అతని కుమారులు పెద సింగమనేడు. ధర్మానేడు. (138ప.వె.వం.) పెద సింగమనేడు మొదటి సింగమనేడు. అతని కుమారులు పిన సింగమనేడు, అన్నమనేడు. (146వచ.వె.వం.) పిన సింగమనేడు రెండవ సింగమనేడు. అతని కుమారుడు అనపోతనేడు. (149వచ.వె.వం.) ఇతడు రెండవ అనపోతనేడు. ఈతని కుమారులు సర్వజ్ఞసింగమనేడు. వసంతరాయలు. (156వచ.వె.వం.) ఈ సర్వజ్ఞసింగమనేడు మూడవ సింగమనేడు. రెండవ సింగమనేడును సర్వజ్ఞవిశిష్టుడు[69]. మొదటి అనపోతనేని అనంతరము- మొదటి సింగమనేడు, రెండవ సింగమనేడు, రెండవ

అనపోతనేడు, మూడవ సింగమనేడు క్రమపరిపాలకులు. రెండవ సింగమనేడు మొదటి సర్వజ్ఞసింగభూపాలుడు. మూడవ సింగమనేడు రెండవ సర్వజ్ఞసింగ భూపాలుడు. రెండవ సర్వజ్ఞసింగభూపాలుని రాజ్యకాలము[70] 1425-1453. రెండవ సర్వజ్ఞసింగభూపాలుని కాలమునందే రాచకొండరాజ్యము బహమనీసులతాను వశమైనది[71].

మొదటి అనపోతానేని ఆస్థానకవి పశుపతినాగనాథుడు. 1369 వ సంవత్సరమునాటి అయ్యవోలు శాసనము, మదనవిలాసభాణమును ఆతని సంస్కృత కృతులు[72]. విష్ణుపురాణము తెలుగుకృతి. ఒక పద్యము "ఉదాహరణపద్యము" లందు ఉదాహరింపఁబడినది. కాని గ్రంథము సముపలబ్ధము కాలేదు. మొదటి సర్వజ్ఞసింగభూపాలుడు రసార్ణవసుధాకరమను అలంకారశాస్త్రగ్రంథమును, సుధాకరమను సంగీతరత్నాకరవ్యాఖ్యానమును రచించెను. అతని ఆస్థానకవి విశ్వేశ్వరుడు చమత్కారచంద్రిక అను అలంకారశాస్త్రగ్రంథమును రచించెను. రెండవ సర్వజ్ఞసింగభూపాలుని ఆస్థాని మహావ్యాఖ్యాత మల్లినాథసూరి[73].

అన్నదమ్ములైన రాచకొండ, దేవరకొండ వెలమరాజులు విష్ణుభక్తులు.

# విజయనగరసామ్రాజ్యము

మొదటి హరిహరరాయలు (1336-1355), మొదటి బుక్కరాయలు (1355-1377), రెండవ హరిహరరాయలు (1377-1404), రెండవ బుక్కరాయలు (1404-1406), మొదటి (ప్రౌఢ) దేవరాయలు (1406-1422) రామచంద్రరాయలు, వీరవిజయభూపతి ఉరఫు మూడవ బుక్కరాయలు (1422-1423) రెండవ ప్రౌఢదేవరాయలు (1423-1446) మల్లికార్జునరాయలు (1446-1465) విరూపాక్షరాయలు (1465-1478) సంగమవంశజులైన విజయనగరసామ్రాజ్యాధిపతులు[74]. వీరందఱు శైవులు. శివాచార్యుల శిష్యులు[75]. వీరి రాజగురువులు క్రియాశక్తిపీఠాధిపతులు. వారు కాశీవిలాసక్రియాశక్తి, వాణీవిలాసక్రియాశక్తి, విద్యాశంకరక్రియాశక్తి, త్ర్యంబక క్రియాశక్తి, చంద్రభూషణక్రియాశక్తి. వీరి శాసనములు 1347 వ సంవత్సరము నుండి 1431 వ సంవత్సరము వఱకు కలవు[76]. క్రియాశక్తిపీఠము కాలాముఖ శైవ సంప్రదాయమునకు చెందినది.

రెండవ ప్రౌఢదేవరాయల ఆస్థానమునందు గౌడడిండిమకవిసార్వభౌముడైన అరుణగిరినాథుడు సంస్కృతకవి[77]. ఆతని కృతులు యోగానందవల్లీప్రహసనము, మహానాటకసుధానిధి, రామాభ్యుదయము. మహానాటకసుధానిధి, రామాభ్యుద

యము ప్రౌఢదేవరాయల పేర కలవు. అరుణగిరినాథుడు తన కుమారునికి తన పేరు పెట్టి నందుకు వీరవిజయభూపతి (మూడవ బుక్కరాయలు) ముడియనూరు అగ్రహారముగ ఒసగి వేయించిన శాసనము కలదు[78]. వీరవిజయభూపతి రెండవ ప్రౌఢదేవరాయల తండ్రి.

రెండవ ప్రౌఢదేవరాయల ఒక సామంతుడు పంట మైలారురెడ్డి. అతని శాసనములు 1424, 1429 సంవత్సరములందు కలవు[79] మఱొక సామంతుడు సాంపరాయని తెలుంగురాయలు. ఇతని శాసనములు 1428, 1438, 1442, 1444 సంవత్సరములందు కలవు[80].

ఇది శ్రీనాథుని జీవితకాలములోని చారిత్రికనైపథ్యము.

# శ్రీనాథుడు

శ్రీనాథుడు బ్రాహ్మీదత్తవరప్రసాదుడు. ఉరుప్రజ్ఞావిశేషోదయాజిహ్మాస్వాంతుడు. ఈశ్వరార్చనకళాశీలుడు. బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారితబ్రహ్మజ్ఞానకళానిధానము. (13ప.1ఆ.శృం.నై.) సకలవిద్యాసనాథుడు. (ఆ.గ.శృం.నై.) అఖిలపురాణవిద్యాప్రవీణుడు. అధ్వర్యువేదశాఖాధీతినిష్ణాతుడు. (అధ్వర్యువేదశాఖ అన కృష్ణయజుర్వేదము.) ఉభయభాషాకవిత్వప్రయోగకుశలుడు. (8ప.1ఆ.హా.వి.) ఆగమజ్ఞాననిధి. తత్వార్థఖని. (21ప.1ఆ.హ.వి.) అమలమతి. (23ప.1ఆ.భీ.పు.) కవిసార్వభౌముడు. (14ప.1ఆ; ఆ.గ.కా.ఖం.) కర్ణాటక్షితినాథమౌక్తికసభాగారాంతరాకల్పితస్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్టు. (265.ప.కా.ఖం.) కర్ణాటక్షితినాథుడన విజయనగరరాజు.

"సంస్కృతప్రాకృతశౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞానపాటవంబు
పన్నగపతిసార్వభౌమభాషితమహా
భాష్యవిద్యాసమభ్యాసబలము
నక్షపాదకణాదపక్షిలోదీరిత
న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంత
కబళనవ్యుత్పత్తిగౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండనైష
ధప్రముఖవివిధప్రబంధము లొనర్చి. 18
కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన" 19ప.1ఆ.

సుకవి. (నాసికేతోపాఖ్యానము.)

# కాలము

"కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టనాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్.
10ప.1ఆ.భీ.పు.

అని శ్రీనాథుని పితామహస్తుతి. కమలనాభామాత్యుడు శ్రీనాథుని అనుఁగుందాత. అంతేకాదు. వినమత్కాకతిసార్వభౌముడు. వినమత్‌శబ్దము తత్కాలశత్రర్థకము. నమస్కరించుచున్న కాకతిసార్వభౌముడు కలవాడని అర్థము. కాకతిసార్వభౌముడు కమలనాభామాత్యుని కొంతకాలముపాటు నమస్కరించెడివాడని తాత్పర్యము. కమలనాభామాత్యుడు వినమత్కాకతిసార్వభౌము డగుటకు కేవలపరమావధి 1323 వ సంవత్సరము. కారణమది కాకతీయసామ్రాజ్యమునకే చరమావధి. కమలనాభామాత్యుడు వినమత్కాకతిసార్వభౌముడైన కాలము కనీసము 1320-1323 కావలయును. తత్కాలమున కాకతిసార్వభౌముడు కడపటి కాకతీయసామ్రాజ్యాధిపతి ప్రతాపరుద్రచక్రవర్తి. సామ్రాజ్యాధీశ్వరుడైన ప్రతాపరుద్రచక్రవర్తి పట్టణాధీశ్వరుడైనకమలనాభామాత్యునికి నమస్కరించుటకు, కమలనాభామాత్యుడు అప్పటికి నలుబదిసంవత్సరముల వయస్సు వాడు కావలయును. కావున కమలనాభామాత్యుని జననకాలము 1320-40=1280 ప్రాంతమగును. అతడు బహుకాలము బ్రదికిన 1370 వ సంవత్సరము నాటికి తొంబది సంవత్సరముల వయస్సు వాడగును. అంతకంటె ఎక్కువ కాలమును జీవించియుండుట సంభవమే కాని, శ్రీనాథునికి "అనుఁగుందాత" అగుట అసంభవము. 1370 వ సంవత్సరము నాటికి కమలనాభామాత్యుడు శ్రీనాథునికి "అనుఁగుందాత" అగుట అపరిహార్యము. అప్పటికి శ్రీనాథునికి కనీసము పదిసంవత్సరముల వయస్సు ఉండక తప్పదు. కాబట్టి శ్రీనాథుని జననకాలము 1370-10=1360 ప్రాంతమగును[81].

ఇక శ్రీనాథుని అవసానకాలము[82]-

"కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ బొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ

సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరి వాఁకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేదు నూర్లు.
కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁ డిచ్చుఁ
గైలాసగిరి పంట మైలారు విభుఁ డేఁగె
దినవెచ్చ మే రాజు తీర్పఁ గలఁడు
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వాని పంక్తిఁ గలుగు
భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

అని శ్రీనాథుని హంసగీతి. భాస్కరుడు అనవేమారెడ్డి, కుమారగిరిరెడ్డి కాలములందలి రాయసభాస్కరుడు. అతడు ముందే దేవుని పాలికి అరుగును. విస్సనమంత్రి రెండవ ప్రౌఢదేవరాయల మంత్రి. రెండవ ప్రౌఢదేవరాయల రాజ్యాంతకాలము 1446 వ సంవత్సరము. తెనుంగు రాయరాహుత్తుండు సాంప రాయని తెలుంగాధీశుడు. రెండవ ప్రౌఢదేవరాయల సామంతుడు. అతని ఉనికి 1444 వ సంవత్సరము తర్వాత లేదు. పంట మైలారువిభుడు కూడ రెండవ ప్రౌఢదేవరాయల సామంతుడు. ఇతని ఉనికి 1429 వ సంవత్సరము తర్వాతనే లేదు. వీరారెడ్డి అల్లాడవీరభద్రారెడ్డి. 1444 వ సంవత్సరము నాటికి వీరస్వర్గ మలంకరించెను. 1446 వ సంవత్సరము తర్వాత రాజపోషకులు, మహారాజ పోషకులు లేక శ్రీనాథుడు నిరాశ్రయుడు. కృష్ణానదీతీరమునందలి బొడ్డుపల్లెను గుత్తకు గొనెను. ఈ గుత్తవ్యవసాయమునకు ముందు శ్రీనాథునికి సొంత వ్యవసాయము కలదు. 1408 వ సంవత్సరము నాటి పొన్నుపల్లి తామ్రశాసన మునందు "శ్రీనాథభట్టరు శాసనాచార్య దక్షిణభాగం వకటి" అని కలదు. అయినను శ్రీనాథుడు స్వయము వ్యవసాయము చేయువాడు కాడు. చేయువారికి పాలి కిచ్చును. పాలి కిచ్చినను పన్ను కట్టవలసిన బాధ్యత గుత్తకు గొన్న

వ్యక్తిదే. ఏడు నూర్లటంకములు- బంగారు నాణెములు - చెల్లింపలేకపోయెను. దేశము పరాధీనమైనది. 1448 వ సంవత్సరము నాటికి ఉభయగోదావరీమండలములు, 1453 వ సంవత్సరము నాటికి గుంటూరుమండలము కపిలేంద్రగజపతికి కైవసమైనవి. 1454 వ సంవత్సరము నాటి గాణదేవుని శాసనమునందు అతడు కొండవీడు, అద్దంకి, వినుకొండలకు పరీక్షకు డని కలదు. కృష్ణామండలము 1450 ప్రాంతమునందే కపిలేంద్రగజపతి కైవసమగును. కపిలేంద్రగజపతి ప్రతినిధి గాణదేవుడు కాని మఱొకడు కాని ప్రతినిధి అగును. ప్రభువు కంటె ప్రతినిధి మిన్న. అందును పరప్రభువు. పరప్రతినిధి. పన్ను చెల్లింపని వారిపై చర్య తీసికొనుట సహజము. కాఁబట్టి శ్రీనాథుని చరమకాలము 1450 ప్రాంతమగును.

శ్రీనాథుని జీవితకాలము 1360-1450

## జీవితచరిత్రాంశములు

"-పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమలమతివి" 23ప.1ఆ.భీ.పు.

అని బెండపూడి అన్నయామాత్యుని అభిభాషణము. కమలనాభుని మనుమడు శ్రీనాథుడు పాకనాటింటివాడు. పాకనాడు + ఇంటివాడు = పాకనాటింటివాడు. (ఔపవిభక్తికము.) ఇంటివాడు అన గృహస్థు. ఇంటివాడు ఏకవచనము. ఇండ్లవారు బహువచనము.

"పదియు నెనుబది వేలును బంచశతియు
నేఁ బదియునైదు సంఖ్యల యిండ్లవార
మాశ్రితులు కాశికాపురి కస్మదీయు
లీశ! పల్లేరు దుడిచి పాటెక్కినారు. " 155ప.6.ఆ.కా.ఖం.

అని శ్రీనాథుని ప్రయోగము. 18, 555 మంది గృహస్థులు కాశికాపురికి ఆశ్రితులని అర్థము. కావున పాకనాటింటివాడు పాకనాటి గృహస్థు కావలయును.

శ్రీనాథుని అనుఁగుందాత కమలనాభామాత్యుడు వారిధితటీకాల్పట్టనాధీశ్వరుడని పూర్వోదాహృతపద్యమునందు కలదు. అది ముద్రితగ్రంథములందలి పాఠము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము (మద్రాసు)లోని తాళపత్రగ్రంథమునందు "వారిధితటీకల్పట్టనాధీశ్వరున్" అని కలదు. కల్పట్టనబు (కల్పట్టణము) ఎనిమిదవశతాబ్ది రండుబల్లి శాసనమునందు కలదు[83]. అది గుంటూరుజిల్లా

బాపట్లతాలుకాలోనిది.(?) పాకనాడు[84] లోనిది కాదు. కాకపోయినను కమల నాభామాత్యుడు తదధీశ్వరుడు కావచ్చును. వారిధితటీకల్పట్టణమన సముద్ర పుటొడ్డునందే ఉండి తీరవలసిన ఆవశ్యకము లేదు. దాక్షారామభీమేశ్వరుడు "దక్షిణాంబుధితటస్థాయి" అని శ్రీనాథుని ప్రయోగమే. (198ప.3ఆ.భీ.పు.) కాని దాక్షారామము సముద్రపుటొడ్డునందు లేదు. సమీపమునందు కలదు. సముద్రపుటొడ్డునందుగాని, సముద్రసమీపమునందుగాని; కల్పట్టణము గాని, కాల్పట్టణము గాని నేడు కానరాదు. అది, ఇది అనుట ఊహామాత్రశరణ్యము. శ్రీనాథుడు పాకనాటిగృహస్థు అగుట నిశ్చయము.

అసలు పాకనాటిగృహస్థు అయిన శ్రీనాథుడు, అనవేమారెడ్డి కొలువునందు అడుగుపెట్టినట్లు కొండవీటి దండకవిలయందు కలదు. అంతేకాదు. 1376 వ సంవత్సరమునాటి అనవేమారెడ్డి మూలగూరమ్మ శాసనము శ్రీనాథకృతి వలె కలదు. సంతానసాగరతటాకశాసనమునందు, జగనొబ్బగండకాలువశాసనమునందు శ్రీనాథకృతి అని కలదు. మూలగూరమ్మశాసనమునందు శ్రీనాథకృతి అని ఉండవలసిన స్థలము అరిగిపోయినది. అనవేమారెడ్డి మంత్రి మామిడి పెద్దన కుమారులు వేమానామాత్యుడు, ప్రెగడన్న, సింగనామాత్యుడు అప్పుడే శ్రీనాథునికి పరిచితు లగుదురు. అనవేమారెడ్డి కాలము నందలి వినుకొండ దుర్గాధిపతి రాయనభాస్కరుడును అప్పటినుండి శ్రీనాథునికి పరిచితుడగును. రాయన భాస్కరుడు కుమారగిరిరెడ్డి మంత్రి. మామిడి వంశీయులు కుమారగిరిరెడ్డి కొలువునందు లేరు. పెదకోమటి వేమారెడ్డి చందవోలు కొలువునందే ఉందురు. శ్రీనాథుడు శృంగారనైషధమును చందవోలునందే మామిడి సింగనామాత్యునికి అంకితమిచ్చినట్లు ఐతిహ్యము కలదు.

కుమారగిరిరెడ్డి మంత్రి రాయన భాస్కరునికి పరిచితపూర్వుడు మాత్రమేగాక, కుమారగిరిరెడ్డి సుగంధిశాలాధ్యక్షుడు అవచి తిప్పయసెట్టికి శ్రీనాథుడు బాలసఖుడు. (8,12ప.1ఆ.హ.వి.) కాని కుమారగిరిరెడ్డి ఆస్థానకవి కాడు. కారణము మామిడివంశీయులతోడి అనుబంధము కావచ్చును. శ్రీనాథుడు హరవిలాసమును అవచి తిప్పయసెట్టికి అంకితమిచ్చెను.

పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమునందు శ్రీనాథుడు విద్యాధికారి. అదొక అపూర్వమైన, అనర్ఘమైన పదవి. శ్రీనాథునికి పూర్వము, తర్వాత కూడ విద్యాధికారి అయిన విద్వాంసుడు లేడు. అనపోతారెడ్డి, అనవేమారెడ్డి ఆస్థానములందు బాలసరస్వతి విద్యాధికారి అని ఒక అభిప్రాయము[85] కలదుగాని, అది యథార్థము కాదు. బాలసరస్వతి విద్వాంసుడు మాత్రమే. అతడు రచించిన శాసనములందు, "అన్నపోతనరేంద్రస్య విద్వాన్

బాలసరస్వతిః", "అన్నవేమనరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః" అనియే కలదు[86]. అట్లు పెదకోమటి మాచారెడ్డి విద్వాంసుడు భావయ నారన రచించిన శాసనమునందు "విద్వాన్ భావయనారణ్ణనామా శ్రీమాచభూపతేః"అని, తిప్పారెడ్డి విద్వాంసుడు నరహరి రచించిన శాసనమునందు "తిప్పమహీపతేః విద్వాన్నరహరిః" అని కలదు[87]. శ్రీనాథుడు రచించిన శాసనములందు "విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః" అని కలదు[88]. ఇట్లు 1404 వ సంవత్సరము నాటి కల్వపాముల, పొన్నుపల్లి శాసనములు మొదలు 1419 వ సంవత్సరము నాటి రుద్రవరశాసనమువఱకు కలదు. అసలు ఒక ఆస్థానమునందు విద్వాంసుడు అగుటయే కష్టము. అట్టిది విద్యాధికారి అగుట మహాకష్టము. పెదకోమటి వేమారెడ్డి ఆస్థానమునందు వామనభట్టబాణుడు విద్వాంసుడు. అతడు విద్యారణ్యమహర్షి శిష్యుడు. సంస్కృతకవిసార్వభౌముడు. బహుగ్రంథకర్త. నలాభ్యుదయము, రఘునాథాభ్యుదయము అను పద్యకావ్యములు, వేమభూపాలచరితమను గద్యకావ్యము, పార్వతీపరిణయము శృంగారభూషణభాణము అను దృశ్యకావ్యములు, శబ్దచంద్రిక, శబ్దరత్నాకరము అను సంస్కృతనిఘంటువులు రచించెను. కాని విద్యాధికారి కాలేదు. శ్రీనాథుడే విద్యాధికారి.

"వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు" 23ప.1ఆ.భీ.పు.

అని బెండపూడి అన్నయామాత్యుని అభిభాషణము. వేమభూపాలుడన పెదకోమటి వేమారెడ్డి. అతడు సర్వజ్ఞచక్రవర్తి. అనేకగ్రంథకర్త. శాస్త్రగ్రంథకర్త. అట్టి సామ్రాజ్యాధిపతికి అఖిలపురాణవిద్యాగమములు వినిపించుట, వివిధదేశవిద్వాంసులను పరీక్షించుట శ్రీనాథుడు విద్యాధికారిగ నిర్వహించిన విధులు. ఆగమములన శైవాగమములు. విద్యలన శాస్త్రములు. సర్వజ్ఞచక్రవర్తికి అఖిలపురాణవిద్యాగమములు వినిపించుటకు అఖిలపురాణవిద్యాప్రవీణుడు, సకల విద్యాసనాథుడు, ఆగమజ్ఞాననిధి, తత్త్వార్థఖని అయిన విద్వాంసుడే అర్హుడు. అంతేకాదు. ఫణిరాజమహాభాష్యఫక్కికాపరమేష్ఠులు, కర్మబ్రహ్మపరామర్శమీమాంసామాంసలాత్మకులు, కణభుగ్గ్రథితగ్రంథసింధుమంథానభూధరములు, అక్షపాదమతప్రేక్షపక్ష్మలీకృతచేతస్కులు, మహాజ్యోతిష్కులు, షట్కర్మనిరతులును అయిన వివిధదేశవిద్వాంసులను పరీక్షించుటకు సంస్కృతప్రాకృతశౌరసేనీముఖ్యభాషాపరిజ్ఞాత, పన్నగపతిసార్వభౌమభాషితమహాభాష్యవిద్యాసమభ్యాసబలుడు, అక్ష

పాదకణాదపక్షిలో దీరితన్యాయకళాకుశలుడు, శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్య సిద్ధాంతకబళనవ్యుత్పత్తిగౌరవుడు అయిన విద్వాంసుడే అర్హుడు. ఏవంవిధగుణ గరిష్ఠుడైన శ్రీనాథునికి విద్యాధికారిపదవి పెదకోమటి వేమారెడ్డి సృష్టి అది పెదకోమటివేమారెడ్డి అనంతరము రాచవేమారెడ్డి కాలమునందును కొనసాగుట నిరాఘాటము. సుమారు పాతికసంవత్సరములు శ్రీనాథుడు విద్యాధికారి.

శ్రీనాథుడు "లింగమనేనిచేత నందికంతపోతరాజను కఠారిని గొంచుపోయి" నట్లు వెలుగోటి వారి వంశావళియందు కలదు. (107,109వచ.) ఆ సందర్భమున శ్రీనాథుడు లింగమనేని మీద చెప్పినట్లు కల "జగన్మొబ్బగండాంక, సంగ్రామనిశ్శంక" (110ప.వె.వం.) అను పద్యమునందు శ్రీనాథుని కవితాశైలి సాక్షాత్కారము కాలేదని, "అల్లయవేముని పరంగుమిండ" అను బిరుదము కలదని, అందువలన అసత్యమని ఒక అభిప్రాయము కలదు[89]. కాని, ఆ పద్యము కేవలము బిరుదావళి పోహళించినది. అది ప్రధానముగ పెదకోమటి వేమారెడ్డి బిరుదావళి. లింగమనేని పరము చేయుట విశేషము. అందు శ్రీనాథుని కవితాశైలి సాక్షాత్కారమగుట అనవకాశము. "అల్లయవేముని పరఁగుమిండ" అను బిరుదు అసంగతము కాదు[90]. అంతేకాదు. "అల్లయవేముని పగరమిండ" అను పాఠాంతరము కలదు. పెదకోమటి వేమారెడ్డి అల్లాడవేమారెడ్డి పగరయే. ఉపరి వల్లూరి నరసింహకవి నాగ్నజితీపరిణయమునందు ఇట్లు కలదు[91].

"ధనరాజ్యంబులు మాని నెమ్మదిఁ బ్రమోదంబంది తన్గోరు న
ట్టి నృపాలాగ్రణి కోర్కి తీర్చుట కకుంఠీభూతచేతస్కుఁ డై
చని సాధించిన సత్కవిప్రవరు రాజన్యాగ్రణీమాన్యు నేఁ
బ్రణుతింతున్ బహుశైవసంగదితశుంభద్గాథు శ్రీనాథునిన్."

ఇది పూర్వకవిస్తుతిలోని పద్యము. నిర్నిమిత్తము కాఁజాలదు. ధనరాజ్యములు మాని అనగా విషాదము చెంది, నెమ్మదిని ప్రమోదము నంది, తన్ను కోరిన నృపాలాగ్రణి కోర్కి తీర్చుటకు, సత్కవిప్రవరుడైన శ్రీనాథుడు అకుంఠీభూతచేతస్కుడై చని సాధించినది నందికంతపోతరాజను కఠారియే అగును. కొండవీటిసామ్రాజ్యాధిపతి పెదకోమటివేమారెడ్డిని ఓడించి, దేవరకొండ రాజ్యాధిపతి లింగమనేడు నందికంతపోతరాజను కఠారిని పట్టుకొని పోవుట అసంభవము కాదు. ఉభయులును ప్రబలశత్రువులు. నందికంతపోతరాజను కఠారి ఆనువంశికమైన రాజఖడ్గము కావచ్చును. అది ప్రతిష్ఠాత్మకము. ఓడిన పెదకోమటి వేమారెడ్డి భుజబలముచేత సాధించునది కాదు. అందుకు విషాదము. సత్కవిప్రవరుడైన శ్రీనాథుడు బుద్ధిబలముచేత సాధించునది. ఇందుకు

ప్రమోదము. పెదకోమటి వేమారెడ్డి కోరిక తీర్చుటకు శ్రీనాథుడు అకుంఠీభూతచేతస్కుడై దేవరకొండ వెళ్లి, లింగమనేనిని మెప్పించి నందికంతపోతరాజను కఠారిని పట్టుకొనివచ్చుట సంభవమే. అది పెదకోమటివేమారెడ్డి రాజ్యావసానకాలమునందు అనుకూలము. ఆ కాలము 1420 ప్రాంతము[92]. లింగమనేడు పెదకోమటి వేమారెడ్డిని ఓడించి, నందికంతపోతరాజను కఠారిని పట్టుకొనిపోయిన కాలము 1417 వ సంవత్సరము. శ్రీనాథుడు లింగమనేనిని మెప్పించి నందికంతపోతరాజను కఠారిని పట్టుకొని వచ్చిన కాలము 1418 వ సంవత్సరము కావచ్చును.

1424 వ సంవత్సరమునందు కొండవీటి సామ్రాజ్యము విజయనగర సామ్రాజ్యమునందు విలీనమైనది. కొండవీటి సామ్రాజ్యము కంటె విజయనగరసామ్రాజ్యము విస్తృతమైనది. విజయనగరసామ్రాజ్యాధిపతి రెండవ ప్రౌఢదేవరాయలు. (1423-1446.) అతని సామంతులు పంట మైలారురెడ్డి (1424, 1429), తెలుగు రాయలు (1428, 1438, 1442, 1444)

"కైలాసగిరి పంటమైలారువిభుఁ డేఁ గె
దినవెచ్చ మేరాజు దీర్పఁ గలఁడు
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు"

అని శ్రీనాథుని అవసానచాటువునందు కలదు. దినవెచ్చము తీర్చినవాడు పంటమైలారురెడ్డి. కస్తూరి ఇచ్చిన వాడు తెలుగు రాయలు. పంటమైలారురెడ్డి ప్రాపు, తెలుగురాయల సమాదరము లభించిన శ్రీనాథుడు వీరి ద్వారా విజయనగరమహాసామ్రాజ్యాస్థానమునందు చేరుటకు ప్రయత్నించుట సహజము. అందుకు విజయనగరమహాసామ్రాజ్యాస్థానపండితకవులు, ప్రతిఘటించుట అంత కంటె సహజము. అందువలన కాఁబోలు శ్రీనాథుడు రాజమహేంద్రవరరాజ్యాస్థానమునందు చేరెను. శ్రీనాథుడు తెలుగు రాయల సన్నిధి నుండియే రాజమహేంద్రవరరాజ్యమునకు ప్రయాణమైనట్లు శ్రీనాథుని చాటుపద్యము కలదు.

"అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్"

సుకవిరాట్+బృందారకశ్రేణికిన్ అనగా సుకవిరాజుయొక్క దేవతా సమూహమునకని అర్థము. సుకవిరాజు శ్రీనాథుడు. అతని ఇష్టదేవతలు అచటి శివ

లింగములు. అందు దక్షారామభీమేశ్వరుని, చాళుక్యభీమవర (సామర్లకోట భీమవరము)చాళుక్య భీమేశ్వరుని అర్చించిన కస్తూరి దేవదాసి పరమగుటు ఆనాటి దేవాలయసంప్రదాయము.

"శ్రీనాథుఁడు సర్వజ్ఞుని సముఖమునకుఁ బోవుచు శారదాంబను ప్రార్థన చేసిన పద్యము" అని (159వచ.) వెలుగోటి వారి వంశావళియందే ఇట్లుకలదు.

దీనారటంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు
బగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
ఇంత కాలంబువలెఁ గాదు వింత రీతి
నెట్లు మెప్పించెదో కదా యింక మీఁద
రావుసింగాంకభూపాలు ధీవిశాలు
సకలసద్గుణనికురుంబ శారదాంబ." 160ప.

ఇందు ఎత్తుగీతము "ఎట్లు మెప్పింతువో నన్ను నింక మీఁద, రావుసింగమహీపాలు ధీవిశాలు, నిండుకొలువున నెలకొనియుండి నీవు, సరససద్గుణనికురుంబ శారదాంబ" అని ఇతరత్ర కలదు. అది ప్రసిద్ధము. ఇంతకు శ్రీనాథుడు సందర్శించిన సర్వజ్ఞుడు రాచకొండ రాజ్యాధిపతి, రావు వంశీయుడు అయిన సర్వజ్ఞసింగమనేడు. శ్రీనాథుని ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థ మాడించిన దక్షిణాధీశుడు విజయనగరసామ్రాజ్యాధిపతి. దీనారటంకాల తీర్థక్రీడ కనకాభిషేకము. సార్వభౌమబిరుదు కవిసార్వభౌమబిరుదము. కనకాభిషేకమన స్వర్ణస్నానము.

"కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్ ....." 263ప.7ఆ.

అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు.

"కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి .... .... ...." 19ప.1ఆ.

అని దగ్గుబల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానమునందు కలదు. కనకాభిషేకవిశేషముతోపాటు కవిసార్వభౌమబిరుదము 'శ్రీనాథుని' కాశీఖండమునందు, శివరాత్రిమాహాత్మ్యమునందు, పలనాటివీరచరిత్రయందు కలదు. శృంగార నైషధము నందు, హరవిలాసమునందు, భీమేశ్వరపురాణమునందు లేదు. హరవిలాసములోని "కవితామహారాజ్యభద్రాసనారూఢ" విశేషణము (8ప.1ఆ.) ప్రశంసయేకాని బిరుదము కాదు. కాశీఖండమునందు "కవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్" అని (14ప.1ఆ.), శివరాత్రిమాహాత్మ్యమునందు "సత్కవిసార్వభౌముఁడగు శ్రీనాథకవివరేణ్యుని" అని (13వచ.1ఆ) పలనాటివీరచరిత్రమునందు "కవిసార్వభౌముఁడ ఘనత గన్నట్టి శ్రీనాథు డనువాడ శివభక్తిపరుడ " అని (25, 26పం.) స్పష్టముగ కవిసార్వభౌమబిరుదము కలదు.

శ్రీనాథుడు ప్రౌఢదేవరాయల సందర్శమునకు ముమ్మసుకవిని దయఁ జూడుమని కోరినట్లు చాటుపద్యము కలదు.

"పంపావిరూపాక్షబహుజటాజూటికా
 రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
 గంభీరఘుమఘుమారంభములకు
కళసాపురప్రాంతకదళీవనాంతర
 ద్రాక్షాలతాఫలస్తబకములకు
కర్ణాటకామినీకర్ణహాటకరత్న
 తాటంకయుగధాళధళ్యములకు
నిర్నిబంధనిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుక నేర్తు
ప్రౌఢదేవేంద్రరాయభూపాలవరుని
సమ్ముఖంబున దయఁ జూడు ముమ్మసుకవి".

ముమ్మసుకవి దయఁ జూచినట్లు లేదు. అథవా ముమ్మసుకవి దయఁ జూచినను అభీష్టము నెఱవేఱినట్లు లేదు. ఆగ్రహోదగ్రుడైన శ్రీనాథుడు సవాలు చేసినట్లు మఱొక చాటుపద్యము కలదు.

"డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
 కవిమీఁదఁ గాని నా కవచమేయు
దుష్టయోగంబులు దొరకొని చెప్పెడు
 కవిశిరస్సునఁ గాని కాలు సాఁప

సంగీతసాహిత్యసరసవిద్యల నేర్చు
కవుల త్రొమ్ములు గాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు
కవి నోరు గాని వ్రక్కలుగఁ దన్న
దంటకవులకు బలువైన యింటిమగఁడఁ
గవుల వాదంబు విన వేడ్క గల్గెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!"

ప్రౌఢరాయక్షితీంద్రుడు కర్ణాటక్షితినాథుడు. దక్షిణాధీశుడు. విజయనగరసామ్రాజ్యాధిపతి ప్రౌఢదేవరాయలు. రెండవ ప్రౌఢదేవరాయల ఆస్థానమునందు సంస్కృతకవిసార్వభౌముడు అరుణగిరినాథుడు. అతడు కంచుఢక్క కల గౌడడిండిమభట్టు. అంతేకాదు. "డంబుసూపి ధరాతలంబుపైఁ దిరుగాడు కవి"యే.

"అగ్రే డిండిమతాడనం తత ఇతో వందివ్రజోద్ఘోషణం
ద్విత్రా శ్చిత్రపటాః కియంతి బిరుదప్రోతాని పద్యాని నః
ఆస్తాం తావదిదం మహేశమకుటీకోటీరకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తి విభవై ర్ద్వేష్యా న్విజేష్యామహే."

అను చాటుశ్లోకము కలదు[93]. అరుణగిరినాథుడు తన కుమారునికి భూపతి పేరు పెట్టినందుకు, వీరభూపతి ముడియనూరు అగ్రహారముగ ప్రదానము చేసినట్లు శాసనప్రమాణము కలదు[94]. ఈ భూపతి రెండవదేవరాయల తండ్రి వీరభూపతి లేక వీరవిజయభూపతి. (భూపతి=భూపన్న=రాజన్న=రాజనాథుడు.) శ్రీనాథుడు గౌడడిండిమభట్టు కంచుఢక్క పగులఁగొట్టించుటకు కారణము "ఉద్భటవివాదము." అది "కవుల వాదము". శ్రీనాథుడు, గౌడడిండిమభట్టు విద్వత్కవులు. విద్వత్కవుల ఉద్భటవివాదము శాస్త్రార్థమే. డిండిమమన కంచుఢక్కయే.

"సూనాస్త్రప్రమదామదస్ఫురితవక్షోజాతకాఠిన్యమున్
బూనంజాలు వచోవిలాసముల నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రు సభం గవిత్వవిజయోత్సాహంబు గైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్."

అని చింతలపూడి ఎల్లన (రాధమాధకవి) తారకబ్రహ్మరాజీయమునందు కలదు[95].

కవిత్వవిజయోత్సాహమును గైకొన్న శ్రీనాథునికి కవిసార్వభౌమబిరుదము

పాదుకొల్పిన చంద్రభూషక్రియాశక్తిరాయలు క్రియాశక్తిపీఠాధిపతి. సంగమవంశీయులైన విజయనగరసామ్రాజ్యధిపతులకు క్రియాశక్తిపీఠాధిపతులు రాజుగురువులు. ఒక చంద్రభూషణాచార్యులు 1349 వ సంవత్సరమునందు క్రియాశక్తిపీఠమును అధిష్ఠించి, 1371 వ సంవత్సరమునందు బుక్కరాయలచే భూదానము గొనినట్లు కొండూరు శాసనమునందు కలదు[96]. అతడు రెండవ ప్రౌఢదేవరాయల కాలమునందుండుట అసంభవము. మొదటి ప్రౌఢదేవరాయల కాలమునందుండుటకూడ సుసంభవము కాదు[97]. మఱొక చంద్రభూషణదేవఒడెయరు ప్రసక్తి 1438 వ సంవత్సరము నాటి నిడుమామిడి మఠమునందలి శాసనమునందు కలదు[98]. ఇతడు పండితారాధ్యపీఠాధిపతి. పండితారాధ్యపీఠము వీరశైవపీఠము. క్రియాశక్తిపీఠము కాలాముఖశైవపీఠము[99]. కాశీవిలాసక్రియాశక్తి, వాణీవిలాసక్రియాశక్తి, విద్యాశంకరక్రియాశక్తి, త్ర్యంబకక్రియాశక్తి, చంద్రభూషణక్రియాశక్తి అను క్రియాశక్తిపీఠాధిపతులు అయిదుగురు. 1347, 1378, 1379, 1384, 1388, 1398-99, 1410, 1431 వ సంవత్సరములనాటి శాసనములందు కలరు[100]. ఇట్లు రెండవ ప్రౌఢదేవరాయల కాలమునందు మఱొక చంద్రభూషక్రియాశక్తిరాయలు ఉండుట నిరాఘాటము. అంతేకాదు. సుప్రసిద్ధుడైన పీఠాధిపతి పేర, తరువాతి పీఠాధిపతులు వ్యవహరింపఁబడుట కలదు. శృంగేరి, కామకోటి మొదలైన పీఠాధిపతుల శంకరాచార్యనామవ్యవహారము, అహోబలపీఠాధిపతుల శఠకోపయతినామవ్యవహారము ప్రసిద్ధము. శ్రీనాథ, గౌడడిండిమభట్టుల ఉద్భటవివాదమునకు రెండవ ప్రౌఢదేవరాయల కాలమునందటి చంద్రభూషణక్రియాశక్తిరాయలు అధ్యక్షించి, శ్రీనాథుని విజయమును ప్రకటించి, గౌడడిండిమభట్టు కవిసార్వభౌమబిరుదమును శ్రీనాథునికి పాదుకొల్పెను. రెండవ ప్రౌఢదేవరాయలు ముత్యాల శాలలో శ్రీనాథునికి దీనారటంకాల తీర్థమాడించెను. అందుకు,

"జననాథోత్తమ! దేవరాయనృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛనసంకాశమహాప్రభావ! హరిరక్షాదక్ష! నాబోటికిన్
కునృపస్తోత్రసముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానము చేసికాక పొగడంగా శక్యమే దేవరన్."

అని శ్రీనాథుడు చమత్కరించినట్లు ఒక చాటుపద్యముకలదు. కనకాభిషేకము చేసిన తదుపరి ప్రశంసించినట్లు మఱొక చాటుపద్యము కలదు.

"జోటీ! భారతి! యార్భటిన్ మెఱయుమీ చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు దేవరాయనృపతిన్ నాసీరధాటీచమూ
కోటీఘోటకఘట్టికాఖురపుటీకుట్టాకసంఘట్టన
స్ఫోటీధూతధరారజశ్ఛుళుకితాంభోధిన్ బ్రశంసించెదన్."

శృంగారనైషధ, హరవిలాస, భీమేశ్వరపురాణములందు ప్రకటింపని; కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్య, పలనాటివీరచరిత్రములందు ప్రకటించిన కవిసార్వభౌమ బిరుదము, కనకాభిషేకసత్కారము తన్మధ్యకాలమునందు శ్రీనాథునికి తటస్థించుట తథ్యము. ఆ కాలము స్థూలముగ 1431 వ సంవత్సరము. శ్రీనాథుని కవి సార్వభౌమబిరుదము, కనకాభిషేకసత్కారము విలాసమాత్రము, లాంఛనప్రాయము కావు. విజయమూలకము, విద్వత్సూచకము. అపూర్వము. అనపరము.

శ్రీనాథుడు సందర్శించిన సర్వజ్ఞసింగమనేడు అనపోతానాయని పుత్త్రుడు. వసంతరాయని అగ్రజుడు. "ఆయనవోతమనేనికి సర్వజ్ఞసింగమనేఁడును వసంతరాయఁడును బుట్టిరి" అని వెలుగోటి వారి వంశావళియందు కలదు. (156వచ.) ఈ సర్వజ్ఞసింగమనేడు రెండవ సర్వజ్ఞసింగభూపాలుడు. అతని రాజ్యకాలము 1425-1453. ఆస్థానవిద్వాంసుడు మహావ్యాఖ్యాత మల్లినాథసూరి. శ్రీనాథుడు సర్వజ్ఞసింగమనేనిని సందర్శించునెడ చేసిన శారదాస్తవమునందు, అతని కవిసార్వభౌమబిరుద, కనకాభిషేకసత్కారములు కలవు. కావున శ్రీనాథుడు సర్వజ్ఞసింగమనేనిని సందర్శించిన కాలము తన్మధ్యకాల మగును. ఆ మధ్యకాలము 1431-1453. ఆ కాలమునందును శ్రీనాథుడు సర్వజ్ఞసింగమనేనిని సందర్శించిన కాలము స్థూలముగ 1435 వ సంవత్సరము.

శ్రీనాథుడు 1428 వ సంవత్సరము నుండి 1446 వ సంవత్సరమువఱకు రాజమహేంద్రవరరాజ్యాధిపతులు అల్లాడవేమ, వీరభద్రారెడ్ల ఆస్థానకవి. 1446 వ సంవత్సరము తర్వాత మాత్రమే రాజపోషకులు, మహారాజపోషకులు లేక నిరాశ్రయుడు. నిరాశ్రయుడైన శ్రీనాథుడు పలనాటిసీమ పర్యటనము కావించినట్లు చాటుపద్యములు కలవు.

"రసికుఁడు పోవఁడు పల్నా
డెసగంగా రంభయైన యేకులె వడుకున్
వసుధేశుఁ డైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

అంగడి యూర లేదు వరియన్నము లేదు శుచిత్వ మేమి లే
దంగన లింపు గారు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగపడంగఁ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న గాన పలనాటికి మాటికిఁ బోవ నేటికిన్.
వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుఁడు కళ్ళిపోతురా
జారయఁ గాలభైరవుఁడు నంకమశక్తియ యన్నపూర్ణయున్

గేరెడు గంగధార మడుఁ గే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి వారికిన్.

చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును దేళ్ళు
పల్లెనాఁటిసీమ పల్లెటూళ్లు

జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగఁ బల్నాటిసీమ ప్రజలందఱకున్."

పలనాటిసీమలో పర్యటించునపుడు "నీటికై భంగపడంగఁ బాల్పడు" నపుకాఁ బోలు శ్రీనాథుడు చెప్పిన మఱొక చాటుపద్యమిది :

"సిరి గలవానికిఁ జెల్లును
దరుణుల పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్ద రాండ్రా!
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్."

ఒక్క పలనాటిసీమయే కాదు; శ్రీశైలము మొదలు శ్రీకూర్మము వఱకు యావదాంధ్రదేశము శ్రీనాథుని తీర్థయాత్రాస్థలమే.

## కృతులు

శ్రీనాథుని కృతులు అనేకము. అందు శృంగారనైషధము, హరవిలాసము భీమేశ్వరపురాణము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము, పలనాటివీరచరిత్ర భాగములు మాత్రమే ఉపలబ్ధములు. శ్రీనాథుడు స్వయము తెలిపిన గ్రంథరచనా క్రమమిది :

"చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నుడివితి
సంతరించితి నిండు జవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమఁ

త్రాయ మింతకు మిగులఁ గ్రైవాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁ గుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి." 7ప.1ఆ.కా.ఖం.

ఇందు ప్రసక్తమైన శృంగారనైషధమునందు ఇట్లు కలదు.

"జగము నుతింపఁ గఁ జెప్పితి
ప్రెగడయ్యకు నా యనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నా యారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్." 41ప.1ఆ.

ఇది శృంగారనైషధకృతిభర్త మామిడి సింగనామాత్యుని మాట. అతని అనుంగు పెద్దన వేమానామాత్యుడు. ప్రెగడయ్య చిన్నన్న. (35-37ప.1ఆ.శృం.నై.) "నిగమార్థసారసంగ్రహమగు నా యారాధ్య చరిత" మనగా పండితారాధ్య చరిత్రము. శృంగారనైషధము ప్రసక్తమైనది హరవిలాసము. "ఆంధ్రభాషానైషధాబ్జభవుని" అని అందు కలదు. (8ప.1ఆ.) భీమేశ్వరపురాణమునందు ఇట్లు కలదు.

"నవమరుత్తు చరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్య చరితమనఁ గఁ
గావ్యములు పెక్కు చెప్పియుఁ గాంక్ష చనక
వెండియును గావ్య మొకటిఁ గావింపఁ దలఁ చి" 18ప.1ఆ.

భీమనాయకుని మహిమను కొనియాడిన తదుపరి శ్రీనాథుడు తెనుగుసేసినది కాశీఖండము. కవితోపన్యాసము కావించినది శివరాత్రిమాహాత్మ్యము. పలికినది పలనాటి వీరచరిత్రము. చాటించినవి చాటువులు.

దంతలూరి బాపిరాజు మూర్తిత్రయోపాఖ్యానమునందు తద్వంశమునందు బహుపూర్వుడైన గన్నభూపాలుడు "శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజయంబను సత్కావ్యమంది వెలసె"నని కలదు. (60ప.1ఆ.) గణపవరపు వెంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు శ్రీనాథుని నందనందనచరిత్రనుండి పద్యపాదములు కలవు. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు శ్రీనాథుని వల్లభాభ్యుదయము నుండి పద్యము కలదు.

మొత్తము మీద మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము, శృంగారనైషధము, హరవిలాసము, ధనంజయవిజయము, నందనందనచరిత్ర, వల్లభాభ్యుదయము, భీమేశ్వరపురాణము, కాశీఖండము, శివరాత్రి

మాహాత్మ్యము, పలనాటివీరచరిత్రము శ్రీనాథుని గ్రంథరచనాక్రమమగును.

## మరుత్తరాట్చరిత్ర

ఇది శ్రీనాథుడు "చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి నాఁడు" రచించినది. "చిఱుతకూఁకటి నున్న చిగురు వెండ్రుకలతో మెఱసి మాఁగుడు వడి మిళ్ళు వ్రేల" అని ఎఱ్ఱాప్రెగడ వటువర్ణనము. (242ప.10ఆ.ఉ.భా.హ.వం.) చిఱుతకూకటి నాడన వటుదశయందని అర్థము. పది పండ్రెండేళ్ళ ప్రాయము. శ్రీనాథుని జననకాలము 1360 ప్రాంతము కావున, మరుత్తరాట్చరిత్ర రచనాకాలము 1372 ప్రాంతము. అంత చిన్నవయస్సునందు కావ్యమును రచించుట అపూర్వము. అది శ్రీనాథుని "అనుఁగుందాత కమలనాభామాత్యునికి" అంకితము కావచ్చును. కృతి అనుపలబ్ధము.

మరుత్తరాట్చరిత్ర ఐతరేయబ్రాహ్మణమునందు కలదు[101]. మహాభారతమునందు కలదు. బ్రహ్మ, బ్రహ్మాండ, భాగవత, మత్స్య, మార్కండేయపురాణములందు కలదు[102]. అన్నిట ఒకటి కాదు. మార్కండేయపురాణములోని మరుత్తరాట్చరిత్ర చిన్నారి పొన్నారి చిఱుతకూకటి నాడు ఆకర్షించునది. భీమేశ్వర పురాణమునందు "నవమరుత్తుచరిత్రంబు" అని కలదు. పూర్వోదాహృతము. కాని నవమరుత్తులు కానరారు. కాన నవశబ్దము సంఖ్యార్థకము కాదు. నూతనార్థకము కావలయును. మార్కండేయపురాణాంతర్గతమైన ఉపాఖ్యానము నిమిత్తమాత్రముగ గైకొని, ప్రపంచీకరించిన స్వతంత్రకావ్యమగును.

## శాలివాహనసప్తశతి

ఇది శ్రీనాథుడు "నూనూఁగు మీసాల నూత్నయౌవనమున నుడివి" నది. "ఉద్భిన్ననవశ్మశ్రు నభినవయౌవనోద్భాసితు షోడశవర్షదేశీయు" అని శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యమునందు కలదు. (38వచ.3ఆ.) నూనూగుమీసాల తెనుగు నుడికారమునకు ఉద్భిన్ననవశ్మశ్రువులు సంస్కృతప్రౌఢి. నూత్నయౌవనమే అభినవయౌవనము. షోడశవర్షదేశీయుడన ఇంచుమించు పదియారేండ్ల వాడు. శ్రీనాథుడు పదియారేండ్ల ప్రాయమునందు రచించినది శాలివాహనసప్తశతి. శ్రీనాథుని జననకాలము 1360 ప్రాంతము కావున, శాలివాహనసప్తశతి రచనాకాలము 1376 ప్రాంతము. అది మామిడి వేమనామాత్యునికి అంకితము కావచ్చును. కృతి అనుపలబ్ధము.

శాలివాహనసప్తశతి, శాతవాహన -లేదా- శాలివాహనరాజైన హాలుడు కోటి

గాథల నుండి ఏర్చి కూర్చిన గాథాసప్తశతి. సంకలనగ్రంథము. హాలుని కాలము ప్రథమశతాబ్ది[103]. 73-78- హాలుని గాథాసప్తశతికి తెనుగుసేత శ్రీనాథుని శాలివాహనసప్తశతి. అరువది సంవత్సరముల క్రితము. హనుమకొండయందు జరిగిన చారిత్రికవస్తుప్రదర్శనమునందు శాలివాహనసప్తశతి తాళపత్రగ్రంథము తటిల్లత వలె తారాడినది[104]. కాని, అంతలోనే అంతర్ధానమైపోయినది! కతిపయపద్యములే కాంతిరేఖలు[105].

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని అముద్రితమైన ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను ఒక అర్వాచీనలక్షణగ్రంథమునందు "సప్తశతిపద్యం" అని "వారణసేయ" అను పద్యము కలదు. అది శ్రీనాథుని పద్యమే అగును. కాని తన్మూలమైన గాథ నాగరలిపిలో ముద్రితములైన గాథాసప్తశతిగ్రంథములందు లేదు. రోమకలిపిలో ముద్రితమైన గాథాసప్తశతి గ్రంథమునందు కలదు. అంతేకాదు. హాలుని గాథాసప్తశతికి సారగ్రహణమైన పెదకోమటి వేమారెడ్డి సప్తశతిసారమునందు కలదు[106]. ఆ గాథాపద్యము లివి:

"కస్సవ ణహోఇ రోసో దట్ఠూణ పిఆఇ సవ్వణం అహరం
సభమరపడమగ్ఘా ఇణి వారిఅవామే సహసు ఏహ్ణిం."
సంస్కృతచ్ఛాయ:
"కస్యవా నభవతి రోషో దృష్ట్వా ప్రియాయా స్స్వ్రణ మధరం
సభ్రమరపద్మాఘ్రాయిణి వారితవామే సహస్వేదానీమ్."

ఇది ఉపపతిచేత దంతక్షతాధర అయిన నాయిక తన పతిని చూచి సంకటుపడునెడ, ఆమె చెలికత్తె అన్నది. "వలదని వారించినను తుమ్మెద యున్న పద్మమును వాసన చూచితివి. ప్రియురాలి పెదవి కాటును చూచిన ఎవరికి రోషము కలుగదు?" అని.

"వారణసేయఁ దావిగొనవా, నవవారిజమందుఁ దేఁటి క్రొ
వ్వారుచునుంట నీ వెఱుఁగవా, ప్రియ వాతెఱ గంటిఁ గంటి కె
వ్వారికిఁ గెంపు రాదె, తగవా మగవారల దూఱ, నీ విభుం
డారసి నీ నిజం బెఱుఁగు నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ."

ఇందు మూలగాథలోని గాఢమైన గూఢమైన భావము, సరళముగ సరసముగ తీగ సాగినది. మూలగాథ పుండరీకముకుళము. శ్రీనాథుని పద్యము సంఫుల్లసరసీరుహము భావోపలక్షణము.

ప్రబంధమణిభూషణమునందు మఱొక సప్తశతిపద్యము కలదు. అది ప్రబంధ

మణిభూషణమునకు ఆధారమైన ప్రబంధసారశిరోమణియందు లేదు. ఆకరమింకను అన్వేషణీయము. తన్మూలగాథ గాథాసప్తశతియందు కలదు. ఆ గాథాపద్యము లివి:

"ణిసాసుక్కమి ఎఅ పులిఏహిం జాణన్తి ణచ్చిఉంధణ్ణా
అమ్హారిసీహిం దిట్ఠే పిఅమ్మి అప్పావి వీసరిఓ." 61గా.1శ.
సంస్కృతచ్ఛాయ:
నిశ్వాసోత్కమి ఏత పులకితై ర్జానన్తి నర్తితుం ధన్యాః
అస్మాదృశీభి ర్దృష్టే ప్రియే ఆత్మాపి విస్మృతః."

ధన్యురాండ్రు ప్రియుని చూడగనే నిట్టూర్పులు విడిచి, కంపము చెంది, పులకోద్గమము నంది నర్తింపఁ గలరు. నా వంటిది ప్రియుని చూచి, తన్ను దాను మఱచిపోవునని తాత్పర్యము. వారు ధన్యురాండ్రు, తాను ధన్యురాలను కానని వాచ్యార్థము. వారి కంటె తానే ధన్యురాలనని వ్యంగ్యార్థము.

"భాగ్యవతులు మున్నుఁ బ్రాణేశ్వరునిఁ జూచి
వడఁకువారు నూర్పు విడుచువారుఁ
బులక లెత్తువారుఁ బోలంగ నన్నుఁ బోటి
తన్ను మఱచునదియుఁ దడవఁ గలదె?" 671ప.

వర్ణనరత్నాకరమునందు (1930) వేఱొక సప్తశతిపద్యము కలదు. తన్మూలమైన గాథ సప్తశతియందు కలదు. ఆ గాథాపద్యము లివి:

"అఇదీహరాఇఁ బహూఏ సీసే దీసన్తి వంసవత్తాఇం
భణిఏ భణామి అత్తా తుమ్హాణం విపాణ్డురా పుట్ఠీ." 74గా.7శ.
సంస్కృతచ్ఛాయ:
"అతిదీర్ఘాణి వధ్వాః శీర్షే దృశ్యన్తే వంశపత్రాణి
భణితే భణామి శ్వశ్రు యుష్మాకమపి పాణ్డురం పృష్ఠమ్."
"వేణికాభారమందుండు వెదురుటాకు
కలికికోడల యెబ్బంగిఁ గలిగెఁ జెపుమ
పలికి పలికించుకొనుటయె ప్రాభవంబొ
అత్త నీ వీఁపు వెలిమిడి యంటు టేమి?" 4332ప.చ.భా.

వెదురుపొదయందు ప్రియోపభోగమునొరిది వచ్చిన కోడలి తలమీద మిక్కిలి పొడవైన వెదురుటాకును చూచి, తదపరాధమును సూచించుటకు అత్త సాకూతముగ అడిగిన, అత్త తాదృశాపరాధమునకు కొండగుర్తును కోడలు గుర్తుచేయుట గూఢార్థము. గాథలోని శీర్షమునకు వేణికాభారము, ప్రత్యేకమైన ప్రాభవశబ్ద

ప్రయోగము, పలుకు నుడికారము శ్రీనాథుని కులుకు సింగారమే.

"హాలుని సప్తశతి వివిధరసముల కూడలియైనను శృంగారమే యందుఁ బ్రధానరసము. ఆ శృంగారము సైతము గట్లు దిగ్రమింగిన పఱవ. వావి వరుసలు లేవు, సప్తశతి స్వభావరమణీయమైనది. (సహోవ రమణిజ్జమ్.) నిత్యస్మర ణీయములైన ప్రకృతివర్ణనల కది నెలవు. దేని కదే చూపును, దలపు నాకట్టునది." అని ఒక అభిప్రాయము కలదు[107]. అంతేకాదు. గాథాసప్తశతిలోని ప్రతిగాథ ధ్వనిప్రధానము. ఇంత రసవంతమైన, అంత ధ్వనిమంతమైన శ్రీనాథుని శాలివా హనసప్తశతి తాళపత్రగ్రంథము తటిల్లత వలె తారాడి, అంతలోనే అంత ర్థానమైపోవుట ఆంధ్రసరస్వతి దురదృష్టము.

## పండితారాధ్యచరిత్రము

ఇది శ్రీనాథుడు శృంగారనైషధమునందు కృతిభర్త ముఖతః తెలిపినది. కావున శృంగారనైషధము కంటె పూర్వరచనము కావలయును. రచనాకాలము 1382 ప్రాంతము. అది మామిడి ప్రెగడయ్యకు అంకితము. అనుపలబ్ధము. కాని పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణము నందు ఇట్లు కలదు.

" xxx xxx xxx"

హరభక్తి వైదికంబని శ్రుతులిడిచెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్య చరిత
సరవి శ్రీనాథుఁ డా చరిత పద్యప్రబం
ధము సేసె ద్విపదలు తఱచు నిలిపి

xxx xxx xxx

కానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చి నెగడు."

సోమేశుడన పాలకుఱికి సోమనాథుడు. ఆరాధ్యచరితమన పండితారా ధ్యచరిత్రము. అది నిగమార్థసారసంగ్రహము. పాలకుఱికి సోమనాథుని పండితా రాధ్యచరిత్రము ద్విపదకావ్యము. శ్రీనాథుని పండితారాధ్యచరిత్రము పద్యప్రబం ధము. పద్యప్రబంధమన పద్యగద్యోభయకావ్యమే.

## శృంగారనైషధము

ఇది శ్రీనాథుడు "సంతరించితి నిండుజవ్వనంబునయందు" అని తెలిపినది.

మామిడి సింగనామాత్యునికి అంకితము. మామిడి ఇంటి పేరు కాదు. తాత పేరు. మామిడన్న సుతుడు పెద్దన. ఇతడు అనవేమారెడ్డి మంత్రి. '(27ప.1ఆ.) పెద్దన పుత్రులు ముగ్గురు. వేమన, ప్రెగడన్న, సింగన. 1(34ప.1ఆ.) వేమన దండనాయక చూడావసంతమైన మంత్రి. ప్రెగడన్న దండనాథతిలకుడైన ధ్వజినీశుడు. (34-36ప.1ఆ.) ఎవరి మంత్రి సేనాధిపతులో లేదు. అనవేమారెడ్డి మంత్రి సేనాధిపతులే అగుదురు. సింగన పెదకోమటివేమారెడ్డి మంత్రి. (44ప.1ఆ.) ముగ్గురును కుమారగిరిరెడ్డి కొలువునందు లేరు. కారణము అనవేమారెడ్డి అనంతరము ముగ్గురును అనవేమారెడ్డి తోడి కూరిమి అనుబంధము కల పెదకోమటి వేమారెడ్డి పక్షము వహించుట కావలయును. కుమారగిరిరెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమునందు పెదకోమటి వేమారెడ్డి చందవోలు శాఖానగరాధిపతి అగును. కుమారగిరిరెడ్డి అనంతరము కొండవీటి సామ్రాజ్యాధిపతి.

శృంగారనైషధము రచనాకాలము పెదకోమటివేమారెడ్డి చందవోలు శాఖానగరాధిపతి అయిన కాలమని[108] కొండవీటిసామ్రాజ్యాధిపతి అయిన కాలమని[109] అభిప్రాయభేదములు కలవు. కొండవీటిసామ్రాజ్యాధిపతి అయిన కాలమనుటకు ప్రధానమైన ఆధారము మామిడి సింగనామాత్యుని వర్ణనము. అతడు "వేమభూవరునిచేత అరుదారన్ వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్రచామరకల్యాణకళాచికాదిబహుసమ్మానార్హచిహ్నంబులు గాంచి" నట్లు "సామ్రాజ్యసంభరణప్రౌఢు"డని,(38ప.1ఆ.ఏ) "పెదకోమటి వేమక్షితిపాలరాజ్యవిభవకళారక్షామణి" అని (44ప.1ఆ.) "శ్రీరాజరాజవేమక్ష్మారమణకృపాకటాక్షసంవర్ధితలక్ష్మీరక్షితబుధలోకు"డని (1ప.2ఆ.) "వేమభూపతిమహాసామ్రాజ్యరక్షామణి, యవనాధీశసభానిరంకుశవచోవ్యాపారపారంగతు"డని (144ప.2ఆ.) "శ్రీరెడ్డివేమవిశ్వక్ష్మారమణకృపావిశేషసమధిగతైశ్వర్యారూఢవిభవశృంగు"డని (1ప.7ఆ.) "శ్రీధామవేమక్ష్మాధీశ్వరసచివు"డని (1ప.8ఆ.) శృంగారనైషధమునందు కలదు. ఇట్టి వర్ణనలు చందవోలు శాఖానగరాధిపతులకును కలవు. అసలు చందవోలు శాఖానగరాధిపతి అయిన మాచారెడ్డి మహేంద్రవిభవుడని భుజస్కంధములపై భూమండలమునుమోసెనని శాసనము లందు కలదు[110]. అనంతరము చందవోలు శాఖానగరాధిపతి అయిన. మాచారెడ్డి కుమారుడు పెదకోమటిరెడ్డి రాజరాజప్రభావుడని, చతురర్ణవమేఖలావలయితమేదినీపతి అని పృథ్వీపతిసార్వభౌముడని, యవనకులకాలకూటుకబళనమహాకాలుడని వామనభట్టబాణుని వేమభూపాలచరితమునందు కలదు. (104, 105 పుటలు) అంతేకాదు. ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను అముద్రితలక్షణ గ్రంథమునందు ఇట్లు కలదు.

"వీఁ పున మోసెఁ గచ్ఛపము. వెండి భుజంగమరాజు మస్తక
స్థాపితఁ జేసె. నీవు వసుధారమణిం బెదకోమటీంద్ర! బా
హాపరిరంభగుంభసముదంచితఁ జేయుట యింత యొప్పునే
మోపరు లే మెఱుంగుదురు ముగ్ధలతోడి విహారధర్మముల్."

ఇందు భూమిని శ్రీమహావిష్ణువు అవతారమైన కూర్మము వీపున మోయుట విశేషము కాదు. ఆదిశేషువు తలను దాల్చుట అధికము కాదు. పెదకోమటిరెడ్డి వసుధారమణిని బాహువులతో పరిష్వంగము చేయుట ప్రత్యేకత. అనగా పెదకోమటిరెడ్డి భూమండలమును పరిపాలించెనని అవగాహనమగును. ఇట్టి వర్ణనలు నిర్ధారకసాధనములు కావు.

శృంగారనైషధము రచనాకాలము పెదకోమటివేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి కాకపూర్వము, చందవోలు శాఖానగరాధిపతి అయిన కాలమనుటకు ప్రధానమైన ఆధారములు రెండుకలవు. 1. పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమునందు శ్రీనాథుడు అతని విద్యాధికారి. ఆ కాలమునందు శ్రీనాథుడు రచించిన శాసనములందు "విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః" అని కలదు. విద్యాధికారిపదవి విశిష్టమైనది. అది కేవలము శ్రీనాథుని కొఱకు పెదకోమటి వేమారెడ్డి సృష్టి. తత్పూర్వము లేదు. తదనంతరమును లేదు. అట్టి విద్యాధికారి ప్రసక్తి శృంగారనైషధమునందు లేదు. కాఁబట్టి శ్రీనాథుడు విద్యాధికారి కాకపూర్వమే, అనగా పెదకోమటివేమారెడ్డి కొండవీటిసామ్రాజ్యాధిపతి కాకపూర్వమే, అనగా చందవోలు శాఖానగరాధిపతి అయిన కాలమే శృంగారనైషధము రచనాకాలము కావలయును. 2. పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమునందు అతని రాజధాని కొండవీడు. ఆ కొండవీడు ప్రసక్తి కూడ శృంగారనైషధమునందులేదు. చందవోలు ప్రసక్తియును లేదు. కాని చందవోలు రాజధాని కాదు. శాఖానగరము. హరవిలాసమునందు కుమారగిరిరెడ్డి రాజధాని కొండవీడు ప్రసక్తి కలదు. (7వచ.1ఆ.) భీమేశ్వరపురాణమునందు అల్లాడ వేమ, వీరభద్రారెడ్ల రాజధాని రాజమహేంద్రవరము వర్ణనము కలదు. (43ప.1ఆ.) కాశీఖండమునందును అల్లాడవేమ, వీరభద్రారెడ్లరాజధాని రాజమహేంద్రవరము వర్ణనము కలదు. (58 ప.1ఆ.) రెండును భిన్నపద్యములు. రాజమహేంద్రవరము కంటె ప్రముఖమైన రాజధాని కొండవీడు వర్ణనముగాని, ప్రసక్తిగాని శృంగారనైషధమునందు లేదు. కాఁబట్టి పెదకోమటివేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి కాకపూర్వమే, అనగా చందవోలు శాఖానగరాధిపతి అయిన కాలమే శృంగారనైషధరచనాకాలము కావలయును. పెదకోమటివేమారెడ్డి చందవోలు శాఖానగరాధిపతి అగు కాలము స్థూల

ముగ 1386-1402. శ్రీనాథుడు నిండుజవ్వనమునందు సంతరించినది శృంగార నైషధము. నిండుజవ్వనము ముప్పదియైదేండ్ల వయస్సు కావచ్చును. శ్రీనాథుని జననకాలము 1360 ప్రాంతము కావున, శృంగారనైషధరచనాకాలము 1395 ప్రాంతము.

శృంగానైషధము శ్రీహర్షుని నైషధీయచరితమునకు ఆంధ్రీకరణము. నైషధీయ చరితము రచనాకాలము 1180 ప్రాంతము[111]. శ్రీహర్షుడు "కాశ్మీరదేశీయుడు." "చింతామణీమంత్రచింతనఫలము" "ఈరేడువిద్యలు వచ్చి"నవాడు. ఖండనఖా ద్యకారుడు. (25ప.6ఆ.శృం.నై.) చిన్నతనమునందే "అశేషశేముషీమూషమాష మశనామి మారిష" అన్నట్లు ఐతిహ్యము కలదు." కవికులాదృష్టాధ్వపాంథుడైన మహాకవీశ్వరుడు. (202వచ.8ఆ.శృం.నై.) నైషధీయచరితమే నైషధము. హర్ష నైషధము. "నైషధం విద్వదౌషధమ్" అని ప్రసిద్ధమైన ఆభాణకము కలదు. అది శ్లోకములోని ఏకదేశము. "కాశీఖండ మయఃపిండమ్ నైషధం విద్వదౌషధమ్" అని శ్లోకభాగము. అనుష్టుప్పులోని అర్ధభాగము. కాశీఖండము పురాణము. నైషధము శ్రవ్యకావ్యము. అనర్ఘరాఘవమను దృశ్యకావ్యము, కాదంబరి అను గద్య కావ్యమును కడమ అర్ధభాగములోనివి కావచ్చును. హర్షనైషధమే విద్వదౌషధము. ఆస్తికమైన వేదములు మొదలు నాస్తికమైన వాదముల వఱకు పదునాలుగు విద్య లును ప్రకటితమైనవి. హర్షనైషధములోని వ్యుత్పత్తిప్రదర్శనము[112]. కాలజీమూత సన్నిభము. శృంగారనైషధములోని వ్యుత్పత్తి ప్రతిఫలనము తటిల్లతాభము. హర్ష నైషధములోని శ్లేషాశ్లేషము[113] మేరుగిరి. శృంగారనైషధములోని శ్లేషాశ్లేషము మేరుపూస. హర్షనైషధములోని శృంగారము కామశాస్త్రమునకు భాష్యప్రాయము. శృంగారనైషధములోని శృంగారము సూత్రప్రాయము. "శృంగారభంగ్యా మహా కావ్యే చారుణి నైషధీయచరితే" అని శ్రీహర్షుని ప్రథమసర్గాంతశ్లోకమునందు కలదు. "భట్టహర్షమహాకవీశ్వరుని శృంగారమహాకావ్యమునకు" అని శ్రీనాథుని అష్టమాశ్వాసాంతవచనమునందు కలదు. హర్షనైషధము శాస్త్రకావ్యమని రాజశే ఖరుని కావ్యమీమాంసయందు కలదు. శృంగారనైషధము శాస్త్రకావ్యము కాదు కావ్యమే. "ఆంధ్రభాషామహాకావ్యగ్రంథ"మని శ్రీనాథుని నిష్కర్ష. శ్రీహర్షుడు, బుద్ధి పూర్వకముగానే గ్రంథగ్రంథులు నిక్షేపించినట్లు, సజ్జనులు వానిని గురుముఖతః విప్పుకొని రసోర్మికలలో మునిగి తేలవలయునని కావ్యాంతమున నిర్దేశించెను.

"గ్రంథ గ్రంథి రిహ క్వచిత్క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞం మన్యమనా హఠేన పఠితీ మాస్మిన్ ఖలః ఖేలతు
శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రంథిః సమాసాదయ
త్వేతత్కావ్యరసోర్మిమజ్జనసుఖవ్యాసజ్జనం సజ్జనః." 152శ్లో.22స.

ఏవంవిధమైన హర్షనైషధమును ఆంధ్రీకరించుట స్వతంత్రకావ్యము రచించుట కంటె కష్టసాధ్యము.

"నైషధాంధ్రీకరణ మతిసాహసము. కీర్తియే ప్రాణమనుకొనెడి యీనాఁటి కవి యెవ్వఁడును సాహసింపఁడు. నేఁటికిని నైషధమును తెనిగింపఁగల కవి మఱియొకఁడు కానరాఁడు."

అను విమర్శకాభిప్రాయము[114] విజ్ఞతామూలకము. హర్షనైషధమును ఆంధ్రీకరించుట సకలవిద్యాసనాథుడైన శ్రీనాథునికే సాధ్యము. శ్రీనాథుడు బహుగ్రంథ కర్తయైనను బహుధా స్మరించినది శృంగారనైషధమే. "ఆంధ్రభాషానైషధాబ్జభవు"నని హరవిలాసమునందు (8ప.1ఆ.), "కల్పించినాఁడవు గాఢపాకంబైన హర్షనైషధకావ్య మాంధ్రభాష" నని భీమేశ్వరపురాణమునందు (28ప.1ఆ.) " పలుకుతోడైతాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భమునకు" అని శారదాస్తవమునందు, " ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ దగిలియుండెను గదా నిగళయుగము" అని జీవిత చరమాంకమునందును శ్రీనాథుని నైషధస్మృతి.

## నైషధాంధ్రీకరణపద్ధతి

"భట్టుహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితము పొంటె
నట్టి నైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ యొనరింపు నా పేర నంకితముగ" 16 ప. 1ఆ.

అని మామిడి సింగనామాత్యుని ఆదేశము. "ఆంధ్రభాషావిశేషంబు నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భావం బుపలక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునం జెప్పంబడి" నది శ్రీనాథుని శృంగారనైషధము.

ఆంధ్రీకరణము త్రివిధము. అది స్వతంత్రాంధ్రీకరణము, అస్వతంత్రాంధ్రీకరణము, స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణము అను వర్గీకరణము సుసంగతమగును. కథానువాదము, భావానువాదము, పదానువాదము అను వర్గీకరణము సుసంగతము కాదు. యథామూలకమైన ఆంధ్రీకరణము అస్వతంత్రము. మూలాతిశాయికమైన ఆంధ్రీకరణము స్వతంత్రము. మూలాతిశాయికత, యథామూలకత కల మాతృకానుసారమైన ఆంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్రము. మూలములోని

శబ్దమును అనుసరించుట, రసమును పోషించుట, అలంకారమును భూషించుట, ఔచిత్యమును ఆదరించుట అస్వతంత్రపద్ధతి. ఇందు ఆంధ్రీకర్తకు స్వాతంత్ర్యము శూన్యము. మూలములోని అభిప్రాయమును కూర్చుట, భావమును ఉపలక్షించుట, అనౌచిత్యమును పరిహరించుట, మూలాతిశాయిగా శబ్దమును అనుసరించుట, రసమును పోషించుట, అలంకారమును భూషించుట, ఔచిత్యమును ఆదరించుట స్వతంత్రపద్ధతి. ఇందు ఆంధ్రీకర్తకు స్వాతంత్ర్యము మాన్యము. శ్రీనాథుని నైషధాంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణపద్ధతియే.

**శబ్దానుసరణము**: "శబ్దం బనుసరిం"చుట శబ్దానుసరణము. శ్రీనాథుని శబ్దానుసరణము బహువిధభాసమానము. పరిభాషాపదములు, ప్రౌఢపదబంధములు, రీతిసుభగములైన సమాసకుసుమావళులు యథామూలకముగాను, మూలాతిశాయిగాను కలవు.

"సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వ మనాయి సాదృశోస్సదసత్సంశయగోచరోదరీ
" 40శ్లో.2స.

ఇందు "గమికర్మీకృత" అను పదబంధము వైయాకరణవైయాత్యము, "సదసత్సంశయ" అను పదబంధము వేదాంతవేతృత్వము కలవి. గమ్ ధాతువు. ధాతువివక్షను ఇదంతము. గమి. గమిధాత్వర్థము గమనము. అది గమికర్మ. తత్కృతము గమికర్మీకృతము. వెళ్లు అనుధాతువు యొక్క అర్థమును (కర్మను) చేసిన అని అర్థము. ఇట్లనుట తెనుగునకు అసహజము. అందువలన అట్లే ప్రయోగింపవలయును. సత్=నిత్యము. త్రికాలాబాధితము. ఉన్నది. అసత్=అనిత్యము. త్రికాలబాధితము. లేనిది. ఉన్నది, లేనిది అనుటకు వేదాంతపరిభాష. అందుకు శ్రీనాథుని అనుసరణము.

"మృదురీతిం బ్రతిహాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయు<sup></sup>ఁ డనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్. 20ప.

కమలేందీవరషండమండితలసత్కాసార సేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁ డనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్." 21ప.2ఆ.

ఒక శ్లోకమునకు రెండు పద్యములు. మొదటి పద్యమునందు "సదసత్సంశయ గోచరోదరీ" కలదు. ఇది హర్షాతిశాయికము. వామనభట్టబాణుడు పార్వతీపరిణయ మునందు చర్వణము చేసినది. గమికర్మీకృత, గమికర్మీభూత పదబంధములు సమానము. గమికర్మీభూతపదబంధము శ్రీనాథుడు భీమేశ్వర పురాణమునందు చర్వణము చేసినది. (38ప.6ఆ.) పయి రెండు పద్యములును ద్వివిధము. శబ్దాను పరణప్రయోజనాత్మకము.

"అశ్రాన్తశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవా
జిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేలినా
పూర్వం గాధిసుతేన సామిఘటితా ముక్తా ను మన్దాకినీ
యత్ప్రాసాద దుకూలవల్లి రనిలాన్దోలై రఖేల ద్దివి." 102శ్లో.2స.

"వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరిస్తవా
సాదబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళిచే
నాదిన్ గాధితనూజుచే సగము సేయంబడ్డ మిన్నేఱు ప్రా
సాదస్వచ్ఛదుకూలకైతవమునం జాలంగ నొప్పు న్ బురిన్."

41ప. 2ఆ.

పయి శ్లోకమున మొదటి రెండు చరణములును ఒకటే సమాసము. సుదీర్ఘ సమాసము. వర్ణవిన్యాసవక్రతావైభవోపేతము. వృత్తమును శార్దూలము. అది తెను గు నందును కలదు. సమాసమును అట్లే సంఘటింపవచ్చును. కాని యతిప్రాసల క్లేశము కలదు. సంస్కృతమున పదచ్ఛేదమే యతి. తెనుగున అక్షరమైత్రి యతి. సంస్కృతమున ప్రాస లేదు. తెనుగున కలదు. అందువలన అలతిమార్పులు అపరిహార్యములు. "అశ్రాంతశ్రుతిపాఠ" అనుచో "వేదాభ్యాసవిశేష" అనుటవలన అక్షరమైత్రి కలదు. "అజిహ్మబ్రహ్మ" అనుచో అనుప్రాసము కలదు. ద్వితీయా క్షరప్రాసము లేదు. "ఆసాద" అనిన కలదు. అక్షరమైత్రి కూడ అమరినది. యతి ప్రాసల కొఱకైన అలతిమార్పులు వినా శ్లోకములోని సుదీర్ఘసమాసము పద్యము నందు సుబద్ధమైనది. "సామిఘటితా" అను సంస్కృతప్రౌఢికి"సగముసేయంబడ్డ" తెనుగు నుడికారము. సమాసానుసరణము సహజసుందరము.

**అభిప్రాయఘటనము**: అభిప్రాయంబు గుఱించి"నది అభిప్రాయఘటనము. గుఱించి అనగా కూర్చి అని అర్థము. హర్షనైషధమునందు సందర్భమునకు మించిన వ్యుత్పత్తి ప్రదర్శనము కలదు. ఆంధ్రభాషకు అందని శ్లేషాశ్లేషము కలదు. అతివేలమైన వర్ణనము కలదు. అట్టి స్థలములందు వ్యుత్పత్తిని వదలి, శ్లేషను వీడి, అతివేలతను తగ్గించి, ప్రధానమైన అభిప్రాయమును మాత్రమే

ఆంధ్రీకరణమునందు కూర్చుట అభిప్రాయఘటనము.

"కలశే నిజహేతుదణ్డజః కిము చక్రభ్రమకారితా గుణః
స తదుచ్చకుచౌ భవన్ ప్రభాఝురచక్రభ్రమ మాతనోతి యత్."
32శ్లో.2స.

ఇందు తర్కశాస్త్రపాండిత్యము ప్రదర్శిపఁ బడినది. తర్కశాస్త్రమునందు ఒక కార్యము పుట్టుటకు మూడు కారణములు చెప్పఁ బడును. 1. సమవాయికారణము 2. అసమవాయికారణము. 3. నిమిత్తకారణము. ఘటము కార్యము. మృత్పిండము సమవాయికారణము. తత్సంయోగము అసమవాయికారణము. కుమ్మరి దండము నిమిత్తకారణము. కార్యమైన ఘటమునందు సమవాయికారణమైన మృద్గుణముండును. నిమిత్తకారణమైన కుమ్మరిదండముయొక్క గుణముండదు. "సమవాయికారణగుణా రూపాదయః కార్యే సంక్రామంతి న నిమిత్తకారణగుణాః" అనితార్కికసమయము. పయి శ్లోకమునందు కలశమునందు (ఘటమునందు) నిమిత్తకారణమైన కుమ్మరిదండము నుండి పుట్టిన చక్రభ్రమకారితగుణము కలదని మొదట విస్మయము ప్రకటింపఁ బడినది. అది విరోధము. కలశమునందు (స్తనకలశమునందు) కాంతిప్రవాహము నందలి చక్రభ్రమ కలుగుట పరిహారము. చక్రభ్రమ అనగా చక్రవాకభ్రమ. స్తనములను కలశములతోను, చక్రవాకములతోను పోల్చుట కవిసమయము. ఇంతకు దమయంతి సౌందర్య వర్ణనమునందు వ్యుత్పత్తి ప్రదర్శనము వలన ప్రధానమైన అభిప్రాయము నిరాఘాటస్ఫురణకు వచ్చునది కాదు. అందువలన శ్రీనాథుడు దమయంతి స్తనసౌందర్యమును తర్కకర్కశము చేయక, నిరాఘాటస్ఫురణ కలుగునట్లు ప్రధానమైన అభిప్రాయమును మాత్రమే ఘటించెను.

"హాటక కలశంబులకును
బాటియగు వధూటి మెఱుఁగుఁ బాలిండ్లు నిరా
ఘాటస్ఫురణప్రభయను
నేటికి జక్కవలకవయయి విరాజిల్లెన్." 17ప.2ఆ.

ఇట శ్లోకమునందలి ప్రభాఝురములోని ప్రభకు నిరాఘాటస్ఫురణవిశేషణమును చేర్చుట గమనింపఁ దగినది.

"ప్రాగ్భూయ కర్కోటక ఆచకర్ష సకంబలం నాగబలం యదుచ్చైః
భువస్త లేకుండినగామిరాజ్ఞాం యద్వాసుకేశ్చాశ్వతరోzన్వగచ్ఛత్."
8శ్లో.10స.

ఇది శ్లేషసంకీర్ణము. రసాతలమునుండి కుండినగామిరాజైన వాసుకియొక్క

కంబలాఖ్యుడను నాగేంద్రునితో కూడిన నాగబలమహాసైన్యమును కర్కోటకుడు ముందుండి నడిపింప అశ్వతరుడు అనుసరించెనని ఒక అర్థము. కుండినగామి రాజులయొక్క శీఘ్రగమనము గల శ్వేతాశ్వములు (కర్కోటకః =కర్క+అటకః. కర్క = శ్వేతాశ్వః. అటకః = శీఘ్రంగంతా. హృద్యగతిర్వా.) ముందు నడువగా అంబారీలతోడి ఏనుగులు, వేసరములు అనుసరించినవని మఱొక అర్థము. కర్కోటకశబ్దశ్లేష కష్టక్లిష్టము. ఆంధ్రభాషకు అందనిఫలము. అందుకు దమయంతి స్వయంవరమునకు వాసుకి, కర్కోటకుడు వచ్చిరను ప్రధానమైన అభిప్రాయ మును మాత్రమే శ్రీనాథుడు ఘటించెను.

"కోటి భుజంగపుంగవులుఁ గొల్వఁగ వందిజనంబు ముందటం
జాటువు లుగ్గడింప ఫణిసంభృతరత్నదిశావిభాసియై
వీటిజనంబులెల్లఁ దను విస్మయమొంది కనుంగొనంగఁ గ
ర్కోటకుఁ డేఁగుదెంచె మదఘూర్ణితపాటలనేత్రపద్ముఁడై." 126ప.

ప్రమథాధీశభుజాంతరస్థలఘనప్రాలంబహారం బద
భ్రమనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణాపర్యంతమాణిక్యమం
జుమయూఖాంకురపుంజమంజులనభస్కుండై భుజంగాంగనా
సముదాయంబిరువంకఁ బాడఁగ యశస్సంగీతగాథావళుల్."

127ప.4ఆ.

సర్పరాజులు మహారాజుల వలె స్వయంవరమునకు వచ్చుట సందర్భోచితము.

**భావోపలక్షణము** : "భావం ఋపలక్షించి"నది భావోపలక్షణము. మూల శ్లోకమునందలి భావమును ఉపలక్షించి, స్వతంత్రకల్పనమున సంతరించుట భావోపలక్షణము. ఇది అభిప్రాయఘటనమునకు వ్యతిరేకము. అభిప్రాయ ఘటనము సంక్షిప్తీకరణమైన, భావోపలక్షణము ప్రపంచీకరణము. "మూలశ్లోకము ను బీజప్రాయముగాఁ గైకొనిదాని నొక పుష్పితవల్లి వోలె స్వకల్పనతోఁ బెంచుట భావోపలక్షణ"మను అభిప్రాయము[115] లోని ఆంతర్యమిదియే. అభిప్రాయఘటన మునందు కవి సంయమనము కనిపించిన, భావోపలక్షణమునందు కవి భావనాశక్తి భాసించును. "ఆంధ్రభాషానైషధాబ్జభవు" డనను శ్రీనాథుని ఆత్మప్రత్యయమునకు ఆయువుపట్టు భావోపలక్షణమే. అబ్జభవుడన బ్రహ్మ. సృష్టికర్త. సృష్టికర్తతోడి సాదృశ్యమునకు సార్థక్యము శ్రీనాథుని స్వతంత్రసృష్టి. అది భావోపలక్షణ మునందు అగ్రేసరభాసమానము.

"విషమో మలయాహిమణ్డలీ విషఫూత్కారమయో మయోహితః
బత(ఖగ)కాలకలత్రదిగ్భవః పవన స్తద్విరహానలైధసా." 57శ్లో.2స

ఇది నలుడు హంసకు దమయింతి గుఱించిన తన విరహమును తెలుపు సందర్భములోనిది. "ఆహా! (పక్షీ!) దక్షిణదిగ్భవమైన పవనము విరహాగ్నిసమిధలను ప్రజ్వలింపఁజేయుచున్నది. అందుకు హేతువు మలయాచలమందలి అహిమండలి యొక్క విషఫూత్కారముల కలయిక అని నేను ఊహింతును." అని శ్లోకార్థము.

"కాలాంతఃపురకామినీకుచతటీకస్తూరికాసౌరభ
శ్రీలుంటాకము చందనాచలతటశ్రీఖండసంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్వాసాగ్నిపాణింధమం
బేలా నా పయి దక్షిణానిలము పక్షీ! సేయు దాక్షిణ్యమున్." 32ప.2ఆ.

"కాలకలత్రదిగ్భవః పవనః" అనగా యముని దిశను పుట్టిన గాలి అని అర్థము. ప్రాణహరమని భావము. అది దక్షిణానిలము. కాలకళత్రదిగ్భవమని కాక, "కాలాంతః పురకామినీకుచతటీకస్తూరికాసౌరభశ్రీలుంటాకము" అని శ్రీనాథుని స్వతంత్రకల్పనము. యమునియొక్క అంతఃపురాంగనల కుచతటములందలి కస్తూరికాసౌరభమను సంపదను అపహరించిన దక్షిణానిలమని అర్థము. అంత ధైర్యము, నైపుణ్యము కలది. అత్యంతప్రాణహరము. అంతేకాదు. అది "చందనాచలతటశ్రీఖండసంవేష్టిత వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్వాసాగ్నిపాణింధమము" కూడ. "మలయాహిమండలీవిషఫూత్కారమయః" అనునెడ గల గర్భితార్థము సువ్యాఖ్యాతము. మలయపర్వతమునందలి చందనవృక్షములను చుట్టుకొనియున్న సర్పముల విశాలములైన ఫణములందలి కఠోరమైన విషఫూత్కారములనెడు అగ్నులకు కొలిమితిత్తి వంటిదని అర్థము. అటువంటి దక్షిణానిలము తన పయి దాక్షిణ్యము చూపదని నలుని ఆవేదనము. ఆక్రందనము. పద్యమునందలి శబ్దసృష్టి అర్థసృష్టి హర్షాతిశాయికము. శృంగారరసవిషయకమైన ప్రథమసమాసము మృదుపదసంయోజనము. భయానకరసవిషయకమైన ద్వితీయసమాసము కఠినశబ్దసంఘటనము. కరుణరసవిషయకమైన చతుర్థపాదమునందలి విఱుపులు నలుని నిట్టూరుపులకు వ్యంజకములు. రసోచితమైన రచనావిధానము, రసనిర్భరమైన రమణీయసృష్టి రసజ్ఞరసాయనము. శ్లోకము బీజప్రాయము. పద్యము పుష్పితవల్లి.

పాణింధమశబ్దమునకు చప్పట్లు, కొలిమితిత్తి, ప్రేరకము అని అర్థములు. మొదటి అర్థమున మురారి ప్రయోగము కలదు. "నవభవద్గీర్వాణపాణింధమాపన్థానో దివి సంకుచన్తి." రెండు, మూడు అర్థముల శ్రీనాథుని ప్రయోగములే బహుళము. మురారికి పూర్వము సంస్కృతమునందు, శ్రీనాథునికి పూర్వము

తెనుగునందు పాణింధమశబ్దప్రయోగము మృగ్యము. శ్రీనాథుని అనంతరము పాణింధమశబ్దమును ప్రయోగింపని ఆంధ్రకవులు అరుదు.

"నీతమేవ కరలభ్యపారతా మప్రతీర్య మునయ స్తపోర్ణవమ్
అప్సరఃకుచఘటావలంబనా త్స్థాయినః క్వచ న యత్ర
చిత్రగాః" (26శ్లో.18స.)

ఇది నలుని విహారసౌధమును వర్ణించు సందర్భములోనిది. చేతితో అందుకొనగల గట్టువఱకు వచ్చి తపస్సముద్రమును దాటకుండ అప్సరసల కుచఘటములను అవలంబనము చేసికొని, అక్కడే మునులు స్థిరముగ ఉండిపోవుట అచటి చిత్రములందు కలదని అర్థము.

"భవజలరాశి దాఁటునెడ భావజవాయువు వీచినం దపః
ప్రవహణముల్ సమున్నతసుపర్వవధూకుచపర్వతాహతిం
బవిలిన దీనతావికలభావము నొందిన మౌనినావిక
ప్రవరుల భావచిత్రములు వ్రాసినవారు కపోతపాలికన్." 152ప.7ఆ.

ఇందు మూలములోని "తపోర్ణవ" రూపకము కంటె "భవజలరాశి" రూపకము సహజము. సముద్రమునందు కుచఘటములు అవలంబనముగ మునులు ఆగిపోయిరనుట కంటె తపస్సు లనెడు నావలు కుచపర్వతాహతిని పగిలిపోయినవనుట శక్తిమంతమైన, స్ఫూర్తిమంతమైన భావప్రకటనము. కుచపర్వతరూపకమును సహజము. సమున్నతవిశేషణము సార్థకము. తపస్సు లనెడు నావలు పగిలినందున మౌను లనెడు నావికప్రవరులు దీనతావికలభావము నొందుటయు సహజము. శ్లోకమునందు మునులు స్వయంకృతాపరాధులు. పద్యమునందు ప్రకృతికృతాపరాధులు. కుచపర్వతాహతికి హేతువు భావజవాయువు వీచుట. వాయువిజృంభణమున వారిరాశి సంక్షుబ్ధమగుట, నావలు పగులుట సహజము. పరమశ్రేష్ఠులైనను మౌనులు దీనులగుట సహజము. పద్యము సహజసుందరము. సమగ్రసుందరము. శ్లోకము పుండరీకముకుళము. పద్యము సంఫుల్లసరసీరుహము.

**రసపోషణము** : "రసంబు పోషించి"నది రసపోషణము. ఆలంబనవిభావములైన నాయికానాయకుల, సహజోద్దీపనవిభావములైన యౌవనభూషణచేష్టల, తటస్థోద్దీపనవిభావములైన మలయానిలచంద్రాదుల, సాత్త్వికభావములైన స్తంభాదుల, సంచారీభావములైన నిర్వేదాదుల, స్థాయిభావములైన రత్యాదుల వర్ణనము రసపోషణము.

నలోపాఖ్యానమునందు ప్రధానరసము కరుణము. నైషధీయచరితము

సకలనలోపాఖ్యానము కాదు. నలోపాఖ్యానైకదేశము. పరిణయపర్యంతమాత్రమైన నలుని చరిత్రము. అందువలన అంగిరసము శృంగారము. అంగరసములు కరుణాదులు. హర్షనైషధములోని శృంగారము శ్రుతిమించినది. శృంగారనైషధములోని శృంగారము శ్రుతి సవరించినది. నలదమయంతుల సంభోగశృంగారము నైషధీయ చరిత్రమునందు నూటయిరువదియారు శ్లోకములందు కలదు. (28-153శ్లో.18స.) అందు నలుబదిశ్లోకములు మాత్రమే - అనగా మూడవవంతు మాత్రమే- శృంగారనైషధమునందు నలుబది పద్యగద్యములందు కలదు. (158-198వచ.7ఆ.)

"అస్తి వామ్యభార మస్తి కౌతుకం సాZస్తి ఘర్మజల మస్తి వేపథు
అస్తి భీతి రతమస్తి వాంఛితం ప్రాపదస్తి సుఖమస్తి పీడనమ్."
62శ్లో18సం.

"పతిపాణిపల్లవచ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశనక్షతివ్యథా
భుగ్నలీలావతీభ్రూలతంబు
ధరణినాయకభుజాపరిరంభమండలీ
గాఢపీడితవధూఘనకుచంబు
వరనఖాంకురమృదువ్యాపారపులకిత
నీరజాక్షీనితంబోరుయుగళి
యస్తి వామ్యభార మస్తి కౌతూహలం
బస్తి ఘర్మసలిల మస్తి కంప
మస్తిభీతి యస్తి హర్ష మస్తి వ్యథం
బస్తి వాంఛ మయ్యె నపుడు రతము" 177ప.7ఆ.

ఇది శ్లోకమునకు శబ్దానుసరణము, ఘట్టమునకు అభిప్రాయఘటనము కల రసపోషణము.

నలుడు హంసను పట్టుకొన్న సందర్భమునందు అంగరసము కరుణము. స్థాయిభావము శోకము. అది మూలమునందు ఇట్లు కలదు

"మదేకపుత్రా జననీ జరాతురా నవప్రసూతి ర్వరటా తపస్వినీ
జన స్తమర్దయ న్నహో విధే త్వాం కరుణారుణద్ధిన. " 135శ్లో1స.

ఇది నిమిత్తమాత్రముగ శ్రీనాథుని స్వతంత్రకల్పన మిట్లు సాగినది.

"తల్లి మదేకపుత్త్రక పెద్ద కన్నులఁ
గానదిప్పుడు మూడుకాళ్ల ముసలి
యిల్లాలుఁ గడు సాధ్వి యేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్యభవ్యచరిత
వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్న సంతానంబు శిశువులు
జీవనస్థితి కేన తావలంబు
కృపఁ దలంపఁ గదయ్య యో నృపవరేణ్య!
యభయ మీవయ్య యో తుహినాంశువంశ!
కావఁ గదవయ్య యర్థార్థి కల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ!" 109ప.1ఆ.

ఇందు "జరాతురా" అను మూలమునకు "పెద్ద, కన్నులు కానదు, మూడు కాళ్లముసలి అను వివరణము, భార్య పచ్చి బాలెంతరాలు, పతివ్రత లేదా దీనురాలు అను మూలమునకు కడు సాధ్వి, పరమపాతివ్రత్యభవ్యచరిత అని మాత్రమే గాక "ఏమియు నెఱుఁగదు" అను విశదీకరణము, అట్టి తల్లికి, భార్యకు తానే గతి అను మూలమునకు వెనుక ముందర నెనరైన చుట్టాలు లేరు, జీవనము పరమదారిద్ర్యముతో కూడినది, శిశువులు లేక లేక పుట్టిన సంతానము, ఆ సంతానము జీవనస్థితికి తానే ఆధారము అను ప్రపంచీకరణము, బ్రహ్మ నిన్ను వారించుట లేదు అను మూలము కంటె సంబుద్ధులు, సంప్రార్థనములు కల ఎత్తు గీతము హంస శోకాతిశయమును అభివ్యక్తము సేయను, నలునికి సానుభూతిని, సహృదయునికి రసానుభూతిని సముత్కటము సేయును. మూలాతిశాయికమైన కరుణరసపోషణము.

**అలంకారభూషణము** : "అలంకారంబు భూషించి"నది అలంకారభూషణము. మూలములోని అలంకారములను అట్లే సంతరించుట, అన్యథాకరించుట, నూతనాలంకారములు కైసేయుట, అమూలకాలంకారములను కల్పించుట అలంకారభూషణము.

"పరిఖావలయచ్ఛలేన యా న పరేషాం గ్రహణస్య గోచరః
ఫణిభాషితభాష్యఫక్కికా విషమా కుణ్డలనామవాపితా" 95శ్లో2అ.

"పరిఖ గుడివోలెఁ దనచుట్టు దిరిగియుండఁ
బరుల కేరికి గ్రహణగోచరము గాక
విషధరాధీశభాషితవిషమభాష్య
ఫక్కికయుఁ బోలె నొప్పె నప్పట్టణంబు" 38ప.2ఆ.

ఇది మూలములోని అలంకారమును అట్లే సంతరించినది. ఉపమాలంకారము.

"ఇత్థం మధూత్థం రస ముద్గిరన్తీ తదోష్ఠబన్ధూకధను ర్విసృష్టా
కర్ణాత్ ప్రసూనాశుగపఞ్చబాణీ వాణీమిషేణాస్య మనోవివేశ." 50శ్లో.8స.

"అంకిలి లేక యప్పు డరుణాధరపల్లవనిర్గతంబులై
పంకరుహాయతాక్షి నునుఁ బల్కులు తేనియ లొల్కు చున్ శ్రవో
లంకృతులై నృపాలు మది లగ్నములయ్యె వినోదలీలకై
మంకెనపూవుఁ జాపమున మన్మథుఁ డేసిన తూపులో యనన్."
13ప.4ఆ.

ఇది మూలములోని అలంకారమును అన్యథాకరించినది. శ్లోకమునందు రూపకాలంకారము కలదు. పద్యమునందు ఉత్ప్రేక్షాలంకారము కలదు.

"బాలా హృది లోలశీలే" 70శ్లో.3స.
"బాలికల చిత్తము లంబుతరంగలోలముల్." 67ప.2ఆ.

ఇట మూలము నిరలంకారము. తెనుగుసేత సాలంకారము. అది నూతనముగ జేసేసినది. "క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్" అను మాటకు ఆద్యప్రకృతి.

"ఆ జగజెట్టి జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపు
తెఱంగున, జలధరతిరోధానంబు వాసినం బ్రకాశించు నా హిమ
ధాముని పగిది, నవిద్యావరణంబు విరిసినం దోఁచు పరమాత్ముని
ప్రకారంబున ..... నేత్రవిషయీభావంబు భజియించె" 2వచ.4ఆ.

ఇందలి-ఉపమానములు అమూలకము. ఇట్టివి అమూలకాలంకారములు.

**ఔచిత్యసమాదరము** : "ఔచిత్యం.బాదరించి"నది ఔచిత్యసమాదరము. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితమ్" అని క్షేమేంద్రుని సిద్ధాంతము. (5శ్లో.) రససిద్ధమైన కావ్యమునకు స్థిరమైన జీవితము ఔచిత్యము. ఏది దేనికి తగునో అది దానికి ఉచితము. ఉచితత్వము ఔచిత్యము. (7శ్లో.) పదౌచిత్యము మొదలు ఆశీర్వచనౌచిత్యము వఱకు ఇరువదియాఱు విధముల ఔచిత్యప్రభేదముల సోదాహరణప్రత్యుదాహరణనిరూపణమే క్షేమేంద్రమని ఔచిత్యవిచార

చర్చ.

"సాలీకదృష్టే మదనోన్మదిష్ణు యథాప శాలీనతమా న మౌనమ్
తథైవ తథ్యేzపి నలే నలేభే ముగ్ధేషు కః సత్యమృషావివేకః." 18శ్లో.8స.

అళీకనలదర్శనాభ్యాసమువలన యథార్థనలదర్శనమునకు దమయంతి సిగ్గు పడలేదను విశేషమునకు, ముగ్ధలకు సత్యమృషావివేక మెక్కడిదని సమర్థనము. ముగ్ధాశబ్దమునకు స్త్రీ అని అర్థము. అంతగా వివేకము లేనిదని కూడ అర్థము. ఇట ముగ్ధాశబ్దప్రయోగము ప్రకరణోచితము. అది పదౌచిత్యము. ఇది శ్రీనాథుడు సమూలకముగ ఆదరించినది.

"అతివ మిథ్యావలోకనాభ్యాసకలన
నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ
దాల్పదయ్యెను శాలీనతాభరంబు
తథ్యమిథ్యావివిక్తి ముగ్ధలకుఁ గలదె?" 3ప.4ఆ.

వివాహసమయమునందు వధూవరులను పెద్దలు, ముత్తైదువలు ఆశీర్వదించుట సంప్రదాయము. నలదమయంతుల వివాహసమయమునందు పెద్దలు ఇంద్రాదిదేవతలు కలరు. పెద్దముత్తైదువ సరస్వతీదేవి కలదు. వరప్రదానములే కాని, హర్షనైషధమునందు ఎవ్వరి ఆశీర్వచనము లేదు. శృంగారనైషధమునందు వరప్రదానములే కాక సరస్వతీదేవి ఆశీర్వచనమును కలదు.

"ఆదిమశక్తియైన తుహినాచలరాజతనూజ వోలె ము
త్తైదువవై నిజేశ్వరుని యర్థశరీరము పాలు గొమ్ము నీ
పాదసరోరుహంబు లతిభక్తి భజింతురుగాక యెప్డు బ్ర
హ్మాదికదేవతాసదృశులైన మహామహిమండలేశ్వరుల్." 14ప.6ఆ.

ఇది ఆశీర్వచనౌచిత్యము. శ్రీనాథుడు అమూలకముగ ఆదరించినది.

**అనౌచిత్యపరిహారము**: "అనౌచిత్యంబు పరిహరించి"నది అనౌచిత్యపరిహారము. ఔచిత్యము లేనిది అనౌచిత్యము. ప్రకరణోచితము కానిది కూడ అనౌచిత్యము.

"సువర్ణశైలా దవతీర్య తూర్ణం స్వర్వాహినీవారికణావకీర్ణైః
తం వీజయామ స్మరకేళికాలే పక్షైః ర్నృపం చామరబద్ధసఖ్యైః"
22శ్లో.3స.

ఇది హంస నలుని వరింపుమని దమయంతికి రాయబారము నడుపుటకు

వచ్చి, నలుని గుఱించి తెలుపు తొలిపలుకులందే కలదు. ఇట నలునికి తనకు మిక్కిలి పరిచయము కలదని తెలుపుటయే హంస ఆశయము. అందుకు తాను నలునికి స్మరకేళిసమయమునందు వింజామర పట్టుదునని తెలుపుట, నలుని వరింపవలసిన దమయంతికి వైముఖ్యము కలిగించును. అది ప్రకరణమునకు ఉచితము కాదు. అనుచితమైన స్మరకేళిని పరిహరించిన శ్రీనాథుని పద్యమిది :

కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల
వీతు నతనికి వైశాఖవేళలందు" 51ప.2ఆ.

ఇట "వైశాఖవేళలందు" అనుట వలన ఎట్టి అనౌచిత్యము లేదు. అంతేకాదు. వైశాఖవేళలందు ఎవ్వరికిని వీజనము కావలయును. హంస ఱెక్కల వీజనము ఒక్క నలుని వైభవము. అది దమయంతి నలుని వరించుటకు అనుకూలము.

నలుని సౌందర్యమునకు శచీదేవి, లక్ష్మీదేవి, పార్వతీదేవి, సరస్వతీదేవి చలించినట్లు ఛలించినట్లు హంస దమయంతికి వివరించును. శచీదేవి మహాపతివ్రత. లక్ష్మీపార్వతీసరస్వతీదేవులు మహాపతివ్రతలు మాత్రమేగాక త్రిజగన్మాతలు. వారి చిత్తచాంచల్యమును వర్ణించుట అనౌచిత్యము. "అత్ర శచ్యాది చాఞ్చల్యోక్తేః నలసౌందర్యతాత్పర్యా న్నానౌచిత్యదోషః" అని మల్లినాథసూరి సమర్థించినను, ఆ శ్లోకచతుష్టయము (28-31శ్లో.3స.) దుష్టచతుష్టయమే. తాత్పర్యము నలసౌందర్యమైనను శచ్యాదుల అందును త్రిజగన్మాతల సౌశీల్యమునకు భంగము కలిగించుట భావ్యము కాదు. "శ్రుణువన్", "సాపీశ్వరే" "అలంసజన్" "శ్రియస్తదా" అను నాలుగుశ్లోకములందును ఒక్కటి కూడ శ్రీనాథుడు తెనుగు సేయ లేదు. అవి పరిత్యజించుట అత్యంతప్రశంసాపాత్రమైన అనౌచిత్యపరిహారము.

ఇట్లు శబ్దానుసరణము, అభిప్రాయఘటనము, భావోపలక్షణము, రసపోషణము, అలంకారభూషణము, ఔచిత్యసమాదరము, అనౌచిత్యపరిహారము కావించిన శ్రీనాథుని నైషధాంధ్రీకరణపద్ధతి స్వతంత్రాస్వతంత్రము. అంతేకాదు, కావ్యాంధ్రీకరణము. పురాణాంధ్రీకరణము కంటె కావ్యాంధ్రీకరణము కష్టము. అందును భారతరామాయణాంధ్రీకరణముల కంటె నైషధాంధ్రీకరణము మహాకష్టము. కారణము నైషధము శాస్త్రకావ్యము. శాస్త్రీయవిషయములను తెనిగించుట ఎంత కష్టమో, విడిచిపెట్టి తెనిగించుట కూడ అంత కష్టము. అనిచెప్పి శాస్త్రీయవిషయములను శ్రీనాథుడు అసలు తెనిగించకపోలేదు.

"ఇహ కిముషసి పృచ్ఛాశంసి కింశబ్దరూప
ప్రతినియమితవాచాం వాయసే నైష పృష్టః
భణ పణిభవశాస్త్రే తాదజః స్థానినౌ కా
వితి విహితతుహీ వాగుత్తరః కోకిలోzభూత్." 60శ్లో.10స.

"ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్తశాస్త్రంబులోఁ
దాతజ్‌స్థానులు చెపుఁడెవ్వి యను చందం బొప్పఁ గా కా యనం
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతం బిచ్చెఁ దుహీ తుహీ యని గృహారామప్రదేశంబునన్." 19ప.8ఆ.

ఇట శ్లోకమునందు వాయసము కౌ అనగా కోకిల తుహీ అన్నట్లు కలదు. పద్యమునందు వాయసము కౌ కౌ అనగా కోకిల వ్రాతము తుహీ తుహీ అన్నట్లు కలదు. కాకి "కావుకావు"మనుట. కోకిల కూజితము " తుహీతుహీ" అనిపించుట సహజము. కాకి అఱుపు పాణినీయమునందు "తాదజ్" దేని స్థానమున వ్యవహరింపఁబడినది? అను ప్రశ్నగా, కోకిల కూత ఆ ప్రశ్నకు అనుగుణముగ తు, హీ అను సమాధానముగ వ్యాకరణశాస్త్రవిషయకచమత్కారకల్పనము. శ్లోకమునందు ప్రశ్న వేసిన కాకి ఒకటి. సమాధానమిచ్చిన కోకిల ఒకటి. పద్యమునందు ప్రశ్న వేసిన కాకి ఒకటేగాని, సమాధానమిచ్చినది కోకిల సమూహము. గృహారామ ప్రదేశము గురుకులప్రాంగణమునకు గుర్తు. అందమైన అప్రస్తుతార్థస్ఫూర్తి కలదు. సముచితమైన శాస్త్రీయవిషయములను సరసముగ తెనిగించుట కిది చిహ్నపతాక. రసభంజకము కాని శాస్త్రీయవిషయములు కాదాచిత్కమైనను శృంగారనైషధము రసవత్కావ్యమే.

# హరవిలాసము

ఇది శ్రీనాథుడు ఇతరకృతులందు తెలుపనిది. "ఆంధ్రభాషానైషధాబ్జభవు"నని పేర్కొన్నది. (8ప.పీ.) ఆంధ్రభాషానైషధమన శృంగారనైషధము. హరవిలాసము తదనంతరకృతి అగుట తథ్యము. అవచి తిప్పయసెట్టికి అంకితము.

అవచి తిప్పయసెట్టి కంచినంబి కుటుంబి. (15ప.పీ.) అందు పావాణిసెట్టి సింహవిక్రమపట్టణశ్రేష్ఠుడైన సెట్టి. జగజెట్టి. (17ప.పీ) సింహవిక్రమపట్టణమన నెల్లూరు. అతని కుమారుడు అవచి దేవయసెట్టి. (18ప.21వచ.పీ.) ఇతడు "శ్రీపర్వతసోపానస్థాపకుఁడగు రెడ్డివేమజగతీపతికిన్ బ్రాపు." (18ప.పీ.) శ్రీపర్వతసోపానస్థాపకుడు అద్దంకి రాజధాని అయిన ప్రోలయ వేమారెడ్డి. ప్రోలయ వేమారెడ్డికి అవచి దేవయసెట్టి ఆధారము. అతని కుమారులు అవచి తిప్పయసెట్టి,

తిరుమలనాథసెట్టి, చామిసెట్టి. (21వచ.పీ.) అవచి తిప్పయసెట్టి "శ్రీపర్వతసో. పానస్థాపకవేమక్షితీశసామ్రాజ్యశ్రీవ్యాపారిముఖ్యుడు. (1ప.3ఆ.) అనగా ప్రోలయ వేమారెడ్డి రాజ్యకాలమునందు మహావ్యాపారి. రాజ్యారంభకాలమునందు తండ్రి, రాజ్యాంతకాలమునందు తనయుడు ప్రముఖు లగుట సహజము. అవచి తిప్పయ సెట్టి పాండ్యాధిపసఖుడు కూడ (36ప.పీ) అంతేకాదు. కుమారగిరిరెడ్డి రాజ్యకాల మునందు కూడ మహావ్యాపారి. (7వచ.27,28ప.) ఉపరి కుమారగిరిరెడ్డి సుగంధ శాలాధ్యక్షుడు. (30ప.1ఆ.) తిరుమలనాథసెట్టి కుమారగిరిరెడ్డి "వసంతవైభవము నొక్కడ నిర్వహించు"ను. (24ప.పీ) చామిసెట్టి కుమారగిరిరెడ్డి కూర్మిహితుడు. (26ప.పీ.)

పయి విషయమెల్ల హరవిలాసరచనాకాలము కుమారగిరిరెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమగుటకు సాధకము. కాని శృంగారనై షధరచనాకాలము పెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపతి అయిన కాలమనుటకు బాధకము. అందువలన హరవిలాసరచనాకాలము కొండవీటి సామ్రాజ్యపతనానంతరకాలమని, రాజమహేంద్రవరరాజ్యపతనానంతరకాలమని ప్రతివాదములు కలవు[116]. ఆ వాదములందు అవచి తిప్పయసెట్టి ప్రోలయ వేమారెడ్డి వ్యాపారిముఖ్యుడు కాడనుటకు పాఠాంతరము కల్పింపఁబడినది. పాండ్యాధిపసఖుడను విషయము పరిగణమునకు రాలేదు. పాండ్యాధిపుడన పాండ్యదేశాధిపతి. ప్రోలయ వేమారెడ్డి, అనపోతారెడ్డి కాలమునందు పాండ్య దేశాధిపతులు సులతానులు.

"ఖుసి మీఱన్ సురధాణి నిండు కొలువై కూర్చున్నచో" అను పద్యములోని (22ప.పీ.) సురధాణి = సులతాను. మధురసులతాను పాండ్యదేశాధిపతి అగును. అతనికి అవచి తిప్పయసెట్టి సఖుడు. కావున అవచి తిప్పయసెట్టి ప్రాభవకాలము ప్రోలయ వేమారెడ్డి రాజ్యాంతకాలము మొదలు కుమారగిరిరెడ్డి రాజ్యాంతకాలము వఱకు కావలయును. ఆ కాలములోని అవచి తిప్పయసెట్టి కొండవీటిసామ్రా జ్యపతనానంతరము గాని, రాజమహేంద్రవరరాజ్యపతనానంతరము గాని సజీవుడై ఉండుట సంభవము కాదు. సజీవుడై ఉండని అవచి తిప్పయసెట్టి హరవిలా సమును అంకితము గొనుట అసంభవము. కాఁబట్టి హరవిలాసరచనాకాలము కొండవీటిసామ్రాజ్యపతనానంతరకాలము కాదు; రాజమహేంద్రవరరాజ్యపతనా నంతరకాలమును కాదు. కుమారగిరిరెడ్డి కొండవీటిసామ్రాజ్యాధిపతి అయిన కాలమే అగును.

"హరిహరరాయఫేరొజిసహసురధాణగజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణన సేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వ రీడగున్." 24ప.పీ.

ఇందు హరవిలాసరచనాకాలమును ఇంకను సూక్ష్మముగ నిర్ణయించుటకు సాధనసంపత్తి కలదు[117]. పద్యమునందు ముగ్గురు సమకాలికులైన పాలకుల పేరులు కలవు. హరిహరరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి. ఫెరొజిసహ బహమనీసులతాను. కుమారగిరిరెడ్డి కొండవీటిసామ్రాజ్యాధిపతి. రెండవ హరిహరరాయల రాజ్యకాలము 1377-1404. ఫెరొజిసహ రాజ్యకాలము 1397-1422. కుమారగిరిరెడ్డి రాజ్యకాలము 1386-1402. ముగ్గురి సమకాలము 1397-1402. కాఁబట్టి హరవిలాసరచనాకాలము 1400ప్రాంతము.

హరవిలాసమునందు అవచి తిప్పయసెట్టి "మంటి బహువత్సరంబులు" అని అన్నట్లు కలదు. (9ప.పీ) అప్పటికి తిప్పయసెట్టి వయస్సు కనీసము ఎనుబదేండ్లు కావలయును. కనుక తిప్పయసెట్టి జననకాలము 1320ప్రాంతమగును. అయిన 1350ప్రాంతమున ప్రోలయవేమారెడ్డి వ్యాపారిముఖ్యుడు, 1370ప్రాంతమున పాండ్యాధిపసఖుడు 1390ప్రాంతమున కుమారగిరిరెడ్డి సుగంధశాలాధ్యక్షుడును అగుట నిరాఘాటము.

అతని సోదరులలో తిరుమలనాథసెట్టి కుమారగిరిరెడ్డి వసంతోత్సవమును ఒక్కడు నిర్వహించుటకు, చామిసెట్టి కూర్మిహితుడగుటకు కారణము, అవచి తిప్పయసెట్టి అప్పటికి విఖ్యాతి (7వచ.)తోపాటు విశ్రాంతి గైకొనుట కావచ్చును. అతని కుమారులు మాచన, విశ్వనాథ, చెనమల్లకుమారులు (31ప.పీ.) కానక కన్న సంతానము కావచ్చును.

అవచి తిప్పయసెట్టికి శ్రీనాథుడు బాలసఖుడని హరవిలాసమునందు కలదు. (8,12ప.పీ.) బాలసఖుడన బాల్యసఖుడని అర్థము కాదు. బాలుడైన సఖుడని అర్థము. (యంగ్‌ఫ్రెండ్). "నారదుండు బాలసఖుండైన పర్వతుండును దానును" అని శృంగారనైషధమునందు ముందే శ్రీనాథుని ప్రయోగము కలదు. నారదుని చెల్లెలి కొడుకు పర్వతుడని తిక్కన భారతమునందు కలదు. (246ప.1ఆ.శాం.ప.) మేనమామకు మేనల్లునికి మధ్య వయోభేదము పాతికేండ్లు మొదలు నలుబదేండ్ల వఱకును ఉండవచ్చును. అవచి తిప్పయసెట్టికి, శ్రీనాథునికి మధ్య వయోభేదము నలుబది సంవత్సరములే (1320, 1360) కలదు.

# కృతిసమీక్ష

"ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నా పేర నంకితముగ" 12ప.పీ.

అని అవచి తిప్పయసెట్టి ఆదేశము. "హరవిలాసంబను ప్రబంధంబు సెప్పం దొడంగితి"నని శ్రీనాథుని నిర్దేశము. (13వచ.పీ.) ప్రబంధమన కావ్యము. శైవప్రబంధమన శైవసంబంధమైన ప్రబంధము. ఆగమజ్ఞాననిధి, తత్త్వార్థఖని అను విశేషణములు తన్నిమిత్తమే. ఆగమమన శైవాగమములు. తత్త్వమన శైవతత్త్వము. శైవతత్త్వానుసారమైన హరవిలాసమునందు అయిదు కథలు కలవు. 1. చిఱుతొండనంబి చరిత్రము. 2. గౌరీకల్యాణము. 3. దారువనవిహారము 4. సముద్రమథనకథ 5. అర్జునాఖ్యానము. ఇవి పరస్పరసంబధము లేని, భిన్నభిన్నగ్రంథములలోని వృత్తాంతములు. ప్రతికథకు ప్రత్యేకముగ హరవిలాసమునందు ఫలశ్రుతి కలదు. కనుక "నానాపురాణములయందలి శివసంబంధికథలను నాలుగైదింటి నేర్చి యొక సూత్రమునఁ గట్టెను. ఈ మాలికలో ఈ పూవులు పరస్పరానుస్రుతములు గాక విడివిడిగా ముడివేసిన వాని వలె (సింహాచలము పూలదండ వలె) నున్నవి" అని ఒక అభిప్రాయము కలదు[118]. అయిదు కథలకును ఐక్యానుసంధానము లేదని ఆంతర్యము. బాహిరముగ లేని మాట నిజము. ఆంతరముగ కలదు. అది గ్రహించుటకు అయిదు కథల ఆంతర్యమును గమనింపవలయును.

చిఱుతొండనంబి చరితము ప్రథమతః మల్లికార్జునపండితుని శివతత్త్వ సారమునందు కలదు. తదుపరి పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు కలదు. శివతత్త్వసారములోని పద్యమిది:

"తన కొడుకుఁ దునిమి చంటక
మొనరఁ గఁ గావించి నీకు నొప్ప నివేదిం
చిన దాన హెచ్చి ముక్తికిఁ
బొనరఁ గఁ జిఱుతొండనంబి పోవఁ డె రుద్రా!" 400ప.

చిఱుతొండనంబి ముక్తికి పోయిన కథ కూడ బసవపురాణమునందు కలదు. ముక్తికి పోయిన కథ సిరియాలుని కథ (752-927పం.4ఆ.). అందు సిరియాలుడనియే కలదు. సిరియాలుని కుమారుడు సీరాలుడని కలదు. సిరియాలుని భార్య సంగళవ్వ

అని కలదు. తిరువెంగాణినంగ అని కూడ కలదు. అనంతరకథయందు శివుడు సిరియాలుని చిఱుతొండ అని సంబోధించును. సిరియాలుడని కూడ కలదు. ఇతడు అఱువదిముగ్గురు తమిళశివభక్తులలోను ఒకడు. అఱువదిముగ్గురు తమిళ శివభక్తుల కథలు పదునొకండవ, పండ్రెండవశతాబ్దుల నాటికి అధికప్రచారములోనికి వచ్చినవి[119]. అవి శేక్కియార్ అను తమిళకవి పెరియపురాణమునందు పొందుపఱిచెను[120]. చిఱుతొండనంబి పేరు తమిళమునందు శిఱుత్తొండర్ అని[121], తిరుత్తొండర్ అని కలదు[122]. తొండర్ అనగా భక్తుడు. శిఱు, తిరు శ్రీశబ్దవికృతులు. శిఱుత్తొండర్, తిరుత్తొండర్ అనగా శ్రీభక్తుడు. సిరియాళుడు అనినను శ్రీభక్తుడే అగును. తమిళభాషలో ఆళ్ శబ్దమునకు సేవకుడను అర్థము కలదు. శివభక్తులు శివుని లెంకలే.

పెరియపురాణము పండ్రెండవశతాబ్ది గ్రంథము[123]. బసవపురాణము పదమూడవశతాబ్ది గ్రంథము. రెండును చిఱుతొండనంబికి సమకాలిక, సమీపకాలికగ్రంథములు కావు. పరంపరాగతములైన జనశ్రుతులు ప్రధానాధారములైన సుదూరకాలికగ్రంథములు. చిఱుతొండనంబి చోళనాడు (తంజావూరు జిల్లాప్రాంతము) లోని తిరుచ్చెంగట్టన్‌కుడి నివాసి, మా-మత్తిరర్ అనగా వైద్యుడు, తల్లిదండ్రులు పెట్టిన పేరు పరంజ్యోతి, వాతాపి మీద గజసైన్యమును నడిపించి, విజయము సాధించి, రాజును మెప్పించిన వీరుడు, రాజు సైనికబంధము తప్పించిన శివలెంకలకు లెంక అని పెరియపురాణము నందు కలదు[124]. పెరియపురాణమునందు వర్ణనిర్దేశము లేదు. వృత్తినిర్దేశమే కలదు[125]. బసవపురాణమునందు సిరియాలుడు (చిఱుతొండనంబి) కాంచీపురనివాసి, సెట్టి అని కలదు. సెట్టి అన వైశ్యుడు. హరవిలాసమునందు అటులే కలదు. కాని బసవపురాణములోని కథకు, హరవిలాసములోని కథకు సామ్యభేదములు కలవు. భేదములు భిన్నమూలమును సూచించును.

చిఱుతొండనంబి భక్తికి సంతసించి శివుడు భైరవమునిగ వచ్చినట్లు పెరియపురాణమునందు కలదు. చిఱుతొండనంబి భక్తిని పరీక్షించుటకు పార్వతీపరమేశ్వరులు వృద్ధభైరవదంపతులైనట్లు హరవిలాసమునందు కలదు. పెరియపురాణమునందు భైరవుడు ముందు చిఱుతొండనంబి గృహమునకు వచ్చును. "చిఱుతొండనంబి శివభక్తుని కొఱకు వీథిలోనికి వెళ్లెను. లోనికి రండు" అని పరిచారిక సందనం ఆహ్వానించును. " స్త్రీలు మాత్రమే ఉన్న గృహములో అడుగు పెట్టము,"అనుట విని, చిఱుతొండనంబి భార్య తిరువెంకాడు వీథిగుమ్మములోనికి వచ్చి, "ఇప్పుడే రాగలరు. మిమ్ము చూచిన అదృష్టముగా భావించి ఆనందింతురు. లోనికి రండు" అని అభ్యర్థించును. "చిఱుతొండనంబి గొప్పదనము

విని ఉత్తరాపథమునుండి వచ్చితిని. ఏమైన సరే, ఆయన లేకుండ ఇంటిలో అడుగు పెట్టను. గుడి దగ్గఱి అత్తిచెట్టు నీడను ఉందును." అని భైరవుడు వెడలి పోవును. భైరవుని వర్ణనమునందు మాత్రమే వర్ణాసాదృశ్యము పెరియపురాణమునందు కలదు. ముయ్యేడు వాసరముల కుంభవృష్టి లేదు. అది బసవపురాణమునందు సిరియాలుని కథలో గాక, హలాయుధుని కథలో సూచన ప్రాయముగా కలదు.

"..హరుండిరువది యొక్క దినము
వదిగొని కంచిలో వాన గుర్పింపఁ
గడఁగి నిత్యము నేఁగు రొడ్డయల కన్న
మిడుచుండఁ దపసు లందెచట లేకున్నఁ
బరముండు దాన తాపసక్రియనంత" 1197-1201ప.4ఆ.

సిరాలుని చిఱుతొండనంబిదంపతులే వధించినట్లు పెరియపురాణమునందు కలదు. చందనగంధి సహకరించినట్లు హరవిలాసమునందు కలదు. సిరాలుని శిరస్సు ముందు వండనట్లు, తర్వాత వండినట్లు పెరియపురాణమునందు కలదు. ముందే వండి యుంచినట్లు హరవిలాసమునందు కలదు.

హరవిలాసములోని చిఱుతొండనంబి పూర్వజన్మవృత్తాంతము, ఇక్షుఘటాభారవహనము, పరమేశ్వరుని సహకారము, పార్వతి ఈర్ష్యాక్రోధము, పార్వతీపరమేశ్వరుల పరీక్ష, జటాజంగమధారి జటిలప్రతిఘటనము, తాపసపురంధ్రీకపటుప్రబోధము, పెరియపురాణమునందు లేవు. బసవ పురాణమునందును లేవు. కాఁబట్టి పెరియపురాణములోని చిఱుతొండనంబి కథ, బసవపురాణములోని సిరియాలుని కథ, హరవిలాసములోని చిఱుతొండనంబిచరిత్రమునకు మూలము కాఁజాలదు. బహుశః అవచి తిప్పయసెట్టి అందఁజేసిన జనశ్రుతి ఆధారము కావచ్చును. అది నిమిత్తమాత్రముగ శ్రీనాథుడు స్వతంత్రకల్పనముల ప్రపంచీకరించి రసవత్తరముగ రచించినది చిఱుతొండనంబి చరిత్రము. కథ పరమార్థము కంచి ఏడువాడల జనులకు చిఱుతొండనంబి కారణముగ మోక్షసిద్ధి. అది ఫలశ్రుతిలోని "ఇష్టార్థసిద్ధి." (142వచ.2ఆ.) చిఱుతొండనంబిప్రభృతులకు శివుడు మోక్షప్రదానము చేయుట హరవిలాసములోని మొదటి విశేషము. ఇది శిష్టరక్షణాత్మకము.

గౌరీకల్యాణము కాళిదాసు కుమారసంభవమునకు సంగ్రహాంధ్రీకరణము. కుమారసంభవాంధ్రీకరణపద్ధతి నైషధాంధ్రీకరణపద్ధతికి సహోదరము[126]. అయినను కథోపక్రమోపసంహారములందు భేదము కలదు. కాళిదాసు కుమారసంభవము పార్వతి జన్మవృత్తాంతముతో ప్రారంభమగును. పార్వతీపరమేశ్వరులకు

జన్మించిన కుమారస్వామి కావించిన తారకాసురసంహారముతో సమాప్తమగును. శ్రీనాథుని గౌరీకల్యాణము తారకాసురుని దురాగతవృత్తాంతముతో ప్రారంభ మగును. కుమారస్వామినిమిత్తమాత్రుడుగ శివుడు తారకాసురుని వధించినట్లు సమాప్తమగును.

"-శతానందముకుందపురందరాదిబృందారకులకు హితంబుగ
సుతుం గాంచి యాంబికేయుండును గాంగేయుండును షాణ్మా
తురుం డును నగు నక్కుమారుని వలనఁ దారకాసురు వధియించి
మహా దేవుండు లోకంబులన్నియు రక్షించె నిది గౌరీకల్యాణము."

101వచ.4ఆ.

ఇందు కర్త శివుడు. కుమారస్వామి కరణము. శివుడు కుమారస్వామి వలన తారకాసురుని సంహరించుట హరవిలాసములోని రెండవ విశేషము. ఇది దుష్ట శిక్షణాత్మకము.

దారువనవిహారము బ్రహ్మాండపురాణప్రోక్తము[127]. ఇందు శివుని భిక్షాటనము, చౌర్యరతము, లింగస్వరూపము కలదు. భిక్షాటనము చౌర్యరతమునకు, చౌర్య రతము లింగస్వరూపమునకు హేతుభూతములు. శివుని జ్యోతిర్మహాలింగము వేద త్రయీప్రకారము. ఆగమామ్నాయానుసారము. (61దం.5ఆ.)శివుని విగ్రహము కాక శివలింగమే అర్చనార్హమని ప్రతిపాదించుట హరవిలాసములోని మూడవ విశేషము. ఇది శివలింగస్వరూపాత్మకము.

సముద్రమథనకథ భారతభాగవతాద్యనేకపురాణప్రసిద్ధము. ఇందు బ్రహ్మా తరము కాని, విష్ణుసాధ్యము కాని, కాలకూటోపసంహారమును శివుడు చేయును. బ్రహ్మ కంటె, విష్ణువు కంటె శివుడు అధికుడని వ్యక్తమగును. శివాధిక్యమును ప్రకటించుట హరవిలాసములోని నాలుగవ విశేషము. ఇది శివాధిక్యాత్మకము.

అర్జునాఖ్యానము భారతకథానుసారి. అర్జునుని పాశుపతాస్త్రసంపాదనము ప్రధా నవిషయము. అది శివానుగ్రహమున సంపాదించును. లింగస్వరూపుడైన శివుని అనుగ్రహమును బడయుటకు అర్జునుడు తపస్సు చేయును. అది సంస్కృతాం ధ్రభారతములందు సమానము. ఇందు భిన్నము. షట్కాలశివలింగార్చనమే అర్జు నుని తపస్సు[128]. షట్కాలశివలింగార్చనము, సంతతజంగమారాధనము పరమశైవ పద్ధతులు. చిఱుతొండనంబిచరిత్రము సంతతజంగమారాధనమునకు నిదర్శనము. అర్జునాఖ్యానము షట్కాలశివలింగార్చనమునకు నిధానము. షట్కాలశివలింగా ర్చనము శివానుగ్రహప్రాప్తిసాధనముగ నిరూపించుట హరవిలాసములోని అయి దవ విశేషము. ఇది శివానుగ్రహాత్మకము.

శిష్టరక్షణము, దుష్టశిక్షణము విధులైన శివుడు లింగరూపుడు. బ్రహ్మ, విష్ణువుల కంటె అధికుడు. అట్టిశివుని అనుగ్రహము షట్కాలశివలింగార్చనమున సాధ్యము. ఇది హరవిలాసములోని అంతరమైన ఐక్యానుసంధానము. శైవతత్త్వము. హరవిలాసము శైవప్రబంధము.

హరవిలాసము గౌరీకల్యాణము వినా స్వతంత్రకావ్యము. చిఱుతొండనంబి చరిత్రము కరుణరసశబలితమైన ధర్మవీరమునకు కాణాచి. కన్నతల్లి తిరువెంగనాంచి, కన్నతండ్రి చిఱుతొండనంబి, పెంచిన దాది చందనంగ (చందనిక) సిరియాలుని వధ్యశృంగారము చేసి, ముప్వురును ఏకవాక్యముగ పలికిన-

"మది శంకింపకుమన్న, మావలని ప్రేమస్నేహవాత్సల్యసం
పద పాటింపకుమన్న, నాలుకతుదిన్ బంచాక్షరీ మంత్రముం
బదిలంబొప్పఁ బఠింపుమన్న, పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సుమ్మన్న, యనుంగు నందన సిరాలా వీరశైవవ్రతా" 116ప.2.ఆ.

అను పద్యము వీరశైవవ్రతమునకు శృంగగ్రాహిక. గౌరీకల్యాణము కరుణ, శృంగారరసములకు నెలవు. కరుణరసనిర్భరమైన రతివిలాపఘట్టమునందు రతిదేవి,

"హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదఁ
దమ్ముఁడా! నా కిమ్ము దగఁ జితాగ్ని
మందమందంబుగా మలయాచలము గాడ్పు
వెరవుతో మండంగ విసరుఁ గాతఁ
బరలోకతృప్తికై బంధులిద్దఱకును
ధర్మోదకం బిండు తమ్మితేనె
సహకారమంజరీచరుపిండకబళంబు
వెట్టుండు మాకునై పికము ముట్టఁ
దేనె పెట్టుండు కస్తూరి దీర్చి యచటఁ
జేర గొజ్జంగి పూనీటఁ జెంబు లిడుఁడు
నన్ను వలరాజుఁ దలఁచి మన్ననఁ దలిర్పఁ
దగ సమర్చన చేయుఁడు దంపతులకు" 49ప.4ఆ.

వసంతునితో పలికిన పద్యము కాళిదాసు శ్లోకములను (35-38శ్లో.4 స.)మించినది. తమ్మితేనెను ధర్మోదకముగ ఇమ్మనుట, పికము ముట్ట సహకారమంజరీచరుపిండకబళము పెట్టుమనుట, కస్తూరితో తీర్చుమనుట, గొజ్జంగిపూనీట చెంబు లిడుమనుట రతిమన్మథులకు మాత్రమే తగిన సామగ్రి. ఇవి

కాళిదాసు శ్లోకములను మఱపించి మురిపించునవి.

దేవదారువనవిహారములోని,

"సెలయేటి తెలినీటఁ జిఱుబంతి పసుపాడి
సేస క్రుమ్ముళ్ళఁ బిచ్చియలు తుఱిమి
గురువింద పేరులు గుబ్బచన్నులఁ దాల్చి
నెమలిపించెంపుఁ బుట్టములు గట్టి
పయ్యెద మాఱుగాఁ బాఱుటాకు లమర్చి
చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళి చిగురాకుఁ గర్ణపూరముఁ జేసి
కుసుమ పూవుల ధూళిఁ గురులఁ జల్లి
చెంచుఁ జిగురాకుఁ బోఁణల చేఁతలెల్ల
నభినయింతురు పర్ణశాలాంతరములఁ
దంద్రుఁ లెందేనిఁ జనునప్పు డల్లులెదుర
గారవమ్మున మునికన్యకాజనంబు" 38ప.5.ఆ.

అను పద్యము బాలవిజ్ఞానమునకు భద్రాసనము. సముద్రమథనకథలోని

"జలధరమంతయై కరటి చందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి నేరెడుపండును బోలె నుండయై
కలశపయోధిమంథనముఖంబునఁ బుట్టిన యమ్మహాహలా
హలము క్రమంబునన్ శివుని హస్తసరోరుహ మెక్కె వింతగన్"

68ప.6ఆ.

అను పద్యము వింత గొలుపునది. విస్మయస్థాయికము.

అర్జునాఖ్యానములోని స్వర్గలోకప్రభాతప్రాయవిభావరీసమయవర్ణనము సంస్కృతాంధ్రకావ్యములందే అపూర్వము. భూలోకప్రకృతివర్ణనము సర్వకవి సంక్షుణ్ణమార్గము. స్వర్లోక ప్రకృతివర్ణనము సమీచీనము.

"పారిజాతకలతాపల్లవంబులు మేసి
కొసరె నుద్యానపుంస్కోకిలములు
కంధరాగ్రే నేయకనకఘంటిక మ్రోయ
వేల్పుటేనిక యుషర్విధికి వెడలె
మందాకినీవీచి మారుతం బల్లార్చె
నప్సరఃస్త్రీల నీలాలకముల
సప్తర్షిపావనాశ్రమవనాంతరమున

నామ్నాయఘోష మభ్యధికమయ్యె
బాలవత్సంబుపైఁ గూర్మిఁ బంచితిలుచుఁ
గామగవి సేఁపు వచ్చి హుంకారమిచ్చె
శక్రు గడియారమున మించె శంఖరవము
విబుధలోకంబునందలి వేగుఁబోక" 135ప.7ఆ.

"మాటుగా వైచిన మాంజిష్ఠ తెరయెత్తి
పంజుమంచము డిగ్గె మంజుఘోష
మొకరి మట్టెల మ్రోఁత ముద్దుచూపఁగ రంభ
కనకంపు గొడుగు పాగాలు దొడిగె
నొకటు వేనలి మడ్చి యొక్క కేల ఘృతాచి
గాజుఁటెక్కల తల్పుగడియ పుచ్చె
నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ
నిల్వుటద్దంబులో నీడ చూచె
హరిణి గీలించె నలినపట్టాంశుకంబు
మేనక ధరించెఁ బాలిండ్ల మీఁద అవిక
యప్సరఃస్త్రీ నికేతనాభ్యంతరములఁ
గొక్కురోకో యనుచుఁ గోళ్లు గూయుటయును." 137ప.7ఆ.

ఇందలి గడియారము, మాంజిష్ఠ తెర, పంజుమంచము, మొకరిమట్టెలు, కనకంపు గొడుగుపాగాలు, గాజుఁటెక్కల తల్పు గడియ మొదలైన శ్రీనాథుని నాటి తెలుగు విలాసవస్తువులే స్వర్గలోకమునందు తేజరిల్లినవి.

హరవిలాసము కృతిభర్త అవచి తిప్పయసెట్టి మహావ్యాపారి. నానాద్వీపనగరనౌకావ్యాపారి. అందువలన కొండవీటిసామ్రాజ్యకాలమునందలి నౌకావ్యాపారమునకు హరవిలాసములోని అవతారికాశ్వాసాద్యంతపద్యములు అద్దములైనవి. అవచి తిప్పయసెట్టి కొండవీటి సామ్రాజ్యాధిపతి కుమారగిరిరెడ్డికి.

"ప్రతివత్సరంబును సంవత్సరోత్సవంబులకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసారసంకుమదహిమాంబుకాలాగురుగంధసారప్రధానంబు లగు సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీనిసింహళతవాయి హురుముంజి చోఁణంగి ప్రభృతినానాద్వీపనగరాకరంబులగు ధనకనక వస్తువాహన మాణిక్యగాణిక్యంబులు దెప్పించియు ..... భువనవిఖ్యాతి గైకొని యొప్పు ఏను." 7వచ.1ఆ.

చీని = చైనాదేశము. పట్టుబట్టలకు ప్రసిద్ధము. సింహళము = శ్రీలంక.

ఏనుగులకు, రత్నములకు నిలయము. తవాయి = మలైద్వీపములోని టవాయ్. కాలాగురుకాష్ఠములకు కాణాచి. హురుముంజి = పర్షియాదేశములోని హార్మజ్ లేక ఓర్మజ్. అశ్వములకు ఆశ్రయము[129].

"పంజారఁ గర్పూరపాదపంబులు దెచ్చె
జలనోంగి బంగారు మొలక దెచ్చె
సింహళంబున గంధసింధురంబులు దెచ్చె
హురుముంజి బలు తేజిహరులు దెచ్చె
గోవ సంశుద్ధసంకుమదద్రవము దెచ్చె
యాంపఁ గట్టాణిముత్యాలు దెచ్చె
భోటఁ గస్తూరికాపుటకోశములు దెచ్చెఁ
జీనిఁ జీనాంబరశ్రేణి దెచ్చె
జగదగోపాల రాయవేశ్యాభుజంగ
పల్లవాదిత్యభూదానపరశురామ
కొమరగిరిరాజదేవేంద్రు కూర్మిహితుఁడు
జాణ జగజెట్టి దేవయచామిసెట్టి." 26ప. 1ఆ.

చామిసెట్టి అవచి తిప్పయసెట్టి కనిష్ఠసోదరుడు. పంజార = సుమత్రాద్వీపములోని నాటి పన్సూర్ లేక ఫన్సూర్. నేటి బరూస్. కర్పూరవృక్షములకు నెలవు. జలనోంగి = మలైద్వీపములోని ఆగ్నేయదిశయందలి జిహ్-లో-టింగ్ జిల్లా కావచ్చును. అది వెండి, బంగారు ఆభరణములకు ప్రసిద్ధము. బంగారుమొలకలు ఒకవిధమైన బంగారునగలు కావచ్చును. గోవ = గోవా. పశ్చిమాసియా, ఐరోపా, ఆఫ్రికాఖండముల నుండి సమస్తవస్తువులు దిగుమతి అగు రేవుపట్టణము. యాంప = యాప = యాల్పాణ = జాఫ్నా. శ్రీలంక ఉత్తరప్రాంతీయము. ముత్యములకు ముఖ్యము. భోట =భోటాన్ కస్తూరికాపుటకోశములు లభించు దేశము[130]

"తరుణాసీరి తవాయి గోవ రమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబుకుంకుమరజః కస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలి జోఁగు వల్లి వలికా సమ్మన్లఁ దెప్పించు నే
ర్పరియై వైశ్యకులోత్తముం డవచి తిప్పం డల్పుఁడే యిమ్మహిన్. "
29ప.1ఆ.

తరుణాసీరి = మలైద్వీపములోని తర్నాస్సరి కావచ్చును. రమణ = రమన్న దేశ = పెగు కావచ్చును. కస్తూరికి ఆకరము[131].

కప్పలి, జోఁగు, వల్లి, వలికా, సమ్మన్ నౌకాభేదములు. కప్పల్ అను

తమిళపదమునకు కప్పలి తెలుగు రూపము. తెలుగోడ కావచ్చును. జోఁగు = జోంగు అను పెద్ద చైనానౌక. వల్లి, వలిక తెలియనివి. సమ్మన్ అనునది మలైద్వీపసముద్రజలమునందు సంచరించు సంపన్ అను నౌకానామమునకు రూపాంతరము కావచ్చును[132].

"పండువా ఢిల్లి రాఢాది పట్టణముల
యధిపతులు మౌళిఁ దాల్చు రత్నాంకురంబు
లవచిత్రిపురాంతకానీతయానపాత్ర
సింహళద్వీపమండలక్షేత్రజములు" 29ప.1ఆ.

అవచి తిప్పయసెట్టి సింహళద్వీపము నుండి స్వీయనౌకలమీద తెప్పించిన రత్నములు పండువాసులతాను, ఢిల్లీసులతాను, రాఢాధిపతి కిరీటములందు ప్రకాశించినవి.

"ఖుసి మీఱన్ సురధాణి నిండు కొలువై కూర్చున్నచో నీ కరా
భ్యసనంబున్ నుతియించురా యవచితిప్పా చంద్రసారంగనా
భిసముత్పాదితతాళవృంతపవనప్రేంఖోల్లన ప్రక్రియా
వసరోదంచితసారసౌరభరసవ్యాలోలరోలంబముల్." 22ప.1ఆ.

సులతాను ఖుషీగా నిండుకొలువులో కూర్చున్నచో, పరిచారికలు తాటాకు విసనకఱ్ఱలు పైకి క్రిందికి విసురునప్పుడు వెల్లివిరిసిన కస్తూరీకర్పూరముల సారసౌరభరసములో మునిగి తేలిన తుమ్మెదలు అవచి తిప్పయసెట్టి హస్తవాసిని నుతియించునట! అవచి తిప్పయసెట్టి ఎంచి అందజేసిన మంచి కర్పూరము, కస్తూరి అలంకరించుకొన్న సులతాను మధురసులతాను అగును. తాటాకు విసనకఱ్ఱలు దక్షిణభారతదేశ ప్రసిద్ధము.

"కొమరగిరిక్ష్మారమణకుంజరచారువసంతవైభవ
క్రమసముపార్జితాభినవగంధహిమాంబుకురంగనాభికుం
కుమఘనసారసంకుమదకుంభమనోహరగంధశాలికా
సముదయసార్వభౌమ! కవిసంఘమనోరథకల్పద్రుమా!" 103ప.4ఆ.

విజయనగరసామ్రాజ్యాధిపతి రెండవ హరిహరరాయలు, బహమనీసులతాను ఫిరోజిషహా, ఉత్కళసామ్రాజ్యాధిపతి గజపతి మొదలైన ఇరుగు పొరుగు రాజులెల్లరు ప్రశంసించు, కొండవీటి సామ్రాజ్యాధిపతి కుమారగిరిరెడ్డి వసంతోత్సవవైభవమునకు (24ప.1ఆ.) వలయు మంచిగంధము, పన్నీరు, కస్తూరి, కుంకుమము, కర్పూరము, జవ్వాజి బానలతో మనోహరమైన సుగంధిశాలల

సముదాయమునకు అవచి తిప్పయసెట్టి సార్వభౌముడగుటకు హేతువు ఆతని నానాద్వీపనగరనౌకావ్యాపారమే.

అవచితిప్పయసెట్టి "లంకాదికద్వీపానీత సువస్తుతర్పితసమాధేయాఖిలక్ష్మాపతి" (195ప.7ఆ.) ఆతని వాణిజ్యము"లంకాశంకరశైలమధ్యవసుధాలంకారము" (133ప.6ఆ.)

[అవతారికలోని "ఖుసిమీాఖన్" అను పూర్వోదాహృతపద్యము సందర్భోచిత ముగ లేదు. "అందు" అను ఉపక్రమణమునకు (21వచ.) అనంతరము పద్యము ప్రథమపురుషయందుండవలయును. కాని మధ్యమపురుషయందు కలదు. "అక్ష య్యంబుగ సాంపరాయని"అను చాటుపద్యమువలె. ఇట్టి పురుషవ్యత్యయము సముద్రమథనకథలోను కలదు. (32, 50వచ.6ఆ.) అంతేకాదు. "ఖుసిమీాఖన్"అను పద్యములోని సుదీర్ఘసమాసము సమీపకాలముననందే పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి అనుకరణపాత్రమైనది." "పవమానప్రేంకణప్రక్రియావసరోదంచిత చారుసౌరభర సవ్యాలోలరోలంబములే" (124ప.3ఆ) కావున చాటుపద్యము గ్రంథస్థము కావ లయును.]

## ధనంజయవిజయము

ఇది కూడ శ్రీనాథుడు తెలుపనిది. తన వంశమునందు బహుపూర్వుడైన గన్నభూపాలుడు " శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజయంబను సత్కావ్యమంది వెలసె"నని దంతులూరి బాపిరాజు మూర్తిత్రయోపాఖ్యానమునందు తెలిపెను. (60ప.1ఆ.) గన్నభూపాలుని పూర్వుడు హరిసీమకృష్ణుడు ధాన్యవాటీపురాధిపతి అని మూర్తిత్రయోపాఖ్యానమునందు కలదు. (56ప.1ఆ.) గన్నభూపాలుడును ధాన్యవాటీపురాధిపతి అగును. పెదకోమటి వేమారెడ్డి మామ ధాన్యవాటీ పురాధిపతి అయిన గన్నభూపాలుడని పెదకోమటి వేమారెడ్డి భార్య సూరమాంబ సంతానసాగరతటాకశాసనమునందు కలదు[133] తల్లి సూరాంబ త్రవ్వించిన సంతా నసాగరమునకు తనయుడు రాచవేమారెడ్డి జగనొబ్బగండకాలువ ఘటించినట్లు మఱొక శాసనమునందు కలదు[134]. రాచవేమారెడ్డి పేరులోని రాచవిశేషణమునకు హేతువు తల్లి సూరమాంబ రాచస్త్రీ అగుట కావలయును. గన్నభూపాలుని ప్రసక్తి కల సంతానసాగరతటాకశాసనకాలము 1410 వ సంవత్సరము. జగనొబ్బ గండకాలువ శాసనకాలము 1415 వ సంవత్సరము. ధనంజయవిజయము రచనా కాలము స్థూలముగ 1412 వ సంవత్సరము కావచ్చును[135]. గన్నభూపాలుడు ధనంజయసగోత్రుడు. ధనంజయవిజయము భారవి కిరాతార్జునీయమునకు

తెనుగుసేత అగును. అనుపలబ్ధము.

## నందనందనచరిత్ర

ఇది కూడ శ్రీనాథుడు తెలుపనిది. గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు, కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందమునందును శ్రీనాథుని నందనందనచరిత్ర నుండి రెండు సీసపాదములు ఉదాహరింపఁబడినవి.

"రామానుజుండు నిరంతరము పదాఱు
వేల నూటెనమండ్రు వెలఁదుల తమి"
"శాశ్వత విశ్వవిశ్వంభరాభారమీ
రాజకుమారుఁడేలంగలండు"

ఇందు మొదటిది కుంటినడక కలది. రెండవది రేఫలకారయతిమైత్రి కలది కావున శ్రీనాథరచితములు కావని ఒక అభిప్రాయము కలదు[136]. కుంటినడక అపవాదము కావచ్చును. రేఫలకారయతిమైత్రి ప్రామాదికము కావచ్చును. అంతేకాదు. శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని ఇష్టదేవతాస్తుతియందు రాధామాధవస్తవము కలదు. అందు రాధామాధవుల రాసక్రీడ కలదు. అది నందనందనచరిత్రమే. ఉపలబ్ధమైన తెలుగుసాహిత్యమునందు రాధామాధవుల రాసక్రీడ ప్రథమతః శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందే కలదు.

"బాలిక మోము మత్తవనబర్హికిశోరకలాస్యలీలఁ బై
వాలిచి పచ్చకపు ఎరపు వాసనతోడి ముఖారవిందతాం
బూలపు మోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చు ధూర్తగో
పాలుఁడు ప్రోచుఁగావుత మపారకృపామతి మంత్రియన్ననిన్."
3ప.1ఆ.

కృతిభర్తయైన మంత్రి అన్నడు మహాశివభక్తుడు. కృతికర్తయైన శ్రీనాథుడు ఈశ్వరార్చనకళాశీలుఁడు. అయినను రాధామాధవస్తవము! ఇది తత్పూర్వకృతియైన నందనందనచరిత్రకావ్యరసోద్గారము కావలయును. శ్రీనాథునికి దినవెచ్చము తీర్చిన పంట మైలారురెడ్డి వైష్ణవభక్తివిశిష్టుడైనట్లు శాసనప్రమాణము కలదు[137]. నందనందనచరిత్ర పంటమైలారురెడ్డికి అంకితము కావచ్చును. రచనాకాలము 1426 ప్రాంతమగును. కృతి అనుపలబ్ధము.

# వల్లభాభ్యుదయము

ఇది కూడ శ్రీనాథుడు తెలిపినది కాదు. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "శ్రీనాథుడు - వల్లభాభ్యుదయము" అను శీర్షికను ఒక సీసపద్యము కలదు.

"సీ. రజనీవధూకర్ణరజతతాటంకంబు
వలరాజు ధవళోష్ణవారణంబు
ప్రోషితయువతిహృత్పుటభేదదాత్రంబు
బహుచకోరకుటుంబపానపాత్ర
మధుకైటభాసురమథను దాఁపటికన్ను
చక్రవాకంబుల చల్ల జంపు
దుగ్ధపాథోరాశి తొలి చూలి సంతతి
రోహిణీదేవి తారుణ్యఫలము
చంద్రకాంతశిలామణిస్థలకృపీటు
నిర్ఝరాంధోవ్యథామోక్షనియమవైద్యుఁ
డంధకారచ్ఛటాహాలహాలధరుండు
చంద్రుఁ డొప్పారెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు." 199ప.3ఆ.

ఇది శ్రీనాథుని సీసపద్యమని స్వయంవేద్యము. ఇందు చంద్రుడు వలరాజు ధవళోష్ణవారణమని కలదు. మన్మథుని తెల్లగొడుగని అర్థము. ఇట్లు వర్ణించుట సర్వకవిసాధారణము కాదు. ఇట్టి వర్ణన శ్రీనాథుని శృంగారనైషధమునందు కలదు. "వలరాజు వెల్లెల్లి" (20ప.8ఆ.) "అతను జగజంపుగొడు గెవ్వఁ డవ్విధుండు" అని కాశీఖండము నందు కలదు. (195ప.4ఆ.) శృంగారనైషధమున మఱొక పద్యము నందు "రోహిణీ శుద్ధాంతగేహవర్తితమైన" అని కలదు. (178ప.8ఆ.) భీమేశ్వరపురాణమునందు "రోహిణీగాఢోపగూహనంబున" అని కలదు. (45ప.2ఆ.) ఇందు "రోహిణీదేవి తారుణ్యఫలము"అని కలదు. "విరహపరితాపవేదన వేఁగుచున్న చక్రవాకాంగనల కటాక్షముల యగ్గి" అని భీమేశ్వరపురాణమునందు కలదు. "చక్రవాకంబుల చల్లజంపు" "ప్రోషితయువతిహృత్పుటదాత్రంబు" అని వల్లభాభ్యుదయము నందు కలదు. శృంగారనైషధమునందు "గగనలక్ష్మికి దంతకాండతాటంకంబు" అని కలదు. (20ప.8ప.) "రజనీవధూకర్ణరత్నతాటంకంబు" అని వల్లభాభ్యుదయమునందు కలదు. ఇట్లు భాష, భావము, శైలి, సీసపద్యరచనాపద్ధతి వల్లభాభ్యుదయసీసపద్యమునందు శ్రీనాథముద్రాముద్రితము[138]. వల్లభాభ్యుదయము శ్రీకాకుళస్వామియైన తెలుగువల్లభునిచరిత మనగా శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమగును.

"అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ", "రంభఁ గూడెం దెనుంగురాయ రాహుత్తుండు" అని శ్రీనాథుని చాటుపద్యములందు ప్రసక్తుడైన, రెండవ ప్రౌఢ దేవరాయల సామంతుడైన తెలుగు రాయల పేరు శ్రీకాకుళస్వామియైన తెలుగు రాయల పేరు కావచ్చును. పంట మైలారురెడ్డి ప్రాపు లభించిన కాలమునందే (1424 -1428) సాంపరాయని తెలుంగురాయల సమాదరమును శ్రీనాథునికి లభించినది. వల్లభాభ్యుదయము తెలుగురాయలకు అంకితమగును. రచనాకాలము స్థూలముగ 1428 వ సంవత్సరము కావచ్చును. కృతి అనుపలబ్ధము.

శ్రీనాథుడు "నవమరుత్తుచరిత్రంబు నైషధంబు సప్తశతి పండితారాధ్యచరిత మనఁగఁ గావ్యములు పెక్కు చెప్పినట్లు భీమేశ్వరపురాణమునందు కలదు. (17ప.1ఆ.) భీమేశ్వరపురాణమునకు పూర్వము శ్రీనాథుడు చెప్పిన పెక్కు కావ్యములలో ధనంజయవిజయము, నందనందనచరిత్ర, వల్లభాభ్యుదయము చేరును.

# భీమేశ్వరపురాణము

ఇది శ్రీనాథుడు "కావ్యములు పెక్కు చెప్పియుఁ గాంక్ష చనక వెండియును గావ్యమొకటిఁ గావింపఁదలఁచి" రచించినది. (17ప.1ఆ.భీ.పు.) అంతేకాదు. "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకుని మహిమ" అని తెలిపినది. (7ప.1ఆ.కా.ఖం.). "ప్రౌఢనిర్భరవయఃపారిపాకమున" అనగా ప్రౌఢనిర్భరవయస్సున కాదు. ప్రౌఢనిర్భరపయస్సుయొక్క పరిపాకమున = పరిపక్వ దశనని అర్థము. "పరమపరిపాకదశ వృంతబంధమెడలి పతనమగు తాటిపంటితో" (30ప.2ఆ.భీ.పు.) , "పరమపరిపాకభిదురఫలాపీడదాడిమీక్రోడనీడాక్రీడచ్ఛిక్రోడ యూథంబును" (100ప.5ఆ.భీ.పు.), "ప్రాణి కర్మపరిపాకకాలంబు ప్రాప్తమయ్యెడునంతదాఁక" (78ప.5ఆ.కా.ఖం.) అని శ్రీనాథుని ప్రయోగాంతరములు కలవు[139]. వయస్సునకు సంబంధించి బాల్యయౌవనప్రౌఢవార్ధకదశలని నాలుగు దశలు ప్రసిద్ధము. "బాల్యంబునను యౌవనంబునం బ్రౌఢత్వసమయంబునను వార్ధకంబునం-" అని తిక్కన వివరణము. (85పచ.1ఆ.స్త్రీ.ప.) పూర్ణపురుషాయుషజీవితమునందు తొలి పాతికసంవత్సరములు (1-25) బాల్యదశ. మలి పాతికసంవత్సరములు (26-50) యౌవనదశ. తదుపరి పాతికసంవత్సరములు (51-75) ప్రౌఢదశ. తుది పాతికసంవత్సరములు (76-100) వార్ధకదశ. ప్రౌఢదశలోని (51-75) పరిపాకవయస్సు 70 సంవత్సరముల ప్రాంతము. శ్రీనాథుని జననకాలము 1360 ప్రాంతము కావున, భీమేశ్వరపురాణ రచనాకాలము 1360+70=1430 ప్రాంతము కావలయును.

భీమేశ్వరపురాణము రచనాకాలము 1430 ప్రాంతమగుటకు ప్రమాణాంతర మును కలదు. భీమేశ్వరపురాణము కృతిభర్త బెండపూడి అన్నయామాత్యుడు. అతడు దక్షారామభీమేశ్వరాలయమునకు

"ప్రాగ్దిశావప్రగోపురప్రాంగణమున
సప్తమునిసింధుసోపానసరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయయన్నయామాత్యవరుఁడు" 75ప.1ఆ.

అని భీమేశ్వరపురాణమునందు కలదు. అది 1428వ సంవత్సరమునందు నిర్మించినట్లు దక్షారామశాసనమునందు కలదు[140].

"నాకే పుష్కరబాణవిశ్వగణితే వత్సరే కీలకే
కార్తిక్యాం శనివాసరే కృతధీ శ్శ్రీయన్నమంత్రీశ్వరః
దాక్షారామజభీమలింగపురత శ్శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపురమంటపం సమకరో ద్రమ్యం శిలానిర్మితమ్."

శాసనకాలము పుష్కరబాణవిశ్వగణితసంవత్సరము. 0,5,13 = 1350 + 78 = 1428 వ సంవత్సరము. 1428వ సంవత్సరము నాటి నిర్మాణము ప్రసక్తమైన భీమేశ్వర పురాణము రచనాకాలము స్థూలముగ 1430 ప్రాంతమగును. శ్రీనాథుడు "వెండి యును గావ్యమొకటిఁ గావింపఁదలఁచి," ఉన్నంత (18వచ.1ఆ.) బెండపూడి అన్నయామత్యుఁడు కొలువుండి (21ప.1ఆ.) పిల్పించి (22ప.1ఆ.)-

"బంధురసపాదలక్ష
గ్రంథంబై యేదుపదులు ఖండంబులతో
సంధిల్లును స్కాందంబన
సింధువునకుం గాల్వ లమరిచిన చందంబునన్. 26.

అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగు దక్షారామభీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యముతోడఁ గూడి భువనశ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసారమగు శ్రీగోదావరీఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీభాషాప్రబంధంబుగన్."
27ప.1ఆ.

అని పలికెను. శ్రీనాథుడు "సపాదలక్షగ్రంథసంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండ మండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీమహాస్కాందంబను నాది పురాణంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దక్షారామభీమేశ్వరమా

హాత్మ్యసంయుతం బగుటంజేసి భీమేశ్వరపురాణంబనం బరఁగు; నది యాంధ్ర భాషాప్రబంధంబుగఁ జెప్పందొడంగితి" నని ఉపక్రమించెను. (30వచ.1ఆ.) "ఇది పంచాశత్ఖండమండితంబును సనత్కుమారసంహితాదిబహుసంహితాసంధానంబును నైన స్కాందపురాణంబునందు గోదావరీఖండంబునందుఁ జెప్పంబడిన భీమఖండంబు, భీమేశ్వరమాహాత్మ్యంబును, భీమేశ్వరపురాణంబనం బరఁగు"నని ముగించెను. (107వచ.6ఆ.) కథాప్రారంభమునందు కాశీఖండము పూర్వఖండమని కలదు. (120వచ.1ఆ.) శ్రీనాథుని కాశీఖండమునందు " ఏకలక్షగ్రంథపరిమాణకలితమై శ్రీమహాస్కాందమొప్పు"నని కలదు. (71ప.1ఆ.) ఏకలక్ష అన ఒక్క లక్ష. సపాదలక్ష అనగా లక్షాపాతికవేలు. గ్రంథసంఖ్యను భేదము కలదు. ఒకచో గోదావరీఖండమే భీమఖండమని కలదు. మఱొకచో గోధావరీఖండమునందు చెప్పఁబడినది భీమఖండమని కలదు. ఇది కూడ భేదము.

అసలు స్కాందపురాణము అఖండము. అది నేపాలుదేశమునందు లభించినది. గుప్తులనాటి లిపిలో కలదు. కనుక ఏడవశతాబ్దిగ్రంథము. తదుపరి స్కాందపురాణము సప్తఖండసమన్వితమైనది. అది ముద్రితమైనది. అందు 1.మాహేశ్వరఖండము 2. వైష్ణవఖండము 3. బ్రహ్మఖండము 4. ఆవంత్యఖండము 5. ప్రభాసఖండము 6. కాశీఖండము 7.నాగరఖండము. మాహేశ్వరఖండమునందు మూడు, వైష్ణవఖండమునందు ఎనిమిది, బ్రహ్మఖండమునందు మూడు, ఆవంత్యఖండము నందు మూడు, ప్రభాసఖండమునందు నాలుగు ఖండములు కలవు. అవియైన మొత్తము ఇరువది మూడు ఖండములే. అయినను ప్రభాసఖండము నందు "మండితం సప్తభిః ఖండైః స్కాందం యః శ్రుణుయా న్నరః" అని స్కాందము సప్తఖండసమన్వితముగనే కలదు. అనంతరకాలమునందు పంచాశత్ఖండమండితమైనది. దాని వివరములు కాలికాఖండమునందు కలవు. అందు శ్రీనాథుడు కాశీఖండమునందు పేర్కొన్న (80వచ.1ఆ.) ఆంధ్రదేశీయములైన ఏకవీరాఖండము, మైలారుఖండము, గోదావరీఖండము లేవు. పేర్కొనని ఆంధ్రదేశీయమైన శ్రీశైలఖండము కలదు. కాలక్రమమున స్కాందపురాణము బహుఖండబాహాటమైనది. సపాదలక్షాధికగ్రంథబంధురమైనది. అయినను గోదావరీఖండము లభింపలేదు. భీమఖండమొకడు దక్షరామప్రాంతమునందు ముద్రితమైనది. తత్సదృశమైన తాళపత్రగ్రంథము కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందు కలదు. ఆ తాళపత్రగ్రంథమునందలి తాటియాకుల పచ్చిదనము, పచ్చదనము కూడ 1960నాటికి తగ్గలేదు. కగ్గలేదు. ఏవంవిధమైన సంస్కృతభీమఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు మాతృక కాదు. పుత్రిక మాత్రమే. సంస్కృతాంధ్రభీమఖండములు సమకాలికగ్రంథములుగ కవితాసాక్ష్యము, చారిత్రికసాక్ష్యము

కావలసినంత కలదు. సంస్కృతభీమఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతీకరణము[141].

# కృతిసమీక్ష

భీమేశ్వరపురాణము పురాణసంజ్ఞితమైనను పురాణముకాదు. కావ్యము. "సత్కావ్యము". (11ప.1ఆ.) క్షేత్రమాహాత్మ్యకావ్యము. "రచియింపు మంధ్రజగతీభాషా ప్రబంధంబుగన్" అని కృతిభర్త ఆదేశము. (27ప.1ఆ.) "ఆంధ్రభాషాప్రబంధంబుగఁ జెప్పందొడంగితి" అని కృతికర్త ఆచరణము. (30వచ.1ఆ.) అంతేకాదు. "ఇమ్మహాప్రబంధంబు" అని శ్రీనాథుని నిర్దేశము. (107వచ.6ఆ.) ప్రబంధమన కావ్యము. మహాప్రబంధమన మహాకావ్యము. "కావ్యమొకటిఁ గావింపఁ దలంచి" (17ప.1ఆ) శ్రీనాథుడు కావించినది భీమేశ్వరపురాణము. అది పురాణపంచలక్షణలక్షితము కాదు." సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితంబులను పంచలక్షణంబులతోడం గూడి"నది "శ్రీమహాస్కాందంబను నాదిపురాణంబు" అని శ్రీనాథుని ప్రతిపాదనమే. (30వచ.1ఆ.) పంచలక్షణలక్షితమైన స్కాందపురాణఖండము కావున పురాణసంజ్ఞ. "భీమఖండంబు భీమేశ్వరమాహాత్మ్యంబును" అని నామాంతరములు. (107వచ.6ఆ.) స్కాందపురాణఖండమండితమగుటవలన భీమఖండనామధేయము. దక్షారామక్షేత్రదైవమైన భీమేశ్వరమాహాత్మ్యప్రతిపాదకమగుటవలన భీమేశ్వరమాహాత్మ్యభిధానము. క్షేత్రమాహాత్మ్యప్రతిపాదనము చేయు కావ్యము క్షేత్రమాహాత్మ్యకావ్యము.

తెలుగు సాహిత్యమునందు తొలి క్షేత్రమాహాత్మ్యకావ్యము ఎఱ్ఱన నృసింహపురాణము. మలి క్షేత్రమాహాత్మ్యకావ్యము శ్రీనాథుని భీమేశ్వరపురాణము. నృసింహపురాణము అహోబలక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకము. భీమేశ్వరపురాణము దక్షారామక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకము. నృసింహపురాణమునందు నృసింహావతారపురాణకథ కలదు. భీమేశ్వరపురాణమునందు వ్యాసనిష్కాస, కాలకూటోపసంహార, త్రిపురాసురసంహారపురాణకథలు కలవు. దక్షారామపురవర్ణన, వ్యాసలోపాముద్రాగస్త్యుల దక్షారామయాత్ర అగస్త్యప్రోక్తతీర్థమాహాత్మ్యము, సప్తర్షిసమానీతసప్తగోదావరవృత్తాంతము, దక్షారామభీమేశ్వరుని స్వయంప్రతిష్ఠ అరవిందాప్తకృతప్రతిష్ఠ వసంతోత్సవము క్షేత్రసమాచారము. నృసింహపురాణములోని క్షేత్రసమాచారము సకృన్మాత్రము. భీమేశ్వరపురాణములోని క్షేత్రసమాచారము సమృద్ధిప్రాయము. నృసింహపురాణము నందు లేని స్థానికవిశేషకథనము, స్థానిక ప్రకృతిచిత్రణమును భీమేశ్వరపురాణమునందు కలవు. అవి దక్షారామక్షేత్రమునకు మాత్రమే పరిమితములు కావు. దక్షారామక్షేత్రము కల భీమమండలమునకు

ఇంచుమించు తూర్పుగోదావరి మండలమునకు పర్యాప్తములైనవి. స్థానికవి శేషకథనము, స్థానికప్రకృతిచిత్రణము క్షేత్రసాక్షాత్కారమునకు నేత్రసము న్మీలనము.

వ్యాసనిష్కాసకథ సంస్కృతాంధ్రకాశీఖండములందు ఇంచుమించు సమానము[142]. విశ్వేశ్వరుడు వ్యాసుని కాశికి "ఐదుక్రోశములకు నవలినేల నుండువాఁడవు పైఁడికుండలు ప్రాకారవలయంబుఁ బొడగానవచ్చుచోట" అని ఆనతిచ్చినట్లు, వ్యాసుడు విశ్వేశ్వరుడు ఆనతిచ్చినచోటనే యధివసించె" నని కాశీఖండమునందు కలదు. (199ప.7అ.) "పొమ్ము నిర్భాగ్య మాయూరి పొలము వెడలి యెచటికేన్" అని విశ్వేశ్వరుడు ఆనతిచ్చిన, వ్యాసుడు "కాశి వెడలి యరిగెడు వేళన్" " విశాలాక్షీవిశ్వేశ్వరుల" "యడుగులంబడి"న విశాలాక్షి "దక్షవాటికన్ దుఃఖం గలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం డఱగొఱలేని వేల్పు" అనిన వ్యాసుడు దక్షారామమునకు వచ్చినట్లు భీమఖండమునందు కలదు. (155-156ప.2అ.) దక్షారామయాత్రామార్గమున వ్యాసుడు ఆంధ్రావనిలోని శ్రీకూర్మము, సింహాద్రి, పీఠికాపురము, చళుక్యభీమవరము, సర్పపురము, తుల్యభాగాతీరసంగమేశ్వరము, సాంపరాయణగ్రామసమీపబిల్వాటవీవాటి అను క్షేత్రములు సందర్శించుట, లోపాముద్రాసహితుడైన అగస్త్యునితో ఓంకారపురమున సమావేశమగుట, అగస్త్యుడు దక్షారామక్షేత్రమహిమను వివరించుట, ముగ్గురును పులుగుర్తి, ఓంకారపురి, శీలామహాగ్రామము అను క్షేత్రములు సందర్శించుట, వ్యాసాగస్త్యులు ఓంకారపురమున నభోమండలమున కెగసి భీమమండలమును విలోకించుట, అభిజిద్వేళ ముగ్గురును దక్షారామమున ప్రవేశించుట, అగస్త్యుడు దక్షారామ క్షేత్రవిశేషములు. భీమమండలములోని ద్వాదశశివలింగస్థానవిషయములు మొదలైనవి తెలుపుట, వ్యాసాగస్త్యులు భీమేశ్వరాలయమునందు ప్రవేశించుట, వ్యాసుడు భీమేశ్వరుని సందర్శించుట, అర్చించుట, సంస్తుతించుట అపూర్వసృష్టి. అందు వ్యాసాగస్త్యులు నభోమండలమున కెగసి విలోకించిన భీమమండల వర్ణనము నభోమండలమునుండి విలోకించిన కనిపించు భీమమండలదృశ్యమే. అది వర్ణచిత్రము, రేఖాచిత్రము కూడ.

"ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాదిబహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి

దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీసింధుకౌంతేయకణ్వనదులు
తుల్యభాగయు నేలేఱు దుమ్మికొనలు
భువనసంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ సంసారతాపశాంత్యౌషధంబు. 50

అదె సంవేద్యము; కోటిపల్లి యదె; దక్షారామమన్పట్టనం
బదె; యభ్రంకషసౌధకూటఘనహేలావాసముచ్ఛ్రాయసం
పద సొంపారెడు భీమలింగము మహాప్రాసాదభూమీధరం
బిదె; సప్తర్షినదీ ప్రవాహమిదె; సంవీక్షింపు మేకాగ్రతన్. 54

అదె పట్టిసస్థాన మందుండు వీరభ
ద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
నిలువేల్పు ముక్కంటి వెలసెఁ దొల్లి
యదె కుమారారామ మాహర్మ్యరేఖయ
చాళుక్యభీమేశు సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీదేవి యోలగంబు
వాఁడె మాయింటివేల్పు పల్వలపురమున
నుండు లింగంబు ఫణిరాజకుండలుండు
సప్తముని సింధుసంగమేశ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మదె మౌనికులవరేణ్య" 55ప.3ఆ.

ఇది నభోమండలమునందు అగస్త్యుడు వ్యాసునికి నిర్దేశించి చూపిన భీమమండలము. వ్యాసుని భీమేశ్వరస్తుతియందు ఒక"వచనము"కలదు. "ఓం జయ జయ --నమస్తేనమః" (212వచ.3ఆ.) అది వచనవాఙ్మయమునకు వజ్రకిరీటము.

కాలకూటోపసంహారకథ సముద్రమథనకథయే. అది హరవిలాసమునందు శివాధిక్యాత్మకము. భీమేశ్వరపురాణమునందు తావన్మాత్రము కాదు. దక్షారామశివాభిధాత్మకము. దక్షారామభీమేశ్వరమాహాత్మ్యప్రతిపాదకము.

"భీమమగు గరళకూటము
భూమియు గగనమును దిశలుఁ బొడచూపినచో
భీమగతి మ్రింగెఁ గావున
భీమేశ్వరుఁడయ్యె నితఁడు బిరుదాంకమునన్." 46ప.4ఆ.

"ఇతఁ"డన దక్షారామములోని భీమేశ్వరుడు. కాలకూటవిషమును కంఠని క్షిప్తము కావించినది కైలాసములోని శివుడు కాడు. దక్షారామములోని శివుడు. కాఁబట్టి భీమేశ్వరబిరుదాంకము. "కాలకూటవిషము చిచ్చు విడివడి యంతంత పెచ్చు పెరుగ" (61ప.) "అప్పుడు మిసిమింతుండునుంగాక పయోధిప్రాంతంబున దక్షవాటంబున హాటకసింహాసనాసీనుండయిన లలాటలోచను ..... హరివిరించి పురందరాది బృందారకులు" (62వచ.) "అభయము భీమనాథ యభయం బభయం బభయంబు శంకరా" (63ప.) "అని శరణుచొచ్చిన" (64వచ.) "కటుకమగు విషము ..... శివుఁడు గుటుకున మ్రింగెన్" (66ప.4ఆ.) అని కాలకూటోపసంహారకథయందు కలదు. ఇది నరసింహావతారము, హిరణ్యకశిపుసంహారము అహో బలక్షేత్రమునకు ముడివెట్టిన ఎఱ్ఱన నృసింహపురాణములోని కథనమునకు సహోదరము. క్షేత్రమాహాత్మ్యమునకు సూత్రకల్పనము.

త్రిపురాసురసంహారకథ బహుపురాణప్రసిద్ధము. కాలకూటోపసంహారము, త్రిపురాసురసంహారము భిన్నకథలు. కాని భీమేశ్వరపురాణమునందు కథాను క్రమణిక కల ఏకకథ. "అమృతముఁ గోలుపోయి విబుధారులు గంధగజాసురాంధకప్రముఖులు" (99ప.) "త్రిపురావాసుల తోడఁగూడి ... పాశుపతాచారనిరూఢి నందఱును ... భీమనాయకుని సేవించుచున్ దపంబు సేసిరి." (102ప.) "అద్దేవుని ప్రసాదంబున ... నసాధారణంబగు నైశ్వర్యంబునుం బొంది" (105వచ.) "గర్వించి నిర్జించి నిఖలజనుల నిర్జరుల బాధపెట్టిరి." (106ప.) "హరివిరించులు పురందరాదులతోడ ... దక్షిణజలధిపంచ దక్షారామంబున నధివసించిన మంచుంగొండయల్లుని"కి మొఱపెట్టుకొనిరి. (108వచ.) "దివ్యస్వయంభూజ్యోతిర్లింగమూర్తి భీమేశ్వరుండు" (123వచ.) "పురుషోత్తముని ... బాణంబు సేసి, పాశుపతాస్త్రసమంత్రకంబుగా నభిమంత్రించి ... ఏసి" (139వచ.) త్రిపురాసురసంహారము కావించెను. ఇది కూడ క్షేత్రమాహాత్మ్యమునకు సూత్రధారణమే.

త్రిపురవిజయానంతరము భీమేశ్వరుడు,

"త్రిపురదైతేయుల కులదైవతంబైన .. దివ్యలింగంబును బంచ బ్రహ్మపంచాక్షరీపంచతత్త్వపంచభూతమయంబగుటంజేసి పంచ ఖండంబులుగా ఖండించి కృష్ణవేణీమహానదీతీరంబున ధరణాలకోట యను గ్రామంబున నమరేశ్వరునిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూడి యను గ్రామంబున సోమునిచేత ప్రతిష్ఠితంబు సేయంబడుటంజేసి సోమలింగంబనం

ప్రఖ్యాతంబైన సోమారామంబును బాలకొొలను (కోట?) అను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటంజేసి రామలిం గంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును జాళుక్యవంశరాజధా నియగు చాళుక్యభీమవరనామగ్రామంబునం గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమారభీమలిం గంబనం బ్రఖ్యాతంబు నొందిన భీమారామంబును మొదలిమామ యగు దక్షప్రజాపతి యునికిపట్టైన యారామం బగుట దక్షా రామంబున శివసన్నిధానంబై దానుండునట్లుగా నీ ప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠ నొందించి తానును దక్షవాటుంబున .... శ్రీభీమేశ్వరలింగంబునందధివసిం చెను." 151వచ.4ఆ.

ధరణాలకోట ధాన్యకటుకము. అది ప్రసిద్ధమైన బౌద్ధారామము. ఆరామశబ్ద వ్యవహారమే బౌద్ధము. ఆంధ్రావనిలోని పంచారామవ్యవహారము వినా భారత దేశము మొత్తము మీద శివాలయమునకు ఆరామశబ్దవ్యవహారము మృగ్యము. బౌద్ధారామములే పంచారామములగుట చారిత్రికసత్యము. "పంచారామముల .... బుద్ధదేవరకును .... అఖండదీపతతులు వెట్టినట్లు" 1146 వ సంవత్సరము నాటి బెజవాడశాసనమునందు కలదు[143] ధాన్యకటకములోని బుద్ధదేవర అవతారబు ద్ధుడు కాడు. గౌతమబుద్ధుడే. భీమేశ్వరపురాణములోని పంచారామకథనము పౌరా ణికప్రతిపత్తి కల్పనము.

వ్యాసుడు వర్ణించిన దక్షారామమాహాత్మ్యమునందు

"కాలకూటోపసంహారకారి యతఁడు
త్రిపురదైత్యాధిపతుల మర్దించె నతఁడు
నిగ్రహానుగ్రహప్రౌఢినిపుణుఁ డతఁడు
సంతతము దేవవేశ్యాభుజంగుఁ డతఁడు" 13ప.2ఆ.

అని దక్షారామభీమేశ్వరుని గుఱించి కలదు. అంతేకాదు. శ్రీనాథుని దక్షారామపు రవర్ణనమునందు భీమేశ్వరుడు "దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు" అని కలదు. కారణము దేవదాసీవ్యవస్థ కల దేవాలయములోని దేవుడు దేవవేశ్యాభు జంగుడే.

"____తచ్ఛ్రీనగదక్షిణద్వార
వరుని జ్యోతిస్సిద్ధవటునాథు భక్త
వరదుఁ బెన్నానదీవరతటావాసు
శాశ్వతపుణ్యు దర్శనముక్తి నలరు

విశ్వైకనుతు దైవవేశ్యాభుజంగు
దేవశిఖామణి దేవదేవేశు
భావించి చూడు మేర్పడ వటేశ్వరుని"

అని పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందు కలదు. సిద్ధవటములోని సిద్ధవటేశ్వరుడు దైవవేశ్యాభుజంగుడు[144]

"దుష్టనిగ్రహా, శిష్టప్రతిపాలకా, దేవవేశ్యాభుజంగా,
అభయాzప్రమేయకృపాంతరంగా" 8వచ.

అని కృష్ణమాచార్యుల సింహగిరి నరహరివచనములందు కలదు. సింహగిరి నరహరి దేవవేశ్యాభుజంగుడు. ఇట్లు దక్షారామభీమేశ్వరుడు దేవవేశ్యాభుజంగుడు.

దక్షపురి సానికూతులు దక్షారామదేవదాసీజనము. వారు "అప్సరశ్చంద్రముఖులు" (89ప.1ఆ.) "పురందరవిశ్రాణితదేవతాభువనగంధర్వాప్సరోభామినీ" గణమని శ్రీనాథుని అభివర్ణనము. (90ప.1ఆ.) అంతేకాదు. దక్షారామభీమేశ్వరునికి,

"సురపతిమార్గశీర్షమున శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం
బొరసిన సిద్ధయోగమున భూతలమిచ్చెఁ బయోధిగౌతముల్
గరుసుగఁ దుల్యభాగయును గంద్రెడు లోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు వారవధూత్రిశతద్వయంబుతోన్. 84ప.

ఇట్లిచ్చి ధర్మశాసనంబు వ్రాయించెను." 85వచ.5ఆ.

అని కూడ శ్రీనాథుని ప్రతిపాదనము. ఇంద్రుడు వ్రాయించిన దక్షారామ శాసనము లేదుగాని, ఇతరులు వ్రాయించిన దక్షారామశాసనములందు వారవధూ త్రిశతద్వయప్రసక్తి కలదు. దక్షారామభీమేశ్వరాలయమునకు చెందిన దేవదాసీ బృందము విధులు భీమేశ్వర పురాణమునందు వివరింపఁబడినవి. అవి :

"గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింతు రాలాపసం
బంధప్రస్ఫుటఝుంటుఝుంటుపదగుంభస్థాపవర్గావళీ
సంధానక్రమదివ్యమంత్రకములన్ సాయాహ్నకాలంబులన్
గంధర్వాప్సరసల్ పురోపవనికాకల్పద్రుమచ్ఛాయలన్." 91ప.1ఆ.

ఇందు దేవవేశ్యలు అభ్యాసము చేయునవి ఝుంటుఝుంటు పదములు కల మోక్షప్రదాయకములైన దివ్యమంత్రకగీతములు. సంస్కృతకాశీఖండములోని "హుండుంకృత్య హుడుంకృత్య హుడుంకృత్య త్రి రుచ్చకైః" అను దానికి (9శ్లో 54అ.) శ్రీనాథుని తెలుగు కాశీఖండములోని "ఝుంఝుం టుంటుం

ప్రధాననానాస్తో బ్ధాక్షరంబులు" (40వచ.6ఆ.), ఝుంటు ఝుంటు పదములు కావచ్చును. గంధర్వాప్సరసలు వక్కాణించు గంధర్వోపనిషద్రహస్యములు మోక్షగమ్యములు

"విరుల దండలతోడి వేణికాభారంబు
 పొంకంబు పిఱుఁదులఁ బొరలియాడ
మణితులాకోటికోమలఝణత్కారంబు
 రవలిమట్టెల మ్రోఁత యవఘళింపఁ
గుదురు నిండిన చిన్ని గుబ్బచన్నుల మీఁద
 ముత్యాల త్రిసరంబు మురువుఁ జూప
వలమానతాటంక వజ్రాంకురచ్ఛాయ
 లేఁతవెన్నెలఁ బుక్కిలించి యుమియ
సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతపు గిన్నె పూని
వీథిభిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మరుల నృత్యంబు జగముల మరులు కొలుపు." 105ప.1ఆ.

సాని అన దేవదాసి, ఈశాని అన పార్వతి. ఒక దేవదాసి పార్వతి వేషము ధరించి ఒకానొక మహోత్సవమునందు వీథిభిక్షాటనమును అభినయించుచు సేయు నృత్యము కూడ దేవదాసి కర్తవ్యము. కావున దేవదాసి సంగీతకళాప్రవీణ కావలయును.

"దక్షారామవిలాసినీతతుల సౌందర్యంబు వర్ణింపఁగాఁ
జక్షుశ్శ్రోత్రకులాధినాయకునకున్ శక్యంబె? తచ్చారుఫా
లక్షేత్రంబును బోల లేక మునిఁగెన్ లజ్జాభరక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖరసుధాంధస్సింధుపూరంబునన్." 93ప.1ఆ.

దక్షారామవిలాసినీతతులు దక్షారామదేవదాసీతతులే. వారి సౌందర్యము వేయి తలలు కల ఆదిశేషువు కూడ వర్ణించుటకు శక్యము కానిది. వారి ఫాలక్షేత్రములను పోలలేక చంద్రుడు సిగ్గుపడి శివుని నెత్తిమీది గంగాప్రవాహమునందు మునిగిపోయెనట! శివుని నెత్తిమీద నెలవంక, గంగ కలవుగాని, నెలవంక గంగలో ఏనాడును మునిగిపోలేదు. పద్యమునందు క్షేత్రప్రసక్తి కలదు. జుటాజూటము ప్రసక్తి లేదు. జుటాజూటములేని శివుడు దక్షారామక్షేత్రములోని భీమేశ్వరలింగము. దక్షారామ భీమేశ్వరలింగమునకు అర్ధేందురేఖ చిహ్నము. "సందర్శించిరి భీమనాథు ....నర్ధేందూత్తంసుని" (186ప.3ఆ.) అభిషేకసమయమునందు భీమేశ్వర లింగచిహ్నమైన అర్ధేందురేఖ అభిషేకజలధారాప్రవాహమున మునిగిపోవుట

సహజము. అభిషేకజలధారాప్రవాహమే గంగాప్రవాహము. అభిషేకసమయమునందు గర్భాలయమును పరివేష్టించిన దేవదాసీతతుల ఫాలతలములను పోలలేక అర్ధేందురేఖ గంగాప్రవాహమునందు మునిగిపోయినదని సంభావనము. సౌందర్యాతిశయవ్యంజకము. దేవదాసీతతులు గర్భాలయమును పరివేష్టించుటయే కాదు; గర్భాలయమునందు పరిచర్యలు చేయుట పరిపాటి. దేవవేశ్యలు సాయంకాలపూజాసమయమునందు నాట్యము సేయుచు ఉజ్జయినిలోని కాలనాథునికి వింజామరలు వీతురని కాళిదాసు మేఘసందేశమునందు కలదు. (39శ్లో.1స.)

సౌందర్యరసాధిదేవత, సంగీతకళాప్రవీణ అయిన కన్యవేశ్యను దేవునికి పెండ్లి చేసిన దేవధాసి అయ్యెడిది. అది సానిపెండ్లి. అట్టి సానిపెండ్లి దక్షారామభీమేశ్వరునికి ఆ కాలమునందు నిత్యకల్యాణము.

"పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాలై యుం
డదు సాని పెండ్లి యెప్పుడు
నది దక్షారామమహిమ మగునో కాదో?" 113ప.1ఆ.

దక్షారామక్షేత్రదైవము భీమేశ్వరుడు. క్షేత్రదేవత మాణిక్యాంబ.

"పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములం దెంచ సర్వశృంగారయగుచు
భీమనాథుని సన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకలకల్యాణమూర్తి" 103ప.1ఆ.

సర్వశృంగార అనగా సర్వాభరణభూషిత. మాణిక్యాంబ విగ్రహము సర్వాభరణభూషితమే. మాణిక్యాంబ అసలు కన్యవేశ్య అని ఐతిహ్యము కలదు.

"ఎనయం గల్గిన కూర్మి భృంగిరిటిఁ గానీ తండుఁ గానీ నికుం
భునిఁ గానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్నుమొఱంగియప్పురమునంగన్నేరు కాదారి బ్రా
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబుగన్."
112ప.1ఆ.

"అప్పురమునన్" త్రికసంధి. ఆ పురమునందే అని నిర్ధరించునది. దక్షారామపురమునందే అయినను భీమేశ్వరుడు జంగమరూపము కాదు. స్థావరరూపము. సానివాడ కరుగుట సాధ్యము కాదు. జంగమరూపమైనను,

అర్ధాంగి పార్వతి. నెత్తిమీది దేవత గంగ అంతఃపురాంగనలు. వారిని మోసగించుట శక్యము కాదు. పద్యము వాచ్యార్థప్రధానము కాదు. అర్థవక్రతావిశిష్టము. పురము దక్షారామభీమేశ్వరాలయము. సానివాడ మాణిక్యాంబ గుడి. మేడ మీద భీమేశ్వరుడు. మేడ క్రింద మాణిక్యాంబ. ఆమె గుడిలోని తూగుటుయ్యేలలో భీమేశ్వరునికి పవ్వళింపుసేవ. అందుకు భీమేశ్వరుని ఉత్సవవిగ్రహమును, గర్భగుడిలోని గంగాపార్వతీవిగ్రహములకు చాటుమాటుగ, భృంగిరిటి విగ్రహము గాని, తండు విగ్రహము గాని, నికుంభుని విగ్రహమును గాని తోడు చేసి అర్చకులు మాణిక్యాంబ గుడికి తీసికొని వచ్చుట ఆలయసంప్రదాయము. ప్రతి-ఏకాదశినాడు జరుగు పవళింపుసేవకు భంగ్యతరప్రకటనము పద్యము.

"గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టు
 పసిఁడి కమ్ముల పట్టు పచ్చడంబుఁ
భసిత మెన్నఁడొకాని ప్రతిదినంబు నలందు
 మలయజంబు కురంగమదము గూర్చి
నిడుదపాములరాజు తొడవు లెన్నఁడొకాని
 తారహారములు నిత్యము ధరించు
నృకరంకరుండమాలిక లెన్నఁడో కాని
 ధరియించు కహ్లారదామ మెపుడు
కాటు నడుచక్కి నెన్నఁడోకాని యుండు
దక్షవాటి సువర్ణసౌధముల మీఁద
నెన్నఁడొపిశాచులను గాని యిందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు." 116ప.1ఆ.

శివుడు కట్టునది గజచర్మము. లేక వ్యాఘ్రచర్మము. ఒడలెల్ల పూయునది విభూతి. కైసేయునది భుజగభూషణములు. ధరించునది అస్థిమాల. ఉండునది వల్లకాటిలో చెలిమిచేయునది పిశాచులతో. కాని భీమేశ్వరుడు పసిడికమ్ముల పట్టుపచ్చడము కట్టును. మంచిగంధము కస్తూరి కలిపి అలదును. తారహారములు నిత్యము తాల్చును. బంగారుమేడ మీద ఉండును. ఇందుముఖులను ఎల్లకాలమును తలంచును. దక్షారామభీమేశ్వరాలయములోని భీమేశ్వరలింగమునకు ప్రత్యేకముగ ఒక బంగారు తొడుగు కలదు. అది ప్రతిదినము అభిషేకానంతరము అలంకరించునది. పసిడికమ్ముల పట్టు పచ్చడమది. భీమేశ్వరలింగమునకు మంచి గంధము కస్తూరి కలిపి మేదించి పూయుట నిత్యవిధి. భీమేశ్వరలింగమునకు పాములు తగిలింపరు. తారహారములు

తగిలింతురు. "కట్టాణి ముత్యాల కంఠమాల, మాణిక్యఖచితకేయూరంబు, హారాం కురంబుల యుంగరంబు, ప్రవాళంబుల యొడ్డాణము, హేమమణిభూషణములు దక్షారామభీమేశ్వరుని ఆభరణములు. (117ప.1ఆ.) కహ్లారదామము పూజాపుష్పో పహారము. భీమేశ్వరుడు ఉండునది మేడమీదనే. ఇందుముఖులు దేవదాసులు.

"కార్తికీవేళ భీమశంకరుని నగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుఱతోరణంబు
నతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోరయమపట్టనద్వారతోరణంబు." 25ప.3ఆ.

ఇది దక్షారామభీమశ్వరాలయమునందు ప్రతికార్తికమాసమునందు జరుగు జ్వాలాతోరణోత్సవము. వసంతోత్సవమును దక్షారామభీమేశ్వరాలయమునందు వైభవోపేతము. (101-124ప.5ఆ.)అందొక హాస్యరసచంద్రిక:

"హేరాళముగఁ జల్లె నెలనాఁగ యొక్కర్తు
కుంభోదరుని మీఁదఁ గుసుమరజముఁ
గుటిలకుంతల భృంగిరిటి మోమునం దోర్తు
తాఁకించె నోలగంధంబుఁ బసుపు
వక్షంబు లక్షించి వైచె గందపుటుండ
వీరభద్రుని నొక్క నీరజాక్షి
చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగనీటఁ
గాలభైరవు నొక్క కలువకంటి
కొమ్మ యొక్కతె యందందఁ గొమరసామి
యొఁదలలయందు జవ్వాది యసలు గలిపెఁ
బునుఁగు మణికుంభమున నించి పోసె నొక్క
పొలఁతి విఘ్నేశ్వరుని కుండ బొజ్జ మీఁద" 115ప.5ఆ.

ఇవి కతిపయస్థానికవిశేషములు. ఇక స్థానికప్రకృతిచిత్రణము-

"ఒకచోటఁ గోటివల్ల్యుడురాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ
యొకచోటఁ బిఠాంబికోన్నతస్తనభరా
స్ఫాలజర్జరితకల్లోల యేల
యొకచోటఁ జటులనక్రకుళీరపాఠీన
తోయగర్భాభోగ తుల్యభాగ
యొకచోటు నప్సరోనికరసంసేవితాం
తరము శ్రీసప్తగోదావరంబు

సమరు నాగరఖండసిద్ధాంతజాతి
నాగవల్లీసమాక్రాంతపూగఖండ
మండితోద్యానవాటికాఖండవిభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు." 20ప.3ఆ.

తూర్పున సముద్రము, దక్షిణమున పడమట గౌతమి, ఉత్తరమున మూడు యోజనముల మేర సరిహద్దులైనది భీమమండలము. (77ప.5ఆ.) అందు వృద్ధగంగ, ఏలేరు, తుల్యభాగ నదులు. సప్తగోదావరము తటాకము. వృద్ధగంగ తటిని కోటిపల్లి సోమేశ్వరుడు, ఏలేరు తటిని పిఠాపురము పీఠాంబిక, సప్తగోదావరము సన్నిధిని దక్షారామభీమేశ్వరుడు ప్రసిద్ధదైవములు. అంతటు ప్రశస్తమైన తమల పాకుల తీగలు, పోకచెట్లు కల ఉద్యానవనములు కలవు.

"త్ర్యంబకాచలశిఖాగ్రమునందు నుదయించి,
పొదలి యార్యావర్తభూమిఁ దఱిసి
మఱఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థమొఱసి
పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథు మందిరము డాసి
యేచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖక్షేత్రంబుఁ గుస్తరించి
భీమమండలి దాపలఁ బెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె" 21ప.3ఆ.

ఇది గోదావరీనదీపరీవాహప్రదేశచిత్రము. గోదావరి నాసికాత్ర్యంబకము కడ పుట్టినది. వింధ్యోత్తరమైన ఆర్యావర్తభూమిని తాకినది. దండకారణ్యములోని ప్రస్రవణాచలమున -పాపి(డి)కొండ- పరవళ్లు త్రొక్కినది. నదీమధ్యస్థమైన పట్టిస క్షేత్రమునందు వీరభద్రేశ్వరుని సేవించినది. తాళ్లపూడిలోని తిలసోమనాథాల యమును సమీపించినది. తదుపరి అనంతభోగేశ్వరస్థానమును పెంచినది. రాజమ హేంద్రవరములోని కమలాద్రిపై గల రుద్రపాదములను దారిచేసికొన్నది. కోటిపల్లి సోమేశ్వరుని అంఘ్రులకు మ్రొక్కినది. కోనసీమలోని కుండలేశ్వరక్షేత్రమునందలి కుండలేశ్వరుని కొలిచినది. భీమమండలమును దాపలించినది. సముద్రమునందు సంగమించినది. ఇది అపూర్వమైన స్థానిక ప్రకృతిచిత్రణము.

"ఎక్కడఁ జూచినన్ సరసి యెక్కడఁ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని యెక్కడఁ జూచిన బుష్పవాటికల్
ఎక్కడఁ జూచిన న్నది మహీవలయంబున భీమమండలం
బెక్కడ యన్యమండలము లెక్కడ భావన చేసిచూచినన్."

23ప.3ఆ.

ఇది సంస్కృతభీమఖండమును సంవదించునది కాదు. నిస్సందేహముగ శ్రీనాథుని స్వీయకవిత. అన్యమండలముల నుండి వచ్చిన శ్రీనాథునికి భీమమండలము ఆశ్చర్యము కలిగించినది. కారణము, అన్యమండలములందు లేని నదులు, తటాకములు, సరస్సులు, దేవాలయములు, పుష్పవాటికలు భీమమండలమునందు సర్వత్ర కనిపించుటయే.

"ఏఁటేఁట విరినీట నిరుగాఱునుం బండుఁ
    బ్రాసంగు వరిచేలఁ బసిఁడి చాయఁ
బరిపాకమున వేఱుపనసపండు తావి
    యిందిందిరములకు విందుసేయు
వేఁబోఁకఁ బొలుపారు వింధ్యాద్రిపవనంబు
    పోఁకపువ్వుల తావిఁ బుక్కిలించు
వేశ్యవాటికలందు విహరించు వలరాజు
    ననయంబుఁ జెఱుకు విల్లును ధరించు
నారదంబుల వలపు పొన్నలఁ బెనఁగి
విచికిలామోదములతోడ వియ్యమందుఁ
బాటలీపుష్పకేతకీపరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు." 54ప.2ఆ.

పిఠాపురమునందు ప్రతిసంవత్సరము రెండు పంటలు. ప్రాసంగు వరిచేలు పసిడిచాయను పండును. ముగ్గిన వేఱుపనసపండుల సువాసనలకు తుమ్మెదలు ముసురును. వేగుబోకలందు చల్లగాలికి పోకపువ్వుల పరిమళము గుబాళించును. చెఱుకు తోటలు ఏపుగా పెరుగును. నారింజ పువ్వుల తావులు, పొన్న పువ్వుల సువాసనలు ఏకమై మల్లె మొగ్గల సౌరభముల లీనమగును. కలిగొట్టు పువ్వుల, మొగలి పువ్వుల పరిమళములు పొదలలో విలసిల్లును. వరి, చెఱకు పంటలు. వేఱుపనసలు పోకలు, నారింజలు ఫలవృక్షములు. పొన్న, మల్లె, పాదిరి, మొగలి పువ్వులు. ఇవియెల్ల పిఠాపురము ప్రకృతిసంపదలు.

"కొమరేటి కల్యాణకమలషండంబుల
సౌరభ్యభారంబు సంతరించి
నారికేళాటవీనవపుష్పకుహళికా
వితతి కన్నెఱికంబు వీడు కొలిపి
యప్సరఃకాంతావిహారహాటకహర్మ్య
శశికాంతమణిగవాక్షములఁ దూఱి
భీమనాయకదేవు పేరురంబునఁ గ్రాలు
భుజగహారములకు భుక్తి వెట్టి
రాజనారాయణస్వామి రమ్యభవన
తార్క్ష్యకేతనగతికి నర్తనము గఱపి
పొలసె నధ్వపరిశ్రాంతి పొడ వడంగ
మౌనివరుపైఁ గుమారవనానిలములు "62ప.2.ఆ.

కుమారవనమన కుమారారామము. చాళుక్యభీమవరము (సామర్లకోట భీమవరము) నందు కలదు. అచట చాళుక్యభీమేశ్వరాలయము, రాజనారాయణస్వామి (మాండవనారాయణస్వామి లేక మండోనారాయణస్వామి) గుడి కలవు. చాళుక్యభీమేశ్వరాలయము నారికేళవనమునందు కలదు. సమీపమునందు కొమరేరు అను ఏరు కలదు. కొమరేటి మీదుగా వీతెంచు చల్లని గాలులు -కొబ్బరితోటలోని కొబ్బరిచెట్ల డొలకలందలి పూమొగ్గలను విరియించి, దేవదాసీగృహములందు ప్రవేశించి, చాళుక్యభీమేశ్వరుని హారములైన భుజగములకు భోజనమై, రాజనారాయణస్వామి గుడి ధ్వజస్తంభము మీద గమనభంగిమ నున్న గరుడవిగ్రహమునకు నర్తనము గఱపి, వ్యాసునిపై ప్రసరించుట కుమారామప్రకృతికి అద్దము పట్టినట్లు కలదు.

దక్షారామము "ఇరుగారును బంటు పొసంగు పంటువలంతి కేదారక్షేత్రంబులచేతను; పయోధి గన్న బిడ్డలుం బోని యొడ్డు చెఱువులచేతను; సరస సహకార, మాధవీనికుంజ, పున్నాగకుసుమ, పుండ్రేక్షుపర్వ, కురువకానోకహ, వకుళవన, లికుచనిచయ, మాతులుంగామోద, నవనారంగ, లవలీలతాలింగిత లవంగ" విశిష్టములైన "శృంగారవనంబులచేతను" విరాజిల్లుట వివరింపబడినది. (110వచ.1ఆ.) అంతేకాదు. లోపాముద్రాగస్త్యవ్యాసులు ఓంకారపురి (ఓదూరు) నుండి దక్షారామమునకు బయలుదేరిన దారిలోని కేదారభూములును విశదీకరింపఁ బడినవి. (57వచ.3ఆ.) అందు,

"చెఱకు ముఱకంబును, బ్రాసంగు మిసిమియుఁ, జెంగల్వ తావితేవయుఁ, గుసుమవాటి యెసకంబును ...... గంది యందం

బును, బెసర సిరియును, మినుము నలువును, గోధూమ శ్యామాక వరగయును, మూషతోర( పర్ణి)సమున్మేషంబును, నేసి(సె) యేపును, న(స)నంతిన(స) కేతనంబును, నువ్వు మవ్వంబును, గుళుత్థ శుద్ధార్థమానవృద్ధియుం బ్రత్తి సంపత్తియు, బొబ్బర యుబ్బ రంబును, నంద సందర్భంబును, యవ యావనాళప్రియంగుగుళుజ (ఖంతిజం)తిలఘరిస్ఫూర్తియు, ద(ద్ర)వ్విందల సందడియు, గంటె కొఱ్ఱతఱచును, గనగస లివయును జెంగలించు జాంగలక్షేత్రం బులు"

ఇట్టి స్థానిక ప్రకృతిచిత్రణము తోపాటు సహజప్రకృతిచిత్రణమును శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు కలదు. అది కాశీక్షేత్రములోని సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయవర్ణనము. (24ప- 49ప.2ఆ.) దక్షిణకాశీక్షేత్రములోని వసంతర్తు వర్ణనమును. (93ప- 100వచ.5ఆ.) అవి కూడ స్థానికప్రకృతి చిత్రణస్పృహ ణీయములే. ఆ స్థానికప్రకృతి దక్షారామక్షేత్రపరిమితము కాదు. కాశీక్షేత్రపర్యాప్తము.

"అభిషేక మొనరించు నమృతధారావృష్టి
మదనాంతకుని ముక్తి మంటపికకు
నలవోకగా విశాలాక్షీమహాదేవి
నిద్దంపుఁజెక్కుల నీడఁజూచు
నెరియించు మిన్నేటి యిసుకతిన్నెల మీఁదఁ
జక్రవాకాంగనా సముదయంబు
డుంఠివిఘ్నేశు నిష్ఠురకంఠవేదిపైఁ
గొదమచుక్కలరాజుఁ గుస్తరించుఁ
గాయువెన్నెల యానందకాననమునఁ
గాలభైరవు దంష్ట్రకు డాలు కొలుపు
విధుఁడు వారాణశీసోమవీథిచక్కి
నభ్రఘంటాపథంబున నరుగునపుడు." 44ప.2ఆ.

ఇందలి వెన్నెలలోని ముక్తిమంటపము, విశాలాక్షి చెక్కులు, మిన్నేటి యిసుక తిన్నెల మీది చక్రవాకాంగనలు, డుంఠివిఘ్నేశ్వరుని నిష్ఠురకంఠవేదిపై నెలవంక, కాలభైరవుని దంష్ట్ర శ్రీనాథుడు కాశీయాత్రను కనులారఁ గాంచినవి.

దక్షారామమునకు దక్షిణకాశి అను వ్యవహారము పదునైదవశతాబ్దిని ప్రసిద్ధము. 1427 వ సంవత్సరమునాటి దక్షారామాలయశాసనమునందు దక్షిణకాశి అను ప్రసక్తి కలదు[145] అది సంస్కృతాంధ్రభీమఖండములందును కలదు. (58శ్లో.8అ;

30ప. 3ఆ.)

"భీమేశ్వరేశ్వరశ్రీమహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావరసలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైన గణపతి
యేకాంత ఢుంఢివిఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశుఁ డూ
హింపంగ దండపాణీశ్వరుండు
భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుండేమి సందియంబు
దక్షవాటంబు కాశికాస్థలముగాదె,
తీవ్రకరతేజ సత్యవతీతనూజ." 31ప.3ఆ.

ఏవంవిధమైన శ్రీనాథుని భీమేశ్వరపురాణము "ఆంధ్రభాషాప్రబంధ"మేకాదు. ఆంధ్రదేశీయమహాకావ్యము. దక్షారామాయణము. (218ప.3ఆ.)

## కాశీఖండము

ఇది శ్రీనాథుడు "ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ .... దెనుఁగుఁ జేసె ద"నని తెలిపినది. (7ప.1ఆ.) "ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండ" అనగా ప్రాయము కొంత కైవ్రాలినదని అవగాహనమగును. ఎంత కైవ్రాలినది ఇతరత్ర తెలియవలయును. కైవ్రాలుట అనగా వ్రాలెను, వంగెను అనియే అర్థము[146]

కాశీఖండము అల్లాడ వీరభద్రారెడ్డికి అంకితము. అల్లాడరెడ్డి కుమారులు నలుగురు. వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి. నలుగురి గురించి కాశీఖండమునందు కలదు. (33-55ప.1ఆ.) 1432 వ సంవత్సరము నాటి శ్రీరామమంత్రి దక్షారామశాసనమునందు కలదు[147] 1443 వ సంవత్సరము నాటి అల్లాడరెడ్డి కుమారుల కాంస్యఘంటాశాసనమునందు అన్నయరెడ్డి ప్రసక్తి లేదు[148] అనంతరశాసనములందును అన్నయరెడ్డి ప్రసక్తి లేదు[149] కారణము 1434 వ సంవత్సరము నాటికి అన్నయరెడ్డి చనిపోవుట అగును[150] కావున అన్నయరెడ్డి ప్రశంస కల కాశీఖండము రచనాకాలము స్థూలముగ 1433 వ సంవత్సరము కావలయును. అప్పటికి శ్రీనాథుని వయస్సు 1433-1360 = 73 సంవత్సరములు. అది ప్రాయము కొంత కైవ్రాలిన కాలమే.

# కృతిసమీక్ష

కాశీఖండము సప్తఖండసమన్వితమైన స్కాందపురాణమునందే కలదు. స్కాందపురాణము సప్తఖండసమన్వితమని బ్రహ్మవైవర్తపురాణమునందు, బృహన్నారదీయపురాణమునందు, సప్తఖండసమన్వితస్కాందపురాణాంతర్గత ప్రభాసఖండమునందును కలదు[151]. అది తొమ్మిది లేక పదవ శతాబ్ది గ్రంథ మగును.

"కాశీఖండ మయఃపిండమ్, నైషధమ్ విద్వదౌషధ"మ్మని ప్రసిద్ధమైన ఆభాణకము. సంస్కృతనైషధము విద్వదౌషధము వలె సంస్కృతకాశీఖండము అయఃపిండము. కాని శ్రీనాథుని కాశీఖండమే అయఃపిండమని కొందఱి అభిప్రాయము[152] అది కేవలము అవిచారితరమణీయము. సంస్కృతకాశీఖండము స్థూలదృష్టికి సులభము. సూక్ష్మపరిశీలనకు జటిలము. సంస్కృతనైషధమునందు వలె సంస్కృతకాశీఖండమునందు వ్యుత్పత్తిప్రదర్శనము మిక్కుటము. పాతంజల యోగశాస్త్ర, మంత్రశాస్త్ర, సాముద్రికశాస్త్రవిశేషములు బహుళము. సంస్కృతకాశీఖండములోని యోగశాస్త్రవిషయములు (48-181శ్లో.41అ.), గాయత్రీమంత్ర విశేషములు (49-91శ్లో.9అ.), సాముద్రికశాస్త్రవిశేషములు (55-75శ్లో.11అ.) శ్రీనాథుని కాశీఖండమునందు సంగ్రహముగ కలవు. (234-248ప.5ఆ.; 181-192ప.3ఆ; 24-32ప.4ఆ.) సంస్కృతకాశీఖండములోని స్త్రీసాముద్రికవిశేషములు (2-49శ్లో.27అ.) శ్రీనాథుని కాశీఖండమునందు నామమాత్రముగ కలవు. "అణువదియా అంగములు లక్ష ణాన్వితంబులు గావలయు"నని మాత్రమే కలదు. (226వచ.5ఆ.) అంగములు పేర్కొనఁబడినవి కాని, లక్షణములు తెలుపఁబడలేదు. అంతేకాదు. సంస్కృతకాశీఖండమునందు శ్లోకములు ప్రౌఢముగ కలవు. అవి శ్రీనాథుని కాశీఖండములోని ప్రౌఢపద్యముల కంటె ప్రౌఢతరములు. అనేకశ్లోకములకు అన్వయభేదమున వాపక్షార్థములు వ్యాఖ్యాతృప్రోక్తములు కలవు. కథాన్వయకాఠిన్యమును కలదు. సంస్కృతకాశీఖండములోని కథోపకథాసంవిధానము కలగూరగంప. ఒక కథలో ఉపకథయే కాదు; ఉపకథలోను ఉపోపకథలు ప్రధానకథను కబళించునవి కలవు. శ్రీనాథుని కాశీఖండములోని కథోపకథాసంవిధానము పూలసెజ్జ. ఉపకథలు ప్రధానకథను ప్రకాశింపఁజేయునవి. అన్వయకాఠిన్యము లేదు. శైలి ప్రౌఢమైనను, స్పష్టార్థప్రతిపత్తి సమధికము. కాఁబట్టి శ్రీనాథుని కాశీఖండము అయఃపిండము కాదు; పయఃపిచ్ఛిలమే.

"స్కందపురాణసంహితకు ఖండము లేఁబది యందులోన నా
నందవనానుభావకథనంబున శ్రోతకు వక్తకున్ శుభా
నందపరంపరావహము నైజగుణంబని కాశిఖండ మా
కందు వెఱంగి నేను సమకట్టితి కావ్యముగా నొనర్పఁగాన్". 8ప.1ఆ.

అని శ్రీనాథుని కంఠోక్తి. కథాప్రధానమైన పురాణమును రసప్రధానమైన కావ్యముగా తీర్చిదిద్దుట శ్రీనాథుని తెనుగుసేత. కవిత్రయము వారి స్వతంత్రాంధ్రీకరణపద్ధతియే శ్రీనాథుని కాశీఖండాంధ్రీకరణపద్ధతి. అంతేకాదు కవిత్రయము వారి భారతాంధ్రీకరణపద్ధతి కంటె శ్రీనాథుని కాశీఖండాంధ్రీకరణపద్ధతి పరమ స్వతంత్రము.

కాశీఖండము కాశీక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకము. వింధ్యపర్వతవిజృంభణము వలని అగస్త్యుని కాశీవియోగము ప్రథమఘట్టము. అది కాశీక్షేత్రమాహాత్మ్యమును అభివ్యక్తము సేయును.

"మందరంబు మందరశ్మి నీలంబు నీలనిలయం బస్తం బస్తవ్యస్తం
బుదయం బనభ్యుదయంబు క్రౌంచం బకించనంబు గంధమాదనంబు
పేద, పారియాత్రం బేతన్మాత్రంబు మలయదర్దురత్రికూటంబు
లొకపాటివి మహేంద్రనిషధద్రోణంబులు దరిద్రాణంబులు హేమ
కూటంబు గిటగిటన, తక్కుఁ జిఱుకొండలఁ బేర్కొనం గారణంబేమి?
ఇపు ్ప డిప్పాటు నాతోడం బ్రతిభటింపఁ గలయది .... సుమేరుశైలంబ"

అని గర్వించి (100వచ.1ఆ.), "మూర్ధమెగి నూర్ధ్వాండంబుతో రాయ" (118 ప.1ఆ.) విజృంభించిన వింధ్యపర్వతము, అగస్త్యుడు మఱలివచ్చువఱకు "ధరిత్రిలో నొదిగి"యున్నది. (162-164ప.2ఆ.) అంతేకాదు.

"ముని జటాధారి శివభక్తుఁ డనఘమూర్తి
యెవ్వఁ డేతెంచు నపు ్ప డఱ్ఱెత్తి చూచుఁ
గుంభసంభవుఁ డను కోర్కి కొనలు సాఁగ
వసుమతీధర మతఁడేల వచ్చు మరలి? 5ప.3ఆ.

అగస్త్యుని కాశీవిరహము కరుణరసనిర్భరము. వింధ్యపర్వతవిజృంభణమును అణచుటకు దేవర్షుల ప్రార్థనను అంగీకరించి, కాశిని విడిచిపెట్టుటకు పరితపించు ఘట్టములోని పద్యము:

"పాయంగవచ్చునే ప్రాలేయగిరికూతు
సమవతీర్ణజలౌఘు జహ్నుకన్య?

మఱువంగవచ్చునే మందారమధురసా
స్వాదఘూర్ణితనేత్రు వటుకనాథు?
విడువంగవచ్చునే విఘ్నాంధకారార్కు
డుంఠివిఘ్నేశు మండూకజఠరు
మానంగవచ్చునే మధ్యాహ్నకాలంబు
శ్రీవిశాలాక్షి కెంజేతిభిక్ష
సురలు ప్రార్థింపఁగాఁ బ్రతిశ్రుతము చేసి
యెట్టు వోకుండ నేర్తు నే నింతవాఁడ?
నెట్టు వోనేర్తుఁ గాశిఁ బుణ్యైకరాశిఁ
బ్రకటగుణరత్నదుగ్ధాంబురాశిం బాసి." 112ప.2ఆ.

అయినను కాశిని విడిచిపెట్టుట అవశ్యకర్తవ్యమైన అగస్త్యుడు "ఎట్టకేలకుం గదలి విరాళిం గొన్న చందంబున మరులు గుడిచిన పోల్కి నపస్మారం బెత్తిన పగిది నస్నుకొన్న విధంబున దూపటిల్లిన తెఱంగునఁ దూలపోయిన రీతి విషం బెక్కిన లీల మ్రాఁగన్ను వెట్టిన లాగున లాహిరి పట్టిన భాతి మదం బెక్కిన మాడ్కి నుంగిడి గొన్న భంగి నూసరిల్లుచు నుస్సురనుచు నుమ్మలించుచు నుదిలగొనుచు నుపతాపంబందుచు నూటాడుచు .. నూర్ధ్వబాహుండై యుచ్చైః స్వనంబున" (138వచ.2ఆ.) పలికినది.

"పరమకళ్యాణి! యో భాగీరథీగంగ!
వార్ధిభామిని! పోయివత్తునమ్మ!
యమరేంద్రులార! లోలార్కకేశవులార!
వనజసంభవ! పోయివత్తునయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్యపుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తునమ్మ!
శ్రీపూర్ణభద్రపారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తునయ్య!
తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివత్తునె మీ కాశిపురము వెడలి. 139.

కలహంసి! రారాదె కదలి నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
కదళికాకాంతార! కదలిరా నను' గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి

శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁగూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁ గూడి యంతర్గేహ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
రండు ననుఁ గూడి యో పరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీరేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁడైన నా పజ్జఁ బట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి." 140ప.2ఆ.

వింధ్యపర్వతమును సమీపించినను అగస్త్యుని కాశీవిరహము తగ్గలేదు. కాశీ దేవతలను తలచుకొని "గఱుదాల్పు సర్వాంగకముల" (149ప.2ఆ.) "మణికర్ణికం దలచు ... మానసవీథిన్." (150ప.2ఆ.) తలచుకొలది విరహతాపము విజృంభించుట సహజము. అందుకు అగస్త్యుడు కావించిన విరహోపశమనప్రయత్నమిది:

"కఠవల్లిఁ బఠియించుఁ గఠము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయుఁ
బరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీ
యోపనిషత్తు నభ్యుపగమించు
దఱియు నథర్వవేదశిరఃప్రపంచంబు
లారణ్యకము త్రోవ లరసి చూచుఁ
బ్రశ్నోపనిషదర్థపరిమళంబు గ్రహించు
శ్రీభగవద్గీతఁ జిత్తగించుఁ
దలవకారంబు శ్వేతాశ్వతరము ననెడు
నుపనిషత్తులు దలపోయు నొయ్య నొయ్యఁ
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
హృదయసంతాపశాంతికై యిల్వలారి." 151ప.2ఆ.

అయినను విరహతాపము వీసమెత్తు తరుగలేదు. అగస్త్యుని ఆవేదనమిది:

"ఎన్నఁడు చూతునో యింకొక్క మాటేను
బ్రకటకైవల్యాంబురాశిఁ గాశి?
నెన్నఁడు చూతునో యింకొక్క మాటేను
జగదేకపావని జహ్నుకన్య?
నెన్నఁడు చూతునో యింకొక్క మాటేను
మహిమాస్పదము ముక్తిమంటపంబు?

నెన్నఁడు చూతునో యింకొక్క మాటేను
విశ్వలోకారాధ్యు విశ్వనాథు?
నింక నెన్నఁడు చూతునో యేను ఢుంఠి?
నింక నెన్నఁడు చూతునో యేను దుర్గ?
నింక నెన్నఁడు చూతునో యేను వటుకు?
నింక నెన్నఁడు చూతునో యేను గుహుని?" 158ప.2ఆ.

ఇంతగా అగస్త్యుడు పలవరించిన కాశీక్షేత్రము, ఎంతగా మహిమాన్వితమో మాహాత్మ్యవిలసితమో అంతగా స్వయంవ్యక్తమగును. ఇవియెల్ల సంస్కృతకాశీ ఖండసారగ్రహణములు. శ్రీనాథుని స్వతంత్రకల్పనములు.

అగస్త్యుడు వింధ్యగర్వాపహరణము చేసి, దక్షిణదిశగా బయలుదేరి, రమ్యమైన గోదావరీతటమును బట్టి, కాశీవిరహతాపము వదలక మఱల కాశీక్షేత్రమును స్మరించి, విలపించి, క్రమముగ కోలాపురమునకు వెడలి మహాలక్ష్మిని సందర్శించినట్లు మాత్రమే సంస్కృతకాశీఖండమునందు కలదు. (169-75శ్లో.5అ.) అగస్త్యుడు దక్షిణకాశీయాత్ర చేసినట్లు శ్రీనాథుని స్వతంత్రకల్పనము. (13వచ.-26ప3ఆ.) అది దక్షారామక్షేత్రమునకు దిగ్దర్శనము[153]. అందు,

"మునిచూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండు గా
వునఁ జారీకరణాంగహారమును లావుల్ మించి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుం దానును దేశిమార్గముల గంధర్వాప్సరోనృత్యముల్."
18ప.3ఆ.

అను పద్యము గమనింపఁదగినది. సత్కళలకు మూర్ధాభిషిక్తుడైన అగస్త్యుడు సతీసమేతముగ శనివారోత్సవవేళఁ గన్గొనిన గంధర్వాప్సరోనృత్యములు సత్కళలే. అగస్త్యుడు దక్షిణాభిముఖుడగుటవలన శరదాగమనమయినట్లు. అగస్త్యోదయము శరదృతుసంకేతము. శ్రీనాథుని శరదృతువర్ణనలోని,

"అచ్చవెన్నెల విచ్చలవిడిం గాయం దొడంగె. కుముదంబులు ముదం బందె. లాంగలి చెంగలించె. ఱెల్లుల్లసిలె. కాసర గాచె. దోస దోరగిలంబారె. పయ్యెద విసరె. వాడి మందటిలియె. కరి మదంబుఁ గురిసె. నందిపోతు పోతరించి ఖణిల్లున ఱంకె వైచె. అస లడుగువడియె. నెఱిని నిసుకదెస దీవి చూపె. నీడ సవియయ్యె. ఏడాకుల పొన్న క్రొన్నన పెరిగె. వరిగ విరిగె. ఱెక్కప్రాసంగు దొెడముక్కు వడియె." (23వచ.3ఆ.)

అను వర్ణనము స్థానికప్రకృతిచిత్రణమునకు సాక్ష్యమేగాక, ఆంధ్రవచనరచనా

వైశారద్యమునకు అచ్చపు మణిదర్పణము.

అగస్త్యుడు దక్షిణకాశీయాత్రానంతరము పట్టిసక్షేత్రమును దర్శించి, పంచారామపర్యటనము పూర్తి కావించుకొని, కొల్లాపురక్షేత్రమునకు వెడలును. సంస్కృత కాశీఖండములోని కోలాపురమే కొల్లాపురము. పట్టిసక్షేత్రము, పంచారామములు తెలుగు కాశీఖండములోని వెలుగురేఖలు. పట్టిసక్షేత్రప్రకరణమునందలి,

"పంకజక్ష్మాధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువనచక్షుఃకరంభ మంభోరుహాక్షి!
గౌతమీగంగ ముత్యాల కంఠమాల" 31ప.3ఆ.

అను పద్యము అనర్ఘరత్నము. కొల్లాపురశ్రీమహాలక్ష్మీస్తోత్రములోని,

"కమలనయన! నీవు కల చోటు సరసంబు
నీవు లేని చోటు నీరసంబు
కంబుకంఠి! నీవు కల వాఁడు కలవాఁడు
లేని వాఁడు నీవు లేని వాఁడు" 47ప.3ఆ.

అను పద్యము ఆణిముత్యము. అగస్త్యుడు కొల్లాపురమునందలి శ్రీమహాలక్ష్మిని సేవించిన అనంతరము సామిమలలకు సాగుచు, యాదృచ్ఛికముగ దూరమునుండియే శ్రీశైలశిఖరమును చూచి (11శ్లో.6అ.), "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అని లోపాముద్రకు చెప్పినట్లు (18శ్లో.6అ.) సంస్కృతకాశీఖండమునందు అతిసంగ్రహముగ కలదు. అది నిమిత్తముగ అగస్త్యుని శ్రీశైలయాత్ర శ్రీనాథునీ స్వతంత్రకల్పనము[154].

అగస్త్యుడు శ్రీశైలము సమీపించుసరికి లభించిన స్వాగతమిది:

"పరిరంభం బొనరించుఁ గుంభభవునిం బాతాళగంగాంబుని
ర్ఝరకల్లోలఘటాపృషద్వ్యతికరప్రాలేయముల్ హాటకే
శ్వరజూటీకృతమాల్యకేసరరజస్సౌరభ్యసంపన్నముల్
కరివక్త్రాభరణాహిపీతపరిముక్తంబుల్ వనీవాయువుల్." 52ప.3ఆ.

అగస్త్యుని వనీవాయువులు పరిరంభమొనరించినవి. అనగా సర్వాంగీణముగ స్పృశించినవి. అవి పాతాళగంగాంబునిర్ఝరకల్లోలఘటాపృషద్వ్యతికర ప్రాలేయములు. హాటకేశ్వరజూటీకృతమాల్యకేసరరజస్సౌరభ్యసంపన్నములు. కరివక్త్రాభరణాహిపీతపరిముక్తములు. శ్రీశైలక్షేత్రమునందు పాతాళగంగ ప్రసిద్ధము. అది

కృష్ణానదియే. ఆ నదీప్రవాహమే అంబునిర్ఝరిణి. అందలి తరంగసంఘముల జలబిందువులను వ్యతికరించు చల్లదనము కల వనీవాయువులు పాతాళగంగ మీదుగా ప్రసరించునవి. అవి క్రమముగా హాటకేశ్వరస్థానమునకు వచ్చునవి. సువిశాలమైన శ్రీశైలక్షేత్రమున మల్లికార్జునదేవాలయమునకు సుదూరమున హాటకేశ్వరస్థానము కలదు. హాటకేశ్వరు డనగా హాటకేశ్వరలింగము. శివలింగమునకు పూలదండ వేయుట పొసగదు. చుట్టవలసినది. కనుక జూటీకృతమని చమత్కరింపఁబడినది. ఇప్పటికిని హాటకేశ్వరలింగమునకు పూల జూటీకరణము కలదు. హాటకేశ్వరాలయము చిన్నది. వాయుప్రసారము నిరాఘాటమైనది. పాతాళగంగ మీదుగా వీతెంచు గాలులు హాటకేశ్వరునికి జూటీకృతమైన పూలదండలోని పుప్పొడిని, పరిమళమును గ్రహించునవి. హాటకేశ్వరాలయమునకు ముందు విఘ్నేశ్వరాలయము కలదు. అది సాక్షిగణపతి గుడి. సాక్షిగణపతి విగ్రహమునకు సర్పహారము కలదు. హారమైన సర్పము ఆహారమైన గాలిని కొంత పీల్చి కొంత విడిచిపెట్టును. విడిచిపెట్టిన వనీవాయువులు అగస్త్యుని పరిరంభమొనరించినవి. శ్రీశైలక్షేత్రమునందు ముందు విఘ్నేశ్వరాలయము, తర్వాత హాటకేశ్వరాలయము, సమీపమున క్రింద పాతాళగంగ కలవు. అవి పరిశీలించి శ్రీనాథుడు అభివర్ణించిన పద్యమిది. ఇది శ్రీనాథుని శ్రీశైలయాత్రానుభూతి అగస్త్యుని శ్రీశైలయాత్రానుభూతిగ రూపాంతరము చెందినది.

"ఆ మిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుం గనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్
వ్యామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్య లాటవికసేనాధీశసీమంతినుల్." 53ప.3ఆ.

ఆటవికసేనాధీశసీమంతినులు అనగా ఆటవికసేనాధిపతి అర్ధాంగులు. వారు లోపాముద్రాసహితుడైన అగస్త్యుని ఉత్పన్నప్రమోదముతో చూచిరి. "వ్యామగ్రాహ్యస్తనీభిః శబరయువతిభిః" అని మురారి అనర్ఘరాఘవమునందు కలదు. తదనుసారిగ "వ్యామగ్రాహ్యపయోధరల్ శబరసేనాధీశసీమంతినుల్" అని హరవిలాసములోను శ్రీనాథుని ప్రయోగము కలదు. (24ప.5ఆ.) శబరసేనాధీశ సీమంతినులే ఆటవికసేనాధీశసీమంతినులు. వారు వ్యామగ్రాహ్యపయోధరలగుట వాస్తవికము. ఆటవికవనితలైనను అందగత్తెలు కాబట్టి కుటిలనీలాగ్రాలకలు, తథ్యమిథ్యామధ్యస్థితమధ్యలు కూడ. వారు లోపాముద్రాగస్త్యులను ఉత్పన్నప్రమోదముతో చూచుటకు హేతువు లోపాముద్రాగస్త్యులు ఋషిదంపతులు. అంతేకాదు. అగస్త్యుడు వింధ్యాటోపవిధ్వంసి. శ్రీనాథుడు బహుపర్యాయములు శ్రీశైలయాత్ర చేసిన శివభక్తుడు. గౌడడిండిమభట్టు కంచుఢక్కను పగులఁగొట్టించి, కవిసార్వ

భౌముడై శ్రీశైలమునకు వచ్చినప్పుడు ఆటవికసేనాధీశసీమంతినులు శ్రీనాథుని ఉత్పన్న ప్రమోదముతో చూచుట సంభవము.

అగస్త్యుడు లోపాముద్ర తోపాటు పాతాళగంగలో అఘమర్షణస్నాన మాచరించి, హాటకేశ్వరుని ఆరగ్వధసుమములతో అర్చించి, బిలమధ్యవాసుడైన నృసింహస్వామిని కొలిచి, ఏకాంతరామేశుని సందర్శించి, శ్రీమల్లికార్జునదేవుని పూజించెను. (54ప.) భ్రమరాంబాదేవిని హృల్లేఖాది మంత్రముల ధ్యానించెను. (55ప.) అమృతమయలింగమూర్తులను వెదకి వెదకి మ్రొక్కెను. (56ప.) మండూక కుండమునఁ గ్రుంకు లిడెను. పంచధార, పల్లధార అను సెలయేఱుల కృతావగాహుడయ్యెను. ఉద్యానవీరభద్రుని ఆరాధించెను. బ్రహ్మ పాదారవిందద్వంద్వమును ప్రణుతించెను. భోగేశ్వరుని భజించెను. ఇష్టకామేశ్వరునకు తుష్టి కలిగించెను. సప్తమాతృకలను సంస్మరించెను. కదళీవనమునందలి కపటభిల్లుని కొలిచెను. (57వచ.) శ్రీశైలక్షేత్రవిశిష్టతను విశదీకరించెను. (58-60ప.3ఆ.) ఇది యెల్ల అగస్త్యుని శ్రీశైలయాత్ర. ఇందు శ్రీనాథుని శ్రీశైలయాత్ర అంతర్వాణి.

అగస్త్యుని దక్షిణకాశీయాత్రకు, శ్రీశైలయాత్రకు ప్రయోజనము కలదు. అగస్త్యుడు "దక్షిణకాశీసందర్శనంబునంగాని కాశీవియోగవేదనాభారంబు డిందు వడదని నిశ్చయించి" (13వచ.3ఆ.) దక్షిణకాశీయాత్రకు బయలుదేరెను. కాశీక్షేత్రమును వదలినది మొదలు దక్షిణకాశీయాత్రకు బయలుదేరువఱకు లోపాముద్రను పట్టించుకొనలేదు. కారణము కాశీవియోగవేదనాభారమే. దక్షిణకాశీయాత్రకు బయలుదేరుచునే అగస్త్యుడు లోపాముద్రను పట్టించుకొనెను. ఆమె "కసుగందకుండ ముందఱఁ బిఱింది నడిపించ"సాగెను. (13వచ.3ఆ.) దక్షిణకాశీసందర్శనమున అగస్త్యుని కాశీవియోగవేదనాభారము చాలవఱకు డిందువడినది. మిగిలినది శ్రీశైలయాత్రను నిశ్శేషమైనది.

"చాకున్న నీదు ముక్తుల
శ్రీకాశీక్షేత్ర మెవ్వరికి నిది నిక్కం
బీ కుధరమిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ." 60ప.3ఆ.

అని అగస్త్యుడు లోపాముద్రకు తెలిపెను. "అప్పుడు లోపాముద్ర ముద్రికామణిమయూఖరేఖలు నఖరశిఖరంబులం జిగురొత్త విద్రుమప్రవాళంబుల యుల్లాసంబు నుల్లసంబాడెడు పాణిపల్లవంబులు మోడ్చి ఫాలభాగంబునం గదించిన వినయవినమితోత్తమాంగయై యున్నం గని సస్నేహంబును సబహుమానంబును సానురాగంబును సాభిప్రాయంబును సమర్మంబును సవిభ్రమంబును

సోపాలంభంబు నుంగా" సంభాషించెను.

"-శిఖర మీక్షించునంతన చేరునట్టి
ముక్తిజనులకు మఱి జీవములు దొరఁ గఁ
జచ్చినపు ఎడు గాని మోక్షంబు లేదు
కాశి కరుగంగ నేటికిఁ గాళ్ల జాలి." 64ప.3ఆ.

అని లోపాముద్ర అడిగినది. అగస్త్యుడు సమాధానముగ బాహ్యాభ్యంత రతీర్థమాహాత్మ్యము చెప్పి (67-78ప.3ఆ.) "ఈ యర్థంబు తేటపడ నొక్క యితి హాసంబు చెప్పెదవినుమని శివశర్మోపాఖ్యానమును వివరించును. అది మఱల కాశీక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు ద్వితీయఘట్టము.

శివశర్మ మహావిద్వాంసుడు. భోగపరాయణుడు. ముదిమిని తీర్థయాత్రాపరా యణుడు. సప్తపురీయాత్ర సాగించును. ఆ సప్తపురములు అయోధ్య, ప్రయాగ, కాశి, మహాకాలపురము, కాంతి, ద్వారక, మాయ అని సంస్కృతకాశీ ఖండమునందు కలదు. ఉజ్జయిని, కాశి, మాయ, అయోధ్య, కాంచి, మధుర, ద్వారక అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. (87ప.3ఆ.) మహాకాలపురమే ఉజ్జయిని. కాంతియే కాంచి అని శ్రీనాథుని వివరణ. "కాంతి యందురు గొంద అక్కాంచి పేరు" (110ప.3ఆ.) ప్రయాగ, మధుర భిన్నములు. మాయ హారిద్వారము. శివశర్మ హారిద్వారమునందు మరణించును. విష్ణుకింకరులు విచ్చేయుదురు. శివ శర్మ వైకుంఠయాత్ర అనేకలోకముల ద్వారా సాగును. ఆ యా లోకముల వృత్తాం తములు విష్ణుకింకరులు వివరింతురు. అగ్నిలోక మొకడు కాశీక్షేత్రమా హాత్మ్యప్రతిపాదకము. విశ్వేశ్వరుడు వైశ్వానరుని "విశోవత్తరంబైన యగ్నిలోకం బున కధీశ్వరుని" చేయును. (55వచ.4ఆ.) శివశర్మ చివఱకు శివలోకము చేరి, భూలోకమునకు వచ్చి నందివర్ధననగరమున వృద్ధకాలుడను పేర పెద్దకాలము రాజ్యము చేసి, కాశీక్షేత్రమున కేగి విశ్వేశ్వరప్రసాదమున మోక్షము నందును అన్య క్షేత్రముల కంటె కాశీక్షేత్రమే మోక్షదాయకమని ఫలశ్రుతి.

విష్ణుకింకరులు వివరించిన వృత్తాంతములందు గుణనిధి కథ విశిష్టమైనది[155]. గుణనిధి పురాణపురుషుడు కాడు. సామాజిక వ్యక్తి. దుర్గుణములకు ప్రతినిధి. పాత్రచిత్రణప్రవణమైన, సహజత్వసాక్షాత్కరణచణమైన కవితాసుధ గుణనిధి కథ. గుణనిధి తండ్రి యజ్ఞదత్తుడు. పరమశ్రోత్రియుడు. గృహకార్యాభ్యంతరవ్యగ్రుడు. తల్లి సోమిదమ్మ. సత్తెకాలపు మనిషి. గుణనిధి లేక లేక పుట్టిన ఏకైక పుత్త్రుడు. పర మభ్రష్టుడు.

"బ్రాహ్మణాచారంబు పరిహాసకము సేయు
నగ్నిహోత్రవిధానమన్న నలుగు
సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జన సేయు
గీతవాద్యవినోదకేలిఁ దగులుఁ
బాషండ భండదుర్భాష లావర్తించు
ద్యూతకారులతోడి యుద్ధి వడయు
ధాతువాదుల మీఁదఁ దాత్పర్య మొనరించుఁ
జెలిమి వాటించు నాస్తికులతోడ
నటుల మన్నించు హర్షించు విటులఁ జూచి
పీఠమర్దుల కొనరించుఁ బెద్దఱికము
కౌలటేయులఁ బాటించు గారవించుఁ
జేటకుల-దీక్షితుని పట్టి సిగ్గు విడిచి." 81ప.4ఆ.

ఇది శ్రీనాథుని స్వతంత్రకల్పనము. ఇంకను గుణనిధి "సజీవనిర్జీవద్యూతంబుల నోడిన ధనంబులు కితవులకుం దల్లి మేని రవణంబుల నమ్మి పెట్టుచుండును." (82వచ.) అయినను తల్లి "గొడ్డు వీఁగి కన్న బిడ్డండు కావున .. ధూర్తుఁడైన వాని దుశ్చేష్టితములెల్ల నధిపు నెఱుఁగనీక యడంచుచుండు"ను. (87ప.) వివాహము చేసి ప్రత్యహము హితబోధ చేయును. (90-97ప.) అయినను గుణనిధి యథాపూర్వముగ దుర్వర్తనములు చేయును. ఒక జూదరి వ్రేల జూచిన తన అంగుళీయకము వలన గుణనిధి అక్షధూర్తుడని యజ్ఞదత్తునికి తెలిసినది. (99-100వచ.) "ఇంటి కేతెంచి మొగంబు గంటు వెట్టుకొని సోమిదమ్మ! ఏమి చేయుచున్న దాన! విటు రమ్ము! నీ కొడుకెక్కడం బోయెం ? బోవుఁగా కేమి విను మని యిట్లనియె." (102వచ.)

"అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరము ల్లోచనా
పాంగప్రాంతములం దిగుర్ప నొకె సయ్యాటంబు గల్పించి నా
యంగుళ్యాభరణంబు పుచ్చుకొనవా? యా యుంగరం బిప్పుడే
శృంగారింపని చేతఁ బావకునకున్ జేయన్ హవిర్దానమున్."

103ప.4ఆ.

అతిలౌక్యముగ, అప్రతివిధానముగ యజ్ఞదత్తుడు అడిగినను.

"-పదిలముగ మందసమునందు బరిణలోన
నునిచి దాఁచిన దాన మీ యుంగరంబు
తీరదిప్పుడు పెట్టె శోధించి చూడ
నారగించిన పిదప నే నధిప తెత్తు" 105ప.4ఆ.

అని పెద్ద అబద్ధమాడినది. అంతయు తెలిసిన యజ్ఞదత్తుడు ఆమె లోపములను (107ప.) గుణనిధి దుశ్చేష్టలను (108ప.) ఏకరువు పెట్టి

"చాలునింక నా పాలికిఁ జచ్చినాఁడు
కొడుకు గుణనిధి యనువాఁడు కులవిషంబు
తిలలు దర్భయు నుదకంబుఁ దెత్తుఁగాక
యే నివాపాంజలుల వాని కిత్తు నిపుడు". 109ప.4ఆ.

అని కొడుకును భార్యను త్యజించును. తండ్రి కోపము తెలిసి కన్ను తెఱచి గుణనిధి వితర్కించును. (111-114ప.) అందు,

"అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేక గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందియలుం గుడువంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లి యున్నదే?
హరహర! యెవ్వరింకఁ గడు పారఁగఁ బెట్టెద రీప్సితాన్నముల్."
:114ప.4ఆ.

అను పద్యము మూలశ్లోకమునకు (97శ్లో.13ఆ.) భావోపలక్షణము. ఇందు తల్లి మమకారము తోపాటు గుణనిధి స్వార్థమును కలదు. ఇట్లు వితర్కించి ఎచటికో పోయిన గుణనిధి ఒక శివాలయములోని నైవేద్యమును అర్ధరాత్రమున అపహరించుటకు ప్రయత్నించును.

"కట్టాయితంబుగాఁ గటిమండలంబునఁ
దీర్చి దట్టీచేల దిండు గట్టి
తలుపు కిఱ్ఱనకుండఁ దరిమి కొంచెంబైన
యోరవాఁకిట దేహ మొయ్యఁ జొనిపి
మునివ్రేళ్ల లొయ్యొయ్య మోపి చప్పుడుగాని
పరిపాటిఁ బవనంబు పట్టి నడచి
దీపాంకురచ్ఛాయఁ దెలివి చాలని యట్టి
కొనచీఁకటిని లోని కొనరఁ జొచ్చి
పళ్లెరములం దపూపసూపముల తోడ
ననఁటి పండుల తోడ నాజ్యంబు తోడ
దధి పయఃక్షౌద్రబహుపదార్థముల తోడ
ధవళకలమాన్న మీక్షించె ధరణిసురుఁడు. " 121ప.4ఆ.

ఇది సరిగా ఒక గజదొంగ దొంగతనమునకు సౌధాంతరమునందు ప్రవేశించు

వైఖరి. శ్రీనాథుని స్వతంత్రకల్పనము. ఇట్లు పాత్రచిత్రణమును ప్రత్యగ్ర మొనరించి, శిల్పవిన్యాసములు చిత్రిక పట్టి, రసగుళికలు రంగరించి, సహజత్వము సవదరించి, సజీవలక్షణమును సంజీవకరణము చేసి, మూలాతిశాయిగా మూదలించిన కవితాసుధ శ్రీనాథుని గుణనిధి కథ.

అగస్త్యుడు సామిమల చేరి, కుమారస్వామిని సందర్శించును. అగస్త్యుడు వచ్చిన ప్రయోజనము తెలిసి, కుమారస్వామి కాశీక్షేత్రమాహాత్మ్యమును విశదీకరించును. ఇది కాశీక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు తృతీయఘట్టము. ఇందు ప్రత్యంశము కాశీక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకమే. అందు కళావత్యుపాఖ్యానములోని సుశీల వృత్తాంతము కరుణరసనిర్భరము. సుశీల కాశీక్షేత్రమున కాశీవిశ్వేశ్వరుని భక్తురాలైన బాలారత్నము.

"లలన సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ
గంకణమ్ములతో మణిసూడిగములు రాయ
విశ్వనాథుని కల్యాణవేదియందు
ముగ్గు పెట్టంగ మోహించు ముజ్జగంబు." 145ప.5ఆ.

ఇట్టి సుశీల విద్యాధరుడు కారణముగ, అతని భార్య కాకపోయినను భార్యగా భావించుకొని (156ప.) సహగమనము చేయునెడ, ఆమె స్వగతము హృదయ విదారకము.

"జ్ఞానవాపీపయస్స్నానక్రియావేళఁ
జలికత్తియలు నన్నుఁ దలతురొక్కొ!
మదిలోన నేభంగి మఱుఁగుచుండుదురొక్కొ
తల్లిదండ్రులు సంతతంబు నాకు!
హరితాంకురంబు లే నందిక మేయని
హరిణశాబము నెవ్వ రరయువారు?
సేవ సేయించుకో నిచ్చగింపఁడు సుమీ
నా చేత శ్రీవిశ్వనాయకుండు!
కాశి! లోలార్క! కేశవ! కాళనాథ!
దండనాయక! ఢుంఠివేదండవదన!
సంభ్రమోద్భ్రములార! యో జహ్నుకన్య!
కాన వచ్చెద మిమ్ము నెక్కటి భవమున." 161ప.5ఆ.

స్వగతము (160-165ప.5ఆ.) తర్వాత సుశీల "దుఃఖావేశంబున" (166వచ.)

"కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చిన భంగి నేడ్చె న

బ్జసరుహనేత్ర కొంతచటిఁ బెద్ద యెలుంగున వెక్కి వెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరు సోనలై
యసిరిక కాయలంతలు పయోధరముల్ దిగజారునట్లుగన్."
166ప.5ఆ

ఇది శృంగారనైషధమునందు దమయంతి

"వేఁ డి యశ్రులు నిగుడంగ వెక్కి వెక్కి
యేడ్వఁ దొడఁగె లతాంగి వృథ్వీశు మ్రోల
మృదులపరివేదనాక్షరోన్మిశ్రమధుర
కంఠకాకువికారకాకలిక యలర. " 87ప.4ఆ.

అను శ్రీనాథుని స్వీయకవితాలతిక పూసిన సరసపుష్పగుచ్ఛము. అంతేకాదు. అనంతరయుగములోని శోకపద్యములకు ఆద్యప్రకృతి.

దివోదాసు చరిత్ర ప్రధానమైనది. బ్రహ్మ కోరి దివోదాసును రాజును చేయుట. విశ్వేశ్వరుడు సమస్తదేవతలతో మందరాద్రి కేగుట. దివోదాసు బహుకాలము ధర్మబద్ధముగ రాజ్యము చేయుట. దేవతలు అగ్నిశక్తిని ఉపసంహరింపఁజేసిన దివోదాసునకు సూర్యపాకమున భోజనము సిద్ధమగుట. పరమేశ్వరుడు దివోదాసును రాజ్యభ్రష్టుని చేయుటకు యోగినులను. సూర్యుని. బ్రహ్మను. వినాయకుని. విష్ణువును కాశికి పంపుట. విఘ్నేశ్వరుడు భయోత్పాతములు పుట్టించుట. విష్ణువు గరుత్మంతుడు లక్ష్మి బౌద్ధధర్మములు ప్రబోధించుట. దివోదాసు సర్వసంపద వెచ్చించి మహాదేవాలయము కట్టించి. లింగప్రతిష్ఠ చేసి. శివలోకము చేరుట. అనంతరము విశ్వేశ్వరుడు సమస్తదేవతాసమేతముగ కాశికాపట్టణమునకు వచ్చి పట్టాభిషిక్తు డగుట దివోదాసువృత్తాంతమునకు పుట్టు పూర్వోత్తరములు. ఇందు యథార్థమైన చరిత్రాంశ మేదియో కథార్థమైనట్లు కనిపించును. విశ్వేశ్వరుడు పట్టాభిషిక్తుడగుట పునరుద్ఘాటన చేయబడినది. అది వృషభధ్వజావిర్భావఘట్టము. ఇది కాశీమాహాత్మ్యమునకు ఆధికారికవృత్తాంతమని. ఇతరములు ఆనుషంగికవృత్తాంతములని శ్రీనాథుని అమూలకవాణి. (140వచ.6ఆ.) ఇతర వృత్తాంతములందు దక్షేశ్వరలింగప్రాదుర్భావము. వ్యాసనిష్కాసము ముఖ్యములైనవి.

దక్షేశ్వరలింగ ప్రాదుర్భావవృత్తాంతమునందు శ్రీనాథుని పాత్రచిత్రణము సాటి లేని మేటి రచనము. సతీదేవి తండ్రి యజ్ఞవాటికి వచ్చిన సందర్భమునందు సంస్కృతకాశీఖండమునందు సామాన్యవనిత వలె కలదు. (66-70శ్లో.88అ.) శ్రీనాథుని కాశీఖండమునందు ధీరోదాత్త.

"యజ్ఞవాటంబు సొత్తెంచి యఖిలజనని
యర్థిఁ గూర్చుండె రత్నసింహాసనమున
భక్తితో దేవసభయును బ్రహ్మసభయు
నంజలులు ఫాలభాగంబునందుఁ గూర్ప." 68ప.7ఆ.

సతీదేవి అఖిలజనని. యజ్ఞవాటిక ప్రవేశించి సరాసరి రత్నసింహాసనమున ఆసీనురాలైనది. దేవసభయు, బ్రహ్మసభయు ఫాలభాగమున అంజలులు ఘటించెను.

దక్షుని శివదూషణమునకు సతీదేవి దీనముగా సమాధానమిచ్చినట్లు సంస్కృతకాశీఖండమునందు కలదు. (88-94శ్లో.88అ) ధీరముగా సమాధానమిచ్చినట్లు శ్రీనాథుని కాశీఖండమునందు కలదు.

"ఆహా! లెస్స! వివేకమే! పురహరుం డాసించి యున్నాఁడె నీ
స్వాహాకారము? శంభుఁ బాసి యిటు నీ సత్రంబునం దేను మృ
ష్టాహారంబు భుజింపవచ్చితినె? మోహాంధుండవై యీశ్వర
ద్రోహం బేటికిఁ జేసెదంచు హితబుద్ధుల్ చెప్పఁగా వచ్చితిన్."
72ప.7ఆ.

అఖిలజనని "ఆహా! లెస్స! వివేకమే!" అనిన మూడు మాటలును త్రిశూలాగ్రములు. "నీ సత్రంబునందు" అనగా నీ యజ్ఞమునందు అనియేగాక నీ 'సత్తరువులో' అని కూడ ధ్వనించును. దక్షుడు మోహాంధుడై ఈశ్వరద్రోహము తలపెట్టినందుకు హితబుద్ధులు చెపుటకు వచ్చితినని సతీదేవి స్పష్టపతిపాదనము.

"శివుఁడు దాత భోక్త శ్రీమహాదేవుండు
సర్వమును హరుండు శాశ్వతుండు
శంభు వేఱ సేసి సాగింపవచ్చునే
క్రియలు? వెఱ్ఱి వేల వయితి? చెపుమ. 73ప.7ఆ.

ఇది సతీదేవి హితోపదేశము. ఇక బుద్ధి చెపుటు -

"జనకా! కనకశైలకోదండుఁ డల్పుండుగాఁ జూచితే?
తండ్రీ! కల్పాంతసంధ్యామహాతాండవాడం బరారంభసంరంభ
సంక్షోభితాశేషలోకప్రచండుండు వంచింప నర్హుండొకో!
అయ్య! త్రయ్యంత విద్యావధూరత్నసీమంత సిందూరపాంసు
చ్ఛటాపాటల శ్రీపదాంభోజయుగ్మండు తన్మాత్రుఁ డే?

తాత! దైతేయలీలావతీ గండపాళీ పరిన్యస్తకస్తూరికాపత్ర
వల్లీమతల్లికళాద్రోహిబాహార్గళాస్తంభుపై నీ కవష్టంభ
సంరంభమేలయ్య యీ లాగునన్?

ఇట్లు సతీదేవి దక్షునికి బుద్ధి చెప్పుటతోపాటు అచటి పెద్దలను క్షాళన చేసినది.

"మధుమథన! మహాప్రబుద్ధుండ వీ విట్టి దుశ్చేష్టితం
బెట్లు వీక్షింపుచున్నాఁడ(వు)?
అబ్జాప్త! నీ యిల్లువేల్పుండ నీ బంద దుర్గోష్ఠితోఁ గూడి
యున్నాఁడ వింకొక్కమాటైన నేమోమునం జూచె
దీశానుపాదాబ్జముల్?
వహ్ని! యీకూడు తీపెయ్యనే నీకు నిర్భాగ్య?
ఏణాంక! యంతఃకళంకంబు తెల్లంబు గావించి
తిన్నాళ్లకున్ లెస్స గాకేమి!
పౌలస్త్య! నిన్నుం గనుంగొన్న సిగ్గయ్యెడిన్
శక్ర! నీ మొక్కలంబు ల్వినంబడ్డవి కావె?
వాచస్పతీ! నీ చరిత్రంబు నీచంబు చాలున్
వృథాలాపముల్ సేయ(ను)
ఈ యున్న వారింద ఱున్నారు. చూడంగ నేఁ డెల్లి యీలోన
నే పాకముం బొంద నున్నారొ?
ఏ దుర్గతిం జెంద నున్నారొ?
ఏ యాపదలం దూలనున్నారొ?
ఏ పంచలం గూడ నున్నారొ?
ఆమీఁద దైవం బొకం డెర్గెఁ డున్." 74దం.7అ.

ఇదొక పెద్దదండకము. పూర్వభాగమునందు పరమేశ్వరుని పరమోత్కృష్టముగ వర్ణించి, "భజింపందగున్ సత్క్రియారంభకాలంబునన్" అని సతీదేవి హితోపదేశము చేయుట కలదు. ఉత్తరభాగమునందు "సహేంద్రతక్షకాయ స్వాహా" అన్నట్లు దక్షుని తోపాటు విష్ణ్వాదులకు బుద్ధి చెప్పుట కలదు. శృంగారనైషధములోని సరస్వతీ దండకము, కాశీఖండములోని సతీదేవీదండకము సముజ్జ్వల లసత్తరములు. సరస్వతీదండకము శ్రీనాథుని శిల్పసృష్టి. సతీదేవీదండకము శ్రీనాథుని అనల్పసృష్టి

సతీదేవి హితబుద్ధులు చెప్పిన తదుపరి ప్రాణరోధవిధానమున దేహమును విడిచి పెట్టినదని సంస్కృతకాశీఖండమునందు కలదు. (95శ్లో.88అ.) శ్రీనాథుని

కాశీఖండము నందు యోగానలప్రజ్వలనమున దగ్ధమైనట్లు విదగ్ధముగ కలదు.

"పాదపద్మములందుఁ బ్రభవించు నప్పుడు
ప్రత్యగ్రయావకద్రవము చెలువు
కటిమండలముపైఁ గనుపట్టు నప్పుడు
కనకకాంచీదామకంబు డాలు
వలుఁదచన్నుల మీఁద మొలతెంచు నప్పుడు
కాశ్మీరజాంగరాగంబు పొలుపు
సీమంతపదమునఁ జిగురొత్తు నప్పుడు
రమణీయ సిందూరరజము సొబగు
ప్రోదిసేయుచు భగ్గున భుజగహారు
రాణివాసంబు దివ్యవిగ్రహమునందు
రవులుకొని మండె నాస్థానరంగభూమి
నధికరోషోత్థితంబు యోగానలంబు." 76 ప. 7 ఆ.

ఇది శ్రీనాథుని స్వీయకవిత. ఇందు సతీదేవి అధికరోషమున వెలువడిన యోగానలము పాదపద్మములందు ప్రభవించునపుడు ఎఱ్ఱని లక్కద్రవము చెలువు, కటి మండలముపై కనుపట్టునప్పుడు బంగారు ఒడ్డాణము డాలు, వక్షోభాగమునందు వ్యాపించునపుడు కుంకుమపూత పొలుపు, సీమంతపదమున ప్రసరించునపుడు సిందూరరజము సొబగు సతీదేవి దివ్యశరీరమున ప్రోదిసేయుట సహృదయవేద్యము.

వ్యాసనిష్కాసవృత్తాంతమునందు అన్నపూర్ణపాత్రచిత్రణమును సాటిలేని మేటి రచనమే.

"జిలుఁగు సంధ్యారాగచీనాంబరము గట్టి
కుసుమగర్భముగఁ గీల్కొప్పు వెతనర
కస్తూరితోఁ గూర్చి గంధసార మలంది
ముత్యాల తాటంకములు ధరించి
సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి
కురులపైఁ జిన్నిపూ గుస్తరించి
శ్రీపాదముల హేమనూపురంబులు దాల్చి
కటి మీఁద వజ్రాలకమరు నిల్పి
యన్నపూర్ణ విశాలాక్షి యనెడు పేళ్లఁ
గాశికామధ్యశృంగాటకములయందు
విశ్వపతిదేవి మధ్యాహ్నవేళఁ బెట్టు

నమృతపాయసదివ్యాన్న మనుదినంబు." 148ప.7ఆ.

ఇది శ్రీనాథుని స్వీయకవిత. ఇందు విశ్వేశ్వరుని దేవి పేరులు అన్నపూర్ణ. విశాలాక్షి. ఒక దేవికే రెండు పేరులు. కాని ఈనాడు కాశీక్షేత్రమున అన్నపూర్ణ వేఱు. విశాలాక్షి వేఱు. ఇద్దఱు దేవులు. రెండు గుడులు. కారణము పదునాఱవశతాబ్దిని కాశీవిశ్వేశ్వరాలయము రూపాంతరము చెందుట కావలయును. ఇంతకు అన్నపూర్ణ అయిన విశాలాక్షి అనుదినము మధ్యాహ్నవేళ అమృతపాయసదివ్యాన్నములు పెట్టు దేవత అయినను, వ్యాసునికి భిక్ష లభింపలేదు. అన్నపూర్ణ ప్రభావమున ఆమె కట్టనుగుచెలులైన కాశీగృహిణులును భిక్ష పెట్టలేదు.

"వండుచున్నారమనె నొక్క వనజనేత్ర
తిరిగిరమ్మనె నొక్క లేఁదీఁగెబోఁడి
దేవకార్యంబు నేఁడనెఁ దెఱవయొర్తు
ద్వాఃకవాటంబుఁ దెఱవదు వనిత యొకతె." 137ప.7ఆ.

ఇది కూడ శ్రీనాథుని స్వీయకవిత. ఇందు కొందఱు స్త్రీల సహజలక్షణము కలదు. మఱునాడు కూడ భిక్ష లభింపక వ్యాసుడు కోపావేశమున శపింపఁబోవ పార్వతి - అన్నపూర్ణయే-ప్రాకృతస్త్రీవేషధారిణియై ప్రత్యక్షమైనది. ఆమె వర్ణనము శ్రీనాథుని కాశీఖండమునందు రెండు పద్యములందు కలదు.

"వేనలి పాటపాట నరవెంద్రుకతోఁ దిలతండులాన్వయ
శ్రీ నటియింపఁ గై సడలి వ్రేఁకని చన్నుల పాలవంకపైఁ
గొ నసియార్ప వాలుఁ దెలికన్నులు కల్కితనంబు వీడ్కొనన్
మానిని హస్తమూది యొక మంజులభాషిణి వచ్చె వీథికిన్. 160
వేదపురాణశాస్త్రపదవీనదవీయసియైన పెద్ద ము
త్తైదువ కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివరా! యిటు రమ్మని పిల్చె హస్తసం
జ్ఞాదరలీల రత్నకటకాభరణంబులు ఘల్లుఘల్లనన్." 161ప.7ఆ.

ఇందు మొదటి పద్యము కేవలము ప్రాకృతవృద్ధస్త్రీరూపవర్ణనము. రెండవ పద్యము పరమరమణీయమైన పార్వతీవర్ణనము. పార్వతి ఆదిమశక్తి. కావున వేదపురాణశాస్త్రపదవీనదవీయసియైన పెద్ద ముత్తైదువ. ఆమెయే అన్నపూర్ణ. విశాలాక్షి. కాఁబట్టి కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ. ఆమె పిలుపు సంజ్ఞామాత్రము. ఆదరపూర్వకము. "రత్నకటకాభరణంబులు ఘల్లు ఘల్ల"నుట సహజము. ఇదియెల్ల శ్రీనాథుని స్వీయకవిత్వము.

మహాదేవి వ్యాసుని అతిథిగా రమ్మని అభ్యర్థనము చేసినట్లు సంస్కృత కాశీఖండమునందు కలదు. (131-134శ్లో.96అ.) అట్లు కాక ఆ పెద్దముత్తైదువ వ్యాసుని మందలించి ఆహ్వానించినట్లు శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. (162-168ప.7ఆ.)

"ఆకంఠంబుగ నీకు మాధుకరభిక్షాన్నంబు భక్షింపఁ గా
లేకున్నం గడు నంగలార్చెదవు మేలే! లెస్స! శాంతుండవే?
నీకంటె న్మతిహీనులే కటకటా నీవారముష్టింపచుల్
శాకాహారులుఁ గందభోజులు శిలోంఛప్రక్రముల్ దాపసుల్. 163
ఓ మునీశ్వర! వినవయ్య యున్న యూరఁ
గన్న తల్లియు నొక్కరూ పన్న రీతి?
యిటు విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి
కాశి యిీవ్విటి మీఁద నాగ్రహము తగునె?" 164ప.7ఆ.

ఆతిథ్యమిచ్చిన అనంతరము వ్యాసుని అపరాధమునకు తగిన శిక్ష వేయఁదల చినది అన్నపూర్ణయే. "భోజనము పుట్టని వేళ కాశిని కినియంగఁ దగునె" అని (198వ.) ఇట్లన్నది.

"ఎట్టు పురాణముల్ పదియునెన్మిదిఁ జెప్పితి? వెట్లు వేదముల్
గట్టితి వేర్పఱించి? నుడికారముఁ దప్పకయుండ భారతం
బెట్టు రచించి?తీవు!ఋషి వెట్టయి? తొక్క దినంబు మాత్రలో
బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబుల రాశిఁ గాశికన్. 194
క్రోధంబు ఫలమె నిర్మల
బోధమునకుఁ? దీర్ఘవాసమున కర్హంబే
క్రోధము? వారాణసి పైఁ
గ్రోధించిన విశ్వభర్త క్రోధింపఁ డొకో" 195ప.7ఆ.

ఇది విశ్వేశ్వరుని నిగూఢమైన క్రోధాగ్నికి ప్రగాఢమైన పాణింధమమైనది. ఇది శ్రీనాథుని స్వతంత్రకల్పనము.

"కాశినుండంగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలి పొమ్మను మాటలు వేయునేల?
క్రోధనుం డెట్లు? కైవల్యకులగృహంబు
నా నివాసంబు కాశికానగర మెట్లు?" 197ప.1ఆ.

అని విశ్వేశ్వరుడు విశాలాక్షికి చెప్పెను. అది గమనించి వ్యాసుడు "అయ్యాది మదంపతుల పాదారవిందంబులకుం బ్రణమిల్లి యే నపరాధంబు సేసితిఁ గోపం

ఋపసంహరింపవలయు"నని ప్రార్థించును. (198వచ.) వ్యాసుని ప్రార్థనమునకు విశ్వేశ్వరుని అనుమతిని విశాలాక్షి అనుగ్రహించినట్లు సంస్కృత కాశీఖండము నందు కలదు. (198,202శ్లో.96అ.) విశ్వనాథుడే అనుగ్రహించినట్లు శ్రీనాథుని కాశీ ఖండమునందు కలదు. (197ప.7ఆ.)

"కాశికాపురిఁ దొరిటి కట్టడ నుండక
పుణ్యకాలమునందు భూతతిథుల
వచ్చువాఁడవు శిష్యవర్గంబు నీవును
నైదుక్రోశములకు నవలి నేల
నుండువాఁడవు పైఁడికుండలు ప్రాకార
వలయంబుఁ బొడగానవచ్చు చోట"

అను విశ్వేశ్వరుని అనుగ్రహము కాశిక్షేత్రమాహాత్మ్యమునకు వ్యంజకము.

అన్నపూర్ణ ఆతిథ్యము (186వచ.7ఆ.) ఆంధ్రదేశీయము.

శ్రీనాథుని కాశీఖండమునందు మయూరుని సూర్యశతకశ్లోకములు పదాఱు (16) తెనుగుసేతకు నోచుకొని తేజరిల్లినవి [156]. వాడి మయూఖములు మృదుచంద్రిక లైనవి. శ్రీనాథుని కాశీఖండము షోడశకళాప్రపూర్ణము. "సమకట్టితి కావ్యముగా నొనర్పఁగాన్" అనిన శ్రీనాథుని సంకల్పము నిర్వికల్పము.

## శివరాత్రిమాహాత్మ్యము

ఇది కూడ శ్రీనాథుడు తెలుపనిది. ఇందు శ్రీనాథుని కాశీఖండములోని సమూలకమైన, పూర్వోదాహృతమైన" అరుణగభస్తిబింబ"మను పద్యము (114ప.4ఆ.) అట్లే కలదు. (20ప.3ఆ.) కావున శివరాత్రిమాహాత్మ్యము కాశీఖండానంతర కాలరచనము కావలయును. శివరాత్రిమాహాత్మ్యము శ్రీశైలభిక్షావృత్తిమఠాధిపతి ముక్తిశాంతభిక్షావృత్తి ముఖ్యోద్యోగి. ముమ్మడి శాంతయ్యకు అంకితము. ముక్తి శాంతభిక్షావృత్తి యతీశ్వరుని శాసనము కలదు [157]. శాసనకాలము 1448 వ సంవత్సరము. రాజమహేంద్రవరరాజ్యపతనానంతరము శ్రీనాథుడు మఱల శ్రీశైలయాత్ర సేయుట సంభవము. కాఁబట్టి శివరాత్రి మాహాత్మ్యరచనాకాలము స్థూలముగ 1445 వ సంవత్సరము.

# కృతిసమీక్ష

శ్రీనాథుడు "కవితావిధానంబు శైవంబుగా సుకుమారచరిత్రంబు (చెప్పంబూనిన)"ది'. (10వచ.1ఆ.), శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వరులు "కవిత్వంబున నీ కథ యుపన్యసింపుమనిన"ది (10వచ.1ఆ.) శివరాత్రిమాహాత్మ్యము. "స్కాందంబున నీశానసంహితయందుఁ జెప్పంబడిన యురులింగోద్భవంబును శివరాత్రిమాహాత్మ్యంబును (సుకుమారోత్పత్తియు యమశంకరసంవాదంబును") (44వచ.1ఆ.) కలది శివరాత్రిమాహాత్మ్యము. ఈశానసంహిత కథామాత్రము. ఆ కథ కూడ అస్థిపంజరప్రాయము. అస్థిపంజరము రక్తమాంసలమైన శరీరమైనట్లు ఈశానసంహితలోని కథాత్రయము శివరాత్రిమాహాత్మ్యమునందు రసమయమైన కావ్యమైనది. ఈశానసంహితానుసరణము తోపాటు కాదంబరీకావ్యాంధ్రీకరణమును కలదు[158]. హరవిలాసము కంటె శివరాత్రిమాహాత్మ్యము స్వతంత్రకావ్యము.

ఉరులింగోద్భవము ఈశానసంహితయందు సంగ్రహము. (15-67శ్లో.) శివరాత్రిమాహాత్మ్యమునందు సవివరము. (56-113ప.1ఆ.) శివరాత్రివ్రతవిధానము సంహితయందు సవివరము. (69-132శ్లో.) మాహాత్మ్యమునందు సంగ్రహము. (117వచ.) సుకుమారచరిత్రము ఈశానసంహితయందు సంక్షిప్తము. (147-206శ్లో) శివరాత్రిమాహాత్మ్యమునందు సవిస్తరము. సంహితయందు గ్రంథపాతము కలదు. మాహాత్మ్యమునందు లేదు. శ్రీనాథుని సుకుమారచరిత్రము మూడాశ్వాసములందు మూడువందల నలుబదియైదు పద్యగద్యముల గ్రంథము. యమశంకరసంవాదము సంహితయందు సవివరము. (1-130శ్లో.) మాహాత్మ్యమునందు సంగ్రహము. పంచమాశ్వాసమునందు ఏబదియాఱు పద్యగద్యముల గ్రంథము. సుకుమారచరిత్రమే కండపట్టు. కలకండతెట్టు.

ఉరులింగోద్భవఘట్టమునందు శివాధిక్యము కలదు. అంతేకాదు. ఒక శైవమతవిశ్వాసము కలదు. అర్ధరాత్రసమయమున శివలింగమునందు శివుడు ఉద్భవించునని, అది లింగోద్భవసమయమని, లింగోద్భవసమయమునందు శివలింగసందర్శనము సర్వపాపహరమని, అది శివరాత్రినాడు అయిన శివలోకప్రాప్తి కలుగునని ఆ విశ్వాసము. వరాహావతారమునందు దంష్ట్రిక తుదిని ఉర్వీమండలిని ఉద్ధరించితినని గర్వించి విష్ణువు, సమస్తజగత్తును సృష్టించితినని అహంకరించి బ్రహ్మ అఖిలేశ్వరత్వమునకు పంతమాడుదురు.

"నన్ను గెల్చితకదా నీవు నలిననాభ
యఖిలలోకేశ్వరుఁడ వౌట యనియె బ్రహ్మ

నన్ను గెల్చికదా నీవు నలినగర్భ
యఖిలలోకేశ్వరుఁడ వౌట యనియె శౌరి." 87ప.1ఆ.

శౌరి శార్ఙ్గ మెక్కుపెట్టును. బ్రహ్మ గాండివము సంధించును. విధాత కుశపూల కమున వ్రేయును. విష్ణువు చక్రము ప్రయోగించును. ఉభయులును పాశుపతా స్త్రములను ఏయుదురు. త్రిభువనోపద్రవము తీండ్రించును. అప్పుడు మహానల స్తంభమూర్తి సంభవించును. అనలస్తంభమునందు మాఘబహుళచతుర్దశినాడు అర్ధరాత్రసమయమున శివుడు అవతరించును. హంసరూపము దాల్చి బ్రహ్మ అంబరమునకు, వరాహరూపము ధరించి విష్ణువు పాతాళమునకు పోయి, అనల స్తంభము తుద మొదలు కానలేక తిరిగి వచ్చి శివుని అఖిలేశ్వరత్వమును అంగీ కరింతురు. మాఘబహుళచతుర్దశి శివరాత్రి. శివరాత్రివ్రతమాహాత్మ్యమునకు నిద ర్శనము సుకుమారచరిత్రము.

సుకుమారచరిత్ర గుణనిధికథకు సహోదరము. గుణనిధి కంటె సుకుమా రుడు గొప్పవాడు. లేక లేక పుట్టిన ఏకైకపుత్త్రుడే. ద్యూతకేళీలోలుడు మాత్రమేగాక, పరదారాగమనపరాయణుడు.

"యమునానదీసైకతమున జాలరికన్య
చనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు
విహరించెఁ బదియాఱువేల సతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు
మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గొక్కొరోకో యని కోడియై యెలుఁగించి
యమరనాయకుఁ డెట్లహల్యఁ గలసె
మొలకచన్నుల ప్రాయంపు ముద్దుఁ గూఁతుఁ
బట్టుకొనె నెట్లు పైకొని పద్మభవుఁడు
చందురుండెట్లు నొరిదె నాచార్యు లేమ
ననుచు విప్రుండు రమియించు నన్యసతుల" 101ప.2ఆ.

తల్లిదండ్రులు సుశీలాయజ్ఞదత్తులు హితోపదేశము చేసిన ఇల్లు విడిచిపెట్టి పోవును. ఇల్లాలిని విడిచిపెట్టి పోయి శబరగ్రామము చెంత ఒక చండాలకన్యను మోహించును. ఆమెను,

"సరసిజలోచన యొక్క మహాముని శాపవశంబున బాణచివై
ధర జనియించినదానవు నీ విది తథ్యము కిన్నరభామినివో

గరుడపురంధ్రివో ఖచరవధూటివొ గాని జఘన్యవుగా వి౯ క నన్
ధరణిసురోత్తము దగ వరియింపు సుధాకరసూర్యులు సాక్షులుగాన్."
66ప.2ఆ.

అని అర్థించును. ఆమె,

"-ఇన్నిటికి నోర్చి నీ కోర్కి యేను దీర్త
నింతవానికి నీకు నన్నీయబరువె
యెప్పటికి నిత్తునో లేక యీ శరీర
మిప్పటికిఁ జాలునో నిక్క మొఱఁగఁ జెపుము. 73ప.
మొదలఁ గక్కుర్తిపడి కూడి పిదప వాయు
నొక్క కమలాననకు డక్కి యుండఁ జాలఁ
డడవిఁ బెక్కుపుష్పములయందు వ్రాలు
చంచరీకంబు మగవాఁడు సరియె సువ్వె." 74ప.2ఆ.

అనిన, సుకుమారుడు -

"మగవారల నిందింపకు
తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయున్
మగవారికె గా కెందును
మగువలకుం గలవె చంద్రమండలవదనా" 77ప.2ఆ.

అని పురుషాధిక్యమును ప్రకటించి, ప్రమాణము చేసి, కందర్పుడు చంపునని, "ప్రాణంబు రక్షింపు మిదే నీకు సేవాంజలి" అని ప్రాధేయపడి అంగీకరింపఁ జేయును. వెలివాడకు కడుంజేరువనున్న హూణభూమియందలి భద్రకాళి గుడిలో విడిదిచేయును. మాంసభక్షణమును మరగును. మధుపానమున లీనమగును. హూణమండలమునందు గుట్టు రట్టయి చెంచుగూడెమునకు పోవును. కూతుళ్లను కూడ మనువాడును.

"కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు
వావి వర్ణంబు మాలిన వద రతండు
శాస్త్రములఁ జెప్పఁ బడిన దోషంబు లెన్ని
యన్నియును జేసె నాతఁ డేమనఁ గఁ గలదు." 20ప.4ఆ.

అయినను శివరాత్రినాడు,

"కుడిచేత మాంసఖండము
లెడకేలను మద్యరససహితమగు కంచుం

గుడుకయు ధరించి మదమున
వడవణంకులు గొనుచు నతఁడు వచ్చె న్గుడికిన్." 42ప.4ఆ.

అది నాగేశ్వరాలయము. అచట సుకుమారుడు మదిరామదాతిరేకమున తన్ను దా నెఱుఁగక పడుచు, లేచుచు, వికారాలోకనమున అలవోకగా నాగేశ్వర శివలింగమును చూచి, శివపూజను కనుగొని "అర్ధరాత్రంబుదాఁక శివనిశావైభవము వీక్షించి చనును." కొంతకాలమునకు

"కుక్కలలో శబరులలో
గక్కురచిమ్మటలలోనఁ గార్కొఁకులలోఁ,
బక్కణము గుడిసె నడుమను
గుక్కిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్." 50ప.4ఆ.

చచ్చిన సుకుమారుని కొఱకు వచ్చిన యమభటులకు, శివదూతలకు మధ్య మహాఘోరయుద్ధము జరుగును. "సుకుమారుడు పుణ్యశివరాత్రివ్రతాలోకనప్రభావమున" శివలోకము చేరును. శివుడు సుకుమారునికి "ప్రమథత్వము" కృపసేయును. ఇది సుకుమార చరిత్రము.

సుకుమారచరిత్రములోని కథాప్రారంభము (3-31ప.2ఆ.) అమూలకము. సుకుమారుని జన్మవృత్తాంతము మూలమునందు ఒకటిన్నరశ్లోకములందు కలదు. (151-153శ్లో.) శివరాత్రిమాహాత్మ్యమునందు సుమారు డెబ్బదిపద్యగద్యముల ఘట్టము. (15-83ప.2ఆ.) ఇందు చాలవఱకు కాదంబరీకావ్యాంధ్రీకరణము కలదు. సుకుమారుని యౌవనవృత్తాంతము మూలమునందు రెండున్నరశ్లోకములందు కలదు. (162-185శ్లో.) శివరాత్రిమాహాత్మ్యమునందు నూట నలుబది పద్యగద్యముల ఘట్టము. (21-142ప.3ఆ.,3-21ప.4ఆ.) కాదంబరీకావ్యాంధ్రీకరణముక్వాచిత్కము. సుకుమారుని శివరాత్రిదర్శనము మూలమునందు ఎనిమిది శ్లోకములందు కలదు. (186-193శ్లో.) శివరాత్రిమాహాత్మ్యమునందు ముప్పదిరెండుపద్యగద్యముల ఘట్టము. (21-52ప.4ఆ.) యమభటుల, శివదూతల యుద్ధము మూలమునందు గ్రంథపాతము గాక పదునాల్గు శ్లోకములందు కలదు. (193-206శ్లో.) శివరాత్రిమాహాత్మ్యమునందు గ్రంథపాతము లేక ముప్పదియైదు పద్యగద్యముల ఘట్టము. (88-93ప.4ఆ.) సుకుమారుని శివలోకప్రాప్తి మూలమునందు గ్రంథపాతము. శివరాత్రి మాహాత్మ్యమునందు పదాఱు పద్యముల ఘట్టము. (88-93ప.4ఆ.) ఇదియెల్ల శ్రీనాథుని ప్రపంచీకరణము.

శ్రీనాథుని సుకుమారచరిత్రమునందు నగ (3ప.1ఆ.) నగర (4-10ప.1ఆ.) నగరాధిప (12-13ప. 1ఆ.) తటాక (21ప.3ఆ.) సూర్యాస్తమయ (93ప-94వచ. 3ఆ.)

వసంతర్తు (120ప.3ఆ.) గంధవహ (4ప.4ఆ.) గోపుర (5ప.4ఆ.) హేమంతర్తు (2జ-34వచ.4ఆ.) ప్రభృతివర్ణనములును కలవు. కాశి మొదలు రాజమహేంద్రవరము వఱకు క్షేత్రముల, పంచారామముల, కర్ణాటతాటంకిని, మాహేశ్వరుల, పాశుపతుల, కాలాముఖుల, జటాధారుల, పరివ్రాట్టుల, శాంభవీశంభుల, కుమారస్వామి భృంగి రిటుల ప్రసక్తులు కలవు. ఇవేమియును ఈశానసంహితలో లేవు నాగేశక్షేత్రవ ర్ణనము సంహితయందు నామమాత్రము. (186-187శ్లో73అ) శివరాత్రిమాహాత్మ్యము నందు రూపచిత్రము. (31,32ప.ప.4ఆ.)

యమేశంకరసంవాదము మూలవిధేయమైనను ఆద్యంతములు శ్రీనాథుని స్వతం త్రకల్పనములు. యమచిత్రగుప్తుల సమావేశము. (2-8ప.5ఆ.) తొలి స్వతంత్రక ల్పనము. యమభటులకు యముని ఉపదేశము (48ప.58వచ.5ఆ.) తుది స్వతంత్రక ల్పనము. తొలి స్వతంత్రకల్పనమునందు యముని పదవీత్యాగసమాలోచనము కలదు.

"ఏలా యీ యధమాధికారము పరాధీనత్వదుఃఖాఢ్యమున్
గైలాసంబున కేఁగియున్ శివుని శ్రీకంఠున్ విరూపాక్షునిన్
దైలోక్యాధిపు సంస్తుతించెద మహాధ్యక్షత్వచిహ్నాంబు ము
ద్రాలంకారముపాదపద్మమణిపీఠాగ్రంబునం బెట్టెదన్" 7ప.5ఆ.

తుది స్వతంత్రకల్పనమునందు శివభక్తులను సేవించుట యమభటుల కర్త వ్యము.

"జంతుకోటిలోన శంకరపాదాబ్జ
సేవ సేయువారిఁ జేరకెపుడు
దూరమందుఁ దొలఁగి దూషింపకెంతయు
భక్తిఁ గొలువవలయు భటులు మీరు." 56ప.5ఆ.

మూలవిధేయమైన యమశంకరసంవాదమునందు హరిగతిరగడ శ్రీనాథుని స్వతంత్రకల్పనము. శివకవియుగమునందు రగడ లఘుకావ్యము. శ్రీనాథ యుగములోని విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణిలోను రగడ కావ్యభేద ముగ కలదు. రగడ ఛందోభేదముగ ప్రథమతః శ్రీనాథుని కాశీఖండమునందు, తదుపరి శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యమునందును కలదు. కాశీఖండములోని మణికర్ణికరగడ తెలుగురగడ. శివరాత్రిమాహాత్మ్యములోని శివస్తుతిరగడ (125ప.5ఆ.) సంస్కృతరగడ. రఘటాభేదము.

మొత్తము మీద పర్యాప్తమైన ప్రపంచీకరణము, సార్వత్రికమైన స్వతంత్ర

కల్పనము కల శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము శ్రీనాథుని హరవిలాసము కంటె స్వతంత్రకావ్యము.

## పలనాటివీరచరిత్ర

ఇది శ్రీనాథుడు తెలుపనిది. పలనాటివీరచరిత్ర భాగము శ్రీనాథకృతము బాలచంద్రయుద్ధము ప్రథమతః 1911 వ సంవత్సరమునందు, తదుపరి 1938 వ సంవత్సరమునందును ప్రకటింపఁబడినది. అదే భాగము కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము అని 1961 వ సంవత్సరమునందు పలనాటివీరచరిత్ర సంపుటమునందు ప్రకటింపఁబడినది. బాలచంద్రయుద్ధభాగమునకు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు ఆరు ప్రతులు కలవు. అందు కల్లుప్రతిష్ఠ, బాలునికథ, బాలుని యుద్ధము అని మూఁడు కథలుగ కలవు[159]. బాలచంద్రయుద్ధము గాక ఆరణగండ్లయుద్ధము, పెద్దన్న పెండ్లిరాయబారము, మందపోతు కథ అను మఱొక మూఁడు కథలు, శ్రీనాథకృతములు ఇటీవల లభించినవి[160]. ఇంకను ప్రకటింపఁబడలేదు. ముద్రితమైన, ఉపలబ్ధమైన కథలను బట్టి శ్రీనాథుడు పలనాటివీరచరిత్ర మొత్తము రచించినట్లు గ్రాహ్యము. కాని ముద్రితమైన బాలచంద్రయుద్ధభాగమును బట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమని, శ్రీనాథకృతము కాదని వాదప్రతివాదములు వెలసినవి[161]. పలనాటివీరచరిత్ర కర్తృత్వము సమస్య అయినది.

## కర్తృత్వము

పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుటకు గల కారణములివి :

1. భాష : బాలచంద్రయుద్ధభాగమునందు వ్యాకరణవిరుద్ధప్రయోగములు, అర్వాచీనములైన అన్యదేశ్యములు కలవు. అవి శ్రీనాథకృతమైన సంభవించునవి కావు.

బాలచంద్రయుద్ధభాగమునందు పట్టుక, చూచుక, చేసుక మొదలైన వ్యాకరణ విరుద్ధప్రయోగములు; డమాయీలు, మస్టీలు, ముఖమల్లు మొదలైన అర్వాచీనములైన అన్యదేశ్యములును ఉన్నమాట నిజము. అవి శ్రీనాథకృతమైన సంభవించునవి కాకపోవు. పఠనపరమైన కావ్యములకు పాఠకలేఖకదోషములు పరిపాటి. ప్రదర్శనపరమైన కావ్యములకు పాఠకలేఖకదోషముల తోపాటు ప్రదర్శకదోషములును సహజము. పలనాటివీరచరిత్ర వ్రాతప్రతులు మాతృకలు గాని, పుత్త్రికలు గాని, పౌత్త్రికలు గాని ప్రపౌత్రికలు గాని కావు. పామరుల నోట పాటరూపమున పరంపరాగతమై, కాలాంతరమున. అది కూడ పరమార్వాచీనకాలమున

లిఖితరూపము నందినవి. అందువలన ఆద్యప్రకృతికి వికృతి కలుగుట అపరి హార్యము. కాలాంతరసంక్రాంతములగు భాషాదోషములు కారణముగ పలనాటి వీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుట ప్రామాణికము కాదు.

2. ఛందస్సు : పలనాటివీరచరిత్ర పదకవిత. అది శ్రీనాథుడు పరిహసించినది.

"ముదివితులు విధవలంజలు
పదకవితలు మారుబాసబాపనవారల్
చదువని పండితవర్యులు
కదనార్భటి వీరవరులు కడిదిపురమునన్"

అని శ్రీనాథుని చాటుపద్యము కలదు. కనుక శ్రీనాథుడు పలనాటివీరచరిత్ర రచించుట తటస్థించునది కాదు.

పలనాటివీరచరిత్ర పదకవిత్వమే. కాని ద్విపదకావ్యము. ద్విపదకావ్యమే పదకవిత కాదు. తదితరమైన పదకవితలు తండోపతండములు. చాటుపద్యములోని పదకవితలు పండితకవిత్వము లేని కడిదిపురములోని పదకవితలు. అంతేకాదు. ఒకసారి పరిహసించి మఱొకసారి పరిగ్రహించుట పాపము కాదు. శృంగారనైష ధమునందు వైశ్యుని పరిహసించి (115ప.6ఆ) తదనంతరకృతియైన హరవిలాస మును శ్రీనాథుడు వైశ్యునికే అంకితమిచ్చెను. అంతేకాదు. రాజమహేంద్రవరతర్క పండితులను అపహాస్యము చేసిన శ్రీనాథుడు స్వయము తర్కపండితుడు. కనుక శ్రీనాథుడు పలనాటివీరచరిత్ర రచించుట తటస్థించును. ఇంతకు పయి చాటు పద్యము శ్రీనాథకృతమే అనుటకు నిర్ధారకసాధనము లేదు. నిర్ధారకసాధనము లేని చాటుపద్యము కారణముగ పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుట సమర్థము కాదు.

3. శైలి : బాలచంద్రయుద్ధభాగమునందు శైలి పేలవముగా కలదు. శ్రీనాథుని శైలీప్రౌఢిమ లేదు. అది శ్రీనాథకృతమైన అట్లుండునది కాదు. కాన పలనాటివీర చరిత్ర శ్రీనాథకృతము కాదు.

బాలచంద్రయుద్ధభాగమునందు శైలి పేలవముగా కల మాట నిజము. శ్రీనాథుని శైలీప్రౌఢిమ లేని మాట యథార్థము. అది శ్రీనాథకృతమైనను అట్లుండును. శైలి కేవలము కవినిష్ఠము కాదు. వస్తుసంబంధి. ప్రక్రియాపరము కూడ. పలనాటి వీరచరిత్ర పఠనపాఠనపరాయణమైన శ్రవ్యకావ్యము కాదు. శ్రవణశ్రావణప్ర వణమైన గేయకావ్యము. పండితపరిమితావధికము కాదు. పామరపరమావధికము. ప్రౌఢకావ్యము కాదు; దేశికావ్యము. శ్రీనాథుని శైలీప్రౌఢిమ శృంగారనైషధ,

భీమేశ్వరపురాణ, కాశీఖండములందు కలదు. హరవిలాస, శివరాత్రిమాహాత్మ్యము లందు లేదు. ప్రౌఢిమ అనగా దీర్ఘసమాసభూయిష్ఠరచన. అది పలనాటివీర చరిత్రకు అందని ఫలము. శృంగారనైషధాదులు చంపూకావ్యములు. పలనాటివీర చరిత్ర ద్విపదకావ్యము. తెలుగు చంపూకావ్యములలోని వృత్తములకు పాదాంత విరతి పాటించవలసిన ఆవశ్యకము లేదు. ద్విపదకావ్యములోనిద్విపదలకు పాదాంతవిరతి పాటించవలసిన ఆవశ్యకము కలదు. ద్విపదపాదమునందు సుదీర్ఘసమాస భూయిష్ఠరచన నిరవకాశము. బాలచంద్రయుద్ధభాగమునందు శ్రీనాథుని శైలీ ప్రౌఢిమ లేదుగాని, శ్రీనాథుని శైలీముద్ర కలదు. కాఁబట్టి శైలి పేలవమని, శైలీ ప్రౌఢిమ లేదని పలనాటి వీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుట సమంజసము కాదు.

4.భావము: పలనాటియుద్ధము మతయుద్ధము. శైవవైష్ణవమతవిజయప్రతిపాదకము. అది శ్రీనాథకృతమగునది కాదు. కాఁబట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథ కృతము కాదు.

పలనాటియుద్ధము మతయుద్ధము కాదు. పురుషాధిపత్యయుద్ధము. స్త్రీపురుష మంత్రిపదవులు కారణము. పలనాటివీరచరిత్ర వైష్ణవమతవిజయప్రతిపాదకము కాదు. వైష్ణవమతవిజయప్రతిపాదకమను భావము భ్రాంతిమూలకము. పలనాటివీరచరిత్రలోని ప్రధానప్రత్యర్థులు నాగమ్మ, బ్రహ్మనాయుడు. నాగమ్మ శివభక్తురాలు. బ్రహ్మనాయుడు వైష్ణవమతప్రచారకుడు. నాగమ్మ శైవమతప్రచారము చేయలేదు. బ్రహ్మనాయుడు శైవమతనాశనము చేయలేదు. మాచెర్ల చెన్నకేశవస్వామి తోపాటు శ్రీశైలమల్లికార్జునస్వామి బ్రహ్మనాయుని ఇష్టదైవము. పలనాటి యుద్ధమునకు ఫలితము నాగమ్మపక్షములోని నలగామరాజునకు విజయము. బ్రహ్మనాయుని పక్షములోని పెద్దమలిదేవరాజునకు మరణము. శైవమునకు శైవలము పట్టలేదు. వైష్ణవమునకు వైజయంతి పుట్టలేదు. కాఁబట్టి పలనాటివీరచరిత్ర వైష్ణవమతవిజయప్రతిపాదకమని భ్రాంతికారణముగ పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుట సిద్ధాంతము కాదు.

5.భక్తి : బాలచంద్రయుద్ధభాగమునందు శ్రీనాథుడు "మాచెర్ల చెన్నుని మదిలోన దలచి"నట్లు, తాను "మాచెర్లచెన్నకేశవపాదసేవారతుఁడ"నని చెప్పినట్లు, మాచెర్ల చెన్నకేశవుడు తన కలలో వచ్చి పలనాటివీరుల భాగవతము రచియించి, అంకిత మొనరింపు" మని తెలిపినట్లు కలదు. శివభక్తుడైన శ్రీనాథుడు ఇట్లు రచించుట పొసగదు. వైష్ణవుడైన శ్రీనాథుడు రచించుట పొసగును. కనుక పలనాటి వీర చరిత్ర కర్త వైష్ణవుడైన మఱొక శ్రీనాథుడు.

శ్రీనాథుడు శివభక్తుడే. వైష్ణవుడైన మఱొక శ్రీనాథుడు లేడు. ఉన్న ఒక్క

శ్రీనాథుడు వీరశైవుడు కాడు. హరిహరాభేదభావము కల ఈశ్వరార్చనక ళాశీలుడు. శృంగారనైషధమునందు విష్ణువును (1ప.1అ) హరవిలాసమునందు కంచివరదరాజస్వామిని (1ప.1అ.) భీమేశ్వరపురాణమునందు రాధామాధవులను (3ప.1ఆ.) స్తుతించిన శ్రీనాథుడు పలనాటివీరచరిత్రయందు మాచెర్ల చెన్నకేశవుని మదిలోన దలచుట, పాదసేవారతుడగుట, కలలోన గాంచుట పొసగును. "శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ" అని బాలచంద్రయుద్ధభాగమునందు కలదు. కాఁబట్టి మాచెర్ల చెన్నకేశవుడు కారణముగ పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము కాదనుట సముచితము కాదు.

6.కాలము : వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు పలనాటివీరచరిత్ర "ద్విప దప్రబంధము" ప్రసక్తికలదు. క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభి రామమను సంస్కృతరూపకమునకు అనుసరణము. "ద్విపదప్రబంధము"ప్రసక్తి ప్రేమాభిరామములోనిదగును. పలనాటివీరచరిత్ర ద్విపదకావ్యము ప్రేమాభి రామము కంటె పూర్వగ్రంథము. కాఁబట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము కాదు.

పలనాటివీరచరిత్ర ద్విపదప్రబంధము ప్రసక్తి వల్లభామాత్యుని క్రీడాభిరా మమునందు కలమాట నిజము. (116ప.) క్రీడాభిరామము రావిపాటి త్రిపురాం తకుని ప్రేమాభిరామమను సంస్కృతరూపకమునకు అనుసరణమని క్రీడాభిరామ మునందే కలదు. (33వచ.) కాని ప్రేమాభిరామనాటకము ఉపలబ్ధముకాలేదు. క్రీడా భిరామములోని ప్రత్యంశము ప్రేమాభిరామమునందు ఉండితీరవలసిన ఆవశ్యక ము లేదు. నాటకోచితము కాని ఘట్టము ఉండకపోవుటయే తథ్యము. పలనాటివీ రచరిత్ర ద్విపదప్రబంధము ప్రసక్తి క్రీడాభిరామమునందు నాటకోచితము కాని ఘట్టమునందు కలదు. అది వల్లభామాత్యుని అమూలకరచనము. ప్రేమాభిరా మమునందు ప్రసక్తము కాని పలనాటివీరచరిత్రద్విపదప్రబంధము ప్రేమాభిరా మము కంటె పూర్వగ్రంథము కాదు. కాఁబట్టి వల్లభామాత్యుని క్రీడాభిరామ ములోని పలనాటివీరచరిత్ర "ద్విపదప్రబంధము" ప్రసక్తి కారణముగ పలనాటివీర చరిత్ర శ్రీనాథకృతము కాదనుట నిశ్చితార్థము కాదు.

ఇక పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమనుటకు సాధనములివి :

1. గ్రంథస్థనిదర్శనము : బాలచంద్రయుద్ధభాగమునందు,

"వలను భారద్వాజవంశవర్ధనుడ
కవిసార్వభౌముడ ఘనత గన్నట్టి
శ్రీనాథు డనువాడ శివభక్తిపరుడ

xxx xxx xxx

మంజరీద్విపదగా మన్నించి నేను
చెప్పఁబూనితి వచఃశ్రీ మెరయంగ" పుటలు1-2.

అని కలదు. శృంగారనైషధాదులు రచించిన శ్రీనాథుడు భారద్వాజవంశవ ర్ధనుడు. కవిసార్వభౌముడు. ఘనత గన్నట్టి శ్రీనాథుడు. శివభక్తిపరుడు. బాలచం ద్రయుద్ధభాగము మంజరీద్విపదకావ్యము. ద్వితీయాక్షరప్రాసము లేని ద్విపద మంజరీద్విపద. కాఁబట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

2.రాజాస్థానపరిచయము : బాలచంద్రయుద్ధభాగములోని నలగామరాజు కొలు వుకూటము వర్ణనము, కొలువుశృంగారము వర్ణనము కవి రాజాస్థానపరిచ యమునకు కరదీపికలు.

"మౌక్తిక మంజీరమంజుపుంజంబు
వ్రేలాడుచుండెను వివిధవర్ణముల
ఘనవితానమ్ములు కట్టిరి మీద
నిలువుటద్దంబులు నిలిపిరి దిశల
తంతుపటములు (విస్తరముగ బరచి)
వన్నెల పటములు వానిపై బరచి
పరచిన వానిపై పంచవర్ణముల
రత్నకంబళములు రంగుగా బరచి
కాంచననవరత్నఖచితమైనట్టి
పీఠ మొక్కటి దెచ్చి కొల్వునకు
నిలిపిరి దిక్కుల నిగ్గులు దేర" పుట16.

"కస్తూరిరసమును గలిపిన యట్టి
శ్రీచందనమును మేనచెలువుగా బూసి
తగటు కూసంబులు ధరియించి తలకు
ఒక వింత యుష్ణీష మొప్పుగా గట్టి
నవరత్నమాల కంఠంబున వ్రేల
డంబుగా కర్ణకుండలములు మెరయ
భుజకీర్తు లనియెడు భూషలు దాల్చి
మేనికి రక్షయై మించు తాయెతులు
దండచేతుల రెంట ధారణచేసి
మురుగులు గొలుసులు ముంజేతులందు
తిరముగా వ్రేళ్ల ముద్రికలను బెట్టి

నవరత్నఖచితంపు నడికట్టు దాల్చి
గండపెండేరంబు కాలికి బెట్టి
బంగారు దుప్పటి పైనను గప్పి
పావుకోళ్లను రెండు పదముల దొడిగి
కటికివారలు మ్రోల కనుపించి పొగడ
ఈవలావల జేరి హెచ్చరింపంగ
వేత్రహస్తులు గూడి విచ్చలవిడిని
సందడి దూరమై చనునట్లు చేయ
(రహిమించ) నంతఃపురంబును వెడలి
కొలువున కేతెంచి కుతుకంబు మీర
నిలిచె శృంగారంబు నేర్పును గనగ" పుట17.

ఇది పెదకోమటివేమారెడ్డి విద్యాధికారి, అల్లాడవీరభద్రారెడ్డి ఆస్థానవిద్వాంసుడును అయిన శ్రీనాథుని కర్తృత్వమునకు గండపెండేరము కైసేయునది. కాఁబట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

3. నాట్యశాస్త్రవ్యుత్పత్తిప్రతిఫలనము : శ్రీనాథుడు సకలవిద్యాసనాథుడు. ఆ సకలవిద్యల సౌరభమును ఆతని కృతులందు గుబాళించును. అది శ్రీనాథుని వ్యుత్పత్తిప్రతిఫలనము[162]. బాలచంద్రయుద్ధభాగమునందు నాట్యశాస్త్రవ్యుత్పత్తి ప్రతిఫలనము కలదు.

"మదను పట్టుపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచిత బహురాగముల

xxx xxx xxx

సమపాదయుతమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
కైకోలు విడుదలల్ ఘనకళాశైలి
కైముడి కట్నముల్ కనుపింపజేసి
వెలయంగ తొమ్మిది విధములైనట్టి
భూచారినాట్యంబు పొందుగా నిలిపి
పదునారు విధములై పరగినయట్టి
ఆకాశచారియు నమరంగ నాడి
అంగహారాఖ్య గలట్టి నాట్యంబు

విదితమౌ తొమ్మిది విధముల నాడి
గతిచారిభేదముల్ గనుపడునట్లు
భ్రమణసంయుతదీప్త పటిమ మీరంగ
పాణిభేదములను బాటించి చూపి
స్థానిక సంచయ సంయుక్తి అమర
ప్రేరణి దేశిని ప్రేంఖణశుద్ధ
దండికాకుండలి తగు బాహుచారి
సప్తతాండవములు సల్పె చిత్రముగ
సభవార లాశ్చర్యసంయుక్తులైరి.
తరువాత నిరుమేల దగు చెలు లమర
సంయుతాసంయుతాచలనసంకుచిత
నానార్థకరములు నాట్యహస్తములు
శిరమును చూపులు చెక్కిళ్లు బొమలు
దంతోష్ఠకంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగవక్షముల్ మొదలుగా నెన్న
అంగంబు లారు ఉపాంగంబు లారు
ప్రత్యంగసముదయం బారునుం గూడి
యెనిమిది పదియగు నెసగు నంగంబు
లమరంగ నభినయంబాశ్చర్యముగను
మాచర్ల చెన్నుని మహిమంబు దెలుపు
ఆంధ్రసంస్కృతవాఙ్మయాదిగీతముల
భావంబు లెస్సగా ప్రకటంబు చేయ
చూచి రంభాదులు చోద్యంబు నొంది
శిరసులు వంచియు సిగ్గును జెంది(రి) ". పుటలు 18-19.

ఇది జానపదకవి రచింపఁ గలిగినది కాదు. జ్ఞానపథకవి మాత్రమే రచింపఁ గలిగినది. సకలవిద్యాసనాథుడైన శ్రీనాథుడు జ్ఞానపథకవి. కాఁ బట్టి పలనాటివీర చరిత్ర శ్రీనాథకృతము.

4. శైలీశబ్దప్రయోగము : శైలీశబ్దము చరిత్ర పూర్వోక్తము[163]. పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలోని శైలీశబ్దప్రయోగము నిర్ధారకప్రయోగము కాదు. పాఠాంతరగ్రస్తము. శ్రీనాథుని శృంగారనైషధములోని శైలీశబ్దప్రయోగము పాఠాంతర గ్రస్తము కాదు. నిర్ధారకప్రయోగము. శ్రీనాథునికి పూర్వము, తర్వాత కూడ శైలీశబ్దనిర్ధారకప్రయోగము మృగ్యము. అట్టిది బాలచంద్రయుద్ధభాగమునందు మాత్రమే కలదు. అది పూర్వోదాహృతమైన నాట్యవర్ణనఘట్టములోని

"ఘనకళాశైలి." ఈ కళాశబ్దపూర్వకమైన శైలీశబ్దప్రయోగము. శ్రీనాథకవితాముద్రా ముద్రితము. కా॥ బట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

5. పూర్వకవితాచర్వణము : శ్రీనాథుని ప్రస్ఫుటకవితాలక్షణము పూర్వక వితాచర్వణము. అది శృంగారనైషధ, హరవిలాస, భీమేశ్వరపురాణ, కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్యములందు పుష్కలము[164]. బాలచంద్రయుద్ధభాగమునందును పూర్వకవితాచర్వణము సమధికము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తి ధీర స్తత్ర నముహ్యతి"

అను భగవద్గీతశ్లోకమునకు అనుసరణము:

"ఇటువంటి మానవు డీ దేహ మెడలి
పోయి కొన్నాళ్లకు బుట్టును మరలి
కర్మరహస్యముల్ గాంచిన వారు
ద్రవ్యంబునకు నవస్థాద్వయమిట్లు
తనరింపుచుందురు తద్‌జ్ఞులు గనుక." పుట41.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ"

అను భగవద్గీతశ్లోకమునకు ఆంధ్రీకరణము.

"సకలధర్మంబులు సరవి త్యజించి
నన్నొక్కనినె శరణం బందితేని
సర్వపాపంబులు సమయజేయుదును
వగవకు మదిలోన వలదు భయంబు" పుట56.

"తతః ప్రత్యాగతే కాలే భిన్ద్యా ద్ఘటమివాశ్మని"

అను భారతములోని కణికోక్తికి అనుసరణము.

"పగవారియెడ దయ పాటింపదగదు
హత మొనర్చుట మంచి దనువైన వేళ
భాండంబు నెగబట్టి బలురాతిమీద
వేసి పగల్చిన విధమున మించి
తరిచూచి శత్రుని దండింపవలయు" పుట85.

"ఏష కర్ణో రణే భాతి మధ్యాహ్న ఇవ భాస్కరః
నివర్తయ రథం కృష్ణన్ జీవన్ భద్రాణి పశ్యతి"

అను భారతశ్లోకమునకు తిక్కన ఆంధ్రీకరణమైన,

"పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచునున్నవాఁడు
మన రథంబింక మాధవా! మఱల నిమ్ము
బ్రదికియుండిన శుభములఁ బడయవచ్చు"

అను పద్యమునకు అనుసరణము:

"పార్థునంతటివాడు ప్రధనరంగమున
కర్ణుని రాకడ గని భీతి నొంది
బ్రతికితే శుభములు పడయంగవచ్చు
అరదంబు మరలింపుమయ్య శ్రీకృష్ణ
అని విన్నపము చేసె ఆశ్చర్యభంగి" పుట106.

వాల్మీకిరామాయణమునందు రాముడు సువేలాద్రిపైనుండి, రావణుడు ప్రాసాద శిఖరమునుండి శత్రుశిబిరములను చూచినట్లు, బాలచంద్రయుద్ధభాగమునందు బాలచంద్రుడు నల్లగొండశిఖరమునుండి రణరంగమును చూచినట్లు కలదు. అంతే కాదు. భట్టనారాయణుని వేణీసంహారనాటకమునందలి తృతీయాంకప్రవేశక ములోని రాక్షసీరాక్షసుల వృత్తాంతము, బాలచంద్రయుద్ధభాగములోని పిశాచగ ణముల స్వేచ్ఛావిహారమునందు నీడ కట్టును. పూర్వకవితాచర్వణమిదియెల్ల శ్రీనాథకవితా పురస్కారము. కాఁబట్టి పలనాటివీరచరిత్రము శ్రీనాథకృతము.

6. ఆంధ్రదేశాభిమానము :ఆంధ్రదేశీయములైన ఆచారవ్యవహారములను, ఆహారపదార్థములను, స్థానికవిషయములను, స్థానికప్రకృతిని, సంప్రదాయములను సంస్కారములను గ్రంథస్థము చేయుట ఆంధ్రదేశాభిమానము. అది శ్రీనాథుని ఆత్మీయతాలక్షణము. ఆంధ్రదేశాభిమానపురస్కృతమైన శ్రీనాథుని ఆత్మీయ తాప్రతిఫలనము శృంగారనైషధ, హరవిలాస, భీమేశ్వరపురాణ, కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్యములందు అగ్రేసరము. బాలచంద్రయుద్ధభాగమునందును భాగ ధేయము.

"దీర్ఘమై నునుపులై తీరైన కురుల
కూర్చి నున్నగ దువ్వి కొప్పు ఏగీలించి
బంగారు పూచేర్లు బాగుగా జుట్టి
మదను కుంతముకు సమంపు పాపటను
మణిహేమమౌక్తికమండితం బైన
చేర్చుక్క చేరిచి చిత్రంబుగాను
పొలుపొంద శశిరవిభూషణయుగము
పాపట కిరువంక భాసిల్ల నిలిపి
మాణిక్యహాటకమయబింబ మొకటి

తలవెన్క మెరయగ దట్టించి రెలమి

XXX XXX XXX

ముక్కున ముత్యంబు ముంగర నిలిపి

XXX XXX XXX

వీనులు మితిలేని విభవంబు నొంద
దీపితరత్నమౌక్తికహేమయుక్త
తాటంకభూషణద్వయము గీలించి
ముత్యాల కుచ్చులు మునికొని వ్రేలు
బవిరలు కుంటేండ్లు పసమీర బెట్టి
కర్ణాగ్రదేశముల్ కాంతుల నీన
కుప్పెల ముత్యాల కుచ్చులు రెండు
ఘనకుంతలంబుల గదియించి మరియు

XXX XXX XXX

బంగారు పువ్వుల పట్టు కంచుకము
తొడిగి నేరువుతోడ దూముడి వేసి
ముత్యాల రత్నాల మురిపెంపు పేర్లు
పతకాలు పవడాలు బన్నసరాలు
వక్షః స్థలమ్మున వరుసగ వేసి
కంబుసన్నిభమైన గళభాగమందు
ముత్యాల పట్టెడ మదముతో బెట్టి

XXX XXX XXX

చెలువొందుచుండెడు చేతుల రెంట
రత్నాలు చెక్కిన రమ్యాంగదములు
దండకడియములు దంటతాయెతులు
మక్కువతో గట్టి మనికట్టు నెగువ
నీలాల గాజులు నేర్పున దొడిగి
పచ్చల కంకణాల్ భాసిల్ల బెట్టి
చామలాకడియముల్ సంధింపజేసి
సొబగైన చేకట్లు సొమ్ములు దాల్చి
మాణిక్యతపనీయమంజులోర్మికల
అంగుళంబులనెల్ల అమరంగ కూర్చి
పాపట సవరించి బంగారు తగటు
ముయ్యంచు చేలంబు మోహన మొప్ప

కటియందు సంధించి గజ్జెలు వ్రేలు
తపనీయతాంచిని దట్టించి ముడిచి
పయ్యెద రొమ్మున బాగుగ జేర్చి
అందెలు గొలుసులు నమరంగబెట్టి

xxx xxx xxx

శృంగార మొనరింప చెలగి మాంచాల" పుటలు71-73.

ఇది మాంచాలను ఆమె చెలికత్తెలు అలంకరించిన తీరు. ఇందు కొప్పునకు బంగారు పూచేర్లు, పాపట చేర్చుక్క, పాపట ఇరువంకల సూర్యచంద్రులు, తలవెన్క బింబము, వీనుల తాటంకములు, ముత్యాల కుచ్చులు, బవిరలు, కుంటేండ్లు, కుప్పెల ముత్యాల కుచ్చులు, ముత్యాల పేరులు, రత్నాల సరులు, పతకాలు, పవడాలు, బన్నసరాలు, ముత్యాల పట్టెడ, దండకడియములు, నీలాల గాజులు, పచ్చల కంకణాలు, చామలాకడియములు, చేకట్లు, ఉంగరములు, బంగారు తగటు, గజ్జెల ఒడ్డాణము తెలుగు నగలు. అవి గ్రంథస్థము చేయుట శ్రీనాథుని ఆంధ్రదేశాభిమానపురస్కృతమైన ఆత్మీయతాలక్షణము. కాఁబట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

7. హరవిలాసప్రమేయము : బాలచంద్రయుద్ధభాగమునందు బాలచంద్రుడు తాను పూర్వజన్మములందు లోహితాస్యుడు, ప్రహ్లాదుడు, సిరియాళుడు, అంగదుడు, కుశుడు, అభిమన్యుడు అని ప్రకటించును. లోహితాస్యప్రహ్లాదాంగదకుశాభిమన్యుస్మరణము సర్వకవిసాధారణము. సిరియాళస్మరణము శివకవికి లేదా శివభక్తిపరుడైన కవికి మాత్రమే ప్రత్యేకము. శివకవియైన పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు తండ్రి సిరియాళుడు, తల్లి సంగవ్వ ఉరఫు తిరువెంగనంగ, తనయుడు సీరాలుడు అని కలదు. శివభక్తిపరుడైన శ్రీనాథుని హరవిలాసమునందు తండ్రి చిఱుతొండనంబి, తల్లి తిరువెంగనాంచి, తనయుడు సిరియాళుడు అని కలదు. బాలచంద్రయుద్ధభాగమునందు ఇట్లు కలదు.

"ఏలెడు శివకంచి యేకామ్రపతికి
చిఱుతొండనంబి నా చెలగు భక్తునికి
శెంకెల శిరువమ్మ సీమంతినికిని
సిరియాళుడన బుట్టి చెన్నొందినాడ." పుట104.

ఇందు తండ్రి చిఱుతొండనంబి. తనయుడు సిరియాళుడు. తల్లి శెంకెలశిరువమ్మ అని కలదు. తిరుశబ్దము చిఱు అయి శిరు అగును. తిరువెంగనాంచి శిరువమ్మ అగును. సంగవ్వ శెంకెల కావచ్చును. తండ్రి కొడుకుల పేరులు

హరవిలాసమునందు వలెనే కలవు. బసవపురాణము ప్రమేయము లేదు. హరవిలాస ప్రమేయము కలదు. కుమారసిరియాళస్మరణము శివభక్తిపరుడైన శ్రీనాథునికే ప్రత్యేకము. కా॥ బట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

8. ఈశ్వరార్చనకళాశీలము: ఈశ్వరార్చనకళాశీలుడైన శ్రీనాథుని భావాంబర వీథిలో ఈశ్వరసాక్షాత్కారము సహజము. అది శృంగారనైషధ, హరవిలాస, భీమేశ్వరపురాణ, కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్యములందు కలదు[165]. బాలచంద్రయుద్ధభాగమునందును కలదు. బాలచంద్రాస్తమయము తోపాటు సూర్యాస్తమయమును జరిగినది. చీకటి దట్టముగ వ్యాపించినది. చరాచరజగత్తు నల్లబడిపోయినది. అప్పుడు,

"శివుడేడి? కైలాసశిఖరంబు నేది?
సోముడు వృషభంబు సురనది యేడ?
యెక్కడ కేగెనో యెఱుగరాదంచు
సంశయస్వాంతయై శైలజ వెదకె." పుట118.

శైలజ నిజముగ అప్పుడు శివుని వెదకెనో లేదో గాని, మాయాంధకారబంధురమైన జగత్తున ఎప్పుడును శివుని వెదకునది శ్రీనాథుడు. ఇది శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలకలితమైన ఆత్మీయతాప్రతిఫలనమునకు చిహ్నపతాక. కా॥ బట్టి పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమే.

గ్రంథస్థనిదర్శనము, రాజాస్థానపరిచయము, నాట్యశాస్త్రవ్యుత్పత్తిప్రతిఫలనము, శైలీశబ్దప్రయోగము, పూర్వకవితాచర్వణము, ఆంధ్రదేశాభిమానము, హరవిలాసప్రమేయము, ఈశ్వరార్చనకళాశీలము నిర్ధారకసాధనములుగ పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతము.

## కాలము

బాలచంద్రయుద్ధభాగమునందు "కవిసార్వభౌముడ ఘనత గన్నట్టి శ్రీనాథుడనువాడ"అని కలదు. (పుట1.) శ్రీనాథుడు కన్నట్టి ఘనత కనకాభిషేకము. కనకాభిషేకసత్కారము, కవిసార్వభౌమబిరుదమును ఏకకాలికము. ఆ కాలము భీమేశ్వరపురాణమునకు అనంతరము. కాశీఖండమునకు పూర్వము. స్థూలముగ 1431 వ సంవత్సరము. కావున పలనాటివీరచరిత్ర రచనాకాలము 1431తర్వాత కావలయును. మఱి శ్రీనాథుడు వయసు మీఱిన వాడయి, మాచెర్ల చెన్నకేశవుని గుడిలోనే చెప్పి, ఏడుగురు శిష్యులచేత భారతమంత పెద్దదైన పలనాటివీరచరిత్రను రెండు నెలలలో పూర్తి చేసెనని ఒక ఐతిహ్యము కలదు. అంతేకాదు.

శ్రీనాథుడు పలనాటిసీమయందు పర్యటనము చేసినట్లు "రసికుఁడు పోవఁడు పల్నాడు" మొదలైన చాటుపద్యములు కలవు. 1431 తర్వాత శ్రీనాథుని పలనాటిసీమపర్యటనము రాజమహేంద్రవరరాజ్యపతనానంతరము సావకాశము. శ్రీశైలమల్లికార్జునస్వామిని సందర్శించి శివరాత్రిమాహాత్మ్యమునందు రచించిన అనంతరము. మాచెర్ల చెన్నకేశవస్వామిని సందర్శించి పలనాటివీరచరిత్ర రచించుట సంభవము. శివరాత్రిమాహాత్మ్యరచనాకాలము 1445వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి పలనాటివీరచరిత్రరచనాకాలము స్థూలముగ 1446 వ సంవత్సరము.

## కృతిసమీక్ష

పలనాటిసీమ పరిణాహసీమ కాదు. పలనాటి రాజ్యము మహారాజ్యము కాదు. వెలనాటి గొంకనృపతి - అనుగురాజు భార్య మైలమదేవికి అరణముగా ఇచ్చిన అల్పరాజ్యము. అది రెండు ముక్కలు చేసినది బ్రహ్మనాయుడు. ఆ రెండు ముక్కలను ఒక్కటి చేసినది నాగమ్మ. బ్రహ్మనాయుడు నారీద్వేషి కుక్కుట ద్యూతవ్యసని. మతప్రచారకుడు. నాగమ్మ మహారాజనీతిజ్ఞురాలు. మతప్రభావమున బ్రహ్మనాయునికి శ్రీమహావిష్ణువు అవతారమని ఆనాడు స్వపక్షమున ముద్రపడినది. అవిచారితరమణీయముగ సంఘసంస్కర్త అని ఈనాడు చరిత్ర పక్షమున ముద్రపడినది. చాపకూడు సర్వమతసర్వవర్ణసహపంక్తిభోజనము కాదు. "ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై సామంతనృపతులు చాపకూడు" అని వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు స్పష్టముగ కలదు. (122ప.) ఏకకార్యస్థులైన సామంతనృపతుల చాపకూడు సర్వమతసర్వవర్ణసహపంక్తిభోజనము కాదు. సంఘసంస్కరణార్థము కాదు. సంగరసంస్కరణార్థము. అయినను పలనాటి వీరచరిత్ర అపరభారతమయినది! తథ్యమిథ్యామధ్యస్థమైనను పలనాటివీరచరిత్ర ఆంధ్రదేశీయమైన అపూర్వకావ్యము. ద్విపదకావ్యము. వీరగాథ. బాలచంద్ర యుద్ధభాగమునందు కల్లుప్రతిష్ఠ భట్టురాయబారము. బాలచంద్రుని బొంగరాలాట. మాంచాల బాలచంద్రుని యుద్ధరంగమునకు పంపుట. కొమ్మరాజు హితోపదేశము. బాలచంద్రకన్నమదాసుల సంవాదము. అనపోతు ఆత్మహత్య. బాలచంద్రుని యుద్ధము ముఖ్యములైన ఘట్టములు.

కల్లుప్రతిష్ఠ అనగా భూతరాట్స్తంభ ప్రతిష్ఠ. నాగులాదేవీశివసింగులను ప్రేయసీప్రియుల ఆత్మహత్యలకు కారకుడై, శివపురికోటను సర్వధ్వంసము చేసి, శివపురి కోటలోని భూతరాట్స్తంభమును, త్రిపురాంతకమునకు తరలించి త్రిపురాంతకమునుండి కార్యమపూడికి మరలించి, పలనాటియుద్ధమునకు

పరమసాక్ష్యముగ యుద్ధరంగమునందు బ్రహ్మనాయుడు ప్రతిష్ఠించుట కల్లుప్రతిష్ఠ. భూతరాట్స్తంభమునకు బ్రహ్మనాయుని నివేదనమిది:

"ఘనకార్యమపూడి కలనులో పలను
నలగామరాజుతో నయముగా బోరి
మడియంగ వచ్చిరి మన్నెనాయకులు
రణరంగపట్టుపు రాజవై నీవు
సాక్షివై యుండవే సర్వభూతేశ
భుక్తి నిచ్చెద నీకు భూతేశ డెరుగ
దాహంబు తీర్చుకో తడుచు రక్తమున" పుట6.

ఇట్లు నివేదించి, భూతరాట్స్తంభమునకు బ్రహ్మనాయుడు ఇచ్చిన భుక్తి పిండివంటలు, పరమాన్నము, పప్పుప్రకూరలు, పానకములు, జున్ను, పచ్చళ్లు, నెయ్యి, ఖండశర్కర, కందగడ్డలు కల కుంభములు మాత్రమే కాదు; "ఘనమైన పోతుతో గావు" కూడ. (పుటలు6-7)

బ్రహ్మనాయుని మంత్రాంగమున పెద్దమలిదేవరాజు నలగామరాజు దగ్గఱకు పంపిన భట్టు నిర్వహించిన రాయబారము భట్టురాయబారము. (పుటలు19-24)

"పగవృద్ధి బొందించు భ్రష్టులె కాని
అడగించు నేర్పరు లవనిలో లేరు" పుట60.
"పోరు మంచిది గాదు భూమి నెక్కడను
పాడౌను దేశంబు పగ మించెనేని
ప్రజలెల్ల నశియించి పారిపోవుదురు" పుట19.

అని భట్టు పలు నీతి వాక్యములు పలికినను, "నరసింగభూపతి నమ్మిక మీరు తమ్ము డా మలిదేవధరణీశు కడకు పంపు" డనుట, నాగమ్మ మంత్రాంగమున నలగామరాజు పెద్దమలిదేవరాజు బలమును తృణీకరించుట, భట్టు బ్రహ్మనాయుని ప్రతాపమును ప్రశంసించుట మాత్రమే గాక,

"గురిజాలపురమును కోటతో గూడ
పెరికి వైతురు క్రుంగువేరులతోడ
నిన్ను నీ తమ్ముని నీకైనవారి
నీదు నాగమ్మను నీ కూర్మిసఖుల
శిక్షింతురో రాజ సిద్ధ మీ మాట" పుట23.

అని భట్టు నలగామరాజుని ధర్షించుటవలన భట్టు రాయబారము విఫలమైనది.

అనపోతును కరణమును చేసి, మాడచిని రాణివాసమునకు రక్షకురాలిని చేసి, పెద్దమలిదేవరాజు, బ్రహ్మనాయుడు కార్యమపూడి కదనరంగమునకు కదలి పోవుదురు. మంత్రియైన బాలచంద్రుడు బాలమిత్రులతో గుమ్మడికాయలు మొదలైన ఆటలాడి, ఎంత వారించినను తల్లి ఐతమ్మను ఎత్తిపొడిచి బొంగరాలాట ఆడును. అమ్మలక్కలు చూడవత్తురు. బాలచంద్రుడు.

"వినయమౌ నా మాట వినుడి మీరెల్ల
దూరాన నుండుడి తొలగి కన్గొనుడి
అని చెప్పి బొంగరం బరచేత బట్టి
ముత్యాలజాలెను ముదమున జుట్టి
చేయెత్తి హుంకించి స్థిరబలంబునను
వేసిన వడిమీర వేగమె పోయి
సంయమీశుండను చత్రాతి దాకి
మింటి మీది కెగసి మెరుగులు క్రమ్మ
అన్నమ్మ యను పేర నలరుచున్న
చక్కని కోమటి జలజాయతాక్షి
మీఁ గాలికిం దాకి మించిన ములికి
అరకాలు దిగి వచ్చి అవనికి దాకె" పుట47.

అన్నమ్మ మూర్ఛపోవును. అమ్మలక్కలు సేదతేర్తురు. మూర్ఛ నుండి లేచిన అన్నమ్మ ముకుళితహస్తుడై ముందరనున్న బాలచంద్రుని చూచి బహుకోపమున-

"ఓరి దురాత్ముడ ఓరి దుర్మార్గ
క్రిందు మీ దెరుగక కెరలు చున్నావు
గర్వమేటికి నీకు కాంతలయెడను
కలిగిన దినవలె గట్టంగవలయు
ఎరుకు మాలిన చేష్టలేల చేసితివి
మురియంగనేల నీ పొంగెల్ల నణగ
ముదిరె మదంబు నీ మురిపెంబు క్రుంగ
తగ మల్లభూపతి ధనమెల్ల నీదు
సదనంబు జేరిన సత్తువ నుండి
త్రుళ్లుచునున్నావు దుష్టచిత్తుండ
సమరంబులో నిన్ను శత్రులు గ్రుమ్మ
నడిచెడు పదముల నారసా లేయ
చూచెడు కనులకు సూదులు గ్రుచ్చ

మీ యయ్యలెల్లను మించిన బలిమి
చేరి వైరుల తోడ శ్రీయుద్ధభూమి
ఉప్పొంగుచున్నవా రుర్వీశు నెదుట
వారిలో గలయు నీ వడి కానవచ్చు
పోతు సింహము రీతి పొదలు చున్నావు
మదము పట్టిన గిత్త మాడ్కి మేడపిని
ఉన్నావు కావర ముడిగెడుగాక" పుటలు47-48.

అని తూలనాడును. ఇందు మల్లభూపతి ధనమెల్ల బ్రహ్మనాయుని సదనము చేరుట, బ్రహ్మనాయుడు అతని సోదరులు యుద్ధభూమి నుండుట కోమటి అన్నమ్మకు కూడ తెలిసిన సంగతి. మల్లభూపతి ధనము సంగతి ఏమోగాని బ్రహ్మనాయుని యుద్ధభూమి సంగతి బాలచంద్రునికి తెలియదు. బాలచంద్రుడు అన్నమ్మను కరుణింపుమని, కట్టు కట్టించి, అయిదువందల మాడలు అర్పించి,

"అమ్మ మాతల్లి నీ వైతమ్మ మారు
మా యయ్యలెల్లను మలసి దండెత్తి
పోయి యే దిక్కున బూని యున్నారు
తలపోసి చెప్పవే తరుణిరో నేడు" పుట48.

అని బ్రతిమాలును. అన్నమ్మ,

"మీ యయ్య చనిన సమిద్రంగ మరయ
ఇలమీద నెచటనో యేను నెరుంగ
ఐతమ్మ యెరుగు న న్నడుగకు మన్న" పుట49.

బాలచంద్రుడు ఇంటికి వెళ్లి తల్లి ఐతమ్మను "నయమొప్ప నాయుడు నాయకులెల్ల ఎక్కడి కరిగిరో యెరిగింపవమ్మ" అని అడిగిన, ఐతమ్మ మూర్ఛ పోవును. బాలచంద్రునికి తెలియనీయని బ్రహ్మనాయుని యుద్ధసన్నాహము, కడకు బాలచంద్రునికి తెలియుటకు బొంగరాలాట బంగారుబాట.

మాంచాల బాలచంద్రుని భార్య. కాని భర్తను ఎఱుగదు. రాక రాక వచ్చినను, రణరంగమునకు పోవు భర్తను తాకరాదు. అయినను మాంచాల-

"రతిరాజసుందరా రణరంగధీర
కమలబాంధవతేజ కరుణాలవాల
వినతాత్మజుని లావు వెస నీకు గలుగు
సామీరి కుండిన సాహసం బబ్బు

కృష్ణుని కీడుగా కీర్తి ఘటిల్లు
రవికాంతియుతుఁడవై రంజిల్లుచుండి
అలరాజు పగదీర్చు మనుజులతోడ
పటుతర విక్రమవైభవం బలర
శ్రీగిరి లింగంబు చెన్నకేశవుడు
వరము లొసంగగ వర్తిల్లగలరు
శాత్రవవిజయంబు సమకూరు మీకు
"ఈ యాయుధము వడినిచ్చు జయము
కలియుగంబున మీకు ఘనపూజలమరు
అని ప్రాణనాథుని ఆశీర్వదించి,
ఆయుధం బిచ్చిన అతడు గైకొనియె." పుటలు78-79.

పలనాటియుద్ధమునకు ప్రాతిపదిక అలరాజు హత్య. అలరాజు తండ్రి కొమ్మరాజు. పుటపాకప్రతీకాశమైన పుత్త్రవియోగశోకము పుంజీభూతమైనను సహనము కోల్పోని సచ్చరిత్రుడు కొమ్మరాజు. నాగమ్మ రాయబారుల సంధివచనములకు బ్రహ్మనాయుని వీరనాయకులు వీరాలాపములు పలుకునెడ,

"చెవులు రెండును మూసి శ్రీకంఠు దలచి
నయమున కొమ్మభూనాథు డిట్లనియె
చేతికిచ్చిన వాని ఛేదించినట్టి
పాపంబు నెబ్బంగి పాపికోవచ్చు
... ... ...
శరణని వచ్చిన శత్రువునైన
కాచి రక్షించుటే ఖండించు టరయ
కాదని కసిపోవ ఖండింతుమేని
ఇహమున నిందింతు రెల్లవారలును
పరమున నరకమ్ము ప్రాప్తించుసుమ్ము
పగవాని తమ్ముడు పాదంబు బట్టు
రక్షింపడా? మును రామభూజాని" పుటలు85-86.

అనిన కొమ్మరాజు మాటలకు వీరనాయకులు "సంధికార్యమునకు సమ్మతులైరి." కాని బాలచంద్రుని వలన కథ అడ్డము తిరిగినది. అయినను కొమ్మరాజు హితోపదేశము ప్రశంసాపాత్రము.

బాలచంద్రుడు కార్యమపూడికి వచ్చి పెద్దమలిదేవరాజదర్శనము కోరి, సభలో "పదములు దట్టించి బాహువులెత్తి కుప్పించి దుమికిన," కన్నమదాసు

"ఘనరౌద్రభరితుడై ఖడ్గంబు దూసి .... ఖండించివైచెద గనియలు గాగ" అని సభ నుండి పొమ్మనును. బాలచంద్రుడు అవహేళన చేయును. కన్నమదాసు మఱల "ఈ తేప పలికిన నీ కత్తిచేత తల తెగ వేయుదు ధరణీశ నెదుట" అని పదరును. "బ్రహ్మనాయుడు నీకు బంధువు డెట్లొ" చెప్పుమని బాలచంద్రుడు ప్రశ్నించును

"నాయుడు విష్ణువు నారాయణుండు
ప్రకటదయాంబుధి వరము లొసంగె
తగ జనించితి నేను తల్లి గర్భమున
పరమపావనమూర్తి బ్రహ్మనాయునికి
పాదసేవకుడనై పరగినవాడ
.........
జ్యేష్ఠపుత్రు డనంగ చెలగినవాడ" పుట92.

అని కన్నమదాసు సమాధానమిచ్చును. "చెలగి బ్రహ్మన్నకు జ్యేష్ఠ పుత్రుడవు, తలదన్ని పుట్టిన తమ్ముడ నేను" అని బాలచంద్రుడు అనగా కన్నమదాసు "భైరవఖడ్గంబు పడవైచి ధరణి" బాలచంద్రుని కౌగిలించుకొని" తప్పు నాయెడనుండె తమ్ముడా" అనును. ఇది బాలచంద్రకన్నమదాస సంవాదము.

అనపోతు కరణము. బాలచంద్రుని బాల్యమిత్రుడు. ఇతరబాల్యమిత్రులతోపాటు అనపోతు కూడ యుద్ధరంగమునకు బయలుదేరును. దారిలో బాలచంద్రుడు "తమ్ముల కెరిగించి తన మర్మమెల్ల" అనపోతును "ముత్యాల గళమాల ముద్దుటుంగరము మరచి వచ్చితి దెమ్మ" అని తిరిగి పంపును. బాలచంద్రుడు త్రిపురాతంకమునకు వచ్చి ఒక ఉత్తరము స్వహస్తమున వ్రాసి రావి చెట్టునకు కట్టి ఇతర మిత్రులతో కార్యమపూడికి పోవును. అనపోతు మేడపికి తిరిగి వచ్చి మాంచాలను అడుగును. "బాలచంద్రుడు నీకు పట్టము గట్టె అందుచే రణమున కరుగంగగూడదు" అని మాంచాల చెప్పును. అనపోతు బాలచంద్రుని సాని సబ్బాయిని అడుగును. "ఇది పొల్లుమాట మరచుట దాచుట మావద్ద లేదు. మాయమాటలు చెప్పి మరల పంపించె కనలేక వచ్చితిగద" అని సబ్బాయి చెప్పును. అనపోతు త్రిపురాంతకమునకు వచ్చి, అనపోతును రణరంగమునకు రావలదని బాలచంద్రుడు వ్రాసిన ఉత్తరమును చదువును. బాలచంద్రుని నిష్ఠురము లాడి అనపోతు "సోదరుని వీరవిక్రమయుద్ధవిభవంబు గనగ భాగ్యంబు లేదాయె పాపిని నేను ఈవు పాసిన యట్టి ఈ దేహ మే నొల్ల"నని గరిగమాడచి అను స్త్రీకి జందెము, బిరుదందె ఇచ్చి ఆత్మహత్య చేసికొనెను. ఆమె బాలచంద్రునికి అందజేసెను. రక్తసిక్తమైన యజ్ఞోపవీతము, బిరుదందె చూచి

బాలచంద్రుడు "వారును వీరు నొక్కటియైన శాత్రవచయము హతము గావించి కాముని దళముపై దుమికి పీనుగు పెంటలు చేసి, నరసింగు తలను ఖండించి పంతము తీర్చెద"నని ప్రతిజ్ఞ చేయును. ఇది అనపోతు ఆత్మహత్య. (పుటలు81-82,95-99,100) పలనాటియుద్ధమునకు అలరాజు హత్య ప్రాతిపదిక అయిన, అనపోతు ఆత్మహత్య కార్యపతాక.

బాలచంద్రుని భీషణసంగ్రామమునకు నలగామరాజు సైన్యము పలాయన మంత్రము పఠించసాగినది. నరసింగరాజు ధైర్యవచనములు పలుకసాగెను. బాల చంద్రుడు శత్రుసైన్యములను చాపకట్టుగ నేల గూల్చెను. సమరరంగము-

"ఘనమైన నెత్తురు కాల్వలై నిలిచె
తెగిపడ్డ గజములు దీవులై యొప్పె
నరికిన తురగముల్ నక్రంబులాయె
పొర్లాడు శిరములు బుద్బుదపటలి
కలిగిన పుచ్ఛముల్ కచ్ఛపరాజి
మేటినేత్రంబులు మీనవారంబు
దీర్ఘశిరోజముల్ తీరైన నాచు
మెదడును మాంసంబు మించిన బురద
తరచైన యీటెలు దర్వీకరాళి
పొడియైన భూషణపుంజంబులెల్ల
సైకతనిచయంబు సరవి వర్ణింప." పుట113.

బాలచంద్రుడు నరసింగుని తలగొట్టి బ్రహ్మనాయునికి చూపును. బ్రహ్మనాయుడు బాలచంద్రుని తెగడును. బాలచంద్రుడు బ్రహ్మనాయుని తెగడును.

"పోగొట్టితివి కోడి పోరున భూమి
నిను నమ్మి వచ్చిన నీ మేనమరది
ప్రాణంబు గొన్నట్టి పాపాత్మకుడవు
చెలువు చూడగ బంప చెవుల రాయనను
చండకర్ముడవయి చంపించి తీవు
ఘను వేంకజోదును కలనికి బంపి
మందలో చంపితి మాయ యొనర్చి." పుట117.

బాలచంద్రుడు మఱల యుద్ధము చేసి మరణించును. ఇది బాలచంద్రుని యుద్ధము. ఇవి గాక కర్తృత్వము శీర్షికను ఉదాహరించిన కొలువు కూటము

వర్ణనము, కొలువు శృంగారము వర్ణనము, నాట్యవర్ణనము, పూర్వకవితాచర్వణము, ఆంధ్రదేశాభిమానము, ఈశ్వరార్చనకళాశీలము కృతిసమీక్షకును విషయములే.

## వీథినాటకము

ఇది కూడ శ్రీనాథుడు తెలిపినది కాదు. అంతేకాదు. ఇదొక కావ్యము కాదు. చాటుపద్యసంకలనము. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు కాగితపు ప్రతి మాత్రమే గాక, తాళపత్రగ్రంథము కలదు[166]. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందును తాళపత్రగ్రంథము కలదు[167]. గతశతాబ్దిని ముద్రితమైన గుజిలీప్రతి కలదు. 1924 వ సంవత్సరమునందు ముద్రితమైన గ్రంథము కలదు. 1972 వ సంవత్సరమునందును ముద్రితమైన గ్రంథము కలదు. ఇందు శ్రీనాథుని చారిత్రికచాటుపద్యములు, శృంగారచాటుపద్యములు కలవు. ఇతరుల శృంగారపద్యములును కలవు.

"శ్రీనాథుని వీథినాటకము" అని లింగమగుంట తిమ్మకవి సులక్షణసారమునందు "కుసుమం బద్దిన" అను పద్యముకలదు. (169ప.) అదే పద్యము అట్లే అప్పకవీయమునందును కలదు. (139ప.) అదిగాక "కందుకకేళి" అను మఱొక పద్యము "వీథినాటకము" అని అప్పకవీయమునందు కలదు. (379ప.) అది "వీథినాటకము" అని పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందును కలదు. (235ప.1ఆ.) ఈ రెండు పద్యములును వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు కలవు. ప్రబంధరత్నాకరమునందు "వీథినాటకము" అని మొత్తము ఎనిమిది పద్యములు గలవు. (86, 87, 235ప.1ఆ.; 65ప.2ఆ; 121, 225,ప. 3ఆ.; 47, 123ప.4ఆ.) ఇందు మొదటి పద్యము క్రీడాభిరామమునందు లేదు. అందలిదే అగును. అది వీథినాటకమునందును లేదు. ఒక అర్వాచీనమైన హరిశ్చంద్రనలోపాఖ్యానము తాళపత్రముఖపత్రములందు "కాకుళ్ల తిరునాళ్లు జెప్పిన శ్రీనాథుని వీథినాటకం"అని "హైమగ్రావనితంబ" అను పద్యము కలదు[168]. అది క్రీడాభిరామములోని "వ్యామగ్రాహ్యనితంబ" అను పద్యము. ఇది కూడ వీథినాటకమునందు లేదు. క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమను సంస్కృతరూపకమునకు అనుసరణము. ప్రేమాభిరామము. సంస్కృతవీథీరూపకభేదమగును. అది వీథినాటకము. వీథినాటకము కాదు. అయినను శ్రీనాథుని వీథినాటకము క్రీడాభిరామమే అని ఒక అభిప్రాయము కలదు[169]. కాని సంస్కృతవీథీరూపకము, తెలుగు వీథినాటకము ఒకటి కాదు. అంతేకాదు. శ్రీనాథుని వీథినాటకము నిజముగ వీథినాటకము కాదు. చాటుపద్యముల

సంపుటము. పయి రెండు పద్యములు వినా క్రీడాభిరామపద్యములు శ్రీనాథుని వీథినాటకమునందు లేవు. కడమ వీథినాటకపద్యములు క్రీడాభిరామమునందు లేవు. రెండు క్రీడాభిరామపద్యములు మాత్రమే గాక, గోగులపాటి కూర్మనాథకవి మృత్యుంజయవిలాసములోని "బొమవింటఁ దొడిగిన" అను ఒక పద్యము శ్రీనాథుని వీథినాటకమునందు కలదు[170]. (45ప. 1924, 49ప. 1972.) లింగమగుంట తిమ్మకవి కాలము పదునాఱవశతాబ్ది ఉత్తరార్ధము. గోగులపాటి కూర్మనాథకవి కాలము పదునెన్మిదవశతాబ్ది ఉత్తరార్ధము. పదునెన్మిదవశతాబ్ది ఉత్తరార్ధములోని పద్యము, పదునాఱవశతాబ్ది ఉత్తరార్ధము నాటికే ఉన్న శ్రీనాథుని వీథినాటకమునందు ప్రవేశించినది.! పదునాఱవ శతాబ్ది ఉత్తరార్ధము నాటికే ఉన్న వీథినాటకము శ్రీనాథకృతము కాదు. శ్రీనాథకృతచాటుపద్యములకు కాలక్రమసంక్రాంతమైన, అజ్ఞాతకర్తృకమైన సంకలనగ్రంథము. అది పరమార్వాచీనకాలమునందును ప్రక్షిప్తభూయిష్ఠము. "శ్రీనాథుని వీథినాటకము" వల్లభామాత్యుని క్రీడాభిరామము కాదు. వల్లభామాత్యుని క్రీడాభిరామము "శ్రీనాథుని వీథినాటకము" కాదు. వీథినాటక సంజ్ఞ పారిభాషికము కాదు. వ్యావహారికము.

## కృతిసమీక్ష

శ్రీనాథుని వీథినాటకములోని "దీనరటుంకాల", "అక్షయ్యంబగు", "ధాటీఘోటక", "కుల్లాయెత్తితి", "సర్వజ్ఞనామధేయము", "కవిరాజుకంఠంబు", "కాశికావిశ్వేశుఁ గలిసె", "జగనొబ్బగండాంక", "రాజనందనరాజ", "వీరరసాతిరేక", "రసికుఁడు పోవఁడు", "ఫుల్లసరోజనేత్ర", "కవితల్ సెప్పిన" (1924) "హంసీయానకు" (1972) అను చారిత్రికచాటుపద్యములు శ్రీనాథకృతములే. నానాజాతిస్త్రీల వర్ణనల శృంగారచాటుపద్యములు శ్రీనాథకృతములే అగును.

"సరసుఁడు గాఁడొ జాణ రతిసంపద లేదొ సమృద్ధిరూపమో
మరుని జయించు మోహ మసమానమె యిన్నియుంగల్గి జారవై
తిరిగెద వేల బాల! యతిధీరపు ప్రౌఢవు నీ వెఱుంగవే
నెఱి గృహమేధియన్ పలుకు నీచము దోఁచెఁ గొఱంతదే సుమీ."
46ప.

అను సంవాదపద్యము సరసము. సప్తశతి సరణి.

# కవితారీతులు

శ్రీనాథుడు తన కవితారీతులను భీమేశ్వరపురాణమునందు, కాశీఖండమునందు సూచించెను. అవి భీమేశ్వరపురాణమునందు ఋజుముఖమున, వ్యతిరేకముఖమున కలవు. కాశీఖండమునందు సాదృశ్యముఖమున కలవు. అంతేకాదు. ఒక చాటుపద్యమునందు చాటిన శ్రీనాథుని కవితానిర్వచనము కలదు.

భీమేశ్వరపురాణమునందు ఋజుముఖమున సూచించిన కవితారీతులు:

"హరచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీపర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్."

11ప.1అ.

ఇది సత్కావ్యలక్షణము. ఇందలి "హరచూడాహరిణాంకవక్రత", "సరసత్వంబు"నుకుంతకుని వక్రోక్తిజీవితములోని శ్లోకమునకు అనుసరణము.

"వాగ్వల్ల్యాః పదపల్లవాస్పదతయా యా వక్రతోద్భాసినీ
విచ్ఛిత్తిః సరసత్వసంపదుచితా కాప్యుజ్జ్వలా జృంభతే
తా మాలోచ్య విదగ్ధషట్పదగణై ర్వాక్యప్రసూనాశ్రయం
స్ఫారామోదమనోహరం మధునవోత్కంఠాకులం పీయతామ్."

35శ్లో.2ఉన్మే.

వక్రతచే మిక్కిలి ప్రకాశించునదియు, సరసత్వసంపదకు సముచితమైనదియు, సముజ్జ్వలమైనదియు అగు వాక్కు అనెడు వల్లి యొక్క పదపల్లవములను ఆశ్రయించిన విచ్ఛిత్తిని వివేచించి, విదగ్ధు లనెడు తుమ్మెదకదుపులు వాక్యపుష్పములలోని మహాసౌరభముచేత మనోహరమైన మకరందమును నూతనోత్కంఠతో ఆస్వాదించును గాక అని తాత్పర్యము.

వక్రత అనగా "బాలేందుసుందరసంస్థాన"మని కుంతకుని వ్యాఖ్య. శ్రీనాథుని పద్యములోని హరచూడాహరిణాంకసాదృశ్యము తదనుసారియే. సరసత్వమన "శృంగారాదివ్యంజకత్వ"మని కుంతకుని వ్యాఖ్య. కాఠిన్యమన ప్రౌఢిమ.

భరతమునిప్రోక్తమైన రసము, కుంతకప్రతిపాదితమైన వక్రోక్తి, శైలీపరిణతమైన ప్రౌఢిమ సత్కావ్యలక్షణములని శ్రీనాథుని సిద్ధాంతము. ఈ మూడును తన కవితా రీతులని శ్రీనాథుని ఋజుముఖప్రకటనము.

భీమేశ్వరపురాణమునందు వ్యతిరేకముఖమున సూచించిన కవితారీతులు :

"ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమన్న నండ్రుగా కేల కొఱఁత
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష." 15ప.1ఆ.

ఇది కుకవినిరాకరణప్రకరణములోని పద్యము. ప్రకరణమును వదలిన అర్థవివరణము నిరాలంబనృత్యము. శ్రీనాథుని కవిత్వములోని ప్రౌఢిని చూచి కొఱతగా సంస్కృతభాష అను వారు, పలుకునుడికారమును చూచి కొఱతగానే ఆంధ్రభాష అను వారు కుకవులు. అనగా కువిమర్శకులు. అట్లు నిరాదరించు కుకవులకు తన కవిత్వము సంస్కృతభాష కాదు, ఆంధ్రభాష కాదు కర్ణాటభాష అనగా కన్నడభాష అని శ్రీనాథుని ముఖపిధానము. సమాదరించు సద్విమర్శకులకు అనగా సుకవులకు తన కవిత్వము సంస్కృతాంధ్ర భాషాసమ్మిశ్రణమున కర్ణాటభాష అనగా కర్ణములందు చరించు భాష అనగా కర్ణ రసాయనభాష అని శ్రీనాథుని ఆంతర్యము. కర్ణాటశబ్దమునకు కర్ణే అటతీతి కర్ణాటః అను వ్యుత్పత్తి నిరాఘాటము. కర్ణ+అట అను పదచ్ఛేదము శ్రీనాథునికి అనభిమతము కాదు. "నా కవిత్వము నిజము కర్ణాటభాష" అని పదచ్ఛేదనిరపేక్షముగ యతిమైత్రి ఘటించిన శ్రీనాథుడు, భీమేశ్వరపురాణములోని అవతారికయందే "అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధారఘూర్జరభాషల్" అని పదచ్ఛేదసాపేక్షముగే యతిమైత్రి ఘటించెను. (73ప.1ఆ.) సంస్కృతభాష అనిపించు ప్రౌఢి సంస్కృతప్రౌఢి. ఆంధ్రభాష అనిపించు పలుకునుడికారము తెనుగు నుడికారము. కర్ణరసాయనమగు సంస్కృతప్రౌఢి, తెనుగు నుడికారము తన కవితా రీతులని శ్రీనాథుని వ్యతిరేకముఖప్రకటనము.

కాశీఖండమునందు సాదృశ్యముఖమున సూచించిన కవితారీతులు :

"వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు-" 13ప.1ఆ.

భీమేశ్వరపురాణములోని "కాలాంతస్ఫురచ్చండికాపరుషోద్గాఢపయోధరస్ఫుట తటీపర్యంతకాఠిన్యము" వేములవాడ భీమన భంగి వచియించు "ఉద్దండలీల"- భీమేశ్వరపురాణమునందు వ్యతిరేకముఖమున ప్రకటించిన సంస్కృతప్రౌఢి, తెనుగునుడికారము నన్నయభట్టు మార్గమున భాషించు "ఉభయవాక్ప్రౌఢి." భీమేశ్వరపురాణములోని "సరసత్వంబు"నకు సంబంధించినది తిక్కయజ్వప్రకారము వాక్రుచ్చు "రసాభ్యుచితబంధము." భీమేశ్వరపురాణములోని "హరచూడాహరిణాంకవక్రత" ప్రబంధపరమేశ్వరుని లేవ పరిఢవించు "సూక్తివైచిత్రి."

తెనుగునుడికారము, సంస్కృతప్రౌఢి = ఉభయవాక్ప్రౌఢి.
కాఠిన్యము = ఉద్దండలీల
సరసత్వము = రసాభ్యుచితబంధము
వక్రత = సూక్తివైచిత్రి.

మొత్తము మీద తెనుగునుడికారము, సంస్కృతప్రౌఢి, ఉద్దండలీల, రసాభ్యుచితబంధము, ఉక్తివైచిత్ర్యరూపమైన వక్రత శ్రీనాథుని కవితారీతులు.

నన్నయ ఉభయవాక్ప్రౌఢి, తిక్కన రసాభ్యుచితబంధము, ఎఱ్ఱన సూక్తివైచిత్రి పూర్వోక్తములు[171]. వేములవాడ భీమన ఉద్దండలీలకు ఒక ఉదాహరణము :

"శ్రీలలనాతనూభవవిశేషజగజ్జయమూలమన్మథా
జ్ఞాలతికాలవాలరతినాథకరాళమదాంధగంధళుం
డాలవిలోలబాహువిలుఠత్కరవాలవిశాలమందవా
తూలమదీయకాంత ధృతి తూలఁగ నేఁపున వీవకుండుమీ."

119ప.2ఆ.ప్ర.ర.ము.

శ్రీనాథుడు తన కవితారీతిని ప్రౌఢకవితారీతిని సూచించిన మఱొక పద్యము కాశీఖండమునందు కలదు.

"ఈక్షోణిన్నినుఁ బోలు సత్కవులు వేరీ నేఁటి కాలంబునన్?
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్."

14ప.1ఆ.

కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యములు శ్రీనాథుని కవిత్వములే. గంధసారమన మంచిగంధము. ఘుసృణమన కుంకుమము. ద్వైరాజ్యమన ద్విరాజభావము. ద్విరాజభావము పరస్పరవిజిగీష అధ్యక్షించునది అంతకంటె అధికమైనది.

గంధసారము కంటె, ఘుసృణము కంటె అభ్యధికమైనది శ్రీనాథుని కవిత్వము. గంధసారము త్వగింద్రియతర్పణము కావించునది. ఘుసృణము దృగింద్రియతర్పణము కావించునది.

కవితానిర్వచనమును చాటిన శ్రీనాథుని చాటుపద్యమిది :

"పంపావిరూపాక్షబహుజటాజూటికా
రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
గంభీరఘుమఘుమారంభములకు
కళసాపురప్రాంతకదళీవనాంతర
ద్రాక్షాలతాఫలస్తబకములకు
కర్ణాటకామినీకర్ణహాటకరత్న
తాటంకయుగధాళధళ్యములకు
నిర్నిబంధనిబంధమై నెనయు కవిత
తెనుఁగునను సంస్కృతంబునఁ బలుక నేర్తు"

ఆరగ్వధప్రసవసౌరభ్యములు ఘ్రాణేంద్రియతర్పణము కావించునవి. ఉత్తుంగవీచీఘటాగంభీరఘుమఘుమారంభములు శ్రవణేంద్రియతర్పణము కావించునవి. ద్రాక్షాలతాఫలస్తబకములు జిహ్వేంద్రియతర్పణము కావించునవి. కర్ణహాటకరత్నతాటంకయుగధాళధళ్యములు దృగింద్రియతర్పణము కావించునవి. వానికి "నిర్నిబంధనిబంధమై నెనయు" కవిత్వమును ఘ్రాణశ్రవణజిహ్వాదృగింద్రియతర్పణము కావించునది. పూర్వపద్యమునందు త్వగింద్రియతర్పణము కలదు. త్వక్ఘ్రాణశ్రవణజిహ్వాదృగింద్రియములు పంచేంద్రియములు. పంచేంద్రియతర్పణము కావించునది శ్రీనాథుడు పలుక నేర్చిన కవిత. ఈ శ్రీనాథుని కవితానిర్వచనమునకు, "కవిత్వము పంచేంద్రియతర్పణము కావించునది" అను పాశ్చాత్యకవితానిర్వచనము అర్వాచీనవాఙ్మయాంతరసంవాదము. శ్రీనాథుని కవితారీతులైన తెనుగునుడికారము, సంస్కృతప్రౌఢి, ఉద్దండలీల, రసాభ్యుచితబంధము, ఉక్తివైచిత్రీరూపమైన వక్రత పంచేంద్రియతర్పణము కావించునవి.

**తెనుగునుడికారము** : తెలుగు పదములు, తెలుగు పలుకుబడులు, తెలుగు సామెతలు, తెలుగు జాతీయములు సహజముగ సందర్భోచితముగ తేజరిల్లునది తెనుగునుడికారము.

"నిఱుపేద యింటి కేటికిఁ
బఱతెంచు నిధాన? మట్లు పఱతెంచిన యే

నిఱుపేద యభాగ్యతఁ దలు
పిఱియఁగ నిడు కాక చొరగనిచ్చునె దానిన్." 73ప.4ఆ.శృం.నై.

"ఆవగింజంత భూతి మై నలఁదికొనిన
వెలఁది గుమ్మడికాయంత వెట్టి పుట్టుఁ
గటకటా తన బుద్ధి పెన్గాటఁ గలయ
నిసువుఁ జంపంగఁ దలఁచె నీ మగండు." 99ప.2ఆ.హ.వి.

"మొగి విరిసి కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గల లేఁ
జిగు రర టాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవి యాజ్ఞ దివ్యపురంధ్రుల్." 128ప.2ఆ.భీ.పు.

"అడుసులోపలఁ దాటిపం డదిమినట్లు
లదుముదునె కాదె పాతాళ మంటికొనఁగ
వేల్పు లెల్లను విభ్రాంతి విహ్వలింపఁ
బాదముల మెట్టి నా దాయఁ బసిఁడికొండ." 114ప.1ఆ.కా.ఖం.

"నెలఁత బొమ్మంచు పుట్టంబు నెఱిక గట్టు
కాంత ధరియించు పచ్చనక్షత్రల బొట్టు
నింతి యొడికంబుగా వాఁడు నిల్లుఁ బట్టు
వీటి విప్రాంగనలు దన్ను వినుతి సేయ." 13ప.4ఆ.శి.రా.మా.

"బాలరాజులు తాను బ్రహ్మనాయకుడు
కలిగిన బలముతో కార్యమపూడి
కలను ప్రవేశించి కదనంబు జేయ
కనిపెట్టి యున్నాడు గ్రక్కున మిమ్ము
రమ్మని పిలిచిన రా మనరాదు
కలిగిని బలిమియు కలిమియు విడిచి
మగటిమి విడనాడి మానంబు దూలి
పంచి భూమి నొసంగ పంతంబు గాదు
కయ్యంబు చేయుట ఘనవిచారంబు
ఇద్దరు రాజులై యేర్పడిరేని
అవనిలోపల నాజ్ఞ యమరిక యౌనె
సిరిపొత్తు చేయుట చెల్లును గాని
ఆజ్ఞ పొత్తిచ్చుట అది నీతి గాదు." పుటలు21-22.ప.వీ.చ.

"పూజారి వారి కోడలు
తాఁ జాఱఁగ బిందె జాతి దబ్బునఁ బడియెన్
మైజాఱు కొంగు దడిసిన
బాజారే తిరిగి చూచి ఫక్కున నవ్వెన్." 18ప.వీ.నా.

సంస్కృతప్రౌఢి : సమాసభూయిష్ఠరచన సంస్కృతప్రౌఢి.

"సరసత్వంబు నిగూఢకార్యఘటనాచాతుర్యసంపత్తియుం
బురుషార్థైక పరాయణత్వమును నభ్యుత్థానలీలాధురం
ధరతాప్రౌఢియునుం గృతజ్ఞతయు వాత్సల్యంబు సద్భావమున్
సరసీజాసనవాహనాహ్వయవతంసా! హంస!నీ కందముల్."

102ప.2ఆ.శృం.నై

"అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముం బోలె నా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్."

15ప.4ఆ.హ.వి.

"కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదుష్ప్రోధాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీఁకటులుగా సంరంభశుంభద్గతిన్
ప్రేక్షిచ్ఛాత్రులు భీతిఁ బొందఁ గడు నుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము రాతిమీద శతధా భిన్నంబుగా వైచితిన్."

102ప.3ఆ.భీ.పు.

"నిజధామంబున శంభులింగము భవానీదృక్కరంభంబు నం
బుజగర్భాదిసురేంద్రవందితపదాంభోజంబుఁ గల్పించె మం
త్రజపధ్యానపరాయణుం డగుచుఁ దత్పార్శ్వంబునన్ దీవిపిరా
డజినాగ్రంబున నున్న పాశుపతవిద్యారాజ్యపీఠస్థునిన్."

60ప.౨ఆ.కా.ఖం.

"అపుడు విలంబమానమయి యంబరకోటతటాంతరంబునం
దపనుని మండలంబు బెడిదంబగు వేఁడిమి నొయ్య వీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాసకళాపచేళిమ
త్రపుసలతాశలాటుసముదాయము చాయఁ దిరస్కరింపఁ గన్."

28ప.3ఆ.శి.రా.మా.

"పరరాజసైన్యమ్ము మైకొని రాగ
వాద్యసమూహంబు వడితోడ మ్రోయ
సాంద్రతురంగహేషావిజృంభణము
రథనేమిసంకులప్రబలశబ్దంబు
లమితపదాతిచయాట్టహాసంబు
భేరీఢమాముల ఫెళ్లను మ్రోత
యేకమై మించిన యెట్లు తాళెదవు" పుట51ప.వీ.చ.

"వరగంభీరమనోరథంబులు గుణాభావప్రవీణత్వమున్
అరవిందాస్యసుగంధగంధపటువేణ్యాత్యంతసౌందర్యము
ద్ధురతంద్రాణవివేకసంపదయు మాధుర్యాదిగాంభీర్యమున్
దరుణీరత్నము శూద్రభామగుణముల్ తథ్యంబె వర్ణింపఁ గన్."

8ప.వీ.నా.

**ఉద్దండలీల** : ద్విత్వసంయుక్తపరుషకఠినపదబంధసుదీర్ఘసమాసభూయిష్ఠరచన ఉద్దండలీల

"సకియ! యితండు నీ వలుఁ ద చన్నుల క్రేవల నొత్తుఁ గాతఁ గిం
శుకముకుళాభిరామములు సుంకము పట్టు నఖాంకురాంకముల్
ప్రకుపితశాంకరీచరణపంకజకుంకుమపంకసంకర
ప్రకటనిరంకశంకరకపర్దశశాంకకళాంకకారముల్."

103ప.5ఆ.శృం.నై.

"జంభారిప్రభవప్రయుక్తనిబిడజ్యారావగంభీరసం
రంభభ్రామితగాండివప్రసరదస్త్రవ్రాతదీవ్యత్త్వరా
సంభిన్నాంగములై సురారితనువుల్ సంగ్రామరంగంబునం
గుంభద్రోణము లట్లు బిట్టు గురిసెన్ ఘోరాస్త్రవర్షంబొగిన్."

166ప.7ఆ.హ.వి.

"ఆడెం దాండవ మార్భటీపటుహలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాతకఠోరకోటకరుటీకోటీలురత్సింధువీ
చీడోలాపటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్." 148ప.4ఆ.భీ.పు.

"పాటిల్లెం ధరణీసురోత్తమున కప్పాటన్ విదాహజ్వరో
ష్మాటోపంబున నత్యుపద్రవములై నాపాదమస్తంబుగాఁ
గోటీవృశ్చికకీటపుచ్ఛలతికాకోటీశిఖాకంటక
త్రోటీకుట్టన సంప్రభూతవిషధూర్దుర్వాహదాహోద్ధతిన్."

"ఆటోపారభటీసముద్భటతారాహంకారబాహోధను
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబునన్ సమా
స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్యు ల్దండభృద్భృత్యులన్
ధాటీసంభ్రమలీలఁ దాఁ కిరి వడిన్ ధారధరాధ్వంబునన్."

77ప.4ఆ.శి.రా.మా.

"ధాటీఘోటకరత్నఘట్టనమిళద్ద్రాఘిష్ఠకల్యాణ ఘం
టాటంకారవిలుంఠలుంఠితమహోన్మత్తాహితక్ష్మోణిభృ
త్కోటీరాంకితకుంభినీధరసముత్కూటాటవీఝూటక
ర్ణాటాంధ్రాధిప!సాంపరాయని తెలుంగా!నీకు బ్రహ్మాయువౌ."

3ప.వీ.నా.

**రసాభ్యుచితబంధము** : రసమునకు అభ్యుచితమైన పదబంధము రసాభ్యుచితబంధము. పదబంధమన పదసంయోజనము. ప్రసిద్ధపదసంయోజనము ప్రసాదగుణము. సరసపదసంయోజనము మాధుర్యగుణము. ద్విత్వసంయుక్తపరుషకఠినవర్ణపదసంయోజనము ఓజోగుణము. ప్రసాదమాధుర్యగుణములు శృంగారహాస్యకరుణాద్భుతశాంతరసములకు, ఓజోగుణము వీరరౌద్రబీభత్సభయానకరసములకు అభ్యుచితములు.

శృంగారరసము ద్వివిధము. 1. విప్రలంభశృంగారము. 2. సంభోగశృంగారము. విప్రలంభశృంగారము వివాహపూర్వవిషయము. అది పూర్వరాగము. సంభోగశృంగారము వివాహానంతరవిషయము. ఇది ఉత్తరరాగము. ఉత్తరరాగమునందును విప్రలంభశృంగారముండును. నైషధమునందు పూర్వరాగమునందలి విప్రలంభశృంగారము, ఉత్తరరాగమునందలిసంభోగశృంగారమును కలదు. విప్రలంభశృంగారమన విరహశృంగారము. అందు రసకార్యములైన సాత్త్వికభావము లుండును.

"బాలిక చెక్కుటద్దముల పజ్జలఁ గోమలమందహాస
ఖాలవ మంకురింపదు వికాసము చాలదు నెమ్మనంబునన్
వాలిక మించుఁ గన్గొనల వాకిట నల్లన సంచరింపనుం
జాలక చాలఁ గుంటువడెఁ జారునిరంజనఖంజరీటముల్."

112ప.2ఆ.శృం.నై.

ఇది స్తంభమను సాత్త్వికభావము. ఇందు ప్రసాదగుణము కలదు.

"కుతుకమునం గురంగమదకుంకుమచర్చ వహించి నీలలో
హితరుచులై స్వయంభులయి యీహితసౌఖ్యవిధాయులైన య
య్యతివ పయోధరంబులకు నర్ధనిశాసమయంబునన్ సమం
చితనఖకింశుకార్చనము సేసె మహీపతి భక్తి యేర్పడన్."

178ప.7ఆ.శృం.నై.

ఇది సంభోగశృంగారము. ఇందు మాధుర్యగుణము కలదు.

శృంగారనైషధములోని బువ్వపుబంతి ఘట్టము హాస్యరసఘట్టము. అందు,

""ఓమె యేమె యిదేమేమె లేమ! యేమె
మేఘపుష్పంబుఁ దే?" వంచు మేలమాడ
"మేమె మేమెలు దఱచయ్యె మేలు మేలు
మేఁక మేఁ కన సభవారు మిగులనగిరి." 114ప.6ఆ.శృం.నై.

ఇందు ప్రసాదగుణము, మాధుర్యగుణము రెండును కలవు.

హరవిలాసములోని రతివిలాపము, కాశీఖండములోని అగస్త్యుని కాశీవిరహము, సుశీలపరితాపము కరుణరసనిర్భరములు. ప్రసాదమాధుర్యగుణసంభరితములు. ముఖ్యపద్యములు పూర్వోదాహృతములు. (64ప.3ఆ.హ.వి; 139, 140ప.2ఆ.కా.ఖం.161ప.5ఆ.కా.ఖం.)

శివరాత్రిమాహాత్మ్యములోని పావకస్తంభావిర్భావము అద్భుతరసావహము. ఆవిర్భవించిన పావకస్తంభవిజృంభణమును అద్భుతరసవిషయము.

"సప్తపాతాళవిష్టపములు భేదించి
ధరణిచక్రంబు బిందం బొనర్చి
భూర్భువస్స్వర్లోకములు సమాస్ఫాటించి
ధ్రువమండలంబుఁ దుత్తుమురు చేసి
పరమేష్ఠిపదవి కుద్భ్రాంతి యాపాదించి
హరిపదంబున కార్తి యావహించి
బ్రహ్మాండకుహరకర్పరము వ్రక్కలు వాపి
యావరణంబు లందంద చించి
పరఁగఁ బుష్కరమార్గంబు పాయఁ బట్టి
యెగసి యెచ్చోట కేఁగెనో యెఱుఁగరాదు
శాంతకుంభాద్రికూటాగ్రసన్నిభంబు
శాంభవంబైన పావకస్తంభ మపుడు." 103ప.1ఆ.శి.రా.మా.

ఇది ప్రసిద్ధపదనిబద్ధమైన ప్రసాదగుణము. ఇంచుక ఓజోగుణము కలదు. అది

అద్భుతరసమునకు అనభ్యుచితము కాదు.

వ్యాసుని భీమేశ్వరభక్తి శాంతరసమునకు విషయము.

"శ్రీభీమనాయకశివనామధేయంబుఁ
జింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్షమోహనమూర్తిఁ
జూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయి పావనకీర్తి
చే. నింప నేర్చిన చెవులు చెవులు
తారకబ్రహ్మవిద్యాదాత యొాదల
విరులు పూన్పఁగ నేర్చు కరము కరము
ధవళకరశేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చిన యడుగు లడుగు
లంబికానాయకధ్యానహర్షజలధి
మధ్యమునఁ దేలియాడెడు మనసు మనసు." 198ప.3ఆ.భీ.పు.

ఇందు చింతనము, సందర్శనము, శ్రవణము, సంసేవనము మాత్రమే గాక తాదాత్మ్యమును కలదు. "ధ్యానహర్షజలధి మధ్యమునఁ దేలియాడెడు మనసు" తాదాత్మ్యమునకు తావలము. అది ద్వంద్వాతీతస్థితి. శమప్రవృత్తిజన్యము. కాఁబట్టి శాంతరసవిషయము. ప్రసాదగుణప్రపూర్ణము.

హరవిలాసమునందు అర్జునుడు నివాతకవచులతో చేసిన యుద్ధము వీరరసప్రధానము. వీరరసమునకు అభ్యుచితమైన బంధము ఓజోగుణము. ఓజోగుణగరిష్ఠమైన పద్యము పూర్వోదాహృతము. (166ప.7ఆ.)

భీమేశ్వరపురాణమునందు భీమేశ్వరుని త్రిపురాసురసంహారోద్యమము రౌద్రరసముద్రాముద్రితము. రౌద్రరసమునకును అభ్యుచితమైన బంధము ఓజోగుణమే.

"గిరిశస్థూలభుజాపరీతవిభవక్రీడాసమాస్ఫాలిత
స్థిరబాణాసనగూఢపాద్గుణలతాదీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరముం దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెన్
బ్రహ్మాండభాండంబులున్." 133ప.4ఆ.

కాశీఖండమునందు మహాకాలభైరవుని ప్రళయకాలతాండవము భయానకరసబంధురము. భయానకరసమునకును అభ్యుచితమైన బంధము ఓజోగుణమే.

"పాదాభిహతిసప్తపాతాళములతోడ
నుర్వీకటాహముల్ఘూర్ణిల్లఁగ
నిర్భరతరజటానికురుంబకంబులు
చెదరి బ్రహ్మాండంబు చెంపఁబెట్ట
బాహార్గళాస్తంభపరివర్తనంబుల
దిక్చక్రవాళంబు త్రెవ్విపడఁగ
వితతనిశ్వాసమారుతవర్తనంబునఁ
బృథ్వీధరంబులు వెల్లగిల్ల
నమరుఢాన్నాదముల సముద్రములు కలఁగ
నారభటివృత్తిఁ దాండవం బవధరించెఁ
బ్రళయవేళ మహాకాలభైరవుండు
కాళరాత్రి కుచంబులు గగురు పొడవ." 130ప.5ఆ.

ఇందు మహాకాలభైరవుని తాండవమే ఆరభటీవృత్తి కాదు; రసాభ్యుచితబంధమైన ఓజోగుణమును ఆరభటీవృత్తిమూలకమే. కాళరాత్రి కుచపులకోద్గమము శృంగారరససంచారీభావము కాదు; భయానకరససంచారీభావము. ఇది. గమనింపవలసినది.

పలనాటివీరచరిత్రలోని పిశాచగణముల స్వేచ్ఛావిహారము బీభత్సరసవిషయము. కాని ఓజోగుణప్రధానము కాదు. కారణము ద్విపదకావ్యమగుట కావచ్చును. వీరరౌద్రబీభత్సభయానకరసములకు ఓజోగుణము అభ్యుచితమైనను ప్రసాదమాధుర్యగుణములు అనభ్యుచితములు కావు. అంతేకాదు. గుణము కంటె జుగుప్సావహమైన భావము బీభత్సరసమునకు జీవము.

"కలను గాచుకయున్న కాళిని జూచి
మీ దయచేతనే మేము తనియగ
అధికభోజనమాంస మబ్బెను మాకు
అని మ్రొక్కి తేన్పుచు ఔత్సుక్యమడర

XXX XXX XXX

చల్లులాడుచు రక్తసాగరమందు
మునుగుచు నీదుచు మూకలు గట్టి
జలకమాడీ చెదరి చౌకలింపుచును
కుప్పించి దుముకుచు గొబ్బున మునిగి"

ఇట్లు శ్రీనాథుని రసాభ్యుచితబంధము శృంగారనైషధ, హరవిలాస, భీమేశ్వర పురాణ, కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్య, పలనాటివీరచరిత్ర, వీధినాటక

వివిధకృతులందును నవరసాశ్రితము.

**వక్రత** : వక్రత అన రమ్యత. అది శబ్దమును, అర్థమును ఆశ్రయించునది. ఇది యెల్ల కుంతకుని వక్రోక్తిజీవితమునందు సోదాహరణనిరూపణముగ కలదు. వామనుని రీతిసిద్ధాంతమునకు, ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునకు సమన్వయరూపము కుంతకుని వక్రోక్తిసిద్ధాంతము. శబ్దమును ఆశ్రయించిన వక్రత శబ్దవక్రత. అర్థమును ఆశ్రయించిన వక్రత అర్థవక్రత. శబ్దవక్రత రీతివిషయము. అర్థవక్రత ధ్వనివిశేషము.

"ఒల్లనను మాట కర్థ మో యుత్పలాక్షి
వలతు ననుమాట కాదుగా వక్రరీతి
విధి నిషేధరూపంబు భావించియున్న
విధియ యగు వ్యంగ్యవాసనావిలసనమున." 76ప.4ఆ.

అని శ్రీనాథుని శృంగారనైషధమునందు కలదు. విధివాక్యమునకు నిషేధార్థము, నిషేధవాక్యమునకు విధ్యర్థము ధ్వన్యర్థమే. అది వక్రరీతి. అనగా వక్రత. అర్థవక్రత. ఉక్తివైచిత్రి అర్థవక్రతయే. శబ్దవక్రతయందు వర్ణవిన్యాసవక్రత ఒకటి. అది అక్షరరమ్యత అని పూర్వోక్తము[172]. ఇది శ్రీనాథుని కృతులందు అగ్రేసర భాసమానము[173]

ఒకటి లేక రెండు లేక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానముతో మఱల మఱల ఆవృత్తమైన వర్ణవిన్యాసవక్రత అగును.

"బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిపి యర్థిం దత్తదేశంబునన్
నలనాళీకమృణాళనాళలతికానవ్యప్రణాళీ మిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై." 78ప.3ఆ.శృం.నై.

ఇందు పూర్వార్ధమునందు రేఫము. ఉత్తరార్ధమునందు న ణ ల ళ వర్ణములు పునఃపునర్బధ్యమానములైనవి.

"జంభారాతితనూజు మీఁదఁ బొలసెన్ సావిత్రవర్త్మంబునన్
సంభిన్నోదరశాతకుంభనలినీనాలీకసంవాసనా
సంభారంబులు సోఁడుముట్ట సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతులముల్."
114ప.1ఆ.హ.వి.

ఇందు త, న, ల, స, క వర్ణములు వ్యవధానమున మఱల మఱల కలవు.

"ఆకాశాంచలవీథుల న్నిగిడె సంధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రితపారిభద్రకళికాపాండిత్యవైతండికో
త్సేకస్ఫూర్జితచండతాండవరయోద్రేకారభట్యుద్భట
శ్రీకంఠస్థిరదీర్ఘపాటలజటాశ్రేణిన్ విడంబించుచున్."

32ప. ౨ఆ.భీ.పు.

ఇందు రేఫము, ప, క, బిందుపూర్వకడకారము, త,టు,వర్ణములు పునఃపున ర్భధ్యమానములైనవి.

"కంఠే స్వఃకరికంఠపీఠవిలుఠద్గ్రైవేయలోహార్గళా
ఘంటాటాంకృతిఁ దారసౌధవలభీగర్భంబులం దార్కొనన్
ఘంటావీథిఁ జరించుచున్నది పురిన్ గారాము వాటించి వె
న్వెంటన్ దివ్యకరేణు వర్గ ముపధావింపంగ దర్పోద్ధతిన్."

200ప.3ఆ.కా.ఖం.

ఇందు క, ఠ, ల, ద, రేఫము, ధ వర్ణములు మఱల మఱల కలవు.

"ప్రాలెం బశ్చిమశైలశృంగము పయిం బ్రత్యగ్రమధ్యాగమో
న్మీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మండలం
బాలంబించె మరుండు హస్తమున దాక్షారమలీలావతీ
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రేక్షుకోదండమున్."

95ప.3ఆ.శి.రా.మా.

ఇందు శ, ప, గ, క, ల, భ, బిందుపూర్వకడకారములు మఱల మఱల కలవు. ఇట్లు ఏకద్విబహువర్ణములు పునఃపునర్భధ్యమానములైన వర్ణవిన్యాసవక్రత అనగా అక్షరరమ్యత పద్యమును లయబద్ధము చేయును.

**సూక్తివైచిత్రి** : ఇట సూక్తి అన నీతివాక్యము కాదు. సుమధురవాక్కు. సు+ఉక్తి=సూక్తి. సుమధురవాగ్వైచిత్రి సూక్తివైచిత్రి. ఉక్తివైచిత్రి విషయమును కుంతకుని వక్రోక్తిజీవితమునందు కలదు. విషయము ప్రాతదైనను చెప్పిన విధాన మునందు చాతుర్యము కలదేని అది ఉక్తివైచిత్రి అగును. ఇది పూర్వోక్తము[174].

"హాలహాలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీలపాండుర
జ్వాలలతోడ నందొక విషం బొక వేలుపు మ్రింగె నెందఱో
వేలుపు లోలిమై ననుభవించిన రెండవ యీ విషంబు ని
ర్మూలముగాక యున్నయది ముద్దియ! పాంథుల పాపమెట్టిదో?"

121ప. ౨ఆ.శృం.నై.

ఇది దమయంతి చంద్రోపాలంభములోని పద్యము. చంద్రుడు విరహులను వేధించుట, విరహులు చంద్రుని సాధించుట ప్రాఁ బడిన విషయము. అయినను, దమయంతి చంద్రోపాలంభము చాతుర్యవిలసితము. కలశాంబుధిని పుట్టినది ఒక విషమే. రెండు విషములని కల్పన. శివుడు కంఠనిక్షిప్తము కావించినది కాలకూట విషము. దేవతలు కంఠదఘ్నముగ త్రావినది చంద్రామృతము. ఎందఱు దేవతలు ఎంత త్రావినను చంద్రామృతము నిర్మూలము కాలేదు. కారణము పాంథులు చేసికొన్న పాపము. పాంథులకు వలె దమయింతికి చంద్రామృతము విషమైనది. అమృతము విషమని అభినవముగ దమయంతి చంద్రోపాలంభము. చెప్పిన విధానము చాతుర్యవిలసితము. ఇది మూలవిధేయము

"భాగ్యము గాదె యశ్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁ జేసి విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసౌ
భాగ్యధురంధరంబయిన పాశుపతాస్త్రము గాంచితింక వై
రాగ్యము పుట్టుఁ గాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్."

106ప.7ఆ.హ.వి.

అర్జునుడు పాశుపతాస్త్రము వలన మహాభారతయుద్ధమునందు విజయము గాంచుననుట అరిగిపోయిన నాణెము. అర్జునుడు తపస్సు చేసి ఈశ్వరాను గ్రహమున పాశుపతాస్త్రమును పడయుట వలన, కురురాజు రాజ్యలక్ష్మికి కురురాజు పైనే వైరాగ్యము పుట్టుననుట వైదగ్ధిభణితి. అంతేకాదు. పాశుపతాస్త్రము మహాశక్తి మంతమనుట కూడ పాతమాట. సమస్తజగత్తునకు ఉపకారము సేయు సౌభాగ్య ముచేత ధురంధరమనుట సాభిప్రాయము. పాశుపతాస్త్రమువలన సమస్తజగత్తునకు సౌభాగ్యము, కౌరవరాజ్యమునకు దౌర్భాగ్యము కలుగునని పద్యతాత్పర్యము. ఇది చాతుర్యవిలసితము.

భీమేశ్వరపురాణములోని "ఎనయంగల్గిన" అను పద్యము అర్థవక్రతా విశిష్టమని పూర్వప్రతిపాదితము. పద్యమును (112ప.1ఆ.) పూర్వోదాహృతము. అది సూక్తివైచిత్రియే. ఇటు అనుసంధించునది.

"పంచాక్షరీమంత్రపారాయణమునకు
నెవ్వాని మానసం బేడుగడయు
దర్పోద్ధతులగు వాతాపీల్వలులకును
వధశిలాస్థాన మెవ్వాని కుక్షి
యాది నెవ్వాని దివ్యావతారమునకుఁ
బూర్ణాంబుకుంభంబు పురిటియిల్లు

మెఱసి లోపాముద్ర మెఱుఁగు బాలిండ్లపైఁ
బవళించు నెవ్వాని భవ్యమూర్తి
కసరి యెవ్వాని కంఠహుంకారరవము
కొండచిలువల కులములోఁ గూర్చె నహుషు
నట్టి పరమమహాశైవు నలఘుతేజు
వెదకి రానందవనములో విబుధమునులు." 40ప.2ఆ.కా.ఖం.

పరమశైవుడైన అగస్త్యుడు - పంచాక్షరీమంత్రపారాయణము చేయును. అగస్త్యుడు వాతాపిల్వలులను రాక్షసులను కడుపులో జీర్ణము చేసికొనెను. తాను పూర్ణాంబుకుంభమునందు పుట్టెను. అగస్త్యుని భార్యలోపాముద్ర. అగస్త్యుని శాపమున నహుషుడు సర్పమయ్యెను. ఇవి పురాణప్రసిద్ధములు. ఇట్లే చెప్పిన పునరుక్తి. పంచాక్షరీమంత్రపారాయణమునకు అగస్త్యుని మనస్సు ఏడుగడ, వాతాపీల్వలులను రాక్షసులకు అగస్త్యుని కుక్షి వధశిలాస్థానము, అగస్త్యుని దివ్యావతారమునకు పూర్ణాంబుకుంభము పురిటియిల్లు, అగస్త్యుడు లోపాముద్ర మెఱుగు పాలిండ్లపై పవళించును, అతని కంఠహుంకారధ్వనిచే నహుషునిది సర్పకులమయ్యెను అని చెప్పిన విధానము ఉక్తిచాతుర్యవిలసితము.

"ఆ కలకంఠి యొయ్యఁ దడియార్చునెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నణకించి మధువ్రతమాలికాకృతిం
గైకొని యింద్రనీలమణిఖండవిలాసమలిమ్లుచంబులై
చీఁకటి కొల్పె బ్రాహ్మణుని చిత్తము పెన్నెఱి సోగవెండ్రుకల్."
46ప.2ఆ.శి.రా.మ.

ఇందు పెన్నెఱి సోగవెండ్రుకలు నెమలిపింఛమును మించినవి అనిగాక అణకించినవి అనుట, ఇంద్రనీలమణిఖండవిలాసమును అతిశయించినవి అనిగాక అపహరించినవి అనుట చతురోక్తులు. అంతేకాదు. స్నానము చేసి తడియార్చునెడ ఒక స్త్రీ పెన్నెఱిసోగవెండ్రుకలు ఒక పురుషుని చిత్తమును హరించెననుట పాతబడ్డ మాట. ఆ పురుషుని యుక్తాయుక్తవిచక్షణారాహిత్యమును వ్యక్తము సేయదు. చిత్తమును "చీఁకటికొల్పె"ననుట సరిక్రొత్తమాట. ఆ వ్యక్తి యుక్తాయుక్త విచక్షణారాహిత్యమును వ్యక్తము సేయునది. సమర్థము. చాతుర్యవిలసితమును.

ఇవి శ్రీనాథుడు తెలిపిన శ్రీనాథుని కవితారీతులు. ఇక శ్రీనాథుని బావమఱది దగ్గుబల్లి దుగ్గన తెలిపిన శ్రీనాథుని కవితారీతి కలదు. అది పూర్వకవితాచర్వణము. ఇది సర్వకవులకు సమామ్నాతపూర్వమే కాని శ్రీనాథునికి ప్రత్యేకము.

**పూర్వకవితాచర్వణము** : దుగ్గన నాసికేతోపాఖ్యానమునందు ఇట్లు కలదు.

"పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండనైష
ధప్రముఖవివిధప్రబంధములొనర్చి." 18ప.1ఆ.

తెలుగుకవులు, సంస్కృతకవులు పూర్వకవిముఖ్యులు. తెలుగు పూర్వకవితా చర్వణము కంటె సంస్కృతపూర్వకవితాచర్వణము సమధికము[175].

"శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా మాస్మప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః."
17శ్లో.4అం.

ఇది కాళిదాసు అభిజ్ఞానశాకుంతలములోని శ్లోకము. శ్రీనాథుని చర్వణమిది:

"పాటించి కొలువుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁ బోలి
యారాధనము సేయు మత్తమామలనెప్డుఁ
బరిజనంబులమీఁద గరుణ గలుగు
మలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడిమాడి చరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లి కరణి
బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తి విశ్వాససౌహార్దపరత నెఱపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య
ధర్మ మేమఱకుండుమీ తల్లికాన!" 9ప.7ఆ.శృం.నై.

"ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టయః
ఘోష్మప్లవమానసూరకిరణక్రూరప్రకారాదృశో
రాయుష్కర్మసమాపయన్తి ధిగమూర్మధ్యాహ్నశూన్యాఃదిశః"
72శ్లో.2అం.

ఇది భట్టమురారి అనర్ఘరాఘవములోని శ్లోకము. శ్రీనాథుని చర్వణమిది:

"మౌళింగోహళి సంఘటించినక్రియన్ మధ్యాహ్నవేళన్ మహా
కాలంబైన నభోవిభాగమున వీఁ కంగాసె బీఱెండ యా
ప్రాలేయాహితసంప్రదీప్త కిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టియై."

109ప.7ఆ.హ.వి.

"సద్యోమార్జిత దాక్షిణాత్యతరుణీదన్తావధౌతద్యుతిః
చన్ద్రః సుందరి! దృశ్యతా మయమితిశ్చణ్డీశచూడామణిః"

ఇది రాజశేఖరుని కావ్యమీమాంసలోని శ్లోకము. శ్రీనాథుని చర్వణమిది:

"ఉదయరాగము నించించు కుజ్జగించి
నిండుచంద్రుండు కన్నుల పండువయ్యె
ధావనానంతరస్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంతదంతవజ్రముల కాంతి." 43ప.2ఆ.భీ.పు.

"శాతశ్శ్యామా లతాయాః పరశురివ తమోzరణ్యవహ్నేరివార్చిః
ప్రాచ్యేవాగ్రే గ్రహీతుం గ్రహకుముదవనం ప్రాగుదస్తోzగ్రహస్తః
ఐక్యం భిన్న న్ద్యుభూమ్యో రవధిరివ విధాతేవ విశ్వప్రబోధం
వాహానాం వో వినేతా వ్యపనయతు విపన్నామధామాధిపస్య"

54శ్లో.

ఇది మయూరుని సూర్యశతకములోని శ్లోకము. శ్రీనాథుని చర్వణమిది:

"చిఱుసానఁ బట్టించి చికిలిసేయించిన
గండ్రగొడ్డలి నిశాగహనలతకుఁ
గార్కొన్న నిబిడాంధకారధారాచ్ఛటా
సత్రవాటికి వీతిహోత్రజిహ్వ
నక్షత్రకుముదకాననము గిల్లెడు బోఁటి
ప్రాచి యెత్తిన హస్త పల్లవాగ్ర
మరసి మింటికి మంటి కైక్యసందేహంబుఁ
బరిహరింపంగఁ బాల్పడ్డ యవధి
సృష్టి కన్నెఱి తొలుసంజ చెలిమికాఁడు
కుంటు వినతామహాదేవి కొడుకుఁ గుఱ్ఱ
సవితృసారథి కట్టెఱ్ఱ చాయవేలు
పరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున." 121ప.1ఆ.కా.ఖం.

"మిథ్యామాహాత్మ్యగర్భనిర్భరాశ్చ న ప్రణమన్తి దేవతాభ్యః, కించ న పూజయన్తి ద్విజాతీన్, న మానయన్తి మాన్యాన్, నార్చ యన్త్యర్చనీయాన్ నాభివాదయన్త్యభివాదనార్హాన్, నాభ్యుత్తిష్ఠన్తి గురూన్..."

ఇది భట్టబాణుని కాదంబరిలోని గద్య. శ్రీనాథుని చర్వణమిది:

"సంపద పేరి కట్టిఁడి పిశాచము సోఁకిన మానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జనులైనవారి మ
న్నింపఁడు మిత్రబంధుల గణింపఁడు ధర్మరహస్యముల్ విచా
రింపఁడు (నేమముం దగం ద్యజింపఁ) డహంకరణంబు
పెంపునన్." 98ప.2ఆ.శి.రా.మా.

పలనాటివీరచరిత్రలోని పూర్వకవితాచర్వణము కర్తృత్వము శీర్షికను కలదు. ఇవి గాక స్థానికవిశేషకథనము, స్థానికప్రకృతిచిత్రణము, పాత్రచిత్రణపాటవము శ్రీనాథుని కవితారీతులే. అవి భీమేశ్వరపురాణ, కాశీఖండకృతిసమీక్షలందు ప్రసక్త పూర్వము. ఇంకను సీసపద్యరచనాపద్ధతి శ్రీనాథుని అపూర్వకవితారీతి.

**సీసపద్యరచనాపద్ధతి** : నన్నయ వృత్తరచనమునందు, తిక్కన కంద పద్యరచనమునందు, శ్రీనాథుడు సీసపద్యరచనమునందు సిద్ధహస్తులు. ప్రసిద్ధ కవులును. సీసపద్యమునందు పంత్రెండు పాదముల విభాగము కలదు. పంత్రెండు పాదములందును ప్రాఙ్నన్నయయుగశాసనపద్యములందు పాదాంతవిరతి కలదు. నన్నయ సీసపద్యములందు పాదాంతవిరతి కల పద్యములు తక్కువ. పాదాం తవిరతి లేని పద్యములు ఎక్కువ. శ్రీనాథుని సీసపద్యములందు పాదాంతవిరతి సార్వత్రికము. అది శ్రీనాథుని సీసపద్యము విశిష్టత అనుట కలదు. కాని పాలకు ఱికి సోమానాథుని సీసపద్యములందే అంతట పాదాంతవిరతి కలదు. కావున పాదాంతవిరతిని పాటించుట మాత్రమే శ్రీనాథుని సీసపద్యముల ప్రత్యేకత కాఁ జా లదు. అంతకంటె అపూర్వమైన అంశము శ్రీనాథుని సీసపద్యముల విశేషమగును. అది సిద్ధహస్తతకు కారణము.

సీసపాదమునందు ఆరింద్రగణములు రెండు సూర్యగణములు లక్షణము. నల, నగ, సల, భ, ర, తలు ఇంద్రగణములు. హ, న, గణములు సూర్యగణములు. సూర్యగణములు రెండును మూడేసి మాత్రల గణములు. ఇంద్రగణములందు నల, భ గణములు నాలుగు మాత్రల గణములు, నగ, సల, ర, త గణములు అయిదు మాత్రల గణములు. నాలుగు మాత్రల గణముల కంటె అయిదు మాత్రల గణముల పాదగమనము తీగసాగును. పద్యము నడక పరవళ్లు త్రొక్కును. అయిదు

మాత్రల గణముల అనుసంధానము శ్రీనాథుని సీసపద్యరచనావిధానము.

"ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ వసుమతీశ."

ఇది నన్నయ సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని మొదటి రెండు గణములు నాలుగు మాత్రల గణములు.

"లింగార్చన క్రియాసంగతి శృంగార
రసమును నద్భుతరసము దోఁ ప." 61ప.అ.సా.

ఇది పాలకుఱికి సోమనాథుని సీసపాదము. పాదంతవిరతి కలదు. కాని మూడు, అయిదు, ఆరు గణములు నాలుగుమాత్రల గణములు.

"పదమున మూఁడుఁ దత్ప్రాణిలింగికి (మూఁడు)
శరణస్థలంబున నరయనైదు" 32ప.చె.సీ

ఇది కూడ పాలకుఱికి సోమనాథుని సీసపాదము. పాదాంతవిరతి కలదు. ఒకటి ఆరుగణములు నాలుగుమాత్రల గణములు.

"వైదికు లిది శుద్ధవైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్రమనఁగ" 22ప.చ.సా.

ఇదియును పాలకుఱికి సోమనాథుని సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని మొదటిగణము నాలుగు మాత్రల గణము.

"పరరాజు పైవచ్చిబలువిడిఁ బరిభవిం
చినఁ దలఁకిన పురశ్రీవిధమున" 75ప.6ఆ.ఉ.రా.

ఇది తిక్కన సీసపాదము. పాదంతవిరతి లేదు. అంతేకాదు. మూడవ గణము నాలుగు మాత్రల గణము.

"ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజవారణరజోరాజి నణఁగు" 191ప.2ఆ.వి.ప.

ఇది కూడ తిక్కన సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని మొదటి మూడు గణములు నాలుగు మాత్రల గణములు.

"జననుత వీరు నా జననియు జనకుండుఁ
జూవె వీరలకు శుశ్రూష సేసి" 117ప.5.ఆ. ఆ.ప.శే.

ఇది ఎఱ్ఱన సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని ఒకటి మూడు గణములు నాలుగు మాత్రల గణములు.

"భానుఁ బిల్పించి నా పంపునఁ బాయని
తెరువరివై మీఁదఁ దిరుగుమనియె." 130ప.2ఆ.నృ.పు.

ఇది కూడ ఎఱ్ఱన సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని మూడు, నాలుగు అయిదు గణములు నాలుగు మాత్రల గణములు.

"ఒండొరెడ యిద్దరినుండి యద్దరిదాఁక
నేపారు పురుడున నీఁదియీఁది"
101ప.6ఆ.హ.వం.పూ.భా.

ఇదియును ఎఱ్ఱన సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని రెండు, ఆరు గణములు నాలుగు మాత్రల గణములు.

"చెందమ్మివిరులలోఁ జిందు తేనెలు వోలెఁ
కన్నుల బాష్పాంబుకణము లురల" 376ప.5ఆ.ఉ.హ.

ఇది నాచన సోమనాథుని సీసపాదము. పాదాంతవిరతి కలదు. కాని నాల్గవగణము నాలుగు మాత్రల గణము.

శ్రీనాథునికి పూర్వము సీసపద్యరచన మిట్టిది. ఇక శ్రీనాథుని సీసపద్యరచనము-

"అమరాంగనాసంగమాభిశోభితమైన
హరికేల మానుషీపరిచయంబు" 68ప.4ఆ.శృం.నై.

"కనకనూపురఝుణత్కారనిక్వాణంబు
రవలిమట్టియలతో రాయిడింప" 45ప.5ఆ.హ.వి.

"ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకు లింకించెఁ
గంభీరహుంకారగర్జనమున" 77ప.2ఆ.భీ.పు.

"ప్రథమసంధ్యాకాల బలిశంఖనినదంబు
ప్రభవించె శ్రీవిశ్వవిభుని నగర" 236ప.3ఆ.కా.ఖం.

"కామినీగండూషకాదంబరీధారఁ
బులకించె నారామభూమిఁ బొగడ" 120ప.3ఆ.శి.రా.మా.

"కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ బొగడదండ" 48ప.వీ.నా.

ఇవి శ్రీనాథుని సీసపాదములు. ఇందు పాదాంతవిరతి కలదు. అంతేకాదు నాలుగు మాత్రల గణము లేదు. ఇట్టి సీసపద్యములు శ్రీనాథుని కృతులందు సమృద్ధము. నాలుగుమాత్రల గణములు కల సీసపద్యములు సకృన్మాత్రము. అపవాదప్రాయము. విస్మరణీయము. అయిదు మాత్రల గణముల వలన, అందును నగ, సల, గణముల వలన శ్రీనాథుని సీసపద్యములకు ఊగు, తూగు, సమత, మమత సిద్ధించినవి. శ్రీనాథుని సీసపద్యములు మూసకట్టులైనవి. అనంత రకవులకు ఆదర్శములైనవి. పాదాంతవిరతి పాటించుట వలన మాత్రమేగాక, నాలుగు మాత్రల గణములు కాక అయిదు మాత్రల గణములను అలవోకగా సంత రించుట వలనను సీసపద్యరచనమున శ్రీనాథుడు సిద్ధహస్తుడు.

## శైలి

నన్నయ శైలి మధురము. జలతరంగిణి వలె నినదించును. తిక్కన శైలి మృదులము. కాహళ వలె రవళించును. ఎఱ్ఱన శైలి గంభీరము. గజ్జెల వలె గద్గదించును. నాచన సోమనాథుని శైలి పటిష్ఠము. మృదంగము వలె మ్రోగును. శ్రీనాథుని శైలి సుకుమారము. వీణ వలె నిక్వణించును. కంచు గీసిన తెఱగున ఎలుగెత్తును. అంతేకాదు. నన్నయ శైలి హంసగమనము. తిక్కన శైలి గోగమ నము. ఎఱ్ఱన శైలి గజగమనము. నాచన సోమనాథుని శైలి వృషభగమనము. శ్రీనాథుని శైలి జవనాశ్వగమనము. ధారాశుద్ధి ధారాళము. గంగాప్రవాహము.

తెనుగు నుడికారము, సంస్కృతప్రౌఢి, ఉద్దండలీల, వర్ణవిన్యాసవక్రత, సీసప ద్యరచనాపద్ధతి శ్రీనాథుని శైలీవిశేషములు. ఇవి యెల్ల పూర్వోదాహృతములు.

## ఆత్మీయత

"బ్రాహ్మీదత్తవరప్రసాదుఁ డ వుదుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁ డ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే?" 13ప.1ఆ.

ఇది శ్రీనాథునికి శృంగారనైషధకృతిభర్త మామిడి సింగనామాత్యుడు ఇచ్చిన కితపత్రము.

"ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి
బహుపురాణజ్ఞుఁ డవు శుభభవ్యమతివి" 12ప.1ఆ.

ఇది శ్రీనాథునికి హరవిలాసకృతిభర్త అవచి తిప్పయసెట్టి ఒసగిన ధ్రువపత్రము.

"కమలనాభుని మనుమఁడ వమలమతివి" 23ప.1ఆ.

ఇది శ్రీనాథునికి భీమేశ్వరపురాణకృతిభర్త బెండపూడి అన్నయామాత్యుడు సమర్పించిన ప్రశంసాపత్రము.

సకలవిద్యాసనాథుడైన శ్రీనాథుడు సరస్వతీవరప్రసాదుడే. ఉరుప్రజ్ఞావిశేషోదయాజిహ్మస్వాంతుడైన శ్రీనాథుడు శుభభవ్యమతియే. అమలమతియే. ఈశ్వరార్చనకళాశీలుడైన శ్రీనాథుడు ఆగమజ్ఞాననిధియే. బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారితబ్రహ్మజ్ఞానకళానిధానమైన శ్రీనాథుడు బహుపురాణజ్ఞుడే; తత్త్వార్థఖనియే. తత్త్వార్థరత్నఖచితమైన ఈశ్వరార్చనకళాశీలసువర్ణపదకము శ్రీనాథుని ఆత్మీయతకు ప్రతీక. పతాక.

ఈశ్వరార్చనకళాశీలుడు అనగా ఆగమోక్తప్రకారముగ శివలింగార్చనము చేయువాడు[176]. ఆగమములన శైవాగమములు. శైవాగమోక్తప్రకారమైన శివలింగార్చనము శాంభవవ్రతము. పాశుపతవ్రతము. అది శ్రీనాథుని కృతులందు అగ్రేసరభాసమానము. నలుడు (104ప.8ఆ.శృం.నై.), పార్వతి(10ప.4ఆ.హ.వి.) పార్థుడు(29ప. 7ఆ.హ.వి.) వ్యాసుడు (101వచ.2ఆ.భీ.పు.)అగస్త్యుడు (60ప.2ఆ.కా.ఖం.) మొదలైనవారు శ్రీనాథుని స్వతంత్రపాత్రచిత్రణమున పాశుపతవ్రతదీక్షాధురంధరులు. శివరాత్రివ్రతము పాశుపతవ్రతము. (117వచ.1ఆ.శి.రా.మా.) అమూలకముగను, సమూలకముగను, అన్యథామూలకముగను శ్రీనాథుని కృతులందు పాశుపతవ్రతము ప్రాధాన్యము వహించినది. అది శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలప్రభావమే.

పాశుపతవ్రతమునందు అంగము లెనిమిది కలవు. వానికి అష్టావరణములని ఆగమవ్యవహారము. అందు గురువునకు అగ్రతాంబూలము. గురుముఖతః దీక్షాసంస్కారము నందవలయును. దీక్షాసంస్కారము నందిన వానికి కొన్ని చిహ్నములుండును. అవి బాహ్యాభ్యంతరభేదమున ద్వివిధము. బాహ్యచిహ్నములందు విభూతిరుద్రాక్షధారణము ముఖ్యమైనది. అది శ్రీనాథుని అనేకపాత్రలకు అలవోకసింగారము. అర్జునుడు "భసితోద్ధూళితనిర్మలావయవుడు." (29,30ప.7ఆ.హ.వి.) "రుద్రాక్షధారణంబాచరించును" వ్యాసుడు "భస్మత్రిపుండ్రాంకఫాలప్రదేశుఁడు." "రుద్రాక్షమాలికారూఢవక్షుండు" (83ప.2ఆ.భీ.పు.) అగస్త్యుడు "రుద్రాక్షభూతిముద్రాముద్రితనిఖిలావయవుడు" (59ప.2ఆ.కా.ఖం.) నారదుడును "విమలభస్మంబు నిఖిలాంగకముల నలఁది యఱుత రుద్రాక్షమాలిక లనువుపఱు"చును.

(95ప.1ఆ.కా.ఖం.) విశ్వానరుడు "విరజానలసంభవంబయిన భస్మంబున సర్వాంగోద్ధూళనం బొనర్చి తిర్యక్పుండ్రంబు లురశ్శిరోబాహుమూలంబుల ధరియించి రుద్రాక్షమాలికాధరుం"డయ్యెను. (240వచ.3ఆ.కా.ఖం.) విశ్వేశ్వరుని సందర్శించిన విప్రులందఱును -ఎందఱు?- పదియునెనుబదివేలును బంచశతియు నేఁబదియునైదు సంఖ్యల యిండ్లవారు" 18,555 మంది గృహస్థులు, భూతిరుద్రాక్షధారులే. (151ప.6ఆ.కా.ఖం.) నాగేశక్షేత్రమునందును "భస్మోద్ధూళనంబొనర్చువారు" కలరు. (47వచ.4ఆ.శి.రా.మా.) అర్జునుడు "వెడద ముత్యములతో నెడవెట్టి గ్రుచ్చిన మంచి రుద్రాక్షదామములు దాల్చు"ను. (111ప.7ఆ.హ.వి.) అల్లాడవేమారెడ్డి "కొత్త ముత్తెములతో రుద్రాక్షమాలిక లష్టోత్తరశతంబు లఱుత దాల్చు"ను. (39ప.1ఆ.కా.ఖం.) ముత్యాల రుద్రాక్షమాలికను ధరించుట ఆగమోక్తప్రకారము. ఇదియెల్ల శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలప్రమేయము.

పాశుపతవ్రతమునకు ప్రధానములైన మంత్రములు కలవు. అవి పంచబ్రహ్మమంత్రములు, ప్రాసాదమంత్రములు, షడంగమంత్రములు, అఘోరపాశుపతము మొదలైనవి. అన్ని మంత్రములకు అసలు మూలమంత్రము పంచాక్షరీమంత్రము. పంచాక్షరీమంత్రపారాయణము శ్రీనాథుని పాత్రలకు పతితపాతము. నలుడు "పంచబ్రహ్మపంచాక్షరంబులఁ బరమనియతి జపించె"ను. (110ప.8ఆ.శృం.నై.) వ్యాసుడు "ప్రణవపంచాక్షరముల .... అర్చనము సేయు"ను. (71ప.2ఆ.భీ.పు.) నారదుని హితోపదేశమున నక్తంచరులు కూడ శివుని "పంచబ్రహ్మషడంగమంత్రములనుం బ్రాసాదపంచాక్షరిన్" .... అభ్యర్చింతురు. (104ప.4ఆ.భీ.పు.) దేవతలు, ఋషులు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవరను "పంచబ్రహ్మపంచాక్షరప్రణవమంత్రంబుల .... నుపచరించి"రి. (32వచ.2ఆ.కా.ఖం.) అగస్త్యుడు "పంచబ్రహ్మంబును శ్రీపంచాక్షరమును ... జపము సేయు నాదిమశైవుం"డు. (62ప.2ఆ.కా.ఖం.) ప్రమథులును "పంచాక్షరీమంత్రపఠనపరు"లే. (279వచ.5ఆ.కా.ఖం.) నాగేశ్వరుని గుడిలో శివరాత్రినాడు "పంచాక్షరీపంచబ్రహ్మాదిమంత్రంబులు జపించువారును" కలరు. (47వచ.4ఆ.శి.రా.మా.) వ్యక్తులే కారు; "శారికాసముదయములు"ను "పంచాక్షరీమంత్రపారాయణంబులు జపియించు"ను. (28ప.3ఆ.భీ.పు.) ఏవంవిధమైన పంచాక్షరీ మంత్రపారాయణము శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలపరాయణమే.

అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు తపస్సు చేయుట నన్నయ భారతమునందిట్లు కలదు.

"అందు మనోవాక్కాయకర్మనియతుఁడై పరమేశ్వరుం దన చిత్తంబున నిలిపి నిరంతరత్రిరాత్రోపవాసంబుల నొక్క మాసంబుం జలిపి ద్విగుణిత త్రిరాత్రోపవాసంబుల రెండవ మాసంబుఁ జలిపి

పక్షోపవాసంబుల మూఁడవమాసంబు సలిపి యూర్ధ్వబాహుండై
యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి వాయు భోజనంబు సేయుచు
నాలవ మాసంబు సలిపి యిట్లతిఘోరతపంబు సేయుచున్న"

297వచ.1ఆ.అర.ప.

ఇది సరిగా వ్యాసభారతమును సంవదించునది. (23-27శ్లో.38అ.అర.ప.) ఇట్టి అర్జునుని అతిఘోరతపము శ్రీనాథుని హరవిలాసమునందు అతిఘోరవీరతపము. (28ప.7ఆ.) అది షట్కాలశివలింగార్చనము.

మృదులభస్మరజశ్శయ్య మేలు కాంచి
యమలరుద్రాక్షధారణం బాచరించి
యర్జునుండు పర్ణశాలికాభ్యంతరమున
హరున కొనరించు నరుణోదయార్చనంబు. 30ప.

కపికేతుం డింద్రకీల
ప్రపాతపతయాళునిర్ఝరస్నాతుండై
యుపచారవిధుల నన్నిటఁ
దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించుఁన్. 31ప.

అవధానంబునఁ బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయ హిమవాఃకర్పూరకస్తూరికా
ద్రవకాలాగురుగంధసారసురభిద్రవ్యంబులం బూవులన్
లవలీసర్జరసాగురుప్రముఖనానాధూపధూమంబులన్. 32ప.

పంచబ్రహ్మషడంగబీజసహితప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుఁ బెండ్లికొడుకున్ మధ్యాహ్నకాలంబు సే
వించున్ నిర్జరరాజసూనుఁ డు మనోవీథీసదాధ్యాసితన్. 33ప.

వైయాఘ్రాజినఖండమధ్యమున తేవన్ బద్ధపద్మాసనుం
డా యింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీంద్రారూఢబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబునన్
సాయంకాలము పూజసేయు నభవున్ సంధ్యానటున్ ధూర్జటిన్.
34ప

అంచితభక్తితో శివుని నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశపదవీపరిశుద్ధసమర్చనావిధిన్
గాంచనకోరకంబుల శుకప్రసవంబులఁ గొండగోఁగులన్

గాంచనకందరాగృహముఖంబుల౯ బార్థు౦డు సంస్కృతార్థు౦డై."

35ప.7ఆ.

పార్థుడు సంస్కృతార్థుడు. అనగా గురుముఖతః దీక్షాసంస్కారము నందిన వాడు. అందువలన సమర్చనావిధి గురూపదేశపదవీపరిశుద్ధము. అది అరుణోదయ, సూర్యోదయ, సంగవ, మధ్యాహ్న, సాయంసంధ్యా, అర్ధనిశాసమయములందు జరిగిన సమర్చనము. కాన షట్కాలశివలింగార్చనము. శివపూజ త్రివిధము. మహాపూజ, గురుపూజ, లఘుపూజ. ఉత్తముడు మహాపూజను, మధ్యముడు గురుపూజను, అశక్తుడు లఘుపూజను చేయవలయునని ఆగమోక్తి. ఆగమోక్తప్రకారమైన షట్కాలశివలింగార్చనము మహాపూజ. అది అర్జునుని అతిఘోరవీరతపము. అర్జునుడు తపస్సుచేసినది ఇంద్రకీలాద్రిపైన. హిమాలయపర్వతము దాటి, గంధమాదనపర్వతమును గడచి ఉత్తరమున ఇంద్రకీలపర్వతము కలదని సంస్కృతాంధ్రభారతములందలి సమాచారము. అది మంచుమయము. అచట పర్ణశాల అసహజము. ఉపచారములు నిరవకాశము. పన్నీరు, కస్తూరి, కర్పూరము, కాలాగురుద్రవము, మంచిగంధము, పువ్వులు, లవలీసర్జరసము లభించునవి కావు. కావున అవచి తిప్పయసెట్టి అంద౯జేసినవి, శ్రీనాథుడు ఎగుమతి చేసినవి కావలయును. ఇంద్రకీలాద్రి మీద బిల్వద్రుమము, ఆ బిల్వద్రుమచ్ఛాయను చంద్రకాంతశిలావితర్ది, ఆవితర్దిపై వ్యాఘ్రాజినమును ఏమోగాని, ఇది అర్జునునిచేత పద్మాసనము వేయించిన శ్రీనాథుడు తిరుగాడిన కొండవీడు కొండను, ఈ కొండమీది మారేడుచెట్టును, ఈ మారేడుచెట్టు నీడను శిలావితర్ది, ఈ శిలావితర్దిపై పులితోలును గుర్తు చేయును. ఇంద్రకీలాద్రి మీది సంపెంగమొగ్గలు, దిరిసెనపువ్వులు, కొండగోగులు కొండవీడు కొండ మీదివే అగును. కొండవీటి రెడ్డిరాజులు మహాశివభక్తులు. అనవేమారెడ్డి ప్రతిదినము షట్కాలశివలింగార్చనము చేసినట్లు చాటుశ్లోకము కలదు[177]. అతడు "కూరిమి పినతండ్రి" అనిన పెదకోమటి వేమారెడ్డి కూడ అట్టివాడే అగును. పెదకోమటి వేమారెడ్డి మంత్రి మామిడి సింగనామాత్యుడు, సింగనామాత్యుని గురువు శంకరమౌని, శ్రీనాథుడు కలిసి శ్రీశైలయాత్ర చేసినట్లు పినపాడు శాసనమునందు కలదు[178]. శంకరమౌని శ్రీనాథుని గురువును కావచ్చును. గురుముఖతః దీక్షాసంస్కారమునందిన శ్రీనాథుడు స్వీయషట్కాలశివలింగార్చనమును అర్జునుని అతిఘోరవీరతపముగ మలచినట్లు అనుమేయము. ఇదియెల్ల శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలప్రతిఫలనము.

అన్నిటికంటె అగ్రేసరమైనది ఆత్మానుసంధానము. ఆత్మయందు శివుని అనుసంధానము చేయుట ఆత్మానుసంధానము. అంతరంగజ్యోతిర్లింగ

పరిష్వంగము. నలుడు "పద్మాసనస్థుఁడై .. మానసకమలకర్ణికయందుఁ గాలకంఠు భావిం"చుట (110ప.8ఆ.శృం.నై.) అర్జునుడు "బద్ధపద్మాసనుం"-డయి "మనోవీథీసదాధ్యాసితన్" సదాశివుని సేవించుట. (33,34ప.7ఆ.హ.వి.) మహాదేవుడు "ప్రత్యభిజ్ఞానమనియెడి ప్రత్యయమున విశ్రుతం బైన యాత్మ భావింపవలయు"నని ఉపదేశించుట (181ప.5ఆ.భీ.పు.) విశ్వానరుడు "పుండరీకచర్మాసనంబున .... నిరస్తసమస్తోపాధికస్వప్రతిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయస్వరూపుండును పరమశివపరమజ్యోతిర్లింగమూర్తియునైన యవిముక్తవిశ్వేశ్వరశ్రీమన్మహాదేవరను భావించి భావించి చూచు"ట (240వచ.3ఆ.కా.ఖం.) ఆత్మానుసంధానము. ఇదియెల్ల శ్రీనాథుని ఈశ్వరార్చనకళాకౌశలము.

కవి ఆత్మీయత కవితాభావాంబరవీథిలో విశ్రుతవిహారము చేయును.

"అభినవసంధ్యాతాండవ
రభసరయచ్ఛిన్నహిమధరాధరకన్యా
ప్రభుహారాస్థుల భంగిన్
నభస్స్థలిం దారకాగణంబులు పొడిచెన్."

158ప.8ఆ.శృం.నై.

ఇది శ్రీనాథుని స్వీయకవిత. ఇందు తారకలు అభినవసంధ్యాతాండవరభసవేగమున జాఱి చెదరిపడిన శివుని హారాస్థికలు. అంతేకాదు. మఱొక పద్యమునందు "మృడు నంబరంబునం దాపించినట్టి ముత్యాలు." (161ప.8ఆ.శృం.నై.) కాలమేఘములు.

"ఒండొరెడ మెండుకొని ఖండపరశుకంఠమూలకఠోర కాలకూటవిషమషీకళంకపంకచ్ఛాయాచ్ఛటాపటలంబు భంగి నంగీకరించు"ను. (21వచ.2ఆ.హ.వి.)

"సంధ్యారాగరేఖావళుల్ .... శ్రీకంఠస్థిరదీర్ఘపాటలజటాశ్రేణిన్ విడంబించు"ను. (32ప.2ఆ.భీ.పు.) అంధకారము.

"-రజతగిరియందుఁ దాండవారంభరభస
భంగిపతితపరశ్వధపాణివికట
కంధరారుద్ధగజకృత్తికంథశంక
ప్రమథులకుఁ దోఁప .... ప్రబలె." 35ప.2ఆ.భీ.పు.

చంద్రబింబము శ్రీనాథునికి అర్చితశివలింగప్రతిబింబము.

"కాదు తా దుదయాద్రికనకకూటం బిది
డంబైన పానవట్టంబు గాని
కాదు తా దిది సుధాకరపూర్ణబింబంబు
కాశ్మీరశంభులింగంబు గాని
కాదు కాదుదయరాగప్రకాశం బిది
నవకుంకుమాలేపనంబు గాని
కాదు కాదు కళంకచ్ఛటారింఛోళి
పూజచేసిన కల్వపువ్వు గాని
యనఁగ సప్తార్ణవములు మిన్నందికొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమశరసార్వభౌము ముత్యాల గొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెలవెల్లిఁ దేల్చె." 42ప.2ఆ.భీ.పు.

మేడి చెట్టు కూడ శివరూపము.

"గమియ నామూలచూడంబుగా ఫలించి
యంబరము మోచియున్న యుదుంబరములు
లీల బ్రహ్మాండభాండమాలికల భూష
లవధరించిన వృషభాంకు ననుకరించె." 91ప.1ఆ.కా.ఖం.

హంసల రొద సహితము శివపరము.

"పరలోకస్థుఁ బతిన్ ఋషాంకు బ్రతికింపంగోరి యోంకారశం
కరు బ్రోలన్ రతి ముక్తకంఠముగ నాక్రందించునా నొప్పెన
ప్పురబాహ్యోపవనాంతదీర్ఘికల (రేపున్ మాపు వీతెంచు) పు
ష్కరకింజల్కభుజిక్రియాసుఖితహంసక్రేంక్రియారావముల్."

8ప.2ఆ.శి.రా.మా.

ఇట్లు దృశ్యమానజగత్తు శ్రీనాథునికి శివమయము. ఇది యెల్ల శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలప్రకాశము.

శివుని ప్రత్యక్షరూపము (135ప.2ఆ.హ.వి54ప.4ఆ.కా.ఖం.), పెండ్లికొడుకు రూపము (91ప.4ఆ.హ.వి.), మనుగుడుపు పెండ్లికొడుకు రూపము (5ప.5ఆ.హ.వి.) ఆదిభిక్షురూపము (67ప.5ఆ.హ.వి.), కిరాతరూపము(41ప.7ఆ.హ.వి.), సర్వకళా రూపము (123వచ.4ఆ.9వచ.5ఆ.భీ.పు.), గృహమేధిరూపము (187ప.7ఆ.కా.ఖం.), త్రైలోక్యాధిపతిరూపము (15-19ప.5ఆ.శి.రా.మా.); పార్వతి జంగమదేవిరూపము (93ప.2ఆ.హ.వి.), యువతీరూపము (23వచ.3ఆ.హ.వి.), తపస్వినీరూపము (11ప.4ఆ.హ.వి.), వృద్ధసీమంతినీరూపము (110వచ.2ఆ.భీ.పు; 160,

161ప.7ఆ.కాఖం.), సకలజగదధిష్ఠాత్రిరూపము (150ప.4ఆ.కాఖం.) అన్నపూర్ణా విశాలాక్షీరూపము (5ప.7ఆ; 148ప.7ఆ.కా.ఖం.), పార్వతీపరమేశ్వరుల యౌగపద్య రూపము (148ప.2ఆ.భీ.పు.) అన్యోన్యతావిలాసరూపము(144-147వచ.4ఆ.కా.ఖం.) శ్రీనాథుని వర్ణచిత్రప్రదర్శనము[179] ఇదియెల్ల శ్రీనాథుని ఈశ్వరార్చన కళాశీలనిదర్శనము.

శతకప్రాయమైన (33-37ప.6ఆ.హ.వి.), ఉదాహరణప్రాయమైన (93-99ప.7ఆ.హ.వి.), వచనములైన (212వచ.3ఆ; 53వచ.5ఆ.భీ.పు.), తోటక వృత్తములైన (249-251ప.4ఆ.కా.ఖం.) గద్యలైన (250వచ.4ఆ.కా.ఖం; 90వచ.4ఆ.శి.రా.మా.) రఘటలైన (21ప.5ఆ.శి.రా.మా.) స్తోత్రములు శ్రీనాథుని ఈశ్వరార్చనకళాశీలసూత్రములు.

ఇంతగా శ్రీనాథుడు ఈశ్వరార్చనకళాశీలుడైనను వీరశైవుడు కాడు. హరిహరాభేదభావము కల స్మార్తశైవుడు. నలుడు "పాంచరాత్రోదితక్రియాపథమున" హరిని పూజించుట (112ప.8ఆ.శృం.నై.) వ్యాసుడు అష్టాక్షర, ద్వాదశాక్షరమంత్రముల విష్ణువును అర్చించుట(68ప.2ఆ.భీ.పు.) నలుడు విష్ణుస్తోత్రము చేయుట (117ప.8ఆ.శృం.నై.) విష్ణువు గ్రామిక రూపము (44,45ప.6ఆ.హ.వి.), ఉత్థానశయనరూపము (40ప.4ఆ.భీ.పు; 22ప.4ఆ.కా.ఖం.) విష్ణుపట్టాభిషేకము (296ప.4ఆ.కా.ఖం.)విష్ణ్వవతారము (48ప.86ఆ.హ.వి.), లక్ష్మీదేవిరూపము (71ప. 78ప. 6ఆ.హ.వి.)లక్ష్మీస్తోత్రము (48ప.3ఆ.కా.ఖం.)భాగవతుల వర్ణనము (144-166ప.3 ఆ.కా.ఖం.) శ్రీనాథుని కృతులందు కలదు[180]. అంతేకాదు.

"యథాశివస్తథావిష్ణుర్యథావిష్ణుస్తథాశివః
అన్తరం శివవిష్ణోశ్చ మనాగపి న విద్యతే" 41శ్లో.23అ.

అను శ్లోకమునకు, "ఫాలలోచనుఁడు ప్రావృషేణ్యపయోధర ధ్వానగంభీరంబగు నెలుంగున "విష్ణుండ యేను ... నేన విష్ణుండ నాకు విష్ణునకు భేదంబు లేదు"అన్నట్లు (300వచ.4ఆ.కా.ఖం.) శ్రీనాథుని తెనుగు సేత. ఇది శ్రీనాథుని హరిహరాభేదభావమునకు జీవనాడి.

భవుడు భవనానికి ఉపదేశించిన మహాజ్ఞానము బ్రహ్మజ్ఞానము. (176-190వచ. 5ఆ.భీ.పు.) అది

"సద్గురునాథోపదిష్టసరణి" (161ప.5ఆ.భీ.పు.)

"ప్రణవాత్మ వర్గరూపస్పర్శనామూర్తి
ప్రణవంబు మూఁడక్షరములు గలది

యది పరబ్రహ్మ మేకాక్షరంబున నొప్పె
నది ఋగ్యజుస్సామమందు నిలిచె
ననులోమకము లుదాత్తాదిస్వరములు తా
లంబులు వర్ణత్రయంబు లవియు
వర్ణత్రయంబు సర్వంబు నంతర్భావ
మొందుట యది యేమి సందియంబు
గతి నకారముకారమకారములను
నాత్మ మాయను జీవాత్మ నాటు కొల్పి
జీవు నీశ్వరబుద్ధి భజింపవలయు
ధృతి దఱుఁ గనీక యెప్పుడు మతివివేక." 184ప.5ఆ.

ఇది శ్రీనాథుని బ్రహ్మజ్ఞానకళానిధానమునకు కరదీపిక. ఇందు "జీవు నీశ్వర బుద్ధి భజిం"చుట బ్రహ్మజ్ఞానప్రయోజనము.

శ్రీనాథుడు బ్రహ్మజ్ఞానకళానిధానము, ఈశ్వరార్చనకళాశీలుఁడు మాత్రమేగాక, తీర్థయాత్రాచణశీలి. లోపాముద్రాగస్త్యవ్యాసుల దక్షిణకాశీయాత్రను, లోపాముద్రాగస్త్యుల దక్షిణకాశీ, శ్రీశైలయాత్రలను శ్రీనాథుని శ్రీశైల, దక్షిణకాశీయాత్రల ప్రతిఫలనము పూర్వోక్తము. శ్రీనాథుని కాశీయాత్ర కూడ భీమేశ్వరపురాణ, కాశీఖండములందు ప్రతిఫలించినది. "విశ్వనాథుని గుడిమీఁది విమలభాసురంబైన హేమకుంభంబు" శ్రీనాథుని "కన్నుల పండువు" (26ప.2ఆ.భీ.పు.) "అంతర్గేహమున విశ్వనాయకతాండవారంభమర్దలరవంబు"శ్రీనాథుని వీనుల విందు. (28ప.2ఆ.భీ.పు.) ఢుంఠివిఘ్నేశునిష్ఠురవేదిపైఁ గొదమచుక్కలరాజుఁ గుస్తరించు విధుడు "శ్రీనాథుని నయనామృతము (44ప.2ఆ.భీ.పు.)" కాలభైరవుని "ఢక్కాడిండిమము"మ్రోత శ్రీనాథుని శ్రవణానందము. "కలుమఠంబులయందు యతులు ప్రాణాయామ మభ్యసిం"చుట శ్రీనాథుని చక్షుఃకరంభము. (47ప.2ఆ.భీ.పు.) వారణాసీనగరోపకంఠము, భాగీరథి, మణికర్ణిక, విశ్వేశ్వరాలయము, ఢుంఠివిఘ్నేశుఁడుండు ప్రదేశము, లోలార్కనగరి మోసాల, దండపాణి, సురాభాండేశ్వరము, కుక్కుటస్థానము, కాలభైరవదేవుగవను, శ్రీవిశాలాక్షి గోష్ఠీవాటి, అపవర్గమంటపము శ్రీనాథుడు కనులారఁ గాంచినట్లు కలదు. (36,41ప.2ఆ.కా.ఖం.) అంతేకాదు. కాశీక్షేత్రము "లోలార్కకేశవులు కోటిద్వయంబును, భాగీరథి నారియు, ధర్మంబు శరంబును, గలి లక్ష్యంబును, విరూపాక్షుండు ధన్వియుంగా ముక్తిపురంధ్రీలతానుకారంబును జంద్రరేఖాఛాయాప్రకారంబై తాను గోదండంబు భంగి నంగీకరించి" నట్లు శ్రీనాథుని అమూలకవాణి. రూపరూపకము. (42వచ.2ఆ.కా.ఖం.)ఇది,

"కాశినగరి ధనుర్వల్లి గంగ నారి
కోటియుగ్మంబు లోలార్క కుధరధరులు
వృషము బాణంబు లక్ష్యంబు వృజినరాశి
విశ్వనాథుండు ధన్వి యుర్వీకళత్ర" 176ప.5ఆ.

అని శ్రీనాథుని పునరుద్ఘాటనము. అమూలకము. గంగానది నారిగాను, కాశీనగరము ధనురాకృతిగాను కనిపించును. ఇది శ్రీనాథుని కాశీయాత్రకు నిదర్శనము. పెదకోమటి వేమారెడ్డి కాశీక్షేత్రమునందు ధర్మకార్యములు చేసినట్లు శాసనప్రమాణము కలదు. అది పూర్వోక్తము అవి నిర్వహించుటకు శ్రీనాథుడు కాశీయాత్ర చేయుట అనుకూలము. శ్రీనాథుడు బ్రహ్మజ్ఞానకళానిధానము, ఈశ్వరార్చనకళాశీలుడు, తీర్థయాత్రాచణశీలి మాత్రమే కాదు; ఆంధ్ర దేశాభిమాని. ఆంధ్ర దేశీయములైన ఆచారవ్యవహారములు, ఆహారపదార్థములు, ఆలయ సంప్రదాయములు, స్థానిక విశేషములు, స్థానికప్రకృతివిషయములు భీమేశ్వరపురాణ, కాశీఖండ కృతిసమీక్షలందు, అలంకరణసంస్కారములు పలనాటివీరచరిత్రకర్తృత్వసమస్యను పూర్వోక్తము. ఆంధ్రదేశీయములైన ఆహారపదార్థములు కాశీఖండమునందు రాశీభూతము.

"అపూపంబులు, లడ్డువంబులు, నిడ్డెనలు, గుడుములు, నప్పంబులు, నిప్పట్లు, జిల్లేడుకాయలు, దోసియలు, సేవియలు, నంగరపొలియలు, పోవెలు, సారెసత్తులుఁ, జొత్తరలుఁ జక్కిలంబులు, మణుఁగుఁబూవులు, మోరుండలు .... గసగసలు, బెసరుపులగములుఁ, జెఱుకుఁగుడుములు, నరిసెలు, బిసకిసలయముల వరుగులుఁ, జిఱుగడములుఁ, బడిదెములుఁ, బులుపలుఁ, బులివరుగులు, నప్పడంబులుఁ, బప్పులు, రొట్టియలును, చాపట్లుఁ, బాయసంబులుఁ ..... గందయు, బొందయుఁ, జారులుఁ, దియ్యగూరలుఁ, బచ్చడులు, బజ్జులు, గిచ్చళ్లు, గిజ్జిఱులు, వడియంబులుఁ, గడియంబులుఁ, గాయంబులు, గంధతోయంబులు, నుంబ్రాలు, నానబాలు, ననుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిలిమిడియును, జలిమిడియును, ద్రెబ్బడయు, వడయు, నుక్కెరలుఁ, జక్కెరలును, నేతులుఁ, దేనెతొలలుఁ, బిట్టును, గట్టును, దోఁపలుఁ బూపలు, మోదకంబులు, గుడోదకంబులు, ముక్కులు, మిరియలి చొక్కాంపుఁ బేరుఁ, బ్రాలమిలమిలని మడుంగు రాజనంపుటోగిరంబులు, షాడబంబులతోడఁ, బానకంబులతోడఁ, దిమ్మనంబులతోడ, దధిపిండఖండంబులతోడ, మీఁగడలతోడ, మజ్జిగలతోడ, నూరుంగాయలతోడ, నంబకళంబులతోడ,

రసావళులతోడం గూడ, భుగభుగలం బొగపుంగంపులతోడం బ్రతి భటించు రామతామోదంబును, రామతామోదంబుతో మంతనం బాడు మెంతుల నెత్తావులు, మెంతుల నెత్తావులతో బిత్తరించు జీర కంబుల సౌరభ్యంబులును, జీరకంబుల సౌరభ్యంబులతోడం బ్రస్త రించు కుస్తుంబరీకిసలయవాసనలును, గస్తుంబరీకిసలయ వాసనలతోడం బిసాళించు గటివేపాకు పరిమళంబును, గటివేపాకు పరిమళంబుతో సంబంధించు కమ్మకసిందగంధంబులును, గమ్మ కసిందగంధంబులతోడం దార్కొను నేలకులసౌరభంబులును ..... మిరియంబు పెరిమయుఁ, బసుపు పసయు, శొంఠి సొబగు, నావ తేవయుఁ, జెందుపు చేఁగయుఁ గరాంబువు మవ్వంబును, బిప్పలి యొప్పును, నల్లంబు మొల్లంబును, జింతగ్రొజ్జు రజ్జును, బేలపిండి మెండును నిప్పపూమొగ్గల యగ్గలికయు, వెన్న పెన్నా టుకంబును ..." 186వచ.7అ.

ఐహికమైన ఆంధ్రదేశాభిమానము, ఆధ్యాత్మికమైన ఈశ్వరార్చన కళాశీలము, బ్రహ్మజ్ఞానకళానిధానవిధానము శ్రీనాథుని ఆత్మీయతాలక్షణములు. అవి శ్రీనాథుని కృతు లన్నిట ప్రతిఫలించినవి.

శ్రీనాథుడు బ్రహ్మజ్ఞానకళానిధానము, ఈశ్వరార్చనకళాశీలుడు, తీర్థ యాత్రాచణశీలి, ఆంధ్రదేశాభిమాని మాత్రమే కాడు. ఆత్మాభిమాని కూడ. అనవే మారెడ్డి కొలువులో అడుగు పెట్టినను, మామిడి వేమనామాత్యుని, ప్రెగడన్నను, సింగనామాత్యుని, భాస్కరుని, అవచితిప్పయసెట్టిని ఆశ్రయించినను, పెదకోమటి వేమారెడ్డి విద్యాధికారి అయినను, రాచవేమారెడ్డి విద్యాధికారి అయినను, పంటు మైలారురెడ్డి ప్రాపు గాంచినను, తెలుగురాయల ఆదరమును పడసినను, బెండపూడి అన్నయామాత్యుని ఆశ్రయించినను, అల్లాడ వేమ, వీరభద్రారెడ్ల ఆస్థానవిద్వాంసు డైనను, ప్రౌఢదేవరాయల కనకాభిషేకసత్కారము నందినను, విస్సన మంత్రి హేమపాత్రాన్నము కలిగినను, సర్వజ్ఞ సింగభూపాలుని సందర్శించినను, రాజులకు మంత్రులకు దాసుడు, దాసానుదాసుడు కాలేదు. "అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికాభిక్షాదానము సేయురా" అని ఏకవచ నప్రయోగము చేసిన ధీరుడు. "సాంపరాయని తెలుంగా! నీకు బ్రహ్మయువౌ" అని ఆశీర్వదించిన ఉదాత్తుడు. "నీకు"అని ఏకవచన ప్రయోగము. అల్లాడవేమారెడ్డి ఆదేశమున వీరభద్రారెడ్డికి అంకితమిచ్చిన కాశీఖండమునందు "కో రాజ్యశ్రియ మాప్య నాంధపదవీం యాతః" అను పంక్తి నిమిత్తమాత్రముగ (35శ్లో.15అ.) శ్రీనాథుడు రచించిన పద్యగద్యములివి :

"ఆదిగర్భేశ్వరుండౌట యనుచితంబు
మిగులఁ జక్కని వాఁడౌట మేలు గాదు
పాప మభినవయౌవనోద్భాసి యగుట
యరయ మంచిగుణంబుల యవగుణములు. 200

అవినయనిదానంబైన స్వాతంత్ర్యంబును గుతూహలబహుళంబైన స్వభావంబునను ధైర్యప్రతిపక్షంబైన యౌవనారంభంబునను నెవ్వనికేని మనోవికారంబు పుట్టకుండునే? అదియునుంగాక 201

ఘనతరాహంకారకాలకూటవిషాన
లాభీలములు కటాక్షాంచలములు
దుర్వారతరతీవ్రగర్వగళగ్రాహ
కలితగాద్గద్యఘర్ఘరము మాట
యస్మితాసంప్రభూతస్మయాపస్మార
విస్తృతధైర్యంబు వినయగరిమ
యుద్దామదర్పభావోష్ణదాహజ్వరా
రంభసంభృతివికారంబు మనసు
చరణచంక్రమదభిమానసన్నిపాత
జాతసర్వాంగకమ్ములు జనపతులకు
భూభుజుల తప్పె యది వారిఁ బొందియున్న
ధరణిసామ్రాజ్యభారంబు తప్పు గాక? 202

భువనైకధన్విచేఁ బుష్పాయుధుని చేతఁ
బ్రణవాస్త్రమున నేటు పడని వాఁడు
నతిగాఢమైన క్రోధాంధకారంబునఁ
గన్నుల నంధుండు గాని వాఁడు
నిర్నిబంధనలోభనిద్రాభరంబునఁ
బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షలీలాసీధుమదమున
మనములోపల నన్నుఁ గొననివాఁడు
లేఁడు భూపతి గలిగెనా వాఁడు నృపుండె
విశ్వధాత్రీజనుల పాలి వేల్పుగాక!
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
నంతరారుల నిర్జింప నలవిగాదు." 203ప.4ఆ.

ఇది పాలకులను వజ్రపుటంచు సువర్ణఖడ్గమున ఖండించునది. ఇందు తప్పు

ఐశ్వర్యము, సౌందర్యము, యౌవనము, సామ్రాజ్యముల దనుట అవహేళనము. పాలకుల పరదారాగమనము, దురహంకారము, వాక్పారుష్యము, వినయాభినయము, మనోవికారము, దురభిమానము, కామము, క్రోధము, లోభము, ధనమదము తీవ్రముగ ప్రత్యాఖ్యాతములు. కామాదులు అంతశ్శత్రువులు, రాజులు బాహ్యశత్రువులను పరిహరింపఁగలరేకాని, అంతశ్శత్రువులను అణచలేరని అధిక్షేపము. అణచిన వాడు కలడేని, అతడు రాజు కాడు. దైవమని ఆరాధనము. ప్రకరణము చంద్రుని ప్రవర్తనము. నిరాకరణము రాజుల ప్రవర్తనము. రాజాశ్రితుడైనను రాజదోషనిరసనము చేయుట శ్రీనాథుని ఆత్మాభిమానమునకు నిదర్శనము.

# పోతన

తెలుగు సాహిత్యజగత్తునకు కవిత్రయము వారు త్రిమూర్తులు; శ్రీనాథుడు, పోతన సూర్యచంద్రులు అని ప్రసిద్ధము. శ్రీనాథుడు, పోతన బావ, బావమఱు దులని ఒక ఐతిహ్యము కలదు. శ్రీనాథుడు సూర్యుడు, పోతన చంద్రుడు కావచ్చు నుగాని; శ్రీనాథుడు బావ, పోతన బావమఱిది కాఁ జాలరు. శ్రీనాథుని బావమఱది పోతన బమ్మెర పోతన కాడు. దగ్గుబల్లి పోతన. దగ్గుబల్లి దుగ్గన అన్న. సూర్యచం ద్రుల కాలముల వలె శ్రీనాథుడు, పోతనల కాలములు భిన్నము.

## కాలము

బమ్మెర పోతన కాలము తెలియుటకు- భోగినీదండకము, దాక్షాయ ణీవివాహము, ఒడయనంబివిలాసము అను గ్రంథములు మాత్రమే దారి చూపఁ గలవు. భోగినీదండకము సవివాదసాధనము. దాక్షాయణీవివాహము, ఒడయనంబి విలాసము నిర్వివాదసాధనములు. దాక్షాయణీవివాహాశ్వాసాంతగద్యలందు ఇట్లు కలదు[181]

> "ఇది బమ్మెరకులపవిత్ర ..... పోతనామాత్యపౌత్త్ర మల్లయా మాత్యపుత్త్ర .... ప్రౌఢసరస్వతినామధేయవరతనూభవకేసనకవి మల్లనకవిప్రణీతంబైన దాక్షాయణీవివాహంబు ..."

పోతన కొడుకు మల్లన. మల్లన కొడుకు ప్రౌఢసరస్వతి. ప్రౌఢసరస్వతి కొడు కులు కేసన, మల్లన జంటకవులు. వీరి తోఁబుట్టువు భర్త అజ్జరపు పేరయ లింగము. అతని కృతి ఒడయనంబివిలాసము. అందు పేరయలింగము వంశ వృక్షము కలదు[182] పేరయలింగము ముత్తాత హరిమంత్రి. కేసన, మల్లన జంటక వుల ముత్తాత పోతన. పేరయలింగము, కేసన, మల్లన జంటకవులు ఒక తరము లోని వారు కావున, వారివారి ముత్తాతలు హరిమంత్రి, పోతన ఒక తరములోని వారగుదురు. హరిమంత్రి తాత కొండన-పోతన తాత ఎల్లన. (24ప.1స్కం.) కాఁబట్టి కొండన, ఎల్లన ఒక తరములోని వారగుదురు. కొండన గజపతిని మెప్పించి, గౌతమీతటమునందలి అజ్జరమను గ్రామమును అగ్రహారముగ పడసినట్లు ఒడయనంబివిలాసమునందు కలదు[183]

"శ్రీ రంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్ర బహువిద్యారూఢి మెప్పించి యా
వీరాగ్రేసరుఁ డియ్య కొండన మహావిఖ్యాతిగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరం బనఁ గఁ దాఁ దెచ్చెన్ మహాగ్రామమున్."

వీరాగ్రేసరుడైన గజరాట్సింహాసనాధ్యక్షుడు కపిలేంద్రగజపతి. 1448 వ సంవత్సరమునాటి పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలుకాలోని పెనుగొండ శాసనమునందు గజపతిక్షోణీశుని పరిపాలనము సూచింపఁ బడినది[184].

"శాకాబ్దే గగనాద్రిరామధరణీసంఖ్యా సమాపూరితే
విభవాబ్దేచ తపస్య మాశిశశినోవారే ద్వితీయం తిథౌ
పేన్గోణ్డాఖ్యపురోత్తమం గజపతిక్షోణీశసందీపితమ్..."

పెనుగొండపురము 1448 వ సంవత్సరమునందు గజపతిక్షోణీశసందీపితమైనది. అజ్జరము గౌతమీతీరక్షోణిని కలదు. కావున కొండన గజపతిని మెప్పించి, అజ్జరమును అగ్రహాముగ పడసిన కాలము స్థూలముగ 1450 వ సంవత్సరము కావచ్చును. అది కొండన తరము. అనగా పోతన తాత ఎల్లన తరమును. తాత ఎల్లన తరము 1450ప్రాంతము కావున, మనుమడు పోతన తరము తదనంతరమగుట తథ్యము. వృద్ధుడైన తాత, యువకుడైన మనుమడు సమకాలికు లగుట సంభవము. కాఁ బట్టి 1450 ప్రాంతమున పోతన యువకుడు.

పోతన మునిమనుమలు కేసన, మల్లన జంటకవుల దాక్షాయణీవివాహమునకు గురజాల చిన మల్లనసోమయాజి కృతిభర్త. అతని మునిమనుమని కొడుకు పేరమంత్రి 1756 వ సంవత్సరమునందు దాక్షాయణీవివాహమునకు ప్రత్యంతరము వ్రాయించినట్లు కలదు[185]. పేరమంత్రికి, గురజాల చినమల్లన సోమయాజికి నడుమ నాలుగు తరములు కలవు. పేరమంత్రి తరము 1756 ప్రాంతమైన, గురజాల చినమల్లన సోమయాజి తరము 1796-160 (40x4) = 1596ప్రాంతము కంటె పూర్వము కాఁ జాలదు. గురజాల చినమల్లనసోమయాజి(కృతిభర్త)తరమే, కేసన, మల్లన జంటకవుల తరము. (కృతికర్తలు) కేసన, మల్లన జంటకవుల తరము 1596 ప్రాంతము కంటె పూర్వము కానిచో, వారి ముత్తాత పోతన తరము 1596-120(40x3) = 1476 ప్రాంతము కంటె పూర్వము కాఁ జాలదు. 1476 తర్వాతను కావచ్చును. 1450 ప్రాంతమున యువకుడు, 1476 ప్రాంతమున తరమును అయిన, పోతన కాలము 1425-1500 కావలయును.

శ్రీనాథుని కాలము 1360-1450. పోతన కాలము 1425-1500. ఉభయులకు అరువదియైదు సంవత్సరములు (1425-1360 = 65) వయోభేదము కలదు. కావున

శ్రీనాథుడు, బమ్మెరపోతన బావ, బావమఱది అగుట మఱి అసంభవము. ఇద్దఱి సంబంధమును అస్తమయోన్ముఖుడైన సూర్యుడు, ఉదయోన్ముఖుడైన చంద్రుడు కనిపించు ఆకాశమునకు సంకాశము.

## కృతులు

పోతన కృతులు అనునవి భోగినీదండకము, నారాయణశతకము, వీరభద్ర విజయము, భాగవతము. నాల్గింటికిని కర్తృత్వసమస్యలు కలవు

### భోగినీదండకము

ఇది పోతన రచింపలేదనుటకు గల అవకాశములివి:

1. పోతన మహాభక్తుడను పూజ్యభావము.
2. పోతన రాజాంకితము చేయడను విశ్వాసము.
3. భోగినీదండకము వేశ్యావిషయమను విగర్హ.

పోతన మహాభక్తుడను పూజ్యభావము కలుగుటకు హేతువు మహాభాగవతము. భాగవతరచనాకాలమునకు పూర్వమే పోతన మహాభక్తుడగును. అంత మాత్రమున పోతన పుట్టుమహాభక్తుడు కావలసిన ఆవశ్యకము లేదు. అయినట్లు ఆధారమును లేదు. మహాభక్తుడు కాకపూర్వము, యౌవనమునందు పోతన భోగినీదండకమును రచించుట అసంభవము కాదు.

భోగినీదండకము రాజాంకితమే. దండకాంతపద్యమునందు అంకితవిషయమును కలదు. పోతన రాజాంకితము చేయడను విశ్వాసమునకును హేతువు భాగవతమే. అందలి "ఇమ్మనుజేశ్వరాధములకు" అను పద్యము భాగవతవిషయము. ప్రతి గ్రంథవిషయము కాదు. ప్రారంభదశను రాజాంకితము చేయుట, పరిణతదశను దైవాంకితము చేయుట కలదు. ఇందుకు తిక్కన ప్రథమోదాహరణము. పోతన ఏ రాజునకు సంబంధించి దండకమును రచించెనో, ఆ రాజునకు అంకితము చేయుట అసంగతము కాదు. ఆ రాజును ఆ దండకమునందు పాత్రపరముగ అభివర్ణించుట కూడ అసందర్భము కాదు.

భోగినీదండకము వేశ్యావిషయమే. కాని వేశ్యాలౌల్యము లేదు. ఆ వేశ్యయును సాధారణ వేశ్య కాదు. "సర్వజ్ఞసింగక్షమానాథుఁ దప్పించి దర్శించి లోకత్రయిన్నీకు నర్పింతునే" అని తల్లి బోధించినను, "అన్యుల న్జేరనేను" అని "తల్లితో మాటఁ జాలించి"న అసాధారణవేశ్య. అంతేకాదు. భోగినీదండకమునందు

అశ్లీలమైన అంశము లేదు. అసభ్యమైన ప్రసంగములేదు. సింగభూపాలుడు గోపాల దేవోత్సవక్రీడలో మేడలో ఉండగా చూచిన వారకాంత తల్లి వారించినను, అక్క సాయమున సింగభూపాలుని దర్శించుట, సింగభూపాలుడు "సద్భోగినీపట్టముం దిట్టమౌనట్టుగా వే ప్రసాదిం"చుట ఇతివృత్తము.

ఇక భోగినీదండకమును పోతన రచించెననుటకు గల ఆధారములివి:

1. దండకాంతపద్యము : భోగినీదండకము చివఱ కల పద్యమిది:

"పండితకీర్తనీయుఁ డగు బమ్మెరపోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదానవిహర్తకు రావుసింగభూ
మండలభర్తకున్ వినుతమానవనాథమదాపహర్తకున్."

ఇందు బమ్మెర పోతన భోగినీదండకమును రచించినట్లు కలదు. అది రావుసింగభూపాలునికి రచించినట్లును కలదు. అనగా రావుసింగభూపాలునికి అంకితమని అర్థము. ఇట్లు కర్తృనిర్దేశము, అంకితసూచనము కల పద్యము దండకాంతమునందుండుట సర్వసాధారణము కాదు. భోగినీదండకమును సర్వసాధారణము కాదు. భోగినీదండకాంతపద్యము పోతన పద్యమువలెనే కలదు.

"స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్." 545ప.8సం.

అను పోతన భాగవతపద్యమునకు ఒరవడి వలె కల భోగినీదండకాంతపద్యము, భోగినీదండకము పోతనకృతమనుటకు నిర్ధారకసాధనము.

2. శైలీసామ్యము : ఇది వస్తుతః నిర్ధారకసాధనము కాదు. శైలీసామ్యమును బట్టి కర్తృనిర్దేశము చేయుట ప్రామాదికము. నిర్దిష్టకర్త శైలీసామ్యమును బట్టి నిర్ధారణచేయుట ప్రామాణికము. పోతన శైలికి అతివేలమైన అంత్యానుప్రాసము ప్రధాన లక్షణము. అది భోగినీదండకమునందు ఆద్యంతము కలదు.

"వసంతావనీనాథసంసేవితాంచత్పదాంభోజు నంభోజరాజీసుహృత్తేజుఁ దేజోజయప్రాభవోద్దాము, నుద్దామజన్యావనీభీము"

"బాలన్ గళత్కుంతలవ్రాతఫాలన్ గరాంభోజరాజత్కపోలన్ సమందోష్ణనిశ్వాసజాలన్ విపర్యస్తసన్యస్తచేలన్ మహాందోళనప్రేంఖితస్వర్ణడోలన్"

"కుమారాన్నపోతావనీనాథసూనున్ వధూచిత్తవిత్తాపహారహా
రావధానున్ సదాదానవిద్యానిరూఢున్ మనోజాతహృద్యానవ
ద్యైకవిద్యావలీఢున్"

"రాజుల్ బహువ్యాజులే? భోజులే? చంచలచ్చిత్తులే? మత్తులే?
వ్రేఁత కాయత్తులే? నూతనాసక్తులే? లోభసంయుక్తులే?
దోషసంసిక్తులే? రంధ్రసంపాదులే? వీతమర్యాదులే?

"రాయచౌహత్తమల్లున్ వధూటీసరోజాతభల్లున్
మహారాజవేశ్యాభుజంగున్ హయానేకపగ్రామహేమాదినానామ
హాదానచంగున్ వధూలోకపాంచాలు సర్వజ్ఞసింగక్ష్మాపాలుఁ
గైకొంట తప్పే?"

3. భావసామ్యము : ఇది కూడ నిర్ధారకసాధనము కాదు. ఉపబలకసాధనము. భాగవతములోని "మందారమకరందమాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు" అను పద్యములోని భావములకు భోగినీదండకమునందు సామ్యము కలదు.

"ఉల్లసత్ఫుల్లమందారరాజన్మరందంబు నందంబునన్ గ్రోలు
మత్తాళి దుత్తూరమున్ గోరునే? హేమరాజీవరాజీరజోరాజితాకాశ
గంగానదీలోలకల్లోలడోలానటద్రాజహంసంబు శైవాలగండూపదీ
భేకభేకీఢులీసంకులాసారకాసారమున్ జేరునే? మండితాఖండలా
నీల జీమూతనిర్యత్పయోధారలన్ ద్రావు సారంగి, కుంభాంతరాం
భః ప్రపూరంబులన్ ద్రావునే? మాధవోజ్జాతచూతాం కుర
స్వాదులీలాలసత్కోకిలేంద్రంబు ఝిల్లీవరక్రూరభల్లాత కీశాఖకున్
బోవునే?"

ఇట్టి భావములు పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు[186], జినసేనుని ఆదిపురాణమునందును[187] (సంస్కృతము) కలవు. అయినను భోగినీదండకములోని భావములు భాగవతములోని భావములకు సన్నిహితము.

మొత్తము మీద భోగినీదండకము పోతన కృతమే.

భోగినీదండకమునందు సింగభూపాలుడు "కుమారాన్నపోతావనీనాథసూను"డని, "పోచమాంబాలసద్గర్భసంజాతు"డని "వసంతావనీనాథసంసేవితాంచత్పదాంభోజు"డని, "సర్వజ్ఞసింగక్ష్మానాథు"డని కలదు. పోచమాంబా న్నపోతానాయకులపుత్త్రుడు, వసంతనాయని అగ్రజుడును అయిన

సింగభూపాలుడు రెండవ సర్వజ్ఞసింగభూపాలుడు. అతని రాజ్యకాలము 1425-1450. పోతన 1450 ప్రాంతమున యువకుడు. కాఁబట్టి యువకుడైన పోతన రచించిన భోగినీదండకము రచనాకాలము స్థూలముగ 1450వ సంవత్సరము.

## నారాయణశతకము

ఇది పోతన రచించినట్లు ఇటీవలి అభిప్రాయము. "శతకాంతమునందు ముద్రింపఁబడిన గద్యము తాళపత్రప్రతులందు లేదు. రెండు కాగితపుప్రతులలో మాత్రము వేఱు సిరాతో వ్రాసియున్నది. ప్రతులను వ్రాసినవారు పోతనభాగవతగద్యమునే శతకాంతమునందు వినికిడివలననో యూహవలననో చేర్చియుందురని యూహింపందగియున్నది." అని పీఠికయందు కలదు[188] వినికిడికి అయినను, ఊహకు అయినను పోతన భాగవతమునకు, నారాయణశతకమునకు "భావైక్యమును బాంధవ్యమును" గల కతిపయపద్యములు (276ప.2స్కం.-24ప; 218ప.1స్కం.22ప; 58ప.2స్కం.-34,35; 95ప.8స్కం-59ప.) కారణములు కావచ్చును. భావైక్యము నిర్ధారకసాధనము కాదు. బాంధవ్యము (41-60ప.శ.) పోతన భాగవతమునకు శతకము తర్వాతి రచనముగ చాటును. అంతేకాదు. నారాయణశతకము ఏకశిలానగరనివాసి[189] పోతనకృతము కాదు. ధర్మపురినివాసి అజ్ఞాతకవికృతము.

"అపరాధంబులు నిన్ను నమ్మి వినుమే నాజన్మపర్యంతమున్
విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవే దిక్కు నాలోనికిన్
గపటం బింతయు లేక దండధరునకుం బట్టీక రక్షింపు మీ
కృపకుం బాత్రుఁ డనయ్య ధర్మపురి లక్ష్మీనాథనారాయణా" 98ప.

ఇందు శతకకర్త ధర్మపురినివాసి అనియేకాదు; "అపరాధంబులు ... విపరీతంబుగఁ జేసి"నవాడని ఇదమిత్థముగ కలదు. పోతన విష్ణుభక్తుడు. శతకకర్త వైష్ణవుడు.

"వరుసం గర్మపిపీలికాకృతతనూవల్మీకనాళంబులోఁ
బరగంగా వసియించియుండెడు మహాపాపోరగశ్రేణికిం
బరమోచ్చాటనమై రహస్యమహిమన్ బాటించుచున్నుండు మీ
తిరుమంత్రంబను మంత్రరాజ మమరున్ దివ్యాత్మ నారాయణా"
38ప.

"ధర గ్రామాధిపునింటిదాసుఁ డొరుతెంతో ద్రోహముం జేసినన్
పరఁగం జెల్లుట సూచి తీ భువనసంపాద్యుండవైనట్టి మీ
వరదాసావళిదాసదాసుఁ డయి దుర్వారాఘముల్ చేసితిన్
గరుణం జేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణనారాయణా." 89ప.

ఇందు మొదటి పద్యములోని తిరుమంత్రము, రెండవపద్యములోని వరదా సదాసదాసానుభావము శతకకర్త వైష్ణవుడని వ్యక్తము సేయును. పోతన మహావిష్ణు భక్తుడైనను వైష్ణవుడు కాడు. శైవకుటుంబి. కాఁబట్టి నారాయణశతకము పోతనకృతము కాదు. పోతన భాగవతప్రభావము కల, ధర్మపురినివాసియైన, వైష్ణవుడైన అజ్ఞాతకవికృతము. అర్వాచీనశతకము.

## వీరభద్రవిజయము

ఇది ముద్రితగ్రంథమునందు "కేసనామాత్యపుత్ర పోతయనామధేయప్రణీతం' బని ఆశ్వాసాంతగద్యలందు కలదు. అంతేకాదు. అవతారికయందు "ఇవ్వటూరి యారాధ్యచంద్రుడు సోమనాథసముండు సోమగురుఁడు" పోతయను రావించి (17వచ.1ఆ.)

"- ఇపు ఎడు మాకెల్ల నూహలోన
వింతపండువు బోలెను వీరభద్ర
విజయ మెల్లను వినఁ గడు వేడ్క యయ్యె
నది దెలుంగున రచియింపు మభిమతముగ 20.

పిన్నవాఁ డననియుఁ బెక్కు సంస్కృతులను
విననివాఁ డననియు వెఱపు మాను
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైన
కవిత చెప్ప లావు గలదు నీకు. 21.

అదియునుంగాక నీకు వీరభద్రేశ్వరప్రసాదంబుంగలదు. కావున వాయుపురాణసారంబగు నీ కథావృత్తాంతమంతయుం దెలుంగున రచియింపు"మని (22వచ.1ఆ.)

ఆనతిచ్చినట్లు కలదు. వీరభద్రవిజయమునందు పోతయ వంశవృక్షము సవిస్తరముగ కలదు. పోతన భాగవతమునందు సంగ్రహముగ కలదు. ఉన్నంతవఱకు రెండు వంశవృక్షములును సంవదించునవి. ఇది భాగవతమును రచించిన పోతన, వీరభద్రవిజయమును రచించిన పోతయ అనుటకు సాధకము. కాని వీరభద్రవిజయమునందు

"భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షదు
ర్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁ డనైతి తన్నిమి
త్తాగతవక్త్రదోషపరిహారముకై యజనైకశైవశా

స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్క నా మదిన్." 41ప.1ఆ.

అను పద్యము కలదు. ఇందు మూడు అసందర్భములు కలవు. 1. ఇది పూర్వోత్తరవిరోధము కలది. "పిన్నవాఁడ" అను పద్యమునకు విరుద్ధము. భాగవతము పోతన పిన్ననాటి కంటె పూర్వము రచించినది కాదు. 2. భాగవతములోని దక్షాధ్వరధ్వంసఘట్టమునందు పోతన అల్పవచస్కుఁడు కాడు. అనల్పవచస్కుఁడు. "దక్షుండు పల్కిన గర్హితవాక్యంబులు వినిందితంబు లగుంగాని యాథార్థ్యంబున వాస్తవంబు లగుచు భగవంతుండగు రుద్రునందు ననిందితంబులగు స్తుతిరూపంబుల నొప్పె"నని పోతన స్పష్టప్రతిపాదనము. (45వచ.4స్కం.) 3. వీరభద్రవిజయములోని దక్షాధ్వరధ్వంసఘట్టమునందు పోతయ అనల్పవచస్కుఁడు కాడు. అత్యల్పవచస్కుఁడు. (135-140ప.1ఆ.) ఇది లేని ముల్లును తీసి కొఱ్ఱు అడచిన చందము. వీరభద్రవిజయమునందు భ్రాంతిమూలకమైన భాగవతరచనాగతవక్తృదోషపరిహారము లేదు. వీరభద్రవిజయరచనాగతవక్తృదోషసంపాదనమే కలదు. కాఁబట్టి ఈ పద్యము ప్రక్షిప్తము కావలయును. అయిన ప్రక్రమభంగము. "వీరభద్రప్రసాదలబ్ధకవితాతిశయంబున" (41వచ.) షష్ఠ్యంతపద్యములు (42-44) "మత్సమర్పితంబగు-" (43వచ.) అను వాక్యమున కవితాతిశయము కావ్యసమర్పణవిషయము కాని కావ్యరచనావిషయము కాదు. అంతేకాదు. వీరభద్రవిజయమునందు భాగవతములోని పరిణతమైన పోతనశైలి భాసించినను, పోతన పిన్ననాడు కూడ పాల్పడని భాషాదోషములు బహుళముగ కలవు.

"చనుపకగంధి నీ పలుకు సంగతి చాలదు వాఁడు దివ్యులన్" 115ప.1ఆ.

"జాలఁడు సిద్ధ మీ పలుకు సర్వయుపాయములందు భావజున్" 13ప.2ఆ.

"పైనొప్పఁ బెట్టిన భద్రదంతావళ
తోలుతో మొల పులితోలుతోడ" 290ప.2ఆ.

"లక్ష్మినా / థాదులకైన నీదు మహిమాతిశయంబు" 233ప.2ఆ.

"మోదతసప్తసంద్రములు ముంగలఁ గొల్వఁ గెలంకులందు" 83ప.3ఆ.

"చీఁకటి గప్పె నాకసముఁ జీఁకటి గప్పె దిగిభకుంభముల్" 119ప.3ఆ.

"స॥ త్రైమన్ వచ్చుటఁ జేసి యుండఁగ మహాప్రవేఁగై భరంబోర్వకీ" 138ప.3ఆ.

"కాలాంభోధరదీప్తి మెచ్చుక భుజంగభ్రుంగసంకాశమై" 204ప.3ఆ.

"ఋగ్యజు॥స్సామయదర్వణాద్రిశ్రుతిసంఘములో" 20ప.4ఆ.

"పాతకంబు దక్ష పాపచక్ష" 26ప.4ఆ.

"దేవుండు త్రిత్రింశకోటిదేవావలికిన్" 33ప.4ఆ.

ఇట్టి వింకను గలవు. ఇతరదోషములును కలవు. (2ప.57ప. 144ప. 170ప. 176ప. 1ఆ; 97ప. 2ఆ; 115ప. 162ప. 164ప. 168ప. 239ప. 247ప. 3ఆ.; 28ప. 47ప. 62ప. 75ప. 102ప. 168ప. 188ప. 222ప. 4ఆ.) ఇది యెల్ల వీరభద్రవిజయము పోతన కృతమనుటకు బాధకము.

అర్వాచీనములైన యక్షగానములందు ప్రయుక్తమైన "యేషాగాథలు" అను పద బంధము వీరభద్రవిజయమునందు ప్రయుక్తమైనది.

"యేషాగాథలు పల్కు మంత్రములుఁ దానెచ్చోటికిం బోయెరా
పూషాదిత్య దురాత్మ యంచుఁ బెలుచన్ భూమిం బడన్ద్రోచి ని
ర్దోషుం డాతని పండ్లు డుల్చె నది హేతుఖ్యాతిగా ధాత్రిలో
భాషల్ తప్పులు వోయె నాతనికిఁ దా భాషించుచో నెప్పుడున్-"
123ప.4ఆ.

యక్షగానప్రసిద్ధమైన "యేషాగాథా" పదబంధమే కాదు; యక్షగానప్రఖ్యాతమైన ఎఱుకత పాత్ర, ఎఱుకత సోదె కూడ వీరభద్రవిజమునందు కలవు. హిమవంతుడు పార్వతిని ఇంటికి తీసుకొనిపోయిన కొంతకాలమునకు పరమేశ్వరుడు "గౌరీదేవిం దలంచి ప్రేమ చేసి యుండుటెఱింగి" తనకును ప్రేమ అంకురించి ఆమెను చూడ వలెనని ఎఱుకత వేషము ధరించి, "ఎఱుక యెఱుక యనుచు నేఁగుదెంచె"నట. (163-171ప.2ఆ.) ఎఱుకత వర్ణన (173ప.) "మహిలో జనములు వొగడఁగ బహు విధముల నెఱుక చెప్పి" హిమాలయము చేరి గౌరి సౌధమును సమీపించెను. ఎఱుకతను చూచి ఆమె సౌందర్యమునకు ఆశ్చర్యపడి గౌరి ఆమెను పిలిపించెను. ఎఱుకత సోదె చెప్పెను.

"నాకు వాకు వచ్చె నలినాక్షి రమ్మంచుఁ
గరము దెమ్మ నాదు కరము పట్టి
యనుచుఁ బ్రేమతోడ నబల పాణిగ్రహ
ణమ్ముఁ జేసె కపటనాటకుండు. 196ప.

ఒక మాటు గరము లంటుచు
నొకమాటు లతాంగిచిత్త మూరించుచు వే
ఱొకమాటు కుచము లంటుచు
ప్రకటించుచు నెఱుక చెప్పెఁ బార్వతిసతికిన్." 197ప.2ఆ.

ఇది యెల్ల వీరభద్రవిజయము పరమార్వాచీనగ్రంథమనుటకు, పోతనకు ఆపాదితమనుటకు సాధకము.

వీరభద్రవిజయము ముద్రితగ్రంథములోని చతుర్థాశ్వాసము పరకవిపూరితమని, ముద్రితపాఠము కంటె సర్వథా భిన్నమైన తాళపత్రప్రతి లభించినదని ఉదాహరించిన పద్యములు కలవు[190] అవి కూడ అంతంతమాత్రములే. అందును యక్షగానము లేదా వీథిభాగవతము ప్రభావము కలదు.

"తెరవచ్చి (విచ్చి?) మొదల గణపతి
వరవేషము నటన సలుప వర్ణింపఁ దగన్
హరసుతుఁడు నాట్యరాగము
లరయంగా నాటు సరణి యప్పుడు తోచెన్."

"- తనరఁ దనరాక సభవారు గనుచు నవ్వఁ
గుంటి నడపులు నడచుచు గెంటినట్లు
పరఁగ దండాలు దండాలు దొరకు ననుచుఁ
బ్రౌఢపరిహాసకుఁడు వచ్చె భర్గు సభకు."

"- చక్రఖడ్గాంతరిక్షాసనాదికవృత్తి
నటన లత్యాశ్చర్యపటిమఁ బెనుపఁ
బద్యగద్యాదిగీతప్రబంధములను
హావభావాదిభావస్వభావ మలర
నఖిలరసయుక్తి కరముల నభినయించి
చెలఁగి మాయాప్రభావంబు చెప్పఁ దొడఁగె."

ఆంధ్రప్రదేశప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు (హైదరాబాదు) వీరభద్రవిజయమునకు తాళపత్రగ్రంథములు అధికముగ కలవు. అందు పోతన అసలు గ్రంథము కలదేమో పరిశోధనీయము. అంతవఱకు వీరభద్రవిజయము సందిగ్ధవిషయము.

## శ్రీమహాభాగవతము

"వేదకల్పవృక్షవిగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన

పదవిఁ గనుఁడు రసికభావవిదులు." 37ప.1స్కం.

భాగవతము పురాణము. "మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతంబని పలుకుటంజేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతంబన నొప్పుచుండు"ను. (35వచ.1స్కం.) శ్రీమహాభాగవతము అష్టాదశపురాణములందు ఒకటి. శ్రీమహాభాగవతము కాక దేవీభాగవతము అష్టాదశపురాణములందు ఒకటి అను పక్షాంతరము కలదు. కాని శ్రీమహాభాగవతమే అష్టాదశపురాణములందు ఒకటిగ ప్రసిద్ధము. ఇది వ్యాసకృతము. శుకప్రోక్తము. పరీక్షిన్నరేంద్రశ్రుతము. అది శౌనకాదిమహామునులకు సూతుడు వివరించినది. ఇదియెల్ల నిర్నిమిత్తము కాదు. వేదవిభాగము చేసి, మహాభారతము రచించి వ్యాసుడు "భూతహితంబునందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబున నొంటి యుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె"ను. (84వచ.1స్కం.)

"వ్రతధారినై వేదవహ్నిగురుశ్రేణి
మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
వడకుండ నడపుదు భారతమిషమునఁ
బలికితి వేదార్థభావమెల్ల
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మములందుఁ
దెలిపితి నేఁ జెల్లఁ దీనఁ జేసి
యాత్మ సంతసమంద దాత్మలో నీశుండు
సంతసింపకయున్న జాడ దోఁచె
హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవతవిధంబు బలుకనైతి
మోసమయ్యె దెలివి మొనయదు మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున" 85ప.1స్కం.

నారదుడు వచ్చి "ఈవు చలించి చెల్లరే కాతరు కైవడిన్ వగవఁ గారణమేమి?" అని అడుగును. (89ప.1స్కం.) "ఈ నా కొఱఁత యెట్టి దంతయు నాకు వివరింపుమయ్య" అని వ్యాసుడు కోరును. (93ప.1స్కం.) నారదుని సమాధానమిది:

"అంచితమైన ధర్మచయమంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక నీకు నీ
కొంచెము వచ్చు టెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా.
95ప.

మునీంద్రా! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు. ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు గావున మహానుభావుండవు యథార్థదర్శనుండవు సకలదిగంతధవళకీర్తివి సత్యరతుండవు ధృతవ్రతుండవు నగు నీవు నిఖిలబంధమోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము ....." 98వచ.1స్కం.

ఇది విని వ్యాసుడు "శమ్యాప్రాసంబనం బ్రసిద్ధంబగు నాశ్రమంబు"న "ధనమదిదిరంబు సేసికొని భక్తియుక్తం బయిన చిత్తంబునం బరిపూర్ణుండయిన యీశ్వరుం గాంచి ..... నారాయణ భక్తియోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లేదని నిశ్చయించి" (135వచ.1స్కం.) నిర్మించినది శ్రీమహాభాగవతము. కావున శ్రీమహాభాగవతము నిఖిలబంధవిమోచననిమిత్తమైన నారాయణభక్తియోగము.

భాగవతము నారాయణభక్తియోగమగుట వలన పోతన కవితాధార తాలోత్తాలముగ మూలోన్మూలముగ పొంగి పొరలినది.

"హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్. 96

అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యు లౌదురుగదా తత్త్వజ్ఞ చింతింపుమా"
97ప.1స్కం.

శాపగ్రస్తుడైన పరీక్షిన్మహారాజు ప్రాయోపవిష్టుడై,

"ఏడు దినంబుల ముక్తిం
గూడంగ నే రీతి వచ్చు గురుసంసార
క్రీడన మే క్రియ నెడతెగుఁ
జూడుఁడు మా తండ్రులార శ్రుతివచనములన్." 513

"- సప్తాహంబుల ముక్తి కేఁగుడు గతిం జర్చించి భాషింపరే"

514ప.1స్కం.

అని ఋషులను అడుగును. "మును లందఱుం బ్రత్యుత్తరంబు విమర్శించునెడ దైవయోగంబున" (515వచ.) అవధూతమూర్తి శుకయోగి వచ్చును. (516-515 ప.1స్కం.) "అతిథిసత్కారంబులు గావించి దండప్రణామంబు సేసి" (520వచ.) పరీక్షిత్తు శుకయోగీంద్రుని,

"- ఉండ మనరాదు గురుఁడవు యోగివిభుఁడ
వావుఁ బిదికిన తడవెంత యంతసేపు
గాని యొకదెస నుండవు కరుణతోడఁ
జెప్పవే తండ్రి ముక్తికిఁ జేరు తెరువు" 525ప.1స్కం.

అని కోరును. శుకయోగీంద్రుడు లోకసరణి తెలిపి ఇట్లు వివరించును.

"ద్వైపాయనుఁడు నాదు తండ్రి ద్వాపరవేళ
బ్రహ్మసమ్మితమైన భాగవతముఁ
బఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై
యుత్తమశ్లోకలీలోత్సవమున
నాకృష్టచిత్తుండనై పఠించితి నీవు
హరిపాదభక్తుండ వగుటఁ జేసి
యెఱిఁగింతు వినవయ్య యీ భాగవతమున
విష్ణుసేవాబుద్ధి విస్తరిల్లు
మోక్షకాముసకును మోక్షంబు సిద్ధించు
భవభయంబులెల్లం బాసిపోవు
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు
వాసుదేవనామవర్ణనములు.
హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవనేర్చునె వాఁడు సం
సరణముఁ బెడఁ బాయఁ డెన్నఁడు సత్యమా హరినామసం
స్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా"

10ప.2స్కం.

అని శుకమహర్షి విశదీకరించినది శ్రీమహాభాగవతము. కావున శ్రీమహాభాగవతము బ్రహ్మసమ్మితము. విష్ణుసేవాబుద్ధివిస్తారకము. ముహూర్తమాత్రముక్తిదము.

భాగవతము ముహూర్తమాత్రముక్తిదమగుట వలన పోతన భాగవతాంధ్రీ

కరణమున భక్తిపారవశ్యము భాసించినది. ముక్తిచింతనము వాసించినది.

"ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁ గన్."
21ప.1స్కం.

నైమిశారణ్యమను శ్రీవిష్ణుక్షేత్రమునందు (39వచ.1స్కం.) శౌనకాదిమహా మునులు.

"గురువులు ప్రియశిష్యులకుం
బరమరహస్యములు దెలియఁ బలుకుదు రచల
స్థిరకల్యాణం బెయ్యది
పురుషులకును నిశ్చయించి బోధింపు తగన్." 42ప.1స్కం.

అని సూతుని అడుగుదురు. సూతుడు బోధించిన సుదీర్ఘతత్త్వవిషయమునకు సారాంశమిది:

"పుణ్యకీర్తనుఁ డైన భువనేశు చరితంబు
బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోకభ
ద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁ డగు వ్యాసభట్టారకుఁ డొనర్చి
శుకుఁ డనియెడు తనసుతునిచేత
జదివించె నింతయు సకలవేదేతిహా
సములలోపల నెల్ల సారమైన
యీ పురాణమెల్ల నెలిమి నా శుకయోగి
గంగ నడుమ వచ్చి ఘనవిరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁ డగు పరీ
క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁ డు." 73ప.1స్కం.

బ్రహ్మతుల్యము, సకలపురాణరాజము, సకలవేదేతిసారమును అయిన భువనేశుచరితము శ్రీమహాభాగవతము. భువనేశుచరితమన శ్రీకృష్ణచరితము. అది అచలస్థిరకల్యాణప్రదము. కావున శ్రీమహాభాగవతము అచలస్థిరకల్యాణప్రదమైన శ్రీకృష్ణచరితము.

భాగవతము అచలస్థిరకల్యాణప్రదమైన శ్రీకృష్ణచరితము కావున పోతన

స్వభావవికాసము, స్వతంత్రకల్పనమున విష్ణుప్రభావవిలాసముగ పరిఢవిల్లినది.

"వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర యితరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే. 49.

హరినామకథనదావానలజ్వాలచేఁ
గాలవే ఘోరాఘకాననములు
వైకుంఠదర్శనవాయుసంఘంబుచేఁ
దొలఁగవే భవదుఃఖతోయదములు
కమలనాభధ్యానకంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ
దీఱవే షడ్వర్గతిమిరతతులు
నలిననయన భక్తినావచేఁ గాక సం
సారజలధి దాఁటి చనఁగరాదు
వేయునేల మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత ధీసమేత." 50ప.1స్కం.

నారాయణభక్తియోగము, ముహూర్తమాత్రముక్తిదము, అచలస్థిరకల్యాణ ప్రదమైన శ్రీకృష్ణచరితము అయిన శ్రీమహాభాగవతమునకు పోతన ఎగురవైచిన చిహ్నపతాక -

"లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై."
22ప.1స్కం.

ఇది నన్నయ "అమితాఖ్యానకశాఖలం బొలిచి" అను పద్యమునకు (36ప.1ఆ. ఆ.ప.) శిష్యప్రాయమైనను, శాకల్య అయ్యలార్యుని "సారస్కంధము శౌర్యమూలము" అను పద్యమునకు ప్రతిబింబప్రాయమైనను,. సమగ్రసుందరము. శ్లేషాశ్లేషము కలదు. ఇందు భాగవతమునకు కల్పవృక్షమునకు రూపకము శ్లేషమూలకము. భాగవతము లలితములైన ద్వాదశస్కంధములు కలది. కల్పవృక్షము లలితమైన స్కంధము=మ్రాను కలది. భాగవతము కృష్ణుడు మూలమైనది.

కల్పవృక్షము నల్లని వేరు కలది. భాగవతము శుకుని పలుకులచేత మనోహర మైనది. కల్పవృక్షము శుకముల=చిలుకల పలుకులచేత ఒప్పునది. భాగవతము మంజులత్వముచేత శోభించునది. కల్పవృక్షము అందమైన లతచేత ప్రకాశించునది. భాగవతము సువర్ణములచేత సుమనస్కులకు=సహృదయులకు తెలియునది. కల్పవృక్షము మంచిరంగు లేదా బంగారురంగు కల పువ్వులచేత తెలియునది. భాగవతము సుందరమైన, ఉజ్జ్వలమైన వృత్తాంతము కలది. కల్పవృక్షము సుందరమైన ఉజ్జ్వలమైన వృత్తాకారము కలది. భాగవతము మహాఫలముతో=మోక్షవిషయముతో కూడినది. కల్పవృక్షము కామితార్థమొసగు మహాఫలము కలది. భాగవతము విమలుడైన వ్యాసునికి ఆలవాలమైనది. కల్పవృక్షము విమలమైన కుదురు కలది. భాగవతము సద్బ్రాహ్మణులకు శ్రేయస్కరము. కల్పవృక్షము మంచి పక్షులకు శ్రేయస్కరము. ఇట్లు శ్లేష సుకుమారము. అది భట్టుమూర్తికి ఆదర్శము. కల్పవృక్షము వంటి భాగవతము వ్యాసకృతము. శుకప్రోక్తము. కృష్ణచరితము. ద్వాదశస్కంధసంభరితము. జ్ఞేయము. ధ్యేయము. మోక్షదాయకము. భాగవతము భావగతమైన పోతన పద్యము ముత్యాలు పోహళించునది. ఇది భాగవతము విశిష్టత.

## భాగవతకర్తృత్వము

తెనుగు భాగవతములోని ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, సప్తమ, అష్టమ, నవమ, దశమస్కంధములు "పోతనామాత్యప్రణీతం" బుని స్కంధాంతగద్యములందు కలదు. పంచమస్కంధము "గంగనార్యప్రణీతం"బని పంచమస్కంధ ప్రథమద్వితీయాశ్వాసాంతగద్యములందు కలదు. షష్ఠస్కంధము "సింగయనామధేయప్రణీతం"బని స్కంధాంతగద్యను కలదు. ఏకాదశ, ద్వాదశస్కంధములు "పోతనామాత్యప్రియశిష్యవెలిగందలనారయనామధేయప్రణీతం"బులని స్కంధాంతగద్యలందు కలదు. కాఁబట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, సప్తమ, అష్టమ, నవమ, దశమస్కంధములు పోతనకృతములు, పంచమస్కంధము గంగనకృతము, షష్ఠస్కంధము సింగనకృతము,. ఏకాదశ, ద్వాదశస్కంధములు నారయకృతములు కావలయును. కాని, పోతన ద్వితీయ, తృతీయ, చతుర్థ, దశమస్కంధములందు వెలిగందల నారయపూరణములు కలవను కారణములు కలవు[191] అవి:

1. రేఫశకటరేఫప్రాససాంకర్యము: అప్పకవి, అహోబలపతి, ముద్దరాజు రామన మొదలైన లాక్షణికులు పోతన కవిత్వమునందు ఱాలు, రేఫలు కదిసినవని పలికిరి. (262ప.స.సా.సం.) అప్పకవీయమునందు ఇట్లు కలదు.

"బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదవ యెంతయు నారసి చూడఁ గాను రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసములైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁ గాన్."

234ప.2ఆ.

ఆదిలాక్షణికులే కారు; "ఎంతయు నారసి" చూచిన అప్పకవి కూడ లక్ష్యలక్షణస మన్వయమునకు పోతనపద్యమును ఉదాహరింపలేదు. ఉదాహరించిన ఒక్క భాగవతపద్యమును (210ప.2స్కం.) లక్ష్యలక్షణసమన్వయమునకు కాదు. "ఆకా శము నిత్యమైనందుకు" (69ప.4ఆ.) అహోబలపతి "పురసతుల" అను భాగవత పద్యమును ఉదాహరించి పోతన పేరెత్తి అప్రామాణికమని (సా నాకరత్వా దప్రా మాణికీతి-) నిర్ణయించెను. "అది హుళక్కి" అనుటకు "పోతరాజు చెప్పినవి ప్రథమ స్కంధమును ద్వితీయస్కంధమున కొంతయు షష్ఠ సప్తమాష్టమనవ (మ ) స్కంధ ములను దశమస్కంధము పూర్వభాగము కొంత "అని నిర్దేశించి. (226-227) "వెలి గందల నారపరాజు చెప్పిన కవిత్వములో రేఫఱకారసాంకర్యమగుటకు"(279-280) ద్వితీయ. తృతీయ. చతుర్థ దశమ (ఉత్తరభాగము) స్కంధములలోని పద్యములను కూచిమంచి తిమ్మకవి ఉదాహరించెను. (280-81స.సా.సం.) అందువలన పోతన ద్వితీయ. తృతీయ. చతుర్థ. దశమ స్కంధములందు వెలిగందల నారయ పూరణ ములు వెలసెను. కారణము రేఫశకటరేఫప్రాససాంకర్యము.

రేఫశకటరేఫసాంకర్యము ద్వితీయ. తృతీయ. చతుర్థ. దశమస్కంధములందే కాదు; సప్తమ స్కంధమునందును కలదు.

"పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్యమని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిం
దాఱఁడు కావరే యనుడు తాపము నొందఁడు కంటగింపఁడున్."

194ప.

ఇది ప్రహ్లాద చరిత్రములోనిది. అది కూడ నారయ పూరణమైన తెనుగు భాగవ తము పోతన భాగవతము కాదు. నారయ భాగవతమగును. అంతేకాదు. వెలిగందల నారయ రచించిన ఏకాదశ. ద్వాదశస్కంధములందు రేఫశకటరేఫప్రాససాంక ర్యము లేదు. రేఫశకటరేఫసాంకర్యము త్రివిధము. 1. రేఫశకటరేఫప్రాసము. 2. రేఫశకటరేఫయతిమైత్రి. 3. రేఫశకటరేఫప్రాసయతి. ఏకాదశ. ద్వాదశ స్కంధ ములందు రేఫప్రాసస్థలములు ఇరువది రెండు కలవు. రేఫయతిమైత్రిస్థలములు

ఏడుకలవు. రేఫప్రాసయతిస్థలము ఒక్కటి కలదు. ఏకాదశ, ద్వాదశ స్కంధములలోని మొత్తము నూటపది పద్యములందును రేఫశకటరేఫసాంకర్యమునకు అవకాశము కల ముప్పది పద్యములందు ఒక్క స్థలమునందు కూడ రేఫశకటరేఫప్రాససాంకర్యము లేదు. రేఫశకటరేఫప్రాససాంకర్యమును పాటించని వెలిగందల నారయ, రేఫశకట రేఫప్రాస సాంకర్యము కారణముగ పోతన ద్వితీయ, తృతీయ, చతుర్థ, దశమస్కంధములందు పూరణములు కావించెననుట అసంగతము.

2. తాళపత్రగ్రంథలేఖనము : ద్వితీయస్కంధమునందు 92 వ పద్యము తర్వాత "వెలిగందల నారయ కవిత్వ ప్రారంభము" అను శీర్షిక ముద్రితగ్రంథములందు కలదు. అంతేకాదు. మూడు తాళపత్రగ్రంథములందును కలదు. ముద్రిత గ్రంథములలోని శీర్షికకు మూలమైన తాళపత్రగ్రంథలేఖనము వెలిగందల నారయ పూరణమునకు కారణము.

"వెలిగందల నారయ కవిత్వప్రారంభము" అను శీర్షిక అర్వాచీనముద్రితగ్రంథములందు కలదు. ప్రాచీనముద్రితగ్రంథములందు లేదు. మూడు తాళపత్రగ్రంథములందు కలదు. ఆరు తాళపత్రగ్రంథములందు లేదు. ఉన్నతాళపత్రగ్రంథమొకటి రాయలసీమప్రతి. కాలము లేదు. మఱొకటి పెద్దాపుర సంస్థానప్రతి. కాలము 2-2-1774. వేఱొకటి మఱల రాయలసీమప్రతి. కాలము లేదు. లేఖనము లేని తాళపత్రగ్రంథములందు ఒకటి రాయలసీమప్రతి. కాలము 25-6-1789. మఱొకటి తెలంగాణము ప్రతి కాలము 9-12-1832. రెండు తీరాంధ్రప్రతులు. కాలములు లేవు. ఇంకొకటి వనపర్తి సంస్థానప్రతి. కాలము లేదు. కాలము తెలిసిన ప్రతులందు "వెలిగందల నారయ కవిత్వప్రారంభము"అను లేఖనము కల ప్రాచీనతరప్రతి కాలము 1774వ సంవత్సరము. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహము రచనాకాలము స్థూలముగ 1740వ సంవత్సరము. లేఖనము తర్వాతిది. అంతేకాదు. ప్రాచీనతర ప్రతి స్థలము పెద్దాపురము. కూచిమంచి తిమ్మకవి స్థలము పిఠాపురము సమీపము. రాయలసీమ, తెలంగాణము సుదూరము. అచటి ప్రతులందు లేఖనము లేదు. కాఁబట్టి ద్వితీయస్కంధమునందు 92 వ పద్యము తర్వాత కల "వెలిగందల నారయ కవిత్వప్రారంభము" అను తాళపత్రగ్రంథలేఖనము కూచిమంచి తిమ్మకవి ప్రభావము కావలయును. అది వెలిగందల నారయ పూరణమునకు కారణము కాదు.

3. సీసపద్యయతినియతి భంగము : సీసపద్యయతినియతి కల భాగములు పోతన రచనములు. యతినియతి లేని భాగములు వెలిగందల నారయ పూరణములు.

సీసపద్యయతినియతిభంగము ప్రతిస్కంధమునందు కలదు. ప్రథమస్కంధము నందు 62వ సీసపద్యమునందు, ద్వితీయస్కంధమునందు 94వ సీసపద్యము నుండి, తృతీయస్కంధమునందు 37వ సీసపద్యమునుండి, చతుర్థస్కంధమునందు 3వ సీసపద్యము నుండి, అష్టమస్కంధమునందు 16వ సీసపద్యమునుండి, నవమ స్కంధమునందు 16వ సీసపద్యమునుండి, దశమస్కంధము పూర్వభాగమునందు 14వ సీసపద్యము నుండి, ఉత్తరభాగమునందు 68వ సీసపద్యమునుండి సీసప ద్యయతినియతి సడలినది. ఒక్క సప్తమస్కంధమునందు 45 సీసపద్యములందును సీసపద్యయతినియతి కలదు. సీసపద్యయతినియతిని బట్టి కర్తృత్వనిర్ణయము కావించినచో, సుమారు ఎనిమిదివేల పద్యగద్యముల (7918)పోతన భాగవత మునందు, పోతన పద్యగద్యములు సుమారు ఎనిమిది వందలు (782)మాత్రమే దక్కును. ఏడువేల పైచిలుకు పద్యములు (7136) వెలిగందల నారయవి అగును. అయిన తెలుగు భాగవతము పోతన భాగవతము కాదు; నారయభాగవతమే అగును. కాని కాలేదు. అంతేకాదు. ఒక్క నన్నయ భారతము నందు వినా (అది కూడ అపవాదరహితము కాదు) తిక్కనాదుల రచనములందును సీసపద్యయ తినియతి నిబంధముగ, నిర్బంధముగ లేదు. అనగా నన్నయ తర్వాత సీసపద్యయ తినియతికి భంగము కలిగినదని అవగాహనమగును. అది లక్షణవిరుద్ధము కాదు. చారిత్రికపరిణామము. కా॥ బట్టి సీసపద్యయతినియతిభంగము వెలిగందల నారయ పూరణములకు కారణము కాదు.

4.ఆటవెలదుల ఆధిక్యము : ఆటవెలదుల ఆధిక్యము కల భాగములు పోతనకృ తములు, తేటగీతుల ఆధిక్యము కల భాగములు వెలిగందల నారయ పూరణములు.

వెలిగందల నారయ పూరణములు అనబడని పోతన సీసపద్యములలోని ఆటవెలదులు201, తేటగీతులు219 కలవు. ప్రథమస్కంధమునందు సమానము. (22) ద్వితీయస్కంధమునందు ఆటవెలదులు రెండు అధికము. (9-7) సప్తమస్కంధ మునందు ఆటవెలదులు నాలుగు తక్కువ. (22-26) అష్టమస్కంధమునందు ఆట వెలదులు పదకొండు తక్కువ. (36-47) నవమస్కంధమునందు ఆటవెలదులు ఇరు వదియొకటి ఎక్కువ (82-63) ఉత్తరభాగమునందు (1-234)సమానము. మొత్తము మీద ఆటవెలదులు పదునెన్మిది తక్కువ. అనగా తేటగీతులు పదునెన్మిది ఎక్కువ. విడి పద్యములందు ఆటవెలదులు 262, తేటగీతులు 146 కలవు. సప్తమ స్కంధమునందు ఆటవెలదులు 23, తేటగీతులు 22కలవు. మొత్తము మీద ఆటవెల దులు ఎక్కువ. (463)తేటగీతులు తక్కువ. (248) అయినను వాని అంతరము సగము పైన. కా॥ బట్టి పోతనకు తేటగీతి అభిమతము కాదనుట అంత సంగతము కాదు. మఱి, పోతన రచన కాదను స్కంధములందు, భాగము లందు,

సీసపద్యములలోని ఆటవెలదుల (8) కంటె, తేటగీతులు (431) అభ్యధికము. విడి పద్యములందును ఆటవెలదుల (37) కంటె, తేటగీతులు (202) సమధికము. కనుక ద్వితీయ (93-289) తృతీయ, చతుర్థ, దశమ (ఉ.భా.234-1342) స్కంధములు పోతన రచన కాదనిన, సప్తమస్కంధమును పోతన రచన కాదనవలయును. కారణము సీసపద్యములందును, విడి పద్యములందును సప్తమస్కంధమునందు ఆటవెలదుల (45) కంటె తేటగీతులు (48) అధికము. అంతేకాదు. పోతనకు ఆటవెలది ఏమోగాని ఉత్పలమాల ఇష్టము. ఇష్టదేవతాస్తుతిలోని ఎనిమిదిపద్యములందును ఆరుపద్య ములు ఉత్పలమాలలు. షష్ఠ్యంతపద్యములు ఉత్పలమాలలు. అట్టి ఉత్పలమాలలు ప్రథమస్కంధమునందు 41, తృతీయస్కంధమునందు 49, దశమస్కంధమునందు 189 కలవు. ద్వితీయస్కంధమునందు 9, చతుర్థస్కంధమునందు 18, సప్తమస్కం ధమునందు 18, అష్టమస్కంధమునందు 8, నవమస్కంధమునందు 19 మాత్రమే కలవు. కావున ద్వితీయ, చతుర్థస్కంధముల తోపాటు సప్తమ, అష్టమ, నవమస్కంధములును పోతనకృతములు కావనవలయును. పద్యముల సంఖ్యను బట్టి కర్తృత్వమును నిర్ణయించుట ప్రామాణికము కాదు; ప్రామాదికము.

5. అద్వైత, విశిష్టాద్వైతసిద్ధాంతచ్ఛాయలు: అద్వైతసిద్ధాంతానుసారమైనది పోతన రచనము. విశిష్టాద్వైతసిద్ధాంతానుసారమైనది వెలిగందల నారయ పూర ణము. కారణము పోతన అద్వైతి. నారయ విశిష్టాద్వైతి.

పోతనకు ప్రియశిష్యుడు నారయ. పోతన అద్వైతి అయిన, ప్రియశిష్యుడు నారయ విశిష్టాద్వైతి అగుట విపరీతము. పోతన భాగవతములోని అద్వైత సిద్ధాంతచ్ఛాయలను బట్టి పోతన అద్వైతి అని, విశిష్టాద్వైతచ్ఛాయలను బట్టి నారయ విశిష్టాద్వైతి అని ముద్ర కొట్టుట విచిత్రము. నిర్వివాదమైన పోతన భాగములందు అద్వైతపరమైన శ్రీధరీయవ్యాఖ్యకు మాత్రమేగాక, విశిష్టాద్వై తపరమైన వీరరాఘవీయవ్యాఖ్యకు, భాగవతచంద్రికావ్యాఖ్యకు, వేంకటకృష్ణాచా ర్యకృతచంద్రికావ్యాఖ్యకు అనుసరణములు కలవు. భాగవతము ముక్తిదాయకము. అద్వైతపరమైన ముక్తి బ్రహ్మైక్యము. విశిష్టాద్వైతపరమైన ముక్తి వాసుదే వబ్రహ్మైక్యము. అది సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య భేదములందు సాయుజ్యము. భీష్ముడు బ్రహ్మైక్యము చెందినట్లు సంస్కృతభాగవతమునందు కలదు. (18శ్లో.2అ.1స్కం.) వాసుదేవబ్రహ్మైక్యము చెందినట్లు నిర్వివాదమైన పోతన భాగవతమునందు కలదు. (227వచ.1స్కం.) శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజునకు చెప్పిన ముక్తిమార్గము వైష్ణవపరమపదమని సంస్కృతభాగవతమునందు కలదు. (18శ్లో.2అ.2స్కం.) నిర్వివాదమైన పోతన భాగవతమునందును అట్లే కలదు. (28వచ.2స్కం.) అంతేకాదు. గజేంద్రుని మోక్షము విష్ణుసారూప్యముగ

సంస్కృతభాగవతమునందు కలదు. (6శ్లో.4అ.8స్కం.) పోతనభాగవతమునందును అట్లే కలదు. (121ప.8ఖం.) ఇట శ్రీధరీయవ్యాఖ్య మౌనము వహించినది. శుకయోగీంద్రుడు చిట్టచివఱ పరీక్షిన్మహారాజునకు చెప్పిన ముక్తిస్వరూపము సంస్కృత భాగవతమునందు అద్వైతపరముగ కలదు. (5శ్లో.4అ.12స్కం.) నారయ రచనము నందును అట్లే కలదు. (26వచ.12స్కం.) అద్వైతసిద్ధాంతచ్ఛాయలు, విశిష్టాద్వైతసిద్ధాంతచ్ఛాయలు సంస్కృతభాగవతమునందే కలవు. కాఁబట్టి అద్వైతసిద్ధాంతానుసారమైనది పోతన రచనము. విశిష్టాద్వైతసిద్ధాంతానుసారమైనది వెలిగందల నారయ పూరణము కావలసిన ఆవశ్యకము లేదు.

మొత్తము మీద రేఫశకటరేఫసాంకర్యమును బట్టి, ఆటవెలదుల ఆధిక్యాభావమును బట్టి, అద్వైత,విశిష్టాద్వైతసిద్ధాంతచ్ఛాయలను బట్టి, తాళపత్రగ్రంథలేఖనమును బట్టి,సీపద్యయతినియతిభంగమును బట్టి, పోతన భాగవతములోని ద్వితీయ, తృతీయ, చతుర్థ, దశమస్కంధములు కొంత కొంత గాని, అంత అంత గాని వెలిగందల నారయ పూరణములు కావని పర్యవసానము.

స్కంధాంతగద్యల సాక్ష్యమును బట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, సప్తమ, అష్టమ, నవమ, దశమస్కంధములు బమ్మెర పోతన కృతములు. పంచమస్కంధము గంగనకృతము. షష్ఠస్కంధము ఏర్చూరి సింగనకృతము. ఏకాదశ, ద్వాదశస్కంధములు వెలిగందల నారయకృతములు.

"పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా" 18.

"-తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండ గన్"
22ప.1స్కం.

అని పలికిన పోతన పండ్రెండు స్కంధముల భాగవతమును రచించుట పరమ సహజము. కానిచో "నేను పలికిన భవహర మగునట, నా జననము సఫలము చేసెదను" అను పోతన పలుకులు అర్థరహితములగును. పంచమ, షష్ఠ ఏకాదశ ద్వాదశస్కంధములు పరకృతములగుట ప్రాగభావఫలితము కాదు. ప్రధ్వంసాభావఫలితము. అందుకు కూచిమంచి తిమ్మకవి శంకుస్థాపనము చేసిన భాగవత భూస్థాపనకథాభవనము కల్పితమైన ఆకాశహర్మ్యము. యథార్థమైన పార్థివ గృహము నాటి చారిత్రికనైపథ్యము.

# ఆంధ్రభాగవతావతరణము చారిత్రికనైపథ్యము

ఒక మహాకావ్యము అవతరించుటకు ఒకానొక చారిత్రికహేతువును ఉండును. హేతువులేని కవిత్వకల్పనము సేతువు లేని సముద్రలంఘనము. ఎంత మహాక పులైనను ఇంద్రులు, చంద్రులు కాఁగలరు కాని, హనుమంతులు కాలేరు. కాలేదు. కవిత్రయము వారి భారతావతరణమునకు వలె పోతనగారి భాగవతావతరణ మునకును చారిత్రికనైపథ్యము కలదు. అది కాలజీమూతమును కదలించినచో సౌదామనీరేఖల వలె సాక్షాత్కరించును.

పోతన కాలము 1425-1500 జన్మస్థలము బమ్మెర. వాసస్థలము ఏకశిలా నగరము. పోతన "ఒక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనా నుమతంబున .... గంగకుం జని క్రుంకులిడి .... మరలి కొన్ని దినంబులకు నేక శిలానగరంబునకుం జనుదెంచి యందు గరువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుం" డయినట్లు భాగవతమునందు కలదు. (15,23వచ.1స్కం.) " అందు గురువృద్ధ బుధబంధుజనానుజ్ఞాతుం "డయ్యె ననగా, పోతన గురువులు, పెద్దలు, పండితులు, బంధువులు, ఏకశిలానగరమునందు కలరని అర్థము. కావున పోతన వాసస్థలము ఏకశిలానగరము. " ఏకశిలానగర మోరు గల్లే"[192] ఇప్పటి వరంగల్.

ఏకశిలానగరము ప్రథమతః కాకతీయుల రాజధాని. కాకతీయుల కాలమునందు ఏకశిలానగరమున అనేకదేవాలయములు నిర్మింపంబడినవి. కోట శిలాప్రాకారము లోపల శివాలయము (115) ఏకవీరాదేవ్యాలయము (127) భైరవాలయము, చమదేశ్వ రీమహాశక్త్యాలయము, వీరభద్రేశ్వరాలయము, బౌద్ధారామము, ముసానమ్మగుడి, కుమారస్వామి గుడి, పాండవుల గుడి, స్వయంభూదేవాలయము (149ప.) కలవని వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు కలదు. అవి యెల్ల వల్లభామాత్యుడు చూచినవి కావు. క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభిరామమును రచించిన రావిపాటి త్రిపురాంతకుడు చూచినవి. ప్రేమాభిరామము రచనాకాలము స్థూల ముగ 1350 ప్రాంతము[193]. 1325వ సంవత్సరమునుండి 1368 వ సంవత్సరము వఱ కును ఏకశిలానగరము ముసునూరి ప్రోలయనాయకుని, అతని సోదరుడైన కాపయనాయకుని రాజధాని[194]. 1369 వ సంవత్సరము నుండి 1425 వ సంవత్స రము వఱకును ఏకశిలానగరము నిరాటంకముగ రాచకొండ, దేవరకొండ

వెలమనాయకుల ఏలుబడియందు కలదు[195]. కా<sub></sub>బట్టి 1350 ప్రాంతమునందు రావిపాటి త్రిపురాంతకుడు చూచిన ఏకశిలానగరములోని దేవాలయములకు, దేవ్యాలయములకు 1425 వ సంవత్సరము వఱకు ప్రమాదము లేదు. 1425 వ సంవత్సరము నందు బహమనీసుల్తాను అహ్మద్ షా (1422-1436) రాచకొండ, దేవరకొండ వెలమరాజుల మీద కక్ష సాధింపు చర్యగ దండయాత్ర సాగించెను[196]. అతని సర్దారు ఖాన్- ఇ- అజామ్ అబ్దుల్ లతీఫ్ ఓరుగల్లును ముట్టడించెను. రాచకొండ వెలమరాజైన రెండవ అనపోతనాయకునికి, అబ్దుల్ లతీఫ్‌కు ఓరుగల్లు నందు యుద్ధము జరిగెను. ఆ యుద్ధమునందు ఏకశిలానగరములోని ఆలయములకు ప్రమాదము కలదు. అంతేకాదు. ఆహ్మద్ షా అన్ని దండయాత్రల యందును దేవాలయములను కూలగొట్టించి, మసీదులు కట్టించినట్లు - సయ్యద్ అలీ తబతబ 1591 వ సంవత్సరమునందు వ్రాసిన బర్హన్- ఇ- మాసిర్ అను గ్రంథము నందు కలదు[197]. కా<sub></sub>బట్టి ఏకశిలానగరములోని కొన్ని దేవాలయములు 1425 వ సంవత్సరమునందు నేల సపాటుము కావచ్చును.

1425 వ సంవత్సరమునందు జరిగిన ఓరుగల్లు యుద్ధమునందు అనపోతనాయకుడు వీరస్వర్గమును అలంకరించుటవలన, అతని కొడుకు రెండవ సర్వజ్ఞ సింగమనాయకుడు రాచకొండరాజ్యాధిపతి అయ్యెను[198]. అతనికి 1433 వ సంవత్సరమునందు అహ్మద్ షా ఓరుగల్లు రాజ్యమును కప్పము గట్టునట్లు అప్పగించెను[199]. కాని బహుశః 1450 వ సంవత్సరమునందు అహ్మద్ షా ప్రతినిధి సంజార్‌ఖాన్, రెండవ సర్వజ్ఞసింగమనాయకునితో యుద్ధము చేసి రాచకొండరాజ్యముతోపాటు ఓరుగల్లు రాజ్యమును స్వాధీనము చేసికొనెను[200] అది 1460 వ సంవత్సరమునందు కపిలేంద్రగజపతి అధీనమైనది[201]. మఱల 1471 వ సంవత్సరము తర్వాత బహమనీసుల్తాను మూడవ సమ్సుద్దీన్ మహమ్మద్ షా (1463-1482) వశమైనది[202]. ఓరుగల్లు రాజ్యము తోపాటు రాచకొండ, దేవరకొండ, కొండవీడు, కొండపల్లి, రాజమండ్రి రాజ్యములును అతని వశమైనవి[203].1473-1475 సంవత్సరముల మధ్య మహాక్షామము సంభవించినది[204]. బీజపూరుక్షామమని దాని పేరు. "తెలంగాణమునందు రెండు సంవత్సరములు విత్తనములు చల్లుకొనుటకు దిక్కు లేక పోయినది. మూడవ సంవత్సరమునందు మాత్రము కొలదిగ వానలు కురిసి దుక్కు సాగినది." అని ఫెరిస్టా గ్రంథమునందు కలదు[205]. అట్టి క్లిష్టసమయమునందు రాచకొండ, దేవరకొండ, కొండవీడు, కొండపల్లి, రాజమండ్రి రాజప్రతినిధులు పురుషోత్తమగజపతి సహాయమునంది మహమ్మదుషా పై తిరుగుబాటు లేవదీసిరి[206]. ఆ తిరుగుబాటును అణచివేయుటకు మహమ్మదుషా దండయాత్ర సాగించెను[207] ఓరుగల్లును స్వాధీనము చేసికొని అజీజ్‌ఖానును ప్రతినిధిగ

నియమించెను[208]. మహమ్మదుషా దండయాత్రలో మఱల ఏకశిలానగరమునందు మఱికొన్ని దేవాలయములు నేలమట్టములగు అవకాశము కలదు. అంతేకాదు. మహమ్మద్‌షా కాంచీనగరములోని దేవాలయములను నేలమట్టము చేసినట్లు బర్హాన్-ఇ-మాసిర్ గ్రంథమునందు కలదు[209]. కాంచీనగరదండయాత్రాకాలములందు కాంచీనగరములోని దేవాలయముల వలె ఏకశిలానగరదండయాత్రాకాలమునందు ఏకశిలానగరములోని దేవాలయములు నేల సపాటము లగుట సహజము. కాఁబట్టి ఏకశిలానగరములోని మఱికొన్ని దేవాలయములు 1475 వ సంవత్సరమునందు నేల సపాటము కాఁగలవు. 1425, 1450, 1475 సంవత్సరములందు ఏకశిలా నగరములోని అనేకదేవాలయములు నేల సపాటములగుటకు- అఖండ శిల్పకళాఖండమైన స్వయంభూదేవాలయము ఖండఖండములై పడియుండుట ప్రత్యక్షనిదర్శనము.

అసలు దేవాలయములు ఆనాడు ఇహపరసాధనములు. ఐహికముగ విద్యావినోదగోష్ఠులకు వితర్దికలు. పారమార్థికముగ మోక్షసామ్రాజ్యమునకు సింహాసనములు. స్వమతసౌభాగ్యమునకు స్వాగతద్వారములు. అవి నేలసపాటము లయినవి అనగా విద్యావినోదములు అడుగంటినవని. మోక్షపదవులు మూల పడినవని అర్థము. ఇహపరములు రెండును చెడినవని తాత్పర్యము. అంతేకాదు. పరమతప్రాచుర్యము ప్రబలినదని ఫలితార్థము. అది 1425 వ సంవత్సరమునందు బీజన్యాసము జరిగి, 1450 వ సంవత్సరమునందు బిందువికాసము కలిగి 1475 వ సంవత్సరమునందు పతాకస్థాయి నందినది. స్వమతమునందు సంవాదములు సకృత్తు. వివాదములు సమృద్ధి. బ్రాహ్మణబౌద్ధజైనమతముల సంఘర్షణ సమసిపోయినను, శైవవైష్ణవమతముల వైరుధ్యము సడలిపోయినను, అద్వైతవిశిష్టాద్వైతసిద్ధాంతముల ద్వైరాజ్యము వదలిపోలేదు. దేవుడు ఒక్కడైనను, 'దేవుళ్లు' వెలసిరి "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అని ఋగ్వేదవాణి ఉద్ఘోషించినను, ఏకదైవభావము కంటె పరమదైవభావము ప్రబలమైనది. దైవమునకు సంబంధించినది మతము. మతమునకు, జీవితమునకు ఆ కాలమునందు అవినాభావసంబంధము కలదు. అది ధీమాన్యులకు పరిమితము కాదు. సామాన్యులకును పర్యాప్తము. అనేకత్వములోని ఏకత్వము సామాన్యులకు అందనిఫలము. పరమతములోని ఏక దైవభావము ప్రలోభనీయము. బాహిరమైన బలప్రయోగమునకు సాయము, ఆంతరమైన విషాదయోగము. అది కనులారఁ గాంచిన మహాకవి మథనపడుట మానవ సహజము. మహాకవి మానసవీథిలోని సముద్రమథనమునకు ఫలము మహాకావ్యామృతకలశము. ఏకశిలానగరము వాసస్థలమైన బమ్మెర పోతనకు 1425 వ సంవత్సరమునుండి 1450 వ సంవత్సరము వఱకు జరిగిన ఏకశిలానగరచరిత్ర

వినుకలి. 1450 వ సంవత్సరము నుండి 1475 వ సంవత్సరము వఱకు జరిగిన ఏకశిలానగరచరిత్ర కనుకలి. అది, ఇది ఘోరకలి. ఆనాడు ఏకశిలానగరచరిత్ర ఆంధ్రదేశచరిత్రకు ఆయువుపట్టు. అది బహుశః 1476 వ సంవత్సరము నుండి భాగవతరచనకు ఉపక్రమించిన పోతనకు ఉద్దీపనవిభావము. భాగవతరచనాకాలము 1480 వ సంవత్సరము కావచ్చును.

ఒకానొక దండయాత్రకు ఒదిగిపోయిన ఓరుగల్లు కోట పోతన భాగవతము నందు పోత పోయఁబడినది. అది కూడ దండయాత్రాసందర్భమే. అయినను సంస్కృతభాగవతమునందు లేని అనేకవిశేషములు పోతన భాగవతమునందు కలవు. అది బలిచక్రవర్తి అమరావతీదండయాత్ర!

అమరావతీనగరవర్ణనము సంస్కృతభాగవతమునందు సరిగా పండ్రెండు శ్లోకములందు కలదు. (12-23శ్లో.15అ.8స్కం.) అది పోతన భాగవతమునందు అరువది శ్లోకముల పెట్టు. మూడున్నరపుటల సుదీర్ఘవచనము. (447వచ.8స్కం.) అందు ఏకశిలానగరవర్ణనము అంతర్లీనముగ కలదు." ముందటు యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోర గాయ పండు గెల కతంబుల వ్రేఁగు లాఁగలేక మూఁగి వీఁగి వ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకులకుం బేటలగు పెందోటలు" ఓరుగల్లులోనివి. "అమృతంబు గురియు కామధేనువులు "అమరావతీనగరములోనివే కాని, "పరాగంబుల సరాగంబులగు వాఁగువ్రంతల చెంతల గుంపులుగొని గఱికి జొంపంబుల లంపుల దిని మంపులు గొని పెల్లు నెమర్లు పెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడవాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్లవాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారికలగు" కామధేనువులు ఏకశిలా నగరములోని గ్రామధేనువులే. వానికి - "నిలువనీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బొడుకు తరువులే కల్పతరువులు. "చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుఁ జెచ్చెర నెదురు చని తూకొని తోకొని పోవు రంభాదులు" అక్కడి వారేగాని, "తోరణస్తంభముల చేరువ నిలిచి చెఱకువిలుతుం డొఱ వెఱికిన బెడిదములగు నవకంపు మొఱుంగుంజిగురుటడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం గరచరణాదిశాఖలు గల చంద్రరేఖ పోఁడిమిని వాహిని గల మోహినీవిద్యల గ్రద్దనంజూపులకుఁ దీపు లొదవించుచు ధర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గల"వారు ఇక్కడివారే.

అమరావతికోట అచ్చుముగ ఓరుగల్లు కోట. ఓరుగల్లు కోట వర్తులాకారము. సప్తప్రాకారసంవలితము. చతుర్ద్వారసంకలితము. తోరణస్తంభసంఘటితము. మఱి అమరావతికోటలోను "ఇభంబుల సరస నొరసికొని వరుసం బరుసదనము వెడలి సుకరములగు మకరతోరణస్తంభంబులు" కలవు."వారవనితాసుపూజితవిరాజితదే

హాళీపాటవంబులగు గోపురకనకకవాటంబులును గవాటవేదికాఘటితమణి గణకిరణోదారంబులగు చతుర్ద్వారంబులును" కలవు. "మిగుల గరితయగు నగ రిసిరి మీఱు నమరు మొగలు వొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడితెరల వలువల బెడంగునం దోరంబులగు ప్రాకారంబులును "కలవు. అంతే కాదు. అమరావతికోట "కాంతాకుచంబునుం బోలె సువృత్తంబయి .... కృతార్థం బయిన"ది. అమరావతికోటలో చతుర్ద్వారముల "ద్వారదేశంబుల చావిళ్లం గావ ళ్లుండి ప్రొద్దుపోక రక్కసుల వేల్పుల కయ్యంబుల నెయ్యంబులం జెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులు శూరులు నయిన మహాద్వారపాలకవీరులును" కలరట! వేల్పుల రాక్షసుల కయ్యములు నెయ్యములు అమరావతికోటలోని చతుర్ద్వారద్వారపాలక మహావీరులు చెప్పికొనుట ఏమోగాని, ఓరుగల్లు కోటలోని చతుర్ద్వార ద్వారపాలకమహావీరులు స్వదేశవిదేశరాజుల సంధివిగ్రహములు చెప్పికొనుట నిజము. అమరావతి కోట ప్రాకారములకు "ప్రాకారకాంచనాంచితయుద్ధసన్న ద్ధమహోఖర్వగంధర్వవాహినీపాలకంబులగు మరకతాట్టాలకంబులును" కలవట! అమరావతి కోట అట్టాలకములందు గంధర్వసేన యుద్ధసన్నద్ధమగునో కాదోగాని, ఓరుగల్లు కోట బురుజులందు మనుష్యసేన యుద్ధసన్నద్ధమే. అమరావతికోటలోని "హిమకరమ్మండలంబు నిద్దంపుటద్దంబని మూఁగి తొంగి చూచుచు నలికఫల కంబునఁ గులకములు గొను నలకములం దరపి తిలకములం దెఱఁగు పఱు చుకొను సమయముల వెనుక నొదిగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితరసతుల రతుల కనుమతులని కనుకనిస్ మరలి నీడ తలంగినం గలంగి చని కాంతులు వొలయ నలయు ముగుదలకు నేకాంతంబులై గగనసముత్సేధంబులైన రాజసౌధంబులు" నిస్సందేహముగ ఓరుగల్లు రాజసౌధములే. "వైరికిం జీరికిం గొనక శంక లుడిగి ఱంకె లిడుచు లంకెలై లెక్కకు మిక్కిలియగుచు ... దిరుగు వీరభటకదంబంబులు, కదంబకరవాలశూలాదుల మెఱుంగులు, నడమొగిళ్ల పెల్లున రథంబుల గములు, తురంగంబుల సురంగంబులు, గానసాహిత్యనృత్యవిశేషములు" ఏకశిలానగరవిశేషములు.

అన్నిటి కంటె అగ్రేసరములైనవి "పరభటప్రాణవంచనంబులు సముదంచ నంబులు నగు దంచనములు." దంచన మన పెద్దఫిరంగి అని శబ్దరత్నాకరము. "కోటలు మున్నగునవి బ్రద్దలు కొట్టుట కుపయోగించు ఆయుధవిశేషము, శత్రు వులను కోట నెక్కకుండ క్రిందికి త్రోయుటకు ఱాలను విసురు ఆయుధవిశేషము" అని సూర్యరాయాంధ్రనిఘంటువు. అది మహమ్మదీయుల ఆయుధవిశేషము. శిలాయంత్రాయుధవిశేషము. పరభటప్రాణవంచనములైన దంచనములు బలి చక్రవర్తి దండయాత్రా కాలమునందలి అమరావతీనగరములోని

ఆయుధవిశేషములు కావుగాని, బహమనీసుల్తాను దండయాత్రాకాలమునందలి ఏక శిలానగరములోని ఆయుధవిశేషములే.

బలిచక్రవర్తి సమరశంఖము పూరించగానే, బృహస్పతి ఆదేశానుసారముగ ఇంద్రాదిదేవతలు కామరూపులై త్రివిష్టపమును విడిచిపెట్టి ఎటకో పోయిరి. బలిచక్రవర్తి స్వర్గాధిపతి అయ్యెను. అది దేవతల తల్లి అదితికి బాధ కలిగించెను. ఆమె భర్త కశ్యపబ్రహ్మ చిరకాలతపస్సమాధిని చాలించి స్వగృహమునకు రాగానే, దీన వదనయైన భార్యను చూచి, "విప్రులకు, లోకమునకు, ధర్మమునకు అభద్రము లేదు కద? అయోగ్యులకు కూడ ధర్మార్థకామముల ఫలములు పొందు గృహములలో కొంచెమైనను అకుశలము లేదుకద?" అని కుశలప్రశ్నలు వైచెను. ఆ ప్రశ్నలకు అదితి "బ్రాహ్మణులకు, జనధర్మములకు భద్రమే. గృహములెల్ల ధర్మార్థకామత్రివర్గములకు నిలయములే. అగ్నులు, అతిథులు, భృత్యులు, భిక్షువులు క్షేమమే" అని సమాధానమిచ్చెను. ఇట్లు సంస్కృతభాగవతమునంధు కలదు. (11,12శ్లో.16అ.8స్కం) ఇది పోతన భాగవతమునందు లేదు. పోతన కాలమునందు గోబ్రాహ్మణులకు, ధర్మార్థకామములకు, అగ్న్యతిథిభృత్యభిక్షువులకు మాత్రమేకాదు; బహమనీసుల్తాను దండయాత్రకు, బీజపూరు క్షామమునకు గుఱియైన ఏకశిలానగరవాసులు ఎవ్వరికిని క్షేమము లేదు. ఇది సమకాలికసాంఘికస్థితిప్రతిఫలనము. "బృహస్పతివచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమ తమ పొందుపట్లకుంజనిరి" అని (458వచ.8స్కం.) ముందు రచించిన పోతన తర్వాత అమూలకముగ రచించిన పద్యమిది:

"ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు
పలు పంచలను జాలిఁ బడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబు బిడ్డలు జయంతాదులు
శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటుపట్టయ్యె నేఁడు
బలి జగముల నెల్ల బలియుచునున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁ డాహరించుచుఁ
గడఁగి సురకొక్క కడియు నీఁడు." 471ప.8స్కం.

తమ పొందుపట్టునకు చనిన ఇంద్రుని ఇల్లాలు ఎండకన్నెఱుగనిది కాదు. ఆ

కాలమునందు అసూర్యంపశ్య అయిన రాజవల్లభ పరుల పంచల పాలైనది. దేవేంద్రుడు త్రిభువన సామ్రాజ్యవిభవమును కోల్పోయినను అడవులలో తిరుగలేదు. త్రిలింగసామ్రాజ్య విభవమును కోల్పోయిన నరేంద్రుడు అడవులలో తిరుగకపోలేదు. ఇంద్రుని కుమారులు జయంతాదులు శబరార్భకుల వెంట చన లేదు. రాజకుమారులు అటవికుల వెంట చనక పోలేదు. అమరావతి అసురలకు వలె, ఏకశిలానగరము విదేశీయులకు ఆటపట్టైనది. నాడు బలిచక్రవర్తియే కాదు; నేడు (పోతన కాలము నాడు) బహమనీసుల్తాను కూడ బలియుచున్నాడు. ఇంద్రుడు బలిచక్రవర్తిని గెలువలేడు. నరేంద్రుడు బహమనీసుల్తానును గెలువలేడు. బలిచక్రవర్తి దేవతలకు అన్నము పెట్టకుండ, యాగభాగములు ఆహరించుట ఏమోగాని, బహమనీసుల్తాను ప్రజలకు అన్నము దక్కకుండ భోగభాగ్యములు అనుభవించుట చారిత్రికసత్యము. ఇందు 1450 వ సంవత్సరమునందలి ఏకశిలానగరము మాత్రమేగాక, తెలంగాణమును విడిచిపెట్టిన రెండవ సర్వజ్ఞసింగమనాయకుని చరిత్ర స్ఫురితప్రసుప్తకల్పముగ కలదు.

అదితికి కశ్యపబ్రహ్మ సమస్యాపరిష్కారసాధనముగ పయోవ్రతమును ఉపదేశించెను. పయోవ్రతవిధానము సంస్కృతభాగవతమునందు ముప్పదియైదు శ్లోకములందు కలదు. (25-59శ్లో.16అ8స్కం.) అది సర్వయజ్ఞము, సర్వవ్రతము, తపస్సారము అని కూడ అందు కలదు. (60శ్లో.) అయినను పోతన భాగవతమునందు పయోవ్రతవిధానము లేదు. కారణము పోతనకాలమునందు ప్రోది చేయవలసినది కర్మమార్గము, జ్ఞానమార్గము కాదు. భక్తిమార్గము. ఏకదైవభక్తిమార్గము. అదే పోతన భాగవతమునందు అగ్రేసరభాసమానము.

పోతన రామభక్తుడని ప్రసిద్ధి. కాని పోతన భాగవతములోని ఇష్టదేవతాస్తుతియందు రామస్తుతి లేదు. పోతన తండ్రి "శైవశాస్త్రముఁ గనియె" (25ప.1స్కం.) తల్లి "సదాశివపాదయుగార్చనానుకంపానయవాగ్భవాని" (26ప.1స్కం.) అన్న "ఈశ్వరసేవాకాముఁ డు" (27ప.1స్కం) పోతన "మాయమ్మ" అన్నది దుర్గను. (10ప.1స్కం) ఆమె మహాశక్తి. ఇంత శైవకుటుంబి పోతన శ్రీమహాభాగవతరచనకు శ్రీకారము చుట్టుచు "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్" అన్నది "మహానందాంగనాడింభకున్" (1ప.1స్కం.) అంతేకాదు "వాలిన భక్తి మ్రొక్కెద"నన్నది "బాలశశాంకమౌళిని" (2ప.1స్కం.) "ఆతతసేవఁ జేసెద"నన్నది "భారతీహృదయసౌఖ్యవిధాతను" (3ప.1స్కం) రచింపఁ దలచినది "శ్రీమన్నారాయణకథాప్రపంచంబు" (15వ.1స్కం.) అందుకు ప్రథమతః ఆచరించినది గంగాస్నానము. తదుపరి కావించినది మహేశ్వరధ్యానము. (15వచ.1స్కం.) అందువలన దర్శనమొసగిన రాజముఖ్యుడు రాజశేఖరుడైన రామభద్రుడు. (16ప.1స్కం.)

రాజశేఖరుడైన రామభద్రుని ఆనతిని, హరికరుణావిశేషమున కృతార్థత్వము సిద్ధించెనని పోతన చిత్తమునందు రామచంద్రుని అంతస్సన్నిధానము కల్పించుకొని (28వచ.1ఆ.) రచించిన పద్యములు కృష్ణపరము. (29-32ప.1స్కం.) షష్ఠ్యంతపద్యములు కృష్ణపరమైనను స్కంధాద్యంతపద్యములు రామపరము. శ్రీమన్నారాయణుడు, మహేశ్వరుడు, రాముడు, కృష్ణుడు ఒకడే అని కావ్యముఖమునందే పోతన దిద్దితీర్చిన ఏకదైవభావతిలకము

"తనువున నంటిన ధరణీపరాగంబు
పూసిన నెఱిభూతి పూఁత గాఁగ
ముందఱ వెలుగొందు ముక్తాలలామంబు
తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు
కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు
గమనీయమగు మెడ కప్పు గాఁగ
హారవల్లు లురగహారవల్లులుగాఁగ
బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు" 297ప.10స్కం.పూ.భా.

ఇది పోతన అమూలకముగ బాలకృష్ణుని వర్ణించిన పద్యము. ఇందు శివకేశవాభేదము ఇదమిత్థముగ కలదు. ఏకదైవభావమునకు కావ్యమధ్యస్థమకుటము.

"అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యే విభు పాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్."
66ప.2స్కం.

ఇది పోతన స్వీయకవిత. ఇందు పండితులు అణువా? మహామహావిభవుడా? -ఛిన్నుడా? అచ్ఛిన్నుడా?- గుణియా? నిర్గుణియా- అని తర్కించుచు, తత్త్వాన్వేషణము కుంఠుబడినవారయి, తర్వాత భక్తిమార్గమున తత్త్వదర్శనము కాంతురని కలదు. ఇట్లు సంస్కృతభాగవతమునందు లేదు. (21శ్లో.4అ.2స్కం.) పోతన అమూలకవాణి. అధ్యాపకవాణి. జీవేశ్వరులకు భేదము తెలుపునది ద్వైతము. అభేదము తెలుపునది అద్వైతము. అభేదభేదము తెలుపునది విశిష్టాద్వైతము. జీవుడు అణువని, ఈశ్వరుడు విభువని ద్వైతవిశిష్టాద్వైతములందు కలదు. జీవేశ్వరులకు

అభేదమైనచో, ఈశ్వరుడు అణువా? విభువా? అను సంశయమునకు అవకాశము కలదు. జీవేశ్వరులకు అభేదము కలదను అద్వైతమునందు ఈశ్వరుడు అచ్ఛిన్నుడు. భేదము కలదను ద్వైతమునందు, అభేదభేదము కలదను విశిష్టాద్వైతమునందు ఛిన్నుడు. కనుక ఈశ్వరుడు ఛిన్నుడా? అచ్ఛిన్నుడా? అను సందేహమునకు అవకాశము కలుగును. ఈశ్వరుడు ద్వైతవిశిష్టాద్వైతములందు గుణి. అద్వైతమునందు నిర్గుణి. కావున ఈశ్వరుడు గుణియా? నిర్గుణియా? అని విచికిత్సకు అవకాశము కలుగును. ఏవంవిధమైన సిద్ధాంతచర్చలవలన తత్త్వాన్వేషణము కుంఠీభూతమగునని, భగవంతుని యెడల భక్తిపారవశ్యము వలన మాత్రమే తత్త్వదర్శనము కలుగునని పోతన స్పష్టప్రతిపాదనము. పోతన భాగవతమునందు పుష్కలముగ, రసపుష్కరముగ ఉన్నది తత్త్వదర్శనతత్పరమైన భక్తిపారవశ్యమే. అది స్వశ్రేయము కాదు. సర్వశ్రేయము. జగద్ధితము.

## గ్రంథప్రధ్వంసము.

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్నిపుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతమ్ము జగద్ధితమ్ముగన్"

ఇది ముద్రితగ్రంథములందు మాత్రమే కాదు; తాళపత్రగ్రంథములందును కలదు[210]. కాని ప్రకరణోచితముగ లేదు. పద్యమిది ప్రథమపురుషయందు కలదు. ప్రకరణమెల్ల ఉత్తమపురుషయందు కలదు. (1-33వచ.1స్కం.) అంతేకాదు. పద్యమునందు పోతన భాగవతము రచించినట్లు కలదు. ప్రకరణమునందు రచించునట్లు కలదు. కాన ప్రక్షిప్తము కావచ్చును. కాని పద్యము పోతన పద్యము వలెనే కలదు. "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి" అను పోతన పద్యమునకు "ఎమ్మెలు సెప్పనేల జగమెన్నఁగ" అను సింగన పద్యమునకు హస్తిమశకాంతరము కలదు. సింగనకృతము కాదు. పోతన కృతమైన పంద్రెండు స్కంధముల భాగవతమునందును ద్వాదశస్కంధాంతపద్యమగును. అది ప్రధ్వంసమగుట వలన అన్యస్థలము నిరవకాశమగుట వలన అవతారికయందు భద్రము సేయుట సంభవము. "ఇమ్మనుజేశ్వరాధములు" అనగా ఈ మనుజేశ్వరాధములు. ఏ మనుజేశ్వరాధములు?

"సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు వీటిఁ బోవు సిద్ధము తల్లీ." 423ప.1స్కం.

అని పోతన భాగవతమునందే కలదు. ఇది యథామూలకము కాదు. పోతన స్వతంత్రకల్పనము. శిష్టరక్షణము చేయని రాజులు రాజాధములు. శిష్టశిక్షణము, దుష్టరక్షణము చేయు రాజులును రాజాధములే. వారే మనుజేశ్వరాధములు. "ఈ" అని పోతన నిర్దేశించిన మనుజేశ్వరాధములు పోతన కాలములోని మనుజేశ్వ రాధములే. వారెవరు?

"కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల యో మదంబ యో
హాటక గర్భురాణి నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ!"

ఇది పోతన చాటుపద్యము. ఇందు "సరస్వతిని అనగా భాగవతమును ఆకలి వలన కొనిపోయి, అల్ల కర్ణాటకిరాటకీచకులకు మనసా, వాచా, కర్మణా అమ్మను" అని కలదు. కర్ణాటకిరాటకీచకులు ఎవరు? "కొనిపోయి, అల్ల" అను మాటలను బట్టి సమీపస్థులు కారు. సుదూరస్థులు. కర్ణాటకిరాటపాలకులు కావల యను. వారు కీచకుల వంటివారును కావలయును. కీచకులు మహాభారతమునందు కలరు. కీచకాగ్రజుడైన సింహబలుడు కాముకుడు. మద్యపానమత్తుడు. కీచకా వరజులైన ఉపకీచకులు చచ్చిన కీచకుని శవమునకు, బ్రదికియున్న ద్రౌపదిని కట్టివేసి అంత్యక్రియలకు బయలు దేరిన మహాకర్కశహృదయులు. కాఁబట్టి కాముకులు, మద్యపానమత్తులు, మహాకర్కశహృదయులు అయిన కర్ణాటకిరా టపాలకులు కర్ణాటకిరాటకీచకులు కావలయును.

కర్ణాటపాలకులు విజయనగరరాజులు. కిరాటపాలకులు బహమనీసుల్తానులు. "ద్వే తు కిరాట స్యా న్మ్లేచ్ఛే వణిజిచాపి" అని నానార్థార్ణవసంక్షేపనిఘంటువు. బహమనీసుల్తానులు మ్లేచ్ఛశబ్దవాచ్యులు. పోతన భాగవతరచనాకాలము 1480 వ సంవత్సరము. అప్పటి ఒక విజయనగరరాజు విరూపాక్షరాయలు[211]. (1465-78) అతడు కాముకుడు. మద్యపానమత్తుడు. మఱొక విజయనగరరాజు నాల్గవ ప్రౌఢదే వరాయలు [212] (1478-85)అతడు విరూపాక్షరాయల కొడుకు. తండ్రిని మించిన తన యుడు. కాముకుడు, మద్యపానమత్తుడు మాత్రమేగాక, రాజ్యాధికారమొసగిన అన్నగారినే చంపించిన మహాకర్కశహృదయుడు. తండ్రి, కొడుకు

కీచకసన్నిభులు. కర్ణాటకీచకులు. బహమనీసుల్తాను మూడవ (షమ్సుద్దీన్) మహ్మాద్‌షా[213]. (1468-82) అతడు బహమనీ రాజ్యము బహుముఖాభివృద్ధికి కారకుడైన మంత్రి, మహావీరుడు మాత్రమేగాక; కవి, పండితుడు, సాధువు అయిన మహ్మాద్ గవాన్‌ను చంపించిన మహాకర్కశహృదయుడు. మద్యపానమత్తుడును. అతడు కిరాటకీచకుడు. ఆ "కర్ణాటకిరాటకీచకులే" ఇమ్మనుజేశ్వరాధములు". కాముకులు, మద్యపానమత్తులు, మహాకర్కశహృదయులు అయిన కర్ణాటకిరాటపాలకులకు భాగవతమును అంకితమిచ్చుట సరస్వతిని అమ్ముకొనుటయే అని పోతన ఆంతర్యము.

పోతన రచించిన పండ్రెడు స్కంధముల భాగవతమునందు పంచమ, షష్ఠ ఏకాదశ, ద్వాదశస్కంధములు ప్రధ్వంసమగుటకు హేతువు దేవతార్చనపేటికలోని క్రిమికీటకాదికము కాదు. సర్వజ్ఞసింగభూపాలుని భూస్థాపనమును కాదు. సర్వజ్ఞ సింగమనాయకుని రాచకొండ రాజ్యము, 1450 ప్రాంతమునందే పరాధీనమైనది[214]. సర్వజ్ఞసింగభూపాలుని శాసనము 1453వ సంవత్సరమునందు బెల్లముకొండయందు కలదు[215]. 1475వ సంవత్సరమునందు తిరుపతియందు కలదు[216]. తిరుపతి తీర్థయాత్రాస్థలము. బెల్లముకొండ దండయాత్రాస్థలము. బెల్లముకొండదుర్గము 1453-54 సంవత్సరమునందే కపిలేంద్రగజపతి అధీనమైనది[217]. కపిలేంద్రగజపతి రాజ్యధుర్యుడైన పూసపాటి మూడవ తిమ్మరాజు "త్రిభువనీరాయబిరుదప్రదీప్తు రావుసింగన జయించెఁ బెదవీటి చెంత" అని పూసపాటి ఆరవ తిమ్మరాజు కృష్ణవిజయమునందు కలదు. (117ప.1ఆ.) "త్రిభువనీరాయబిరుదప్రదీప్తుఁడైన రావుసింగని సంగరరంగమందుఁ దునిమెఁ బెదవీటి చెంత" అని పూసపాటి వేంకటపతిరాజు ఉషాభ్యుదయమునందు కలదు[218]. కాఁబట్టి పూసపాటి మూడవ తమ్మిరాజు సర్వజ్ఞసింగభూపాలుని సంహరించిన కాలము 1476 వ సంవత్సరము కాగలదు. 1476 వ సంవత్సరమునందు వీరస్వర్గమును అలంకరించిన సర్వజ్ఞసింగభూపాలుడు 1480 వ సంవత్సరమునందు పోతన భాగవతనమును భూస్థాపితము చేయుట అభూతకల్పన. 1486 సంవత్సరము నందు ఏకశిలానగరము మఱల రణరంగమైనది[219]. రాజమండ్రి నుండి కొవమ్- ఉవ్- ముల్క్ దండెత్తి వచ్చి ఓరుగల్లును ముట్టడించి స్వాధీనము చేసికొనెను. వెంటనే బీదర్ నుండి బహమనీసుల్తాను నాల్గవ మహ్మాద్‌షా (1482-1518), అతని ప్రధాని నిజామ్- ఉల్- ముల్క్ ముట్టడిదారును మట్టుపెట్టుటకు ఓరుగల్లు మీద దండయాత్ర సాగించిరి. అది ఒక అంతర్యుద్ధమైనను యుద్ధమే. ఆ యుద్ధరాక్షసి కరాళదంష్ట్రలకు, పోతన భాగవతములోని పంచమ, షష్ఠ ఏకాదశ, ద్వాదశస్కంధములు కబళములు

కావచ్చును.

పంద్రెడు స్కంధముల పోతన భాగవతము మొత్తము, ఒక తాళపత్రగ్రంథము కాదు. తొమ్మిది తాళపత్రగ్రంథములగును[220]. అందు పంచమ, షష్ఠస్కంధముల నాల్గవ తాళపత్రగ్రంథము; ఏకాదశ, ద్వాదశస్కంధముల తొమ్మిదవ తాళపత్ర గ్రంథము ప్రధ్వంసము కావచ్చును. రెండు బృహత్తాళపత్రగ్రంథములైనను, రెండు తాళపత్రగ్రంథముల చరమభాగములైన పంచమ, షష్ఠ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు ప్రధ్వంసము కావచ్చును.

## భాగవతాంధ్రీకరణము

కవిత్రయము వారి భారతాంధ్రీకరణము స్వతంత్రపద్ధతి. శ్రీనాథుని నైషధాంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్రపద్ధతి. కాశీఖండాంధ్రీకరణము పరమస్వతంత్రపద్ధతి. పోతన భాగవతాంధ్రీకరణము మహాస్వతంత్రపద్ధతి. కవిత్రయమువారి స్వతంత్రాంధ్రీకరణపద్ధతిని తెనుగు భారతము తరిగినది. శ్రీనాథుని స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణపద్ధతిని శృంగారనైషధమును తరిగినది. పరమస్వతంత్రాంధ్రీకరణపద్ధతిని తెలుగు కాశీఖండము కూడ తరిగినది. పోతన మహాస్వతంత్రాంధ్రీకరణపద్ధతిని పోతన భాగవతము పెరిగినది. కారణము శ్లోకప్రపంచీకరణము మాత్రమేగాక, సన్నివేశవిపులీకరణము.

> "భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
> శూలికైనఁ దమ్మి చూలికైన
> విబుధజనుల వలన విన్నంత కన్నంత
> దెలియవచ్చినంత దేటపఱుతు" 19ప.1స్కం.

అని పోతన స్వవచనము. విబుధజనుల వలన విన్నది, వివిధవ్యాఖ్యానములందు కన్నది, స్వయముగ తెలిసికొన్నది పోతన భాగవతమునందు త్రివేణీసంగమము వలె తీర్థభూతమైనది.

భీష్మని శ్రీకృష్ణస్తవమునందు శ్లోక ప్రపంచీకరణము కలదు.

> "స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం
> ఋతమధికర్తు మవప్లుతో రథస్థః
> ధృతరథచరణోఽభ్యయాచ్చలద్గు
> ర్హరిరివ హన్తు మిభం గతోత్తరీయః. 37

శితవిశిఖవతో విశీర్ణదంశః
క్షతజపరిప్లుత ఆతతాయినో మే
ప్రసభ మభిససార మద్వధార్థః
న భవతు మే భగవాన్ గతి ర్ముకున్దః" 38శ్లో.9అ.1స్కం.

అను శ్లోకములు నిమిత్తమాత్రముగ పోతన స్వకపోలకల్పనమున ప్రపంచీకరించిన పద్యమిది.

"కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి
గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నా లావు నగుఁబాటు సేయకు
మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ
గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు." 222ప.1స్కం.

శ్రీకృష్ణుడు కుచేలుని ఆహ్వానించునెడ శ్లోకప్రపంచీకరణము కలదు.

"తం విలోక్యాచ్యుతో దూరా త్ప్రియాపర్యంక మాస్థితః
సహసోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీ న్ముదా"
18శ్లో.80అ.10స్కం.

అను శ్లోకము పోతన ఆంధ్రీకరణమున రెండు పద్యములైనది.

"కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేద వి
ప్రుని నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పమున్. 980

కర మర్థి నెదురుగాఁ జని
పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా
దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్."
981ప.10స్కం. ఉ.భా.

ఇందు కుచేలుని దారిద్ర్యవర్ణనము పోతన స్వతంత్రకల్పనము. అది శ్రీకృష్ణుని బాల్యస్నేహసమాదరమునకు అభివ్యంజకము.

ప్రపంచీకరణము కంటె విపులీకరణము విస్తృతము. శుకయోగీంద్రుడు బోధించిన ముక్తిమార్గము, భక్తిమార్గము విపులీకరణము. పదియేడుశ్లోకములకు అరువదియేడు పద్యగద్యములు. (3-69ప.2స్కం.) విదురమైత్రేయసంవాదమును విపులీకరణము. ఏబదిశ్లోకములకు అష్టోత్తరద్విశతపద్యగద్యములు. (180-388 వచ.3స్కం.) దక్షాధ్వరధ్వంసమును విపులీకరణమే. కతిపయశ్లోకములకు నూటడెబ్బదియైదు పద్యగద్యములు. (35-211వచ.4స్కం.) ప్రహ్లాదచరిత్రమును విపులీకరణము. రెండువందల ఏబదిశ్లోకములకు రెండువందల డెబ్బదిరెండు పద్యగద్యములు. (115-386ప.7స్కం.) ఇటు సంఖ్యాబలము ఇంచుమించు సమానమే గాని, గ్రంథపరిమాణము త్రిగుణితము.

"ప్రహ్లాద ఉచ్యతాం తాత స్వధీతం కించిదుత్తమమ్ ।
కాలే నైతావతాయుష్మన్ యదశిక్ష ద్గురోర్భవాన్." 22.
"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్. 23
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత ముత్తమమ్. " 24శ్లో.5అ.7స్కం.

అను మూడు శ్లోకముల హిరణ్యకశిపు, ప్రహ్లాదుల ముచ్చట, తొమ్మిది పద్యగద్యముల తోరణస్తంభము. ఒక్క వచనము వినా, ఎనిమిది పద్యములును ఎల్లకాలమును ప్రజల నాలుకలపై నాట్యమాడునవి. పోతన స్వీయకవితాచంద్రికలు. ప్రహ్లాదుని హరిభక్తిపారవశ్యము తోపాటు పోతన హరిభక్తిపారవశ్యమును పరవశ్లు త్రొక్కునవి. పోతన పాత్రచిత్రణపాటవమును ముత్యాల ముగ్గుగా పోతపోయునవి. హరిభక్తిపారవశ్యము నారాయణభక్తియోగమైన శ్రీమహాభాగవతమునకు అత్యంత సముచితము. ఆ పద్యములివి:

"చోద్యం బయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు లేవెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగఁ, గోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ,
బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ, దాత్పర్యంబు భాషింపుమా. 163.

నిన్నున్ మెచ్చురు నీతిపాఠమహిమన్ నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ జెప్పనేర్తురుగదా గ్రంథార్థముల్ దక్షులై
యన్నా యెన్నఁడు నీవు నీతివిదుండౌదంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే."

164ప.

ఇందు పితృహృదయము పిఠరపాకము. పుత్త్రవాత్సల్యము పుటపాకము. అంతే కాదు., పరిశోధనాత్మకపాఠప్రవచనవిధానము నిధానము.

"చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ. 166

తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలంతున్ సత్యంబు

దైత్యోత్తమా. 167.

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థసంసారముల్. 168.

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడు తండ్రి తండ్రి. 169.

కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంభితచర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక
చక్రిచింతలేని జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే
పాదయుగము తోడి పశువుగాక 170

సంసారజీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ని లాఱునే
విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాశి లింకునే
హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే
పద్మాక్షనుతిరవిప్రభలు లేక
నిరుపమాపునరావృత్తినిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామరసగర్భునకునైన దానవేంద్ర." 171ప.

ఇందు "కమలాక్షు నర్చించు కరములు కరములు" అను పద్యము "శ్రీభీమనాయకశివనామధేయంబుఁ జింతింపనేర్చిన జిహ్వ జిహ్వ" అను శ్రీనాథుని పద్యమునకు అనుకరణము.

గజేంద్రమోక్షమును విపులీకరణము. కతిపయ శ్లోకములకు నూటపది పద్యగద్యములు. (18-121ప.8స్కం.) అందు గజేంద్రుని మొఱ ఆలకించి విష్ణువు బయలుదేరుట ఒక్క శ్లోకమునందు కలదు. అది పోతన ఆంధ్రీకరణమున పదమూడు పద్యగద్యముల ఘట్టము.

"తం తద్వదార్తముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేన స ఊహ్యమాన
శ్చక్రాయుధోఽభ్యగమ దాశు యతో గజేన్ద్రః"

31శ్లో.3అ.8స్కం.

"అల వైకుంఠపురంబులో నగరులో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి
సంరంభియై. 95.

సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముంజేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. 96.

తన వెంటన్ సిరి లచ్చి వెంట నవరోధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగు వా రాబాలగోపాలమున్. 98.

తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ డనాథస్త్రీ జనాలాపముల్
వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
గని చక్రాయుధుఁ డేఁ డీ చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్. 99.

అని వితర్కించుచు 100.

తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్. 102.

అడిగెదనని కడు వడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నెడ నుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. 103.

నిటలాలకము లంటనివుర జుంజుమ్మని
ముఖసరోజము నిండ ముసురుఁ దేంట్లు
నళులఁ జోపఁగఁ జిల్క లల్లనల్లనఁ జేరి
యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మం
దాకినీ పాఠీనలోక మెసఁగు
మీనపంక్తుల దాఁటు మెయిదీఁగతో రాయ
శంపాలతలు మింట సరణి గట్టు
శంపలను జయింపఁ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు సూపు
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె
జలదవర్ణు వెనుకఁ జనెడు నపుడు 104.

వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతిజీ
వనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105.

ఇట్లు పొడగని 106ప.

చనుదెంచెన్ ఘనుఁ డల్ల వాఁడె హరిపజ్జం గంటిరే లక్ష్మి శం
ఖనినాదంబదె చక్రమల్లదె భుజంగధ్వంసియున్ వాఁడె క్ర
న్నన యేతెంచె నటంచు వేల్పులు నమోనారాయణాయేతిని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్."

107ప.7స్కం.

ఇదియెల్ల పోతన స్వీయకవిత. ఇందు పోతన భక్తి, రక్తి అంతర్లీనముగ కలదు. సన్నివేశకల్పనాచాతుర్యము సహృదయహృదయంగమము. ఇందుకు మార్గదర్శనము భైరవుని శ్రీరంగమాహాత్మ్యమునందు కలదు. (4ప.3ఆ.)

గంగావతరణమును విపులీకరణము. రెండు శ్లోకములకు (10,11శ్లో9అ.9స్కం.) రెండున్నరపుటల సుదీర్ఘవచనము. (230వచ.9స్కం.) గంగాప్రవాహవర్ణనమది గంగాప్రవాహవల్గనము వలెనే కలదు. అందు,

"క్రేపు వెంబడి నుఱక క్రేళ్లుఱుకు మఱకప్రాయంపుఁ గామధేనువు చందంబున, ముందటికి నిగుడుచు ముద్దుఁ జందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పు దప్పక

సాంగి చనుదెంచు సుధార్ణవంబు తైవడి ... మహేశ్వరు వదనగహ్వరంబు వలన నోంకారంబు పిఱుంద వెలువడిన శబ్దబ్రహ్మంబు భంగి .... బహుదీర్ఘబిందువిసర్గంబై సర్గ బంధకావ్యంబు విన్ననువున -"

అను పోతన సాదృశ్యకల్పనములు అపూర్వములు.

శ్రీకృష్ణచరితము దశమస్కంధము. దశమస్కంధమే శ్రీమహాభాగవతమునకు హృదయము. అందు పెక్కు ఘట్టములు కలవు. ప్రతిఘట్టము పోతన ఆంధ్రీ కరణమున విపులీకరణమే. గోపికావిరహము, గోపికాగీతలు మహావిపులీకరణము. నలుబదియాఱు శ్లోకములకు డెబ్బది నాలుగు పద్యగద్యములు. సంఖ్యాబలము కంటె గ్రంథపరిమాణము మిన్న. అందు ముఖ్యములైన కొన్ని పద్యములు :

"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార మీ పొదల మాటున లేఁడు గదమ్మ చెప్పరే. 1010.

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁ దూపులకు నగ్గము సేసి లవంగలుంగనా
రంగములార మీ కడకు రాఁడుగదా కృప నున్నఁ జూపరే. 1011.

అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ
బాటలీతరులార పట్టరమ్మ
హేలావతులఁ గృష్ణ యేల పాసితివని
యైలేయలతలార యడుగరమ్మ
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగడు గదా
చూతమంజరులార చూడరమ్మ
మానినీమదనుతో మారాక యెఱిఁగించి
మాధవీలతలార మనుపరమ్మ
జాతిసతులఁ బాయ నీతియే హరికని
జాతులార దిశలఁ జాటరమ్మ
కదళులార పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ. 1013.

ఈ చరణంబులే యిందునిభానన
సనకాదిమునియోగసరణి నొప్పె
నీ పాదతలముచే నెలనాఁగ శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్ను మిగులు
నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటి రాచూలి పట్టుఁగొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ
ముక్తికాంతామనోమోహనంబు
లీ యడుగుల రజమె యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళి దిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేఁగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి." 1030

"నీ వడవిం బగల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్యమి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై"
105. ప.10స్కం.పూ.భా.

ఇట్లు శ్లోకప్రపంచీకరణము, సన్నివేశవిపులీకరణము పోతన ఆంధ్రీకరణవిధానము.

## కవితారీతులు

"కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్." 20ప.1ఆ.

అని పోతన ఆశయము. కొందఱికి గుణమగు తెనుగు అచ్చ తెనుగు కాదు. తేటతెనుగు. కొందఱికి గుణమగు సంస్కృతము కేవలసంస్కృతము కాదు. సంస్కృతభూయిష్ఠరచన. కొందఱికి గుణములగు రెండును విడివిడిగ తేటతెనుగు సంస్కృతభూయిష్ఠరచన కావచ్చును. తేటతెనుగు, సంస్కృతభూయిష్ఠరచనల కలగలుపు కూడ కావచ్చును. అందఱిని మెప్పించుటకు ఆ యా స్థలములందు తేటతెనుగు, సంస్కృతభూయిష్ఠరచన, తేటతెనుగు, సంస్కృత భూయిష్ఠరచనల కలగలుపును ఆవశ్యకము. ఈ మూడును పోతన తెలిపిన కవితారీతులు.

**తేటతెనుగు** : వ్యవహారప్రసిద్ధమైన కతిపయసంస్కృతశబ్దములు కలిసినను, సంస్కృతసమేతరమైన ఆచ్ఛికశబ్దముల ఆధిక్యము కలది, అర్థమగునది తేట తెనుగు.

"కొడుకులఁ బట్టి చంపెనని కోపము నొందదు బాలఘాతుకున్
విడువు మటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే
విడువఁగనేల చంపుఁ డిటు వీనిని మీరలు సంపరేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్."
168ప.1సం.

అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు సీర లిచ్చుటో
మన్నన సేయుటో మధురమంజులభాషల నాదరించుటో
మిన్నుల ప్రోఁ తలే నిజము మేలని చంపకుమన్న మాని రా
వన్న సహింపుమన్న తగదన్న విధింపకుమన్న వేఁ డెదన్."
26ప.10స్కం. పూ.భా.

**2. సంస్కృతభూయిష్ఠరచన**: సంస్కృతశబ్దసంధానము మాత్రముగాక సమాసాఢ్యమైన రచన సంస్కృతభూయిష్ఠరచన. సంస్కృతశబ్దములు సమధికముగ కలది, అనల్పసమాసములు, దీర్ఘసమాసములు అధికముగ కలది సంస్కృతభూయిష్ఠరచన.

"వరవైకుంఠము సారసాకరము దివ్యస్వర్ణశాలాంకగో
పురహర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు దన్మందిరాం
తరవిభ్రాజితభోగి కర్ణిక తదుద్యద్భోగపర్యంకమం
దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు
భృంగాకృతిన్." 513ప.2స్కం.

"హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేవోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబకమగున్ హీనస్థితిన్ వింటిరే." 215ప.7స్కం.

**3. తేటతెనుగు, సంస్కృతభూయిష్ఠరచనల కలగలుపు**: కొంత తేటతెనుగు, కొంత సంస్కృతభూయిష్ఠరచన కలది తేటతెనుగు, సంస్కృతభూయిష్ఠరచనల కలగలుపు.

"పురముల్ మూఁడును నొక్కబాణమున నిర్మూలంబు గావించు శం
కరు చందంబున నేర్చె రాఘవుఁడు లంకాపట్టణం బిద్ధగో
పురశాలాంగణహర్మ్యరాజభవన ప్రోద్యత్త్రతోళీకవా
టరథాశ్వద్విపశస్త్రమందిరనిశాటశ్రేణితో ప్రేల్మిడిన్." 169ప.2స్కం.

"అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవిందయుగళార్చననిర్దళితాఖిలాఘు నీ
శ్వరకరుణావలోకనసుజాతసమగ్రమనోరథున్ సుతుం
గర మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁడై."
307ప.4స్కం.

4. **అంత్యానుప్రాసము** : ఇది శబ్దాలంకారము. భాస్కరరామాయణమునందు మొలకెత్తి, ఎఱ్ఱన నృసింహపురాణమునందు తలయెత్తి నాచనసోమనాథుని ఉత్తర హరివంశమునందు ఆకుదొడిగి, మడికి సింగన పద్మపురాణమునందు మాఱాకువైచి, జక్కన విక్రమార్కచరిత్రమునందు కొనసాగి, భైరవుని శ్రీరంగ మహత్త్వమునందు చిగురుపట్టి, పోతనభాగవతమునందు పూతపట్టినది.

"భూషణములు వాణికి, నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్" 46ప.1స్కం.

"పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్."
116ప.8స్కం.

"రాముఁడు గనుఁగొనె భార్గవ
రామున్ రజనీశకులధరావరనగసు
త్రామున్ సన్నుతగుణ
స్తోమున్ గారుణ్యసీము సుజనలలామున్." 949ప.10స్కం.

5. **వ్యంగ్యవైభవము** : అభిధాశక్తి బోధించు అర్థము వాచ్యార్థము. వ్యంజనాశక్తి బోధించు అర్థము వ్యంగ్యార్థము. అభిధాశక్తి ప్రాకరణికార్థమును బోధించును. వ్యంజనాశక్తి ప్రాకరణికార్థమును, అప్రాకరణికార్థమును

బోధించును. అన్యార్థమే వ్యంగ్యార్థము. ధ్వన్యర్థము. "వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది" అనిన బలిచక్రవర్తి ప్రశ్నలకు వామను డిచ్చిన సమాధానములివి:

"ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
నొకచోటనక నెందు నుండనేర్తు
నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు
నాయంతవాఁడనై నడవనేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నది నేర్తు నిది నేర్తునని యేల చెప్పఁగ
నేరుపు లన్నియు నేన నేర్తు
నొరులు గారు నాకు నొరులకు నేనౌదు
నొంటివాఁడఁ జుట్టు మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నాటెంకి
సుజనులందుఁ దఱచు సొచ్చియుండు." 553ప.8స్కం.

ఒక నివాసస్థలము లేదు. ఎక్కడైన ఉండగలను. నేను ఒకరివాడను కాను. నాయంతవాడను నేను. ఒక నడవడి కాదు. మూడు పోకలు. (సత్త్వరజస్తమోగుణప్రవర్తనములు) ఇది, అది కాదు అన్నియు నేర్తును. ఎవ్వరును నాకు ఇతరులు కారు. అందఱికిని నేను కావలసినవాడను. ఒంటరివాడను. ఒక్క బంధువు లేడు. ఒకప్పుడు సంపద కలవాడను. సుజనులందు చొచ్చియుండుట నా ఉనికి. అని ప్రాకరణికార్థము. వాచ్యార్థము. సర్వాంతర్యామిని, సర్వతంత్ర స్వతంత్రుడను, సృష్టిస్థితిలయకారుడను, సర్వజ్ఞుడను, సర్వముఖ్యుడను, ఏకశబ్దవాచ్యుడను, స్వయంభువుడను, శ్రీపతిని, సుజనహృదయము నా స్థానము అని అప్రాకరణికార్థము. వ్యంగ్యార్థము. దీనికి మార్గదర్శనము భైరవుని శ్రీరంగమహత్త్వమునందు కలదు. (14ప.3ఆ.)

"ఒంటివాఁడ నాకు నొకటి రెం డడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల
గోర్కి దీర బ్రహ్మ కూఁకటి ముట్టెద
దానకుతుకసాంద్ర దానవేంద్ర" 566ప.8స్కం.

బలిచక్రవర్తి "అసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీ నేర్పునే" అనగా వామనుడు ఇచ్చిన సమాధానమిది:

"గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూము లెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మమెక్కడ మదాకాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్."

572ప.8స్కం.

వామనుడు అడిగిన విధానములోని "బ్రహ్మకూకటి ముట్టు"ట అపరిమితానందమును పొందుట అని వాచ్యార్థము. అపరిమితోన్నతస్థానమును తాకుట అని వ్యంగ్యార్థము. ఇచ్చిన సమాధానములోని మదాకాంక్షామితము"పరిమితమని వాచ్యార్థము. అపరిమితమని వ్యంగ్యార్థము. "అది బ్రహ్మాండంబు నా పాలికిన్" అనగా బ్రహ్మానందసదృశమని వాచ్యార్థము. బ్రహ్మాండపర్యంతమని వ్యంగ్యార్థము.

6. **కల్పనాచమత్కారము**: వాస్తవిక చిత్రణమునకు దుర్లభమైన దృశ్యసాక్షాత్కరణమునకు కల్పనాచమత్కారము కార్యసాధకము. వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించు దృశ్యమును సాక్షాత్కరింపఁజేయుట ఏ లలితకళకును సాధ్యము కాదు. కవితాకళకు మాత్రమే కల్పనాచమత్కారమున సాధ్యమైనది. అందుకు పోతన రచించిన రెండు పద్యములందును కల్పనాచమత్కారములు పరస్పరము ప్రతిద్వంద్విప్రాయముగ కలవు. ఆ రెండు పద్యములివి:

"ఇంతింతై వటుడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 622

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

623ప.8స్కం.

ఇందు మొదటిపద్యము నందు సత్యపదోన్నతుడగుచు బ్రహ్మాండాంతసంవర్ధి అగుట కలదు. అందుకు ఇంతింతై, ఇంతయై, మఱియుఁ దానింతై" అను తొలి నిర్దేశములు ధ్వనిగర్భితములు. ఎంత అని నిర్దేశించిన అంత అగును. "నభోవీథిపై నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై నంతై, చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై నంతై" అను మలి నిర్దేశములు సాదృశ్యగర్భిత

ములు. నభోవీథి అంత, తోయదమండలాగ్ర మంత, ప్రభారాశి అంత, చంద్రుని అంత, ధ్రువుని అంత, మహర్వాటి అంత అయ్యెనని స్పష్టము. నభోవీథి పైన మేఘమండలము, మేఘమండలము పైన కాంతిమండలము, కాంతిమండలముపైన చంద్రమండలము, చంద్రమండలముపైన ధ్రువమండలము, ధ్రువమండలముపైన మహర్లోకము, మహర్లోకముపైన సత్యలోకము క్రమము. వటుడు సత్యపదోన్న తుడగుటలోని క్రమపరిణామము, క్రమపరిమాణము కరతలామలకము. రెండవ పద్యమునందు పరిణామక్రమము, పరిమాణక్రమమును ప్రతీయమానము. వటుడు బ్రహ్మాండము నిండునెడ, సూర్యబింబము మొదట గొడుగుగా, పిదప శిరోమణిగ, పిమ్మట కర్ణభూషగ, ఆమీద కంఠాభరణముగ, తర్వాత దండకడియముగ తదుపరి హస్తకంకణముగ, తదనంతరము మొలనూలి మువ్వగ, క్రమముగ కాలిక డియముగ, చిట్టచివఱకు పదపీఠముగ ఉపమించుటకు తగునని కల్పనము. చమత్కారావహము. కావున కల్పనాచమత్కారము. రవిబింబము కొలమానముగ గొడుగు మొదలైనవి ఉపమానములుగ వామనమూర్తి బ్రహ్మాండాంతసంవర్ధమాన క్రమపరిణామ, క్రమపరిమాణదృశ్యము సాక్షాత్కారమగును.

ఇది దండి దశకుమారచరిత్రములోని శ్లోకమునకు అనువాదమని ఒక అభి ప్రాయము కలదు. శ్లోకమునందు బ్రహ్మాండమునకు ఛత్రదండము, ఇంద్ర భవనమనెడు పద్మమునకు మృణాళదండము, క్షోణీతలమునకు కూపదండము, దివిజగంగ లలాటపట్టమునకు కేతుదండము, జ్యోతిశ్చక్రమునకు అక్షదండము, త్రిభువనవిజయమునకు స్తంభదండము, అంఘ్రిదండము అయిన త్రివిక్రముడు మేలు సేయుగాతమని కలదు. ఇందు వామనమూర్తి సమస్తబ్రహ్మాండాంత సంవర్ధ మానక్రమపరిణామదృశ్యము సాక్షాత్కారము కాదు.

**7.భక్తి పారవశ్యము** : భాగవతము నారాయణభక్తియోగము. శుకయో గీంద్రుడు పరీక్షిన్మహారాజునకు బోధించిన భక్తిమార్గము పోతన భాగవతమునందు మూలాతిశాయి. "సంసారప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదులయిన మోక్షమార్గం బులు పెక్కులు గల వందు భక్తిమార్గంబు కంటె సులభంబులేదు." (34వచ.2స్కం.) అని పోతన అధికరించెను. భక్తిమార్గవివరణమునందు-

"విష్ణుకీర్తనముల విననికర్ణంబులు
గొండల బిలములు కువలయేశ
చక్రిపద్యంబులఁ జదువని జిహ్వలు
గప్పలజిహ్వలు కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీక్షింపని కన్నులు
కేకిపిచ్ఛాక్షులు కీర్తిదయిత

కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు
శవము హస్తంబులు సత్యవచన
హరిపదతులసీదళామోదరతి లేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమను భజనగతి లేని పదములు
పాదపముల పాదపటల మనఘ. 50

నారాయణుని దివ్యనామాక్షరములపైఁ
గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న
కనకకిరీటంబు గట్టి మోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి
వనదుర్గచంద్రికావైభవంబు
కైటభారిభజన గలిగియుండనివాఁడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదముఁ గనని వాని బ్రదుకు
పసిఁడికాయ లోని ప్రాణి బ్రదుకు." 51ప.2స్కం.

అను పద్యములు పోతన భక్తిపారవశ్యమునకు అచ్చపు మణిదర్పణములు. కపిలుని ప్రవచనంబునందు "నిర్గుణుండు భగవంతుండని చెప్పిన జ్ఞానయోగంబును మదీయభక్తియోగంబును నను రెండు నొక్కటియ" (105వచ.3స్కం.) అని కలదు. అంతేకాదు. భక్తి త్రివిధమని (952వచ.) చతుర్విధమని (1027వచ.3స్కం.) కలదు. తామస, రాజస, సాత్త్వికభక్తియోగములు త్రివిధము. ఆత్యంతిక భక్తియోగముతో చతుర్విధము. హింసాదంభమాత్సర్యరోషతమములు మానని భక్తి తామసభక్తి. భోగప్రాభవ, యశోవైభములను కోరు భక్తి రాజసభక్తి. "భావము నందలపోసి, కర్మలు భగవదర్పణబుద్ధిని"చేయుట సాత్త్వికభక్తి. భగవత్సేవావిరహితమైన ఇతరకర్మములను ఆచరించకపోవుట ఆత్యంతికభక్తి. (953-958 వచ.3స్కం.) ప్రహ్లాదుని ప్రబోధమునందు భక్తి నవవిధము. అవి "శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము" అని సంస్కృతభాగవతమునందు కలదు. శ్లోకము పూర్వోదాహృతము. పోతన శ్లోకానువాదమునందు ఆత్మనివేదనమునకు "ఆత్మలో నెఱుక" అని కలదు. పద్యము పూర్వోదాహృతము. స్థలాంతరమునందు ఆత్మసమర్పణమని కలదు. "శ్రీనారాయణ చరణస్మరణకీర్తనశ్రవణసేవార్చననమస్కార

దాస్యాత్మసమర్పణసఖ్యంబులు." (409వచ.7స్కం.) ఆత్మనివేదనము, ఆత్మలో నెఱుక, ఆత్మసమర్పణమును సమానమే అగును. ప్రహ్లాదుడు ప్రథమతః హిరణ్యకశిపునికి ప్రతిపాదించినది ఆత్మనివేదనమే.

"మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు
నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేర నేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల." 150ప.7స్కం.

ఇది పోతన ఆత్మనివేదనమే. తదుపరి ప్రహ్లాదుడు తండ్రికి వివరించినది నవవిధభక్తిప్రబోధము. ఆపద్యములు పూర్వోదాహృతములు. అందు అర్చనము, సంకీర్తనము, వందనము, శ్రవణము, ఆత్మనివేదనము, సఖ్యము, దాస్యము, చింతనము, సేవనము కలవు. ప్రహ్లాదుని భక్తిప్రబోధము పోతన భక్తిపారవశ్యమునకు అనర్ఘరత్నముకురము.

గజేంద్రుని మొఱ పోతన మొఱయే

"ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁ డు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁ డు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁ డువాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁ డెదన్. 73

లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకంబగు పెం
జీఁ కటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁ గు నతని నే సేవింతున్. 75

కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగిగణముల పాలన్

గలఁ డందు రన్ని దిశలను
గలఁ డు కలం డనెడు వాఁడు గలఁ డో లేఁ డో. 86

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం
బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా. 90

వినుదఁటు జీవుల మాటలు
చనుదఁటు చనరాని చోట్ల శరణార్థుల కో
యనుదఁటు పిలిచిన సర్వము
గనుదఁటు సందేహమయ్యెఁ గరుణావార్ధీ 91

ఓ కమలాప్త యో వరద యో ప్రతిపక్షవిపక్షదూర కు
య్యో కవియోగివంద్య సుగుణోత్తమ యో శరణాగతామరా
నోకహ యో మునీశ్వరమనోహర యో విమలప్రభావ రా
వే కరుణింపవే తలఁ పవే శరణార్థిని నన్నుఁ గావవే" 92ప.8స్కం.

కాలగ్రాహక్రకచదంష్ట్రాదష్టుడైన పోతన కూడ శరణార్థియే

8. **శృంగారపారతంత్ర్యము**: భక్తియోగమైన భాగవతమునందు ప్రాణిసహజమైన రక్తిలౌల్యమునకు అవకాశము చాల తక్కువ. అవకాశ మున్నంతలో శృంగారరసపోషణమున పోతన ఇతరకవులకు తీసిపోలేదు. సంధ్యాలలన వర్ణనమిది:

"నవ్యకాంచనరణన్మణినూపురారావ
విలసితపాదారవిందయుగళ
కాంచీకలాపసంకలితదుకూలవ
స్త్రస్ఫారపులిననితంబబింబ
రాజితాన్యోన్యకర్కశపీనకరికుంభ
పృథుకుచభారకంపితవలగ్న
మదిరారసాస్వాదమదవిఘూర్ణితచారు
సితనవవికచరాజీవనయన
యపరపక్షాష్టమీశశాంకాభనిటల
మదవదలికులరుచిరోపమానచికుర
లలితచంపకకుసుమవిలాసనాస

హాసలీలావలోకన యబ్జపాణి." 726ప.3స్కం.

ఆమె దనుజులను మోహపరవశులను జేసిన విధానమిది:

"గురుకుచభారసంకుచితావలగ్నంబు
దనరారు నాకాశతలముగాఁ గ
లలితపల్లవపాణితలమునఁ జెన్నొందు
చెండు పతత్పతంగుండు గాఁ గ
సలలితనీలపేశలపృథుధమ్మిల్ల
బంధంబు ఘనతమఃపటలి గాఁ గ
ప్రవిమలతరకాంతభావవిలోకన
జాలంబు తారకాసమితి గాఁ గఁ
గడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁ గ
నంగనాకృతి నొప్పు ప్రసంధ్యావధూటిఁ
గదిసి మనముల మోహంబు గడలు కొనఁ గ
నసురులందఱుఁ గూడి యిట్లనిరి మఱియు. 734ప.3స్కం.

మూలము నిమిత్తమాత్రమైన జగన్మోహినీవర్ణనమిది:

"మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు
లరఁటికంబముల దోయైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడు లేఁత నడుమును
బల్లవారుణకాంతిపాణియుగముఁ
గడుదొడ్డ పాలిండ్లుఁ గంబుకంఠంబును
బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁ గవయును నలికుంతలంబులు
బాలేందుసన్నిభఫాలతలము
నమరఁ గుండల కేయూరహారకంక
ణాదు లేపార మంజీరనాద మొప్ప
నల్లనవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర
పతుల నడఁగింప నాఁడు రూపంబు దాల్చె." 801ప.8స్కం.

జగన్మోహిని సవ్రీడస్మితవిక్షిప్తభ్రూవిలాసావలోకములచేత రాక్షసుల హృదయములందు కామమును ఉద్దీపింపఁ జేసినదను శ్లోకమునకు ప్రపంచీకరణ:

"పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు
జాఱించి మెల్లన చక్కనొత్తుఁ
దళ్కుదళ్కను గండఫలకంబు లోలయించు
నొలయించి కెంగేల నుజగించుఁ

గడు మెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు
నల్లార్చి ఱెప్పల నండగొలుపు
సవరని దరహాసచంద్రికఁ జిలికించుఁ
జిలికించి కెమ్మోవిఁ జిక్కువఱచు
దళితధమ్మిల్ల కుసుమగంధమ్ము నెఱపుఁ
గంకణాదిఝణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకఁ బాఱు
సన్న వలిపంపుఁ బయ్యెద సౌకళించి." 363ప.8స్కం.

జగన్మోహిని శివుని మోహింపఁ జేసిన ప్రకారమిది :

"ఒక యెలదోఁటలో నొకవీథి నొకనీడఁ
గుచకుంభముల మీఁది కొంగు దలఁగఁ
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ
జికురజాలంబులు సిక్కువడఁగ
ననుమానమై మధ్య మల్లాడఁ జెక్కులఁ
గర్ణకుండలకాంతి గంతులిడఁగ
నారోహభరమున నడుగులు దడఁబడ
దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప
వామకరమునఁ బట్టిన వలువఁ బట్టి
కనకనూపురయుగళంబు గల్లనంగఁ
గంకణంబుల ఝుణఝుణత్కార మెసఁగ
బంతిచే నాడు ప్రాయంపుటింతిఁ గనియె" 394ప.8స్కం.

ఇంకను జగన్మోహిని విభ్రమవిలాసములు ఒక సుదీర్ఘవచనమునందు కలవు. (396వచ.8స్కం.) జగన్మోహినీ శంభువుల సంభోగశృంగారవర్ణనమిది:

"ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
డబలా పోకుము పోకుమీ యనుచు డాయంబాఱి కెంగేలఁ ద
త్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిల్ల నోలార్చె నం
త బహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్తయై. 402

వీడి వెన్నున నాడు వేణీభరంబుతో
జఘనభారాగతశ్రాంతితోడ
మాయావధూటియై మరలి చూచుచుఁ బాఱు
విష్ణు నద్భుతకర్ము వెంటఁ దగిలి
యీశాను మరల జయించె మరుం డనఁ

గరిణి వెన్కను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు
దాఁటి శంభుఁడు సనఁ దన్మహాత్ము
నిర్మలా మోఘవీర్యంబు నేలమీఁదఁ
బడిన చోటెల్ల వెండియుఁ బైఁడి యయ్యె
ధరణి వీర్యంబు వడఁ దన్నుఁ దా నెఱింగి
దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు." 403ప.8స్కం.

ఇటు పోతన ఇచ్చిన తీర్పు :

"కాము గెలువ వచ్చుఁ గాలారి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాఁడు వారి చూపుటుంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన." 405ప.8స్కం.

ఇంకను గీష్మర్తువర్ణనమునందు "మిథునకోటికి రతి మెండు దోఁచె"నని (716ప.10స్కం.పూ.భా.) వర్షర్తువర్ణనమునందు "జలదసమయవిటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువు నం బుడమిం బడు కరకలును" అని (756వచ.10స్కం.పూ.భా.) "మెఱుంగుల తెఱం గున మగువలు పురుషులం దగిలి నిలువరని జనుల కెఱుంగ నలువ మొఱ యిడిన తెఱంగున ఘోరయు నుఱుములును" అని (అదే) "వనచరానందకారిణులయి వారర మణుల రుచి ననవరతభుజగసమేతలగు కేతకులును" అని (అదే.) పోతన భావ నలు, శరదృతువర్ణనమునందు

"చేగ గల చెఱకు వింటను
బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగము సేసి మదనుఁడు
వేగంబున విరహిజనుల వేటాడెఁ దగన్" 767ప.10స్కం.పూ.భా.)

అని పోతన అభిప్రాయము. హేమంతర్తువర్ణనమునందు,

"అన్నుల చన్నుల దండ వి
పన్నులు గా కెల్లవారు బ్రదికిరి గా కీ
చన్నులు మీఱిన వలి నా
పన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్." 801ప.10సూ.పూ.భా.

అని పోతన ఆశ్చర్యము! ఉషావిరహము శృంగారవిషయము.

(331ప.10స్కం.ఉ.భా.)అవబృథస్నానము చేసిన ధర్మరాజు అనుయాయులలో వారాంగనలు పోతన అనుగ్రహమే. ఆ వేశ్యావర్ణనమునందు (803ప.804వచ.10 స్కం.ఉ.భా.) నగ్నప్రదర్శనమును కలదు. పోతన వేశ్యావర్ణనము దేవదాసీవర్ణనము కాదు. ఏకశిలానగరములోని ఘంటాపథమున సాగిన సానిమేళము వర్ణనము.

ఇవి యెల్ల పోతన శృంగారపారతంత్ర్యమునకు శృంగగ్రాహికలు.

9. **కర్షక కవిత్వము**: కృషీవలజీవనమును చిత్రించునది కర్షకకవిత్వము. "పేస్టరల్ పోయిట్రీ" భారతదేశము ప్రాధాన్యవివక్షను కృషీవలదేశమైనను, దేశవాఙ్మయములందు కర్షకకవిత్వము అస్తినాస్తివిచికిత్సాసహము. అది కాసంత హరివంశమునందు, భాగవతమునందు భాసించినది. సంస్కృతభాగవతమునందు రేఖాచిత్రము. పోతన భాగవతమునందు పంచవర్ణచిత్రము. గోపడింభకులు "ప్రొద్దున లేచి గ్రద్దనం దమయింటి లేఁగ గదుపులం గదిలించి .... చలిది కావడులు మూపుల వహించి" బయలుదేరినది మొదలు, కాంతారములోని కాసారతీరమునందు బంతిచలుదులు భక్షించువఱకు పోతన అనేకవిశేషములను అక్షరబద్ధము చేసెను. (456వచ.-459ప; 492-498ప. 10స్కం. పూ.భా.) అది ఆంధ్రభాషాకర్షకకవిత్వమేకాదు; ఆంధ్రదేశకర్షకకవిత్వము కూడ. అందు

"ఒక్కఁడు మున్నెమఱి చన
నొక్కఁడు బలుబొబ్బవెట్టు నులికిపడన్ వే
ఱొక్కఁడు మిట్టితటాలున
నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్."

457ప.10స్కం.పూ.భి.

ఇప్పటికిని బహుశః ఎప్పటికిని పచ్చికబీడులందు ప్రత్యక్షమగు దృశ్యము.

"మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి
చూడు లేదని నోరు సూపు నొక్కఁ
డేగు రార్గుర చల్దు లెలమిఁ బన్నిద మాడి
కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్నియుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు లాడు నొకఁడు
కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమోల

మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకడు మురియు నొకఁడు." 496ప. 10స్కం. పూ. భా.

ఇందలి నవ్వులు సంస్కృతములోనివేగాని, ఊరించు నూరుఁగాయలు, మ్రింగి లేదని నోరు చూపుటలు, పన్నిదమాడి కూర్కొని తినుటలు, బంతెనగుండులు మనవే.

"కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
లాలితవంశనాళంబుఁ జొనిపి
విమలశృంగంబును వేత్రదండంబును
జాఱి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు
వ్రేళ్లసందులయందు వెలయ నిఱికి
సంగడీల నడుమఁ జక్కఁగ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె." 498ప. 10స్కం. పూ. భా.

ఇందలి "దిండుగాఁ గట్టిన వలువ" విలువ తగ్గినను, "మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది" వెల్ది అయినను, "కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్లసందులయందు వెలయు"నవియే. అందును ఊరుగాయ ఆంధ్రుల అమృతధార.

## శైలి

"కవితారీతుల"లోని తేటతెనుగు, సంస్కృతభూయిష్ఠరచన, తదుభయసమ్మిశ్రరచన, అంత్యానుప్రాసము పోతన శైలీవిశేషములు.

## ఆత్మీయత

"చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁ డేని
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు" 14ప. 1స్కం.

అను పోతన పద్యమును బట్టి పోతన శివపూజాపరాయణుడని, హరిభక్తిపారాయణుడని, దయామయుడని, సత్యవ్రతుడని స్పష్టమగును.

దక్షాధ్వరధ్వంసఘట్టమునందు దక్షిణామూర్తియైన శివుని వర్ణనము (138,140 ప.4స్కం.) బ్రహ్మ చేసిన శివస్తుతి (145-147, 149ప.4స్కం.) హాలాహలభక్షణకథలోని బ్రహ్మాదుల శివస్తుతి (222-231ప.8స్కం.) పోతన శివపూజాపరాయణతకు చిహ్న పతాకలు. "కవితారీతుల"లోని "భక్తిపారవశ్యము" పోతన హరిభక్తిపారాయణతకు రత్నదీపికలు. "ఆంధ్రభాగవతావతరణము. చారిత్రికనైపథ్యము"లోని ఏకదైవభావము లోకమాన్యము.

పోతన హృదయము దయామయము. ధ్యేయము సత్యవ్రతము. ఇవి స్వీయ చరిత్ర వలన గాని, జీవితచరిత్రవలన గాని తెలియునవి. కటుకథలు తప్ప పోతన యథార్థమైన చరిత్ర అందని ఫలము. అయినను పోతన దయామయహృదయము సత్యవ్రతము శంకనీయములు కావు. సత్యవచనములే.

# ఇతరకవులు

**మడికి సింగన:** ఈతని కృతులు పద్మపురాణోత్తరఖండము, భాగవతదశమ స్కంధము, సకలనీతిసమ్మతము, జ్ఞానవాసిష్ఠరామాయణమును.

## కాలము

మడికి సింగన కాలము నిర్ణయించుటకు మూడు విధములైన సాధనములు కలవు. 1. కృతికర్తృ, కృతిభర్తృవంశవృక్షములు. 2. గ్రంథాంతపద్యములు. 3. చరిత్రాంశములు. ఉత్తరోత్తరము బలీయము. వంశవృక్షసాధనమున తరముల పరిగణనము సావకాశము. కాన నిర్ధారకసాధనము కాదు. గ్రంథాంతపద్యసాధనమున కాలదోషము లేనిచో, అది నిర్ధారకసాధనమే. పద్మపురాణము గ్రంథాంతపద్యమునందు "ఆకరయుగానలమృగాంకశకవత్సరములై పరగు శార్వరిని మార్గశిరపంచమిని బొల్చు నుడుపాలసుతవాసరమునందు" రచించినట్లు కలదు[221]. అది 1420 వ సంవత్సరము. ఆ సంవత్సరము శార్వరమార్గశిరపంచమీతిథి బుధవారము కాదు. కాలదోషము కలదు. నిర్ధారకసాధనము కాదు. జ్ఞానవాసిష్ఠరామాయణము గ్రంథాంతపద్యమునందు "శ్రీకరశకాంకములు సింధురవరామయుతశీతకరమై పరిధావిన్ ... వసంతయుతఫాల్గునమునందు సితపంచదశికావ్యతిథి" యందు రచించినట్లు కలదు[222]. అది 1-3-1433 వ తేదీ. కాలదోషము లేదు. ఇది నిర్ధారకసాధనమే. కాంబట్టి జ్ఞానవాసిష్ఠరామాయణము రచనాకాలము 1433 వ సంవత్సరము.

మడికిసింగన తండ్రి అయ్యలుమంత్రి "వేంగిదేశంబులో నేపారు రాజమహేంద్రపురికి నధిపతి తొయ్యేటి యనపోతభూపాలుని మంత్రి" అని జ్ఞానవాసిష్ఠరామాయణమునందు కలదు. (33ప.1ఆ.) ఇది చరిత్రాంశము. తొయ్యేటి అనపోతభూపాలుడన ముసునూరి అనపోతనాయకుడు. కాపయనాయకుని జ్ఞాతిసోదరుడు. అతడు మొదట తొయ్యేరు రాజధానిగ పరిపాలించుటవలన తొయ్యేటి యనపోత భూపాలుడయ్యెను. 1345 వ సంవత్సరము నాటి కాపయనాయకుని ప్రోలవరముశాసనమునందు అనపోతనాయకుడు తొయ్యేరు రాజధానిగ పరిపాలించుచున్నట్లు కలదు[223]. అతడు "రాజమహేంద్రపురికి నధిపతి " అగు కాలము 1345తర్వాత

అగును. కాపయనాయకుని అనంతరము కావచ్చును. ఆకాలము 1369 వ సంవత్సరము. 1374 వ సంవత్సరమునందు అనవేమారెడ్డి రాజమహేంద్రవరమును జయించువఱకు తొయ్యేటి అనపోతభూపాలుని రాజమహేంద్రపురాధిపత్యము నిరాఘాటము. తొయ్యేటి అనపోతభూపాలుడు "రాజమహేంద్రపురికి నధిపతి" అగు కాలము 1369-1375. అప్పుడు మంత్రియైన అయ్యలుమంత్రి తనయుడు మడికి సింగన కాలము తదనంతరమగుట తథ్యము.

మడికి సింగన పద్మపురాణమునకు, భాగవతదశమస్కంధమునకు కృతిభర్త కందనామాత్యుడు. అతడు రామగిరిపట్టణాధీశ్వరుడైన ముప్పభూపతి మంత్రి. ముప్పభూపతి ప్రతాపరుద్రుని సేనానియైన ముప్పిడినాయకుడు కాడు[224]. అతడు సింహవిక్రమపట్టణాధీశ్వరుడు. ఇతడు రామగిరిపట్టణాధీశ్వరుడు. అతడు ముప్పిడి. ఇతడు ముప్ప. పద్మపురాణములోని ముప్పభూపతి బిరుదావళి[225], కాపయనాయకుని పిల్లలమఱ్ఱి శాసనములోని కాపయనాయకుని బిరుదావళి[226]. అది ముప్పభూపతికి పరంపరాగతమగును. చళుక్యచొక్కనృపాలుడు, తెలుగు రాయలు, ముప్పభూపతి క్రమముగ రామగిరిపట్టణాధీశ్వరులగు కాలము 1368 తర్వాత మాత్రమే అవకాశమని పూర్వోక్తము[227]. ముప్పభూపతి రామగిరిపట్టణాధీశ్వరుడగు కాలము పదునైదవశతాబ్ది పూర్వార్థమగును.

జ్ఞానవాసిష్ఠరామాయణమునందు "పద్మపురాణోత్తరఖండంబును భాగవతదశమస్కంధంబును ... రచియించినట్లు" కలదు. (10వచ.1ఆ.) ఈ రెండును నరాంకితములు. సకలనీతిసమ్మతము, జ్ఞానవాసిష్ఠరామాయణము దైవాంకితములు. కావున పద్మపురాణోత్తరఖండము, భాగవతదశమస్కంధము, సకలనీతిసమ్మతము, జ్ఞానవాసిష్ఠరామాయణము పౌర్వాపర్యము కావచ్చును. జ్ఞానవాసిష్ఠరామాయణము రచనాకాలము 1433 వ సంవత్సరము కావున సకలనీతిసమ్మతము రచనాకాలము 1430వ సంవత్సరము, భాగవతదశమస్కంధము రచనాకాలము 1420వ సంవత్సరము కావచ్చును. పద్మపురాణగ్రంథాంతపద్యములోని "మార్గశిర పంచమి" కి "మాఘసితపంచమి" అను కతిపయాక్షరపరిష్కారము[228] నిరాకరణీయము కాదు. అది 8.1.1421వ తేదీ.

## పద్మపురాణోత్తరఖండము

పద్మపురాణము పదునెనిమిది పురాణములందును ఒకటి. అది సంగ్రహముగ మొదట తెనిగించిన కవి ఎవరోగాని, కృతిభర్త శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు. అతడు "పద్మపురాణ సంగ్రహకళాకావ్యప్రబంధాధిపు" డని

భీమేశ్వరపురాణమునందు కలదు. కావ్యప్రబంధాధిపుడన కృతికర్త కాడు. కృతి భర్త. కమలనాభామాత్యునికి అంకితమైన పద్మపురాణసంగ్రహము అనుపలబ్ధము. సముపలబ్ధమైనది మడికి సింగన పద్మపురాణోత్తరఖండము. కందనామాత్యునికి అంకితము.

"సత్యనిరతుఁడైన సాత్యవతేయుండు
చెప్పినర్థమెల్లఁ దప్పకుండఁ
దెలుఁగు సేయరాదు నలువకైనను భక్తి
కారణంబుగాఁ గఁ గథ రచింతు" 64ప.1ఆ.

కథ రచింతుననియే కవివచనము. పద్మపురాణోత్తరఖండము కథాప్రధానమే. ఏకకథ కాదు. అనేక కథలు. అవి ద్వివిధము. 1. వ్రతకథలు 2. దశావతారకథలు. వ్రతకథలు రసవత్కథలు కావు. మాఘస్నానమాహాత్మ్యమును ప్రతిపాదించునవి. అవతారకథలును అంతంతమాత్రమే. పురాణమును కావ్యమును చేయు పూనిక మడికి సింగనకు లేదు. కవితాస్పర్శ క్వాచిత్కము. అది కూడ వర్ణనలందు అధికము. సూర్యోదయవర్ణన:

"కమలినీముఖపద్మకాంతి నివాళింప
నేపార నెత్తిన దీప మనఁగఁ
బూర్వపర్వతశిరోభూషావిశేషమై
చెలువారు గైరికశిల యనంగ
ప్రాచీదిశావధూఫాలదేశంబున
లలి నొప్పు సింధూరతిలక మనఁగ
జంభారివారణకుంభమధ్యంబున
భాసిల్లు చెంగల్వబంతి యనఁగ
మెఱసి చీకటి విరియించి మిన్ను ముట్టి
చక్రవాకాళితాపము సంహరించి
యళుల మేల్కొల్పి కొలఁకులఁ దెలుపు లొసఁగి
తరణి యుదయాద్రిఁ బొడతెంచెఁ దత్క్షణంబ" 117ప.1ఆ.

పురూరవశ్చరితమునందు ఊర్వశి వర్ణన:

"ఘననీలమణికాంతిఁ గనుపట్టు కొప్పుపై
మందారపుష్పదామములు వెలుఁగ
నిభకుంభయుగమున కెనవచ్చుఁ జనుదోయిఁ
బూననేరక లేఁత కౌను నులియఁ

గందర్పునందంబు గతిఁ బొల్చు మోమున
మహితచందనలలామము దనర్పఁ
గమ్మతావుల గతి పజ్కి గడలుకొనఁ గ
శంబరాంతకు మోహనశక్తి వోలె
నలరు నూర్వశి నా నొక్క యమరకాంత
తివుట నేతెంచె నపు ర్వురూరవుని కడకు." 160ప.1ఆ.

భాస్కరరామాయణము తర్వాత అంత్యానుప్రాసము అతిశయించి, పోతనకు మార్గదర్శకమైన గ్రంథము మడికి సింగన పద్మపురాణమే.

"కనియె శ్రుతిస్మృతిప్రకరగాఢతరార్థవరిష్ఠ దివ్యబో
ధనపదవీమహత్త్వసముదగ్రగరిష్ఠఁ దపోవిశేషసం
జనితనితాంతపుణ్యగణసంచయసువ్రతనిష్ఠ శేముషీ
జనితహితప్రభావమునిసంఘవరిష్ఠ వసిష్ఠ నయ్యెడన్" 128ప.1ఆ.
"చనిచని కాంచె నంత మునిసత్తముఁ డున్నతశృంగజాలమున్
జనిమరణాదిదూరగణశంకరధారణనిత్యశీలమున్
వినుతయశోవిశాలమును విశ్రుతదివ్యమహీజజాలమున్
వనజభవాదిమునివర్ణితహేలము రౌప్యశైలమున్." 137ప.1ఆ.

ఇది అల్లసానిపెద్దనకు ఇంచుక ఆదర్శము.

భృగుమహర్షివృత్తాంతము, పురూరవశ్చరిత్రము, సుందోపసుందోపాఖ్యానము, హేమకుండలచరితము, శ్రీకుండవికుండలచరితము మాఘస్నానమాహాత్మ్యమును ప్రతిపాదించు కథలు. మూసకట్టు కథలే. దశావతారస్తవము శ్రీనాథుని శృంగారనైషధమునందు కలదు. (120-142ప.8ఆ.) దశావతారకథలు మడికి సింగన పద్మపురాణోత్తరఖండమునందు కలవు. పద్మపురాణోత్తరఖండము కావ్యకళాఖండము కాదు; పురాణకథాఖండమే.

## భాగవతదశమస్కంధము

ఇది ద్విపదకావ్యము. అంతేకాదు. భాగవతములోని ఒక స్కంధము. దశమస్కంధము మాత్రమే. ద్విపదకావ్యరచనము, అందు కాండవిభాగము రంగనాథరామాయణప్రభావమగును. మడికి సింగన భాగవతదశమస్కంధము (1425) పోతన భాగవతమునకు (1480) పూర్వగ్రంథము. ఒక స్కంధమునైన ప్రథమమున భాగవతరచన చేసిన ఘనత మడికి సింగనదే. అంతేకాదు. మడికి సింగన దశమస్కంధము పోతన మననము చేసినదే. కాని పోతన దివ్యదీధితి ముందు

మడికి సింగన దివ్వెవెలుగు వెలవెలఁబోయినది. దశమస్కంధము పూర్తిగ లభింపలేదు. ఆద్యంతకాండములు లేవు. మధురకాండము, కల్యాణకాండము, జగదభిరక్షకాండము అను మూడు కాండములు మాత్రమే కలవు. మధురకాండము మొదట గ్రంథపాతమును కలదు. అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించుట మొదలు జరాసంధుడు ప్రహర్షణగిరిని దహించుట వఱకు మధురకాండము. రుక్మిణీకల్యాణము మొదలు ఉషాకల్యాణము వఱకును కల్యాణకాండము. నృగమహారాజు చరితము మొదలు శిశుపాలవధ వఱకు జగదభిరక్షకాండము.

మధురకాండమునందు శ్రీకృష్ణుడు తల్లిదండ్రులతో,

"తనయుండు జనియించి తల్లిదండ్రులకు
ననుపమంబగు భక్తి నరయకుండినను
దనయుండె? ఆతఁడు తల్లి యౌవనము
గొనకొని తెగఁ జూచు గొడ్డలి గాక" 270,271ద్వి.

అను భావప్రకటనము శక్తిమంతము. కల్యాణకాండమునందు రుక్మిణీవర్ణనమున

"కామునికై పుత్త్రకామేష్టి వెల్వ
హోమగుండము భంగి నొప్పారు నాభి" 104ద్వి.

అను సంభావనము ఉక్తివైచిత్రీవిలసితము. జగదభిరక్షకాండమునందు,

"మగువల గండూషమధుకేళిఁ దేలి
పొగడ లామనివేళఁ బొగడొందెఁ బూచె" 68ద్వి.

మొదలైన దోహదప్రక్రియలతోడి సుదీర్ఘమైన వసంతర్తువర్ణనము (54-81ద్వి.) వైభవోపేతము. మడికి సింగన వర్ణనలు అర్వాచీనకవులకు ఆదర్శప్రాయములైనవి. భాగవతదశమస్కంధము ద్విపదచ్ఛందస్సునందు దిద్దితీర్చిన కావ్యము.

## సకలనీతిసమ్మతము

ఇది సంకలనగ్రంథము. తొలి తెలుగు సంకలనగ్రంథము. కాని రసవత్తర పద్యముల సంకలనము కాదు. రాజనీతిపద్యముల సంకలనము. రాజనీతిశాస్త్రగ్రంథముల నుండి మాత్రమే గాక, కావ్యగ్రంథముల నుండి కూడ సంకలనము చేసినది. భారతము, పంచతంత్రి, కుమారసంభవము (?), పద్మపురాణము, కేయూరబాహుచరిత్రము, రామాయణము, శ్రీగిరిశతకము, కావ్యకోటిలోనివి. కామందకము,

పురుషార్థసారము, బద్దెననీతి, మార్కండేయము, చారుచర్య, మిత్రనీతులు శాస్త్ర రాశిలోనివి. చాటువులు, అజ్ఞాతములు, "మదీయము" లును కలవు. ఆకరములు లేని పద్యములును కలవు. సకలనీతిసమ్మతమునకు తాళపత్రగ్రంథము లేదు. ఒకటే కాగితపు ప్రతి లభించినది[229]. అది కూడ అదృశ్యమైనది. దానికి ప్రత్యంతరమైన కాగితపుప్రతి కలదు[230]. అది కూడ నవీనప్రతి.

## జ్ఞానవాసిష్ఠరామాయణము

ఇది వేదాంతగ్రంథము. గురుకులమునుండి సాకేతపురికి వచ్చిన శ్రీరాముడు చిఱుప్రాయమునందు పదియాఱవయేట సంసారభీతిని వంత నొంద, విశ్వామిత్రుని ఆదేశమున వసిష్ఠుడు ఉపదేశము చేసిన వేదాంతము విషయము. ఇందు పెక్కు ఉపాఖ్యానములు కలవు. అందు లవణోపాఖ్యానము లవణరాజు కల అను ఒక ఆధునికగేయమునకు ఆధారము- కాని గేయము అన్యథాకల్పనము. "మనోవిలాస మాత్రంబు బంధంబును, మనశ్శమనంబు మోక్షంబు నగుఁ దద్విలాసంబున గోష్పదంబు యోజనశతం బగు; క్షణకాలంబు బ్రహ్మకల్పం బగు"నని(217వచ.2ఆ.) అందుకు నిదర్శనముగ వసిష్ఠుడు చెప్పినది లవణోపాఖ్యానము. దానికి "అనంతరూపంబగు పరమాత్మమాయ మనోరూపంబు దాల్చి జగత్తుల భ్రమలం బెట్టుచుండు" నని పర్యవసానము. (239వచ.2ఆ.) లవణోపాఖ్యానము ఆత్మతత్త్వ ప్రతిపాదనాత్మకము. లవణరాజు కల సంఘసంస్కరణప్రతిఫలనాత్మకము.

మడికి సింగన పద్మపురాణము కంటె, భాగవతదశమస్కంధము కంటెను సరళమైన భాషను జ్ఞానవాసిష్ఠరామాయణమును సంతరించుట విశేషము.

సకలనీతిసమ్మతము తోపాటు జ్ఞానవాసిష్ఠరామాయణమును తెలుగు శాస్త్రవాఙ్మయచరిత్రకు వెలుగురేఖలు.

**నిశ్శంకకొమ్మన**: ఈతని కృతి శివలీలావిలాసము. అసమగ్రముగ ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రికయందు ప్రకటితము. "ఉదాహరణపద్యములు" అను సంకలనగ్రంథమునందు నిశ్శంక కొమ్మన వీరమాహేశ్వరమునుండి పద్యములు ఉదాహరింపఁబడినవి. అవి శివలీలావిలాసమునందు లేవు. ఉపలబ్ధభాగమునందు ఉండవలసిన పద్యములు కూడ (కల్పాంతరవార్ధి, దైతేయకాంతల) లేవు. కావున వీరమాహేశ్వరము మఱొక కృతి కావలయును. అనుపలబ్ధము. శివలీలావిలాసము అల్లాడవేమ, వీరభద్రారెడ్ల సోదరుడు దొడ్డారెడ్డికి అంకితము. వేమ, వీరభద్రారెడ్ల వర్ణనము కలదుగాని అన్నారెడ్డి వర్ణనము లేదు. అన్నారెడ్డి 1434 నాటికి లేనట్లు పూర్వోక్తము. కాఁబట్టి శివలీలావిలాసము రచనాకాలము స్థూలముగ 1435 వ

సంవత్సరము.

శివలీలావిలాసము "ముప్పదియాఱు శివలింగాఖ్యానంబులు" కల "మహాకావ్యము" అని కవివచనము. ఆ శివలీలల వివరమును కలదు. (17వచ.1ఆ.) అందు మొదటి శివలీల ఆఖ్యానము లేదు. రెండవ శివలీల మొదటి ఆఖ్యానముగ కలదు. ప్రకటితభాగమునందు పదియేడు శివలీలాఖ్యానములు కలవు. 1. పురుషత్రయము.2. అజబోధ. 3. సతీవివాహము. 4. గణేశ్వరోద్భవము. 5. చంద్రధారణము. 6.వృషభవాహనము 7. భృంగిప్రసాదము. 8. గంగాధారణము. 9. నందిమండలము. 10. భక్తరక్షణము. 11. జలంధరవధ.12. దారువనవిహారము. 13. హాలాహలభక్షణము.14. సుదర్శనప్రదానము. 15. దక్షిణామూర్తిరూపావతరణము. 16 దక్షనిరసనము. 17.కందర్పదాహము.

ప్రతి లీల ఒక చిన్నకథ. రసవద్ఘట్టములు తక్కువ. "సత్త్రబంధనిబంధనంబు .... జనితమహాధ్వనివిభూషణీయం"బని (ఆఱవలీల) కవివచనమే గాని కావ్యమట్లు కానరాదు. వర్ణనలు కలవు. దాక్షాయణి వర్ణనము సుమారు పాతిక పద్యములందు కలదు. (135-158ప.1ఆ.)

"కలదనఁ గా లేదనఁ గాఁ
గల మాటల రెంటి నడుము గాఁ బట్టి సుమీ
చెలువ చెలువారు నడుముకుఁ
గలిగె న్నడుమనఁ గ నామకంబు విశదమై". 142ప.

అను పద్యము చమత్కారముగ కలదు. సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (192-206ప.1ఆ.), వర్షాకాల (212-224ప.1ఆ.) వర్ణనలు కలవు. శైలీప్రౌఢిమ కలదు. శ్రీనాథుని ప్రభావము సమధికము. కాని ధారాశుద్ధి క్వాచిత్కము. శ్రీనాథుని అవతారికల వలె, నిశ్శంక కొమ్మన అవతారిక కూడ ఆనాటి చరిత్రకు అద్దము.

**జక్కన** : ఇతని కృతి విక్రమార్కచరిత్రము. జక్కనకాలమొక జటిలసమస్య.

## కాలము

జక్కన "నెల్లూరి తిరుకాళమనుజవిభుని సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి"న "పెద్దయామాత్యసుకవి మనుమఁ"డని, "పెద్దయయన్నయ" పుత్త్రుడని కలదు. (20-22ప.1ఆ.) నెల్లూరి తిరుకాళమనుజవిభుడు మొదటి తిక్కభూపతి (1209-1250) అయిన, పెద్దయకాలము 1209-1250, అన్నయకాలము 1249-1290,

జక్కనకాలము 1289-1320 అగును. రెండవతిక్కభూపతి[231] (1278-1282) అయిన, పెద్దయ 1278-1282, అన్నయ 1318-1322, జక్కన 1358-1362 మధ్య ఉండవలయును. ఇది ప్రధానమైన చరిత్రాంశమునకు ప్రతిబంధకము. "పెద్దయ యన్నయ" పెద్దయ పుత్త్రుడే కావలసిన ఆవశ్యకము లేదు. ప్రసిద్ధిని బట్టి, అట్టి నిర్దేశమునకు అవకాశము కలదు. వంశీయుడును మనుమడగును.

విక్రమార్కచరిత్రము కృతిభర్త రెండవ సిద్ధమంత్రి. అతని తండ్రి జన్నమంత్రి. తాత మొదటి సిద్ధమంత్రి. ఇతడు "ఎద్దనపూడి రాజేంద్రచోడక్షమారమణునిచే నగ్ర హారములు వడ"సిన సూరనసోమయాజి మనుమడు. (33ప.1ఆ.) తనయుడను పూర్వ ముద్రితపాఠము తాళపత్రగ్రంథములందు మృగ్యము. ఎద్దనపూడి రాజేంద్రచోళుని కాలము[232] 1163-81. సూరనసోమయాజి 1180 ప్రాంతమున అగ్రహారములు పడ సినను, అతని మనుమడు మొదటి సిద్ధమంత్రి 1260 ప్రాంతమున, ఇతని కుమా రుడు జన్నమంత్రి 1300 ప్రాంతమున, ఇతని కుమారుడు రెండవ సిద్ధమంత్రి 1340 ప్రాంతమున ఉండవలయును. ఇది కూడ ప్రధానమైన చరిత్రాంశమునకు ప్రతిబం ధకము. "మనుమడు" వంశీయుడగును.

మొదటి సిద్ధనమంత్రి "నన్నయగంధవారణంబునకుఁ బ్రధానుఁ"డని కలదు. (36ప.1ఆ.) నానిదేవ, నన్నదేవ, నన్నయదేవనామధేయములు ఒకటే యని, "నన్న యగంధవారణంబు"లోని నన్నయ 1275 నాటి నానెదేవుడని ఒక సమన్వయము కలదు[233]. కాని పద్యమునందు "నన్నయ" శబ్దము నిర్ధారకప్రయోగము కాదు. "అధికుండగు నన్నయగంధవారణంబు" అని పద్యమునందు కలదు. ఇట నుగా గమప్రాప్తికి అవకాశము కలదు.. అధికుండగు+ను+అన్నయ అను పదచ్ఛే దమున మూలచ్ఛేదమగును. నిర్ధారకసాధనము కాదు.

ప్రధానమైన చరిత్రాంశమిది:

విక్రమార్కచరిత్రము కృతిభర్త రెండవ సిద్ధమంత్రి తండ్రి జన్నమంత్రి-

"రసికత్వమున దేవరాయమహారాయ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచె" 44ప.1ఆ.

విక్రమార్కచరిత్రము కృతిభర్త రెండవ సిద్ధమంత్రి-

"దేవరాయమహారాయధీవిధేయ
మంత్రివల్లభచామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పి .... ... ...." 50ప.1ఆ.

ఇందలి చామనామాత్యుడు "దండాధినాథు"డని ఇంకొక పద్యమునందు కలదు. దండనాథుడన మంత్రియే. చామనామాత్యుడు ఏ దేవరాయల మంత్రివల్లభుడో, ఆ దేవరాయల వలన తండ్రి జన్నమంత్రి కటాక్షవీక్షణమును కాంచుట, తనయుడు సిద్ధమంత్రి చామనామాత్యుని వలన రాజలాంఛనములందుట, ఆ కాలమే జక్కన కాలమగుట అపరిహార్యము. రెండవ దేవరాయలకు దండనాథుడైన చామరాజునకు సంబంధించిన శాసనము కలదు[234]. కావున కృతిభర్త రెండవ సిద్ధమంత్రి కాలము, కృతికర్త జక్కన కాలము రెండవదేవరాయల కాలము. 1424-1446. జక్కన విక్రమార్కచరిత్రరచనాకాలము స్థూలముగ 1435వ సంవత్సరము.

## కృతిసమీక్ష

ఇది కథాకావ్యము. కేతన దశకుమారచరిత్రము కంటె, మంచన కేయూరబాహుచరిత్రము కంటె జక్కన విక్రమార్కచరిత్రము విస్తృతమైన, రసవత్తరమైన కథాకావ్యము. సంస్కృతవిక్రమార్కచరిత్రకు తెనుగుసేత కాదు. కథాసరిత్సాగరములోని కథలు, పుక్కిటిపురాణములు ఆధారముగ రచించిన స్వతంత్రకథాకావ్యము. విక్రమార్కుని కథ ప్రధానేతివృత్తము. భర్తృహరికథ ఆనుషంగికము. విక్రమార్కుని కథ త్రిలోకసంచారము చేయును. అభూతకల్పనలు అనేకము. విక్రమార్కుడు యోగదండప్రభావమున మేరుగిరి సమీపమున చంద్రపురము అను నగరమును నిర్మించి, అది రాజధానిగ పరిపాలించుట, పాదుకల ప్రభావమున బ్రహ్మసభ కేగి బ్రహ్మను మెప్పించి బ్రహ్మాస్త్రమును బడయుట, ఇంద్రుని ఆహ్వానముపై స్వర్గలోకమున కేగి ద్వాత్రింశత్సాలభంజికారంజితమైన దివ్యసింహాసనమును బడసి, అధిష్ఠించి, రాజ్యముసేయుట, సూర్యమండలమున కేగి రసరసాయనములు తెచ్చి వృద్ధవిప్రునికి ఇచ్చుట, మధుర కేగి దివ్యమణిని పొంది వైశ్యకుమారునికి ఇచ్చుట, సిద్ధపురరాజును ఓడించి విదర్భరాజతనయ అనంగవతిని వివాహమాడుట, నరమోహిని అను వారనారిని రాక్షసుని బారినుండి రక్షించి కమలాకరునికి ఇచ్చి వివాహము చేయుట, నాగకన్య కళావతి మౌనమును భంగము సేయుటకు దీపస్తంభముచేత కామమంజరీహేమాంగదుల కథ, కర్పూరకరండముచేత రాజశేఖరుని కథ, సువర్ణకలశముచే ముగ్గురు రాజపుత్త్రికల కథ చెప్పించుట త్రిలోకసంచారమునకు, అభూతకల్పనలకు ఆలవాలము. విక్రమార్కుడు చరిత్రప్రసిద్ధుడైనను చరిత్ర పూజ్యము. ఉజ్జయినీపాలకత్వమే చరిత్రాంశము. కడమ విషయమెల్ల కట్టుకథల పుట్ట. భర్తృహరి వైరాగ్యము చరిత్రాంశము. తన్నిమిత్తమైన కథ మఱల కట్టుకథ.

విక్రమార్కచరిత్రము కథ కల్పితమైనను, జక్కన కవిత్వము చక్కన.

"చక్కన నీ వైదుష్యము
చక్కన నీ కావ్యరచనచాతుర్యంబుల్
చక్కన నీ వాగ్వైఖరి
చక్కన నీ వంశమహిమ జక్కనసుకవీ! 23

స్వాభావికనవకవితా
ప్రాభవముల నుభయభాషఁ బ్రౌఢిమఁ జెప్పన్
భూభువనంబున సరి లే
రాభారతి నీవుఁ దక్క నన్నయజక్కా! 24ప.1ఆ.

అని కృతిపతి సంభావించినట్లు జక్కన వైదుష్యము, కావ్యరచనాచాతుర్యము, వాగ్వైఖరి చక్కనివే. స్వాభావికనవకవితాప్రాభవము, ఉభయభాషాప్రౌఢిమ పరిఢవిల్లునవియే. అవి కథాకథనమునందు కంటె వస్తువర్ణనమునందు అధికము. జక్కన విక్రమార్కచరిత్రము వర్ణనల పెన్నిధి. పునఃపునరుక్తములైన వర్ణనలును స్వాభావికనవకవితాప్రాభవములే. ఇందుకు ప్రథమోదాహరణము స్త్రీవర్ణనలు. పది స్థలములందు కలవు. 1. మదనరేఖవర్ణన (116-119ప.1ఆ.) 2.అనంగవతివర్ణన (16-19ప.4ఆ.) 3. నరమోహిని వర్ణన (170-173ప.5ఆ.) 4.కామమంజరి వర్ణన (40-46ప.7ఆ.) 5. దూతికారమణి వర్ణన. (29,36ప.8ఆ.) 6. కామమంజరి వర్ణన (44-49ప.6ఆ.) 7.పద్మావతి వర్ణన (22ప.8ఆ.) 8. గుణవతి వర్ణన(43-46ప.8ఆ.) 9. లీలావతి వర్ణన. (72,73ప.8ఆ.) 10. కళావతి వర్ణన (24-28; 140,172ప.8 ఆ.) ఇట్లే పురవర్ణనలు. 1. మధురాపురవర్ణన. (2-41ప.1ఆ.) 2.ఉజ్జయినీపురవర్ణన. (41ప.2ఆ;112ప. 8ఆ.) 3. వంచకపురవర్ణన. (7ప.7ఆ.) 4. అవంతీపురవర్ణన (40ప.7ఆ.) 5. కాంచీపురవర్ణన (112-118ప.7ఆ.) 6. విక్రమసింహపురవర్ణన (112ప.7ఆ.) పురవర్ణనముల తోపాటు క్షేత్రవర్ణనములు కలవు. ఉత్తరభారతదేశములోని కాశీక్షేత్రము, దక్షిణభారతదేశములోని శ్రీరంగ, అనంతశయనక్షేత్రములు ఆంధ్రదేశములోని శ్రీశైల, అహోబల, సిద్ధవట, శ్రీవిరూపాక్షక్షేత్రములు విక్రమార్కచరిత్రమునందు కన్నులకుఁ గట్టును. పుర, నగ, సముద్ర, ఋతు, చంద్రోదయ, సూర్యోదయ, (సూర్యాస్తమయ, అంధకార), ఉద్యానవిహార, జలకేళి, మధుగోష్ఠి రతోత్సవ, విరహ, వివాహ, కుమారోదయ, మంత్రాలోచన, దౌత్య, ప్రయాణ, యుద్ధ, నాయకాభ్యుదయములు అను అష్టాదశవర్ణనలును కలవు. అంతేకాదు. రాజ, శబర, వృద్ధబ్రాహ్మణ, నారద, విప్రకుమార, విట, ముని, రాక్షస, వరాహ, నాట్య, యాగ, వాయు, కుక్కుటారావ, సిద్ధ, యోగినీ, శుక, భోజనాదివర్ణనములు కలవు. వర్ణనభూయిష్ఠమైన

కథాకావ్యము జక్కన విక్రమార్కచరిత్రము.

స్వాభావికనవకవితాప్రాభవమునకు, కల్పనావైభవమునకు నిదర్శనము :

"తలమీఁదఁ జెరివినఁ దనరారు నునుఁ జెంక
యమృతాంశురేఖ చందమున నమర
మేదినీరేణువు మెయినిండఁగాఁ బర్వి
భసితాంగరాగసంపద వహింప
జుంజువెంద్రుక లెత్తి చుట్టిన లేఁదీఁగ
పన్నగాధీశ్వరు పగిది మెఱయఁ
గరమొప్ప నుదుటిపై గైరికతిలకంబు
ఫాలలోచన భాతి బరఁగుచుండ
శబరుఁ డొక్కరుఁ డేతెంచె సంభ్రమమున
శంకరుఁడు దొల్లి శబరవేషము వహించె
నంచు మదిలోన నీసు ధరించి తాను
నీశు నాకృతిఁ గైకొన్న యెఱు కనంగ." 123ప.2ఆ.

కల్పనావైభవము కాసంతయు లేని స్వాభావికకవితాప్రాభవమిది:

"తూనిఁగలాడెఁ దోయనిధిఁ దోరపుఁబ్రోఁత జనించెఁ బంక్తులై
కానఁబడెన్ బలాకములు కప్పయెలుంగు చెలంగె నిర్జల
స్థానములందుఁ గుంజములుతుదం గృకలాసము నిల్చినింగికై
యాననమెత్తె భూమిరజమంగలముల్ బెరయించెఁ బిచ్చుకల్"
28ప.4ఆ.

ఇది శ్రీనాథుని హరవిలాసములోని "తూనిఁగలాడఁ జొచ్చె" అను పద్యమునకు (19ప.2ఆ.) ప్రపంచీకరణము. శ్రీనాథుని ప్రభావము జక్కనపై సమధికము.

పురందరుడను వణిక్కుమారుడు "కట్టక కుడువక యొరులకుం బెట్టక తమ తండ్రి గూడఁబెట్టిన సిరి " వెచ్చించునెడ పురవైశ్యులు ధనప్రభావము నెఱింగించినను, ధనమునకు సద్వినియోగమే ఫలమను ప్రబోధము (178-187ప.2ఆ.) ప్రశస్తము.

"నేలం బాఁతిన నన్యుల
పాలవు ధన మొండె ముచ్చుపాలవు ధరణీ
పాలుని పాలవుఁ గావున
వాలాయముఁ గుడువ విడువవలయున్ ధనమున్." 178

సంపదలు తరంగసంచలంబులు రెండు
మూఁడు నాల్గుదివసములది ప్రాయ
మాయు వరయ శారదాభ్రపటలమని
యెఱిఁగి సేయుఁడు పరహితము హితము. 183

తన చేసిన పురుషార్థము
తన సొమ్ముగ నెఱిఁగి నరుఁడు దానపరుండై
యనుభవియై మనవలదా?
దినములచే మోసపో కతిస్థిరబుద్ధిన్." 185ప.2ఆ.

చకోరిక సందేశములోని అనంగవతి భావప్రకటనము రసబంధురము.

"చెప్పఁ దలంచు. సిగ్గు తనుఁ జెప్పఁగ నీమికి సంచలించుఁ దాఁ
జెప్పెడు మాట యెవ్వరికిఁ జెప్పకుమీ! యనఁ జూచు నంతటం
జెప్పకయుండరాదు మఱి చెప్పఁగ రాదని కొంకు నెమ్మెయిం
జెప్పకపోదుపో! మ్మనుచుఁ జిత్తము నూల్కొనఁ జేసి యిట్లనున్.
151

నిజకరస్పర్శమొనరించి నీరజముల
నర్కుఁ డలరించునది యెంత యన్న కరణి
వినినయంతనె విక్రమవినుతుఁడైన
యర్కుఁ డలరించె నాహృదయాంబుజంబు" 152ప.4ఆ.

అనంగవతీవిక్రమార్కుల పుష్పాపచయఘట్టమునందు అపూర్వమైన పద్యము:

"అందని పువ్వుగుత్తి దెసకై యఱ సాపఁ గనేల బాల? కో
యం దలపయ్యెనేని నెగయ న్నిను నెత్తెదనంచు సంతసం
బందఁగ నెత్తి యెత్తి విభుఁ డందఱ ముందఱ డించుచుండఁగా
నందిన కంటె సంతసము నందె లతాంగియు మాటిమాటికిన్."
27ప.5ఆ.

అల్లసాని పెద్దన మనుచరిత్రములోని "నను నిముసంబు గానకయున్న" అను పద్యమునకు (17ప.2ఆ.) ఆదర్శప్రాయమైన జక్కన పద్యమిది:

"ఏనుఁ బొత్తుకు రాక యెన్నఁడు నారగిం
పని యట్టి రక్తు మజ్జనకుఁ దలఁచి
చెమట నెత్తురుగాఁ గఁ జిత్తమ్మునఁ దలంచి

యర్మిలిఁ బెనుచు మదంబుఁ దలఁచి
నిముసంబు ననుఁ బాసి నిలువక యొడఁ గూడి
చరియించు మత్ప్రాణసఖులఁ దలఁచి
యెయ్యది పనిచిన నొయ్యఁ జేయుచు నాదు
కనుసన్న మెలఁగు భూజనులఁ దలఁచి
గంధసింధురసైంధవోత్కరముఁ దలఁచి
సతతసేవాగతనరేంద్రవితతిఁ దలఁచి
వనటయొదవిన నింతయొప్పని మనమున
నున్న చందంబుగాని, వేఱొండు లేదు." 59ప.6ఆ.

ఇట్లు తేటతెనుగు రచన తోపాటు సంస్కృతప్రౌఢి కూడ జక్కన వాక్ప్రౌఢియే. అందును శ్రీనాథుని ప్రభావము అత్యధికము.

"ఆ రామామణితోడఁ గూరిమి నతం డత్యాస్థఁ గ్రీడించు సం
సారస్ఫారసుఖైకసారసురతేచ్ఛాపూరనిర్మగ్నుఁ డై
యారామాంతరకేళిపర్వతగుహాహర్మ్యాంతరాళంబులం
గిరాలాపమదాలిగీతవిలసత్క్రీడానివాసంబులన్." 40ప.3ఆ.

"నూతనమీనకేతనవినోదపరిశ్రమఖిన్నులైన య
బ్జాతముఖీనృపోత్తముల సారెకు సారెకు సేద దేర్చు వే
గాతటినీతటీకలితకాంతరసాలనికుంజమంజరీ
జాతమరందకందళితసారసమీరము కాంచికాపురిన్." 115ప.17ఆ.

జక్కనకు శబ్దాలంకారములపై మమకారము మెండు. అంత్యానుప్రాసము అధికము.

"నాకముఁ గాంచె నట్టియెడ నందనమందచరన్నితంబినీ
లోకము, సంయమీంద్రధృతిలోపకలోలవిలాసమేనకా
లోకము, వాసవేభమదలోలుపచంచలచంచరీకమున్
స్వీకృతసత్తపఃఫలవిశేషవిపాకముఁ బుణ్యలోకమున్." 82ప.2ఆ.

ఇతఃపూర్వకవులు మక్కువ చూపని యమకము జక్కనకు ఎక్కువ ఇష్టము.

"ని/ న్నేమనుదాన నింక నెటులే మనుదాన మహోదరిద్రతన్." 8ప.3ఆ.

"విజయపాలుని నెమ్మోము విన్నవోయి
తెల్లవాఱినకైవడి తెల్లవాఱె." 102ప.3ఆ.

"ఏకతంబున నిది యేకతంబున వచ్చెనో" 106ప.3ఆ.

"తమ్ములా కొమ్మ నెమ్మోవితమ్ములనఁగ

బింబ మా యింతి కెమ్మోవి బింబమనఁగ
జాతి యా నాతి లేనవ్వు జాతి యనఁగ
రామ యొప్పారు లోకాభిరామ యనఁగ" 18ప.4ఆ.

ఇట్టి యమకము చేమకూర వెంకనకృతులందు ఇతోధికము. చేమకూర యమకమునకు జక్కన యమకము మార్గదర్శకము. పూర్వకవులకు శిష్యప్రాయమైన, అర్వాచీనకవులకు ఆదర్శప్రాయమైన జక్కన విక్రమార్కచరిత్రము కథాకావ్యములందు కలికితురాయి.

**అనంతామాత్యుడు** : ఈతని కృతులు రసాభరణము, భోజరాజీయము, ఛందోదర్పణమును. రసాభరణము అలంకారశాస్త్రగ్రంథము. ఛందోదర్పణము ఛందశ్శాస్త్రగ్రంథము. భోజరాజీయము కావ్యము. అహోబలనృసింహునికి అంకితము.

## కాలము

రసాభరణమునందు "ఋతుశరజ్వాలేందులై యొప్పు నయ్యానందాబ్దమునందు మాఘమాసమునఁ గృష్ణైకాదశీభౌమయుక్తానామామృతవేళ" రచించినట్లు కలదు. అది 25-1-1435వ తేదీ [235] ఛందోదర్పణమునందు "భోజచరిత్ర చెప్పి" నట్లు కలదు. (132ప.4ఆ.)కాఁబట్టి భోజరాజీయము రచనాకాలము స్థూలముగ 1440 వ సంవత్సరము, ఛందోదర్పణము రచనాకాలము స్థూలముగ 1445 వ సంవత్సరము కావచ్చును.

## కృతిసమీక్ష

భోజరాజీయము కథాకావ్యము. మంచన కేయూరబాహుచరిత్రము వంటిది.

"సూత్రకథ భోజరాజచ
రిత్ర మ యా నడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్" 86ప.1ఆ.

అని కవివచనము. సూత్రకథ అత్యల్పము. ధర్మరీతులు, నీతులు బోధించు చిత్రకథలు అత్యధికము. ప్రథమాశ్వాసము మహానికథ. అది భోజరాజుకథకు ఉపక్రమణిక. ద్వితీయాశ్వాసము భోజరాజు కథ. తృతీయాశ్వాసము మొదట భోజరాజు సర్పటి అను సిద్ధుని భోజనము చేయుమన (4ప.3ఆ.) సర్పటి తన

పంచభిక్షనియమమునకు భంగకరమని నిరాకరించును.' భంగకరము కాదనుటకు భోజరాజు ఒక కథ చెప్పును. అవుననుటకు సర్వటి మఱొక కథ చెప్పును. అది మొదలు కథలపై కథలు, కథలలో కథలు, కథలలోని కథలలో కథలు సప్తమాశ్వాసము కడదాక సాగును. అప్పుడు సర్వటి నాలుగిండ్ల భిక్షనంది భోజనము చేయును. తదనంతరము భోజరాజునకు పుత్త్రుడు, పౌత్త్రులు పుట్టుదురు. ఇది భోజరాజచరితము. ఈ భోజరాజు ధారానగరము రాజధానిగా పరిపాలించిన భోజుడే గాని, కవులకు అక్షరలక్షలు లేవు. గోష్ఠులు కలవు.

"సంగీతవిద్యాప్రశస్తమానసులతోఁ
గూడి వినోదించుఁ గొంత దడవు
సాహిత్యవిద్యావిశారదాత్మకులతోఁ
గూడి వినోదించుఁ గొంతదడవు
నృత్తవిద్యాకళాయత్తచిత్తులతోడఁ
గూడి వినోదించుఁ గొంతదడవు
వాద్యవిద్యానిరవద్యభావకులతోఁ
గూడి వినోదించుఁ గొంత దడవు
శబ్దశాస్త్రమంత్రశాస్త్రధనుశ్శాస్త్ర
తురగశాస్త్రవిదులతోడి గోష్ఠి
నడుపుఁ గొంతదడవు నయశాస్త్రవేదులఁ
గూడి మాటలాడుఁ గొంతదడవు" 109ప.2ఆ.

ఇందు సూర్యోదయవర్ణనము, (114-119ప.) భోజరాజు దినచర్య (120-125ప.) వారవనితావర్ణనము (170 ప.2ఆ.) కలవు.

"ఆ లోలాక్షిలలాటవక్త్రసదృశత్వాకాంక్షఁ జంద్రుండు దా
బాలత్వంబు వహించి చూచియు నొగిం బ్రౌఢత్వమున్ బొందియున్
బోలంజాలక జాలి పొంది వగలం బొల్పేది లోఁగుందెఁ గా
కాలోకింపఁ దదీయబింబము కురంగాకారముం గూరునే."

157ప.3ఆ.

అను పద్యము శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని "దక్షారామవిలాసినీతతుల" అనుపద్యమునకు (193ప.1ఆ.) అనుసరణము.

"ఎక్కడఁ జూచినం జిలుక లెయ్యెడఁ జూచినఁ గోకిలమ్మలే
చక్కటిఁ జూచినన్ సమదషట్పదసంఘము లెందుఁ జూచినం
జొక్కపు శారికల్ ఋతువు సొంపు నుతింప వశంబె పువ్వుఁ దే

రెక్కిన పంచసాయకుఁడ యెద్దెసఁ జూచిన నవ్వనంబులోన్.
166ప.3ఆ.

అను పద్యము శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని "ఎక్కడఁ జూచినన్ సరసి" అను పద్యమునకు (23ప.3ఆ.) అనుకరణము.

గోవ్యాఘ్రసంవాదకథ గొప్పఘట్టము. అందు గోవు, మీదికి లంఘించు బెబ్బులిని "ఓహో! నిలు నిలు. నా కొక చన వీవలయు వివేకించి నాదు వాక్యము వినుమీ" (130ప.)

"అనినం బులి గోవుపై నె
త్తిన కేలును భీషణాకృతియుఁ బటమున వ్రా
సిన చిత్తరు రూపు విధం
బున ఖచరుల కద్భుతంబు పొదలఁగ నుండెన్. 131

పులియఁకు దీపనానలము పొంగున మ్రోఁగుచు నుక్కియట్టె యి
మ్ముల నొకపాఁడిగో వపుడుముందటికిం జనుదెంచునట్టె హో
నిలుమనినం బయింబడక నిల్చి కనుంగొను నట్టె బాపురే
కలఁగక యాడు మాట లయకాలుని నైన శమింపఁ జేయదే."
132ప.4ఆ.

అను అనంతామాత్యుని సన్నివేశచిత్రణము అనన్యసామాన్యము. అంతేకాదు. బెబ్బులికి గోవు నివేదనము, అంతలోనే గోవు ఆత్మగతము తిర్యగ్గతమైనను మానవహృదయపరము. కరుణరసనిర్భరము.

"మును మును బుట్టె నాకు నొక ముద్దులపట్టి యతండు పుట్టి యే
డెనిమిది నాళ్ల పాటి గలఁ డింతియ పూరియు మేయ నేరఁ డేఁ
జని కడుపార జన్ గుడిపి చయ్యన వచ్చెద నన్నుఁ బోయి ర
మ్మని సుకృతంబు గట్టికొనవన్న దయాగుణ ముల్లసిల్లఁ గన్."
134ప.4ఆ.

"రేపు చనుగుడిపి వచ్చితి
నేపున నందంద పరువులిడి యంతటిలో
నా పుడిసెడు నఱఁగినఁ గొడు
కే పాటులఁ బడునొ వాని కెయ్యది గతియో. 136

ఏ నఱ్ఱు నాకుచుండగఁ
దా నను నండఁ గొని చెవులు దాలవయిచుచున్
మేనెఱుఁగక యుండెడు నా

కూనకు నెవ్వారు దిక్కొకో యిటమీఁదన్. 137

నన్నుఁ గానక పోయి నా పుత్త్రుఁ డే యావు
పొదుగైన దొడుకంగఁ గుదిలి కొనుచుఁ
గొమ్మన నదరంటఁ జిమ్మనో నుడిసిన
నడ్డంబు దాఁకునో గొడ్డుటావు
లుగ్రమహోక్షంబు లొండొరులఁ దొడరుచోఁ
ద్రొక్కునో జఠరాగ్నిఁ బొక్కిపడుచుఁ
బొరుగిండులకు నొరులఁ బోవఁ గుక్కలు దోలి
కఱచునో గతిమాలి యఱచుకొనుచుఁ
దిరిగి తిరిగి యధికదీనవక్త్రముతోడఁ
దోఁట దొడ్డి చెరఁగఁ దోలఁ బోయి
పడుచుపైన వెంటఁ బడి నొవ్వనడుచునో
యేమి సేతునంచుఁ బ్రేముడించు" 138ప.4ఆ.

ఇందు మానవమాతృహృదయము వలె గోమాతృహృదయమును మథనము చెందినట్లు రచించిన అనంతామాత్యుని ప్రజ్ఞ అసాధారణము.

భోజరాజీయకథావల్లరిలోని అగస్త్యవసిష్ఠుల కథ, దుష్టసతిశిష్టపతుల కథ, మంటిముద్ద యోగికి పెట్టిన స్త్రీ కథ, చండాలదంపతుల కథ, విప్రుని కథ, వంజర దంపతుల కథ- ఆతిథ్యమహిమను, అన్నదానమాహాత్మ్యమును; గోవ్యాఘ్ర సంవాదకథ, మునికథ, మదనరేఖకథ- సత్యవ్రతమాహాత్మ్యమును; పావకలోముని కథ, సుశీలకథ-విధివిధానమాహాత్మ్యమును ప్రతిపాదించును. ప్రధానమైన భోజ రాజు కథ- భోజరాజు శీలమునకు కళంకమును ఆపాదించును. సర్పటి అను సిద్ధుని ధూమవేధివిద్యను తనయొద్ద శబ్దభేధివిద్యకలదని అసత్యమాడి భోజుడు సంగ్రహించును. సర్పటి శపించును. ప్రార్థింప అనుగ్రహించును. ఇది చారిత్రిక వ్యక్తియైన భోజరాజు చరిత్ర కాదు. కట్టుకథయే అగును.

అనంతామాత్యుడు "ఏఁ బలికెడు నూత్నకావ్యరసభావములు" అని (70ప. 1ఆ.)," నూతనంబయ్యుంబురాతనకృతులట్ల సంతతశ్రవ్యమై బరుగు"నని(78ప.1ఆ.) "-సునీతిపథాయత్తంబై క్రొత్తగదే" అని (256ప.7ఆ.)" వివిధకథా నూత్నరత్నభూషణాభిరామ"మని (258ప.7ఆ.) తెలుపుట వలన, భోజరాజీయము సంస్కృతమూలము లేని విక్రమార్కచరిత్రము వలె స్వతంత్ర కథాకావ్యమగును. విక్రమార్కచరిత్రములోని కామమంజరి కథకు, భోజరాజీయములోని వంజర దంపతుల కథ సదృశము. ఈ రెండు గ్రంథములకు పుక్కిటిపురాణములే ఆధారము.

భోజరాజీయమునందు సంస్కృతప్రౌఢి సకృన్మాత్రము. తెనుగు నుడికారము సమృద్ధిప్రాయము. తిక్కన తర్వాత తేటతెనుగు తేనెసోనలు కురిపించిన కవి అనంతామాత్యుడే. అనంతామాత్యుడే తిక్కనకు తగిన వారసుడు.

**గౌరన** : ఈతని కృతులు హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథచరిత్ర, లక్షణ దీపికయును. లక్షణదీపిక సంస్కృతభాషలోని తెలుగు లక్షణగ్రంథము. హరిశ్చంద్రో పాఖ్యానము, నవనాథచరిత్ర ద్విపదకావ్యములు.

## కాలము

హరిశ్చంద్రోపాఖ్యానము ఎవ్వరికిని అంకితము కాదు. నవనాథచరిత్ర శ్రీశైల భిక్షావృత్తి ముక్తిశాంతభిక్షావృత్తి ఆదేశమున శ్రీశైలమల్లికార్జునదేవునికి అంకితము. గౌరన సింగనమాధవక్షితిపాలునికి మంత్రియైన పోతరాజునకు తమ్ముడైన ఎల్ల మంత్రికి ద్వితీయపుత్త్రుడని హరిశ్చంద్రోపాఖ్యానమునందు. సింగనమాధవక్షితి పాలుని మంత్రియైన పోతరాజునకు తమ్ముడైన అయ్యలుమంత్రికి కూర్మితనయు డని నవనాథచరిత్రయందు కలదు. ఎల్లమంత్రి లేఖకదోషము కావచ్చును. సింగన మాధవక్షితిపాలుని ఉమామహేశ్వరశాసనమునందు అతని మంత్రి పోతన అని కలదు[236].(31శ్లో.) పోతరాజు తండ్రి పెద్దన అని హరిశ్చంద్రోపాఖ్యానమునందు కలదు. పోతన పెద్దనమంత్రివర్యుని తనయుడని ఉమామహేశ్వరశాసనము నందును కలదు. (32శ్లో.) శాసనకాలము 1376వ సంవత్సరము. అది పోతరాజు కాలము. అతని తమ్ముడైన అయ్యలుమంత్రి ద్వితీయపుత్త్రుడు గౌరన కాలము తద నంతరమగుట తథ్యము. నవనాథచరిత్రకృతిభర్త ముక్తిశాంతభిక్షావృత్తి శాసనము కలదు[237]. శాసనకాలము 1449వ సంవత్సరము. కాఁబట్టి హరిశ్చంద్రోపాఖ్యానము రచనాకాలము స్థూలముగ 1440వ సంవత్సరము. నవనాథచరిత్ర రచనాకాలము స్థూలముగ 1445వ సంవత్సరము.

## హరిశ్చంద్రోపాఖ్యానము

హరిశ్చంద్రుని కథ ఋగ్వేదమునందు కలదు. మార్కండేయపురాణమునందు కలదు. దేవీభాగవతమునందు కలదు. స్కాందపురాణమునందును కలదు. కాని హరిశ్చంద్రుని కథ ద్వైతవనమునందు ధర్మరాజునకు మార్కండేయుడు చెప్పి నట్లు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునందు కలదు. (4,36-44పం.ఆవ.) ద్వైతవన మునందు మార్కండేయుడు ధర్మరాజునకు హరిశ్చంద్రుని కథ చెప్పినట్లు మహా భారతమునందు లేదు. బృహదశ్వుడు నలోపాఖ్యానము తర్వాత

హరిశ్చంద్రోపాఖ్యానము చెప్పినట్లు సంస్కృతభారతప్రతులందు కొన్నిటు సంగ్రహముగను, కొన్నిటు సవిస్తరముగను కలదు. అంతేకాదు. ద్వైతవనమునందు ధర్మరాజునకు మార్కండేయుడు నలహరిశ్చంద్రుల కథలు చెప్పినట్లు భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు కలదు.(1-5ప.1ఆ.) గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములోని హరిశ్చంద్రుని కథ, భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానములోని హరిశ్చంద్రుని కథ సర్వసమానము. హరిశ్చంద్రుడు అయోధ్యానగరాధిపతి. తండ్రి త్రిశంకుడు. మంత్రి సత్యకీర్తి. భార్య చంద్రమతి. కుమారుడు హరిశ్చంద్రోపాఖ్యానముందు లోహితాస్యుడు. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు లోహితుడు. నక్షత్రకుడు, కలహకంఠీకాలకౌశికులు ఉభయత్ర కలరు. మార్కండేయపురాణములోని హరిశ్చంద్రుని కథ సర్వసమానము కాదు. భార్య శైబ్య. కుమారుడు రోహితాస్యుడు. నక్షత్రకుడు, కలహకంఠీకాలకౌశికులు లేరు. కౌశికుడు కలడు. వీరబాహు, వీరదాసునామములు లేవు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునకు మార్కండేయపురాణము మూలము కాదు. మహాభారతప్రత్యంతరమే మూలమగును.

హరిశ్చంద్రుని కథ జగత్ప్రసిద్ధము. హరిశ్చంద్రుడు సత్యసంధుడని సర్వవిదితము. సత్యవ్రతము కొఱకు సమస్తరాజ్యమును ధారపోయుట, భార్యాపుత్త్రులను మాత్రమేగాక తన్ను కూడ అమ్ముకొనుట, నానాబాధలకు గుఱి అగుట కూడ అందఱికిని తెలిసినదే. హరిశ్చంద్రుడు అంత సత్యసంధుడగుటకు అతని భార్య చంద్రమతి ప్రధానకారణము. ఆమె లేనిచో విశ్వామిత్రుని విషమ పరీక్షలకు హరిశ్చంద్రుడు ఆహుతి కావలసినదే అన్నంతగా చంద్రమతి పాత్రను గౌరన తీర్చి దిద్దెను. విశ్వామిత్రుడు సృష్టించిన మాతంగకన్యలు- చంద్రమతి,

"కలుగునే మాతంగకన్యల కిట్టి
లలితవిభ్రమనవలావణ్యమహిమ
యే యుపాయంబుల నిది నమ్మరాదు
మాయురే కౌశికు మాయ గాఁ బోలు" 1025-28పం.ప్ర.భా.

అనినగాని, హరిశ్చంద్రుని విడిచిపెట్టిపోలేదు. విశ్వామిత్రుడు సకలరాజ్యములు సమర్పించుమనిన, "ఒండాడ మొనయక యూఁ కొట్టి" వినుచున్న హరిశ్చంద్రుడు- చంద్రమతి

"ఏ మాట సందున నెసఁ గునో బొంకు
లెనయ నిద్ధర నెల్ల నేలిన నృపులు
గొనిపోయిరే నేల గొఱిదెఁ డంతైన

నీ నిఖిలోర్వియు నిమ్ము నీంద్రునకు
దానమిమ్మిచట సత్పాత్రంబు దొరికె" 1326-30పం.ప్ర.భా.

అనినగాని, సమస్తరాజ్యమును ధారపోయలేదు. విశ్వామిత్రుడు సృష్టించిన దావాగ్నిలో, చంద్రమతి -

"చెచ్చెర రాయంచ చెంగల్వకొలనుఁ
జొచ్చిన గతిఁ జిచ్చుఁ జొచ్చి యా నడుమ
గలయఁ బూసిన కింశుకంబులలోనఁ
జెలువారుచున్న రాచిలుక చందమునఁ
బ్రబలసంధ్యారాగపటలంబునందు
సొబగొందు క్రొన్నెల సోగ బాగునను
మలసి మండెడు పెనుమంటలలోన" 2271-77పం.ప్ర.భా.

నిలిచినగాని చల్లారలేదు. అంతేకాదు. చంద్రమతి
"ఆపద వచ్చిన యప్పుడే మున్ను
దాఁపిన ధనమిచ్చి తగుఁ బత్నిఁ గావఁ
జనుఁ బత్నినైనను జట్టిగా నమ్మి
తనకు వచ్చిన బారిఁ దప్పింపవలయు

xxx xxx xxx

వక్రంబుగా నాడవలదు నన్నిపుడు
విక్రయింపఁగ వేళ విచ్చేయు'మనుచు" 237-58పం.ద్వి.భా.

మ్రొక్కినగాని హరిశ్చంద్రుడు భార్యను అమ్మలేదు. కడకు హత్యాదోషము కూడ ఆపాదితమైన చంద్రమతిని రాజాజ్ఞను అనుసరించి చంపుటకు సంశయించు హరిశ్చంద్రుని

"ఇనకులాధీశ నీ వెఱుఁగని యట్టి
వినుతధర్మంబులు వేఱొండు గలవె

xxx xxx xxx

రూఢిగా రాకుమారునిఁ జంపెననెడి
యాడిక తలగూడె నభిమాన మెడలె
నటుగాన ననుఁ జంప నర్హ మీవేళ
కటకటా నీవేల కరుణఁ దాల్చెదవు" 2474-92పం.ద్వి.భా.

అని కర్తవ్యోన్ముఖుని చేసినది చంద్రమతి. ఇంత ధీరోదాత్తగా చంద్రమతి

పాత్రను చిత్రించిన గౌరన కవితాగౌరవము గౌరీశంకరశిఖరోన్నతము.

స్త్రీపాత్రచిత్రణమున చంద్రమతి ధీరోదాత్తపాత్ర వలె, పురుషపాత్రచిత్రణమున నక్షత్రకుడు సజీవపాత్ర. సదృశలక్షణములు కల వ్యక్తి స్మరింపఁజేయు పాత్ర సజీవపాత్ర. విడిచిపెట్టకుండ నిరంతరము విసిగించి పీడించు వ్యక్తిని నక్షత్రకుడనుట పరిపాటి. చంద్రమతికి చేయూతనిచ్చి, లోహితాస్యుని మూపున నిడుకొని హరిశ్చంద్రుడు అడవిలో నడుచునెడ, నక్షత్రకుడు మిథ్యాపథిశ్రాంతి నటించి "హా గురునాథ" అని చదికిలఁబడి

"పొగిలె నంగంబులు వొక్కెఁ బాదములు
నొగిలె నెమ్ములు చాల నొచ్చె మస్తకము" 1619-20పం.ప్ర.భా.

అని విసిగించును. కాశీపురి చేరిన హరిశ్చంద్రుని,

"ఇచ్చిన మితి నేఁడు నెల్లియుఁ జిక్కెఁ
బచ్చపైకము గూడఁ బడినది లేదు" 152-53పం.ద్వి.భా.

అని వేధించును. చంద్రమతిని అమ్మటకు హరిశ్చంద్రుడు సంశయించునెడ,

"తరుణిఁ బాయఁ గలేక తల్లడించినను
మరి యుపాయముఁ జెప్పు మా ధనంబునకు" 293-94పం.ద్విభా.

అని బాధించును. హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మగా వచ్చిన ధనమంతయు నిచ్చిన,

"గురుఁడు పుత్తేరంగఁ గోరి నీ వెంటఁ
దిరుగుచుఁ దరువున్న దినములకెల్ల
చెల్లించితివి నాకుఁ జెల్లె ధనంబు
మితితోడ నొసఁగుము మేకొన్న గాధి
సుతుని ఋణంబెల్లఁ జొప్పడఁ దీర్చి"1213-17పం.ద్వి.భా.

అని సాధించును. కౌశికుని ఋణమెట్లు తీర్తునని హరిశ్చంద్రుడు తలపోయునెడ,

"ఊరక నివ్వెఱఁ గొంది యిట్లున్న
నే రీతి మాధనం బిట మీఁద వచ్చుఁ
జెచ్చెఱ నొక త్రోవఁ జేసి మమ్మనిపి
పుచ్చినఁ బోదు మీ పోరాట ముడిపి

మేదినీ నాథ యీ మేలంబు లేల
లేలేమ్ము ధనము చెల్లింపు నీవు" 1311-21పం. ద్వి. భా.

అని పీడించును. కడకు హరిశ్చంద్రుని అమ్మిన కర్కశుడు నక్షత్రకుడు.

పాత్రచిత్రణముతోపాటు హాస్యరసపోషణమును గౌరన ప్రత్యేకత. కలహకంఠీ కాలకౌశికుల వృత్తాంతము మోతాదు మించిన హాస్యరసఘట్టము. చంద్రమతిని, లోహితాస్యుని కొని తీసికొని స్వగృహమును సమీపించిన కాలకౌశికుడు శిష్యుని

"నీవు ముందఱ నేఁగి నేర్పు సంధిల్ల
జననాథుఁ డొక్కఁ డీ సతి దారవోసె
నొనర నొజ్జల కని యొడఁ బడ మొఱఁగి" 1017-20పం. ద్వి. భా.

రమ్మని లోనికి పంపును. శిష్యుడు కలహకంఠికి,

"రాచకూఁ తురుఁ గొని రవ్వగాకుండ
దాఁచిన మీ మూలధనమెల్లఁ బెట్టి
గోఁచికాఁ డై దానిఁ గొనుచు నేతెంచి" 1048-50పం. ద్వి. భా.

నాడని చెప్పి, "విచ్చేయుఁ డింక మీ వెఱపెల్లఁ బాపి వచ్చితని"నని, వారు "లోని కేఁగెడునంతలోఁ దల్పుమూసి పూని గొండ్లెముఁ బెట్టి" పోవును. "తల సాలఁ గట్టిన తన వ్రేలు దుడ్డు వడిఁగేలఁ గైకొని వచ్చు" కలహకంఠిని చూచి కాల కౌశికుడు తలుపు తీయఁ బోవును. కలహకంఠి,

"పొడువ నీ కెక్కడఁ బోవచ్చు ననుచుఁ
బెక్కు భంగుల మొఱ్ఱఁ బెట్టంగ వెఱ్ఱి
కుక్క లోఁ బడఁ బట్టి కొట్టిన రీతిఁ
జేతు లొగ్గుచు మ్రొక్కుఁ జేకొను మనుచు
సాతురంబున వేఁడ నందంద మొత్తి" 1019-13పం. ద్వి. భా.

అలసిపోవును. కాలకౌశికుడు "దీని గొంపలోపల వెళ్లఁ గొట్టుదు"ననుచుఁ

"గుదియక కరతిత్తి గొని దాని వ్రేయ
నది చెడిపోవను నందంద మోఁదె
వడిదాని తలఁ బట్టి వంచిన విప్రు
నొడిచి గడ్డము పట్టియూఁ చె నవ్వెలఁ ది

నఖముల వ్రచ్చె నన్నాతి నాద్విజుఁడు
ముఖము ద్రిప్పఁగ నది ముక్కు వోఁ గఱచె" 1126-31పం.ద్వి.భా.

ఇది కలహకంఠీకాలకౌశికుల వృత్తాంతమునకు దిక్సూచి. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము ద్విపదకావ్యములందు దివ్యదీధితి. అర్వాచీనహరిశ్చంద్రకావ్యములకు ఆదర్శము.

## నవనాథచరిత్ర

నవనాథచరిత్ర నవనాథుల చరిత్ర. నవనాథులు నాథసంప్రదాయప్రవర్తకులు. నాథసంప్రదాయమన నాథమతము. అది శైవము. నాథశైవము. వీరశైవము కంటె ప్రాచీనమైనది. వీరశైవమునందు విలీనమైనది. వీరశైవము ద్వైతము. నాథశైవము ద్వైతాద్వైతము. వీరశైవము భక్తిప్రధానము.. నాథశైవము యోగప్రధానము. నాథశైవము జన్మస్థలము ఉత్తరభారతదేశము. గమ్యస్థలము దక్షిణభారతదేశము[238]. అందుకు ఏడవ శతాబ్దినాటికే కేంద్రము శ్రీశైలము[239]. శ్రీశైలభిక్షావృత్తిమఠము నాథసంప్రదాయమునకు చెందినది. ఆ మఠాధిపతి ముక్తిశాంతభిక్షావృత్తి,

"పరఁగ శ్రీగిరికవి పద్యబంధముల
విరచించి నాఁ డది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర"

అని గౌరనను పిలిపించి

"సన్నుతనవనాథచరితంబు ద్విపద
కావ్యంబుగాఁ జెప్పి కమలజవిష్ణు
సేవ్యమానునకును శ్రీశైలపతికి
శంకరునకు బాలశశిశేఖరునకు
నంకితం బొనరింపు"

మన గౌరన "శ్రీమల్లికార్జునశ్రీమహాదేవుపేర" నొనరించినది నవనాథచరిత్ర. నాథసంప్రదాయమునకు శివుడు ఆదినాథుడు. నవనాథులు ప్రవక్తలు. మత్స్యేంద్రనాథుడు, చౌరంగినాథుడు, గోరక్షనాథుడు, మేఘనాదసిద్ధుడు, విరూపాక్షనాథుడు, నాగార్జుననాథుడు, ఖణికసిద్ధుడు, బుద్ధసిద్ధుడు, వ్యాళిసిద్ధుడు గౌరన నవనాథచరిత్రలోని నవనాథులు. సిద్ధులకు, నాథులకు కించిద్భేదమున్నను నాథులు సిద్ధులుగ వ్యవహరింపఁబడిరి. మత్స్యేంద్రనాథునికి మీననాథుడని పర్యాయనామము. బుద్ధసిద్ధుడే మంజునాథుడు.

శివుడు పరమరహస్యముగ పార్వతికి అధ్యాత్మవిద్యను ఉపదేశించును. అది:

"అలరు జీవుల బ్రహ్మకాదిని మొదటఁ
గలిగిన నాలుగు కడపటు రెండు
నేకమై యితరంబు నేమియుఁ జెప్ప
రాక వెలుంగొందు క్రమమును జెప్పి
యొలిఁ జతుర్ముఖయోగములందు
నాలోన మతములు నభ్యాసవిధులు
తనరు నవస్థలు తాత్పర్యవశ్య
జనితసౌఖ్యములును సరి యటు మీఁద
జరిగెడి సిద్ధిసూచకముల వలను
నరయ నింతకు మూలమై స్థూలసూక్ష్మ
కారణైక్యము పరకాయసంస్థితులు
నేరుపు మీఱ నన్నియు నెఱింగించి
రాజిల్లు నటు మీఁద రాజయోగంబు"

ఇది విని "యోగమాహాత్మ్యమంతయు వింటిఁ గడమఁ జెప్పు" మనిన వీాన నాథుని,

"..... సిద్ధాసనంబునను
మనమార నునిచి తన్మస్తకస్థలిని
గరతలం బల్లనఁ గదియంగఁ జేర్చి
యురుతరం బగుట నయ్యోగంబు పిదప
నలవడ, యోగంబు లాదిగాఁ గఱపి
కలుగు నభ్యాసయోగములెల్ల నేర్పి
యనుపమరాజయోగామృతవార్థి
ననువంద మత్స్యేంద్రుఁ డనువాని దృష్టి
వెరవుతో మరలించు విధ మెఱిఁగించి
తిరముగా వెలుపలఁ దెలుపులు దోఁప
వెలియును లోనును వీక్షించునట్టి
పొలుపు చూపియు ముఖాంబురుహంబు నొప్ప
నెపమున వినిపించి నిగమాదియైన
విపులపదంబున వినుతికి నెక్కు
కోదండగుణము నిక్కువముగాఁ దెలిపి
యాదరం బెసఁగఁ గృతార్థుఁ గావింప
సకలవాదంబులు సకలసన్మణులు
సకలమంత్రంబులు సకలౌషధములు

సకలసంసిద్ధియు సమకొన నొసఁగి
యకలంకచరిత నీ వతులితమహిమ
దీపింప నఖిల సత్సిద్ధుల కెల్ల
నేపార గురుఁడవై యెసఁగుచునుండు"

మనెను. ఇదియెల్ల నాథసంప్రదాయమునకు[240] సారగ్రహణము. రాజయోగము నాథసంప్రదాయమునకు రాజలాంఛనము. అది హఠయోగమూలకము. అమనస్క యోగకీలకము. మత్స్యేంద్రనాథునికి ఉపదేశగురువు శివుడు. చౌరంగినాథునికి, గోరక్షనాథునికి ఉపదేశగురువు మత్స్యేంద్రనాథుడు. మేఘనాదసిద్ధునికి ఉపదేశ గురువు చౌరంగినాథుడు. విరూపాక్షనాథునికి, నాగార్జున సిద్ధునికి, బుద్ధసిద్ధునికి (మంజునాథునికి) ఉపదేశగురువు గోరక్షనాథుడు. ఖణికాఖ్యసిద్ధునికి ఉపదేశ గురువు నాగార్జునసిద్ధుడు. అందఱికి గురువు మత్స్యేంద్రనాథుడు. పరమగురువు ఆదినాథుడు శివుడు. యోగశాస్త్రాభ్యున్నతికి మత్స్యేంద్రనాథుడు నాందీసూత్రధారి. గోరక్షనాథుడు నాంద్యంతసూత్రధారి. రసవాదాభివృద్ధికి నాగార్జుననాథుడు నాయకపాత్రధారి చౌరంగినాథుడు అసలు సారంగధరుడు.

సారంగధరుడు మాళవదేశాధిపతి రాజమహేంద్రుని కుమారుడు. చంద్రశేఖరుని పేరు. రాజమహేంద్రుని రాజధాని మాంధాతపురము. పట్టపుదేవి రత్నాంగి. భోగసతి చిత్రాంగి. సారంగధరుడు వివాహితుడు. భార్య మంగళాంగి. రాజమహేంద్రుడు వేటకు వెళ్లిన సమయమునందు సారంగధరుడు రాకుమారులతో పావురముల పందెమాడును. సారంగధరుని బిరుదుపావురము ఉప్పరమెగసి, చిత్రాంగి ముద్దాడు చిలుక కొంఱకు వ్రాలును. మంత్రి కుమారుడు సుబుద్ధి వారించినను బిరుదుపావురము కొంఱకు చిత్రాంగి లోఁగిలి కేగును. చిత్రాంగి అతని చేయి పట్టుకొని మేడలోనికి తీసికొనిపోవును. సిగ్గువిడిచి మీదపడబోయిన తప్పించుకొని వచ్చు సారంగధరుని వలువలాగి కొనును. వాంఛితార్థము సమకూడని చిత్రాంగి రాజమహేంద్రుడు రాగానే సారంగధరుడు మానభంగము చేసినట్లు చెప్పును. రాజమహేంద్రుడు సభచేసి విచారించును. చిత్రాంగి చూపిన సారంగధరుని వలువ ఆధారముగ సారంగధరుడు కరచరణఖండితుడగును. మత్స్యేంద్రనాథుని వలన కరచరణమండితుడగును. నాథు డగును. మాళవదేశకథ ఆంధ్రదేశమునకు ఆపాదితమైనది.

సారంగధరుని కథ గౌరన కరుణరసపోషణమునకు పరాకాష్ఠ. కరచరణ ఖండితుడైన సారంగధరుడు

"ఆ తీవ్రవేదన నసువు లూఁటాడ

హా తాత హా మాత యనుచు నందంద
భూతలంబునఁ బడి పొరలుఁ బల్మారు"

"బడిబడి పంక్తులై పాఱు చీమలను
దుడువఁ గోసిన గండ్లఁ దోఁగి జుమ్మనుచు
నేఁపి కాల్లాడిన యీఁగలఁ బోవఁ
జోఁపఁ జేతులు లేక సుఖ్ఖన స్రుక్కి
పొరిఁ బొరి రక్తంబు పొలుసుకంపునకు
నరుదెంచు మృగముల నలిగి యదల్పఁ
ద్రాణయు లేకుండి తలవరులార!
ప్రాణంబులుండ నీపాటి మీరైన
నేతెంచి తలఁ ద్రెంపుఁ డే నొప్పి కోర్వ
భూతసంఘములార! పొరిపుచ్చుఁ డింత
నీ నొప్పి కే నోర్వ నెడపక వచ్చి
పూని చంపరె మృగపుంజంబులార!
చాల నేదుఃఖంబు సైరింపఁ జాలఁ
గాలువరే తన్నుఁ గార్చిచ్చులార!"

"తునకలై వడిన చేతులఁ బదంబులను
నలిఁ జూచిమంత్రి నందనుని వాక్యములు
తలపోసి తలయూఁచి తార్కాణమిచ్చి
యొకమరి నవ్వు వేఱొక మరి యేడ్చు
నొకపరిపాడు వేఱొకపరి మూల్గు
నొకపరి గిరిశ! మహోరగాభరణ!

XXX XXX XXX XXX

శరణని యీరీతి సంతాపమందు."

ఇదియెల్ల హృదయవిదారకము. రత్నాంగి పుత్త్రశోకమును కరుణరసనిర్భరము.

గౌరన ప్రత్యేకత అయిన హాస్యరసపోషణమునకు ఆలవాలము వంచక పురోహితుని కథ. పురోహితుని వాలకము, వంచనము, కుప్పిగంతులు, గోవింద బొబ్బలు, పౌరోహిత్యప్రతాపము, శృంగారశూరత్వము సర్వము హాస్యమయము. రాకుమారి కలదని చీకటిలో మందసము చొచ్చి'

"పాఱుండు మన్మథపరవశుండగుచు
నది పెద్ద భల్లూకమను తెల్వి లేక
యుదితేందుముఖి శంకనూఁది చిఱ్ఱునుచుఁ
దలఁ గెదవే యొజ్జతన మూడ్చి మీఁదఁ
గొలువ నొజ్జలతోనె గుటగుట యనుచు
బలిమిఁ బైఁబడక లోఁ బడవు నీ వనుచు
నలుఘారు నెలుఁగును నట వీఁగు దోఁకఁ
బ్రీతిమై రాకుమారితె వేణి యనుచుఁ
జేత బిగ్గరఁ బట్టి చేరఁ దిప్పుటయు
గొటగొట గోంగ్రడించి కోరలోండొరెటిఁ
గటగటఁ దాఁకింప గర్భంబు గలఁగి
హా తాత హా మాత యనుచు మోఁజేతు
లూఁతగా వెనుకకు నొఱిఁగి వెలికిలఁ
బడి పాఱుకొని గుండె బలువిడి నడచి
పడఁగ నెలుంగని బాతళింపఁగను
నత్తఱి విప్రుపై నదరంట నుఱికి
క్రొత్తనెత్తురు లొత్తఁ గ్రొవ్వాడిగోళ్లఁ
జిల్లులు వోవంగ సిరమును నురము
గుల్లల తిత్తిగాఁ గొట్టియు మెడయుఁ
జరణయుగంబు గక్షములు నురంబుఁ
గరములు జిగిబిగిగా నొగిలించి
విడిచె నంతటితోడ విటశిఖామణికి
నడఁగెఁ దొల్లిటి విషయవ్యథలెల్ల"పుటలు 197-198

గౌరన నవనాథచరిత్ర శ్రీగిరి పద్యకావ్యానుసరణమైనను విశిష్టమైన ద్విపద కావ్యము.

**కొలని గణపతి దేవుడు** : ఈతని కృతులు మనోబోధము, శివయోగ సారము లభించినవి. శివయోగసారము పీఠిక యందు ఇట్లు కలదు.

"పశుపాశపతిజ్ఞానము
ను శరీరభవవిజయము మనోబోధము నా
విశదములగు నీకృతు లస
దృశగతిఁ జెప్పితిని దేశితెనుఁగునఁ దెలియన్ 91

మఱియును శివపరములయై
నెఱయఁ గృతుల నాటకముల నేర్పు జనులం

దఱునౌనౌనని పొగడఁ గఁ
గఱకంతుని కరుణ రచన కావించితిలన్" 92.

పశుపాశపతిజ్ఞానమన పశుపాశపశుపతిజ్ఞానము. శరీరభవవిజయమన మన్మథ విజయము. శరీరభవవిజయము, శివపరమైన ఇతరకృతులు, నాటకములు లభింపలేదు. నాటకములు దేశినాటకములగును. అట్టి నాటకముల విషయము పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందు కలదు. "సాంగభాషాంగక్రియాంగ పటునాటకంబుల నటియించువారు." (1235-36పం.4ఆ.)

## కాలము

కొలని గణపతిదేవుడు కొలని రుద్రదేవుని తమ్ముని మనుమడు ఆదిమూలుని కుమారుడు[241]. కొలని రుద్రదేవుడు శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు కృతిభర్త అయిన బెండపూడి అన్నయామాత్యుని తాత అన్నమంత్రికి అరేడుగ్రామమును అగ్రహారముగ ఇచ్చినట్లు భీమేశ్వరపురాణమునందు కలదు. (50ప.1ఆ.) కాఁబట్టి కొలని రుద్రదేవుడు, అన్నమంత్రి సమకాలికులు, అందువలన కొలని రుద్రదేవుని తమ్ముని మనుమడు ఆదిమూలుడు, అన్నమంత్రి మనుమడు బెండపూడి అన్నయామాత్యుడు సమకాలికులు అగుదురు. బెండపూడి అన్నయామాత్యుడు భీమేశ్వరపురాణమునకు 1430ప్రాంతమునందు కృతిభర్త. అతని సమకాలికుడగు ఆదిమూలుని కుమారుడు కొలని గణపతి దేవుడు 1430 తర్వాత కృతికర్త కాఁగలడు. కాఁబట్టి కొలని గణపతి దేవుని పశుపాశపతిజ్ఞానము రచనాకాలము స్థూలముగ 1440వ సంవత్సరము, మనోబోధము రచనాకాలము స్థూలముగ 1445వ సంవత్సరము, శివయోగసారము, రచనాకాలము స్థూలముగ 1450వ సంవత్సరము కావలయును.

## మనోబోధము

ఇది వేదాంతగ్రంథము. మంజరీద్విపదప్రబంధము. రెండువందల ముప్పది ద్విపదలు కలవు. వేదాంతగ్రంథమైనను వేమనపై ప్రభావము నెఱపిన గ్రంథము. కాఁబట్టి సమీక్ష సాపేక్ష్యము.

మనోబోధము కేవలము శివభక్తిప్రబోధకము కాదు. శివయోగప్రబోధకము.

"పద్మాసనంబున బైశిక వెట్టి
వీఁపును విఱుచుచు వీఁగి నిక్కుచును
వాయువుల్ వట్టుచు వదలంగఁ జేయు

చుండుట యోగమే? యుండఁ గోరెదవు
శివుతోడఁ గూడక శివయోగి యగునె?" 343-347పం.

ఇట్టి విమర్శయే వేమనపద్యములలోని యోగాభ్యాసవిమర్శ. అంతేకాదు. మనోబోధమునందు స్త్రీవైముఖ్యము కలదు.

"ముక్తి కామిని యుండ మూర్ఖువై కోరి
మాయంపుఁ దరుణుల మఱుఁ గనేమిటికి" 184-185పం.
"పొలఁ తుల మొదలుగాఁ బొందుట మాని
పొలుపార శివభక్తి పొందు మెంతయును" 229-230పం.

ఇదే తాత్పర్యము వేమన స్త్రీనిందపద్యముల తాత్పర్యము. ఇంకను మనోబోధములోని భావములు వేమనపద్యములందు కలవు.

"ఆవులు పలుచాయలై యుండుఁ గాక
పాలు నా చాయలై పరఁ గునే చెపుమ
జాతులు పెక్కని చాటిన నేమి?
జీవుఁ డొక్కఁ డె కాదె చిక్కు లింకేల?" 388-391పం.
"కనఁగ సొమ్ము లెన్నె కనకంబు నొకటి
పసుల వన్నె లెన్నె పాలు నొకటి
పుష్పజాతు లెన్నె పూజ యొక్కటి సుమీ
విశ్వదాభిరామ వినుర వేమ
ఇవియెల్ల నాథసంప్రదాయసరణులు.

## శివయోగసారము

ఇది నాథసంప్రదాయమునకు చెందిన యెగశాస్త్రగ్రంథము. శాస్త్రవాఙ్మయచరిత్రకు విషయమైనను నాథసంప్రదాయమును బట్టి సాహిత్యచరిత్రకును సాపేక్ష్యము. అంతేకాదు. శివయోగసారములోని అవతారిక, కాకతీయుల నాటి ఆంధ్రదేశచరిత్రకు కంచుటద్దము. శివయోగసారము కొలను గణపతిదేవుని మేనమఱది, గురువును అయిన ఈడూరి నూకనారాధ్యునికి అంకితము.

శివయోగసారమునందు మత్స్యేంద్రాసనము, గోరక్షాసనము, జాలంధరబంధముల లక్షణములు కలవు. మత్స్యేంద్రాసనము మత్స్యేంద్రనాథుని సృష్టి గోరక్షాసనము గోరక్షనాథుని సృష్టి జాలంధరబంధము జాలంధరనాథుని సృష్టి జాలంధరబంధము శాంభవీముద్ర. హఠయోగ, రాజయోగ, అమనస్కయోగలక్షణ

ములును శివయోగసారమునందు కలవు. అవి నాథసంప్రదాయయోగములు. అతి వర్ణాశ్రమిలక్షణములును కలవు[242]. (54-74ప.4ఆ.)

"అతివర్ణాశ్రమి యగు వి
శ్రుతచరితుఁడు గురువులకు గురుఁడు లోకమునం
దతనికి సముఁడధికుఁడు నగు
నతఁడును లేఁడెందు సంశయము లేదు హరీ! 54

xxx xxx xxx

"ఆత్మావలోకనంబు వలన నెవ్వరికి వర్ణాశ్రమాచారభేదంబులు గళితంబులగు నతండు సర్వవర్ణాశ్రమంబులు నతిక్రమించి యాత్మ యందు సుస్థితుఁడై యతివర్ణాశ్రమి యని వేదాంతార్థవిదులచేతఁ జెప్పఁబడు. వెండియు దేహేంద్రియప్రాణమనోబుద్ధిచిత్తాహంకార మాయలను వ్యోమాదిజగజ్జాలంబును గర్తయు, భోక్తయు, భోజియు నింతయుఁ గాననుచు యథార్థంబునఁ గేవలంబైన చిత్స దానందబ్రహ్మం బే నౌదునని యెఱుంగు నెవ్వం డతం డతివర్ణాశ్రమియనం దగు ... " 61వచ.4ఆ.

ఇది విశ్వగురువైన శివుడు, విష్ణువును తత్త్వజ్ఞానిని చేయదలచి చెప్పిన విష యము. వర్ణాశ్రమాచారభేదములు లేనివాడు అతివర్ణాశ్రమి అని శబ్దార్థము. వర్ణభే దరాహిత్యము, గృహస్థాశ్రమరాహిత్యము, పై వేదాంతశాస్త్రమార్గము, నాథసంప్ర దాయమునందు కలవు. కాఁబట్టి శివయోగసారము నాథసంప్రదాయమునకు చెందిన యోగశాస్త్రగ్రంథము.

**వేమన**: వేమన పదునేడవశతాబ్దివాడని పూర్వపక్షము[243]. కాని పదునైద వశతాబ్దికవి. పదునాఱవశతాబ్ది ఎడపాటి ఎఱ్ఱన పూర్వకవిస్తుతిలోని "వేము"డు వేమన కాడనుట విపరీతము. ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రమునందు వేమన ప్రభావము కలదు[244]. అది వేమన పదప్రయోగ, పద్యరచనావిధాన, తత్త్వప్రతి పాదనముల ప్రతిఫలనము.

"సురభి పొదుగున దుగ్ధముల్ దొరుకుఁగాక
తవిలియున్నె యజాగళస్తనము లొడియ
నీశ్వరేశ్వరు కృపఁ గోర్కు లెసఁగుఁగాని
యితరకృత్యంబులందెల్ల నేల కలుగు?"

అజాగళస్తనములవంటి అన్యకృత్యములు వేమన నిరసించిన విగ్రహారా

ధనము, తీర్థయాత్రాదికమును. పదునాఱవశతాబ్ది పూర్వార్థములోని తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల నీతిశతకమునందును వేమన ప్రభావము కలదు[245]

"పదుగు రాడిన మాట పాటియై ధరఁ జెల్లు
నొక్క డాడిన మాట యెక్క దెందు"
"కాశికిఁ బోవచ్చుఁ గ్రమ్మఱ రావచ్చుఁ
దెలిసి సుషుమ్న భేదింపరాదు."

ఇందు పెదతిరుమలాచార్యుల "పదుగురాడిన" అను సీసపాదములు వేమన ఆటవెలదిపాదములగుట కంటె, వేమన ఆటవెలదిపాదములు పెదతిరుమలాచార్యుల సీసపాదములగుట సహజము. అంతేకాదు. వైష్ణవుడైన పెదతిరుమలాచార్యులు "కాశికిఁ బోవచ్చు", "సుషుమ్న భేదింపరాదు" అనుట గమనించిన వేమన ప్రభావమే అని స్వయంవేద్యమగును. అదే కాలములోని హరిభటు వరాహ పురాణమునందు ప్రసిద్ధమైన వేమన పద్యమునకు అనుకరణము కలదు[246].

"లోభివానిఁ జంపలోకంబులోపల
మందు మాకు వలదు మాట గలదు(చాలు)
పైక మడిగినంత భగ్గునఁ బడి చచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ"
"ఘనతరకష్టలోభిఁ దమకంబునఁ జంపెడు సంత యల్కఁ నె
మ్మనమునఁ బుట్టెనేని విషమారణకర్మకృపాణముఖ్యసా
ధనములు గూర్పనేల? ప్రమదంబున డగ్గఱి కాసువీస మి
మ్మనుటయె చాలు వాని నిమిషార్ధమునన్
మృతిఁ బొందఁ జేయఁ గన్." 184ప.5ఆ.

ఇది హరిభట్టు "లోభాధారులకు నర్థివాక్యము మారణమంత్రంబు గాదె మహి నూహింపన్" అని (183ప.5ఆ.) ప్రకరణోచితముగ రచించిన పద్యము తరువాతి పద్యము. పునరుక్తభూతము. కారణము వేమన పద్యప్రభావమే. పదునైదవశతాబ్ది ఉత్తరార్థము తుది కవి అయిన కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశికయందును. వేమన ప్రభావము కలదు[247]. అందు వేమన పద్యరచనాపద్ధతి అత్యధికము. అంతేకాదు. వేమన పద్యమే అలతిమార్పున సింహాసనద్వాత్రింశికయందు కలదు.

"కపు ఎరంపుఁ బాది కస్తూరి యెరువులో
నుల్లి నాటి చందనోదకంబు
పోసి పెంప కంపువోనట్లు ఖలుడురా
విశ్వదాభిరామ వినుర వేమ"

"కపు ప్రరంపుఁ గుదుటఁ గస్తూరి యెరువుతో
నుల్లి నాటి చందనోదకములఁ
బెంపిరేని దాని కంపు మాయని భంగి
నెంతయైన నిలువ దింతి మనము-" 98ప.1ఆ.

వేమన పద్యములందు గజపతి ప్రసక్తి కలదు[248].

"అధముఁడైన మనుజుఁ డర్థవంతుండైన
నతని మాట నడచు నవనిలోన
గజపతింటు నెన్న గవ్వలు చెల్లవా
విశ్వదాభిరామ వినుర వేమ"
"చచ్చిపడిన పశువు చర్మంబుఁ గండల
బట్టి పెఱికి తినును పరగ గ్రద్ద
గ్రద్దవంటివాఁడు గజపతి కాఁడొకో
విశ్వదాభిరామ వినుర వేమ"

ఇందు "గజపతింటు నెన్న" అను పాఠమునకు "గణకు లొప్పియున్న"అను పాఠాంతరము కలదు. అదే వేమన పాఠమినను, "గజపతింటునెన్న" అను పాఠాంతరమైనను గజపతులకాలమునందే పుట్టును. అంతేకాదు. "గజపతి కాఁడొకో" అను పాఠమునకు మఱి పాఠాంతరము లేదు. ఆ పద్యము వేమన పద్యమునకు అనుకరణమనినను, అది గజపతుల కాలమునందే పుట్టవలయును. "చచ్చిపడిన పశువు చర్మంబుఁ గండలఁ బట్టి పెఱికి తినుగ్రద్ద" అనిపించు గజపతి లేకపోలేదు. అతడు బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోయిన కవిసార్వభౌముని శిక్షించిన గాణదేవుని అధిపతి కపిలేంద్రగజపతి. ఆంధ్రదేశమునందు మాత్రమేగాక, ఉత్కళదేశమునందును గజపతుల పరిపాలనము 1538వ సంవత్సరమునందే ముగిసినది[249]. విజయనగరసంస్థానాధిపతులు పూసపాటిరాజులకు గజపతివ్యవహారము 1794 వ సంవత్సరము తర్వాత గాని ప్రసిద్ధము కాదు[250]. శ్రీనాథుని అవసానకాలము 1450ప్రాంతము. కాఁబట్టీ పై పద్యము రచనాకాలము 1450 తదనంతరము 1538 పూర్వము నగుట తథ్యము.

వేమన పద్యములందు మిరపగింజ ప్రశంస కలదు[251].

"మిరపగింజ చూడ మీఁద నల్లఁగనుండు
కొరికి చూడ లోన చురుకుమనును
సజ్జనులగు వారి సార మిట్టుల నుండు
విశ్వదాభిరామ వినుర వేమ"

మీద నల్లగనుండు మిరపగింజ మిరపకాయగింజ కాదు. మిరియపుగింజ. మిరపకాయ వాస్కోడిగామా వలన దక్షిణ అమెరికాలోని ఛిల్లీదేశమునుండి 1498-1502ప్రాంతమున దిగుమతి అయినది[252]. అంతకు పూర్వము మిరియపుగింజయే కాని, మిరపకాయగింజ అను అర్థమున మిరపగింజ లేదు. మిరపకాయగింజ అను అర్థమున గాక, మిరియపుగింజ అను అర్థమున మిరపగింజ అని ప్రయోగించిన వేమన పద్యము మిరపకాయగింజలేని కాలములోనిది కావలయును. పోర్చుగీసువారే ప్రవేశపెట్టిన బాతులు శ్రీకృష్ణదేవరాయల కాలమునందే-అందును ఆముక్తమాల్యదరచనాకాలమునందే (1524) వరిచేలలోని కాలువల నడిమి ప్రదేశమునకు చేరినవి. (65ప.1ఆ.) అట్లు మిరపకాయలును ఆ కాలమునందే అంగడిలోనికి వచ్చుట, అంగుటిలోనికి పోవుట సంభవము. పోర్చుగీసువారి వ్యాపారము పదునాఱవశతాబ్ది ప్రారంభమునుండి విజయనగరసామ్రాజ్యమునందు విరివిగ సాగినది[253]. కా॥ బట్టి ఈ పద్యము రచనాకాలము పదునాఱవశతాబ్ది పూర్వార్థము కంటె పూర్వము కావలయును.

ఇవిగాక వేమన ప్రభావము పదునాఱవశతాబ్ది పూర్వార్థములోని ఎడపాటి ఎఱ్ఱన, తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, హరిభట్టు కృతులందు మాత్రమేగాక, పదునేడవశతాబ్ది ఉత్తరార్థము తుది కవి కొఱవిగోపరాజు సింహాసన ద్వాత్రింశికయందును కలదుగావున, వేమన పదునైదవశతాబ్ది ఉత్తరార్థము తొలి కవి.

వేమన కవియే కాదు; యోగి, శివయోగి, రాజయోగి, అవధూతయోగి, ఒక్క మాటలో నాథయోగి. వేమన తత్త్వము నాథసంప్రదాయము[254] మతమౌఢ్య నిరసనము, కులభేదనిరాకరణము, విగ్రహారాధనవిగర్హణము, తీర్థస్నానవిమర్శనము, ఉపవాసనోల్లుంఠనము, జీవహింసాసమ్మార్జనము, సంసారసౌఖ్యఖండనము, సచ్చిదానందజ్యోతిర్మండనము, నాదానుసంధానము, మంత్రలయహఠరాజయోగభేదనాడీసాధనము, రసవాదసమాదరము, శూన్యవాదపురస్కారము, శూన్యసాధనోపస్కారము, యోగమార్గశివధ్యానము, శివశక్త్యభేదము, శివజీవాభేదము, శివజీవసమరసకరణము, బహిరంతస్సమదర్శనము, శివరూపబ్రహ్మము, శివమార్గమోక్షము, మర్మకవిత్వము, నీతికవిత్వము, స్త్రీనింద మొదలైనవి నాథసంప్రదాయవిషయములు[255]. అవే "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటము కల వేమన ఆటవెలది పద్యములందు కలవు. "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటమే నాథసంప్రదాయమునకు చిహ్నపతాక.

నాథసంప్రదాయము ఆంధ్రదేశమునందు పదమూడవశతాబ్దినుండి అభ్యుదయపరంపరాభివృద్ధి నందినది. 1245వ సంవత్సరము నాటి నెల్లూరు జిల్లా

ఉదయగిరితాలుకా ఉదయగిరిశాసనమునందు "రసాయన, పదాంజన, ఘుటిక, కన్యకావాద, మంత్రవాద, ధూమ్రవాద, రసవాద, గారుడవాదవిద్యలు" ప్రచారము పొందినట్లు కలదు. అంతేకాదు. సిద్ధవ్యాళి, నాగార్జున, సిద్ధబుద్ధుల నామములు కలవు. 1314 వ సంవత్సరము నాటి కడపజిల్లా రాజంపేట తాలూకా టంగుటూరిశాసనమునందు "శ్రీసిద్ధనా[థ] దేవర"ప్రసక్తి కలదు. 1342వ సంవత్సరము నాటి కర్నూలు జిల్లా మలకాపురము తాలూకా త్రిపురాంతకశాసనమునమునందు ఒక గోంకరాజునకు "అవధూతమండలీకగోరక్షు"డను బిరుదము కలదు. 1382 వ సంవత్సరమునాటి కడపజిల్లా కమలాపురము తాలూకా చిలకమఱ్ఱుశాసనమునందు "సిద్ధనాంథదేవర"ప్రసక్తి కలదు. కాలమానము లేని కృష్ణాజిల్లా బందరుతాలూకా శ్రీకాకుళశాసనమునందు ఒక మహామండలేశ్వరుడు జగదేవరాజులు "శ్రీసిద్ధనాథ దేవదివ్యశ్రీపాదపద్మారాధకు"డని కలదు. 1405వ సంవత్సరము నాటి రెండవ హరిహరరాయలశాసనమునందు అతడు "సిద్ధసారస్వత .... కర్ణావతంసుం" డని కలదు. "సిద్ధసారస్వతమంత్రము అసంఖ్యాకమైన సిద్ధమంత్రములలో ఒకటి."

పదమూడవశతాబ్ది పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రములోని "హఠయోగరాజయోగాదివిభ్రాంతిఁ బటువగు పశుయోగబంధంబు లేమి నవిరత నిరతిశయానందహేతువవు నిత్యశివయోగివివశాత్ములు" (327-8పు.5ప్ర.) నాథసంప్రదాయశివయోగులు. పదునాల్గవశతాబ్ది నిత్యనాథుని రసరత్నాకరమునందు శ్రీశైలములోని రసాయనశాస్త్రప్రయోగశాలయందు రసవాదప్రయోగములు చేసినట్లు కలదు. అదే శతాబ్ది ఎఱ్ఱన హరివంశములోని "యోగిసన్నద్ధానందసమాధిగుహలు" (161-164ప.5ఆ.ఉ.భా.) శ్రీశైలములోనివే అగును. శ్రీకృష్ణుని యోగనిష్ఠ (163-164 ప.5ఆ.ఉ.భా.)నాథయోగనిష్ఠ శ్రీకృష్ణుడు వేసినది స్వస్తికాసనము. చేసినది యోగాభ్యాసము. నిలిపినది ఏకాగ్రత. కొలిపినది షడ్గ్రంథిభేదనము. తాల్చినది జాలంధరబంధము. అది శాంభవీముద్ర. పొందినది ఆనందసమాధి. శ్రీగిరి నవనాథచరిత్ర నాథసంప్రదాయపద్యకావ్యము. శ్రీనాథుని శృంగారనైషధములోని యోగీంద్రుల స్త్రీనింద (79ప.7ఆ.) నాథయోగీంద్రుల స్త్రీనిందయే. అది నాథుడైన భర్తృహరి స్త్రీనిందకు (16శ్లో.3శ) సహోదరము. శ్రీనాథుడు చింతామణీమంత్రము "సిద్ధసారస్వతసంసిద్ధికారణ"మనుట (19వచ.6ఆ.) సిద్ధసారస్వతమంత్రప్రభావము. హరవిలాసమునందు "ఏదేవిఁ గొల్చి మత్స్యేంద్రనాథాదులు యోగసంసిద్ధికి నొడయులైరి యమ్మహాదేవి కామాక్షి" (3ప.1ఆ.) అని శ్రీనాథుని ఇష్టదేవతాస్తుతి. పదునైదవశతాబ్ది శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని బ్రహ్మజ్ఞానము (159-194 ప.5ఆ.) నాథసంప్రదాయసనాథము. "సద్గురునాథోపదిష్టసరణి" అను ప్రయోగములోని (185ప.5ఆ.) నాథశబ్దము అర్థవంతము. కాశీఖండమునందు శ్రీనాథుని

కంటికి శ్రీశైలము "రససిద్ధరసాయనసిద్ధమూలికాసిద్ధిపాదుకాసిద్ధ్యాదులగు సిద్ధక్షేత్రంబులతోను శోభితంబు." (51వ..3ఆ.) జాలంధరబంధము సంస్కృతాంధ్రకాశీఖండములందు కలదు. (149-150,180శ్లో.41అ; 240ప.241వచ.5ఆ.) సతీదేవి సర్వేశ్వరస్తోత్రములోని యోగిబృందారకులు (74దం.7అ.) నాథయోగిబృందారకులు. జక్కన విక్రమార్కచరిత్రమునందు విక్రమార్కుని పేరోలగమునకు విచ్చేసిన సిద్ధుడు నవనాథసిద్ధులకు ఐక్యమూర్తి (4ప.6ఆ.) నవనాథుల తోపాటు నాథిని కూడ కలదు. (14-21ప.7ఆ.) సిద్ధసారస్వతమంత్రమును కలదు. (163వచ.7ఆ.) అంతే కాదు ఉజ్జయినిలోని కాళికాలయము "ప్రసిద్ధసిద్ధజనకథితనవనాథచరిత్రప్రవర్ధనప్రమోదహృదయ సామాజికవిరాజమానమణిమండపములు" కలది. (51వచ.2ఆ.) అనంతామాత్యుని భోజరాజీయమునందు దత్తాత్రేయుడు మహాని కుష్ఠవ్యాధి నిర్మూలించుట (8S-139ప.1ఆ.), సర్పటి అను సిద్ధుడు పంచలోహమయమైన భోజరాజు కొలువుకూటమును సువర్ణమయము చేయుట. (87వచ.1ఆ;113వచ.2ఆ.) నాథసంప్రదాయసరణులే. పావకలోముని మ్రోల నిలిచిన సిద్ధవనిత నాథినియే. (164ప.5ఆ.) గౌరన నవనాథచరిత్ర "ప్రసిద్ధి పెంపలర" రచించిన ద్విపదకావ్యము. శ్రీశైలభిక్షావృత్తిమఠము సిద్ధమఠము. కొలను గణపతి దేవుని శివయోగసారము నాథసంప్రదాయయోగశాస్త్రగ్రంథము.

ఇది యెల్ల నాథయోగి వేమన అవతరణమునకు చారిత్రికనైపథ్యము[256].

వేమన పద్యములు వేలకొలది వెలసినవి. ఆటవెలదులు మాత్రమేగాక తేటగీతులు, కందములు, సీసములు, వృత్తములు, గేయములును కలవు. "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటముగాక విభిన్నములైన మకుటములు కలవు. అవి యెల్ల వేమన పద్యములు అనిపించవు. కాలక్రమసంక్రాంతములు కావలసినన్ని కలవు. "విశ్వదాభిరామ వినుర వేమ" మకుటము కల అన్ని పద్యములును వేమన పద్యములు కాఁజాలవు. వేమన ఆటవెలది పద్యరచనాపద్ధతి విశిష్టమైనది. అది[257] :

> "దీనిలో (ఆటవెలదిలో) ఇతఁడు (వేమన) యతి కిచ్చిన మర్యాద, అందము, అద్భుతమైనది ........ ఎక్కడికి యతి యుండ వలయునో యక్కడికి పదమే కాదు, అభిప్రాయమును తెగిని లుచును. వెంటనే ఆద్యక్షరావృత్తియు తడువుకో నక్కరలేక సిద్ధముగా దాఁపురించును. లేదా ప్రాసము సిద్ధము. ...... ఇతని (వేమన) భావము లెట్లు కృత్రిమములు కానివో, యితని భాషయు నట్లే. ఇదే నిజమైన యచ్చ తెనుఁగు"

ఇట్టి రచనాపద్ధతి కల, "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటము కల ఆటవెలది పద్యములే వేమన పద్యములగును. వేమన పద్యములకు అనేక ముద్రణములు కలవు. ఉన్నంతలో ప్రథమ, ద్వితీయముద్రణములే ప్రామాణికములు. అవి కూడ ప్రక్షిప్తమయములు. అపరిష్కృతములు. ముడి వజ్రములు సానపట్టవలసినవి. ఆత్మాశ్రయలక్షణలక్షితముగ గాక వస్త్వాశ్రయలక్షణలక్షితముగ సుపరిష్కృతమైన సంశోధితముద్రణము వేమన పద్యములకు సాపేక్ష్యము.

## నీతిపద్యములు

"ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?
భాండశుద్ధిలేని పాకమేల?
చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా?
విశ్వదాభిరామ వినుర వేమ"

ఆచారము, పాకము, శివపూజ వలదని అర్థము కాదు. ఆచారమునకు ఆత్మశుద్ధి, పాకమునకు పాత్రశుద్ధి, శివపూజకు చిత్తశుద్ధి వలయునని తాత్పర్యము.

"వేరు పురుగు చేరి వృక్షంబుఁ జెఱచును
చీడపురుగు చేరి చెట్టుఁ జెఱచు
కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱచురా." విశ్వ.
"చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలు సేసి పొమ్మనుటే చాలు"[258]. విశ్వ.
"అనఁగ ననఁగ రాగ మతిశయించుచునుండుఁ
దినఁగఁ దినఁగ వేము తియ్యనుండు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన" విశ్వ.

## లోకరీతిపద్యములు

"ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండుఁ
జూడఁ జూడ రుచుల జాడ వేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా". విశ్వ.
"మేడిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడఁ బురుగు లుండు
బెఱుకు వాని మనసు బింక మీ లాగురా" విశ్వ.
"కుక్క గోవు గాదు కుందేలు పులి గాదు

దోమ గజము గాదు దొడ్డదైన
లోభి దాత గాఁడు లోకంబులోపల".విశ్వ.
"కరక కాయలు తిని కాషాయవస్త్రముల్
బోడినెత్తి గలిగి బొరయుచుండ్రు
తలలు బోడులైన తలఁపులు బోడులా". విశ్వ

## హాస్యహేతి పద్యములు

"పాలసాగరమునఁ బవ్వళించినవాఁడు
గొల్లయిండ్లఁ బాలు గోరనేల?
ఎదుటివారి సొమ్ము లెల్లవారికిఁ దీపి" విశ్వ.
"గుహలలోనఁ జొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగ మొకండు దారసిలిన
ముక్తిమార్గమదియె ముందుగాఁ జూపురా"విశ్వ.
"గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ గొంపోయిన
పండ్లు రాలఁ దన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా"విశ్వ.
సకలతీర్థములను సకలయజ్ఞములను
తలలు గొరుగ కున్న ఫలము లేదు
మంత్రజలము కన్న మంగలి జలమెచ్చు".విశ్వ.

## విమర్శనకళపద్యములు

"మతము లెన్నియైన సతముగా నుండవు
సతముగాను నుండు జగతి నొకటి
యంత మదము విడిచి యా బ్రహ్మ మరయుట". విశ్వ
"మాలవాని నేల మహిమీఁద నిందింప
నొడల రక్తమాంస మొకటిగాదె
వానిలోన మెలగువాని కులంబేది ".విశ్వ
"రాతిబొమ్మ కేల రంగైన వలువలు
గుళ్లు గోపురములుఁ గుంభములును
కూడుఁ గూడ్డఁ దాను గోరునా దేవుఁడు"విశ్వ.
"అడవిఁ దిరుగ లేదు ఆకసమున లేదు
అవనిఁ దీర్థయాత్రలందు లేదు.
ఒడలు శుద్ధి చేసి యొడయనిఁ జూడరా."విశ్వ.

"కాంత మేనుఁ జూచి కళవళపడుదురు
కడుపులోని రోతఁ గానలేరు
ఇంత రోతబ్రతుకు ఈ దేహ మేలరా?"విశ్వ.
"జీవుఁ జంపు టెల్ల శివభక్తి దప్పుఏట
జీవు నరసిచూడ శివుఁడు గాఁడె?
జీవుఁడు శివుఁడనుచు సిద్ధంబు దెలియరో."విశ్వ.

## శివతత్త్వపద్యములు

"పాల నీరు క్రమము పరఁగ హంసయెఱుంగు
నీరు పాల క్రమము నెమలి కేల?
అజ్ఞుఁడైనవాఁడు నల శివునెఱుఁగునా?"విశ్వ.
"ఆత్మలోన శివుని ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుఁడౌను సర్వంబు దానౌను."విశ్వ.
"శివుఁడు బ్రహ్మమనుచు స్మృతులెల్లఁ బలుకంగ
పరులఁ గొల్చు నెట్లు బ్రాహ్మణుండు
హరుని భక్తజనుల నగ్రజు లనరాదె"విశ్వ.

## శివయోగి పద్యములు

"జాతి మతము విడిచి చని యోగిగా మేలు
జాతితోనె యున్న నీతు లేల?
మతముఁ బట్టి జాతి మానకుంటు కొఱంత."విశ్వ.
"మనసులోని శివుని మానుగాఁ దెలిసిన
యోగియంధ్రు వాని నుర్విజనులు
నీవు నిన్నెఱుంగ నీవెపో శివుఁడవు."విశ్వ
"అమలమైన పలుకు లభిషేకవారిధి
తనువు దేవళంబుఁ దాల్మినొసిది
యాత్మ శివునిఁ జేర్చు నాతఁడె శివయోగి"విశ్వ.

## లోను, వెలిపద్యములు

"లోను జూడఁ జూడ లోకాభిరామంబు
బయలుఁ జూడఁ జూడ బంధనంబు

తన్నుఁ జూడఁ జూడఁ దారకబ్రహ్మంబు"విశ్వ.
"లోను బయలుఁ జేసి లోకంబు దెగటార్చి
కులముఁ గాలఁ బెట్టి గుణము వదలి
చింతలోని చింతఁ జేసిన యోగిరా"విశ్వ.

## నాదానుసంధాన పద్యములు

"ఆత్మలోని నాద మాలించి యాలించి
యాశలందుఁ జిక్కఁ డాది యోగి
యాత్మలోని కళల నంటునా తత్త్వంబు."విశ్వ.
"నాదబిందుకళల నయమొంది యాత్మయం
దంటు చపల చిత్త మమర నిల్పి
బ్రహ్మరంధ్రమునకు బ్రబలిన యోగిరా."విశ్వ.
"నాదబిందువులను నాదంబుగాఁ జేసి
నాదబిందుకళల నాదముగను
జేసి నాద మరసి చింతింప యోగంబు". విశ్వ.

## రాజయోగిపద్యములు

"ఖేచరి యను ముద్రకీలెఱఁ దెలిసియు
వాదులాడకుండు వారలెల్ల
మాయఁ గెల్చువారు మఱి గెల్వవచ్చునా"విశ్వ
"మఠములోన నున్న మహిమలన్నియుఁ గోసి
ఘటములోన నున్న ఘనునిఁ దెలిసి
ఘనత నిల్పువాఁడు ఘనతరయోగిరా."విశ్వ.
"తాను నింద్రియములఁ దనర జయించిన
తత్త్వ మరసి చూడఁ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచునుండు"విశ్వ.

## రసవాదపద్యములు:

"హేమకారవిద్య నెఱిఁగిన వారెల్ల
వెతలఁ బడని యట్లు విద్య చేత
తత్త్వ మెఱుఁగు వెనుక తనకుఁ జింతేలరా"విశ్వ.
"పేరుముడియకాయ పెనువేపయు గుడంబు

జోడు గూడి రసము సోకెనేని
ఇంపు సొంపు మీఱు హేమంబ యౌనురా." విశ్వ.
"ఇహమున సుఖియింప హేమకారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మ విద్య
కడమ విద్యలెల్లఁ గన నిష్ఫలంబులే" విశ్వ.

ఇవి అర్థరహితములని తొలగింపవలయునని ఒక అభిప్రాయము కలదు[259]. వేమన రసవాదపద్యములు అర్థరహితములో, అర్థసహితములో తేల్చవలసినది విజ్ఞానశాస్త్రవేత్తలు. అర్థరహితములని తేలినను ప్రాచీనకాలమునందు ప్రఖ్యాతములు. ప్రత్యాఖ్యాతములు కావు. అనేకగ్రంథములు కలవు. అందు "రసరత్నాకరము" పేర రెండు రసవాదగ్రంథములు కలవు. ఒకటి నాగార్జునకృతముగ కలదు[260]. మఱొకటి నిత్యనాథకృతముగ కలదు. నాగార్జునుడు రసవాద సారశాస్త్రములు రచించినట్లు గౌరన నవనాథచరిత్రయందు కలదు.

"అటఁ బెంపు మీఱు నాగార్జుననాథుఁ
డిటునటు ననక మహీమండలంబుఁ
గలయఁ జరించి యొక్కనిఁ దనపేర
వెలయ సిద్ధునిఁ జేసి వివిధౌషధముల
మణిమంత్రయోగాదిమర్మకర్మలను
నణిమాదిసిద్ధుల నాత్మప్రణీత
రసవాదసారశాస్త్రంబులఁ దెలిపి"

"భారతీయభావమైన రసాయనప్రస్థానములోని వైద్య, రసాయనశాస్త్రములు యోగశాస్త్రముగ రూపాంతరము చెంది" నట్లు నాథసంప్రదాయజ్ఞుల అభిప్రాయము[261]. ఎవరికివారు స్వీయాభిప్రాయానుసారముగ తొలగించుట చేసిన వేమన పద్యముల వెరశి హుళక్కి అగును.

## మర్మకవిత్వము

"బ్రహ్మఁ జంపి విష్ణుభాగంబులోఁ గల్పి
విష్ణుఁ జంపి శివుని వెలయఁ గలిపి
శివునిఁ జంపి తాను శివయోగి కావలె." విశ్వ.

ఇటు బ్రహ్మ అన బ్రహ్మగ్రంథి. విష్ణువన విష్ణుగ్రంథి. శివుడన రుద్రగ్రంథి. ప్రాణము బ్రహ్మరంధ్రము చేరుటకు మొదట హృదయమునందలి బ్రహ్మగ్రంథిని, పిదప కంఠము నందలి విష్ణుగ్రంథిని, ఆమీద భ్రుకుటియందలి రుద్రగ్రంథిని

భేదింపవలయును. అట్లు భేదించి, ప్రాణమును బ్రహ్మరంధ్రము చేర్చు శివయోగి కావలయునని వేమన తాత్పర్యము[262].

## ప్రతీక కవిత్వము

"హయము గురువు గాద? యఖిలంబు తాఁ గాద?
యనుభవింపరాద హరుని గూర్చి?
హరునిఁ దలఁప నింత యంధకారంబేల?" విశ్వ.
"హయము సున్నముఁ దిన నతిశయంబై యుండు
కల్ప మేలఁ గల్గు కారణమున
హయము సున్నముఁ దిన నంధకారం బుడ్గు." విశ్వ.

ఇందు హయము ప్రతీక. ప్రతీక అనగా సంకేతము. ఒకటి చెప్ప మఱొకటి. ఒక విధముగ ఉపమేయము లేని ఉపమానము. సాదృశ్యము, సాధర్మ్యము గర్భితముగ ఉండును. హయధర్మము వేగము. మనోధర్మము కూడ వేగము. కనుక హయము మనస్సునకు ప్రతీక. హయము వాహకుని యానమార్గమున గమ్యస్థానము చేర్చును. మనస్సు సాధకుని యోగమార్గమున ధ్యేయస్థానము చేర్చును. గురువుకూడ శిష్యుని యోగమార్గమున ధ్యేయస్థానము చేర్చును. కావున మనస్సు గురువు కాఁ గలదు. "హయము గురువు కాద?" అనగా మనస్సు గురువు అగునని తాత్పర్యము. అఖిలమన సమస్తము. సమస్తము సుఖదుఃఖమయము. సుఖదుఃఖమయమగునది మనస్సు. కాఁబట్టి సుఖదుఃఖమయమైన సమస్తము మనస్సు కాఁ గలదు. "అఖిలంబు తాఁ గాద?" అనగా మనస్సు సుఖదుఃఖమయమగునని తాత్పర్యము. సుఖము ద్వివిధము. 1. మిథ్యాసుఖము. సాంసారికము. 2. నిత్యసుఖము.పారమార్థికము. నిత్యసుఖమన మోక్షము. అది మనస్సును గురువు చేసి, అనగా లగ్నము చేసి, యోగమార్గమున శివుని ధ్యానము చేసిన సిద్ధించును. "అనుభవింపరాద హరునిఁ గూర్చి" అనగా మనస్సును లగ్నము చేసి, యోగమార్గమున శివుని ధ్యానము చేసి, శివోऽహమ్మను అనుభూతిని పొందవలయునని తాత్పర్యము. ఇది సుజ్ఞానము. ఇందుకు భిన్నమైనది అజ్ఞానము. అది శివధ్యానము చేయుటకు వెనుకాడించును. అజ్ఞానమునకు ప్రతీక అంధకారము. "హరునిఁ దలప నింత యంధకారంబేల?" శివధ్యానము చేయుటకు వెనుకాడుట అజ్ఞానమని అర్థము. అజ్ఞానమును తొలగించుకొనుమని తాత్పర్యము. "హయము సున్నముఁ దిన" అనగా మనస్సు అమృతమును క్రోలిన అనుభూతిని పొందిన, అనగా యోగము సిద్ధించినచో, యోగికి కల్పము అనగా లయము-సంకల్పవికల్పలయము- స్వాధీనమగును. కల్ప మేల గలుగు? అని

ప్రశ్నార్థకము కాదు. "కల్పమేలఁ గలుగు" అని కారణార్థకము. లయము వలన అతిశయము కలుగును. అజ్ఞానాంధకారము పటాపంచలగును. జ్యోతిర్దర్శన మగునని తాత్పర్యము. ఇది నాథసంప్రదాయమునకు చెందిన యోగమార్గము.

## మకుటార్థము.

రసవాది, రాజయోగి, అతివర్ణాశ్రమి, తత్త్వజ్ఞాని అయిన వేమన అపండితుడు కాడు. ఛందోవ్యాకరణాలంకారతర్కశాస్త్రవేత్త మాత్రమే పండితుడు కాడు. రసవాద, రాజయోగ తత్త్వశాస్త్రవేత్తయును పండితుడే. వేమన పాండిత్యము వేమన పద్యములందు కలదు[263]. శివుడే భోగము, శివుడే యోగము, శివుడే మోక్షము, శివుడే బ్రహ్మము - అనగా లౌకికమైన విశ్వము, అలౌకికమైన విశ్వము శివుడే అని వేమన జ్ఞానమార్గము[264]. ఇంతగా విశ్వము శివమయమైన వేమన, "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుటమును శివమయమే అగుట సిద్ధము.

అభిరామశబ్దమునకు శివుడు అను అర్థము కలదు. తెలుగు నిఘంటువులందు వెలుగు ముఖము చూడలేదు. సంస్కృతనిఘంటువులందు సంఘటింపఁ బడినది. "ఏన్ ఎపిథెట్ ఫర్ శివ" అని ఆప్టే నిఘంటువునందు కలదు. కాని ప్రయోగమును ఆప్టే ప్రదర్శింపలేదు. సంస్కృతభారతమునందలి ఆనుశాసనికపర్వములోని శివసహస్రనామస్తోత్రమునందు కలదు.

"అభిరామస్సురగణో విరామస్సర్వసాధనః
లలాటాక్షో విశ్వదేవో హరిణో బ్రహ్మవర్చసః" 150శ్లో.77అ.

ఇందు అభిరామః=శివః (శివుడు) అని ఇదమిత్థముగ కలదు. కాఁబట్టి విశ్వసమస్తమును లేదా విశ్వమును -లౌకికవిశ్వమును, అలౌకికవిశ్వమును-ద=ఇచ్చు అభిరామ=శివుడు అని, విశ్వదాభిరాముడు అను విశేషణమునకు అర్థము వచ్చును. విశేష్యము వేముడు. వేమనయే విశ్వమును ఇచ్చు శివుడు కాఁగలడు. జీవుడు శివుడని నాథసంప్రదాయమునందు కలదు. అది ప్రతిఫలించు వేమన పద్యములును కలవు[265]. తానే విశ్వము, తానే తత్త్వము, తానే జీవుడు, తానే ఆత్మ, తానే దేవుడు, అనగా శివుడు అను తాత్పర్యము తత్త్వజ్ఞానము. శివభక్తుడైన ప్రారంభదశను పెట్టుకొన్న మకుటమునకు తాత్త్వికార్థము సహజము కాదు. అంతేకాదు. విశ్వశబ్దమునకును శివుడను అర్థము కలదు. అది కూడ నిఘంటుసంఘటితము కాదు. సంస్కృతభారతములోని శివసహస్రనామస్తోత్రమునందు కలదు.

"దేవా సురేశ్వరో విశ్వో దేవాసురమహేశ్వరః
సర్వదేవమయోzచింత్యో దేవతాత్మాత్మసంభవః" 146శ్లో

ఇందు విశ్వః=శివః అని ఇదమిత్థముగ కలదు. "విశ్వదాభిరాముడు" అను విశే షణములోని విశ్వశబ్దమునకు శివుడను అర్థము వివక్షితమైన "ద" ప్రత్యయ మునకు వైయర్థ్యము వచ్చును. కనుక విశ్వశబ్దమిట శివార్థకము కాదు. ఇక "విశ్వదః+అభిరామః" "విశ్వదమ్+అభిరామ" అను పదచ్ఛేదములకు అవకాశము కలదు. విశ్వదః అను శబ్దమునకు సమస్తమును ఇచ్చువాడను సామాన్యార్థము ఝటితిస్ఫూర్తిని భాసించును. విశ్వమును ఇచ్చువాడు అను విశేషార్థమును నిష్పన్నమగును. ప్రయోగాంతరము మృగ్యము. సదృశపదప్రయోగము కలదు. అది కూడ సంస్కృతభారతములోని శివసహస్రనామస్తోత్రమునందే కలదు.

"సర్వకాలప్రసాదశ్చ సుబలో బహురూపభృత్
సర్వకామవరశ్చైవ సర్వద స్సర్వతోముఖః" 66శ్లో.

ఇందు సర్వదః=శివః అని ఇదమిత్థముగ కలదు. సర్వదుడు శివుడు. విశ్వదు డును శివుడు "శివారామతానిరూఢాత్ములు" అను తిక్కన ప్రయోగము కలదు. (400ప.5ఆ.అను.ప.). శివారాముడు అను పదబంధము, ఆత్మారాముడు అను పదబంధము వంటిది. ఆత్మని-ఆఙ్-రమతి ఇతి ఆత్మారామః అను వ్యుత్పత్తి వలె శివే-ఆఙ్-రమతి ఇతి శివారామః అని వ్యుత్పత్తి. ఇట్లు విశ్వదే-అభి-రమతి ఇతి విశ్వ దాభిరామః అను వ్యుత్పత్తి నిష్పన్నమగను. అభి, ఆఙ్ ఆధిక్యార్థకములైన ఉపసర్గలు. "రమ్ క్రీడనే" అని ధాతువు. ఆత్మయందు అధికముగ క్రీడించువాడు ఆత్మారాముడు. శివునియందు అధికముగ క్రీడించువాడు శివారాముడు. విశ్వదు నియందు (=శివుని యందు) అధికముగ రమించువాడు విశ్వదాభిరాముడు. ఆత్మా రామశబ్దమునకు "ఆత్మన్యేవారామః యేషాం తే ఆత్మారామః" అను వ్యుత్పత్తి కలదు[266]. అట్లు శివే+ఏవ+ఆరామః అని, విశ్వదే +ఏవ+అభిరామః అను వ్యుత్పత్తులును నిష్పన్నములగును. ఆత్మయందే అధికముగ క్రీడించువాడని, శివుని యందే అధికముగ క్రీడించువాడని, విశ్వదునియందే (=శివునియందే) అధి కముగ క్రీడించువాడని అర్థములు వచ్చును. ఆత్మారాముడు యోగి. శివారాముడు శివయోగి, శివభక్తుడును. విశ్వదాభిరాముడును శివభక్తుడు. శివయోగి.

విశ్వదుడు అనగా శివుడు. సమస్తమును ఇచ్చువాడని సామాన్యార్థము. విశ్వ మును - లౌకికవిశ్వమును, అలౌకికవిశ్వమును -ఇచ్చువాడని విశేషార్థము. దృశ్య మానజగత్తు అనగా బహిర్జగత్తు లౌకికవిశ్వము. అది జీవుని అంతరంగ మునందును ఉండునని నాథసంప్రదాయమునందు కలదు. అంతరంగములోని

జగత్తు దర్శనీయజగత్తు. అనగా అంతర్జగత్తు. అలౌకికవిశ్వము. అది తత్త్వజ్ఞానికి సాధ్యము. లౌకికవిశ్వమును, అలౌకికవిశ్వమును ఇచ్చు శివుని యందే అధికముగ క్రీడించువాడని విశేషార్థము. వేమనకు శివభక్తునిగ సామాన్యార్థము, శివయోగిగ, శివతత్త్వజ్ఞానిగ విశేషార్థము సంగతమగును. సమస్తమును; లౌకికవిశ్వమును, అలౌకికవిశ్వమును ఇచ్చు శివుని యందే అధికముగా క్రీడించువాడు విశ్వదాభిరాముడు. అతడు వేముడు. వినుర అను క్రియకు అనుగుణముగ విశ్వదాభిరామ వినుర వేమ అని సంబోధనాంతముగ మకుటము.

వేమన కవిగా కంటె ప్రవక్తగా ప్రముఖుడు. వేమన వంటి కవులు అన్యసాహిత్యములందును కలరు. తమిళసాహిత్యమునందు[267] శివవాక్యర్, పట్టినత్తు పిళ్లైయార్, కన్నడసాహిత్యమునందు సర్వజ్ఞుడు, హిందీసాహిత్యమునందు కబీర్, గుజరాతీసాహిత్యమునందు[268] ఆఖో లేక ఆఖాభగత్ సదృశకవులు. వీరందఱును పదునైదవశతాబ్ది కవులే. ఉత్తరభారతదేశమునందు, కర్ణాటాంధ్రదేశములందు నాథ సంప్రదాయము ప్రత్యక్షముగ ప్రభావము నెఱపినది.[269]. తమిళదేశమునందు శైవ సిద్ధాంతము ద్వారా నాథసంప్రదాయము పరోక్షప్రభావము నెఱపినది[270]. ఇతః పూర్వమే వంగసాహిత్యమునందు వీరందఱిని మించిన కవయిత్రి లక్ష్మీంకరాదేవి. సమగ్రమైన తులనాత్మకసాహిత్యపరిశీలనము సాపేక్ష్యము.

**దూబగుంట నారాయణ** : ఈతని కృతి పంచతంత్రము. అది తమ్మరాజు కుమారుడైన బసవరాజునకు అంకితము. తమ్మరాజు ఉదయగిరిమాన్యమునందు విశ్వేశ్వరుని, గోపాలకృష్ణుని ప్రతిష్ఠించి, గుడులు గోపురములు కట్టించి, దానములు చేసినట్లు రెండు శాసనములు కలవు[271]. రెండుశాసనములందును తమ్మరాజు పరిపాలించుచున్నట్లు లేదు. ఉదయగిరిదుర్గమును బసవరాజు పరిపాలించినట్లు 1518 వ సంవత్సరము నాటి మఱొక శాసనమునందు కలదు[272]. అది అసమగ్రశాసనము. అందు బసవరాజు సవతితమ్ముడు సింగరాజు అయిదుగురు కుమారుల వఱకు గతచరిత్ర కలదు. అయిదుగురు కుమారుల దగ్గఱ ఆగిపోయినది. తమ్మరాజు గుడులు, గోపురములు కట్టించిన కాలమునందే బసవరాజు ఉదయగిరిదుర్గాధిపతి అగును. ఆ కాలము 1460 ప్రాంతము. కాఁబట్టి పంచతంత్రము రచనాకాలము స్థూలముగ 1460 ప్రాంతము.

నారాయణ పంచతంత్రము రెండవది. మొదటిది మడికి సింగన సకలనీతిసమ్మతము నాటికే కలదు. అది అనుపలబ్ధము. ఉపలబ్ధమైన పంచతంత్రములలో నారాయణ పంచతంత్రమే మొదటిది. తర్వాతను పంచతంత్రములు వెలువడినవి. అవియెల్ల చంపూకావ్యములు. అన్నిటి కంటె నారాయణ పంచతంత్రము కాసుగీటునకు వచ్చునదేకాని, వచనకావ్యములైన చిన్నయసూరి

మిత్రలాభ, మిత్రభేదముల, కందుకూరి వీరేశలింగము సంధి, విగ్రహముల మేలిమి బంగారము ముందు పోడిమి చెడినది. నారాయణపంచతంత్రమునందు మిత్ర భేదము, సుహృల్లాభము, సంధివిగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్షకారిత్వము అను పంచతంత్రములు కలవు. తెలుగు పంచతంత్రచంపువులకు అముద్రితమైన, మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని ఒక సంస్కృతపంచతంత్రమే మూలము[273]

నారాయణ పంచతంత్రము ప్రబంధము (18ప.పీ.) మహాప్రబంధము (11,47 వచ.పీ.) అని కలదు. కావ్యము లేక గ్రంథము అనియే అర్థము. మచ్చుతునకలుగ పురవర్ణన (477ప.మి.భే.) వనవర్ణన (504ప.మి.భే.) సరోవరవర్ణన (82,83ప.సం.వి.) అంధకారవర్ణన (161ప.సం.వి.) మేరునగవర్ణన (265ప.సం.వి.) సముద్రవర్ణన (5ప. ల.నా.) అరుణోదయవర్ణన (48ప.అసం.) కలవు. పంచతంత్రము ప్రపంచతంత్రము. నీతిబోధకమైన కథాకావ్యము.

ఇందలి తంతువాయుని కథ (మి.భే.), రథకారుని కథ (సం.వి.) - శుకసప్తతి, హంసవింశతి కథలకు ఆద్యప్రకృతులు.

## కతిపయనీతిపద్యములు

"తన నడవడి సత్పురుషులు
కొనియాడఁగ నుబ్బ కదియ గుణముగఁ దద్వ
ర్తనము న్వదలకయుండిన
మనుజుఁడు పూజ్యుండు జనసమాజములోనన్." 123ప.మి.భే.

"నిత్యసంతోషవంతుఁడై నెగడు వాని
కన్నిచోటుల సంపద లానియుండుఁ
జెప్పు ఎలిడుకొన్న కాళ్లకీ క్షితితలంబు
తోలు గప్పిన చందమై తోఁచునట్లు." 121ప.సు.లా.

"వినుమధర్మమైన పని ధర్మమని తోఁచుఁ
గాని తెరువు తెరువుగాఁ దలంచు
శత్రు మిత్రుఁగాను మిత్రు శత్రునిగాను
గాంచు నరుఁడు చేటుకాలముననను." 293ప.సం.వి.

"శోకశాత్రవభయముల చొప్పు ఎ మాన్చు
ప్రీతి విశ్వాసగుణహేతుభూతమైన
మిత్త్రమను నక్షరద్వయమిశ్రమైన
రత్నమే వేల్పు సృజియింపఁ బ్రబలెనొక్కొ" 40ప.ల.నా.

నారాయణ పంచతంత్రములోని ఒక పద్యము (126ప.మి.భే.) మడికి సింగన సకలనీతిసమ్మతమునందు కలదు - (33ప.2ఆ.) మడికి సింగన పూర్వుడు. నారాయణ అనంతరుడు. కావున నారాయణ పంచతంత్రములోని పద్యము ప్రాచీనపంచతంత్రిలోనిది కావచ్చును. అది నారాయణపంచతంత్రమునందు ప్రక్షిప్తము కావచ్చును. అథవా, పంచతంత్రములోని పద్యము సకలనీతిసమ్మతమునందు కాలాంతరసంక్రాంతము కావచ్చును. నారాయణ పంచతంత్రములోని కొన్ని పద్యములు అలతిమార్పున (108-110ప.సు.లా.), ఒక పద్యము యథాతథముగ (30ప.సం.వి.) భానయ పంచతంత్రియందు కలవు. (70-72ప.2ఆ.; 18ప.3ఆ.) ఇవి భానయ స్వీకరించినవియే అగును. ఇది నారాయణ పంచతంత్రమునకు నాడు గల ప్రసిద్ధికి నిదర్శనము.

**దగ్గుబల్లి దుగ్గన**: ఈతని కృతులు కాంచీపురీమాహాత్మ్యము, నాసికేతోపాఖ్యానమును. మొదటిది అనులపబ్ధము. రెండవది అసమగ్రలబ్ధము. ఇతడు శ్రీనాథుని బావమఱది. పోతన, ఎఱ్ఱన, దుగ్గన సోదరులు. (19ప.1ఆ.) నాసికేతోపాఖ్యానము గంగనామాత్యునికి అంకితము. గంగనామాత్యుని జ్ఞాతిసోదరుడు దేవసచివాగ్రణికి కాంచీపురనాథు దివ్యకథ అంకితము. (20ప.1ఆ.) కాంచీపురనాథు దివ్యకథ అన కాంచీపురీమాహాత్మ్యము. గంగనామాత్యుడు పంచతంత్రకృతిపతి బసవరాజుమంత్రి. (71ప.1ఆ.) కాఁబట్టి కాంచీపురీమాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1460 ప్రాంతము.

నాసికేతుని కథ వేదప్రసిద్ధము. (11ప.1ఆ.) ఋగ్వేదదశమమండలములోని నూటముప్పదియైదవ సూక్తము కఠోపనిషత్తులోని నాసికేతుని కథకు బీజము[274]. మహాభారతమునందును నాసికేతుని కథ కలదు. తిక్కన తెనుగుసేతను కలదు. (446-462ప.2ఆ.) కాని, దుగ్గన నాసికేతోపాఖ్యానమునకు మూలము - అముద్రితమైన పూనా భండార్కర్ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు కల సంస్కృతనాసికేతోపాఖ్యానము[275]. అందలి కథ దుగ్గన నాసికేతోపాఖ్యానమునకు మాత్రమేగాక, పందొమ్మిదవశతాబ్ది మిక్కిలి మల్లికార్జునుని నాచికేతూపాఖ్యానమునకును అతిసన్నిహితము. నాచికేతునామధేయము కంటె నాసికేతనామధేయము కథానుగుణము.

"నాసికాంతస్సముద్భూతః సర్వలక్షణసంయుతః
నాసికేతురితి ఖ్యాతః మునిభిః కృతమంగళం"

అని సంస్కృతనాసికేతోపాఖ్యానమునందు కలదు[276]. నాసికేతుడు నాసిక నుండి పుట్టిన వాడే గాక, పెరిగిన తర్వాత తల్లిదండ్రులకు వివాహము చేసిన

తనయుడు. ఇది నాసికేతోపాఖ్యానములోని ప్రథమ, ద్వితీయాశ్వాసముల వృత్తాంతము. ఇట్లు కఠోపనిషత్తునందు లేదు. మహాభారతమునందును లేదు. అంతేకాదు. కఠోపనిషత్తునందు నచికేతుడు"గోదానము సేయునెడ "నన్నెవరికి దానము చేసెదవు" అని మూడుసారులు అడిగిన, విసుగెత్తిన తండ్రి "మృత్యువునకు దానము చేసెదను" అనిన (కస్మై మాం దాస్యసి. మృత్యవే త్వా దదామ్.4శ్లో) యమలోకమున కేగినట్లు కలదు. నాసికేతోపాఖ్యానమునందు నాసికేతుడు" అపునరావృత్తికిని మూల మాత్మవిద్య" అనిన (16ప.3ఆ.)అగ్నిహోత్రము మేలన్న తండ్రిని కాదని; అధ్యాత్మ, యోగము మేలనుట వలన తీవ్రరోషుడైన ఉద్దాలకుడు "యముని నగరు చూడు" మని శపించిన (21ప.3ఆ.) యమలోకమున కేగినట్లు కలదు. నాసికేతుని యమలోకప్రవేశము, పర్యటనము, (పునరాగమనము), యమలోకవర్ణనము నాసికేతోపాఖ్యానములోని నవీనవిషయము.

దుగ్గన కవితాగురువు శ్రీనాథుడు. "శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ శ్రీనాథమహాకవీంద్ర ప్రసాదలబ్ధకవితావిశేష" అని దుగ్గన ఆశ్వాసాంతగద్యలందు కలదు. అయినను సంస్కృతప్రౌఢి కంటె తెనుగునుడికారము దుగ్గన కవితావిశేషము. శ్రీనాథుని ప్రభావమును అశేషము. ఇందుకు శ్రీనాథుని వర్ణించిన పద్యమే (పూర్వోదాహృతము)ప్రథమోదాహరణము.

"మకరందంబులఁ దొప్పఁ దోఁగి వికచన్మందారమాకందచం
పకసౌరభ్యముఁ బూని లేఁజిగురు జొంపంబుల్ మొగిం జొచ్చి పా
యక మందానిలుఁ డెందుఁ గ్రమ్మఁ ఉఁదపోవాప్తిభ్రమత్తాపసీ
సకలాంగోదితఘర్మవారికణికాజాలంబు నింకింపుచున్." 101ప.1ఆ.

ఇది శ్రీనాథుని ప్రభావమును స్ఫురింపఁజేయును. ఇంతకంటె చంద్రవతి పసిబిడ్డను ప్రేపతీగల నల్లిన పెట్టెలో పెట్టి గంగలో విడిచిపెట్టిన, ఆ పెట్టె గమనమును అభివర్ణించిన దుగ్గన పద్యము శ్రీనాథుని పద్యమునకు శిష్యప్రాయము.

"పృథులోర్మిమాలికాప్రేంఖోళనంబుల
డోలాధిరోహణలీల లమర
శింజానమధుకరీమంజురవంబుల
గీతికాకర్ణనప్రీతి దొరక
సైకతవేదికా సన్నిధానంబుల
నంకాధివాససౌఖ్యంబు గలుగ
మందప్రవాహనిష్పందవర్తనములఁ

బర్యంకనిద్రానుభవమెలర్ప
నవిరతాంభః ప్రవాహయై యరుగ నరుగ
వారిలోపలఁ దన కన్నవారి నడుమ
నర్హ విధమున నుండెడు నట్ల యుండె
పేటికామధ్యగతుఁడైన పిన్నపాప" 243ప.1ఆ.

పిన్నపాపని విడిచిపెట్టిన చంద్రవతి, కొంతకాలమునకు వెదకికొనుచు పోయి, ఒకరి నొకరు కలిసికొను సన్నివేశము కరుణరసనిర్భరము. తెనుగు నుడికారము తేనెపెఱ. చంద్రవతి.

"చిక్కనఁ గౌఁగలించుఁ దన చెక్కుల బాలకు చెక్కుఁ జేర్చి యిం
పెక్క శిరంబు మూరుకొని యేడ్చుచు నచ్చెరు వందు నాత్మలో
మక్కువతోడ మైనిమురు మాటికి మాటికి మోముఁ జూచుచున్
గ్రక్కునఁ గ్రుచ్చి యెత్తుకొనుఁ గామిని చన్నులు చేఁపుచుండఁగన్" 13ప.2ఆ.

తాను తల్లినని తెలిపి, తనయునితో ఇట్లనును.

"అక్కటికంబు మాలి నిను నమ్మెయిఁ బాఱఁగవైచి చన్ననా
కక్కట! కన్నతల్లినని యర్మిలి సేసెద వన్న!భూమిలో
నెక్కడ నాడుఁ బుట్టువల కేఁ కరినట్టులు దైవమిట్లు నిన్
రక్కసినైన నా కడుపునన్ గలిగించెనె పాపజాతియై. 15

కడుపునఁ బుట్టిన బిడ్డలఁ
జెడవఱుతఁ గలిపిపుచ్చుఁ జెల్లునె మఱి యే
పడఁతులకు నిర్దయాత్మకుఁ
గడుఁ గ్రూరకు నాకుఁ జెల్లెఁ గాక కుమారా! 17
ఓ నాసికేత! కరుణా
హీనాత్మక నన్నుఁ బాసి యెట్లైతివి? యి
క్కానన మెవ్వరి యాశ్రమ
మీ నెలవున కీవు చేరుటెట్లు కుమారా? 19
ఎవ్వరు దిక్కైరియ్యెడ
నెవ్వరు ప్రోవంగఁ బెరిగితే చందములన్
నెవ్వగలఁ దలఁగఁ ద్రోచితి
వివ్విధమంతయు నాకు నేర్పడఁ జెపుమా" 20ప.2ఆ.

అసమగ్రమైన తృతీయాశ్వాసములోని యమలోకవర్ణనము. శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యములోని శివలోకవర్ణనమునకు సహోదరము. అది కైలాసము. శాంతనిలయము. ఇది నరకము. బీభత్సభయానకవలయము. ఉన్నంతవఱకును దుగ్గన నాసికేతోపాఖ్యానము. ఉత్తమరచనము.

**భైరవుడు**: ఈతని కృతులు శ్రీరంగమహత్త్వము, కవిగజాంకుశము, రత్నపరీక్ష. రత్నపరీక్ష రత్నశాస్త్రగ్రంథము. కవిగజాంకుశము ఛందశ్శాస్త్రగ్రంథము. శ్రీరంగమహత్త్వము క్షేత్రమాహాత్మ్యకావ్యము. ప్రబంధశబ్దమును ప్రయుక్తము. (17వచ. 1ఆ.) ఇతడు "గౌరనామాత్యసుతు"డని శ్రీరంగమహత్త్వమునందు కలదు. (21ప. 1ఆ.) " భ్రమరాంబికామహావరసముదితనిరవద్యహృద్యసాహిత్యకళాక్రమవిమలప్రతిభాచంక్రమణక్రమశాలియైన గౌరన సుతుండన్" అని కవిగజాంకుశమునందు కలదు. (6ప.) గౌరన "భ్రమరాప్రసాదసంప్రాప్తకవిత్వసుమహితసామ్రాజ్యసుఖపరాయణు"డని హరిశ్చంద్రోపాఖ్యానమునందు (3011-12పం.ద్వి.భా.) "భ్రమరాంబికావరప్రాప్తవిచిత్రవిమలసాహిత్యప్రవీణాధికుండు" అని నవనాథ చరిత్రయందు (పుట7) కలదు. కాఁబట్టి హరిశ్చంద్రనలోపాఖ్యానము, నవనాథచరిత్ర రచించిన గౌరన సుతుడే భైరవుడు.

శ్రీరంగమహత్త్వము చాగయామాత్యుని కుమారుడైన రాఘవామాత్యునికి అంకితము. రాఘవామాత్యుడు "ఉపసంహృతకర్ణాటకటకజననాథచమూరంహు"డు. (70ప.1ఆ.) అతని అన్న విఠ్ఠలామాత్యుడు "-ప్రశోషితమహాకర్ణాటసేనాసముద్భటపాథోనిధి." (50ప.1ఆ.) అంతేకాదు." ఇమ్మడిసైపఖానాధిరాజ్యభారధుర్యుడు" (51ప.1ఆ.) కర్ణాటజననాథుడు విజయనగరరాజు. కటకజననాథుడు ఉత్కళరాజు. ఇమ్మడి సైపఖాను అనగా రైండవసైపఖాను బహమనీసుల్తాను ప్రతినిధి అగును. అతని మంత్రి విఠ్ఠలామాత్యుడు, ఇతని తమ్ముడు రాఘవామాత్యుడు బహమనీసుల్తాను విజయనగరరాజు మల్లికార్జునరాయలను, ఉత్కళరాజు కపిలేంద్రగజపతి కుమారుడు హంవీరుని ఓడించిన దండయాత్రలో పాల్గొనిరని తాత్పర్యము. అది 1446-1460 సంవత్సరముల మధ్యను మాత్రమే అవకాశము [277]. కాఁబట్టి శ్రీరంగమహత్త్వము రచనాకాలము స్థూలముగ 1465 ప్రాంతము.

శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు కావ్యము శ్రీరంగమహత్త్వము. మూలము సౌపర్ణపురాణము. (24ప.1ఆ.) అదే తార్క్ష్యపురాణము. (80ప.1ఆ.) అనగా గరుడపురాణము. శ్రీరంగమహత్త్వములోని పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు పదమూడు కలవు. (92, 108, 113,253,266 ప.1ఆ.; 16ప.2ఆ; 25,38,71,78,83,87,169ప.4ఆ.) శ్రీరంగమహత్త్వము ప్రథమతః 1912 వ

సంవత్సరమునందు ప్రకటింపఁ బడినది. తేటతెనుగు తేజరిల్లి, పద్యరచన ప్రసన్నమై కథలు రక్తికట్టి, రసము చిప్పిలి వర్ణనలు వాసించి, శ్రీనాథుని ప్రభావము కలిగి, పోతనపై ప్రభావము నెఱపి, అర్వాచీనవర్ణనలకును ఆదర్శప్రాయమై, ప్రౌఢమైన భైరవుని శ్రీరంగమహత్త్వము ప్రసిద్ధము కాక పోవుట విచిత్రము.

బలి, సుబోధసత్వులు, ఇక్ష్వాకుమహారాజు, ధర్మవర్మ, విభీషణుడు, సనత్కుమారుడు, చోరుడు, పిశాచి, సోమకభూపాలుడు, చిత్రసేనుడు, కణ్వుడు, పుష్కరుడు, విదేహభూపతి, జయధరుడు, కుశలుడు, ప్రభాకరుడు, సునేత్రుడు ప్రభృతుల కథలు, కావేరి, చంద్రపుష్కరిణి, అశ్వత్థతీర్థము, కేసరతీర్థము, జంబూతీర్థము, ఆమ్రతీర్థము, కదంబతీర్థము, పుష్కరతీర్థము మొదలైన తీర్థముల మహిమలు సర్వము శ్రీరంగక్షేత్రమునకు సంబంధించినవి. పుర (110ప.2ఆ. 256-276వచ.4ఆ.) నగ (107ప.1ఆ.; 250ప.4ఆ.) నదీ (100-103ప.1ఆ;140-142ప.146వచ.1ఆ.) హేమంత (31-35ప.2ఆ.) వసంత (37-50ప.2ఆ.) పుష్ప (77-82ప.4ఆ.) పుష్పాపచయ (69ప.2ఆ.)దోహదప్రక్రియా (61ప.2ఆ.) కందుకక్రీడా (70-71ప.2ఆ.) వీణావాదన (72-73ప.2ఆ.) పరిణయోత్సవలీలా (75ప.2ఆ.) జలకేళీ (94-100ప.4ఆ.) సూర్య (201ప.5 ఆ.) విష్ణువాసర (103ప.5ఆ.) ప్రకృతి వర్ణనలు బహుళము. తేటతెనుగు పద్యములు అవిరళము.

"నేరెడు పండు చాయ రవణించెడు మేనఁ బదాఱువన్నెఁ బం
గా రొలఁ బట్టు పట్టుఁ బసగందని తామరరేకుమై సిరుల్
దోరణఁ గట్టి యేలు కనుదోయును, బొందుకు నుద్దియై మెఱుం
గారు నురంబు కెంపు, దయసానిన యుల్లము చల్లచూపులున్."

189ప.1ఆ.

"చల్లని తావు లెందు వెదఁ జల్లఁ గ మవ్వపుఁ బూవు మొగ్గ చా
లల్లన విప్పుచుం గిసలయావళి శ్రీ వెలయంగఁ దెల్పుచున్
మెల్లన జంతుజాల మెలమిం బొదలం బరిపాటిమైఁ బ్రవ
ర్తిల్లును గాని, గాలి తనతీవ్రత సూపఁ గనోడు నియ్యెడన్" 85ప.3ఆ.

"తెల్లని తమ్మిరేకుల గతింజిగి మించు వెడందకన్నులుం
జల్లని సత్కృపారసముఁ జల్లెడు చూపులు లేఁ తనవ్వు రం
జిల్లెడు నెమ్మొగంబు వికసిల్లెడు నల్లని కల్వపూలతో
నుల్లసమాడు మై పసయు నొప్పె నిజాకృతిఁ జూపి నిల్చినన్."

142ప.4ఆ.

ఇక్ష్వాకుమహారాజు కథ రసవత్తరమైన లఘుకావ్యము. ఇంద్రుని పంపున

రతిద్వితీయుడు, వసంతసమేతుడునైన మన్మథుడు పరమేశ్వరుని తపస్సునకు విఘ్నము కలిగించెను గాని, ఇంద్రుని పంపుననే సురగణికానికాయపరివృతుడైన మన్మథుడు ఇక్ష్వాకుమహారాజునకు తపోభంగము కలిగించలేకపోయెను.

"మెలఁగుచు, మధురసముల జడి
కలఁగుచు, లీలాభినయసమంచితగతులన్
వెలఁగుచు, నవసరసోక్తులఁ
జెలఁగుచు, నృపుఁజేరి వేల్పు చేడియ లచటన్. 60

ఇచ్ఛారూపచతురసల్లాపంబులఁ బ్రమోదంబు నొరిది
వినోదించుచు64
బహుప్రకారంబుల మదనవికారకారణంబులగు లీలవిలోల
సంధిభావంబుల పచరించియుఁ గేళీవిహారంబుల సంచరించియు
నసమశృంగారభంగీవిశేషంబుల మెఱయు నా రాజతపోధను
చిత్తంబుఁ జిత్తజాయత్తంబు చేయంజాలక 76

మేనక విన్ననై నిలిచె, మెల్లన మో మరవాంచె రంభ లో
నూనిన వింత నివ్వెఱఁగు నొదెఁ దిలోత్తమ, గర్వహీనయై
దీనత నొరిదె నూర్వశి, మదిం జలియించె ఘృతాచి యన్యకాం
తానిచయంబులెల్ల దవుదవ్వుల నుండె భయంబు పెంపునన్. 77

సరి గెందామర మొగ్గ నారస మలిజ్యావల్లి సంధించి భా
సురమాణిక్యమయోర్మికారుచులు చక్షుష్కోణశోణద్యుతుల్
బెరయం జక్రవిభాకృతిం దనువు శోభిల్లన్ వడిందీసి ని
ర్భరముష్టిన్ వెస డాసి యేసె మరుఁ డా రాజన్యచూడామణిన్. 81

అట్లు పుంఖానుపుంఖంబులగుచు నిగుడు
నతనుబాణపరంపర లా నృపాలు
నిచ్చఁ దెరలింపఁ జాలక విచ్చిపోయె
జగతిఁ బూవుల కది సహజంబ కాదె. 82ప.2ఆ.

ఇది అసాధారణసంఘటనము. ఇందుకు హేతువు ఇక్ష్వాకుమహారాజు హృదయములోని శ్రీరంగక్షేత్రదైవమైన శ్రీరంగశాయి అంతరంగస్థాయి అగుటయే.

భైరవుని వర్ణనలు మనోహరములు.

నిదాఘము : "ప్రాణికిఁ దను వౌసఁగు జగ
త్ప్రాణపయఃపాదపములు పటుఘర్మపరి
క్షీణములై కొరె జగ

త్రాణపయఃపాదపాంతరంబులఁ దమకున్" 22ప.2ఆ.

హేమంతము : "హిమముచే నంబరంబెల్ల నిముఱుగొనఁగ
నుష్ణకరుఁడును గరములొయ్యొయ్య సాఁచి
తాను ననలాంశ ధరియింపఁ బూనె ననఁగ
నెంత యనవచ్చునింక హేమంతమహిమ. 34ప.2ఆ.

వసంతము : "పసిమిఁ బాసి ముదిరి పసరింకి పరుసనై
పఱపు మిగిలి తుదలు పగిలి తలఁకి
పండి తొడిమ లెడల నెండుచుఁ గారాకు
డుల్లెఁ దరుల రవము పెల్లుగాఁగ" 40ప2ఆ.

పుష్పవర్ణనము: "దవనము వనలక్ష్మి వినో
దవనము సదవనము విరహతాపాంధులకున్
భువనము లలరఁగ మెలఁగెడి
భవనమున కపూర్వజన్మభవనము తన్వీ!" 80ప.4ఆ.

భైరవుని శ్రీరంగమహత్త్వమునందు చిగురుదాల్చిన అంత్యానుప్రాసము -

"సతతానేకమునీంద్రబృందకృతపూజాచందనం జందనా
గతమందానిలకందలీకృతతరంగస్యందనన్ దీరసం
గతమాకందమరందబిందుసహితార్కస్పందనం గాంచి ర
య్యతు లింపొందఁ గవేరనందనఁ ద్రిలోకానందనానందనన్."
140ప.1ఆ.

"శ్రీకరములు సుమహితశో
భాకరములు భవవిషోపహరజంతుసుధా
శీకరము లబ్జబాంధవ
నీకరములు దనుజకుముదినీభీకరముల్." 204ప.5ఆ.

ఇవియెల్ల భైరవుని కవితావైభవమునకు దిక్ప్రదర్శనములు.

శ్రీనాథుని ప్రియతమశబ్దములు భైరవుని శ్రీరంగమహత్త్వమునందు రసమయలబ్ధములు.

"పాథోధిమండల పాణింధమంబైన
కల్లోలవితతుల త్రుళ్ళఁడంగ" 152ప.1ఆ.
"వైకుంఠాంఘ్రిసమర్చనాకలనహేవాకుండు" 3ప.2ఆ.

"ప్రయోగానుసంధానప్రౌఢిమ' 17ప.5ఆ.

శ్రీనాథుని "శ్రీభీమనాయకశివనామధేయంబుఁ జింతింపనేర్చిన జిహ్వ జిహ్వ" అను పద్యమునకు (198ప.3ఆభీ.పు.) భైరవుని అనుకరణమిది:

"హరిదివ్యనామధేయామృతం బింపారఁ
జెలఁగి యాస్వాదించు జిహ్వ జిహ్వ
గోవిందకల్యాణగుణవిశేషంబులు
పలుమాఱుఁ దలపోయు తలఁపు తలఁపు
కమలాక్షు నిత్యమంగళమూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణిరాజతల్పు శ్రీపాదపద్మంబులు
చేరి యర్చన సేయు సేఁత సేఁత
వాసుదేవప్రియంబైన వ్రతము వ్రతము
దైత్యభేది నుపాసించు తపము తపము
శౌరి నారాధనము సేయు జపము జపము
విష్ణుపదభక్తి సమకొల్పు వినికి వినికి." 91ప.1ఆ.

శ్రీనాథుని "పంచాక్షరీమంత్రపారాయణంబులు జపియించు శారికాసముదయములు" అను పద్యమునకు (28ప.3ఆ.భీ.పు.) భైరవుని అనుసరణమిది:

"కర్ణామృతంబుగా కమలాక్షునవతార
కథలు వర్ణించు శుకవ్రజంబు
సామంబు లంచితస్వరముగా మునికుమా
రులఁ జదివించు కోకిలకులంబు
హరిఁ బాడు కిన్నరవరులకు నాలాప
విధము లాసించెడి మధుకరములు
నమరవిలాసినీసముదయంబునకు లాస్య
గతు లొజఁ గఱపు శిఖావళములు
శ్రీమనోహరు శుభదివ్యనామవితతి
విశదముగఁ బల్కఱను బల్కు విహగచయము
చూతపున్నాగవకుళఖర్జూరముఖ్య
తరుకదంబంబు గల్గు తత్తటములందు." 13ప.4ఆ.

ఇక బమ్మెర పోతనపై ప్రభావము నెఱపిన భైరవుని పద్యములు:

"పటుతరభవరోగపరితాపములఁ బాప
నబ్జాక్షుసేవ దివ్యౌషధంబు
అంచితజ్ఞానమహానిధానముఁ జూప
నచ్యుతభక్తి శుద్ధాంజనంబు
దుర్వారభయములు దొడరకుండఁగఁ జక్ర
పాణిసంస్తుతి వజ్రపంజరంబు
ఇష్టార్థఫలసిద్ధు లెసఁగింప హరినామ
పఠన మంగళకల్పపాదపంబు
విపులదుర్మోహతిమిరంబు విరియఁ జేయు
నురగశయనుని పూజ సూర్యోదయంబు
అనిమిషానందలీలల నునిచి మనుపఁ
గమలనాభుని పదతీర్థ మమృతసరము." 92ప.1ఆ.

"హరి లీలం బ్రణవాత్మకుండగుటఁ దా నధ్యాపకుండై ఖగే
శ్వరచక్రాబ్జసరోజనందకగదాశార్ఙ్గాఖ్యశుగంబుల్ మనో
హరభాస్వద్వటుకాకృతుల్ మెఱయ శిష్యస్తోమమై విస్ఫుట
స్వరవర్ణక్రమవేదపాఠనిరతిన్ సద్భక్తి నేతేరఁ గన్." 4ప.3ఆ.

"ఇందుండి వచ్చితి నిపుడే ననరాదు
సకలలోకైకసంచారిఁ గాన
నిది యది నెలవని యేర్పరింపఁగఁ బోల
దెందుఁ జూచిన వసియింతుఁ గాన
రూపించి తల్లిదండ్రులఁ జూపి చెప్పఁగా
లేదు వారెవ్వరు లేరు గాన
వీరు బంధువులని వివరింపఁ గూడదు
సర్వభూతములకు సముఁడఁ గాన
వటువు లిట్టట్టు గతిఁ జేరవచ్చి రనఁగఁ
బొందు గాదు నిమిత్తసంభూతు లగుచుఁ
జిత్తగతమైన కార్యంబు చేఁతలందు
నెఱుఁగఁ దగుఁ గాక మాటల నేమి చెప్ప." 14ప.3ఆ.

పూర్వోదాహృతమైన "తెల్లని తమ్మిరేకుల" అను పద్యముయొక్క ప్రభావము పోతన "నల్లనివాఁడు" అను పద్యముపై పోతపోసినట్లు కలదు. మఱొక పద్యము:

"పటుఘోరపాతకపటలమహారణ్య
చటులసముజ్జ్వలజ్వలనకీల
దుర్వారదారుణదుష్కృతసంఘాత

మేఘసంవర్తసమీరణంబు
భూరిభీషణపాపపుంజసముత్తుంగ
భూమిభృన్నిశితదంభోళిధార
దుస్సహదురితసందోహనిరంతర
ధ్వాంతప్రచండమార్తాండహేతి
క్రూరకల్మషకుంభికంఠీరవంబు
భీకరాఘౌఘపవనకుంభీనసంబు
కుటిలకిల్బిషపాథోధికుంభసూతి
భాసురంబైన శ్రీవిష్ణు వాసరంబు." 103ప.5ఆ.

ఒక్క పోతనపై మాత్రమేగాక, అర్వాచీనకవులపై కూడ భైరవుని ప్రభావము కలదు. పూర్వాపరకవుల ప్రభావము సర్వసాధారణము. సరసకవిత్వమేగాక బంధ కవిత్వమును భైరవుని శ్రీరంగమహత్త్వమునందు కలదు. చక్రబంధము, నాగ బంధము, గోమూత్రికాబంధము, భైరవుని గ్రంథాంతపద్యములందు కలవు. (263-265ప.5ఆ.) క్షేత్రమాహాత్మ్యకావ్యములందు శ్రీరంగమహత్త్వము విశిష్టము.

**వల్లభామాత్యుడు**: ఈతని కృతి క్రీడాభిరామము. అది రావిపాటి త్రిపురాం తకుని "ప్రేమాభిరామనాటకంబు ననుసరించి" రచించినది. (33వచ.) క్రీడా భిరామము "రూపక"మని ఆదిని కలదు గాని, (33వచ.) అంతమునందు ఆశ్వాసాం తగద్యను "వీథినాటకంబున .... నేకాశ్వాసము" అని కలదు. ఆశ్వాసము దృశ్య కావ్యవిభాగము కాదు. శ్రవ్యకావ్యవిభాగము. అంతేకాదు. క్రీడాభిరామము స్వరూ పమును బట్టి శ్రవ్యకావ్యమే[278]. ప్రేమాభిరామము రూపకభేదము. వీథీనాటకము. వల్లభామాత్యకృతమైన క్రీడాభిరామము శ్రీనాథకృతమని, కాదని వాదప్రతి వాదములు కలవు[279].

## కర్తృత్వము

క్రీడాభిరామము శ్రీనాథకృతమనుటకు గల అవకాశములివి: 1. కవ్యతిశ యోక్తులు. 2. లాక్షణికోదాహృతులు. 3. శైలీసామ్యము. ఇది త్రివిధము. i. శ్రీనాథు నిప్రియతమపదములు. ii. శ్రీనాథుని పద్యములు iii.శ్రీనాథుని పద్యరచనాపద్ధతి. 4. పలనాటివీరచరిత్ర ప్రసక్తి. 5. సమకాలికతాభాసము.

1.కవ్యతిశయోక్తులు : క్రీడాభిరామములోని కృతికర్తృప్రశంసను వల్లభామా త్యుని కవిత్వము సంధ్యాతాండవసమయశివశిరఃప్రచారగగనగంగాప్రవాహ సదృశమని, వాగ్దేవీకర్పూరతాంబూలసౌరభసన్నిభమని, శ్రీకృష్ణవనమాలాపరిమళ బహుళమని, మధుసూదనభిల్లావతారభుజస్ఫాలనచాపజ్యావల్లీసహోదరమని,

నెల్లూరి తూముకాలువ కలువల తావిని గేలిసేయునని; దాతృత్వము మేఘ, కర్ణ, కుబేర, జీమూతవాహనులకు సాటి అనవచ్చునని, చింతామణి, కుబేర, మేఘ, బలి, సూర్య, చంద్ర, సురతరుసురధేనువులు సరిరావని కలదు. (23-30ప.) గ్రంథాంతపద్యమునందు వల్లభరాయలు "కవీంద్రకాంక్షితత్రిదశమహీరుహంబ"ని కలదు. (295ప.) ఇదియెల్ల అతిశయోక్తివిలసితమైన ఆత్మస్తుతి కావున వల్లభామాత్య కృతము గాక శ్రీనాథకృతమని ఉపపత్తి.

క్రీడాభిరామము వల్లభామాత్యకృతమైన, క్రీడాభిరామములోని అతిశయోక్తి విల సితమైన ఆత్మస్తుతి వల్లభామాత్యునికి ప్రత్యక్షముగ వర్తించును. క్రీడాభిరామము శ్రీనాథకృతమైన, క్రీడాభిరామములోని అతిశయోక్తివిలసితమైన ఆత్మస్తుతి శ్రీనాథునికి పరోక్షముగ ప్రవర్తించును. ప్రత్యక్షమైన ఆత్మస్తుతి కర్తృత్వభం జకము, పరోక్షమైన ఆత్మస్తుతి కర్తృత్వరంజకము కాదు. ఆత్మస్తుతి కవులకు ఆజ న్మసిద్ధము. వల్లభామాత్యుని ఆత్మస్తుతి కంచుమ్రోత కావచ్చునుగాని, కర్తృత్వనిక షోపలకాంతి కాదు.

2. లాక్షణికోదాహృతులు : లింగమగుంట తిమ్మకవి, అప్పకవిప్రభృతుల లక్షణ గ్రంథములందు "శ్రీనాథుని వీథినాటకము" నుండి ఉదాహరించిన "కుసుమం బద్దిన", "కందుకకేళి" అను పద్యములు క్రీడాభిరామమునందు కలవు. (82,86 ప.) పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "వీథినాటకము" నుండి ఉదాహరించిన పద్యములును క్రీడాభిరామమునందు కలవు. (45,54,68, 82,91,98,145ప.) క్రీడాభిరామము వీథినాటకము కావున వల్లభామాత్యకృతము గాక శ్రీనాథకృతమని మఱొక ఉపపత్తి.

శ్రీనాథుని వీథినాటకము క్రీడాభిరామము కాదు. అది పరకృత, కాలక్రమసం క్రాంతచాటుపద్యసంకలనగ్రంథమని వీథినాటకమను శీర్షికను పూర్వోక్తము. అందు క్రీడాభిరామములోని రెండు పద్యములు కలవు. గోగులపాటి కూర్మ నాథకవి మృత్యుంజయవిలాసములోని పద్యమును కలదు. మృత్యుంజయ విలాసము శ్రీనాథకృతము కాదు. అట్లు క్రీడాభిరామమును శ్రీనాథకృతము కాదు. అంతేకాదు. శ్రీనాథుని వీథినాటకము వీథినాటకము కానట్లు వల్లభామాత్యుని క్రీడా భిరామమును వీథినాటకము కాదు. తన్మూలమైన ప్రేమాభిరామము సంస్కృతవీ థీనాటకము. తెలుగు వీథినాటకము కాదు. క్రీడాభిరామము వీథీనాటకానుసరణమే కాని వీథినాటకము కాదు. అసలు నాటకము కాదు. అయినను క్రీడాభిరామము గ్రంథాంతమునందు,

"నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహా
పుటభేదన మీ త్రితయము
నిటుఁ గూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్" 294ప.

అను పద్యము కలదు. క్రీడాభిరామమును ప్రదర్శించిన నటులది దోరసముద్రమని, క్రీడాభిరామములోని మంచనశర్మ, టిట్టిభసెట్టి అను విటులది ఓరుగల్లు అని, క్రీడాభిరామము కవిది వినుకొండ అని తలంచుటకు అవకాశము కలదు. కాని, ఇదియెల్ల భ్రాంతిమూలకము. దోరసముద్రమన ద్వారసముద్రము అది హొయసలుల రాజధానిగ చరిత్రప్రసిద్ధము. అది తెలుగుదేశములోనిది కాదు. కన్నడదేశములోనిది. అచటి నటులు తెలుగు నాటకమును ప్రదర్శించుట అసంగతము. సంస్కృతనాటకమును ప్రదర్శించుట సుసంగతము. మంచనశర్మ, టిట్టిభసెట్టి విటులది ఓరుగల్లే అయినను,వారు క్రీడాభిరామసంతానము కాదు. ప్రేమాభిరామసంతానము. క్రీడాభిరామము వల్లభామాత్యకృతమైనను, శ్రీనాథకృతమైనను కవిది వినుకొండకాదు. వల్లభామాత్యుడు ములికినాటి వాడు. శ్రీనాథుడు పాకనాటివాడు. వల్లభామాత్యుని తండ్రి త్రిపురాంతకుడు. "మూఁడు గ్రామగ్రాసముల తోడఁ గూడంగ మోపూరు పాలించె ముల్కినాట"అని క్రీడాభిరామమునందు కలదు. (22ప.) అంతేకాదు. వల్లభామాత్యుడును ములికినాటి మోపూరు నివాసి.

"ముదమున ముల్కినాఁటిపురమోహనశైలసువర్ణకందరా
సదనుఁడు కాలభైరవుఁడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహంబునకుఁ దిప్పయవల్లభరాయమంత్రికిన్. "295ప.

అని కూడ క్రీడాభిరామమునందు కలదు. కాలభైరవుడు ములికినాటి మోపూరునందు కలడు. ములికినాటి మోపూరులోని కాలభైరవుడు వినుకొండలోని వల్లభరాయనికి కృపసేయుట కృతకము. మోపూరులోని వల్లభరాయనికి కృపసేయుట సహజము. కాఁబట్టి వల్లభామాత్యుడు మోపూరు నివాసి.

క్రీడాభిరామములోని ఆశ్వాసాంతగద్యను "శ్రీమన్మహామంత్రిశేఖరవినుకొండ తిప్పయామాత్యనందన చందమాంబాగర్భపుణ్యోదయ .... వల్లభరాయ-"అని కలదు. వల్లభామాత్యుని తండ్రి తిప్పయామాత్యుడు మోపూరు కరణము. తాత తిప్పయామాత్యుడు కొంతకాలము వినుకొండదుర్గాధిపతి కుడిభుజము (20ప.)తాతను బట్టి తండ్రికి వినుకొండ ఇంటిపేరు లేదా వ్యవహారనామము. వల్లభామాత్యుని తల్లి పేరు చందమాంబ అని ఆశ్వాసాంతగద్యను మాత్రమేగాక,

వల్లభామాత్యుడు "చందమాంబికకు సుతుండు" అని కృతికర్తృప్రశంసను కూడ కలదు. (22ప.) వల్లభామాత్యుని తండ్రి తల్లి పేరు పెద్దమాంబ(15ప.) తాత, తండ్రి ఒకడనుటకు పెద్దమాంబ పేరు లేఖకవ్యత్యయమని ఒక అభిప్రాయము కలదు[280] అది క్రీడాభిరామమును శ్రీనాథకృతము చేయుటకు, కన్నతల్లిని కట్టుకొన్న భార్యను చేయు కూటకరణము.

ఇంతకు క్రీడాభిరామము కవిది వినుకొండ కాదు. మఱి ప్రేమాభిరామము కవిది వినుకొండ. ప్రేమాభిరామమును రచించిన రావిపాటి త్రిపురాంతకుడు వినుకొండదుర్గాధిపతి భాస్కరుని పై చెప్పిన చాటుధార అప్పకవీయమునందు కలదు. (60ప.3ఆ.) పదునైదవశతాబ్దిని తెలుగునాటకప్రదర్శనము లేదు. సంస్కృతనాటక ప్రదర్శనమే కలద. క్రీడాభిరామమునందు వీథ్యంగములు కలవుగావున వీథినాటకమని ఒక అభిప్రాయము కలదు[281]. క్రీడాభిరామములోని వీథ్యంగములు స్వార్జితములు కావు. పిత్రార్జితములు. ప్రేమాభిరామమునుండి సంక్రమించినవి. ప్రేమాభిరామము వీథ్యంగవిశిష్టమగు వీథీరూపకభేదమే అగును. అయినను క్రీడాభిరామము నాటకమను ప్రవాదమున, ప్రథమాంధ్రనాటకమను ప్రమాదమునకు గుఱియై, క్రీడాభిరామము ప్రబంధముగానే ముద్రింపఁబడినదని, నాటకముగ ముద్రింపవచ్చునని మచ్చు చూపిన సందర్భము కలదు[282]. అందే, "గన్నేరు పూఁజాయ" అను సీసపద్యము మంచనశర్మవర్ణనము. అది నాటకరూపమా?

"ముసిముసినవ్వుతో నతని మోము గనుంగొని వైశ్యుఁడిట్లనున్
రసికకులావతంసుఁడవు బ్రాహ్మణ! యింతకు మున్నెఱుంగవే

xxx xxx xxx xxx xxx

విసరు సమీరణంబయిన వేడుకమం దిది గొందు రంగనల్."

79ప.

ఇది నాటకపద్యమా?-మొదటిపాదమునందు కవివచనము కలదు. కడమ మూడు పాదములందును పాత్రసంభాషణము కలదు. "కందుకకేళి" అను పద్యమును (82ప.) పాత్రసంభాషణము కాదు. కవివర్ణనము. ఇట్టి పద్యములు క్రీడాభిరామమునందు కోకొల్లలు. (112,116-124,128-132,134,136,137,140,193,219,220,223,224, 233,257-259,274,280,282-284,287,292.) ఏవంవిధమైన క్రీడాభిరామము దృశ్యకావ్యము కాదు. శ్రవ్యకావ్యమే. వీథీనాటకానుసరణమేకాని, వీథినాటకము కాని క్రీడాభిరామము "శ్రీనాథుని వీథినాటకము" కాదు. లాక్షణికోదాహృతులు భ్రమప్రమాదభరితములు కాని, కర్తృత్వప్రమాణఖచితములు కావు.

3.శైలీసామ్యము : శ్రీనాథుని శైలికి, వల్లభామాత్యుని శైలికి సామ్యము కలమాట

సత్యము. అంతమాత్రమున క్రీడాభిరామము శ్రీనాథకృతమనుట సాహసము. కారణము శైలి అనుకరణీయము కాదు. బాణభట్టు శైలికి (పూర్వకాదంబరి), భూషణభట్టు శైలికి (ఉత్తరకాదంబరి) సామ్యము కలదు. కాని ఉత్తరకాదంబరి బాణభట్టుకృతమను వాదములేదు. నన్నయ శైలికి, ఎఱ్ఱన శైలికి (అరణ్యపర్వశేషము) సామ్యము కలదు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషము నన్నయ కృతమను వాదము కలదు. కాని వాస్తవము కాదు. పోతన శైలికి ఏర్చూరి సింగన శైలికి (షష్ఠస్కంధము) సామ్యము కలదు. సింగన షష్ఠస్కంధము పోతనకృతమను వాదము కలదు. కాని యథార్థము కాదు. వల్లభామాత్యుని క్రీడాభిరామమును అంతే. శ్రీనాథుని శైలిని సమకాలికులైన కొమ్మన, జక్కన, అనంతామాత్యుడును అనుకరించిరి. అనంతరకాలికులైన భైరవుడు, పోతన, పినవీరన, నంది మల్లయ ఘంటసింగనలు, కొఱవిగోపరాజును అనుకరించిరి. అర్వాచీనకాలికులైన అల్లసాని పెద్దనాదులు కూడ అనుకరించిరి. అట్లు వల్లభామాత్యుడును అనుకరించుట సంభవము. అనుకరణము త్రివిధము. 1. ప్రతిబింబాకార సంవాదము. 2. ఆలేఖ్యాకారసంవాదము. 3. దేహాంతరతుల్యసంవాదము. దేహాంతర తుల్యసంవాదరూపానుకరణమునందు పెద్దన అగ్రేసరుడు. ప్రతిబింబాకార, ఆలేఖ్యా కారసంవాదరూపానుకరణమునందు వల్లభామాత్యుడు ప్రాగ్రసరుడు. అది పెద్దన పుణ్యము, ఇది వల్లభామాత్యుని పాపము కాదు. త్రివిధానుకరణమును సంస్కృతాంధ్రకవులకు సమభ్యస్తవిద్య.

i. శ్రీనాథుని ప్రియతమపదములు: శ్రీనాథుని ప్రియతమపదములు, పదబంధములు, సమాసములు క్రీడాభిరామమునందు కలవు. అందు ప్రౌఢిమ, పాణింధమ, వ్యామగ్రాహ్యపదబంధములు అపూర్వములైనవి. శ్రీనాథుడు శృంగారనైషధాదికృతులందు ప్రయోగించినవి. శ్రీనాథునికి పూర్వము పూర్వాంధ్రకవులు ప్రయోగింపలేదు. అయినను శ్రీనాథుని అప్రయుక్తపూర్వపద ప్రయోగములు కావు. పూర్వసంస్కృతకవితాచర్వణపురస్కారములు. ప్రౌఢిమ శబ్దము మూకపంచశతియందు ప్రయుక్తము. పాణింధమము, వ్యామగ్రాహ్యపదబంధములు మురారి అనర్ఘరాఘవమునందు ప్రయుక్తములు. ప్రౌఢిమశబ్దము, పాణింధమపదబంధము వల్లభామాత్యుని కంటె పూర్వము భైరవుడు ప్రయోగించినవి. అవి పూర్వోదాహృతములు. వల్లభామాత్యుని అనంతరము పెక్కు మంది కవులు ప్రయోగించినవి కూడ.

క్రీడాభిరామములోని పాణింధమపదబంధప్రయోగము భీమేశ్వరపురాణము లోని శ్రీనాథుని ప్రయోగమునకు అనుసరణము. భీమేశ్వరపురాణమునందు కాశీవిశాలాక్షి వ్యాసుని "కలమధురవీణాక్వాణపాణింధమంబైన యెలుంగెత్తి"

పిలిచినట్లు కలదు. (110వచ.2ఆ.) క్రీడాభిరామమునందు ఓరుగల్లు తెలికిబోటి ప్రజలకు, "శతానందగేహినీకరరుహప్రరోహశిఖరముఖరవీణాక్వాణపాణింధమం బైన యెలుంగెత్తి" సంపెంగనూనె అమ్మినట్లు కలదు. (100-102ప.) అన్నపూర్ణ కంఠమును తెలికిబోటి కంఠము అతిశయించినది. ఇది శ్రీనాథుని భీమేశ్వర పురాణములోని పాణింధమపదబంధప్రయోగమును సోల్లుంఠనము సేయునది.

మురారి అనర్ఘరాఘవమునందు "వ్యామగ్రాహ్యస్తనీభిః శబరయువతిభిః" అని కలదు. (2శ్లో.5అం.) శ్రీనాథుని శృంగారనైషధమునందు "వ్యామగ్రాహ్యస్తనులగు భామలు" అని కలదు. (98ప.3ఆ.) ఆ భామలు రాచపరిచారికలు. శ్రీనాథుని హరవిలాసమునందు "వ్యామగ్రాహ్యపయోధరల్ శబరసేనాధీశసీమంతినుల్" అని కలదు. (24ప.5ఆ.) కాశీఖండమునందు "వ్యామగ్రాహ్యపయోధరల్ ..... ఆటవికసేనాధీశ సీమంతినుల్" అని కలదు. (53ప.3ఆ.) మురారికృతియందు, శ్రీనాథుని కృతులందును "వ్యామగ్రాహ్యపదబంధము స్తనవిశేషణముగ కలదు. అది గ్రామికస్త్రీపరము. మఱి క్రీడాభిరామమునందు "వ్యామగ్రాహ్యనితంబబింబకుచభారాభీలభద్రాకృతుల్ కామాంధల్ వెలనాఁటి కోడెవిధవల్" అని కలదు. (209ప.) ఇందు వ్యామగ్రాహ్యపదబంధము ముందు నితంబవిశేషణముగ కలదు. అది బ్రాహ్మణస్త్రీపరము. ఇది కూడ శ్రీనాథుని వ్యామగ్రాహ్యపదబంధప్రయోగమును సోల్లుంఠనము సేయునదియే.

శ్రీనాథుని పదములు, పదబంధములు, సమాసములు క్రీడాభిరామమునందు ఎన్ని క్రీడలాడినను, సోల్లుంఠనము స్వయంకృతము కాదు. అన్యకృతమగుట అపరిహార్యము.

ii శ్రీనాథుని పద్యములు : భీమేశ్వరపురాణములోని పద్యమిది:

గార్గ్యసిద్ధాంతమతముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంతమభిజిత్తు సమ్మతమగు" 42ప.3ఆ.

ఇది అగస్త్యుడు- వ్యాసుడు దక్షవాటికలో ప్రవేశించుటకు కాలశుద్ధి విమర్శించి పెట్టిన శుభముహూర్తము. అంతేకాదు. లోపాముద్రాగస్త్యులు, వ్యాసుడు దక్షారామము ప్రవేశించిన సమయము కూడ అభిజిద్వేళ. అనగా మధ్యాహ్నవేళ. (57వచ.3ఆ.)

మఱి క్రీడాభిరామములోని పద్యమిది:

"గార్గ్యసిద్ధాంతమతముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము." 66ప.

ఇది మంచనశర్మ "గోధూళిలగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుం బ్రశస్తంబు" అని (65వచ.) పలికినది. ఇందు సర్వసిద్ధాంతసమ్మతమైన అభిజిత్తులేదు. గార్గ్యసిద్ధాంతమతమైన ఉషఃకాలము కలదు. అది కూడ పురప్రవేశమునకు కాదు. పురప్రవేశారంభమునకు మాత్రమే. భీమేశ్వరపురాణములోని "గార్గ్యసిద్ధాంత"పద్యము దైవదర్శనార్థము. ఋషిప్రోక్తము. క్రీడాభిరామములోని "గార్గ్యసిద్ధాంత"పద్యము పునర్భోనిమిత్తము. విటజల్పితము. అది శ్రీనాథుని ఆవృత్తశిల్పము కాదు. అంతేకాదు. శ్రీనాథుని హరవిలాసములోని "ఎంచి నుతింప శక్యమె" అను పద్యము (22ప.5ఆ.) ఒక్క అక్షరమైనను మార్పు లేకుండ అట్లే పినవీరన(శృంగార)శాకుంతలమునందు కలదు. (102ప.2ఆ.) అలతిమార్పున నన్నయ "రయవిచలత్" పద్యము ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు, ఎఱ్ఱన "అంబనవాంబుజోజ్జ్వల"పద్యము పోతన భాగవతమునందు కలవు. మంచన "బాలరసాలసాల" అను పద్యము పోతన చాటుపద్యముగ ప్రసిద్ధము. పూర్వకవుల పద్యములను పుణికి పుచ్చుకొనుట కూడ సమామ్నాతపూర్వము.

ఇక సప్తశతిపద్యములు. ఇవి రెండు పద్యములు. రెండుపద్యములు కూడ సప్తశతిగాథలకు ఆంధ్రీకరణములుకావు. ఆంధ్రీకరణములకు అన్యథాకరణములు[283].

"ఝఞ్ఝా వాతోత్తృణితే గృహే రుదిత్వా నిఃసహనిషణ్ణామ్
దర్శయతీవ గతిపతికాం విద్యుదుద్యోతో జలధరాణామ్." 15గా.4శ.

వానగాలిచే పూరికప్పు ఎగుర, గొట్టు బడిన కొంపలో (భర్తృవిరహమువలన) ఏడ్చి, ఓర్మిలేకుండ ఉన్న ప్రోషితభర్తృకను మెఱుపు కాంతి మేఘునికి చూపించినదని వాచ్యార్థము. "నీ రాకతోనే ఈ అవస్థను పొందినది. ఇటువంటి అబలను ఇంకను దుఃఖపెట్టెదలవేల? ఇంతకంటె ఈమె భర్తకు విరహోత్కంఠను కలిగింపుము. అందువలన ఈమె దుర్దశ తొలగిపోయి జీవించుటకు శక్తురాలగును"అను ఆశయముతో, విద్యుత్తు స్త్రీ అగుటవలన హృదయమార్దవముచే ప్రోషితభర్తృకయెడల పక్షపాతము వహించి, పురుషుడైన మేఘునికి జాలి కలిగించు నిమిత్తము ప్రోషితభర్తృకను చూపించినదని ధ్వన్యర్థము. ఇది

గాథాహృదయము.

మఱి క్రీడాభిరామములోని పద్యమిది:

"పటుఝుంఝూపవనోత్తృణాలయములో భద్రంబునం బట్టె కం
కటిపై ముచ్చుముడింగి నిర్భరవియోగగ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచునున్న వాడవనితన్ గర్జావచఃప్రౌఢిమన్
దటిదుద్యోతము చూపు నట్టనడురే ధారధరశ్రేణికిన్." 60ప.

ఇందు పెనుగాలికి, పూరికప్పు ఎగురఁగొట్టఁబడిన కొంపలో భద్రముగ పట్టెమంచముమీద ముడిచిపెట్టుకొని పడుకొని, మిక్కుటమైన వియోగబాధచేత శోషనంది ఒంటరిగ నిద్రించుచున్న వాడవనితను, మెఱపుకాంతి ఉఱుము అను ఉచ్చైఃస్వనముతో మబ్బులగుంపునకు చూపించెనని కలదు. వాడవనిత అనగా వారవనిత. వారవనితకు నిర్భరవియోగగ్లాని కలుగవలసిన అవశ్యకము లేదు వార వనితకు పాంథవనిత అను పాఠాంతరమును కల్పించినను, ఆమె పెనువానగాలికి పూరికప్పు ఎగురగొట్టబడిన కొంపలో "భద్రంబునన్" పవ్వళింపఁ గలుగుట దుర్ఘటము. ముకుళించుకొని ప్రవళించుటకు "ముచ్చముడుంగు"అను ప్రయోగము శ్రీనాథుని కృతులందు మృగ్యము. నిర్భరవియోగగ్లానిచేత శోషనంది "నిద్రించుచునున్న"పాంథవనితనైన మెఱుపుకాంతి మబ్బులగుంపునకు చూపవలసిన ఆవశ్యకము లేదు. ఎంత శోష నందినను హాయిగా నిద్రపోవుచున్నది కదా! అంతేకాదు. తటిదుద్యోతము గర్జా వచఃప్రౌఢిమను చూపుట సంగతము కాదు. గర్జ మేఘజన్యము. మెఱుపుజన్యము కాదు. "ధారాధరవ్యూహసంభవగర్జారభటిన్ బఠించు బ్రహ్మర్షి" అని శ్రీనాథుని ప్రయోగము. (63ప.2ఆ.కా.ఖం.) కవిసమయమును కాదు. అంతేకాదు. గర్జావచఃప్రౌఢిమ స్త్రైణము కాదు. పౌరుషము. "విద్యుత్తు స్త్రీ అగుటవలన హృదయమార్దవముచే ప్రోషితభర్తృకయెడల పక్షపాతము వహించి, పురుషుడైన మేఘునికి (స్త్రీపురుషులైన విద్యున్మేఘులు దంపతులు) జాలి కలిగించు నిమిత్తము చూపించిన"దను గాథాహృదయము గంగపాలైనది. విద్యుత్త్రమద ప్రోషితభర్తృకను మేఘునికి చూపించుటలోని ఆశయము గర్భితము కాని గర్జితము కాదు. మొత్తము మీద క్రీడాభిరామపద్యమునందు ధ్వన్యర్థము ధ్వంసమైనది. ధ్వన్యర్థమును ధ్వంసము చేయుట ఆంధ్రీకరణము కాదు. బహుశః

"పటుఝుంఝూపనోత్తృణాలయములో భద్రస్థలిన్ బట్టె కం
కటిపై మేనరవాల్చి నిర్భరవియోగగ్లాని శోకించి యె
క్కటి నిద్రింపకయున్న పాంథవనితన్ గంభీరతాప్రౌఢిమన్
దటిదుద్యోతము చూపు నట్టనడురే ధారాధరస్వామికిన్"

అని శ్రీనాథుడు ఆంధ్రీకరించియుండు శాలివాహనసప్తశతిలోని పద్యమునకు వల్లభామాత్యుని క్రీడాభిరామములోని పద్యము అన్యథాకరణమగును.

"విక్రీణితే మాఘమాసే పామరః ప్రావరణంబలీవర్దేన
నిర్ధూమముర్ముర నిభౌ శ్యామల్యాః స్తనౌపశ్యన్." 38గా.3శ.

పామరుడు మాఘమాసమునందు నిర్ధూమముర్మురనిభములైన నవవధూస్తనముల వెచ్చదనము లభించుటవలన, అంతవఱకు చలికి కప్పుకొన్న పచ్చడమును ఇచ్చి, ఎద్దును కొనెనని అర్థము. మాఘమాసము శీతకాలము మాత్రమే కాదు. వివాహకాలమును. అంతేకాదు. వ్యవసాయకాలమును. శీతగట్టు దుక్కులు ప్రసిద్ధము. ఎద్దును కొన్న పామరుడు హాలికుడు. హాలికులు శీతగట్టున ఎద్దులు కొనుట కూడ ప్రసిద్ధము. నవవధువు నవనవోష్మత్వమును నమ్ముకొని దుక్కుటెద్దు కోసము చలికి కప్పుకొన్న పచ్చడమును పేదరైతు అమ్మివైచెనని తాత్పర్యము. ఇది గాథాహృదయము.

మఱి క్రీడాభిరామములోని పద్యమిది:

"మాఘమాసంబు పులివలె మలయుచుండ,
బచ్చడంబమ్ముకొన్నాఁడు పణములకును
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొఱగోయకేలుండు సైరికుండు" 202ప.

ఇందు హాలికుడు పణముల కొఱకు పచ్చడమును అమ్ముకొన్నట్లు కలదు. పణములన నాణెములు. హాలికుడు పచ్చడమును అమ్ముకొన్నది వ్యవసాయక్షేత్రమునందు కాదు. వేశ్యవాటికయందు. వ్యవసాయము చేయుటకు కాదు. వ్యభిచారము చేయుటకు. అందుకు మాఘమాసమే ఎందుకు? ముదితచన్నులు ఒఱగోయుటకు కాఁబోలు! ఒఱగోయు అను క్రియాపదము శ్రీనాథుని కృతులందు మృగ్యము. వేశ్యవాటికలోని ముదిత నవవధువు కాదు. వెలయాలు. అందుకు పణములు. "మాఘమాసంబు పులివలె మలయు చుండ" అను పంక్తిని చలి ధ్వనితము. మఱల "చలికి" అనుట వ్యర్థము. మొత్తము మీద గాథాహృదయము గాసటబీసటైనది. "పణములకును" అనునెడ "పసరమునకు" అను పాఠాంతరము కల్పించినను, దుక్కుటెద్దు ఓరుగల్లు వేశ్యవాటికయందు అమ్మనది కాదు. మంచనశర్మ "హాలికవాటి" దాటి "వేశ్యవాటికలోని యొక సురపొన్న క్రీనీడ కందుకక్రీడయొనర్చు" వేశ్యను చూచి, వర్ణించి, కతిపయదూరము కడచి "మున్ను తన్నెఱింగిన" మఱొక వేశ్యను టిట్టిభసెట్టికి చూపించి, వర్ణించి, "ఒకసైరికునింగని" సూర్యాస్తమయసమయమునందు పలికిన పద్యమిది. ఇది సప్తశతిగాథకు

ఆంధ్రీకరణము కాదు. బహుశః,

"మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడము నమ్మివైచెను బసరమునకు
నిభృతనిర్ధూమముర్మురనిభములైన
చామ కుచకుంభములు సూచి సైరికుండు"

అని శ్రీనాథుడు ఆంధ్రీకరించియుండు శాలివాహనసప్తశతిలోని పద్యమునకు వల్లభామాత్యుని క్రీడాభిరామములోని పద్యము అన్యథాకరణమగును. కాఁ బట్టి క్రీడాభిరామములోని "సప్తశతిపద్యములు" శ్రీనాథుని శాలివాహనసప్తశతిలోని పద్యములు కాఁ జాలవు.

iii. శ్రీనాథుని పద్యరచనాపద్ధతి. శ్రీనాథుని పదసంవిధానము, అన్వయ క్రమము, కారకప్రయోగవైచిత్రి, యత్తదర్థకనిర్దేశము, పద్యోపక్రమనిర్వాహము పరి ఢవిల్లు పద్యరచనాపద్ధతి క్రీడాభిరామమునం దున్న మాట నిజము. ఒక నిదర్శనము:

"వేరీ? నిన్నెదిరింపఁ గా జగమునన్ వీరుల్ ప్రతాపోద్ధతిన్
ధౌరంధర్యమునన్ బ్రభావమహిమన్ ధైర్యంబునన్ జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దారప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్." 145ప.7ఆ.

అను హరవిలాసములోని పద్యరచనాపద్ధతి,

"సారాచారమునన్ వివేకసరణిన్ సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునన్ బ్రతాపగరిమన్ దానంబునన్ సజ్జనా
ధారున్ దిప్పనమంత్రివల్లభు నమాత్యగ్రామణిం బోల్పఁ గా
వేరీ మంత్రులు ? సింధువేష్టితమహోర్వీచక్రవాళంబునన్." 31ప.

అను క్రీడాభిరామములోని పద్యమునందు కలదు. మఱి,

"నారీచిత్తసరోమరాళ! నయచాణక్యా! విరించాన్వయ
క్షీరాంభోధిసుధామయూఖ! కవితాసిద్ధాంతసర్వజ్ఞ! జం.
భారాతిద్విపహస్తకాండనిభబాహాఖడ్గధారాపయో
ధారాశాంతవిరోధిభూధవమహోదగ్రప్రతాపానలా!"144ప.6ఆ.

అను శృంగారనైషధములోని పద్యరచనాపద్ధతి,

"నారీచిత్తసరోమరాళ, నవనానాగంధసౌగంధ్యవి

స్తారోదారభుజాంతరాళ, ప్రతిభాసర్వజ్ఞ, సోమాబ్జవి
స్మేరాతారశరన్నిశాకరకరాశ్లేషప్రియంభావుక
స్ఫారక్షీరపయోధిలంఘనకళాజంఘాలకీర్తీశ్వరా! 229ప.4ఆ.

అను విక్రమార్కచరిత్రములోని పద్యమునందు కలదు. కాని విక్రమార్క చరిత్రము శ్రీనాథకృతము కాదు. జక్కనకృతము. అట్లు క్రీడాభిరామమును శ్రీనాథకృతము కాదు. వల్లభామాత్యకృతమగును శ్రీనాథుని శైలీవిశేషములు కొన్ని స్వోపజ్ఞములు. కొన్ని. పూర్వానుసరణులు. అవి. ఇవి శ్రీనాథుని సమకాలిక, అనంతరకాలిక, అర్వాచీనకాలికకవులు అనేకులు అనుకరించినవి. అనుసరించినవి. అంతేకాదు. అన్యకవుల అనుకరణములందు. అనుసరణములందును శ్రీనాథుని శైలి అస్థానపతితము కాదు. అవహేళనఫలితము కాదు. క్రీడాభిరామమునందు అస్థానపతితము. అవహేళనఫలితము. కారణము క్రీడాభిరామము హాస్యరసప్రధానమైన వీథీనాటకానుసరణము. అదియెల్ల శ్రీనాథుని శైలీప్రభావమునకు నిదర్శనము కాని. క్రీడాభిరామకర్తృత్వమునకు నిమిత్తము కాదు.

4పలనాటివీరచరిత్ర ప్రసక్తి: క్రీడాభిరామమునందు పలనాటివీరచరిత్ర ద్విపద ప్రబంధమును సాభినయముగ పాడుట కలదు.

"ద్రుతతాళంబున వీరగుంభితక ధుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళికయతిగ్రామాభిరామంబుగా
యతి గూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నా
క్కత ప్రత్యక్షరముంగుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్."

116ప.

ఇది పలనాటివీరచరిత్రద్విపదప్రబంధప్రదర్శనవిషయము. ప్రదర్శనవివరము తర్వాతి పద్యమునందును కలదు. (117ప.)కాని. పలనాటివీరచరిత్రకర్తృత్వము వివాదగ్రస్తవిషయము. క్రీడాభిరామకర్తృత్వమును వివాదగ్రస్తవిషయము. ఒక వివాదగ్రస్తవిషయమును పరిష్కరించుటకు మఱొక వివాదగ్రస్తవిషయము ప్రకృష్టసాధనము కాదు. అంతేకాదు. క్రీడాభిరామములోని పలనాటివీరచరిత్ర ద్విపదప్రబంధప్రసక్తిని బట్టి పలనాటి వీరచరిత్ర శ్రీనాథకృతమనుట, పలనాటి వీరచరిత్ర శ్రీనాథకృతమనుటను బట్టి క్రీడాభిరామము శ్రీనాథకృతమనుట అన్యోన్యాశ్రయదోషమగును. ఇతరసాధనములను బట్టి పలనాటివీరచరిత్ర, క్రీడాభిరామముల కర్తృత్వములు నిర్ణీతమైన, సమన్వయించుట సరియైన పద్ధతి.

క్రీడాభిరామమునందు పయి పద్యమునకు ముందున్న పద్యమిది :

"అనినఁ డిట్టిభుఁ డౌనంచు ననుచరింప
నాలువరిక్రింది త్రోవఁ గా నరిగి యరిగి
విప్రుఁ డీక్షించెఁ బలినాటి వీరపురుష
పరమదైవతశివలింగభవనవాటి." 115ప.

ఇది పాత్రసంభాషణము కాదు. కవివివరణము. నాటకమునందు ప్రయోగ సూచనము. ప్రయోగసూచనములు శ్లోకములు పద్యములు కావు. సంస్కృతనాటకమునందు "పరిక్రమ్య, దృష్ట్వా, నిరూప్య" అను ప్రయోగసూచనములుండును. అనంతరము పాత్రసంభాషణము పద్యమునందు లేదా గద్యమునందును ఉండును.

"విప్రుఁ డీక్షించె" తర్వాత క్రీడాభిరామములోని పాత్రసంభాషణమైన పద్యగద్యములివి :

"కోల దాపునఁ ద్రిక్కటిఁ గూడియున్న
గచ్చు చేసిన చిత్రంపు గద్దెపలక
వ్రాసి నారదె చూడరా వైశ్యరాజ
శీలబ్రహ్మాదివీరనాసీరచరిత! 125ప.

ఈ వీరపురుషులు మనకుంగార్యసిద్ధి సేయుదురు గాక పద|పద.
126వచ.

పయి రెండు పద్యముల నడుమ పద్యనవకము కలదు. (116-124)అది నాటకోచితముకాదు. క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభిరామము లభింపక పోయినను, "ప్రేమాభిరామంబు ననుసరించి ... తెనుంగు బాస రచియించిన" (33వచ.) క్రీడాభిరామమునందు నాటకోచితము కాని పద్యనవకము అమూలకమని సులభగ్రాహ్యము. అంతేకాదు. మక్కికి మక్కి అనువాదము అనుసరణము కాదు; ఆంధ్రీకరణమును కాదు. కాఁబట్టి పలనాటివీరచరిత్ర ద్విపదప్రబంధము ప్రదర్శనరంగమున ప్రసిద్ధమైన కాలమునందు క్రీడాభిరామమునందు గ్రంథస్థమగుట సంగతము.

5. సమకాలికతాభాసము : క్రీడాభిరామములోని ఒక పద్యమునందు (20ప.)పాఠాంతరకల్పనము, మఱొకపద్యమునందు (21ప.) దూరాన్వయకల్పనము, వేఱొక పద్యమునందు (15ప.) లేఖకవ్యత్యయకల్పనము చేసిన, శ్రీనాథుడు, వల్లభామాత్యుడు సమకాలికులగుట కిట్టును. అది ఇష్టసిద్ధి, అనిష్టపరిహారమును అగును గాని చారిత్రికసత్యము కాదు. సమకాలికతాభాసము కర్తృత్వనిర్ణయసాధనము

కాదు.

ఇంకను క్రీడాభిరామము శ్రీనాథకృతము కాదు; వల్లభామాత్యకృతమే అనుటకు సాధనములు కలవు.

1గ్రంథస్థనిదర్శనము : వల్లభామాత్యుడు క్రీడాభిరామమును రచించినట్లు గ్రంథాదిని (33వచ.) గ్రంథాంతమునందు ఆశ్వాసాంతగద్యను కలదు. వల్లభామాత్యుడు ప్రభువు కాడు. బ్రాహ్మణేతరుడు కాడు. ప్రాచీనకాలమునందు ప్రభువులు, బ్రహ్మణేతరులు రచించినట్లు కల గ్రంథముల కర్తృత్వము శంకనీయము కాని, బ్రాహ్మణుడు రచించినట్లు కల గ్రంథము కర్తృత్వము శంకనీయము కాదు. కాలేదు. నియోగి బ్రాహ్మణుడైన వల్లభామాత్యుడు క్రీడాభిరామము రచించుట నిరాఘాటము.

2వీథీరూపకప్రశంస: క్రీడాభిరామము కృత్యవతరణికను ప్రథమతః

"గణన కెక్కిన దశరూపకములయందు
వివిధరసభావభావన వీథి లెస్స"

అని కలదు .(1ప.) దశరూపకములందు వీథి లెస్స కాదు. వివిధరసభావభావనాభరితము కాదు. "భాణవత్ రసః సూచ్యస్తు శృంగారః స్పృశేదపి రసాన్తరమ్" అని దశరూపకమునందు వీథీరూపలక్షణము. భాణతుల్యము. శృంగారరసము సూచనీయము. రసాంతరము కూడ స్పర్శనీయము. భాణము కల్పితధూర్త చరిత్రము. విటైకపాత్రవర్ణితము. కాఁబట్టి రసాంతరము హాస్యము. వీథీభాణములకు భేదము పాత్రసంఖ్య. భాణము ఏకపాత్రప్రయోజ్యము. వీథి ఏకద్విపాత్ర ప్రయోజ్యము. అది లెస్స అనుట హాస్యాస్పదము. అందును సకల విద్యాసనాథుడు, కవిసార్వభౌముడును అయిన శ్రీనాథుడు సర్వలక్షణలక్షితమైన నాటకమును, తత్సదృశమైన ప్రకరణమును కాదని, "దశరూపకములయందు .... వీథి లెస్స" అనుట సంభవము కాదు. వల్లభామాత్యు డనుట అసంభవము కాదు. అంతే కాదు. ఆదిని వీథి లెస్స అనియున్నను, ప్రేమాభిరామప్రశంసను "వీథి యను రూపకము మది వెఱపు లేక తిప్పవిభువల్లభుండెట్లు తెనుఁ గుజేసె" నని కలదు. ఇది వీథి లెస్స కాదనుటకు నిదర్శనము. పూర్వోత్తరవిరోధము. "వెఱపు" ఉండవలసిన వీథి లెస్స అని శ్రీనాథుడు అనుటకంటె వల్లభామాత్యుడు అనుటయే సంగతము.

3. పూర్వకవిప్రశంస: రావిపాటి త్రిపురాంతకుడు ఎంతటివాడు? ప్రేమాభిరామ మనంగ నెంతటిది? అను ప్రశ్నలకు సమాధానముగ క్రీడాభిరామమునందున్న పద్యమిది :

"నన్నయభట్టతిక్క కవినాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁ డ తగునా యిటుదోసపుమాటలాడఁగన్."
36ప.

నన్నయభట్టతిక్కకవినాయకులన్న నెన్నుదుటం గరాంజలులు జేయని నించిన" సత్కవీశ్వరులు కలరు. హుళక్కిభాస్కరుండన్నను, చిమ్మపూడి అమరేశ్వరుడన్నను "నెన్నుదుటం గరాంజలులు జేయని నించిన" సత్కవీశ్వరులు లేరు. సత్కవీశ్వరుడైన శ్రీనాథుడు పూర్వకవిస్తుతులందు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను పూజించెను గాని; హుళక్కిభాస్కరుని, చిమ్మపూడి అమరేశ్వరుని, రావిపాటి త్రిపురాంతకుని స్మరింపలేదు. సరికదా,

"నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్." 8ప.1ఆ.భీ.పు.

అనిన శ్రీనాథుని నోట; హుళక్కిభాస్కరునికి, చిమ్మపూడి అమరేశ్వరునికి "నెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని" అను మాట వచ్చుట అసంభవము. రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమును అనుసరించి క్రీడాభిరామమును రచించుటకు సిద్ధపడిన వల్లభామాత్యుని నోట వచ్చుట సుసంభవము. విద్వదౌషధమైన నైషధమును, అయఃపిండమైన కాశీఖండమును ఆంధ్రీకరించిన శ్రీనాథుడు వీధీరూపకమైన ప్రేమాభిరామమును ఆంధ్రీకరించుట కూడ అసంగతము.,

4. ద్విరుపసర్గసంధానము: శ్రీనాథుని కవితామార్గము కుంతకుని వక్రోక్తి జీవితము. అందు ఉపసర్గవక్రత అని ఒకటి కలదు. ఒక ఉపసర్గను గాక, రెండు ఉపసర్గలను చేర్చి శబ్దములను ప్రయోగించుట శ్రీనాథుని సాధారణపద్ధతి. అది శృంగార నైషధాదికృతులందు అగ్రేసరభాసమానము. కతిపయోదాహరణములు : సమనుభూత (83-3)ప్రోత్థిత (61-5) సంవిభాగ (54-6) ప్రత్యుద్ధృతి (123-8శృం.నై.) అభ్యున్నత (30-3) సంప్రరూఢ 44-4 సంప్రదీప్త (109-7హ.వి.)అభ్యున్నత (30-3)

సంప్రరూఢ (44-4)ప్రదీప్త(109-7హ.వి) సంప్రదీప్త (102-2) సుదుస్సహ (161-3)సముద్భ్రాంత (5-5) సంప్రకాశ (46-6భీ.పు.)సమవతీర్ణ (112-2) అభ్యుద్గత (64-3) సమభ్యధిక (181-3)ప్రవిజృంభమాణ (256-6కా.ఖం.)ప్రోద్భవ(115-1) సముద్గత(50-2) ప్రవిలుప్త (78-3)సముద్భట (73-4శి.రా.మా.) ఇట్టి ద్విరుపసర్గసంధానము క్రీడాభిరామమునందు లేదు. "సముపార్జిత" "సంవీక్షింతమో" అను సామాన్యశబ్దములు కలవు. ఇంకను శ్రీనాథుని సంకథా, సంరక్త సమధికప్రభృతి-ఏకోపసర్గశబ్దములు, వ్యాభుగ్న, వ్యామిశ్ర, వ్యాలీఢముఖ్యద్విరు పసర్గశబ్దములు క్రీడాభిరామమునందు లేవు. శ్రీనాథుని ప్రత్యేకప్రయోగములైన ఏకద్విరుపసర్గసంధానములు లేని క్రీడాభిరామము శ్రీనాథకృతము కాఁ జాలదు. వల్లభామాత్య కృతమే అగును.

5. ఆచ్ఛికపదప్రయోగము: క్రీడాభిరామమునందు ముచ్చముడుంగు, ఒఱ గోయు తోపాటు జఱిగొన్న (42) సందిసంది, ఇరుచంబడ, కుమ్మడి (45) ఘుక్కని (50) మాఁగిలి (51) వలతీరు (52) దమ్మదార (54) పఱి తాళింపుచు (75) అప్పసము (86) దిచ్చరించె (95) విజ్జోడుపడ (101) జనపపెద్దలు (122) త్రిక్కటి (125) గవడపేరు (128) పుట్టుఁబాపల (129) దేబెల (129) గనపప్రాఁతర్ల (142) గనపవేటల (145) రంపిల్లఁగా (148) బఱిపోతుగ (168) గాలాము (173) దొరఁగూర్చి (199) పుల్లసిలిన (206) విక్కను (224) తస్సి (230) లాసియు (235) రోవట్టిడి (240) గుల్లాము (265) తోఁపుటంగి (279) ప్రయించు (289) మొదలైన ఆచ్ఛిక పదప్రయోగములు కలవు. ఇవి శ్రీనాథుని ఇతరకృతులందు మృగ్యము. కాఁబట్టి క్రీడాభిరామము శ్రీనాథ కృతము కాఁజలాదు. వల్లభామాత్యకృతమే అగును.

6రచనాకాలము: క్రీడాభిరామములోని పద్యములకు పాఠాంతరకల్పనము, దూరాన్వయకల్పనము, లేఖకవ్యత్యయకల్పనము చేయకుండ, చరిత్రాంశములను సమన్వయించిన క్రీడాభిరామరచనాకాలము శ్రీనాథుని అనంతరకాలమగును. శ్రీనాథుఁడు, వల్లభామాత్యుడు సమకాలికులు కారు. క్రీడాభిరామము శ్రీనాథకృతమే అను నిశ్చితాభిప్రాయమునందే "శ్రీనాథుఁడు క్రీడాభిరామకర్త యనుట కితరసాధనములెన్నియున్నను వల్లభరాయని కాలము వేఱగునేని అవి యెల్లను బొల్లవోవును" అని కలదు[284]. వేఱు కాకపోయినను క్రీడాభిరామము శ్రీనాథకృతమనుటకు బాధకములు, వల్లభామాత్యకృతమనుటకు సాధకములు కలవు. అవి పూర్వోక్తములు. వల్లభరాయని కాలము కూడ వేఱగును. కాఁబట్టి క్రీడాభిరామము శ్రీనాథకృతము కాదు. వల్లభామాత్యకృతమే.

# కాలము

వల్లభామాత్యుని వంశమునందు చంద్రామాత్యుడు "కర్ణాటక్షితినాథు౦డైన పెద బుక్కక్ష్మాపదేవేంద్రు నభ్యర్ణామాత్యు"డు(5ప.)పెదబుక్కక్ష్మాపతి విజయనగరసామ్రాజ్యాధిపతి మొదటి బుక్కరాయలు. మొదటి బుక్కరాయల మొదటి హరిహరరాయలతోడి సంయుక్తరాజ్యకాలము[285] 1346-1357. మొదటి బుక్కరాయల రాజ్యకాలము[286] 1357-1378. సంయుక్తరాజ్యకాలమునందు కంటె స్వతంత్రరాజ్యకాలమునందు చంద్రామాత్యుడు మొదటి బుక్కరాయల మంత్రి అగుట సహజము. కావున చంద్రామాత్యుడు మొదటి బుక్కరాయల మంత్రి అయిన కాలము 1357-1378.

చంద్రామాత్యుని మనుమడు మల్లన తృతీయపుత్రుడు త్రిపురారి "వీరహరిహరరాయపృథ్వీకళత్రరత్నభండారసాధికారప్రగల్భు"డు.(17ప.) అంతేకాదు. "శ్రుతపర్వతదుర్గమహాప్రధానరాడ్గంధగజంబు" (20ప.) వీరహరిహరరాయలు రెండవ హరిహరరాయలగును. రెండవ హరిహరరాయల రాజ్యకాలము[287]. 1378-1404 ఆకాలమునందు త్రిపురారి రత్నభండారాధ్యక్షుడు. త్రిపురారి మొదటి తిప్పన. ఇతడు శ్రుతపర్వతదుర్గమహాప్రధానరాడ్గంధగజము కూడ. శ్రుతపర్వతమన వినుకొండ. శ్రుతపర్వతదుర్గమహాప్రధానరాడ్గంధగజమన వినుకొండదుర్గాధిపతి కుడిభుజము. వినుకొండ దుర్గము కొండవీటి సామ్రాజ్యము లోనిది. 1373-77 సంవత్సరముల మధ్య మాత్రము విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది. 1377 వ సంవత్సరమునుండి 1424వ సంవత్సరము వఱకు మఱల కొండవీటి సామ్రాజ్యమునందు కలిసిపోయినది. అందువలన మొదటి తిప్పన వినుకొండ దుర్గాధిపతి కుడిభుజమైన కాలము 1373-1377 అని ఒక అభిప్రాయ[illegible]దు[288]. అది నిజమైన, అతని ముత్తాత చంద్రామాత్యుడు మొదటి బుక్క[illegible] అగుట మఱి సంభవము కాదు. కావున మొదటి తిప్పన వినుకొ[illegible] కుడిభుజమైన కాలము 1424 వ సంవత్సరము తర్వాత కావలయును. [illegible]త్సరమునందు కొండవీటిసామ్రాజ్యము విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైపోయినది[289]. మొదటి తిప్పన రెండవ హరిహరరాయల కాలమునందు రత్నభండారాధ్యక్షుడు, రెండవ దేవరాయల కాలమునందు [290] (1426-1446) వినుకొండదుర్గాధిపతి కుడిభుజమును అగును.

మొదటి తిప్పన తృతీయపుత్త్రుడు రెండవ తిప్పన. మొదటి తిప్పన భార్య పెద్దమాంబ. (15ప.) రెండవ తిప్పన భార్య చందమాంబ. (22ప.

ఆశ్వాసాంతగద్య)రెండవ తిప్పన "మూడు గ్రామగ్రాసములతోడ మోపూరు పాలించెను" అంతేకాదు. "రాయనవరత్నభండారరక్షకు"డు (20,22ప.) రాయలన రెండవ హరిహరరాయలే కావలసిన ఆవశ్యకము లేదు. కాఁజాలడు కూడ. రాయలు మొదటి దేవరాయలు, రెండవ దేవరాయలు కావచ్చును. రెండవ దేవరాయల కాలమునందు తండ్రి మొదటితిప్పన వినుకొండదుర్గాధిపతి అయిన, తనయుడు రెండవ తిప్పన రత్నభండారాధ్యక్షుడగును. రెండవ దేవరాయల అనంతరము రత్నభండారాధ్యక్షపదవి పోయి మోపూరు పాలకుడగును. మోపూరు కడపజిల్లా పులివెందలతాలూకా లోనిది. మోపూరు పాలకుడన మోపూరు కరణము.

మోపూరు కరణమైన రెండవ తిప్పన ఏకైక పుత్త్రుడు వల్లభామాత్యుడు. ఇతడు మోపూరు కరణమగును. కవికూడ.

చంద్రామాత్యుడు మొదటి బుక్కరాయల కాలమునందు, మొదటి తిప్పన రెండవ హరిహరరాయల, రెండవ దేవరాయల కాలములందు, రెండవ తిప్పన రెండవ దేవరాయల కాలమునందు, రెండవ దేవరాయల అనంతరకాలమునందు ఉండవలయును. కావున చంద్రామాత్యుని జీవిత కాలము 1300-1375, మొదటి తిప్పన జీవితకాలము 1375-1450, రెండవ తిప్పన జీవితకాలము 1425-1500, వల్లభామాత్యుని జీవితకాలము 1425-1500 కావలయును. కాఁబట్టి క్రీడాభిరామము రచనాకాలము స్థూలముగ 1475 వ సంవత్సరము.

క్రీడాభిరామమునందు ఏకశిలానగరములోని "కర్తారుఁడుండు తుర్కల మసీదు" ప్రసక్తి కలదు. (149ప.) అది కాకతీయసామ్రాజ్యాధిపతులు కట్టించునది కాదు. కట్టించినట్లు ప్రమాణమును లేదు. కాకతీయసామ్రాజ్యము పతనమై, ఏకశిలానగరము తురుష్కాక్రాంతమైన కాలమునందు (1323-25) ఏకశిలానగరములోని దేవతాప్రతిమలు భగ్నమైనట్లు కలదు గాని, మసీదు వెలసినట్లు విలసశాసనమునందు లేదు[291]. రావిపాటి త్రిపురాంతకుని (1290-1370)ప్రేమాభిరామమునందు (1320)మసీదు ప్రసక్తి నిరవకాశము. 1425, 1450, 1475సంవత్సరములందు మాత్రమే ఏకశిలానగరమునందు మసీదు వెలయుటకు ఆధారములు కలవని పూర్వోక్తము. (ఆంధ్రభాగవతావతరణము-చారిత్రికనైపథ్యము.) కాఁబట్టి ఏకశిలానగరములోని మసీదు ప్రసక్తి కల క్రీడాభిరామము రచనాకాలము 1425కంటె పూర్వముకాదు. 1450 కంటె తర్వాత కావచ్చును ఇది క్రీడాభిరామము రచనాకాలము స్థూలముగ 1475వ సంవత్సరమగుటకు ఉపబలకసాధనము.

క్రీడాభిరామమునందు కాలజ్ఞానము కలదు. అది మధుమావతి భూతభవద్భావికాలముల జన్మములగుఱించి, ఒక చొక్కపుజోగి సౌధాట్టమున

లిఖించిన "తెనుంగు పద్యము" (240,241ప.) ఆ "తెనుంగు పద్యము" (242ప.) మంచనశర్మ నాటి మధుమావతి దక్షారామమునందు చిన్నిపోతి అను పేర జన్మించి దేవదాసి అగునని. అనంతరము "తమిలేటి పరిసరమున వేంగి కురువాటికా దేశవిపినభూమి ..... చెంచుకులమునందు గడిమి కత్తుల యమ్మి" అను పేర జన్నించునని, ఇట్లు కలదు.

"కడిమికత్తులమ్మి నిడువాలుఁ గన్నులు
గండుమీల నడుచు మిండగీఁడ!
దాని చన్నుదోయి ధారాసురత్రాణ
కటకకుంభికుంభకలహకారి." 243ప.

ఇందు "ధారాసురత్రాణకటకకుంభికుంభకలహకారి"అను సమాసమునకు ధారానగరసురత్రాణుని రాజధానిలోని ఏనుగులకుంభములతో కలహము కలిగించునదని అర్థము వచ్చును. "కుమ్భః కుఞ్జరమూర్ధాగ్రే కుమ్భకర్ణే ఘటే విటే" అని నానార్థరత్ననిఘంటువు. కడిమికత్తులమ్మి కాకపోయినను, స్త్రీమూలకముగ ధారా సురత్రాణునికి, కటకగజపతికి యుద్ధము జరిగిన చరిత్రాంశము గర్భితము[292]. ధారాసురత్రాణుడు మాళవదేశాధిపతి. కటకగజపతి ఉత్కళదేశాధిపతి. యుద్ధము మాళవదేశమునందు, ఉత్కళదేశమునందు గాక ఆంధ్రదేశమునందు జరిగినట్లు "తమిలేటి పరిసరమున వేంగి కురువాటిక" అను వివరము వ్యక్తము సేయును. కపిలేంద్రగజపతికి, ధారాసురత్రాణునికి యుద్ధము జరిగినట్లు కపిలేంద్రగజపతి వెలిగలని, చిఱువ్రోలి శాసనములందు మాత్రమే గాక, 1464 వ సంవత్సరము నాటి గోపీనాథపురశాసనములోని "మాలవధ్వంసలీలాజంఘాలః", "కృత్వాపసయతి మాలవేంద్రజయనం" అను పంక్తులను బట్టి స్పష్టమగును. ధారాసురత్రాణుడు రాజమహేంద్రవరరాజ్యము మీదనే దండెత్తు సన్నాహమునందున్నట్లు శ్రీనాథుని కాశీఖండమునందు కలదు.

"ప్రబలధారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వాఃకవాటప్రదీపిత మది
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము." 58ప.1ఆ.

"ధారాపట్టణ సార్వభౌమసురధాణ్దర్పాపహారక్రియా
ధౌరంధర్యపటిష్ఠనిష్ఠురభుజాదంభోళిసంరంభ!"337ప. 5ఆ.

ధారాసురత్రాణుని దండయాత్రసన్నాహము లేనిచో, రాజమహేంద్రపురము

"ప్రబలధారాసురత్రాణభద్రజాతికరిఘటాసైన్యదుస్సాధ"మని. రాజమహేంద్రవరరాజ్యాధిపతి ధారాసురత్రాణ "దర్పాపహారక్రియాధౌరంధర్యప్రతిష్ఠ నిష్ఠురభుజాదంభోళిసంరంభ"ము కలవాడని శ్రీనాథుడు చెప్పవలసిన ఆవశ్యకము లేదు. ఇది 1433వ సంవత్సరమునాటి స్థితి. అది 1464వ సంవత్సరమునాటి గతి. కపిలేంద్రగజపతికి, ధారాసురత్రాణునికి ఆంధ్రదేశమునందు యుద్ధము జరిగిన కాలము -తన్మధ్య కాలము- స్థూలముగ 1450వ సంవత్సరము. అది గర్భితమైన క్రీడాభిరామము రచనాకాలము తదనంతరమగుట తథ్యము. ఇది క్రీడాభిరామము రచనాకాలము స్థూలముగ 1475 వ సంవత్సరమగుటకు ప్రోద్బలకసాధనము.

మొత్తము మీద క్రీడాభిరామము రచనాకాలము స్థూలముగ 1475వ సంవత్సరము.

# కృతిసమీక్ష

క్రీడాభిరామము వల్లభామాత్యకృతము. రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు అనుసరణము. ప్రేమాభిరామము వీథీరూపకము. క్రీడాభిరామము శ్రవ్యకావ్యము. అంతేకాదు. శ్రుతిమించిన శృంగారమునకు శృంగాటకము. అశ్లీలమైన అసభ్యమైన హాస్యమునకు ఆపణము. సమకాలిక సమాచారమునకు దర్పణము.

కాకతీయుల రాజధాని ఏకశిలానగరమునకు క్రీడాభిరామమునందు రేఖాచిత్రము కలదు. వెలిపాళెము, మేదరవాడ, హట్టమార్గము, హాలికవాటి, వీథీవిటంకము, మోహరివాడ, బాహ్యకటకవీథీవిటంకము, గనపప్రరిఖ, ప్రాకారరేఖ, వంకధార, పెద్దగవని, గడియారము, పూటకూటియిల్లు, బాడబులవాడ, వేశ్యావాటిక, నగరవిశేషములు. ఏకవీర కాకతమ్మ మాహురమ్మ గుడులు, భైరవాలయము, చమడేశ్వరీశక్త్యాలయము, వీరభద్రేశ్వరాలయము, బౌద్ధారామము, ముసానమ్మ గుడి, కుమారస్వామి కోవెల, పాండవుల గుడి, కేశవాలయము, స్వయంభూదేవాలయము, దేవాలయవివరములు; మేదరకరణవేశ్య, చండాలాంగన, కర్ణాటాంగన, పామరభామ, కరణకాంత, గానులకన్నె, గృహిణి, మాలెత,కాపుటాలు, జక్కులపురంధ్రి, ఏడ్వు రక్కలు గొరగపడుచు, పుష్పలావి, మాచల్దేవి, మధుమావతి, మదాలస, పుష్పగంధికానర్తకీమణులు, వారాంగనాజనములు; ఆటది, నట్టువుని కోడలు, జఋభి, కామమంజరి, పూజరిసాని తమ్మడిసాని కూతురు, వెలనాటి కోడె విధవలు, వితంతువులు, స్త్రీవిభేదములు, కుట్రపువాడు, బవనీడు, మైలారుభటులు, బ్రాహ్మణుడు, లక్ష్మణవజ్ఝులు, పాముల మెంగడు, తూర్పునాటి గడిడు, పిల్ల,

తలవరులు, పురుషప్రభేదములు. ఇదియెల్ల రావిపాటి త్రిపురాంతకుని నాటి సమాచారము. వాడవనిత, తుర్కల మసీదు, పలనాటి వీరచరిత్ర ప్రదర్శకులు, సైరికుడు వల్లభామాత్యుని నాటి సమాచారము.

పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమని, రచనాకాలము స్థూలముగ 1446వ సంవత్సరమని పూర్వోక్తము. క్రీడాభిరామము వల్లభామాత్యకృతమని, రచనాకాలము స్థూలముగ 1475 వ సంవత్సరమని ప్రకృతము నిరూపితము. కావున శ్రీనాథుని పలనాటివీరచరిత్ర ద్విపదకావ్యము పాతిక, ముప్పది సంవత్సరములకు ప్రదర్శన రంగమునందు ప్రసిద్ధమై, వల్లభామాత్యుని క్రీడాభిరామమునందు గ్రంథస్థమైనట్లు గ్రాహ్యము

ఏకశిలానగరము స్థూలదర్శనమిది:

"సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన
ఘంటాపథంబైన గగనపరిఖ
తారకామండల స్తబకావతంసమై
కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించిన భువనగోళము భంగి
సంకులాంగణమైన వంకదార
మెఱుఁగుటెక్కులతోడి మేరుశైలముఁ బోలు
పెను బైఁడి తలుపుల పెద్దగవని" 112ప.

ఏకవీరాదేవి పూర్వవృత్తాంతమిది:

"పద్మలోచన భృగుబ్రహ్మసంయమివంశ
పరిపాటి కఠినవాభరణమయ్యె
రమణి త్రేతాద్వాపరముల సంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువుమనియె
నెలఁత కానకకన్న నెయ్యంపుఁ గొడుకుచేఁ
జంపించె ముయ్యేడు సారె నరుల
తరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవడపేరుగఁ జేసి కట్టె నఱుత
మండపాకను బెనుఁబాక మాహురమున
నాగవరమున బోలాస ననిచె నింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడ యేకవీర" 128ప.

గొరగపడుచు గొండ్లియాట

"వెనుకకు మొగ్గవ్రాలి కడువిన్నను వొప్పఁగఁ దొట్టి నీళ్లలో
మునిఁగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చి కొంచు లే
చెను రసనాప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీల నిప్పడు చుపాయము లిట్టివి యెట్లు నేర్చెనో." 144ప.

ప్రతాపరుద్రధరణీశోపాత్తగోష్ఠీప్రతిష్ఠాపారీణ మాచలదేవి చిత్రశాలలోని చిత్ర ములివి:

"అదె దారువనభూమి, యసమనేత్రుఁడు వాఁడె
సంయమీంద్రుల పుణ్యాసతులు వారె
యదె కన్యకారత్నమబ్జాసనుఁడు వాఁడె
యదె రతిక్రీడావిహారశయ్య
వాఁడె వైకుంఠుండు వారె గోపస్త్రీలు
యమునానదీసైకతాంతమదియె
అదె యహల్యాదేవి, యమరాధిపుఁడు వాఁడె
యదె పర్ణశాలికాభ్యంతరంబు
చందురుఁడు వాఁడె యది బృహస్పతి పురంధ్రి
జాలరియునదె శ్రీపరాశరుండు వాఁడె
కుశికజుఁడు వాఁడె యదె యింద్రు కొలువులేమ
చిత్తజుని శౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల" 191ప.

ఇవి రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామములోనివి. అంతేకాదు. కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునాటివి. ఆంధ్రదేశీయములే కావు. భారతదేశీయ ములు. ఇట్టి చిత్రములు శ్రీహర్షుని నైషధీయచరితమునందు కలవు. (21-26శ్లో. 18స.) అవి శ్రీనాథుని శృంగారనైషధమునందు అమరినవి. (151ప.7ఆ.)

క్రీడాభిరామమునందు జూదము, పాములాట, ఆటపాటలు, కోడిపందెము, గొఱ్ఱెపందెము మొదలైనవి కలవు. మేషయుద్ధమునందు రుద్ధహాస్యము కలదు. (232ప.)కోళ్లపోరితము హాస్యపూరితము. (235వచ.236ప.)

"హో! కుమారస్వామి యౌపవాహ్యములార!
హో! మంత్రదేవతాస్వాములార!
హో! కాలవిజ్ఞానపాకకోవిదులార!
హో! భూతభుక్తి కుంభార్హులార!
హో! యహల్యాజారయభనహేతువులార!

హా! బలాత్కారకామాంధులార!
హా! నిరంకుశమహాహంకారనిధులార!
హా! కామవిజయకాహళములార!
హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతాభువనమునకు
మీరు రంభాతిలోత్తమామేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార! 236ప.

ఇది వీరస్వర్గమునకు అధిక్షేపణము. ఇట్లు ఉచ్చనీచముల కలయిక క్రీడాభిరామము. నీచపదార్థమైన శ్లేష్మసేవనము ఈగ లక్షణము. మధురపదార్థమైన మకరందాస్వాదనము తేనెటీగ లక్షణము. క్రీడాభిరామపాఠకులకు తేనెటీగ లక్షణము విధాయకము.

**పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు:** ఈతని కృతులు లభించినవి శాకుంతలము, జైమిని భారతము. లభింపనివి అవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము. (21ప.1ఆ.శా.) అవతారదర్పణమునకు నవరసదర్పణమని ఒక పాఠము కలదు గాని, యతిభంగము ఘటిల్లును. (నవరసదర్పణం బభినవముగ) ఈతని వంశీయుడు సోమనామాత్యుని సీమంతినీపరిణయమునందు "అవతారదర్పణం బన్నకావ్యముఁ జేసె"నని కలదు[293]. ఉదాహరణపద్యములను సంకలన గ్రంథమునందు పిల్లలమఱ్ఱి వీరయ్య పురుషార్థసుధానిధినుండి రెండు పద్యములు కలవు. పురుషార్థసుధానిధి పినవీరభద్రుని కృతి కావచ్చును. కాకపోవచ్చును. పిన వీరభద్రుడు ఆరేడు కృతులు రచించినను రెండే లభించినవి.

శాకుంతలము శృంగారశాకుంతలమని ముద్రణములందు కలదు. కాని గ్రంథమునందు శృంగారశాకుంతలమని లేదు. కావ్యాదిని "శాకుంతలంబను ప్రబంధంబు" అని (28వచ.1ఆ.) "శాకుంతలకావ్యకథ" అని (68వచ.1ఆ.) ఆశ్వాసాంతగద్యలందు "శాకుంతలశృంగారకావ్యము"అని కలదు. అప్పకవీయమునందు శృంగారశాకుంతలమని కలదు. అది శ్రీనాథుని శృంగారనైషధము ప్రభావము కావచ్చును. శృంగారనైషధీయచరితము శృంగారకావ్యమని కలదు. (202వచ.8ఆ. శృం.నై.) అది నలదమయంతుల పరిణయపర్యంతకథ అగుటవలన అర్థవంతము. ఇది శకుంతలాదుష్యంతుల గాంధర్వవివాహపర్యంతకథ కాకపోవుటవలన అర్థహీనము. శాకుంతలమని పిన వీరభద్రుడు పెట్టుకొన్న పేరే సార్థకము. శృంగారనైషధము సకలనలోపాఖ్యానము కాదు. శాకుంతలము సకలశకుంతలాచరితము.

# కాలము

శాకుంతలము చిల్లర వెన్నమంత్రికి అంకితము. వెన్నమంత్రి వంశవృక్షము విపులముగ కలదుగాని చరిత్రాంశము లేదు. వెన్నమంత్రి తాత మేడనకు "పంటనృపకౌస్తుభములకు పాలవెల్లి" అయిన సోమరాజపల్లి 'పైతామహస్థాన"మని మాత్రము కలదు. (32,33ప.1ఆ.) వెన్నమంత్రికి నాలుగుతరముల పూర్వము, పంటనృపులన రెడ్డిరాజులు. వారిలో ఆద్యుడు ప్రోలయవేమారెడ్డి రాజ్యకాలమునందు (1324,25-1353) మేడన పితామహుడు కలడేని, వెన్నమంత్రి ప్రాభవకాలము స్థూలముగ 1454,55-1483 అగును. జైమినిభారతము సాళువనరసింహరాయలకు అంకితము. అతడు మొదట విజయనగరసామ్రాజ్యాధిపతి సేనాధిపతి. పిదప తానే విజయనగరసామ్రాజ్యాధిపతి. "రాజపరమేశ్వరుండు ..... భద్రాసనంబునం బేరోలగంబుండి" జైమినిభారతము రచింపుమన్నట్లు అందు కలదు. (15-18ప.1ఆ.) అంతేకాదు "నృసింహసార్వభౌముని" అని కలదు. (45ప.1ఆ.) "శ్రీవేంకటాద్రినాథదయావర్ధితరాజ్య", "విశదీభూతచక్రవర్తివిలాసా" అను సంబుద్ధులు కలవు. (1ప.5ఆ, 272ప.6ఆ.) రాజపరమేశ్వరవిశేషణము విజయనగరసామ్రాజ్యాధిపతిత్వవిశేషము. ఇది జైమిని భారతము సాళువనరసింహరాయలు విజయనగరసామ్రాజ్యాధిపతి అయిన కాలమగుటకు సాధకము. ఆ కాలము 1486వ సంవత్సరము. కాఁబట్టి జైమినిభారతము రచనాకాలము స్థూలముగ 1486వ సంవత్సరము,[294] శాకుంతలము రచనాకాలము స్థూలముగ 1480వ సంవత్సరమును అగును. అది వెన్నమంత్రి ప్రాభవకాలమునకు (1454,1455-1483) అనుకూలము.

శ్రీనాథుడు, పినవీరభద్రుడు సమకాలికులను కథలు కట్టుకథలే. 1430-1445 రాజమహేంద్రవరము, 1446-1450 బొడ్డుపల్లె వాసస్థలములైన శ్రీనాథుని పినవీరభద్రుడు కనీసము చూచుట కూడ సంభవము కాదు. పినవీరభద్రుడు "వాణి నా రాణి" అన్నాడను కథ కూడ కట్టుకథయే. శాకుంతలమునందు,

"పాసఁ గన్నెఁ గృతిఁ జెప్పఁగా బరిమళంబు ల్వాల కొక్కొక్కచోఁ
గొసరొక్కించుక గల్గనేనియును సంకోచంబు గాకుండ నా
రసి యచ్చోటికి నిచ్చుఁ గాత పరిపూర్ణంబొంద వాగ్దేవి యిం
పెసలారం దన విభ్రమశ్రవణకల్హారోదయామోదముల్" 7ప.1ఆ.

అను పద్యము కలదు. ఇది సరస్వతి జైమినిభారతము రచింప "వాణి నా రాణి అని పిన వీరభద్రుడు అన్నాడను కట్టుకథకు పెట్టుబడి. పిన వీరభద్రునికి

కృతిపరిమళము ప్రీతిపాత్రము.

"నన్నపార్యుని ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కన యజ్వ వాగ్భక్కికామోదంబు
చెలువు కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు
సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల
పరిమళంబులు గూడఁ బఱచ నేర్చు" 19ప ౩ా.

# శాకుంతలము

"భారతప్రోక్త కథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు." 27ప.1ఆ.

అని కృతిభర్త కోరినట్లు వ్యాసుని మహాభారతములోని కథ మూలకారణముగ, కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలములోని కథ సహాయకారణముగ, స్వకపోల కల్పితకథ అభినవకారణముగ పినవీరభద్రుడు రచించినది శాకుంతలము. మహాభారతము మహేతిహాసము. అందు దుష్యంతుని చరిత్రము జనమేజయుడు అడుగకుండ వైశంపాయనుడు చెప్పినది. అది నిర్నిమిత్తము కాదు. అంతేకాదు. యథార్థ కథనము. అభిజ్ఞానశాకుంతలము మహానాటకము. అందు దుష్యంతుని చరిత్రము కాళిదాసు మార్పులు, చేర్పులు చేసినది. అది నాటకలక్షణానుగుణము. భిన్నకథాంశముల, నవ్యకథాంశముల కలగలుపు పినవీరభద్రుని శాకుంతలము.

మహాభారతమునందు దుష్యంతుని గాంధర్వవివాహప్రతిపాదన అవ్యాజము. శకుంతల సంగమనిబంధనప్రకటన సవ్యాజము. వివాహము దుష్యంతుని లక్ష్యము. కుమారయౌవరాజ్యపట్టాభిషేకమే శకుంతల ధ్యేయము. అది గ్రహించిన కణ్వమహర్షి భరతుడు భువనయౌవరాజ్యపట్టాభిషేకమునకు సమర్థుడైన సమయమునందే శకుంతలను దుష్యంతుని పాలికి పంపించెను. అభిజ్ఞానశాకుంతలమునందు దుష్యంతుని ప్రతిపాదనము, శకుంతల అంగీకారము పరస్పర ప్రేమఫలము. శకుంతలను అంతర్వత్నిగానే కణ్వుడు దుష్యంతుని పాలికి పంపించెను. దుష్యంతునికి విస్మృతిదోషము వాటిల్లకుండ దూర్వాసశాపవృత్తాంతము, అంగుళీయకవృత్తాంతము కాళిదాసు కల్పించెను. విస్మృతిదోషము వాటిల్లిన

దుష్యంతునికి విఱుగుడు మహాభారతమునందు అశరీరవాణి వృత్తాంతము. కాళిదాసు అంగుళీయకవృత్తాంతమునందు శకుంతల వ్రేలి అంగుళీయకము పతనమగుట, అసహాయురాలైన శకుంతల మారీచాశ్రమము చేరుట, అచట భరతుడు జన్మించుట, అనంతరము దుష్యంతునికి అంగుళీయకము లభించుట, శాపవిమోచనము కలుగుట, శకుంతలాదుష్యంతుల పునస్సమాగమమునకు కారణమగుట కలదు. అశరీరవాణి వృత్తాంతము, దూర్వాసశాపవృత్తాంతము, అంగుళీయకవృత్తాంతమును మేళవించిన పినవీరభద్రుని శాకుంతలమునందు అంగుళీయకము పతనోత్థానములు లేవు. అశరీరవాణి పలుకగానే అంగుళీయకప్రదర్శనము జరుగును. అప్పుడు నారదుని ఆగమనము పినవీరభద్రుని అభినవకల్పన. అంతేకాదు. దుష్యంతుని వేటవర్ణన, యుద్ధవర్ణన శకుంతలాదుష్యంతుల విరహవర్ణన, కణ్వమహర్షి శిష్యుని హిమాలయవర్ణన, వసంతవర్ణన, మందానిలవర్ణన మొదలైన వర్ణనలు, కణ్వమహర్షి శకుంతలకు బోధించిన పతివ్రతాధర్మములు. నారదుడు భరతునికి బోధించిన రాజనీతిధర్మములు పినవీరభద్రుని అభినవకల్పనములే.

శకుంతల జన్మవృత్తాంతము మహాభారతమునందు కణ్వమహర్షి ఒక మునికి చెప్పిన విధమున శకుంతల దుష్యంతునికి చెప్పినట్లు కలదు. అభిజ్ఞానశాకుంతలమునందు శకుంతల చెలికత్తెలు అనసూయాప్రియంవదలు చెప్పబోయి, "వసంతోదారసమయమునందు విశ్వామిత్రుడు ఉన్మాదము కలిగించు మేనక రూపము చూచి" అని సిగ్గుపడిపోయి అర్థోక్తిలో ఆగిపోవుదురు. అది మహేతిహాసమార్గము. ఇది నాటకపాత్రోచితసరణి. ఇక పినవీరభద్రుని శాకుంతలమునందు కణ్వమహర్షి శిష్యుడు మేనకాసౌందర్యవర్ణనము, పుష్పాపచయవర్ణనము, మన్మథకేళీవర్ణనము మానకుండ విశదీకరించును. ఇది "ముల్లు తీసి కొఱ్ఱు అణచిన చందము" అని ఒక అభిప్రాయము కలదు[295]. అది యథార్థమే.

వర్ణనలందు వైదగ్ధి, వైచిత్రి కలదు. నాయకవర్ణనమునందు శాస్త్రపద్ధతి-

"జగమున రెండు తత్త్వములు శాస్త్రులు చెపు ఎదు రందులోపలన్
జగడము కాని యొక్కరయినం బొడఁగానరు వాని రెంటిలో
సగుణముఁ బట్టి నిర్గుణము శత్రువధూగళసీమలం జను
ల్పొగడఁగఁ జూపు నవ్విభుఁ డపూర్వముగా ఘనశస్త్రపద్ధతిన్."

98ప.1ఆ.

నాయికావర్ణనమునందు కర్షకపద్ధతి-

"జవ్వనంబును తొలుకారు నివ్వటిల్ల

సావితోడను మోహబీజంబు లలుక
మానసక్షేత్రములు దున్ను మదనుఁ డనెడు
కర్షకున కింతి నాసిక కనకహలము." 178ప.2ఆ.

విరహవర్ణనమునందు బంధుపద్ధతి-

"స్వామీ చంద్రమ తావకాన్వయుఁ డు దుష్యంతుండు భూపాలచూ
డామాణిక్యము నీకుఁ దా మనుమఁ డౌటన్ బెక్కు వాక్యంబు లే
లా మా తాతవు నీవు నే మనుమరాలం గాన మేలంబుగా
నా మాటల్వినుమ తప్పుపట్టకు మదిన్మన్నించు గారామునన్."
187ప.3ఆ.

వసంతవర్ణనమునందు రాజపద్ధతి-

"హేమంతంబను రాజు సేన పఱుపన్ హేలాగతిన్ జైత్రుఁ డన్
సామంతుం డెదురం దదీయజవరాజత్కీరతుక్ఖారరిం
ఖామార్గంబుల నించు పాంసువులు నాఁ గం బర్వె నారామకుం
జామల్లీలవలీలవంగవనపుష్పశ్రేణికారేణువుల్." 128ప.2ఆ.

యుద్ధవర్ణనమునందు యుక్తిపద్ధతి-

"తొడుగుట కానరాక వెసతోడన యేయుట కానరాకపై
వెడలుట కానరాక యుడువీథికిఁ బోవుట కానరాక య
య్యొడువిభువంశసంభవుని యుగ్రశరంబుల దైత్యమస్తము
ల్వడుటయు రక్తవాహినులు వాఱుటయుం గనవచ్చె నాజిలోన్."
128ప.3ఆ.

పినవీరభద్రుని శాకుంతలమునందు కాళిదాసు అభిజ్ఞానశాకుంతలములోని అనేకశ్లోకములకు ఆంధ్రీకరణము కలదు.

"అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్యమస్యామభిలాషి మే మనః
సతాం హి సన్దేహపదేషు వస్తుషు
ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః" 21శ్లో1అం.

"సందియమేల యీ వికచసారసలోచన రాజపుత్త్రి నా
డెందము మౌనికన్యలబడిం జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయవిచారపదంబగునట్టి వస్తుసీ
మం దమ చిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్."
64ప.2ఆ.

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవమనాస్వాదితరసమ్,
అఖణ్డం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః"
10శ్లో.2అం.

"కొనగొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచి డా
యని రతనంబు జిహ్వ చవియానని తేనియ గోరు మోపి గి
ల్లని చిగురాకు, లాలితవిలాసనికేతన మీ లతాంగి, దా
ననుభవకర్త యే ఘనుఁ డొయా విధి యత్న మెఱుంగనయ్యెడున్"
158ప.2ఆ.

"సంకల్పితం ప్రథమమేవ మయా తవార్థే
భర్తార మాత్మసదృశం సుకృతై ర్గతా త్వమ్
చూతేన సంగతవతీ నవమాలికేయ
మస్యా మహం త్వయిచ సంప్రతి వీతచిన్తః" 13శ్లో. 4అం.

"కొంత సుఖంబునుం గలదు కోమలి నాకిటఁ, బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం బరువొందిన మాలతీలతా
క్రాంతమనోజ్ఞమైన సహకారముఁ, గన్గొనునప్పుడెల్ల దు
ష్యంతుఁ డు మా శకుంతలయు సంగడి నుండుటగాఁ దలంచెదన్"
91ప.4ఆ.

ఇందు మూడవది స్వతంత్రాంధ్రీకరణము. మూలాతిశాయికము. "తత్ర శ్లోక చతుష్టయమ్" అని ప్రసిద్ధి గాంచిన వానిలో మూడు శ్లోకములను తెనిగించెను. అవి : "యాస్యత్యద్య" (6శ్లో.84,85ప.4ఆ.) "పాతుం న ప్రథమం" (9శ్లో.93ప.4ఆ.) "శుశ్రూషస్వ గురూన్" (17శ్లో.88ప.4ఆ.) ఇందు కడపటి శ్లోకమునకు (17) శ్రీనాథుని ఆంధ్రీకరణము కలదు. (9ప.7ఆ.శృం.నై.) అది పినవీరభద్రునికి ఆదర్శము. కణ్వమహర్షి శకుంతలను పంపించు ఘట్టమునందు పినవీరభద్రుడు అమూలకముగ రచించిన పద్యములందు,

"ఎన్నఁడు నా మది న్మఱతునేనిటఁ, బుత్త్రిక పూఁటుపూఁట యా
సన్నసరోవరంబునను సంస్మరణం బొనరింప సంతత
స్విన్నమరందసిక్తసరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నుల నీటితోడఁ, గుళకంబగుచున్న భవన్ముఖాబ్జమున్" 90ప.4ఆ.

అను పద్యము కరుణరసమునకు పరకాష్ఠ. శకుంతలానిష్క్రమణము మఱింత కరుణరసనిర్భరము. (96-90ప.4ఆ.) అందు శకుంతల అచటి స్థలములు ఒకసారి "చూచి క్రమ్మఱం బోయి చూడవచ్చు"ట (96) తండ్రిఁ బాయంగ లేని సంతాప జలము, నత్తవారింటి కేఁగెడు హర్షజలము" (96) నించుట, 'అరుగుఁ గొండొకనేలఁ దిరిగి మౌనులకు మా యయ్యసుఁ డీ యని యప్పగించు"ట పుటపాకప్రతీకాశము.

పినవీరభద్రుని శాకుంతలమునందు శ్రీనాథుని ప్రభావము శిఖరస్థానీయము. శ్రీనాథుని పదములు, పదబంధములు, సమాసములు, వాక్యములు, వచనములు, పద్యములు, పద్యరచనాపద్ధతులు, భావములు, కథాంశములు పినవీరభద్రుని శాకుంతలమునందు కోకొల్లలు. శ్రీనాథుని శైలీసామ్యము క్రీడాభిరామమునందు అస్థానపతితము. అవహేళనఫలితము. శాకుంతలమునందు సుస్థానకలితము. గౌరవఫలితము. కతిపయోదాహరణలు:

"నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్." 8ప.1ఆ.భీ.పు.

"ఇట్టలమగు మతి భారత
ఘట్టమునకు నడువ నచ్చుగట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్." 11ప.1ఆ.శా.

"కుర్కురప్రకరోదంచితకంఠనాళకుహరీభౌభౌమహారావముల్" 37ప.7ఆ.హ.వి.
"కుర్కురకంఠనాళకుహరీభౌభౌమహారావముల్" 109ప.1ఆ.శా.

"కండూయనము సేయుఁ గరటి శుండాదండ
పుష్కరమ్మున సింహపోతకంబు
వాలారునఖముల వదన మించుకయెత్తి
ముద్దాడుఁ బులి లేటి ముద్దరాలి
నిండు కౌఁగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁడేలు
కాదమచింబోతును గుస్తరించుఁ
గుంజమంటపకుటీక్రోడమధ్యంబున
నాఖుతోఁ జెలఁలాడు నడవిపిల్లి
యెండ దాఁకకయుండంగ నెత్తి పట్టుఁ

బగలు ముంగికి భుజగంబు పడగగొడుగు
కోఁతితో మైత్రి వాటించుఁ గొండగొఱియ
యౌర్వశేయుని పుణ్యాశ్రమాంతరమున" 43ప.2ఆ.కా.ఖం.
"వృద్ధసింహమునకు విహరింపఁ దొడంబు
కైదండగా నిచ్చు గంధగజము
పులి క్రొత్త యీనిన పొదరింటిలోనికిఁ
బురిటాలి తగవుఁ గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ల శిరము దువ్వఁగఁ జొక్కి
కనుమోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింత
లేక చన్నిచ్చు బాలెంతకరిణి
యెలుక తోడుతఁ జెరలాడు నెనసి పిల్లి
నెమ్మిఁ బురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగకన్యక నాడించుఁ బూని నమలి
యనఘ కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున." 45ప.2ఆ.శా.

"జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపు తెఱంగున" 2వచ.4ఆ.శృం.నై.

"జవనిక వాయందట్టినం బొడసూపు బహురూపి తెఱంగున" 78వచ.2ఆ.శా.

"జనకుం గొల్వఁగ వచ్చినప్పుడు తదాస్థానంబులోఁ బాఠకుల్
వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ వర్ణించుచో
వనితారత్నము వీరసేనుతనయున్ వర్ణింపఁగా నున్నత
స్తనభారంబు కెలంకుల న్నినుచుం జంచల్లిల రోమాంచముల్."
74ప.1ఆ.శృం.నై.

"ఆ కాంతాతిలకంబు చన్నుఁగవపై నందంద రోమాంచ మ
స్తోకంబై పొడకట్టు నుత్కళిక చేతోభీతి సంధిల్ల నా
క్ష్మాకాంతామణి మంజుభాషణము లాకర్ణించుచుం దోన తా
నాకర్ణించె మనోజచాపగుణసాహంకారఠంకారముల్." 84ప.2ఆ.శా.

"భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు" 3ప.1ఆ.హ.వి.
"సామాన్యసౌభాగ్యప్రాభవవైభవంబుల"84ప.2ఆ.హ.విశా.
"ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబు
లెవ్వాఁడు శివునిచే నెఱిఁగి కొనియె" 72ప.2ఆ.భీ.పు.
"పంచాక్షరీమంత్రపరమోపనిషదర్థ
వాసనాసంపత్తి యెవ్వాని బుద్ధి" 110ప.2ఆ.శా.

"కాలాంతఃపురకామినీకుచతటీ కస్తూరికా సౌరభ శ్రీలుంటాకము
..." 32ప.2ఆ.శృం.నై.

"సమవర్తి రాణివాసాల పాలిండ్లపై
మృగమదామోదంబు మేత వట్టి" 132ప.2ఆ.శా.

"సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్."
20ప.2ఆ.శృం.నై.

"సదసత్సంశయగోచరోదరి సుధాసంబాధబింబాధరిన్."
178ప.2ఆ.శా.

"-దివ్యగంధములు నాహాపుట్టఁ జేయంగ" 100ప.6ఆ.హ.వి.

"ఆహా పుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్"
188ప.2ఆ.శా.

"గంభీరవాక్ప్రౌఢిమన్" 12ప.1ఆ.శృం.నై.

"క్రమవిభవవ్యాపారప్రౌఢిమంబు" 27ప.3ఆ.శా.

"..... ... ... ... చంద్రసారంగనా
భిసముత్పాదిత తాళవృంతపవనప్రేంఖోల్లనప్రక్రియా
వసరోదంచిత సారసౌరభరసవ్యాలోలరోలంబముల్"
22ప.1ఆ.హ.వి.

"... ... తదంతరాంతరనితాంతామోదహేలాలతాం
తసమాక్రాంత కృతాంతరూప పవమానప్రేంకణ ప్రక్రియా
వసరోదంచితచారుసౌరభరసవ్యాలోలరోలంబముల్."
194ప.3ఆ.శా.

"కైసేయకెన్నఁడు కదియ వధిపు" 72ప.2ఆ.కా.ఖం.

"జలమాడి మడుగువస్త్రముఁ గట్టి కైసేసి
కొనిగాని కవయఁ బోఁ జనదుప్రియుని" 79ప.4ఆ.శా.

"పసుపుం గుంకుమ కజ్జలంబులును గూర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసుపాక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలమున్
ససిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్."
73ప.2ఆ.కా.ఖం.

"కంచెలయుం బటీరతిలకంబును బాపటు చెందిరంబు ఫా
లాంచలసీమ లేఁ బసుపుటచ్చుత బొట్టుఁ జెవాకు గాజులుం
గొంచెపు వీడ్యము న్విరుల కొప్పు వ్రను నొప్పు నొసర్ప నెప్పుడుం
జంచలనేత్ర యుండఁ దగు సంతత భర్తృఫలాభివృద్ధికిన్." 74ప.4ఆ.శా.

"కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁదఁ
జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు" 75ప.2ఆ.కా.ఖం.
"గడపమీఁదను సన్నెకలు మీఁద రోలుమీఁ
ద నునికి విభునికిఁ దఱఁగు యశము" 79వచ.4ఆ.శా.
"ఆహా! లెస్స! వివేకమే!" 72ప.7ఆ.కా.ఖం.
"ఆహా లెస్స విచారమే" 119ప.4ఆ.శా.

శ్రీనాథుడు ఇంద్రాగ్నియమవరుణాదులను పేర్కొనునెడ అన్నికృతులందును పకారవృత్త్యనుప్రాసమును పాటించును. అది కూడ పినవీరభద్రుని అనుకరణమే.

"పాకశాసనపావకపరేతరాజపాశపాణులు" 18వచ.4.ఆ.శృం.నై.
"పాకశాసనపావకపరేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యపన్నగాభరణు
లఁ బరిభవించి" 9వచ.2ఆ.హ.వి.
"పాకశాసనపావకపరేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యపశుపతిప్రధా
నులగు వేల్పులు" 47వచ.4ఆ.భీ.పు.
"పాకశాసనపావకపరేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యులు
పరమహర్షంబున" 9వచ.3ఆ.కా.ఖం.
"పాకశాసనపావకపరేతరాజపలలాశిపవనపౌలస్త్యపన్నగాభరణులకు
నజేయుండు" 147వచ.3ఆ.శా.

శ్రీనాథుని హరవిలాసమునందు, భీమేశ్వరపురాణమునందును సముద్రమథనకథ కలదు. హరవిలాసమునందు లేని విశేషమొకటి భీమేశ్వరపురాణమునందు కలదు. అది విఘ్నేశ్వరపూజ. సముద్రమథనము వలన కాలకూటము పుట్టుటకు కారణము విఘ్నేశ్వరపూజ చేయకపోవుట అని సురాసురులు తలంచి విఘ్నేశ్వరపూజ చేసిన (88-91ప.4ఆ.) అనంతరము చంద్రాదులు అవతరింతురు. ఇది కూడ పినవీరభద్రుడు ఇమిడించినది. వేటకాండ్ర పొగరు, వేటకుక్కల తెంపు, వన్యమృగముల పోతరము చూచి భీతినందిన మాండవ్యుడు దుష్యంతునితో,

"కర్మకాండం బెఱుంగని పామరుండఁగా
ర్యాదిఁ జేకొని వినాయకునిఁ గొల్వు
వేటమైఁ దమి విఘ్నవిభుఁ బ్రార్థనము సేయ
కయ వచ్చినారము గమన వేళ" 9ప.2ఆ.

అని, మృగవిజయము కొఱకు సామజవదనునకు సంకల్పపూర్వకముగ హోమము సేయుటకు సంకల్పించును. (8-11ప.2ఆ.)

శ్రీనాథుడు హరవిలాసములోని గౌరీకల్యాణమునందు గాక, దేవదారువనవిహారమునందు, కాళిదాసు కుమారసంభవములోని హిమాలయనగవర్ణనశ్లోకములు మూడు ఆంధ్రీకరించెను. ఆ మూడు శ్లోకములే పిన వీరభద్రుడును తెనిగించెను[296]. అందొకపద్యము శ్రీనాథుని పద్యమే. హిమాలయనగవర్ణనము శ్రీనాథుడు సీసపద్యముతో మొదలుపెట్టెను. పినవీరభద్రుడును సీసపద్యముతోనే మొదలుపెట్టెను. శ్రీనాథుడు వచనములో ముగించెను. పినవీరభద్రుడును వచనములోనే ముగించెను. (20-27వచ.5ఆ.హా.వి., 101-109 వచ. 2ఆ.శా.) శ్రీనాథుని ఒక పద్యములోని "హేమశైలంబు దోగ్ధగా భూమి సురభి" అను ప్రథమపాదము, "అమరశైలంబు దోగ్ధగా నవనిసురభి" అని పినవీరభద్రుని ఒక పద్యమునందు చతుర్థపాదమైనది.

"యంత్రాంశుకాక్షేపవిలజ్జితానాం
యదృచ్ఛయా కింపురుషాఙ్గనానామ్
దరీగృహద్వారవిలమ్బిబిమ్బా
స్తిరస్కరిణ్యో జలదా భవన్తి" 14 శ్లో. 1స.

అను కాళిదాసుశ్లోకమునకు,

"ఎంచి నుతింప శక్యమె యహీశ్వరు నంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమనిరస్తరవీందుమరీచిజాలమున్
గాంచనకందరాయవనికాయితవారిధరాంతరాళని
ర్వంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్." 21ప.5ఆ.

అని శ్రీనాథుని ఆంధ్రీకరణము.

"ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమనిరస్తసమస్తరవీంద్రుజాలమున్
గాంచనకందరాయవనికాయితవారిధరాంతరాళని
ర్వంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్."

102ప.2ఆ.శా.

ఇందు 'సమస్తరవీంద్రుజాలమున్' అను పాఠము అపపాఠము. రవీందులు జాలము కాదు. సమస్తవిశేషణము సార్థకము కాదు. "రవీంద్రుమరీచిజాలమున్" అనియే కవిపాఠము.

# జైమినిభారతము

వ్యాసుడు మహాభారతమును జనమేజయునికి వక్కాణించుటకు వైశంపా యనుని పంపెనని నన్నయ భారతమునందు కలదు. (66వ.1ఆ.ఆ.ప.) వ్యాసభారత మునందును కలదు. అట్టిది జనమేజయునికి జైమిని వక్కాణించినట్లు, జైమిని రచించినట్లు పినవీరభద్రుని జైమినిభారతమునందు కలదు. (17,26,52వచ.1ఆ.) అంతేకాదు. జైమిని రచించినట్లు కల సంస్కృతజైమినిభారతమును కలదు. కాని లభించిన సంస్కృతజైమినిభారతము, పినవీరభద్రుడు తెనిగించిన జైమిని భారతము, లక్ష్మీశుడు కన్నడించిన జైమినిభారతమును అశ్వమేధపర్వమే. వ్యాస భారతములోని అశ్వమేధపర్వమునకు సామ్యము తక్కువ. భేదము ఎక్కువ. వ్యాసభారతమునందు మరుత్తుని చరితము కలదు. అది జైమినిభారతమునందు అతిసంగ్రహముగ కలదు. వ్యాసుడు ధర్మరాజును అశ్వమేధయాగోన్ముఖుని చేయుట, ధర్మరాజు అర్జునుని యజ్ఞాశ్వరక్షణము చేయుటకు నియోగించుట, అర్జు నబభ్రువాహనయుద్ధము రెండిట కలదు. వ్యాసభారతములోని ఇతరవిషయములు జైమినిభారతమునందు లేవు. జైమినిభారతములోని ఇతరవిషయములు వ్యాసభార తమునందు లేవు. జైమిని భారతము కృష్ణమూలకము. భీమనాయకము. దక్షిణభా రతప్రధానము. అనౌచిత్యభరితము.

వ్యాసభారతమునకు కవిత్రయము వారి భారతము వలె, జైమినిభారతమునకు పినవీరభద్రుని జైమినిభారతము స్వతంత్రాంధ్రీకరణమే కాని, కథను గైకొనుటయందు కవిత్రయము వారంత స్వాతంత్ర్యమును పినవీరభద్రుడు వహింప లేదు. శ్రీనాథుని వలె అనౌచిత్యమును పరిహరింపలేదు. సరికదా ఒకచో సముచి తమని సమర్థించెను. ద్వారకనుండి పురజనులను వెంటఁ బెట్టుకొని హస్తినాపు రమునకు వచ్చునెడ శ్రీకృష్ణభీమసేనుల బావమఱదుల పరిహాసము (4-7శ్లో.11అ.) అటు శ్రీకృష్ణునికి, ఇటు భీమసేనునికి అపకర్ష కలిగించునది. అయినను పిన వీరభద్రుడు,

"కలయఁ బడి మూఁపు మూఁపునఁ దలఁగ ద్రోయ
రాని సందడి నడుచు పౌరవ్రజంబు
నరయుచును వచ్చు వృద్ధవేశ్యాజనంబుఁ
జూపి నవ్వుచు హరి వాయుసుతున కనియె. 62

"వీరిఁ బరిగ్రహింపు మిది వేళ సమానలు నీకు భీషణా
కారకఠోరమన్మథవికారగుణంబుల నన్ను నవ్వి య

మ్మారుతి పల్కె నిట్టి కొలఁబూలిన జంతలఁ జక్కఁ బెట్టు నీ
భారము వన్నెకెక్కు దురవస్థలు నీ కరలాలనంబునన్." 63ప.3ఆ.

అని తెనిగించుటయేగాక, "అని చాణూరబకాంతకుల్ సముచితవ్యాహారులై" అని సమర్థించెను. (64ప.3ఆ.) ఇది లక్ష్మీశుడు పరిహరించెను[297]. ఇంతకంటె ఘోర మైన అనౌచిత్యము రుక్మిణితో శ్రీకృష్ణుని సంభాషణము. (49-51శ్లో.11అ) అది కూడ పినవీరభద్రుడు

"కమలదళాక్షుఁ డంత నిజకామిని రుక్మిణితోడ నిట్లనున్
గమలిని, జూచితే ప్రియుఁడు గన్గొనెరామి మరాళసామజ
భ్రమరకులంబు పైఁ బడఁ గరంబు సుఖించెడుఁ గామ మెప్పుడున్
రమణుని కంటె నెన్మిది గుణంబులు గాదె లతాంగి కారయన్."
67ప.3ఆ.

అని ఆంధ్రీకరించెను. ఇది కొంత సుకుమారముగ లక్ష్మీశుడు కన్నడీకరించెను[298]

అశ్వమేధపర్వము ప్రధానవిషయము ధర్మరాజు అశ్వమేధయాగనిర్వ హణమైనను, కృష్ణభక్తికి ప్రాధాన్యము కలదు. యాగాశ్వసంపాదనమునకు, అశ్వమేధయాగసంరక్షణమునకు జరిగిన అనేకయుద్ధములందు అన్ని విజయ ములు కృష్ణధ్యానఫలములు. శ్రీకృష్ణుని మాహాత్మ్యమునకు, సుధన్వుడు తప్తతైల కటాహమునందు ప్రవేశించినను, నిశ్చింతగ సజీవుడుగ ఉండుట ప్రముఖోదా హరణము. సుధన్వుని శ్రీకృష్ణస్తుతి మూలమునందు పంద్రెండు శ్లోకములందు కలదు. (178-189శ్లో.17.అ.) తెనుగు సేతను ఒకపద్యమునందు కలదు. (132ప.4ఆ.) కాగుచున్న నూనెతొట్టెలోని సుధన్వుని వర్ణన (190,191శ్లో.17అ.) తెనుగుసేతను మూలాతిశాయి.

"తడయక మందు తైలపరితప్తకటాహము కేలుదామరం
దొడికిలి పట్టి రాహువు విధుం గబళించిన రీతిఁ జూపఁ గ్రొ
మ్మడుగున కేఁగు భద్రకరి మాడ్కి సుధన్వుఁడు చొచ్చె బిట్టుగా
నుడికెడి నూనెతొట్టె బలియుర్ హరిదాసులు సత్యసంపదన్. 133

కీలిశిఖాముఖదారుణ
తైలకటాహంబు కంఠదఘ్నమయిన భూ
పాలసుతు వదన మొప్పెన్
గాళిందీనదములోని కమలము భంగిన్. 134

ఆ హేమకృతకటూహ
స్నేహము దనుజారిదాసునికిఁ జారుశర
న్నీహారకిరణచంద్రిక
యై హర్ష మొనర్చుచుండె నా సమయమునన్." 5ప.4ఆ.

ఇందు మూలములోని "నీటిలో వికసించిన పద్మము" "కాళిందీనదములోని కమల"మైనది. "రాహువు విధుం గబళించిన రీతి", "క్రొమ్మడుగున కేఁగు భద్రకరి మాడ్కి" "చారుశరన్నీహారకిరణచంద్రిక" పినవీరభద్రుని స్వతంత్రకల్పనలు.

జైమినిభారతమునందు యౌవనాశ్వుని యజ్ఞాశ్వమును తెచ్చుటకు భీమసేనుడు నాయకుడుగ, కర్ణసుతుడు వృషకేతుడు, ఘటోత్కచసుతుడు మేఘవర్ణుడు సహాయకులుగ దండయాత్ర సాగించుట కలదు. అందు వృషకేతుని పాత్ర అద్భుతముగ చిత్రింపఁ బడినది.

"దినపజుఁడు భవజ్జనకుం
డనవరతాభీష్టదాతయైనను నాలం
బునఁ దెగిన ప్రాణములు త
త్తనువున కీ నేరఁ, డివ్విధంబున నతఁడున్" 93ప.2ఆ.

అని యౌవనాశ్వుడు వృషకేతుని తండ్రిని మించిన తనయునిగ పేర్కొనుట వాక్స్తవము కాదు. వాస్తవము. భీమాదులు యౌవనాశ్వుని యజ్ఞాశ్వమును తెచ్చుట వ్యాసభారతమునందు లేదు. ఈ ఘట్టమెల్ల కృష్ణభక్తివిలసితమే.

అర్జునుని దిగ్విజయములు ప్రాధాన్యవివక్షను, వ్యాసభారతమునందు త్రిగర్త, ప్రాగ్జ్యోతిష, సింధు, మణిపూర, మగధ, వంగ, పుండ్ర, (ఉత్తర)కోసల, కాశీ, శృంగ,(దక్షిణ)కోసల, కిరాట, దాశార్ణదేశములందు, జైమినిభారతమునందు మాహిష్మతీపురము, మహిళామండలము, వృక్షదేశము, మణిపురము, రత్నపురము, సారస్వతపురము, కుంతలదేశములందుకలిగినవి[299]. వ్యాసభారతములోనివి ఉత్తరభారతదేశీయములు. జైమిని భారతములోనివి దక్షిణభారతదేశీయములు.

జైమినిభారతము కృష్ణమూలము, భీమనాయకము, దక్షిణభారతప్రధానమును అగుటవలన అర్వాచీనగ్రంథమని ఒక అభిప్రాయము కలదు[300]. ప్రాచీనగ్రంథమే అని ప్రత్యభిప్రాయమును కలదు[301]. జైమినిభారతము జైమినిప్రోక్తము. అది వ్యాసభారతమునకు విరుద్ధము. జైమినికృతము కాదు. అర్వాచీనగ్రంథమగుటయే సంభవము.

బభ్రువాహనవృత్తాంతము వ్యాసభారతమునందు, జైమినిభారతమునందును కలదు. బభ్రువాహనపుత్త్రునిచే అపమరణము నందిన అర్జునుని గుఱించి, చిత్రాంగద మొదలైన అంతఃపురాంగనలు రోదించినట్లు మాత్రమే ఉభయసంస్కృతభారతములందును కలదు. (38,39శ్లో. 79అ.1శ్లో.80అ.వ్యాభా; 77,78శ్లో.38అ.జై.భా.) తిక్కన చిత్రాంగద పార్థుని సమీపించి విలపించినట్లు రచించెను. (68,69ప.4ఆ.) అది గమనించి, పినవీరభద్రుడు, అంతకంటె హృదయవిదారకముగ, ఒక్కచిత్రాంగదయే గాక ఉలూచితోపాటు అంతఃపురాంగన లందఱును "శోకవహ్నిం బొగిలి పొగిలి" విలపించినట్లు ఇట్లు రచించెను.

"దివిజులఁ దఱిమి ఖాండవము సప్తార్చికి
ధారవోసిన యశోధనుఁడు వీఁడె
నిఁటలాక్షుతోడ నెక్కటి పోరి పాశుప
తము గొన్న విక్రమోద్ధతుఁడు వీఁడె
కాలకేయాదిరాక్షసుల నుక్కడఁగించి
జయము గైకొనిన దుర్జయుఁడు వీఁడె
కలన భీష్మాదియోధుల గర్వ మెడలించి
పసి మరల్చిన బాహుబలుఁడు వీఁడె
యగ్రజునకును రాజసూయాధ్వరప్ర
శస్తి నెఱపిన భ్రాతృవత్సలుఁడు వీఁడె
యదుకుమారుల సరకు సేయక సుభద్రఁ
గడిమిఁ జేకొన్న హరి చెలికాఁడు వీఁడె" 59ప.7ఆ.

ఇది తిక్కన "ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నులపాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె" అను పద్యమునకు (175ప.3ఆ.ఉ.ప.) అనుకరణమైనను సందర్భోచితము. కరుణరసకంపము కలిగించునది.

ప్రమీలార్జునీయవృత్తాంతము వ్యాసభారతమునందు లేదు. జైమిని భారతమునందే కలదు. అర్జునుని యజ్ఞాశ్వమును పట్టుకొన్న మహిళామండలి వర్ణన మూలమునందు మామూలు ధోరణిలోనే కలదు. (95,96శ్లో.21అ.) ఆ మహిళలు సాధారణలుకారు. ధనుర్ధరలు. ప్రతాపధురంధరలు. అందుకు పినవీరభద్రుడు అతిస్వతంత్రముగ అందము, చందము కలిసివచ్చునట్లు అభివర్ణించిన పద్యమిది:

"నెలవంకబొమలకుఁ దలఁకి మ్రొక్కుచునున్న
పగిది నానమితచాపములు మెఱయఁ
గలికిచూపులకు భీతిలి డాఁగి నిలిచిన

కైవడిఁ బొదుల మార్గణము లమరఁ
గుచమండలములఁ గన్గొని భయంబందెదు
రీతిఁ జక్రములు పరిభ్రమింప
నలువొందు రోమావళులకుఁ గాక వడంకు
కరణిఁ బట్టంబులు కంప మొంద
వీరశృంగారములు మేళవించినట్టి
చెలువమున నిందుముఖులు తేజీల నెక్కి
వచ్చి రాహవ మొనరింప వారిలోనఁ
బడతిఁ యొక్కతె మున్నాడి పాఱితెంచి" ౹11ప.5ఆ.

ఇది పినవీరభద్రుని స్వీయకవిత. ఇందు మేళవింపఁబడిన ఇందుముఖుల వీరశృంగారముల చెలువము ప్రకరణోచితము. ప్రమీల,

"కిం కరిష్యసి యాగేన మయా సహ మధుం పిబ
దర్శయిష్యామి తే సౌఖ్యం యన్నదృష్టం త్వయాపురా."
9,10శ్లో.22అ.

అని పార్థునితో అన్నట్లు మూలమునందు కలదు. "యాగమువలన ఏమి చేయ గలవు? నా తోపాటు మధుపానము సేయుము. ఇంతకుముందు నీకు కనిపించని సౌఖ్యమును చూపింతును" అను ప్రమీల అభిభాషణములోని ధార్ష్ట్యము అర్జునునికి అసహ్యము కలిగింపవచ్చును. అందుకు పినవీరభద్రుని అన్యథా కరణమిది:

"సోమపానంబు నీ యగ్రజుండొనర్చి
యిష్టఫలభోగములఁ బొందనిమ్ము నీవు
నిటు మదీయాధరామృతం బెలమిఁ గ్రోలి
యువతిమండలమున కెల్ల నొడయఁడగుము." 117ప.5ఆ.

ఇందు యాగనింద లేదు. మధుసేవ కాదు. ధర్మరాజునకు సోమపానము. అర్జునునకు అధరామృతపానము. ఆమీద యౌవతాధిపత్యము. ప్రమీల మాటలివి ప్రలోభనీయములు. అనుద్వేగకరములు. అనౌద్ధత్యభరములు. అయినను తన ప్రణయాభిలాషను కాదన్న అర్జునుని ప్రమీల ఇట్లు బెదిరించినది.

"అర్జునోభయథా నూనం తవ మృత్యురయం స్థితః
మచ్ఛరై ర్నయనై ర్వాపి తాడ్యమానో న జీవసి" 11, 12శ్లో.22అ.

"నా తూపుల వలన గాని, చూపులవలన గాని నీకు చావు నిక్కము. నాతో నీవు కలిసిన నీకు సౌఖ్యము, నాకు నీ తోపాటు మరణము" అని మూలము.

"రణమున నాదు భీకరశరంబులనైన లసత్కటాక్షవీ
క్షణములనైన నిన్నిపుడు చంపుట తప్పదు రిత్త చావఁ గా
రణమది యేల? నన్నురతిరాజసుఖంబులఁ దేల్చి తీఁటినన్
గణనకు నెక్కఁ బావకముఖంబున నీబడి నేఁ గుదెంచెదన్"

120ప. 5ఆ.

అను పినవీరభద్రుని ఆంధ్రీకరణము మూలాతిశాయిగ కలదు.

చంద్రహాసవృత్తాంతమును వ్యాసభారతమునందు లేదు. జైమినిభారతమునందు మాత్రమే కలదు. సమ్ముఖము వేంకటకృష్ణప్పనాయకుని వచనజైమినిభారతములోని చంద్రహాసోపాఖ్యానము పాఠ్యభాగమగుటవలన ప్రాచుర్యమునందినది. ఇందు దుష్టబుద్ధి చంద్రహాసుని చంపించు నిమిత్తము, తన పుత్త్రుని యొద్దకు చంద్రహాసుని పంపుచు ఒసగిన పత్రమునందు ఇట్లు కలదు.

"స్వస్తి శ్రీరస్తు మదన వక్తుం కారణమీదృశం
చన్ద్రహాసౌ హితో తీవ మమాయం సంపదాం ప్రభుః" 9శ్లో.
"విద్యాబలం విలమ్బం మా మిత్రస్యాస్య కురు ధ్రువమ్
విషమస్మై ప్రదాతవ్యం త్వయా మగనశత్రవే." 11శ్లో.54అ.

ఇట్లున్న పత్రికను దుష్టబుద్ధి పుత్త్రికయే మార్చిన విషయమిట్లు కలదు.

"కనిష్ఠికా నఖే నాథ తీక్ష్ణ నాదయ సున్దరీ" 14శ్లో.
రసాలద్రుమనిర్యాసం విలేఖ విషయా తదా
విషయాస్మై ప్రదాతవ్యే త్యేవం వర్ణాన్ సమాలిఖత్" 15శ్లో. 54అ.

ఇది పినవీరభద్రుని తెనుగసేతను ఇట్లు కలదు.

"స్వస్తి సమస్తప్రశస్తగుణాన్వితుం
డవు దుష్టబుద్ధి నిజాత్మజుఁ డగు
మదను దీవించి ప్రేమముగఁ బుత్తెంచిన
శుభలేఖ చంద్రహాసుఁడు కుళిందు
పట్టి కులస్థాన పౌరుషాధికుఁ డు సి
ద్ధంబుగా మనకు నీతండహితుఁ డు
కాన సందేహంబు మాని యీ పత్రిక
వీక్షించి నపు ్ఢెడె విషయనొస‌ గు" 83ప.8ఆ.

ఇది దుష్టబుద్ధి పుత్త్రుడు చదివిన పత్రిక లోనిది. దుష్టబుద్ధి పుత్త్రిక మార్చినది.

మూలమునందు అవగ్రహమొకటి ఒక పదచ్ఛేదమునకు ఆవశ్యకము. మఱొక పదచ్ఛేదమునకు అనావశ్యకము. ఆ పాటి చిక్కును లేకుండ పద్యమునందు ఒక్క అక్షరము మార్పు సరిపోయినది. "విషము నొసంగు"మని దుష్టబుద్ధి వ్రాత. "విషయనొసగు"మని దుష్టబుద్ధి పుత్త్రికచేత అయినది. ఆమెయే విషయ. "ఈతండహితుండు"అనునది. ఈతండు+అహితుండు; ఈతండ+హితుండు" అను పదచ్ఛేదములకు అవగ్రహము లేకుండ అమరిపోయినది. ఇది పినవీరభద్రుని ఆంధ్రీకరణనైపుణకి తార్కాణము.

ఎన్ని వృత్తాంతములు జైమినిభారతమునందున్నను, అన్ని వృత్తాంతముల కంటె అగ్రేసరమైనది. శ్రీరామచరిత్రమని పినవీరభద్రుని అభిప్రాయము.

"వెలయఁగ నీ కథ విను ధ
న్యులు తక్కిన కథలు వినఁగ నొల్లరు మధిఁ గా
కుల రొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్" 270ప.6ఆ.

"ఈ కథ" అన్నది శ్రీరామచరిత్రమే. అది వ్యాసభారతమునందు లేదు. జైమినిభారతములోని శ్రీరామచరిత్రము కాకుల రొదల మధ్య కోకిల కలకూజితమే. అట్టి శ్రీరామచరిత్రమునందు సీతాపరిత్యాగఘట్టమున పినవీరభద్రుని కవితా లేఖిని పరవళ్లు త్రొక్కినది. శ్రీరాముని ఆనతిని లక్ష్మణుడు వినిపింపఁగా సీత నేలఁ గూలినప్పుడు మూలమున అంబరమునుండి రోహిణి రాలిపడుట సాదృశ్యముగ కలదు. "అమ్బరా ద్రోహిణీ యథా" (35శ్లో.28అ.) ఇంతకంటె ఉజ్జ్వలమైన ఉపమానము పినవీరభద్రుని ఉపాయనము.

"ఆ తీవ్రభాషణము విని
సీతాతన్వంగి సొమ్మసిలి వ్రాలె ధరి
త్రీతలము మీఁద ఝుంఝూ
వాతాహతిఁ బడిన పుష్పవల్లికఁ బోలెన్." 65ప.6ఆ.

ఇది మూలమునందలి ఉపమానము కంటెనే కాదు, ఉత్తరరామాయణములోని "కీలెడపిన జంత్రము క్రియ " అను తిక్కన ఉపమానము కంటెను (17ప.9ఆ.) ఉజ్జ్వలమైనది. తిక్కన ఉపమానము యాంత్రికము. జైమిని ఉపమానము కాల్పనికము. పినవీరభద్రుని ఉపమానము వాస్తవికము. శ్రీరాముని ఆనతి హఠాత్సంభూతమైన దుర్భరవిషయము. ఝుంఝూవాతాహతి అట్టిది. సీత యంత్రము కాదు. రోహిణియును కాదు. పుష్పవల్లికయే. సీతాతన్వంగి అని ఉపమేయమునందు కలదు. పుష్పవల్లిక అని ఉపమానమునందు కలదు. సీత సౌకుమార్యమే గాక,

గర్భవతి కావున గాంభీర్యమును స్ఫురించుటకు పుష్పవల్లికతోడి సాదృశ్యము పొసగునది. ఝంఝూవాతాహతి వలని పుష్పవల్లిక పతనము స్వాభావికమే గాక సన్నివేశసుభగము.

ఇట్లు సొమ్మసిలి, నేలమీద వ్రాలిన సీత, కొంతవడికి తేరుకొని, లక్ష్మణునితో మాటాడిన సందర్భమున, రాముని అధికరించి పలికినట్లున్న మూలములోని శ్లోకములను (48-52శ్లో.28అ. ) నిమిత్తమాత్రముగ గైకొని, పినవీరభద్రుడు స్వతంత్రకల్పనమున సంతరించిన పద్యమిది.

"విపులబాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నా నిమిత్తంబ కాదె
చలపట్టి దైతేయశాంబరీమృగము మ
స్తముఁ ద్రుంచె నా నిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన
దాఁటించె నా నిమిత్తంబ కాదె
కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికం
ధరుఁ గూల్చె నా నిమిత్తంబ కాదె
యట్టి రాముండు తాన నన్నడవిలోన
డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచె నట్లు
తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకు." 71ప.6ఆ.

ఇందు అన్న ప్రతిజ్ఞ నెఱవేర్చిన మఱది లక్ష్మణుని, "తమ్ముఁడ" అని సీత ఆమంత్రించుట మకుటాగ్రమణి. అది లక్ష్మణుని హృదయమును కలగించునది.

"కాకపక్షధరః పూర్వం రామః కౌశికసంయుతః
ఆగతో మిథిలాం పూర్వస్త్వయా సహ మహామతే." 48శ్లో.28అ.

అను మూలములోని శ్లోకమునకు,

"దీక్షితుఁడైన కౌశికుఁడు దేరఁగ నాఁడు వివాహవేళ నా
లక్షితకాకపక్షసమలంకృతమున్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణబింబనిభంబు విశాలపుండరీ
కాక్షమునైన రాముని ముఖాంబుజ మెన్నఁడు బాయ దాత్మలోన్"
72ప.6ఆ.

అని పినవీరభద్రుని తెనుగుసేత. ఇందు భావమును పుటము పెట్టి స్ఫుటము

చేయుట ప్రస్ఫుటము.

"మద్వియోగే సతి పురా వృక్షా నాలిఙ్గతిస్మయః
స రామో వ్యజహాత్ సీతాం దైవమేవహి కారణమ్." 50శ్లో.28అ.

అను శ్లోకమునకు,

"నను఻ బాసి విరహతాపము఻
గొని తీ఻గల఻ గౌఁగిలించుకొనెన఻ ట నే఻ డ
వ్వనవల్లుల లోనన న
న్నునిచెన఻ ట రాము఻ డేమనుదు దైవంబున్." 73ప.6ఆ.

అని పినవీరభద్రుని తెనుగుసేత. వృక్షములను గాక తీ఻గలను కౌ఻గిలించు కొన్న అను పరిష్కారము సముచితము. సీతాస్థానీయము లతయే. నాడు సీతా విరహతాపము కొలది తీగలను కౌగిలించుకొన్న రాముడు నేడు సీతను తీగలన డుమనే నిలిపెననుట యత్తదుచితము. దైవమే కారణమను నిర్దేశము కంటె, దైవ మును ఏమనుదునను నిర్వేదము రసనిర్భరము. ఇది జైమినిభారతాం ధ్రీకరణములోని పినవీరభద్రుని జాగరూకతకు మూదల.

జైమినిభారతము యుద్ధమయము. అందు కుశలవుల యుద్ధము జైమిని భార తములోని అన్యయుద్ధముల కంటెను మాత్రమేగాక, వ్యాసభారతములోని అనేక యుద్ధముల కంటెను అగ్రగణ్యము. ప్రతిక్షణోత్కంఠాపాదకము. యజ్ఞాశ్వము లలాటపట్టికలోని సువర్ణపత్రబిరుదాక్షరపంక్తిని,

"మిత్రకులాగ్రణిదివిజ
స్తోత్రపరాక్రము఻ డు వీరసూః కౌసల్యా
పుత్త్రు఻ డు రఘుపతి విడిచిన
సత్రహయము఻ బట్టు఻ డుర్వి సాహసులున్నన్. 114

అని చదివి లవు఻ డు రాఘవ
మనుజేశుని తల్లి వీరమాత఻ ట సీతా
జనని కుశలవులు నిరువురం
గనియు నకట గొడ్డువోయె఻ గడపట నను చున్. 115

"కవకవ నవ్వి యజ్ఞతురగంబు మెడం దన యుత్తరీయమున్
లవు఻ డు దవిల్చి మొక్కలమున఻ గదళీతరువందు఻ గట్టివే"యు
116ప.6ఆ.

మొదటి సంఘటనమే ఉత్సుకతాబీజము. శత్రుఘ్నుడు లవుని, కుశుడు శత్రుఘ్నుని మూర్ఛితులను చేయుట, లవకుశులు లక్ష్మణుని నిహతుని చేయుట రాముని మూర్ఛితుని చేయుట బిందుపతాకలు. శ్రీరాముడు కుశలవులను కుశలప్రశ్న లడుగ

"పోరి కెదిరించి మా పుట్టుపూర్వములను
దెలియఁ బనియేమి? మీకు నీ తేటలకును
హయము విడుతుమె యైన మీ యంతవార
లడుగఁ జెప్పమి తగవుగాదని కుశుండు" 223ప.6ఆ.

చెప్పుట ముగ్ధమనోహరము. కడకు వాల్మీకి వలన కథ సుఖాంతమై,

"మోహపరవశుల నూహా
పోహపరిజ్ఞానమూఢబుద్ధుల నాత్మ
ద్రోహుల మముఁ బ్రోవుము వై
దేహీనందనుల నన ముదితహృదయుండై" 259ప.6ఆ.

శ్రీరాముడు కుమారులను కౌగిలించుకొని, మూర్ధఘ్రాణము చేసి మన్నించును.

పినవీరభద్రుని జైమినిభారతమునందు, శాకుంతలమునందు వలె శ్రీనాథుని పదములు, పదబంధములు, సమాసములు, వాక్యములు పుష్కలముగ లేవు గాని అసలు లేకపోలేదు. అవి లేకపోయినను జైమినిభారతములోని పినవీరభద్రుని అనేకపద్యములు శ్రీనాథుని పద్యములే అనిపించును. శ్రీనాథుడు ప్రవేశపెట్టిన ప్రౌఢిమశబ్దమును పినవీరభద్రుడు జైమినిభారతమునందు ముమ్మాఱు ప్రయోగించెను.

"అస్తోకప్రౌఢిమ" 39ప.5ఆ.
"అవిచ్ఛేద్యప్రౌఢిమ" 186ప. 5ఆ.
"కార్ముకముఖాస్త్రప్రౌఢిమలు" 49ప.8ఆ.

ఇతర సంస్కృతప్రౌఢిప్రయోగములు, తెలుగు నుడికారములును కలవు.

"-పాఠీనచ్ఛాయాదాయాదంబులైన" 110వచ.2ఆ.భీ.పు.
"అర్చిశ్ఛటాదాయాదోత్కటకీలలన్" 29ప.5ఆ.జై.భా.
"మందరాచలమంథానమథ్యమాన" 92ప.4ఆ..భీ.పు.
"మంథరాచలమంథానమథ్యమాన" 33ప.2ఆ.జై.భా.

"ధూళిపాళిక చుళుకించె" 25ప.4ఆ.శృం.నై.

"ధూళీపాళికచుళుకిత" 205ప.5ఆ.జై.భా.

"నీ భాగ్యంబు సామాన్యమే" 13ప.1ఆ.శృం.నై.

"మద్భాగ్యంబు సామాన్యమే" 103ప.5ఆ.జై.భా.

"కుడిచి కూర్చుండి" 53ప.4ఆ.భీ.పు.

"కుడిచి కూర్చుండి" 68ప.1ఆ.108ప.2ఆ.జై.భా.

"కుస్తరించు " 44ప.2ఆ.భీ.పు.

"కుస్తరించి" 128ప.1ఆ.జై.భా.

"పంచబంగాళమై పాఱిపోవ" 122ప.1ఆ.కా.ఖం.

"పంచబంగాళమై పాఱుననిన" 109ప.2ఆ.జై.భా.

"కటాక్షజ్యోత్స్న తెంపార" 228ప.6ఆ.కా.ఖం.

"కనుఁగవ నునుసోఁగ కెంపు" 36ప.2ఆ.జై.భా.

"వేరీ" 145ప.7ఆ.హ.వి., 14,54ప.కా.ఖం.

"వేరీ" 232ప.7ఆ.జై.భా.

"ఖండపరశుకంఠమూలకఠోరకాలకూటవిషమషీకలంక
పంకచ్ఛాయాచ్ఛటాపటలంబు భంగి నంగీకరించుచు"
21వచ.2ఆ.హ.వి.

"కాలకంధరకంఠమూలకాకోలవిషమషీసగంధం
బగు నంధకారంబు గల్పించు కల్పాంతకాలమేఘంబుల"
24వచ.2ఆ.జై.భా.

"ప్రతిబింబమోకాని రజనివల్లభున క
ధ్యాహార్యమో కాని యమృతరుచికి
వినిమయంబో కాని విధున కన్వాదేశ
మో కాని యత్రినేత్రోద్భవునకు
వీప్సయో కాని పూవిలుకాని సఖునకు
నామ్రేడితమొ కాని యబ్ధిజునకు
నభిధాంతరమొకాని యరవిందవైరికి
సారూప్యమో కాని చందురునకు" 191ఆ.కా.ఖం.

"అంగవల్లులకుఁ బర్యాయంబులైన క్రొ
వ్వలపుఁ దీఁగలు వంచి వంచి మాని
హస్తపల్లవముల కభిధాంతరములైన
కిసలయంబులు గిల్లి గిల్లి మాని
కుచగుళుచ్ఛములకు విచికిత్సలైన పూ

గుత్తు లుబ్బునఁ గోసి కోసి మాని
యధరామృతములకు నామ్రేడితములైన
తేనెలింపున నాని యాని మాని" 10ప.4ఆ.జై.భా.

శ్రీనాథుని పద్యములే అనిపించు జైమినిభారతములోని పినవీరభద్రుని పద్యములలో మచ్చుతునుక

"సేనా వాహుఁడు జానకీసుతుని నాజిందాఁకి నాళీకబా
ణానీకంబుల ముంచినం గుశుఁడు ప్రత్యస్త్రంబులం ద్రుంచి సా
జానేయధ్వజచక్రరక్షకధనుస్సవ్యేష్టపత్రంబుగా
సేనానిం బదహస్తమస్తముల విచ్ఛేదించి మోదించినన్" 141ప.6ఆ.

ఇవి యెల్ల శ్రీనాథుని ప్రభావమునకు చిహ్నపతాకలు.

**నంది మల్లయ, ఘంటసింగన** : వీరు మలి జంటకవులు. వీరికృతులు ప్రబోధచంద్రోదయము వరాహపురాణము. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాక రమునందు ఉదాహృతమైన నంది మల్లయ మదనసేనము నంది మల్లయకృతియే అగును. షష్ఠస్కంధము, భారతము, బలరామవిజయము కూడ మలిజంటకవులు రచించినట్లు ఒక అభిప్రాయము కలదు[302]. ఆధారములు లేవు. "కవులషష్ఠము", " రాచమల్లకవుల షష్ఠము" అని లాక్షణికులు ఉదాహరించిన గ్రంథము నంది మల్లయ, ఘంటసింగనల కృతి అనుటకు సాధకములు లేవు సరికదా బాధకములు కలవు.

## కాలము

ప్రబోధచంద్రోదయము చెందలూరి గంగయమంత్రికి అంకితము. అతనికి దగ్గుబల్లి దుగ్గన నాసికేతూపాఖ్యానము కూడ అంకితము. గంగయమంత్రి బసవరాజు మంత్రి. బసవరాజునకు దూబగుంట నారాయణ పంచతంత్రము అంకితము. బసవరాజునకు అంకితమైన పంచతంత్రము రచనాకాలము, గంగమంత్రికి అంకితమైన నాసికేతూపాఖ్యానము రచనాకాలము 1460 ప్రాంతమని పూర్వోక్తము. ప్రబోధచంద్రోదయమునందు గంగయమంత్రి, "గజపతిసురధాణి గడిదుర్గముల కెల్ల ... వజ్రంపు బోరుతల్పు"అయిన "వీరబసవక్ష్మాచక్రవిభునిచేత మన్ననలు గాంచి" నట్లు (16ప.1ఆ.), " నరసింహనృపవశీకరనయవిద్యాకరణు" డని కలదు. (1ప.2ఆ.) పురుషోత్తమగజపతి సాళువనరసింహరాయలను వశీకరించుకొన్నట్లు, సాళువనరసింహరాయలు ఉదయగిరి దుర్గమును పురుషోత్తమగజపతికి ఇచ్చినట్లును, ఇతని కుమారుడైన ప్రతాపరుద్రగజపతి అనంతవరము శాసనమునందు

కలదు[303]. పురుషోత్తమగజపతి సాళువనరసింహరాయలను వశీకరించుకొనుటకు గంగయమంత్రి మంత్రాంగమే "నరసింహనృపవశీకరనయవిద్యాకరణ"త్వము. ఉదయగిరి దుర్గము పురుషోత్తమగజపతి అధీనమైన కాలము 1489 ప్రాంతము[304] కావున ప్రబోధచంద్రోదయము రచనాకాలము 1489 ప్రాంతమే కావలయును. సాళువనరసింహరాయల రాజ్యకాలము [305]1486-1491. కా౹ బట్టి ప్రబోధచంద్రోదయము రచనాకాలము స్థూలముగ 1489వ సంవత్సరము.

ఇది బసవరాజు కాలము స్థూలముగ 1460-1490 అగుటకు సాధకము.

వరాహపురాణము సాళువనరసింహరాయల దండనాయకుడైన తుళువనరసనాయకునికి అంకితము. (20వచ.24వచ.1ఆ. 120ప.2ఆ.,140ప.6ఆ.,137ప.11ఆ.) తుళువనరసనాయకుడు సాళువనరసింహరాయల దండనాయకుడైన కాలము సాళువనరసింహరాయల రాజ్యకాలమే. (1486-1491) కా౹ బట్టి వరాహపురాణము రచనాకాలము స్థూలముగ 1491వ సంవత్సరము.

కవులషష్ఠము, రాచమల్లకవుల షష్ఠము అని లాక్షణికులు ఉదాహరించిన పద్యములందు, అది " చికతిమ్మాధీశు తిమ్మాధిపు"నకు అంకితముగ కలదు. "-యేఱువనరసింహాధీశ్వర....చికతిమ్మయదేవ మహాఅరసుగళ కొమారరు తిమ్మరాజుగళు" కన్నడశాసనము 1521 వ సంవత్సరమునందు కలదు[306] కా౹ బట్టి కవులషష్ఠము లేక రాచమల్లకవుల షష్ఠము రచనాకాలము స్థూలముగ 1520 వ సంవత్సరము. అది విజయనగరసామ్రాజ్యాధిపతి, సాహితీసమరాంగణసార్వభౌముడు, అయిన శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలము. శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజకవులందు ఆద్యుడు నంది తిమ్మన. నంది తిమ్మన మేనమామ ఘంటసింగన. ఘంటసింగన మేనమామ నంది మల్లయ. నంది మల్లయ, ఘంట సింగనలు శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలమునందుండుట సుసంగతము కాదు. అంతే కాదు. శ్రీకృష్ణదేవరాయలు తుళువనరసనాయకుని కుమారుడు. తుళువనరసనాయకునికి వరాహపురాణమును అంకితమిచ్చిన నంది మల్లయ, ఘంట సింగనలు శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలమునందు కలరేని, వారు నంది తిమ్మనతోపాటు విజయనగరసింహాసనాధీశ్వరుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులే అగుదురు. ఏఱువ సింహాసనాధీశ్వరుడు తిమ్మరాజు ఆస్థానకవులు కావలసిన ఆవశ్యకము లేదు. "రాచమల్లకవుల"లోని మల్లశబ్దము నంది మల్లయకు వర్తించును గాని, రాచశబ్దము ఘంట సింగనకు వర్తించునది కాదు. అంతేకాదు. ప్రబోధచంద్రోదయము రచించు నాటికే, నందిమల్లయ ఘంటసింగనలు ప్రౌఢవయస్కులు కావలయును. వారి కాలము పదునైదవశతాబ్దియే అగును. రాచమల్లకవులు నందిమల్లయ, ఘంట సింగన కాక మఱొక జంటకవులు కావచ్చును.

నందిమల్లయ, ఘంటసింగనలే అనుటకు ప్రమాణము లేదు. కాఁబట్టి కవుల షష్ఠము, లేక రాచమల్లకవుల షష్ఠము అని లాక్షణికులు ఉదాహరించిన షష్ఠస్కంధము నంది మల్లయ , ఘంటసింగనల కృతి కాదు.

## ప్రబోధచంద్రోదయము

ఇది కృష్ణమిశ్రుని సంస్కృతప్రబోధచంద్రోదయనాటకమునకు తెనుగుసేత. నాటకముగ కాదు. ప్రబంధముగ. "మహాప్రబంధ"మని మలి జంటకవుల మాట. (28ప.1ఆ.) సంస్కృతప్రబోధచంద్రోదయనాటకము కీర్తివర్మ పట్టాభిషేకసమయమునందు ప్రదర్శింపఁబడినట్లు, కీర్తివర్మ 1098 వ సంవత్సరమునందు ఉన్నట్లు కలదు[307]. ప్రక్రియ నాటకమే గాని, వస్తువు వేదాంతము. "సర్వవేదాంతసారంబు" అని మలి జంటకవుల పలుకు. (21ప.1ఆ.) పాత్రలు పౌరాణిక, చారిత్రిక, సాంఘిక వ్యక్తులు కారు. వ్యక్తిరూపభావములు. పాతిక పైగా పురుషపాత్రలు, పదియాఱు స్త్రీపాత్రలు కలవు. వ్యక్తిరూపభావములు పాత్రలైన సంస్కృతనాటకములు పెక్కులు కలవు. అన్నింటికి ప్రబోధచంద్రోదయమే ఆద్యప్రకృతి. ఆదర్శప్రాయము. అద్వైతపరము. వేదాంతదేశికుల సంకల్పసూర్యోదయము విశిష్టాద్వైతపరము. ప్రతిద్వంద్విప్రాయము. అయినను ప్రబోధచంద్రోదయమునకే అగ్రతాంబూలము.

ఈశ్వరుడను రాజునకు మాయ అను రాణి వలన పుట్టిన వాడు మనస్సు. అతనికి ప్రవృత్తి, నివృత్తి అని ఇద్దఱు భార్యలు. ప్రవృత్తిసంతానము మహామోహాదులు. నివృత్తిసంతానము వివేకాదులు. మనస్సునకు మహామోహాదులయెడ పక్షపాతము. మహామోహాదులకు, వివేకాదులకు కురుపాండవులకు వలె దాయాదకలహము. పాలకులైన మహామోహాదులు, కాందిశీకులైన వివేకాదులను నిర్మూలించుటకు ప్రయత్నింతురు. మహామోహమహారాజు గూఢచారి దుర్గుణుడు. వివేకమహారాజు గూఢచారి సదాచారుడు. వివేకమహారాజు అగ్రమహిషి మతి. ద్వితీయమహిషి ఉపనిషద్దేవి. ఈమెతో వివేకమహారాజునకు పునస్సమాగమము కలిగినచో, విద్యాప్రబోధచంద్రులు ఉదయింతురు. అందుకు మతి అంగీకరించును. ఉపనిషద్దేవీవివేకమహారాజుల పునస్సమాగమము కలుగకుండ, మహామోహరాజు సపరివారముగ కాశీనగరమున ప్రవేశించును. అతని పరివారము దంభ, లోభ, అహంభావ, క్షపణక, బౌద్ధ, చార్వాకకాపాలికాదులు. విష్ణుభక్తి అను బాలిక వినా అందఱు వారికి లొంగుదురు. ఆమెను, శ్రద్ధను, శాంతిని వశీకరించుకొనుటకు ప్రయత్నింతురు. ఉభయపక్షములకు యుద్ధము జరుగును. మహామోహమహారాజు ఓడిపోవును. వారి పరాభవమునకు తండ్రియైన మనస్సు దుఃఖించును. అతనికి

వ్యాససరస్వతి వైరాగ్యము కలిగించును. అద్వైతసిద్ధాంతమును బోధించును. కడకు వివేకమహారాజు, ఉపనిషద్దేవి జీవేశ్వరుని సమక్షమున కలిసికొందురు. విద్య అను పుత్రిక, ప్రబోధచంద్రుడు అను పుత్రుడు ఉదయింతురు. ప్రబోధ చంద్రుని ఉదయమే ప్రబోధచంద్రోదయము.

నంది మల్లయ, ఘంటసింగనల ప్రబోధచంద్రోదయప్రబంధము ఇంచుమించు యథామూలము. వర్ణనలు, అలతిమార్పులు కలవు. కథారంగమైన చిదానందనగరి వర్ణన (39ప.1ఆ.) చైత్రయాత్రావర్ణన (37ప.4ఆ.) ఉద్యానవనవర్ణన (42ప.4ఆ.) ప్రకృతివర్ణన (48ప.49వ.4ఆ.) యుద్ధవర్ణన (67,68ప.69వచ.4ఆ.) జంటకవుల స్వతంత్రకల్పనలు. నాటకమునందు కొంత పరివారముతో కాశీనగరమునందు ప్రవేశించిన మహామోహమహారాజు ప్రతీహారిని పంపించి. కాముడు, క్రోధుడు మొదలైన వారిని పిలిపించి రప్పించును. ప్రబంధమునందు మహామోహ మహారాజుతోనే కామక్రోధాదులు వత్తురు. నాటకమునందు ఉపనిషద్దేవి శాంతి తోపాటు జీవేశ్వరుని కడకు ముందే వచ్చినట్లు కలదు. ప్రబంధమునందు వివేక మహారాజు జీవేశ్వరుని సందర్శించిన తదుపరి ఉపనిషద్దేవి వచ్చినట్లు కలదు. ఇట్టి అలతిమార్పులు అక్కడక్కడ కలవు.

వాచస్పతి చార్వాకునకు ఉపదేశించిన చార్వాకమతమిది:

"లోకంబులం గృత్యాకృత్యంబులు కలవనుట మిథ్య.
(అ)తథ్యంబు లోకాయతి కంటె శాస్త్రంబు. దండనీతియె విద్య.
ప్రత్యక్షంబె ప్రమాణంబు, పృథివ్యప్తేజోవాయురాకాశంబులే
తత్త్వంబులు. భూతంబులే ప్రేరకంబులు. చచ్చుటయే మోక్షం
బుగాక పరలోకం బెక్కడియది?" 34వచ.2ఆ.

దిగంబరజైనమతతత్త్వమిది :

"తొమ్మిది గవనులు గల్గు పు
రమ్మున సతతంబు నాత్మ భ్రాజిలుచుండున్
నెమ్మదిలో నిది యెఱిఁగిన,
గ్రమ్మన సిద్ధించు సౌఖ్యకైవల్యంబుల్" 13
"........... ఆత్మసదా
మలరహితము ఋషుల సేవ మఱువకుఁ డెపుడున్."
14ప.3ఆ.

సౌగతబౌద్ధమతతత్త్వమిది:

"పదార్థంబు లన్నియు నిరాత్మకంబులు. ప్రతిక్షణక్షయ శీలంబులు. లోపల సత్తును వెలుపల నసత్తును నగు ధీపరంపరల వలన నీ భావంబులు తోఁచు చుండు. నిట్టి ధీపరంపరయు వాసనా రహితంబు గావున విషయానుభవదోషంబులు లేవు. భోగమోక్షం బులు గలయది సౌగతధర్మంబు" 21వచ.3ఆ.

కాపాలిక మతరహస్యమిది :

"శస్త్రబ్రహ్మకపాలపాత్ర సుర యాస్వాదింపుచున్ వహ్నిలో
మస్తిష్కాక్తవసాభిపూరితమహామాంసంబులన్ వేల్చుచున్
హస్తోద్యత్కరవాలఖండితమనుష్యశ్రేష్ఠ కంఠోపకం
ఠాస్తోకక్షతజోపహారబలిచే నర్చింతు నే భైరవున్" 34ప.3ఆ.

వ్యాససరస్వతి మనస్సునకు సంవాదరూపమున ఉపదేశించిన అద్వైతసిద్ధాంతమిది:

"భావంబు లనిత్యములని
యీ వెఱఁగవె? వినవె పెక్కు లితిహాసపురా
ణావళులు పుట్టువునకుం
జావునకు లంకె యను విచారము వలదే." 14

"లోకంబు లనిత్యములను
లోకాంతరమైన తెలివిలో నిలుపఁదగున్
శోకము నిత్యానిత్యవి
వేకుల చిత్తములఁ జేర వెఱచున్ మనసా. 16

ఏకము నిత్యము బ్రహ్మము
వైకల్పితవికృతులున్న వస్తువు లెల్లన్
ఏకత్వ మెఱుఁగు వారికి
శోకము మోహంబు లేదు సుమ్మీ మనసా" 17ప.5ఆ.

విషయము గహనమైన వేదాంతమైనను, అది కథారూపమున, అందును భారత కథాప్రతిబింబప్రాయముగ ఉండుటవలన ప్రబోధచంద్రోదయము కావ్యమైనది. ప్రధానరసము శాంతము. అది నాటకప్రదర్శనమునందు సామాజికులకు అనుభూయమానమగుట కంటె ప్రబంధపఠనమునందు సహృదయులకు అనుభూయమానమగుట సుకరము.

# వరాహపురాణము

ఇది అష్టాదశపురాణములలో ఒకటి. వక్త వరాహదేవుడు. శ్రోత భూదేవి. వరాహప్రోక్తమగుటవలన వరాహపురాణము. పర్వతిథుల, వ్రతముల పుట్టు పూర్వోత్తరములు పుష్కలము. అయినను ధర్మవ్యాధుని వృత్తాంతము, దుర్జయుని వృత్తాంతము, గౌతముని వృత్తాంతము వంటివి కావ్యత్వసిద్ధి కలిగించినవి.

ధర్మవ్యాధుడు ప్రతిదినమును ఒక మృగమును చంపి, అగ్నికి అతిథులకు సగము సమర్పించి, సగము విక్రయించి సంసారము చేయువాడు. అర్జునకి అను కూతురిని మతంగముని కుమారుడైన ప్రసన్నునికి వివాహము చేసెను. అత్తింట మెలగవలసిన తీరు ఆమెకు బోధించెను. అందొక పద్యము (124ప.2ఆ.) శ్రీనాథుని పద్యమునకు (9ప.7ఆ.శృం.నై.) అనుపల్లవి. మఱొక పద్యమిది:

"కసరకుమీ కోపించిన
విసువకుమీ సేవ చేయు వేళ నీగుల్
కొసరకుమీ! నీ పాలికి
బిసరుహాముఖి! యేడుగడయుఁ బెనిమిటి సుమ్మీ!"

125ప.2ఆ.

ఇది సుమతిశతకములోని "ఏఱకుమీ కసుగాయల" అను పద్యమునకు అనుసృతి. అర్జునకి అందగత్తె. ఆమె సౌందర్యవర్ణనము (112-117ప.2ఆ.) అమూలకము. అందగత్తె మాత్రమే కాదు; అణకువ గల అత్తింటికోడలు. (130,131ప.2ఆ.) అయినను ఒకసారి పిలిచిన పలుకలేదని అత్తగారు పుట్టింటికి వెళ్లగొట్టెను.

" ఓసి దురాత్మురాల! మృగయూధములన్ మొఱవెట్టఁగా మెడల్
గోసి వధించు పాతకుని కూఁతుర! బుద్ధులు చెప్పి చెప్పి నే
వేసరితిన్ మహాముని వివేకవిహీనుఁడు గాక, యెట్టుగాఁ
జేసె నినుం బ్రసన్నునకు శిష్టవిధిజ్ఞత లేని రక్కసన్. 133

పని లేదు నా నివాసం
బున నుండఁ గ నిఁ కఁ బొకాలి పొమ్మని నునుఁ జె
క్కున నెత్తు రుట్టిపడ వీ
డని రోషావేశమునఁ జటాలునఁ గొట్టెన్." 134ప.2ఆ.

కుదురైన కోడలిని వంకబెట్టి, తిట్టి, కొట్టి పుట్టింటికి పొమ్మను అత్తకు ఆది.

అర్జునకి "ఎఱ్ఱవాఱిన ధవళకపోలతలము గరుణ పుట్టింప" (135ప.) "పురపురం బొక్కుచు" పుట్టింటికి వచ్చి తల్లిదండ్రులకు జరిగినది పూసగ్రుచ్చినట్లు చెప్పినది.

"ఎట్టెట్టా! ముని భార్య నన్ను వినదే యీమాట నిన్నాడఁ గా
నట్టితాక యెఱింగి వత్తము తదీయాహింసకత్వస్థితుల్
పట్టీ! రమ్మని వెంటఁ బెట్టుకొని ఖిల్లస్వామి దట్టంబుగా
నిట్టూర్పు ల్నిగుడంగ వచ్చి కనియెన్ వియ్యంపు వాచంయమున్"
141ప.2ఆ.

మతంగమునిని చూచి ధర్మవ్యాధుడు,

"మనమున మఱియే యీహిత
మునులేదు భవన్నివాసమున నిర్జీవా
శనము భుజియింప వచ్చితి
నని ధర్మవ్యాధుఁ డాడ యతి సమ్మతుఁ డై." 143ప.2ఆ.

వ్రీహిగోధూమయవల ఆహారము పెట్టెను. ధర్మవ్యాధుడు "హరిహరి యనుచు లేచి పోవంగ" మతంగముని కారణ మడిగెను. ధర్మవ్యాధుడు,

"-అసంఖ్యములైన జీవు ననుదినంబుఁ
గనికరము లేక ప్రాణాలు గొని భుజించు
ఘాతుకుని యింటఁ గుడువంగఁ గాదు గానఁ
దొలఁగిపోవు చున్నాండం గలిగె నేని
ప్రియమున భుజింతుఁ బెట్టు నిర్జీవభుక్తి" 145ప.2ఆ.

అని, తనకు మునికి హస్తిమశకాంతరము కలదని (146ప.2ఆ.) వ్రీహిగోధూమ యవాహారములు అపవిత్రములను వేదరహస్యమును తెలిపి (147వచ.2ఆ.)

"ఇలువడి గల నా కూఁతురు
కొలఁ ది యెఱిఁ గి జీవఘాతి కూఁతుర! యనుచుం
బలుకఁ గ నోయి మునీ! నీ
కులకామిని యే విశిష్ట కూఁతురు చెపుమా!" 148ప.2ఆ.

అని "ఉల్లసంబులాడి నవ్వి" (149ప.2ఆ.) "ముగ్ధ న్నా తనూజాత నూరక భర్జింపక యేలుకొండు" అని చెప్పి వెడలిపోవును.

ఇది వరాహపురాణములోని సాంఘికేతివృత్తము.

దుర్జయుడు మానవుడు. దుర్మార్గుడే కాని, కీచకుని వలె ప్రతినాయకుడు కాడు. నాయకుడే. విషాదాంతనాయకుడు. సుప్రతీకమహారాజునకు "పులోమజిద్విజయదీక్షాదక్షుఁ దక్షుద్రుఁ డత్యంతక్రూరుఁ డు దుర్జయాఖ్యుఁ డు ..... లోకఖ్యాతిగాఁ బుట్టు" నని దూర్వాసుని వరము. (187ప.2ఆ.) దుర్జయుడు ఇంద్రుని జయించిన దీక్షాదక్షుడే. హేతి ప్రహేతి పుత్త్రికలైన సుకేశీమిశ్రకేశీసోదరీమణులను ప్రేమించి పెండ్లాడిన అక్షుద్రుడు. లోకఖ్యాతుడు. కాని మహాసేనాసమేతముగ తనకు మహావైభవోపేతముగ వసతిసౌకర్యములు, భోజనభాజనములు వగైరా కల్పించిన, గౌరముఖుడను మునియొద్ద గల విష్ణురత్నమును ఆశించి, యుద్ధము చేసిన అత్యంత క్రూరుడు. అది మానవహృదయదౌర్బల్యమువలని దౌర్మార్గ్యము. విష్ణురత్నమును ఆశించుట వలన విష్ణుచక్రమునకు ఆహుతి అగుట విషాదాంతము.

నంది మల్లయ, ఘంటసింగనల వరాహపురాణములోని దుర్జయవృత్తాంతము స్వతంత్రకావ్యసరణిని కలదు. అనంతరయుగములోని స్వతంత్రకావ్యములకు అవ్యవహితపూర్వమైన అధ్యాపకవాణి అయినది. వసంతవర్ణనము (70-76వచ.3ఆ.) సుకేశీమిశ్రకేశీసోదరీమణుల వనకేళీవర్ణనము (77-96ప.3ఆ.) జలకేళీవర్ణనము (97-107ప.3ఆ.) మన్మథపూజ (108వచ.3ఆ.) దుర్జయవర్ణనము (109ప.3ఆ.) పరస్పరావలోకనవర్ణనము (110-112ప3ఆ.) నాయికాద్వయవర్ణనము (114-124ప.3ఆ.) (నాయికాద్వయనాయకవియోగవర్ణనము)(125-130ప.3ఆ.) నాయకవిరహవర్ణనము (131-132వచ.3ఆ.,2-12ప.4ఆ.) చంద్రోదయవర్ణనము (13ప.4ఆ.) నాయికాద్వయవిరహవర్ణనము (14-35ప.4ఆ.) వివాహవర్ణనము (36-63ప.4ఆ.) విహారవర్ణనము (65-67ప.4ఆ.) కుమారోదయవర్ణనము (68,69ప.4ఆ.) ఆతిథ్యమునందు స్నానవర్ణనము (122-127ప.4ఆ.) నాట్యవర్ణనము (128ప.4ఆ.) వీణావాదనవర్ణనము (129ప.4ఆ.) ఆళతిపాటలవర్ణనము (130ప.4ఆ.) భోజనవర్ణనము (132-136ప.4ఆ.) సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంతప్రకృతివర్ణనము (137-155,164-171ప.4ఆ.) ఆద్యంతములందు యుద్ధవర్ణనము (26-33,38-60ప.3ఆ.20-41ప.5ఆ.) మధ్యలో వేటవర్ణనము (80-87ప.4ఆ.)కలవు. వనకేళీవర్ణనమునందు దోహదప్రక్రియలు, పుష్పాపచయము కలవు. పుష్పాపచయఘట్టము రగడ ఛందస్సున కలదు. నాయికాద్వయవిరహవర్ణనమునందు చంద్ర, మన్మథోపాలంభములు కలవు. మొత్తము మీద దుర్జయవృత్తాంతము బహురసబంధురమైన స్వతంత్రప్రబంధసంగ్రహము.

జంటకవుల వర్ణనములందు వైలక్షణ్యమును కలదు.

"తన పగతు కంఠమును బో

లెనటంచు, రతీశ్వరుం డలిగి కత్తుల బో
నునఁ బెట్టిన మూల్గెడి విధ
మునఁ బికము ప్రవాళమధ్యమున నెలుఁగించెన్" 74ప.3ఆ.

ఇట్లు కోకిల కలకూజితమును వర్ణించుట విలక్షణము.

"సకియా! చివురున సుమనో
మకరందము వడిసెఁ జూడుమా! విరహుల ద
ర్పకుఁ డు నలుక శాతకృపా
ణికఁ బొటుఁ బొటుఁ గాఱు క్రొత్తనెత్తురు భంగిన్."
84ప.3ఆ.

ఇట్లు పూలమకరందమును క్రొత్త నెత్తురుగ కల్పించుట కూడ విలక్షణము.

"మిను కళ్లము తారలు చి
క్కిన గింజలు పూర్ణతుహినకిరణుఁ డు తూర్పె
త్తిన కొలుచు రాశిగా లాం
ఛనము మషీరచితముద్ర చందము దాల్చెన్." 148ప.4ఆ.

ఆకాశము కళ్లము, నక్షత్రములు గింజలు, చంద్రుడు తూర్పారఁ బోసి కొలుచుటకు సిద్ధము చేసిన ధాన్యపురాశి. చంద్రునిలోని మచ్చ ధాన్యపురాశి మీద మషీరచితముద్ర. ధాన్యపురాశులకు ముద్రలు వేయుట కలదు.

మధురమైన పూల మకరందమును భయానకమైన క్రొత్తనెత్తురుగ భావించిన జంటకవులు, భయానకమైన క్రొత్తనెత్తురును మనోహరమైన కుంకుమద్రవముగ భావించుట కూడ కలదు.

"వరవరణాభిలాషమున వారిజపత్రవిలోచనల్ పురం
దరపురి నుండి శీఘ్రగమనంబున రాఁ గుచఘర్మవారిచేఁ
గరఁగిన కుంకుమద్రవము గాఱెడు కైవడిఁ గాఱఁ జొచ్చె నం
బరవలమానలూనరిపుమస్తపరిస్రవ దస్రబిందువుల్." 33ప.5ఆ.

గౌతముని వృత్తాంతమునందు అమూలకమైన క్షామవర్ణన అరుదైన వర్ణనము.

"రోషముతో నిజమహిమో
న్మేషము చూపంగ వలసి మీనంబునకున్
బూషాత్మజుండు వచ్చిన
దోషంబునఁ జేసి కఱవు దోడనె రాఁగన్. 27

విసరెఁ బెనుగాడుపులు మసలె జలదాగమము
పసిమిచెడి సస్యములు కసవుదినలేమిం
బసరములు వట్టె నదు లిసుకలునుఁ జిప్పలును
మిసమిసమనన్ విగతరసగరిమ నింకెన్
వసుమతి పడందివిసెఁ గుసుమఫలపత్రముల
పస దఱిగె భూరుహము లుసురుడిగెఁ బ్రాణి
పసరములు నొండొకటి మెసఁ గఁ దొడఁ గెఁ గఱవు
గసిమసఁ గె విశ్వమున వెస లయవిభాతిన్. 28

మిగుల భీకరవృత్తి మిన్ను ముట్టిన ధూమ
కేతువె బిరుదుటెక్కెంబు గాఁ గ
నోరంతప్రొద్దును హోరని విసరుచుఁ
గెరలు కరువలి నకీబు గాఁ గఁ
జెట్టుచేమలు గారు చిచ్చునఁ గమరిన
నున్నని గిరులె యేనుఁగులు గాఁ గ
నిప్పులు గ్రక్కుచు నెప్పుడు గాయు ని
బ్బరపుటెండలె ప్రతాపంబు గాఁ గ
అనశనప్రాప్తి మృతమనుష్యప్రతాన
మాంసభక్షణదృప్తగోమాయుకాక
ఘూకబహుజంతువులు బంట్లగుంపు గాఁ గ
రాజసంబున దుర్భిక్షరాజు మెఱసె. 29.

భూకాంత నీరువట్టుకుఁ
గాక వదనమిలుకరింపఁ గాన్పించిన పం
డ్లో కాకన వెలిపుచ్చులు
లోకములోఁ గాచె నిట్లు లోఁ బడె జనముల్" 30ప.10ఆ.

వరాహపురాణమునందు గౌరీకల్యాణము కథ శైవపురాణములలోని ప్రసిద్ధమైన కథ కంటె భిన్నముగ కలదు. దక్షుని తనయ గౌరి-తండ్రి శత్రువు భార్య అని, భర్త శత్రువు తనయ అని- తన్ను భావింతురని తలంచి, హిమాలయపర్వతమునందు బహుకాలము తపస్సు చేసి, యోగవహ్నిశిఖల తనువల్లి వేల్చి, మేనకాహిమవంతుల తనయగా జన్మించి, ఉమ కృష్ణ అను పేరు ధరించి, శైవముగడపి, తారుణ్యము గైకొని, పశుపతి తన పతి కావలెనని, తల్లిదండ్రుల అనుమతిని, మహావనమునందు తపస్సు చేయును. ఆమెను అనుగ్రహించుటకు మహాదేవుడు ముసలి బ్రాహ్మణుడై వచ్చి "ఆకలిఁ గొన్నాఁ డ నశనంబు వెట్టింపు"మని అడుగును. "ఫలంబులు గాని యిచట నశనంబు గడింపరాదు .... ఫలాహారముఁ గొన

వేడ్క కల దేని కృతస్నాతుండవై రమ్ము" అని పార్వతి అనును. ముసలి బ్రాహ్మణుడు స్నానము చేయుచు, 'పెద్ద మొసలి పట్టుకొన్నది. విడిపించుటకు రమ్ము" అని కేక పెట్టును.

"పితృభావన హిమవంతునిఁ
బతిభావన శివునిఁ దక్కఁ బరునంటని నే
నితని భుజాదండము ప
ట్టి తిగువఁ గా నెట్టు లోర్తు డెందము గలఁ గెన్ 23

అయిన నితని కరస్పర్శనాపయశము
మాన్పుకొనవచ్చుఁ గాని బ్రాహ్మణుఁ డు మొసలి
బారిఁ బడి చావఁ గావని పాతకంబు
మాన్పుకొనరాదు జన్మజన్మముల ననుచు" 24ప.6ఆ.

పార్వతి "తత్కపటవిప్రు పాణి కరపల్లవంబున బట్టి తిగువ" మొసలి లోపలికి పోవును. ముసలి బ్రాహ్మణుడు శంకరుడయి వివాహమాడుమనును. "తపము గావించుట ధవునిగా నినుఁ గోరి కావున వృథగాదు" కాని కన్నతండ్రి కన్యాదానము చేయగా వివాహమాడుమని పార్వతి కోరును. శివుడు పెండ్లి పెద్దగ బ్రహ్మను పంపును. హిమవంతుడు శుభలేఖలు వేయించి మఱియు వివాహము చేయును. ఇంత భేదమునకు హేతువు, వరాహపురాణము వైష్ణవపురాణమగుట కావలయును.

"అల్పాక్షరముల ననల్పార్థరచన"

అని పాలకుఱికి సోమనాథుడు అన్నమాటను పట్టుకొని, నంది మల్లయ ఘంట సింగనలు

"అల్పాక్షరంబుల నధికార్థంబు గుదియించి" 8వచ1ఆ.

అని కృతిప్రారంభము చేసిరి. చాలవఱకు కృతకృత్యులయిరి. అయినను ఏకాక్షరకందము (90ప.10ఆ.) ద్వ్యక్షరకందము (69ప.11ఆ.)కందగర్భమణిగణనికరము (11 2ప.11ఆ.)వంటి చిత్ర, గర్భకవిత్వములకును పాల్పడిరి. విశేషవృత్తములును విశేషము.

నంది మల్లయ ఘంట సింగనలు ప్రథమతః శ్రీనాథుని పూర్వకవిస్తుతిలో చేర్చిరి.

"శ్రీనాథుఁ బొగడి" 18ప. 1 ఆ.

అని పొగడిన శ్రీనాథుని ప్రభావము వరాహపురాణమునందు పొటమరించినది. ప్రౌఢిమ శబ్దము ప్రయుక్తమైనది. "ఏతత్క్రియారంభప్రౌఢిమ" (79ప.10ఆ.) వ్యామగ్రాహ్యపదబంధము పుష్పవిశేషణముగ ప్రయుక్తము. "వ్యామగ్రాహ్యములు ... ప్రసూనంబులు" (129ప.10ఆ.) ఇంకను "పంచబంగాళమైరి" (59ప.3ఆ.) "చౌకళింప" (133ప.4ఆ.) "ప్రొద్దు కరకర పొడిచెన్" (168ప.4ఆ.) "చిట్టుమిడిచిన" (12వచ.5ఆ.) "చిన్నారిపొన్నారి చెమట చిత్తడి తోడి" (52ప.6ఆ.) వంటివి శ్రీనాథుని తెనుగు నుడికారములే.

"వలపులు గులుకు చెంగలువ క్రొవ్విరుల తే
కులు గానరా సేసకొప్పు ముడిచి
మంచి పన్నీట మేదించిన సారంగ
నాభిపంకంబున నాభి దీర్చి" 109ప.3ఆ.

"మెప్పించినాఁడవు మితి మేర లేని త
పోమహత్త్వమున నంభోజభవుని
నొప్పించినాఁడవు నుగ్గు నూచములుగా
బలభేదిముఖ్యదిక్పాలబలము
తెప్పించినాఁడవు త్రిభువనంబుల నపూ
ర్వములైన వివిధసువస్తులెల్ల
కల్పించినాఁడవు గాఢతరప్రతా
పానలచ్ఛటలఁ జరాచరంబు" 54ప.11ఆ.

వంటి పద్యములును శ్రీనాథుని ప్రభావమును ప్రకటించునవియే.

**తాళ్ళపాక అన్నమాచార్యులు** : ఈతని కృతులు ముప్పదిరెండు వేల సంకీర్తనయలు, రామాయణద్విపదప్రబంధము, శృంగారమంజరి, సంస్కృతవేంకటాద్రి మాహాత్మ్యము, ద్వాదశభాషాశతకములు అని ఈతని చిన్నమనుమడు చిన్నన్న రచించిన "అన్నమార్య చరితము"నందు కలదు. ఇది "శ్రీతాళ్లపాక అన్నమాచార్యుల జీవితచరిత్రము " అని ముద్రితమైనది. పెద్దమనుమడు చినతిరుమలాచార్యులు తెనిగించిన సంకీర్తనలక్షణమునకు మూలము అన్నమాచార్యులు సంస్కృతమునందు రచించిన సంకీర్తనలక్షణమని అందు కలదు. అన్నమాచార్యుల సంకీర్తనములు అనేకసహస్రములు లభించినవి. రామాయణ ద్విపద ప్రబంధము లభింపలేదు. ద్వాదశభాషాశతకములందు ఒకటగు ఆంధ్ర భాషాశతకము వేంకటేశ్వరశతకము లభించినది. శృంగారమంజరి లభించినది.

## కాలము

అన్నమాచార్యులు వైశాఖమాసమున విశాఖనక్షత్రమునందు జన్మించినట్లు అన్నమార్యచరితమునందు కలదు. (పుట9) సంవత్సరము లేదు. సాళువనరసింహరాయల కాలమునందు ఉన్నట్లు కలదు. (పుటలు31-41) అన్నమాచార్యుల కుమారుడు పెదతిరుమలాచార్యుల కాలమునందు సంకీర్తనములు లిఖింపంబడిన రాగిరేకుల మీద,

> "స్వస్తిశ్రీ జయాభ్యుదయశాలివాహనశకవరుషంబులు ౧౩౪౬ అగు నేంటి క్రోధిసంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అదిమొదలుగాను శాలివాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేంటి దుందుభిసంవత్సరఫాల్గుణబహుళ ౧౨ నిరుధానకు తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార/ అధ్యాత్మ సంకీర్తనలు"

అని కలదు[308]. ఇందు 1346+78 = 1424వ సంవత్సరము " అన్నమాచార్యులు అవతరించిన" సంవత్సరమని, "తిరువేంగళనాథుడు ప్రత్యక్ష" మైన సంవత్సరమని అభిప్రాయభేదములు కలవు[309]. అన్నమాచార్యులు అవతరించిన సంవత్సరమైనచో, అన్నమాచార్యుల జననకాలము 1424వ సంవత్సరమగును. తిరువేంగళనాథుడు ప్రత్యక్షమైన సంవత్సరమైనచో, అన్నమాచార్యుల జనన కాలము 1424-16 = 1408 వ సంవత్సరమగును. రాగిరేకుల మీది వాక్యము అటు, ఇటు అన్వయించుటకు వీలుగ కలదు. సాధనాంతరము సాపేక్ష్యము.

అన్నమయ్యకు ఇద్దఱు భార్యలు. తిరుమలమ్మ, అక్కలమ్మ. ఇద్దఱితోను ఏకకాలమునందే వివాహమైనట్లు అన్నమా(చా)ర్య చరిత్రమునందు కలదు. (పుట 29). అక్కలమ్మకు జన్మించిన పుత్త్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు. ఇతని శాసనములు 1517 నుండి 1545 వఱకు గలవు[310].1545 వ సంవత్సరము నాటికి పెదతిరుమలాచార్యుల వయస్సు 85సంవత్సరములైన, అతని జననకాలము 1545-85= 1460 వ సంవత్సరమగును. అన్నమాచార్యుల జననకాలము 1408వ సంవత్సరమైన అతనికి పెదతిరుమలాచార్యులు 1460-1408=52 సంవత్సరముల వయస్సున జన్మించినట్లగును. 1424వ సంవత్సరమైన 1460-1424=36 సంవత్సరముల వయస్సున జన్మించినట్లగును. ఏబది రెండవయేట జన్మించుట అసంభవము కాదుగాని, ముప్పదియాఱవయేట జన్మించుట సుసంభవము. కాఁబట్టి

అన్నమాచార్యుల జననకాలము 1408 వ సంవత్సరమగుట కంటె 1424వ సంవత్సరమగుట సంభవము. సంభావ్యము.

పెదతిరుమలాచార్యుల ప్రథమపుత్త్రుడు చిన తిరుమలాచార్యుల శాసనములు 1540నుండి 1547వఱకు కలవు[311]. చతుర్థపుత్త్రుడు చిన్నన్న శాసనములు 1546, 1554 సంవత్సరములందు కలవు[312]. అన్నమాచార్యులు అధ్యాత్మసంకీర్తనలు విన్నపము చేసిన తుది కాలము 1424+78=1502 వ సంవత్సరమని రాగిరేకుల మీఁది వాక్యమునందు కలదు. అన్నమాచార్యుల జీవితకాలము స్థూలముగ 1424-1502 అయిన పెదతిరుమలాచార్యుల జీవితకాలము స్థూలముగ 1460-1545, చినతిరుమలాచార్యుల జీవితకాలము స్థూలముగ 1485-1547, చిన్నన్న జీవితకాలము స్థూలముగ 1490-1554 అగును. అన్నమాచార్యులు 78సంవత్సరములు, పెదతిరుమలాచార్యులు 85 సంవత్సరములు, చినతిరుమలాచార్యులు 62 సంవత్సరములు, చిన్నన్న 64 సంవత్సరములు జీవించుట కూడ సంగతమగును. పెదతిరుమలాచార్యులు ఎక్కువ కాలము జీవించుటవలన, అతని ప్రథమ, చతుర్థపుత్త్రులు అతనికాలమునందే శాసనకర్తలు, కావ్యకర్తలును అగుట సంభవము.

మొత్తము మీఁద అన్నమాచార్యుల ప్రాభవకాలము పదునైదవ శతాబ్ది ఉత్తరార్ధము, పెదతిరుమలాచార్యుల, చినతిరుమలాచార్యుల, చిన్నన్నల ప్రాభవకాలము పదునాఱవ శతాబ్ది పూర్వార్ధము.

అన్నమాచార్యుల భార్య తిమ్మక్క సుభద్రాకల్యాణము రచించినట్లు కలదు. అంతేకాదు. ఆమె తొలి కవయిత్రి అని ఒక అభిప్రాయము కలదు[313] సుభద్రా కల్యాణము ప్రథమతః 1910 వ సంవత్సరమునందు ముద్రితమైనది. అందు,

"వెలయ కృష్ణుని పేర విఖ్యాతి గాను
ప్రబల పార్థుని పేర అంకితంబుగను
వరకవి తాళ్లపాక తిమ్మప్ప
చెప్పెను విష్ణుకథ జగతిలోపలను"

అని కలదు[314]. తదుపరి 1950 వ సంవత్సరమునందు ముద్రితమైనది. అందు,

"అవనిలో తాళ్లపాకన్నయ్యగారి
తరుణి తిమ్మక చెప్పె తాను సుభద్ర
కల్యాణ మనుపాట ... ... ..."

అని కలదు. అనంతరము 1963వ సంవత్సరమునందు ముద్రితమైనది. అందు,

"ధరణిలో హేమాద్రితనయు డప్పన్న
గురుభక్తి తిమ్మక్క మధుభక్తిరతియు
మలయు పూర్ణాసుభద్రావివాహం" పుట230
స్త్రీల పౌరాణికపుపాటలు.

అని కలదు. ప్రథమముద్రణమునందు "స్త్రీల కత్యంతోపయోగముగ ప్రాచీనకవి పుంగవులచే రచింపఁబడిన సుభద్రాకల్యాణము" అని ప్రకాశకుల ప్రకటనము కలదు[315]. కవిపుంగవులను బహువచనము గౌరవవాచక బహువచనము. మూడు గ్రంథములందును మూడు విధములుగ కలదు. అలతి భేదములు వినా గ్రంథమొకటే. కవిపుంగవుని కృతి కవయిత్రీతిలకము కృతియై, కవిపుంగవ,కవయిత్రీ తిలకముల కృతియైనట్లు కలదు. తాళ్లపాకతిమ్మప్ప కవిపుంగవుడు. తాళ్లపాక తిమ్మక్క కవయిత్రీతిలకము "గురుభక్తి" కల హేమాద్రితనయు డప్పన్న కవిపుంగవుడు "మధుభక్తిరతి" కల తిమ్మక్క కవయిత్రీతిలకము. సుభద్రాకల్యాణము కవయిత్రీతిలకము కృతి అయిన కావచ్చును గాని అన్నమాచార్యుల భార్య తిమ్మక్క కృతి కాఁజాలదు.

సుభద్ర యతీశ్వరుడని భావించి శృంగారించుకొని,

"పాలిండ్ల వలను కన్పడగ నొక వింత
లీల పయ్యెద కొంగులే జాఱవిడిచె"

అని సుభద్రాకల్యాణమునందు కలదు. ఇందు రసపోషణము కంటె శృంగారలౌల్యము కలదు. ఇట్లు అన్నమాచార్యుల భార్య రచించుట సంభవము కాదు.

రుక్మిణి శ్రీకృష్ణుని సన్నిధికి ఏగునపుడు,

"ఇంతి పయ్యెదలోన నేకాంతమునకు
ఆ చక్రవాకములు అతివ హారములు
కొమరారు కొప్పులో గొజ్జంగి దండ
నటనతో వీపున నాట్య మాడగను
జాఱుపయ్యెద కొంగు చక్క ద్రోయుచును"

అని సుభద్రాకల్యాణమునందు కలదు. ఇందును రసపోషణము కంటె శృంగారలౌల్యమే ఇతోధికముగ కలదు. ఇట్లు అన్నమాచార్యుల భార్య రచించుట సంభవము కాదు. రుక్మిణి శ్రీకృష్ణునికి చేసిన విన్నపమునందు "ముద్దుగోపాల" అను సంబుద్ధి కలదు. బాలకృష్ణుడు మువ్వలు ధరించిన గోపాలుడగును గాని,

శ్రీకృష్ణుడు మువ్వలు ధరించిన గోపాలుడు కాడు. మువ్వగోపాలముద్ర క్షేత్రయ్యపదములందు కలదు. అందు మొవ్వ క్షేత్రములోని గోపాలుడు మువ్వగోపాలుడు. క్షేత్రయ్యకు పూర్వము మొవ్వక్షేత్రము ప్రసిద్ధము కాదు. కావున మువ్వ గోపాలముద్రాముద్రితమైన సుభద్రాకల్యాణము క్షేత్రయ్యపదములు ప్రసిద్ధమైన కాలమునందు రచింపఁబడిన గ్రంథమగును.

క్షేత్రయ్యకు ఇంచుక పూర్వుడైన చేమకూర వేంకటకవి విజయ విలాసమునందు సుభద్ర కావించిన అర్జునుని వర్ణనమిట్లు కలదు.

"ఎగుభుజంబుల వాఁడు మృగరాజమధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుము వాఁడు
నెఱివెండ్రుకల వాఁడు నీలంపు నికరంపు
మెఱుఁగుఁ జామన చాయ మేని వాఁడు
గొప్పకన్నుల వాఁడు కోదండగుణకిణాం
కములైన ముంజేతు లమరు వాఁడు
బవిరిగడ్డము వాఁడు పన్నిదంబిడి డాఁగ
వచ్చు నందంపు వెన్ను మచ్చువాఁడు
గరగరనివాఁడు నవ్వు మొగంబు వాఁడు
చూడఁ గలవాఁడు మేలైన సొబగువాఁడు
వావి మేనత్త కొడుకు కావలయు నాకు
నర్జునుఁడు పరాక్రమోపార్జునుండు" 164ప.2ఆ.

ఇది సుభద్రాకల్యాణమునందు ఇట్లు కలదు.

"ఎగుభుజమ్ముల వాఁడు మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాఁడు
గరగరనివాఁడు చక్కనివాఁడు నతఁడు
గొప్ప కన్నుల వాఁడు కోదండగుణకి
ణాంకంబులై బాహు లమరినవాడు
బవిరిగడ్డము వాడు పన్నిదం బిడిన
వెన్ను పగడసాల వెస నాడవచ్చు
చిగురొత్తు చెంద్రిక చెలగు పాదపములు"

ఇది చేమకూర వేంకటకవి అనుకరించెనని ఒక అభిప్రాయము కలదు[316]. సుభద్రాకల్యాణకవి అనుకరించెనని మఱొక అభిప్రాయము కలదు[317]. ఈ రెండు అభిప్రాయములును స్థూలనిర్దేశములే. సూక్ష్మనిర్ణీతములు కావు. సుభద్రా కల్యాణము ద్వితీయముద్రణమునందు 1183 ద్విపదపాదములు కలవు. ఎడనెడ

ఛందోభంగములున్నను, 1182 ద్విపదపాదాంతములు పదాంతములుగ కలవు. పాదాంతవిరతి ద్విపదపాదసహజలక్షణము. అట్టిది ఒక్క పాదాంతము మాత్రము పదాంతము కాదు. అది పై నుదాహరించిన "గొప్పకన్నుల వాఁడు కోదండగుణకి" అను పాదమే. సీసపాదాంతములును పదాంతములగుట కలదు. పై నుదాహరించిన చేమకూర వేంకటకవి సీసపద్యములోని ప్రతి పాదాంతమును పదాంతమే. అందు "గొప్పకన్నుల వాఁడు కోదండగుణకిణ"అన్నది పదాంతము. అంకము తోడి సంధి భంగము కాదు. సీసపద్యములోని మూసకట్టు ద్విపదపాదమునందు ముక్కలయినది. అది చేమకూర వేంకటకవి సీసపద్యమును సుభద్రాకల్యాణకవి అనుకరించుట వలని ఫలము. 1963 ముద్రణమునందు "కోదండగుణగణాంకములు" అని ఏకపాదము. ఛందోభంగము. అనర్థకము. ఇది సుభద్రాకల్యాణము చేమకూర వేంకటకవి విజయవిలాసము కంటె అనంతరగ్రంథమగుటకు నిదర్శనము. కాఁబట్టి సుభద్రాకల్యాణము అన్నమాచార్యుల భార్య తిమ్మక్క రచనము కాదు. అన్నమాచార్యుల పెద్దభార్య తిమ్మక్క రచన కలదేని, అది అన్నమాచార్యుల రచనల తోపాటు, చిన్నన్న అన్నమార్యచరితమునందు ప్రసక్తమగును. కాని కాలేదు. కారణము చిన్నన్న అన్నమాచార్యుల చిన్న భార్య అక్కలమ్మ మనుమ డగుట కాఁజాలదు. తిమ్మక్క పుత్త్రపౌత్త్రపారంపర్యమునకు, అక్కలమ్మ పుత్త్రపౌత్త్రపారంపర్యమునకు సాపత్న్యము క్రమపరిప్రాప్తమైనట్లు నిర్ధారకసాధనము లేదు. అంతేకాదు. అన్యగ్రంథములందును అన్నమాచార్యుల భార్య తిమ్మక్క కవయిత్రి అని గాని, సుభద్రా కల్యాణకర్త్రి అని గాని కానరాదు. అన్నమాచార్యుల భార్య కవయిత్రి అయినచో, ఆమె రచన సుభద్రాకల్యాణము కాదు. పద్మావతీ కల్యాణమగును. సుభద్రాకల్యాణము మఱొక తాళ్లపాక తిమ్మక్క లేదా తిమ్మప్ప రచనమే అగును. అన్నమాచార్యుల భార్య తిమ్మక్క రచన కాదు. ఆమె కవయిత్రి కాదు. ప్రథమాంధ్రకవయిత్రి అసలే కాదు. సుభద్రాకల్యాణము చేమకూర వేంకట కవి, క్షేత్రయ్య, బహుశః ముద్దుపళని తర్వాతి గ్రంథమే.

## వేంకటేశ్వరశతకము

అన్నమయ్య తిరుపతియాత్రలో కొండపై "బడలిక నొకరాతి పై శయనింప" (పుట15) వచ్చిన పెద్దముత్తైదువ (పుట16) అనుగ్రహమున తిరుమలను సాలగ్రామమయముగ తెలిసి కొని, ఆమె ఇచ్చిన ( పుట17) ప్రసాదాన్నప్రభావమున,

"పరమసారస్వతపారీణుఁ డగుచు
సరసకవిత్వవాచాప్రౌఢి మెఱసి

యలమేలు మంగకు నాశుమార్గంబున
సలలితంబుగ నొక్క శతకంబు జెప్పె"

నని అన్నమార్యచరితమునందు కలదు. (పుట18) అంతేకాదు. అన్నమయ్య స్వామిని దర్శించిన మఱునాడు (పుట25),

"వితతవృత్తంబుల వేంకటపతికి
శతకంబు కుతుకంబు సమకూరఁ జేసి" పుట 26

అని కూడ కలదు. అలమేలుమంగకు చెప్పిన శతకము అలమేలుమంగాశతకము, వేంకటపతికి చెప్పిన శతకము వేంకటపతిశతకమును అగును. వానికి భిన్నమైనది వేంకటేశ్వరశతకము. ఇందు పవ్వళింపు సేవ (23ప.) గరుడోత్సవము (25ప.) వనవిహారము (41ప.) నగరసంచారము మొదలైన విశేషములు కలవు. గరుడోత్సవ విశేషమిది :

"ఒక్కొకనాఁటి రాత్రి సకలోన్నతుఁడైన ఖగేంద్రమూర్తిపై
నెక్కి వినోదలీలఁ జరియించుచు నయ్యలమేలుమంగ మో
మక్కునఁ జేర్చుచున్ బహువిహారములన్ వనవీథులం బ్రియం
బెక్కువగాఁ జెలంగు విధమేమని చెప్పుదు వేంకటేశ్వరా" 25 ప.

ఇవి వేంకటేశ్వరశతకము గరుడోత్సవాదులను గమనించిన కాలమునందు రచించుటను తెలుపును. ఆ కాలము తిరుపతియాత్రాకాలముకాదు. తిరుపతినివాసకాలమగును. అలమేలుమంగాశతకము, వేంకటపతిశతకము వివాహాత్పూర్వకృతులు, వేంకటేశ్వరశతకము వివాహానంతరకృతి అగును. అన్నమయ్య వివాహము "ఎలజవ్వనము"నందు జరిగినట్లు అన్నమార్యచరితమునందు కలదు. ఎలజవ్వనమన లేతయౌవనము. పాతికేండ్లు పై దాటిన వయస్సు. అన్నమాచార్యుల జననకాలము 1424వ సంవత్సరము కాఁబట్టి, వేంకటేశ్వరశతకము రచనాకాలము స్థూలముగ 1424+30=1454వ సంవత్సరము.

వేంకటేశ్వరశతకమునందు సరిగా నూరుపద్యములు కలవు. "వేంకటేశ్వరా" అను మకుటము కలదు. అలమేలుమంగ ప్రసక్తి కలదు. అది సంబుద్ధి రూపమునను కలదు. కాని మకుటము కాదు. అలమేలుమంగ గుఱించి వేంకటేశ్వరునికి నివేదించుట విషయము. వేంకటేశ్వరశతకము ప్రాధాన్యవివక్షను శృంగారశతకము. దైవసంబంధము.

"తొలకరిమించి తొయ్యలి వధూమణి చక్కని తల్లి మానినీ
తిలకము దేవదేవుని సతీమణి యే యలమేలుమంగ నీ

సొలపులచూపులే విభుని చూపుల విందు లటంచు నెచ్చెలుల్
పలుకఁ గ నిన్నుఁ జూచి నగుఁ బైకొని నీసతి వేంకటేశ్వరా" 14ప.

"మా యలమేలుమంగ చలమా యలయించెద వెంతసేసినన్
దోయజగంధి నీకు మతితోడనె తక్కిన దల్క నోపునా
చేయంగ నేర్పు చేంత లివి చేయుదుగాక లతాంతసాయకుం
డీయెడఁ జేయు వేదనల కిన్నియుఁ దోడగు వేంకటేశ్వరా" 78ప.

తెలుగు శృంగారశతకములందు వెలుగు చూచిన మొదటిశతకమిదియే.

## శృంగారమంజరి

ఇది అన్నమాచార్యులు సాళువనరసింహరాయలను అనుగ్రహించిన తర్వాత రచించినట్లు అన్నమార్యచరితమునందు కలదు. (పుట41) అందు సాళువనరసింహరాయలు మొదట "టంగుటూ రను పురంబేలు" చున్నట్లు (పుట31), తర్వాత-

"బలియుఁ డై పరిపంథిబలముల నడచి
నలిరేఁ గి సింహాసనంబు చేకొనుచు
తన రాజధానియై తనరు పసిండి
పెనుగొండ గతి నుండు పెనుగొండ నుండి" పు.32

నట్లును కలదు. విజయనగరసామ్రాజ్యాధిపతి అయినట్లు లేదు. కాకపూర్వమే అన్నమాచార్యులు శృంగారమంజరి రచించినట్లు అనుమేయము. కాఁ బట్టి శృంగారమంజరి రచనాకాలము స్థూలముగ 1470 వ సంవత్సరము.

శృంగారమంజరి శృంగారము ప్రధానమైన మంజరీద్విపదలఘుకావ్యము. ఇందు రెండువందల యేబదియెనిమిదిన్నర ద్విపదలు కలవు. ఒక బాల తిరువేంకటాద్రీశుని వినుకలిని వరించుట, కనుకలిని తరించుట ఇతివృత్తము. చెలికత్తెలతో పుష్పాపచయము సేయు బాల, చతురవిద్యాగోష్ఠిని చరియించు తిరువేంకటాద్రీశుని కని విరహావస్థకు పాల్పడును. చెలికత్తెల శీతలోపచారములకు తాపమతిశయించును. ప్రోడయైన చెలికత్తె రాయబారము ఫలించి, తిరువేంకటాద్రీశుడు బాలకు చిత్తజసామ్రాజ్యసింహాసనమున పట్టము గట్టును. ఆ బాల ఎవరో లేదు. తిరువేంకటాద్రీశుని

"శృంగారవిఖ్యాతి చెలువంబు రీతి
నొయ్యారముల బాగు నొసపరిలాగు
రాజసంబుల సొంపు రసికత పెంపు

సరసత్వముల చెల్మి చతురత కల్మి
విని విని యొకబాల వికచాంబుజాక్షి"

అనియేకలదు. గ్రంథాంతమునందు "మధురంపు శృంగారమంజరి" అని కలదు. మధురభక్తిమర్మము మృగ్యము. వనవర్ణనము, విరహవర్ణనము, దూత్యవర్ణనము కల శృంగారమంజరి, అనంతరయుగములలోని శృంగారప్రబంధములకు శృంగ గ్రాహికయైన ఆద్యప్రకృతి.

## సంకీర్తనలు

ఇవి ముప్పదిరెండువేలు రచించినట్లు అన్నమార్యచరితమునందు కలదు. (పుట45 ). అవి 1537 ప్రాంతమున రాగిరేకుల మీద చెక్కింపఁ బడినవి[318]. రాగిరేకులు అనేకము తిరుపతిదేవాలయప్రాకరములోని "తాళ్లపాకవారియర" యందు లభించినవి. కొన్ని అహోబల శ్రీరంగక్షేత్రములందు లభించినవి. మఱికొన్ని రాగి పాత్ర లయినవి. ముప్పదిరెండువేలు సంకీర్తనలు లభింపలేదు. మూడవవంతు పైగా లభించినవి. రాగిరేకులమీది వాక్యమును బట్టి (పూర్వోదాహృతము) అన్నమాచార్యుల సంకీర్తనల రచనాకాలము 1440-1503.

అసలు కీర్తన అన స్తుతి. సంకీర్తన అన చక్కని స్తుతి. లేదా మిక్కిలి స్తుతి. అది పాట అయిన ప్రక్రియ. ప్రక్రియాభేదమైన సంకీర్తనశబ్దము కృష్ణమాచార్యుల సింహగిరినరహరివచనములందు ప్రయుక్తము. అవి సంకీర్తనములే. కాని, వచన సంకీర్తనములు. పాడునవియే. అన్నమాచార్యుల సంకీర్తనములు వచనసంకీర్తనములు కావు. పదసంకీర్తనములు. పదకవితాప్రభేదములు. పదములు ద్వివిధము. 1.దేశీయపదములు లేక దేశిపదములు 2.శాస్త్రీయపదములు లేక మార్గ పదములు. దేశీయసంగీతముతో కూడినవి దేశీయపదములు. శాస్త్రీయసంగీతముతో కూడినవి శాస్త్రీయపదములు. దేశీయపదములు ప్రాథమికదశాపురస్కారములు. శాస్త్రీయపదములు పరిణామదశాపరిష్కారములు. శాస్త్రీయపదములు సంస్కృత మునందు ప్రబంధములని వ్యవహృతములు. ప్రబంధభేదములు, ప్రబంధ లక్షణములు శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము మొదలైన సంగీతశాస్త్రగ్రంథములందు సవివరముగ కలవు. సంకీర్తనభేదములు, సంకీర్తన లక్షణములు అన్నమాచార్యుల సంకీర్తనలక్షణమను సంస్కృతగ్రంథమునకు ఆంధ్రీకరణమైన చినతిరుమలాచార్యుల సంకీర్తనలక్షణమను తెలుగుగ్రంథమునందు కలవు. అందు కృష్ణమాచార్యులు పరికల్పించిన పదము తాళబంధచ్ఛందోవిరహితమైన చూర్ణమని, అది తాళగంధి అని కలదు. చూర్ణము వచనభేదము. "అనావిద్ధలలితపదం చూర్ణమ్"

అని వామనుని కావ్యాలంకారసూత్రవృత్తియందు కలదు. తాళబంధచ్ఛందోవిర హితమైన, తాళగంధసహితమైన వచనము వచనసంకీర్తనము. తాళబంధచ్ఛం దస్సహితమైన పదము పదసంకీర్తనము. అన్నమాచార్యుల సంకీర్తనలు తాళబం ధము, మాత్రాఛందస్సు కల శాస్త్రీయపదములు.

"యోగమార్గంబున నొకకొన్ని బుధులు
రాగిల్ల శృంగారరసరీతిఁ గొన్ని
వైరాగ్యరచనతో వాసింపఁ గొన్ని
సారసనేత్రుపై సంకీర్తనములు"పుట 45.

అన్నమాచార్యులు రచించినట్లు అన్నమార్యచరితమునందు కలదు. శృంగార రసరీతివి శృంగారసంకీర్తనలు అని, యోగమార్గమున కలవి, వైరాగ్యరచనతో వాసించునవి అధ్యాత్మసంకీర్తనలు అని ముద్రణములందు కలదు. శృంగారసం కీర్తనలు ద్వివిధము. 1.వస్త్వాశ్రయములు 2.ఆత్మాశ్రయములు. అలమేలుమంగావేం కటేశ్వరుల శృంగారమును వర్ణించునవి వస్త్వాశ్రయములు. 2. అన్నమాచార్యులు నాయికగా, వేంకటేశ్వరస్వామి నాయకుడుగా శృంగారమును ప్రకటించునవి ఆత్మాశ్రయములు. ఈ నాయికానాయకశృంగారము మధురభక్తి. నారదభక్తిసూత్ర ములందు గాని, భాగవతనవవిధభక్తులందు గాని మధురభక్తి నామకరణములేదు. కాని మధురభక్తి వైష్ణవభక్తిభేదమే. మధురభక్తిస్వరూపమిది[319].

"ప్రతి జీవాత్మయు స్త్రీ. పరమాత్మ ఒక్కడే పురుషుడు. జీవాత్మ లన్నియు పరమాత్మను పొందుటకై యోగమార్గమును అవలంబిం చుటకు నాయికాసదృశములు. ఆ నాయికలకు అనగా జీవా త్మలకు నాయకుడు అనగా పరమాత్మ శ్రీకృష్ణుడు. ఆ నాయికా నాయకుల ఐక్యమే రాధాకృష్ణతత్త్వము. అదే మధురభావము. తదారోపమైన, ఆధ్యాత్మికమైన, అలౌకికశృంగారము మధురభక్తి".

అన్నమాచార్యులు తన జీవాత్మను నాయికగా, పరమాత్మ వేంకటేశ్వర స్వామిని నాయకునిగా ఆరోపించి, రచించిన శృంగారసంకీర్తనలు ఆత్మాశ్రయ ములు. మధురభక్తివిలసితములు. జీవాత్మపరమాత్మల సంబంధము నాయికానాయ కానురాగముగ పన్నిద్దరాళ్వారులలో ఒకరైన నమ్మాళ్వారు రచనములందే కని పించును.

అలమేలుమంగావేంకటేశ్వరులశృంగారమునకు సుకుమారమైన ఉదాహరణము :

"అలరులు గురియఁగ నాడె నదె
అలకలఁ గులుకుల నలమేల్మంగ ||అల||

అరవిరి సొబగుల నతివలు మెచ్చఁగ
అరతెర మరుగున నాడె నదె
వరుస నపూర్వదువాళపు తిరుపుల
హరి గరగింపుచు నలమేల్మంగ ॥అల॥
మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడవుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకుల
అట్టిటు చిమ్ముచు నలమేల్మంగ॥అల॥
చిందుల పాటల సిరి పొలయాటల
అందెల మ్రోతల నాడె నదె
కందువ తిరువెంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల అలమేల్మంగ" ॥అల॥ 24-3

మధురభక్తికి ఉదాహరణము:

"ఏమని వలపు చెప్పే నెవ్వరూ నే మెఱఁగేరు
నేమపు నీ గుణాలకు నీవే సాక్షి ॥ఏమని॥

వొనర నీపై బత్తి వొరులకుఁ జెప్పరాదు
మనసులోపల నున్న మరుఁడే సాక్షి
నినుఁ బాసి విరహాన నేనిందాక నున్నందుకు
నినుపులయిన నా నిట్టూర్పులే సాక్షి ॥ఏమని॥

నెక్కొన్న నా కోరికలు నీతో వాక్రుచ్చరాదు
దిక్కులను మొక్కు కొన్న దేవరే సాక్షి
చొక్కపు నా చూపుల సూటి నీపై నున్నందుకు
పక్కన నే నుండేటి భావమే సాక్షి ॥ఏమని॥

బాసతోడ నీ కౌఁగిటఁ బాయలేక వున్నందుకు
రాసి కెక్కినట్టి నా రతియే సాక్షి
సేసవెట్టి యేలితివి శ్రీవేంకటేశ్వర నన్ను
అ సుద్దుల కెల్లా మన ఆయములే సాక్షి ॥"ఏమని"॥ 307-27

అధ్యాత్మసంకీర్తనకు ఉదాహరణము ;

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె ॥బ్రహ్మ॥

కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మంతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥బ్రహ్మ॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి యొకటే ॥బ్రహ్మ॥

చండాలు డుండేటి సరిభూమి యొకటే
కడఁగి యేనుగు మీఁద కాయు యెండొకటే
పుడమి శునకము మీఁదఁ బొలయు నెండొకటే
కడుఁ బుణ్యులనుఁ బాప కర్ములను సరిగావ
జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే" 59 ఉత్సవసంచిక

అన్నమాచార్యుల సంకీర్తనములందు "జాజరలు (చర్చరి), చందమామలు, కోవెల, చిలుక, తుమ్మెద, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, జోల, జోజో, జేజే, జయ జయ, విజయీభవ, శోభన, మంగళ, వైభోగములు, మేల్కొలుపులు, నలుగులు, దంపుళ్లు, కొట్నాలు, కూగూగులు, గుజ్జెనగూళ్లు, చందమామగుటకలు, నివాళులు, ఆరతులు, మంగళారతులు, జయమంగళాలు, అల్లోనేరేళ్లు, చాంగుబళాలు, బళాబళాలు, సాసముఖాలు, అవధానములు, తందానలు, వెన్నెలలు; చిత్తమా, మనసా, బుద్ధీ సంబోధనలగు తత్త్వగేయములు" మొదలైన మధురకవితలు[320] కలవు.

అన్నమాచార్యులు పదకవితాపితామహుడు. వాగ్గేయకారవల్లభుడు. వాక్కు సాహిత్యము. గేయము సంగీతము. సంగీతసాహిత్యవిద్యాయుగళస్రష్ట వాగ్గేయ కారుడు. అన్నమాచార్యుల సంకీర్తనలు రాగనిర్దిష్టములు. రాగము సంగీత విషయము. భాష సాహిత్యవిషయము. అన్నమాచార్యుల సంకీర్తనములందు శివ కవుల కృతులందు కంటె, తిక్కనకృతులందు కంటె అధికముగ తేటతెనుగు తేజ రిల్లినది.

**పిడుపర్తి బసవన**: ఇతని కృతులు దీక్షాబోధ, పిల్లనైనారు కథ, బ్రహ్మోత్త రఖండము మొదలైన శివరహస్యములని, ఈతని కుమారుడు పిడుపర్తి సోమ నాథుని పద్యబసవపురాణమునందు కలదు. పిల్లనైనారు కథ, బ్రహ్మోత్తర ఖండము లభింపలేదు. గురుదీక్షాబోధ లభించినది. అందు శివకథలు, పిల్లనైనారు చరిత ద్విపదగా నుడివినట్లు కలదు. గురుదీక్షాబోధ "కాలమాసన్నంబు గా

కటుమున్నె" రచించినట్లు కలదు. చివఱి గ్రంథము, చరమగ్రంథమును అగును. బసవనకాలము 1410-1490 అని పూర్వోక్తము[321]. కాఁబట్టి గురుదీక్షాబోధరచనాకాలము స్థూలముగ 1490వ సంవత్సరము. అది తెరియ పద్మరసు మొదట సంస్కృతమునందు, తర్వాత కన్నడమునందు రచించిన గ్రంథమునకు తెనుగుసేత అని గురుదీక్షాబోధయందు కలదు. గురుదీక్షాబోధ కావ్యము కాదు. మతగ్రంథము.

**పిడుపర్తి సోమనాథుడు** : ఈతని కృతులు పద్యబసవపురాణము, ప్రభులింగలీల. కాలము 1440-1520 అని పూర్వోక్తము[322]. పద్యబసవపురాణము రచనాకాలము స్థూలముగ 1490వ సంవత్సరము. ప్రభులింగలీల రచనాకాలము 1500 వ సంవత్సరము.

## పద్యబసవపురాణము

ఇది పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునకు పద్యగద్యప్రబంధము.

"సరవి శ్రీనాథుఁ డా చరిత పద్య ప్రబం
ధము చేసె ద్విపదలు తఱుచు నిలిపి

XXX XXX XXX

గానఁ బూర్వకావ్యము వేఱుగతి రచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చి నెగడు"

అని పిడుపర్తి సోమనాథుడు అవతారికలో చెప్పినట్లు, అతని పద్యబసవపురాణము పాలకుఱికి సోమనాథుని బసవపురాణములోని ద్విపదలు తఱుచు నిలిపి రచించినది. ద్విపదకావ్యము పద్యకావ్యమగుటకు నాంది పలికినది శ్రీనాథుడు. శ్రీనాథుని పండితారాధ్య చరిత్రము. అనుపలబ్ధము. ఉపలబ్ధమైన అట్టి కావ్యములందు మొదటిది పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణము. గ్రంథము కంటె అవతారిక గణనీయమైనది. పాలకుఱికి సోమనాథునికి అంకితము.

## ప్రభులింగలీల

ఇది చామరసు అను కన్నడకవి "ఆదిపదములు వేనూట పదునొకొండింట .... .... నిర్వ్విదియేను గతుల" ( పుట191) రచించిన "ప్రభులింగలీలె" అను కన్నడకృతికి తెనుగుసేత. చిఱుతొండనంబి వంశీయుడైన వణిక్ప్రముఖుడు నెల్లూరి రామలింగయ్య.

"కలితమౌ కన్నడ కావ్యంబు గాన
తెలియఁగ జెప్పు ఁడీ తెనుఁగున మీరు
శుద్ధ సద్విద్యోపశోభితుండైన
సిద్ధవీరేశదేశికచక్రవర్తి ।కి"పుట3

అనగా, పిడుపర్తి సోమనాథుడు "ప్రతిభఁ జెప్పిన సత్ప్రబంధంబు" (పుట7) తెలుగు ప్రభులింగలీల. సిద్ధవీరేశ్వరగురువునకు అంకితము. "ఇది యొక కావ్యమాత్రంబు గాదు. గురుగుహేశ్వరలింగమూర్తి లీలావినోదంబు .... మోక్షావాప్తి యగును" (పుట5) గుహేశ్వరలింగమూర్తి అల్లమప్రభువు. అతని లీలలు ప్రభులింగలీల. ప్రాసద్విపదకావ్యము. ఇర్వదియేను గతులును కలవు. ఒక్కొక్కగతి ఒక్కొక్క విషయము. వీరశైవమతమునకు భక్తి బసవేశ్వరుని కానుక. జ్ఞానము అల్లమప్రభువు ఉపద.

అల్లమప్రభువు చరితములందు కన్నడమున హరిహరుని "ప్రభుదేవరగళె" మొదటిది. చామరుసు ప్రభులింగలీలె రెండవది. మొదటిది సమీపకాలికము. రెండవది సుదూరకాలికము. రెండిటికిని భేదము కలదు. అల్లమప్రభువు బసవేశ్వరునికి సమకాలికుడైన చారిత్రికవ్యక్తియేకాని, ప్రభులింగలీలె పౌరాణిక ప్రతిపత్తి కలది. తాత్త్వికప్రతిపత్తి కూడ కల అల్లమప్రభువు తల్లి సుజ్ఞాన. తండ్రి నిరహంకారుడు. మాయాసతి తల్లి మోహిని. తండ్రి మమకారుడు. ఇది ప్రబోధ చంద్రోదయమునకు జ్ఞాపిక. "అల్లమప్రభువు"లోని అల్లమశబ్దమునకు అర్థము "నామరూపాదినిర్ణయుఁడుగాకున్కి" (పుట17) అల్ల, ఇల్ల అను కన్నడ శబ్దములు శూన్యార్థకములు. అల్లమప్రభువు "పరశివబ్రహ్మంబు" (పుట163)

అల్లమప్రభువు మాయాసతిని మాయసేయుట, అక్కమహాదేవి కథ, గొగ్గయ్య కథ, ముక్తాయికథ, సిద్ధరామయ్య కథ, బసవేశ్వరుని కథ, గోరక్షుని కథ మొదలైనవి ప్రభులింగలీలయందు రసవత్కథలు. గోరక్షకుడు నాథుడే కాని, శ్రీశైలములోని గోరక్షుడు, గోరక్‌పూర్ లోని గోరక్షనాథుడు-నవనాథులలో ఒకడు - కాడు -కథలు రసవంతములే గాక, పిడుపర్తి సోమనాథుని కవిత్వము మృదు మధురము. చామరసు శైలి సరళమటు[323]. సోమనాథుని శైలి కూడ పరమ సరళము. సాదృశ్యకల్పనములు సహజసుందరములు.

"బాలురకును జనుఁ బాలు జీవనము
పాలు ద్రావించి చన్ బాలకుఁ బాపి
యుక్కెఱఁ బెట్టు పాలొయ్యన మాన్పి
మక్కువ నన్నంబు మరగించు నట్లె" పుట92

"కోరి వెంట్రుకఁ బట్టి కొండఁ దాఁ ద్రాఁకు
తీరున"పుట94

"నూలిసంకెలఁ బాఱనూఁకి బంగారు
కీలలు కాళ్లకుఁ గీలించినట్లు"పుట95

కర్ణాటాంధ్రకావ్యముల తులనాత్మక పరిశీలనము సాపేక్ష్యము.

అల్లమప్రభువు గురువు అనిమిషనాథుడు. అల్లమప్రభువును "నాదబిందుకళల నడుమనె నిలుచు నాదిసద్గురునాథుడు" (పుట169) అల్లమప్రభువు జ్ఞానమార్గమునందు షట్‌స్థలములు (పుట124) సమరసభక్తి (పుట131) శివాద్వైతవిజ్ఞానము (పుట148) "హఠరాజయోగమార్గము" (పుట102) కలవు. రసవాదము లేదు. (పుట124.) రసవాదము వినా నాథసంప్రదాయము వీరశైవమతమునందు విలీనమైనట్లు విదితమగును. అల్లమప్రభువు బసవేశ్వరునికి ఉపదేశించిన భక్తి మూఢభక్తి కాదు. జ్ఞానభక్తియే. అందు శివలింగపూజావిశేషమిది :

"సకలచరాచరజంతుసంతతుల
కొకమాటు గినియక యురుతరకరుణ
జరపుచునుండుటే శంభుమజ్జనము
పరులు నా వా రను భ్రాంతులు వాసి
పరమశాంతి వహించి పరగు చిత్తంబు
హరునకు శ్రీగంధ మలఁదుట మేనఁ
గర్మఫలాకాంక్ష గడచి వర్తించు
మర్మ మెఱింగి నిర్మలశివధర్మ
గతినున్కి యదియ యక్షతసమర్పణము
సతతంబు మార్పులు సంధిల్లుచుండు
మనసు నిర్మలత నేమఱకుండునేని
నొసర నీశునకుఁ బుష్పోపహారంబు
ఒడలి దుర్గుణముల నుజ్జ్వలజ్ఞాన
బడబాగ్నిలోపలఁ బడఁద్రోచి కాల్ప
ధూప మర్పించుట దురితదూరునకుఁ
దాపత్రయాలయతనువు తామసము
తొఱఁగుట దీప మెత్తుట లింగమునకు
మఱియుఁ బాత్రవిముక్తమహిత పదార్థ
శాల్యన్నములు శివస్మరణయుక్తముగ
లౌల్యవర్జితమతి లాలించు రచన

భావభవారికి భక్తియుక్తముగ
నైవేద్యమిచ్చు చందంబునఁ బరఁగుఁ
బ్రచురతరానందబాష్పోదకములు
ఉచితహస్తోదకం బొసఁగుట యగును
మొదల సత్త్వరజస్తమోగుణత్రయముఁ
బొదవకుండుటయె తాంబూలంబు లింగ
మునకు నిచ్చుట యది ముఖ్యార్పణంబు" పుట123

సర్వభూతదయ అభిషేకాచరణము, స్వపరభేదరాహిత్యము చందనచర్చాసమర్చనము, ధర్మానుష్ఠానము అక్షతసమర్పణము, నిశ్చలమనోనిర్మలత పుష్పోపహారసమర్పణము, దుర్గుణదహనము ధూపవహనము, తామసపరిత్యాగము దీపదర్శనము, లౌల్యవర్జనము నైవేద్యనివేదనము, ఆనందబాష్పోదకప్రచురము హస్తోదకప్రదానము, గుణత్రయనిగ్రహము తాంబూలసమర్పణము అను పూజా విధానము మానవతాదృక్పథమునకు మహానిధానము.

అల్లమప్రభువు, బసవేశ్వరుడు నిర్మింపఁజేసిన శూన్యసింహాసనము మీద ఆరోహణము సేయుట కంటె, సిద్ధము చేయించిన లక్షయేనుబదివేలమంది ఆహారమును ఆరోగణము సేయుట అద్భుతావహము.

**వెలిగందల నారయ**: ఈతని కృతి భాగవత - ఏకాదశ, ద్వాదశస్కంధద్వయము స్కంధాంతగద్యలందు "సహజపాండిత్యపోతనామాత్యప్రియశిష్యవెలిగందలనారయనామధేయప్రణీతంబు" అని కలదు. ఇంతకు మిక్కిలి ఇతని గుఱించి తెలియదు. పోతన ప్రియశిష్యుడైన నారయ ఏకాదశ, ద్వాదశస్కంధముల రచనాకాలము 1490 ప్రాంతము కావచ్చును. పోతన భాగవతములోని రేఫశకటరేఫప్రాససాంకర్యము, విశిష్టాద్వైతసిద్ధాంతచ్ఛాయలు వెలిగందల నారయ కృతములను అపవాదములు కలవు. అవి యథార్థములు కావని పూర్వోక్తము. (భాగవతకర్తృత్వము) నారయ భాగవతాంధ్రీకరణము సంగ్రహము. మూలమునందు ఏకాదశస్కంధము 31అధ్యాయములు. 1362శ్లోకములు. తెనుగు సేతను 124పద్యగద్యములు. ద్వాదశస్కంధము 13అధ్యాయములు. 563శ్లోకములు. 50 పద్యగద్యములు. పద్యముల కంటె గద్యములు అధికము. ఏకాదశస్కంధము వేదాంతప్రధానము. నారదుడు తెలిపిన విదేహర్షభసంవాదము, శ్రీకృష్ణుడు ఉద్ధవునికి కావించిన పరమార్థోపదేశము అవధూతయదుసంవాదము జ్ఞానవిషయము. మహర్షుల శ్రీకృష్ణసందర్శనము, యాదవుల ద్వారకానిష్క్రమణము, శ్రీకృష్ణబలరాముల వైకుంఠగమనము సామాన్యవిషయము. ఇందు మహామునులు శ్రీకృష్ణుని సందర్శించిన ఘట్టము అమూలకము (12-18వచ.) అందు,

"తరణంబులు భవజలధికి
హరణంబులు దురితలతల కాగమముల తా
భరణంబు లార్త జనులకు
శరణంబులు నీదు దివ్యచరణంబు లిలన్." 15ప

అను పద్యము పోతన శిష్యత్వమునకు సాకిరి. ద్వాదశస్కంధము బహువిషయభరితము. అవి భావికాలగతులు, యుగధర్మములు, ప్రళయచతుష్టయము, పరీక్షిన్మరణము, జనమేజయసర్పయాగము, వ్యాసుని వేదవిభాగపురాణప్రవర్తనములు, మార్కండేయోపాఖ్యానము, ద్వాదశాదిత్యుల క్రమమును. మార్కండేయోపాఖ్యానము పురాణసామాన్యము కాదు. మార్కండేయుడు శివభక్తునిగా కంటె హరిభక్తునిగ కలదు. ద్వాదశస్కంధము వేదాంతప్రధానము కాకపోయినను రసవత్తరఘట్టము మరుమరీచిక.

అనంతరయుగమునందు ఏకాదశద్వాదశస్కంధద్వయము హరిభట్టుకృతము కలదు. వెలిగందల నారయ ఏకాదశ, ద్వాదశస్కంధములందు, హరిభట్టు ఏకాదశ ద్వాదశస్కంధములందు సమానరచనము కలదు.

"విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్ప దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదముట్టన్ వధియించి కృష్ణుఁడతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యంబయ్యె నత్యుగ్రమై"
6ప.11స్కం.

అను నారయ ఏకాదశస్కంధములోని పద్యమునందలి "గొలువ"బదులు "పొగడ" అని, "భూమి మోవంగ నసహ్యంబయ్యె" బదులు "భూమిలోన నవిషహ్యంబయ్యె"నని హరిభట్టు ఏకాదశస్కంధములోని పద్యమునందు కలదు[324]. కడమపద్యము సమానము. ఇట్టి సమానరచనము పోతనరచనము, భిన్నరచనములు శిథిలమైన పోతన రచనమునకు ఇద్దఱిపూరణములు కావచ్చును.

**గంగనార్యుడు** : ఈతని కృతి భాగవతపంచమస్కంధము. స్కంధాంతగద్యను "బొప్పనామాత్యపుత్రగంగనార్యప్రణీతంబు" అని కలదు. ఇంతకు మిక్కిలి ఇతని గుఱించి కూడ ఏమియును తెలియదు. పంచమస్కంధము గంగనార్యకృతమేగాని, అన్యకవికృతము లేదు. వెలిగందల నారయ పంచమస్కంధమును ఏల వ్రాయలేదో కూడ తెలియదు. గంగనార్యుని పంచమస్కంధము రచనాకాలము 1495ప్రాంతము కావచ్చును.

పంచమస్కంధమునందు ఆశ్వాసవిభాగము కలదు. రెండు ఆశ్వాసములు. ప్రథమాశ్వాసమునందు ప్రియవ్రతుని చరిత్రము, ఋషభావతారవృత్తాంతము, భరతోపాఖ్యానము కలవు. ద్వితీయాశ్వాసమునందు భూగోళవర్ణనము, భగణవిషయము, నరకలోకవర్ణనము కలవు. భరతోపాఖ్యానము రసభరితము. వేదాంతవిషయసహితము. వేదాంతవిషయము గహనముగ లేదు. సరళముగ కలదు. గంగన కవితాస్రవంతి గండశిలలపై గంతులు వేయు గంగానది కాదు. మైదానమున మంద గమనము సేయు మందాకిని. బహుకాలము రాజ్యము చేసి పుత్రులకు పంచి యిచ్చి, పులహాశ్రమమునందు హరిపూజాతత్పరుడైన భరతుడు హరిణపోతమును ఆశ్రమమునకు తెచ్చి పెంచుకొనుట తోపాటు, ఆత్మయోగము చెడి మమకారమును పెంచుకొనుట మనోజ్ఞముగ సంతరించెను.

"అక్కట తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁ జేసి యే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి నాయెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమ సేసి చరియించుచునున్నది నాదు సన్నిధిన్
మక్కువ చేసి దీనిఁ గడుమన్ననలం దగఁ బ్రోతు నెంతయున్."
103. 1 ఆ.

అని సర్వకాలసర్వావస్థలయందు "తనయొద్దన యునిచికొనుచు", "వెనువెంటఁ దిరుగుచు", "కొంతసేపు స్కంధంబుల వహింపుచు మఱి కొంతదడ వురంబున నుత్సంగంబున నునిచికొని లాలించుచు సంతసంబు నొందుచు .... దాని నాశీఃపరంపరల నభినందించుచుఁ జుంబనాదులఁ బ్రీతి సేయుచు నతిమోహంబునఁ బెంచుచుండును."(105ప.) హరిణశాబకము కనబడకుండపోయిన,

"హరిణపోతంబు నీకు వనాంతమందుఁ
గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు
రాజవృషభుఁడు భరతుఁ డారాటమంది. 109

తల్లి చచ్చిన హరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండనగు నన్నుఁ బొంది పాసె
నేమిసేయుదు నేనింక నెట్లు గందుఁ
జేరి యేరీతిఁ గాంచి రక్షించుకొందు

కట్టా యీ యాశ్రమమునఁ
బుట్టిన తృణచయము మేసి పొదలిన హరిణం
బిట్టట్టుఁ దిరుగుచుండఁగఁ

బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించెనొకో" 111ప.1ఆ.

అని దుఃఖించును. హరిణడింభకము తిరిగివచ్చుపఖకు తల్లడిల్లును. (112వచ.1ఆ.)

"భరతుం డల్లన యంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పుడా
హరిణంబుంగడు భక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుందన యాత్మలో నిలిపి దేహం బంతటుం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్."
115ప.1ఆ.

ఇతడే, తదనంతరజన్మమునందు జడభరతుడు. తొలిజన్మములోని భరతుని పేర అజనాభమను వర్షము భరతవర్షమయినది. (98వచ.1ఆ.)

**ఏర్చూరి సింగన** : ఈతని కృతి భాగవతషష్ఠస్కంధము. ఇతడు అవతారికను రచించెను. అందు ఏర్చూరిశాసనుడు ఎఱ్ఱనప్రెగ్గడ పుత్త్రుడు వీరన, వీరన పుత్త్రుడు నాదయ నాదయపుత్త్రులు కసవన, వీరమంత్రి, సింగధీమణి; కసవనపుత్త్రులు సింగయ, తెలగయ అని కలదు. (26-29ప.) చరిత్రాంశము లేదు. ఒక్కడును చరిత్రకు అందిన వ్యక్తి కాడు. సింగనకు స్వప్నమునందు దివ్యవాణి సాక్షాత్కరించి, "చాటుకారపదసాధుకవిత్వము" చెప్పుమన్న ఒక్కశ్లోకము చెప్పెనట! ఆ శ్లోకము దేవి అంగీకరించెనట! (15-21వచ.) అది మొదలు అతనికి "నారాయణాంకితం బయిన కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరంబైన దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని" షష్ఠస్కంధము రచించెనని కలదు. (21-24ప.)

"భాగవతము దేటపఱుప నెవ్వఁడు సాలు
శుకుఁడు దక్క నరుని సఖుఁడు దక్క
బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకు వాఁడ" 23ప.

అని పోతన "భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు" అను పద్యమును అనుకరించినను, పూర్వకవిస్తుతిలో "కవిమనోనాథు శ్రీనాథు ఘనత మెచ్చి" (11ప.)

"ఎమ్మెలు సెప్పనేల జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు సేసిన వాని భక్తిలో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్." 12ప.

అని పోతనపై ప్రత్యేకముగ ఒక పద్యమును రచించినను, సింగన పోతన షష్ఠస్కంధము ప్రసక్తి తీసికొనిరాలేదు. ఉత్పన్నమగుటయే తన్నిమిత్తమగును. ఏకాదశద్వాదశస్కంధములు రచించిన పోతన ప్రియశిష్యుడు వెలిగందల నారయ గాని, పంచమస్కంధమును రచించిన గంగయ గాని షష్ఠస్కంధమును రచింప లేదు. పరిశిష్టమైన షష్ఠస్కంధమును సింగన రచించెను. ఏకాదశ, ద్వాదశ, పంచమ, షష్ఠస్కంధములు క్రమోత్పన్నములు కాఁ బోలు! కారణాంతరము కలదో? నాలుగు స్కంధములు 1485 ప్రాంతమునందు ఉత్పన్నమగుటయే సహజము. సింగన షష్ఠస్కంధము రచనాకాలము 1500ప్రాంతము కావచ్చును. అది కృష్ణార్పణము. (15వచ) షష్ఠస్కంధమునందు అజామిళోపాఖ్యానము, దక్షనారదవృత్తాంతము, వృత్రాసురవృత్తాంతము, చిత్రకేతూపాఖ్యానము, సవితృవంశప్రవచనకథాదికమును కలవు. దక్షనారదవృత్తాంతమునందు నారదుడు నివృత్తిమార్గమును ఉపదేశించుట, దక్షుడు నారదుని శపించి ప్రజలను క్షయించుట కలవు. అజామిళోపాఖ్యానము, చిత్రకేతూపాఖ్యానము రసవత్తరములు. సింగన కవిత్వము పోతన కవిత్వము వలెనే కలదు. పోతన శైలీవిన్యాసము, భక్తిపారవశ్యము, శృంగారపారతంత్ర్యము, శ్రీనాథప్రభావము సింగన షష్ఠస్కంధమునందు పోత పోసినట్లు కలదు. అందువలన సింగన షష్ఠస్కంధము పోతన కృతమే అను వాదము పుట్టినది. కాని కిట్టినది కాదు. గిట్టినది.

"కావునఁ గాలకింకరవికారముఁ గానకమున్న మృత్యుదు
ర్భావనఁ జిత్తమున్ వెడఁగు పాటును జెందకమున్నమేనిలో
జీవములెల్ల వెల్గుచుండఁ దన చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ బాయు తెఱంగొనరింపఁగాఁ దగున్"
44ప.

"నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మం బేల వ్యర్థంబగున్." 128ప.

"హరి భక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్
వరముక్తికాంత తేటలు
నరిషడ్వర్గంబు సొరని యరుదగు కోటల్." 153ప.

ఇట్లు పోతన శైలీవిన్యాసము సింగన షష్ఠస్కంధము నందు కలదు.

"బ్రహ్మహత్యానేకపాపాటవుల కగ్ని
కీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ
గేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యసంతమసంబునకు సూర్య
కిరణములు హరినామసంకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ
గేసరుల్ హరినామకీర్తనములు
మహితయోగోగ్రనిత్యసమాధివిధుల
నలరు బ్రహ్మాదిసురులకు నందరాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య
ఖేలనంబులు హరినామకీర్తనములు." 118ప.

"కూలిన చోటఁ గొట్టువడి కుందిన చోట మహాజ్వరాదులం
గ్రేలిన చోట సర్పముఖపీడల నందిన చోట నార్తులై
తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్" 123ప.

ఇట్లు పోతన భక్తిపారవశ్యము సింగన షష్ఠస్కంధమునందు కలదు.

"హాలాఘూర్ణితనేత్రతో మదనతంత్రారంభసంరంభతో
ఖేలాపాలనయోగ్యభూవిభవతోఁ గీర్ణాలకాజాలతో
హేలాలింగనభంగివేషవతితో నిచ్ఛావతీమూర్తితోఁ
గేళిం దేలుచునున్నవానిఁ గనెఁ బుంజీభూతరోమాంచుఁడై"98ప.

ఇట్లు పోతన శృంగారపారతంత్ర్యము సింగన షష్ఠస్కంధమునందు కలదు.

"కుంకుమరాగరమ్యకుచకుంభములం గడుం గజ్జలంబుతోఁ
బంకిలమైన బాష్పముల పాల్పడ మజ్జన మాచరించుచున్
గంకణపాణిపల్లవయుగంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావితపంచమసుస్వరంబునన్." 451ప.

ఇట్లు శ్రీనాథుని ప్రభావమును సింగన షష్ఠస్కంధమునందు కలదు.

ఇతరులు రచించిన షష్ఠస్కంధములందు కవుల షష్ఠము గురించి పూర్వోక్తము. హరిభట్టు షష్ఠస్కంధమును రచించెను. అముద్రితము. రచనాకాలము 1520 ప్రాంతమే అగును. సర్వన రచించిన షష్ఠస్కంధమునుండి ఒక్కపద్యమే పెదపాటి

జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉదాహరింపఁబడినది. (205ప.2అ.) అనుపలబ్ధము. పోతన షష్ఠస్కంధమని ఒకటి ముద్రితమైనది. అది పోతన కృతముగ లేదు. అన్యకర్తృకమే.

ఏర్చూరి సింగన కువలయాశ్వచరిత్రమునుండి కతిపయపద్యములు ప్రబంధరత్నాకరమునందు ఉదాహరింపఁబడినవి. కాని, కువలయాశ్వచరిత్రము కూడ అనుపలబ్ధము.

**కొఱవి గోపరాజు:** ఈతని కృతి సింహాసనద్వాత్రింశిక. ఇందలి పూర్వకవిస్తుతిలో "పిల్లలమఱ్ఱి వీరరాజు" కలడు. (12ప.1అ.) కావున కొఱవి గోపరాజు పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి తర్వాతి వాడు కావలయును. పినవీరభద్రుని శాకుంతలము రచనాకాలము 1489ప్రాంతము, జైమినిభారతము రచనాకాలము 1491 ప్రాంతము కావున, సింహాసనద్వాత్రింశిక రచనాకాలము స్థూలముగ 1500వ సంవత్సరము.

కొఱవి గోపరాజు కాలము 1450-1525 కావచ్చును. అయిన గోపరాజు తండ్రి కసవరాజు కాలము 1420-1495 అగును. కసవరాజు పెదతండ్రి కుమారులు బాచన, సింగనల కాలములు 1410-1485, 1415-1490 కావచ్చును. బాచన, సింగన అనపోతసింగయ మంత్రులని సింహాసనద్వాత్రింశిక అవతారికయందు కలదు. (48ప.) అనపోతసింగయ రెండవ సర్వజ్ఞసింగభూపాలుడగును. అతని రాజ్యకాలము 1425-1450 అని పూర్వోక్తము. 1410, 1415ప్రాంతములు జననకాలములగు బాచన, సింగన 1440-1450 మధ్య అనపోతసింగన మంత్రు లగుట అనుకూలము.

సింహాసనద్వాత్రింశిక ఆశ్వాసాంతగద్యను "సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీ కొఱవి వెన్నయామాత్యపౌత్ర ..... కసవరాజ తనూజ గోపరాజవిరచితంబు" అని కలదు. గోపరాజు గాని, అతని తండ్రి కసవరాజు గాని అవతారికలోని వంశవృక్షమును బట్టి, వెన్నయామాత్యుని పుత్త్రుని పుత్త్రుడు కాడు. వంశీయులు మాత్రమే. వెన్నయామాత్యుని పౌత్త్రుడు అమరేశ్వరమంత్రి అని కూడ అవతారిక యందు కలదు. (44ప.1అ.) అతడు కూడ వంశీయుడే అగును.

సింహాసనద్వాత్రింశిక మూలము విక్రమార్కచరితము. (సంస్కృతము) తన్మూలము కథాసరిత్సాగరము. సింహాసనద్వాత్రింశిక హరి, హర, హరిహరాంకితము. ఆశ్వాసాంతపద్యములందు మొదటిది హరిపరము. రెండవది హరపరము. మూడవది హరిహరపరము. ద్వితీయాశ్వాసాది పద్యము హరిపరము. తృతీయాశ్వాసాదిపద్యము హరపరము. చతుర్థాశ్వాసము మొదలు ద్వాదశాశ్వాసము వఱకు హరి,

హర క్రమము కలదు. నవమాశ్వాసాదిపద్యమునందు నాల్గవపాదము "-శరీరార్ధసతీ సనాథుం ద్రిజగన్నాథున్" అను పాఠాంతరము కవిహృదయానుగుణము. తిక్కన భారతము వలె, నాచన సోమనాథుని ఉత్తరిహరివంశము వలె, గోపరాజు సింహాసనద్వాత్రింశిక కేవలము హరిహరనాథాంకితము కాదు. హరి, హర, హరి హరనాథాంకితము. చిత్రమైన అంకితము.

విక్రమార్కుని "ముప్పదిరెండు కథలును" "రసభావములు ముప్పిరిగొను నట్లుచెప్పెద"నని గోపరాజు ప్రతిజ్ఞ. (28ప.1ఆ.) అవి కథాసరిత్సాగరమునం దున్నను, ద్వాత్రింశత్సాలభంజిక అను సంస్కృత, ప్రాకృతకావ్యములును, విక్రమార్కచరితమను సంస్కృతకావ్యమును కలవు. అందు విక్రమార్కచరితము సింహాసనద్వాత్రింశికకు అత్యంతసన్నిహితమైన మూలము. సంస్కృతకావ్యమును యథామూలకముగ తెనుగు సేసినట్లు గోపరాజు స్వవచనమే.

"ఈ సరసోక్తి కావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లు వీఁ డు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బుఱక చేయకుఁ డీ, విలుకాఁ డు తూటుగా
నేసిన నందె పాఱ మఱి యేసిన వానిద సూటి గావునన్" 35ప.1ఆ.

సంస్కృతభాషలోని సరసోక్తికావ్యము విక్రమార్కచరితము. స్వతంత్రకావ్యరచనము కంటె సంస్కృతకావ్యాంధ్రీకరణమే ఎంత కష్టమో ఇందు స్పష్టముగ కలదు. ఒక విలుకాడు బాణము వదిలి తూటు చేసిన స్థలమునందే మఱొక విలుకాడు బాణము వదిలి తూటు చేయుట కష్టతరము. కష్టతరమైన ఆంధ్రీకరణముతోపాటు అష్టాదశవర్ణనలును గోపరాజు అభిమతార్థము.

"పురమధుజలలీలాంబుధి
పరిణయనయవిప్రలంభపతిగుణసుతభా
స్కరచంద్రోదయరణగతి
గిరివనదూతర్తురతులఁ గృతి చెప్పఁదగున్" 37ప.1ఆ.

వర్ణనల తోపాటు సింహాసనద్వాత్రింశికయందు సార్వజనీనములు, సార్వకాలికములునైన, నీతిపద్యములు కలవు. అవి ఏర్చి కూర్చిన నీతిపద్యసంకలనమగును. గోపరాజు భాష తేటతెనుగునకు మొగ్గు.

"తెనుఁ గునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందులేదు మె
త్తన పస చాలదంద్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁ దఁ జె
ప్పిన నవి దర్పముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్

దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్."
32ప.1ఆ.

తేటతెనుగు కావ్యము పొందులేనిది, మెత్తన, పస చాలదు అనుట, సంస్కృత భూయిష్ఠరచనలు దర్భముళ్లు అనుట యుగలక్షణము. ఈ పద్యమునందు "తెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెద" ననినను, ఇంకొక పద్యమునందు "తేటతెనుంగ యొప్పు " అని గోపరాజు తేల్చి చెప్పెను. (36ప.1ఆ.) సింహాసనద్వాత్రింశిక ప్రాధాన్యవివక్షను తేటతెనుగు కావ్యమే. ఇందు వేములవాడ భీమన సుమతిశతకముపద్యముల, వేమన పద్యముల ప్రభావము కలదు.

"ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాటలాడి యన్యుల మనముల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ"

"ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కా విద్య మహిమ మచ్చుపడఁ గాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడునే కావ్య మంత సులభమె ధరిత్రిన్" 22ప.1ఆ.

"పలుకమన్న నేల పలుకకయున్నావు
పలుకుమయ్య నాతొ ప్రబలముగను
పలుకుమయ్య నీదు పలుకు నేనెఱిఁగెద
విశ్వదాభిరామ వినుర వేమ"

"పలుకఁ దగిన పలుకు పలుకక యున్నను
బలుకువినియు వినని పగది నున్న
బలుకఁ జూచు వానిఁ బలుకకు మన్నను
బలుకులేల తల్లి సొలయు నతని" 48ప.5ఆ.

"అనఁగ ననఁగ రాగ మతిశయిల్లు చునుండుఁ
దినఁ గఁ దినఁ గ వేము తియ్యనుండు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినుర వేమ"

"దుఃఖ సాధ్యమయ్యుఁ దొడరి యభ్యాసంబుఁ
జేయఁ జేయ యోగసిద్ధి పెంపు
దినఁ గఁ దినఁ గ వేము తియ్యనౌ నైవడిఁ

ఖిదపఁ బరమహర్షపదము సుమ్ము." 15ప.5ఆ.

ప్రభావము లేని, గోపరాజు స్వభావమైన తేట తెనుగు:

తరుణులతోడి రహస్యము
వెరవరి వగసైరణయును వేషాఢ్యుని స
చ్చరితము దుర్జను సఖ్యము
నరపతి కరుణయును నీవు నమ్మకు మదిలోన్" 16ప.3ఆ.

"కవులు పొగడు వేళఁ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణముసేయు వేళ రాకొట్టి పిలుచుట
పాడి యిదియ మిగుల భజన కెక్కు" 70ప.7ఆ.

"రానిపైఁ డి చెల్లు వ్రాయుట యాయంబు
తక్కువై వ్యయం బదెక్కుడౌట
లెక్క తుడుపు వడుట లిపి సందియం బౌట
చెల్లు మఱచుటయును గల్లపనులు" 98ప.11ఆ.

గోపరాజు వర్ణనలందు పూర్వాపరకవులు స్పృశింపని, హాస్యరసప్రధానమై, విదూషకుడు వినోదకరముగ ప్రొద్దుపుచ్చుటకు చేసిన చింతచెట్టు వర్ణనము చిత్రమైనది.

"చింత మది లేక మనుజులు
చింతించిన కొలఁదిఁ జవులు చేకూర్చు ని
శ్చింతులఁ గా నొనరించెడు
చింతకు సరిగలదె లోకచింతామణికిన్. 155

ఈ చింతపంటి సరిగా
నో చెల యమృతంబుఁ జెప్పనొప్పునె దానిన్
వాచవి గొని తమజిహ్వల
నేచవులు లేక చెడరె యింద్రాది సురల్ 156

భ్రాంతివడి కల్పవృక్ష
ప్రాంతంబునఁ గూడుఁ గూర్కుఁ బట్టక సురల
శ్రాంతంబు దీనికై మదిఁ
జింతించుటఁ జేసి పరఁగెఁ జింత యనంగన్. 157

మును ఁజిగురునఁ బువ్వున నో
మనగాయల దోరపండ్ల మఱి యారఁగఁ బం
డిన పండ్ల నెల్లకాలముఁ
దనియఁగఁ జవు లొసంగ నొెడు తరువులు గలవే. 158

ఉడుపతి తనలో నమృతముఁ
గడలు కొనియుఁ బెక్కు చవులు గానక కృశుఁడై
విడిచిన కళలన్నియు నీ
గొడిసెల రూపమునఁ జింతఁ గొలువఁగఁ బోలున్. 159.

వెస నిర్మించిన బ్రహ్మకు
రసికుఁడు మ్రొక్కిడుచు ఫలము రంజిల్లఁగ ష
డ్రసములలో నిది నమలెడు
దెసఁగని నోరూరు నాది దేవుని కైనన్. 160

గరిత లేని యిల్లు దొరలేని తగవును
జింతపండు లేని వింత చవియుఁ
జనవులేని కొలువు శశిలేని రాత్రియు
ముక్కు లేని మొగము నొక్క రూప." 161ప.3ఆ.

ఇతరవర్ణనములందు "అటచని కాంచె భూమివరుఁ"డను పద్యము (157ప. 10ఆ.) అల్లసాని పెద్దన " అటచని కాంచె భూమిసురుఁ"డను ప్రసిద్ధమైన పద్యమునకు అత్యంతసన్నిహితము. "ఆకులపాటు" శబ్దశ్లేషకు ఆద్యప్రకృతి సింహాసన ద్వాత్రింశికయందు కలదు. శేషము వేంకటపతికి మార్గదర్శకము. గోపరాజు పద్య మిది:

"కాకులలోఁ గోకిలములు
కాకులఁ బడలేక కులము గలయఁగఁ బవనుం
డాకుల పా టొనరింపఁగ
నాకులపాటయ్యె విరహులగు లోకులకున్" 10ప.7ఆ.

ఇది వసంతర్తువర్ణనములోని పద్యము. సింహాసనద్వాత్రింశికయందు వసంత ర్తువర్ణనము రెండు స్థలములందు కలదు. రెండు స్థలములందును వసంతోత్సవము కలదు.

"కని కని మానినీజనమనోధనములు
తొలి తొలి గిలుబాడు దొద్దకాఁడు
పువ్వురెమ్మలకు లేమవ్వ మెక్కించుచు
నంగజుతో నాడు సంగడీఁడు

రాచిల్కగములకు వాచవిఁ జుబ్బన
చూఱగా నొనరించు సొంపుకాఁడు
కోకిలంబుల కెల్ల మూక భావంబులు
విడిపింప నడరెడు వెజ్జుతేఁడు
తేఁటికదుపులకును దేనెతోఁ బుప్పొడి
మేపి మరపనేర్చు తీపులాఁడు
మ్రాఁకులకు ముదంబుఁ బ్రాయంబు వాటిల్ల
వింతఁ దోఁచె భువి వసంతుఁ డంత" 126ప.3ఆ.

"కాలవసంత" అనుట వలన (17ప. 7ఆ.) కాలోచితవసంతపూజ వసంతోత్సవము. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు భీమేశ్వరుని వసంతోత్సవము వైభవోపేతముగ వర్ణింపఁబడినదని పూర్వోక్తము. గోపరాజు సింహాసనద్వాత్రింశికయందు విక్రమాదిత్యుని వసంతోత్సవము వివరముగ వర్ణింపఁబడినది. (138-144, 172-175ప.3ఆ; 16-26ప.7ఆ.) అది, ఇది ఆనాటి ఆంధ్రదేశీయవసంతోత్సవములకు అచ్చుపు మణిదర్పణములు.

దేవుని వసంతోత్సవములకు స్థలము దేవాలయము. రాజుల వసంతోత్సవములకు రంగము ఉద్యానవనము. రాజభవనము నుండి రాజు ఉద్యానవనమునకు బయలుదేరును. అప్పుడు పరరాజులు కప్పములు చెల్లింతురు. పరిచయములు జరుగును. అందఱితోను రాజు ఉద్యానవనము చేరును. పూబోడులు పుష్పాపచయములు చేయుదురు. అరటిచెట్టులు కట్టి, పూర్ణకలశములు పెట్టి, మరువము పఱచి, పట్టుమేల్కట్టులు పసిడితోరణములు కట్టి మణివేదిక సిద్ధముగ ఉండును. వేదిక మీద వసంతుని, మన్మథుని, లక్ష్మీనారాయణులను, పార్వతీపరమేశ్వరులను శచీపురందరులను ప్రతిష్ఠింతురు. షోడశోపచారముల పూజింతురు. నృత్యవాద్యగీతములు, ఆటపాటలు, వినోదములు జరుగును. సుగంధద్రవ్యములు చల్లుకొందురు.

రామాయణపరమైన సూర్యాస్తమయవర్ణనము రమణీయము.

"అయ్యెడ దశరథునాజ్ఞ పోలిక బ్రహ్మ
కట్టడిఁ గాలంబు గడవ రాక
జనకజ కెనయైన దినలక్ష్మి తనతోడు
నీడ కైవడిఁ దోడఁ గూడి నడువ
సౌమిత్రి గతి మునిసవనంబునకు మున్ను
దోడైన యరుణుండు తోడు గాఁగ
సాకేతపురిలోని జనుల వక్త్రంబుల

వడువున జలజము ల్వాడు వాఱఁ
గైక వంకవారి పగిదిఁ గలువ లుబ్బఁ
జిత్రకూటము క్రియ నస్తశిఖరి దాఁటి
రాక్షసుల భంగి నటఁ దిమిరంబు నడువ
వనము సొచ్చె రఘువరుని వరుస నినుఁ డు" 238ప. 4ఆ.

సింహాసనద్వాత్రింశికలోని ఉపోద్ఘాతకథలు, సాలభంజికలు చెప్పిన ముప్పది రెండు కథలు గోపరాజు "రసభావములు ముప్పిరిగొన చెప్పినవియే. సాలభంజికలు చెప్పిన ముప్పదిరెండు కథలు విక్రమార్కుని గుణములకు ముప్పదిరెండు ఉదాహరణములు. గుప్తదానము, సాహసము, ఔదార్యము, ఉపకారము, గంభీరౌదార్యము, నిర్వ్యాజదానము, సాహసోపేతసత్త్వము, సాహసగుణగణము, సత్త్వధైర్యములు, సత్యసంధత, పరోపకారసత్త్వము, సాహసదానము, ఘనప్రభుత్వము, దానము, సాహసౌదార్యములు, దానము, సాహసాదినైపుణి తోడి అత్యుపకారము ఘనధైర్యవితరణములు, శౌర్యధైర్యౌదార్యములు, అష్టభోగదేవేంద్రవైభవము, అష్టసిద్ధ్యాదానప్రదానములు, మహోదారత్వము, దానవైభవము, ఈశ్వరానుగ్రహాదికము, దివ్యసామర్థ్యము, ధైర్యసత్యధర్మములు, దాతృత్వము, అతిసాహసకలోపకారసానుభూతులు, విస్తృతదానము, వదాన్యవృత్తి, సామర్థ్యము ధర్మసత్యసాహసములు ముప్పదిరెండు కథలలోని విక్రమార్కుని గుణములు. ముప్పదిరెండు కథలందును సుదర్శనుని, గౌళికుని, పద్మావతి, జీమూతవాహనుని కథలు ఉపకథలు. అన్ని కథలందును అగ్రేసరమైనది, అత్యంతరసవంతమైనది జీమూతవాహనుని కథ. ఇది శ్రీహర్షుని నాగానందనాటకమును ఇంచుమించు అనుసరించినది.

సింహాసనద్వాత్రింశికలోని జీమూతవాహనచరితము స్వతంత్రప్రబంధసంగ్రహము. అనంతరయుగములోని స్వతంత్రప్రబంధములకు వరాహపురాణములోని దుర్జయవృత్తాంతము కంటె అవ్యవహితపూర్వమైన ఆదర్శము. అంతే కాదు. అది విషాదాంతము. ఇది ప్రమోదాంతము. శృంగార, దయావీర, కరుణరసముల త్రివేణీసంగమము.

మలయవతిని చూచిన జీమూతవాహనుడు మధుకరునితో ఇట్లనెను.

"ఇది దేవకామినియేని నింద్రుని వేయుఁ
గన్నులు సఫలము లగ్గాకయున్నె
యిది నాగకన్యకయేనిఁ బాతాళంబు
సోముఁ డు లేఁ డని శూన్యమగునె
యిది ఖేచరాంగనయేని మా జాతికిఁ

ప్రభయెక్కు చెఱుకునఁ బండు గాదె
యిది సిద్ధబాలికయేని లోకంబులో
సిద్ధకులంబు ప్రసిద్ధిఁ గనదె
యిది వసంతలక్ష్మియేని వనంబెల్లఁ
బల్లవింపకున్నె యెల్లయపుడు
నిది సుధాంశురేఖయేని యీ గుడినున్న
శిలలు చంద్రకాంతశిలలు గావె" 117ప.5ఆ.

ఇది ప్రకరణోచితమైన, పాత్రోచితమైన రసోచితమైన వర్ణనము. ఇట్టిదే మఱొకటి :

"మారుని మోహనాస్త్రము, సమస్తవిలాసవిహారభూమి, శృం
గారరసంబు తేట, తొలుకారు మెఱుంగుల పుట్టినిల్లు, సం
సారసుఖంబు లే మొలక, చక్కఁదనంబుల ప్రోక కాఁక బం
గారము చేఁగ, యీ తరుణి కన్నుల పండువ గాదె చూచినన్."
156ప.5ఆ.

విరహవర్ణనలును సహజసుందరములు.

"పుష్పొడియుఁ బువ్వుఁదేనెయుఁ
గపు ప్రరమును జందనంబుఁ గలపిన పన్నీ
రప్పాలఁ తుకప్పై జిలికిన
నిపు ప్రపయిం జిలికి నట్టి నెయ్యిం బోలెన్" 129ప.5ఆ.

"తను వంటు నోడి వనజా
ననకును జేమంతి పువ్వువనం గొని పన్నీ
రెనయ మెయిం బూయుచోఁ గ్రాఁ
గిన పెనమున నొలుకు నూనె క్రియఁ జుయి కొట్టెన్"
139ప.5ఆ.

శంఖచూడుడు కరములు మొగిడించి విన్నఁదనము లేక

"వసుధఁ గొఱకాని కదుఁ బా
లసులము పులుకాసి పుర్వులము మాకై నీ
యసువులఁ బగఱకు నొసఁగుట
కసవునకై రత్న మమ్మఁ గడుగుట కాదే" 201ప.5ఆ.

అని విన్నవించినను, జీమూతవాహనుడు "పరోపకారసమయం బిటుగల్గిన నుబ్బి వచ్చితి" ననుటయేగాక, (206ప.5ఆ.) "వధ్యచిహ్నమైన రక్తాంశుక మడిగి"

పడయక

"అత్తవారిచ్చిన యరుణాంశుకంబులు
వధ్యచిహ్నములకు వలనుగాఁ గఁ
బులకించి చని వధ్యశిల యెక్కి మదిఁ జొక్కి
గారుడాగమనంబు గోరుచుండి
తల్లి కనకవతియుఁ దండ్రి ఖేచరపతి,
కాంత మలయవతియె గాఁ గ నాకు
నీ పరోపకార మెల్లజన్మంబులఁ
గలుగవలయు ననుచుఁ దలఁ చు" 216ప.5ఆ.

ఆత్మప్రాణత్యాగనిరతి దయావీరము. ఖేచరపతియైన జీమూతకేతుడు, మలయవతితో గూడి కనకవతి కుమారుడైన జీమూతవాహనుని మీద వ్రాలి విలపించుట కరుణరసము. మః యవతిని ఉద్దేశించి, కనకవతి

"దైవ మేల యిట్లు దలఁ చె నే నెట్లోర్తు
నేమి సేయుదాన నెందుఁ జొత్తుఁ
బాసి యేఁ గఁ దగునె మూసిన ముత్తెమ
పంజరమ్ము చిలుక పసిఁ డి బొమ్మ"

అనుట హృదయము జలదరించు కరుణరసకళిక.

భర్తృహరి నాథుడు కాకపూర్వమే ప్రకటించిన భావములు నాథసంప్రదాయానుగుణములు. (98-100ప.1ఆ.) సిద్ధసారస్వతము సిద్ధమంత్రము. (173,225ప.4ఆ.) అవధూతకుడు నాథయోగి. అతడు బోధించిన యోగశాస్త్రము నాథయోగము (12-18ప.5ఆ.) అంధ్రభూమి గౌతమిలో వేడిమడుగు నుండి వెడలివచ్చు పడతులు "అష్టసిద్ధులకు పరకాయప్రవేశాద్యుపసిద్ధులు" (198ప.8ఆ.) పరకాయప్రవేశాది సిద్ధులు నాథసిద్ధులు. త్రికాలనాథుడు నాథయోగి. సిద్ధయతీంద్రుడు. (108ప.8ఆ.) వజ్రముకుటుడను రాజకుమారుడు, బుద్ధిశరీరుడను మంత్రికుమారుడు కుంతల దేశమున సిద్ధవేషులైన మీననాథ, గోరక్షనాథుల వలె కలరని గోపరాజు సాదృశ్యకల్పనము.

"అక్కడ మాని తత్పురియుపాంతమున న్మసనంబులోన గో
రక్కుఁ డు మీననాథుఁ డు ధరం జరియించుచు విశ్రమార్థమై
యిక్కడ నిల్చినారొ యన నిద్దఱు నుద్ధతి సిద్ధవేషులై
యొక్క మఠంబు గట్టుకొని యుండిరి శూలము తేలఁ గ్రాలఁ గన్."
48ప.12ఆ.

కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక జక్కన విక్రమార్కచరిత్ర వలె కథా కావ్యము. కాని సింహాసనద్వాత్రింశికయందు విజ్ఞానసర్వస్వలక్షణము నూతన విశేషము. ఇది అర్వాచీనకథాకావ్యముల విజ్ఞానసర్వస్వలక్షణమునకు ఆద్య ప్రకృతి. పద్మిన్యాదిస్త్రీజాతిలక్షణములు (214-217ప.1ఆ.), ప్రాకృతచిత్రకవిత్వము (46ప.2ఆ.) చీరల పేరులు (188వచ.3ఆ.) ఆంధ్రదేశమునందలి కోణమండలము (కోనసీమ)లోని తెలుగు కవిత వ్రాలు వళ్లు (యతిప్రాసలు) వివరము (187-217 ప.4ఆ.) స్త్రీపర్యాయవాచకములైన నలుబది ఆచ్ఛికపదములు (221ప.4ఆ.) ఛందోభే దములు (54వచ.5ఆ.) చతుష్షష్టికళల వివరము (168వచ.11ఆ.) మొదలైన బహువిష యములు విజ్ఞానసర్వస్వమునందు వలె సింహాసనద్వాత్రింశికయందు కలవు. కథా కావ్యముల కోవను సింహాసనద్వాత్రింశిక మేరుపూస.

కొఱవి గోపరాజు పినపితామహుడు కొఱవి సత్యనారన ఆంధ్రకవి పితామహుడు. అతడు రామాయణకృతికృతి అని ఒక పాఠము. రామాయణ కృతిపతి అని మఱొకపాఠము. (49ప.1ఆ.) సత్యనారన "భూమిని మించిన భీమన నామంబునఁ బరఁగె"నట! (49ప.1ఆ.) కావున రామాయణకృతికర్త కావలయును. ఆంధ్రకవిపితామహుని రామాయణము అనుపలబ్ధము.

**వెన్నెలకంటి అన్నయ్య** : ఈతని కృతి షోడశకుమారచరిత్రము. అవతారిక లేని గ్రంథము లభించినది. అందును తృతీయచతుర్థాశ్వాసములు లేవు. ప్రథమ, ద్వితీయ, షష్ఠ, అష్టమాశ్వాసములందు గ్రంథపాతములు కలవు. ఆశ్వాసాం తగద్యలందు "వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర .... అన్నయనామధేయప్రణీ తంబు" అని కలదు. ఆశ్వాసాదిపద్యములందు "అన్నసూరామాత్యా" (2,5) "మంత్రియన్నయసూరా! " (6) "అన్నయసూరవరేణ్యా" (7) అను సంబుద్ధులు కలవు. అన్నయ సూరనామాత్యునికి అంకితమిచ్చినట్లు స్పష్టము. తండ్రి సూర నామాత్యుడు "భట్టియుగంధర"సదృశుడని (182ప.6ఆ.) "కృష్ణకందార, భోజక్ష్మాప, జగదేకమల్ల, సర్వజ్ఞసోమేశ్వర"సదృశుడని (128ప.7ఆ.) ఆశ్వాసాంతపద్యములందు కలదు. భట్టియుగంధరాదుల వలె కృష్ణకందారుడు సుప్రసిద్ధుడు కాడు. కాని కృష్ణకందారభూపుని కథ గౌరన నవనాథచరిత్రమునందు కలదు. (పుటలు 351-353) అది నిమిత్తముగ అన్నయ్య సాదృశ్యము కల్పించుట సావకాశము. కాఁబట్టి షోడశకుమారచరిత్రము రచనాకాలము స్థూలముగ 1500వ సంవత్సరము.

షోడశకుమారచరిత్రము దశకుమారచరిత్రమునకు సదృశము. యువరాజు కమలాకరుడు (1) మంత్రికుమారులు బుద్ధిసాహాయ్యుడు, వివేకనిధి, కాంతి మంతుడు, యశఃకేతుడు, కరుణాకరుడు, ప్రభాకరుడు, చిత్రకరుడు, నీతిమంతుడు(8)

దండనాయకతనయులు భీమభటుడు, దీర్ఘబాహుడు, దృఢముష్టి, విక్రమకేసరి(4) పురోహితపుత్రులు మతిమంతుడు, కళానిధి, వసంతకుడు (3) కలిసి షోడశకుమారులు (1+8+4+3=16) ప్రాణమిత్రులు. దశకుమారుల వలె షోడశకుమారులు విడిపోయి చిత్రవిచిత్రకథానాయకులై మఱల కలిసికొనుట షోడశకుమారచరిత్రము-భేతాళుడు చెప్పిన కథలు పది కలవు. ఆరు లభించినవి. అందు దేవసేన కథ అనంతామాత్యుని భోజరాజీయములోని మదనరేఖ కథకు అనుసరణము. కథాసరిత్సాగరము లోని కథలును కలవు. కమలాకరుని కొలువునకు కళావతి చిలుకను తెచ్చుట కాదంబరీ ప్రభావము. కళావతి తెలిపిన చిలుక పాండిత్యము (13ప.6ఆ.) అనంతరయుగములోని శుచిముఖి పాండిత్యమునకు (61-64ప.4ఆ.) మార్గదర్శకము.

అన్నయ్య వర్ణనాదుల కంటె కథకు ప్రాధాన్యమిచ్చుట విశేషము. షోడశ కుమార చరిత్రము కథాకావ్యముల కోవను కొలికి పూస కాకపోయినను కలికి పూస.

**మొల్ల** : ఈమె కృతి రామాయణము. మొల్లరామాయణము. (25వచ.పీ.) మొల్ల ప్రథమాంధ్రకవయిత్రి. ఆదికవి భారతము, ఆదికవయిత్రి రామాయణము అందు కొనుట రమణీయమైన సంఘటన. మొల్ల "గురులింగజంగమార్చనపరుఁ డును .... శివభక్తిరతుఁ డు"ను అయిన, "ఆతుకూరి కేసయ వరపుత్రిని" అని మాత్రమే చెప్పినది. (11ప.పీ.) "గురులింగజంగమార్చనపరుఁ డు" వీరశైవుడు. వీరశైవుని తనయ రామాయణమును రచించుట విచిత్రము. పూర్వకవిస్తుతిలో శ్రీనాథుని స్తుతించినది. (9ప.పీ.) "పలికెడిది భాగవతమఁ ట"అను పోతన పద్యమునకు అనుకరణముగ,

"చెప్పు మని రామచంద్రుఁ డు
సెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పు ణ్యచరిత్ర తప్పు లెంచకుఁ డు కవుల్" 13ప.పీ.

అను పద్యము మొల్లరామాయణమునందు కలదు. పెద్దనాదుల పేరెత్తలేదు కాఁ బట్టి మొల్లరామాయణము రచనాకాలము స్థూలముగ 1500వ సంవత్సరము.

భాష, వ్యాకరణము, ఛందశ్శాస్త్రము, అలంకారశాస్త్రము, నిఘంటువులు "ఏవియు నెఱుఁ గ"నని " గోపవరపు శ్రీకంఠమల్లేశు వరము చేత ..... కవిత్వంబు చెప్పఁ గా నేర్చికొంటి"నని చెప్పినది మొల్ల. (12ప.పీ.) కాని శ్రీకారము చుట్టిన మొట్టమొదటి పద్యములోని "సుత్రామ"శబ్దప్రయోగము భాషాపరిజ్ఞానమునకు,

పురవర్ణనములోని "సుమన ఐరావత" సమాసప్రయోగము వ్యాకరణశాస్త్ర పరిజ్ఞానమునకు, కావ్యము ఛందశ్శాస్త్రపరిజ్ఞానమునకు, కవితాచమత్కారము అలంకారశాస్త్రపరిజ్ఞానమునకు నిదర్శనములు. "సూరిజనవినుతకవితాచమత్కార ... మొల్లనామధేయవిరచితంబు" అని ఆశ్వాసాంతగద్యములందు కలదు. "ఏవియు నెఱుంగ"ననుట కేవలము నిరహంకారలక్షణము. మొల్ల కవితాలక్షణములును మోదావహములు.

"వలిపపు సన్నపయ్యెదను వాసిగ గందపుఁ బూత తోడుతన్
గొలఁదిగఁ గానవచ్చు వలి గుబ్బచనుంగవ రీవి నొప్పఁ గాఁ
దెలుఁగని చెప్పుచోటఁ గడు తేటల మాటల గ్రొత్తరీతులం
బొలుపు వహింపకున్న మఱి పొందగునే పటహాదిశబ్దముల్. 15

మును సంస్కృతములఁ దేటగఁ
దెనిఁగించెడి చోట నేమి దెలియకయుండన్
దన విద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే. 16

తేనె సోఁక నోరు తీయన యగు రీతి
తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగ చెవిటి వారి ముచ్చటగును. 17

కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధుల మదికిన్." 18ప.పీ.

మొల్ల తెలుగు వెలుగు. మఱల రామాయణము రచించుటకు మొల్ల తెలిపిన కారణములును నిరహంకారనిపుణములు. అవి:

"రాజితకీర్తియైన రఘురామచరిత్రము మున్ గవీశ్వరుల్
తేజమెలర్పఁ జెప్పిరని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్పనేలనన్
భూజనకల్పకం బగుచు భుక్తికి ముక్తికి మూలమైన యా
రాజును దైవమైన రఘురాము నుతించినఁ దపు ఏగల్గునే. 21

వారాంగన శ్రీరాముని
పేరిడి రాచిలుకం బిలిచి పెంపు వహించెన్

నేరుపు గల చందంబున
నా రాముని వినుతి సేయ హర్షము రాదే. 22

సల్లలితప్రతాపగుణసాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామనరపాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్
జిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే
అల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాసనేయునే." 24ప.పీ.

ఇవి మొల్ల రువ్వులు. మఱి మొల్ల పువ్వులు.

మొల్లరామాయణము మొల్లపువ్వంత పరిమాణము. మల్లెపువ్వంత పరిమళము. వాల్మీకి రామాయణమునకు ఆంధ్రీకరణము కాదు. పారాయణము చేసిన సారగ్ర హణము. నారదుడు రామకథను వాల్మీకికి చెప్పుటు ప్రకరణము. అధ్యాత్మానంద రామాయణములలోని అంశములును కలవు. కథాప్రారంభములోని అయోధ్యాపు రవర్ణనము అంధానుసరణము కాదు. అపూర్వకవితాచమత్కారవిలసితము. విరో ధాభాసాలంకారవిశిష్టము.

"మదనాగయూథసమగ్రదేశముగాని
కుటిలవర్తనశేషకులము గాదు
ఆహవోర్వీజయహరినివాసము గాని
కీశసముత్కరాంకితము గాదు
సుందరస్యందనమందిరంబగుఁ గాని,
సంతతమంజుళాశ్రయము గాదు
మోహనగణికాసమూహగేయము గాని
యూథికానికరసంయుతము గాదు
సరససత్పుణ్యజననివాసమ్ముగాని
కఠిననిర్దయదైత్యసంఘమ్ము గాదు
కాదు కాదని కొనియాడఁ గలిగి నట్టి
పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము" 3ప.బా.కాం.

మదించిన సర్పములతో నిండిన ప్రదేశముగాని, కుటిలవర్తనము కల సర్పముల గుంపు కలది కాదని విరోధము. మదపుటేనుగులతో నిండిన ప్రదేశము గాని, కుటిలవర్తనము కల సర్పముల గుంపు కలది కాదని పరిహారము. ఇట్లు పద్యమంతటు విరోధపరిహారములు కలిగి, విరోధాభాసాలంకారవిశిష్టమైనది. ఇట్టి పద్యము లింకను గలవు. (9,11ప.బా.కా.) దశరథుడు పుత్త్రకామేష్టిని పావకు డిచ్చిన,

"పాయసమ్ము రెండు భాగముల్ గావించి
యగ్రసతుల కీయ నందు లోన
సగము సగము దీసి ముగుద సుమిత్రకు
నొసఁగి రంత నామె మెసవెఁ బ్రీతి" 39ప.బా.కాం.

అని మొల్ల రామాయణమునందు వాల్మీకి రామాయణమునకు భిన్నముగ కలదు. కైకే "తనయుం బట్టము గట్టి రాఘవునిఁ బద్నాల్గేండ్లు కాంతారమందును వర్తిల్లఁగఁ గొన్న వరము"ను సుమంత్రుడు వసిష్ఠునికి చెప్పిన "సన్న యెఱింగి రామచంద్రుండు రాజచిహ్నాంబులు త్యజించి జటావిభూతివల్కలంబులు దాల్చి" లక్ష్మణసీతాసమేతముగ అరణ్యమున కేగినట్లును భిన్నముగ కలదు. (24-30 వచ.అ.కాం.)

రాముడు పడవ దాటింపుమనినపుడు గుహుడు, "ఆత్మలోన"

"సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడనొక కాంత యయ్యెనఁట పన్నుగ నీతని పాదరేణువి
య్యెడ వడి నోడ సోఁక నిదియేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రామపదకంజయుగమ్ము భయమ్ము పెంపునన్."
32ప.అ.కాం.

ఇది అధ్యాత్మరామాయణమును అనుసరించినది.

"క్షాళయామి తవ పాదపంకజమ్ నాథ దారుదృషతో కిమంతరమ్
మానుషీకరణ చూర్ణమస్తి తే పాదయో రితి కథా ప్రదీయసీ."

ఇందలి మానుషీకరణచూర్ణము కంటె, "ఓడ సోఁక నిది యేమగునో"అను గుహుని సంశయము ముగ్ధమనోహరము. రాముని "పదరజము సోఁకి... ఒక ఉపలమటు బంగారు పూదె కరఁగిన రీతిం బొదలుచు ... సుదతిగఁ జూపట్టె"నని మొల్ల రామాయణమునందు ముందు కలదు. (61-62ప.బా.కాం) అది కూడ అధ్యాత్మరామాయణమును అనుసరించినదియే.

హనుమంతుడు సీతాన్వేషణము చేసి, రాముని సందర్శించి "దృష్టా్వ మయా సీతా" అన్నట్లు వాల్మీకి రామాయణమునందు సందర్భోచితముగ కలదు. ఇట్లు హనుమంతుడు రాముని సందర్శించినపుడు మాత్రమే గాక, సీతను సందర్శించినపుడును అన్నట్లు మొల్ల రచనము.

"ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁడి దె కపులఁ గూడి యురుగతి రానై

యున్నాఁడు నిన్నుఁ గొనిపో
నున్నాఁ డిది నిజము నమ్ము మూర్వీతనయా" 91ప.సుం.కాం.

"కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి నా లంకలోఁ
గంటిన్ మీ పదపంకజంబులను నేఁ గౌతూహలం బొప్పఁగా
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగాఁ గీర్తులం
గంటిన్ మా కపివీరబృందములలో గాంభీర్యవారాన్నిధీ"
245ప.సుం.కాం.

త్రిజట స్వప్నవృత్తాంతమును సీతకు తెలిపినట్లు వాల్మీకి రామాయణము నందు కలదు. రాక్షసస్త్రీలందఱికిని తెలిపినట్లు మొల్ల రామాయణమునందు కలదు. అంతేకాదు. విభీషణుడు రావణునికి తెలిపినట్లును కలదు.

"కల గంటిన్ వినుఁ డింతులార మన లంకాద్వీప మీ యబ్ధిలో
పల వ్రాలన్ మన రావణేశ్వరుని శుంభద్రత్నకోటీరముల్
కలనన్ గూల రఘూద్వహుం డెలమితో గంధద్విపంబెక్కి యు
జ్జ్వలకాంతిన్ విలసిల్లు సీతఁ గొని పోవన్ మిన్న కే నిపు డే."
85ప.సుం.కాం.

"అదియునుంగాక మొన్న రాతిరి సీతయొద్దఁ గావలియున్న రాక్షస కాంతలందఱును నిద్రించుచున్న సమయంబునం ద్రిజట దిగ్గన మేల్కాంచి నిదిరించుచున్న స్త్రీలను లేపి చెప్పిన దుస్స్వప్నంబు విన్నవించెద నాకర్ణింపుము. రామచంద్రుండు మన లంకపై దండు విడిసినట్లును నీవును గుంభకర్ణుండును దక్షిణాభిముఖులై గార్దభంబులపై నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును నింద్రజిదాదికుమారవర్గంబును సైన్యంబును మూలబలంబును సర్వంబును నశించిపోవుచున్నట్టును సీతం జేకొని శ్రీరామచంద్రుం డయోధ్యకుఁ బోవు చున్నట్లును గలఁ గన్నదఁట. త్రిజట కల నిక్కంబై తోఁ చెడిని" 13వచ1ఆ..యు.కాం.

వాల్మీకి రామాయణమునందు గాని, అధ్యాత్మరామాయణమునందు గాని, ఆనందరామాయణమునందు గాని లేని అపూర్వకల్పనము మొల్ల రామాయణమునందు కలదు[325] అది: సూర్యోదయము కాకుండ హనుమంతుడు సంజీవని తెచ్చిన, మృతుడైన లక్ష్మణుడు పునర్జీవితుడగును. హనుమంతుని రాక కొఱకు రామాదులు ప్రతిక్షణనిరీక్షణము చేయుచున్నారు. హనుమంతుని జాడలేదు. రాత్రి మూడవజాము గడచినది. ఆకాశమునందు తూర్పుదిశను శతకోటి సూర్యకాంతి

ప్రసరించినది. అది చూచి ఆందోళనము చెందిన రాముడు సుగ్రీవునితో ఇట్లనెను.

"అదె కనుఁ గొంటిరే కలయ నర్కుఁడు పూర్వగిరీంద్రశృంగమం
దుదయము నొందె నింక నిటునుంచినఁ దమ్ముని ప్రాణవాయువుల్
బ్రదుకుట దుర్లభం బకట పల్మఱు మ్రొక్కెడు ప్రొద్దె మాకుఁ దా
నదయత శత్రుఁడయ్యె గపులార వినుండిదె మీకుఁ జెప్పెదన్. 86

మా కులంబున కెల్లను మహినిఁ దలఁపఁ
దానె కర్తయై యుండియు ధర్మమగునె
యుదయమందంగ మనుమఁడిట్లున్నయెడను
గొనరి చుట్టాలు పగవారిఁ గూడవలెనె. 87

ఈ లాగునఁ దాఁ బొడిచిన
మా లక్ష్మణు ప్రాణమేల మగుడును భానుం
గూలంగ నేసెద విల్లును
గోలలుఁ దెమ్మనుచు నందికొను నాలోనన్.

88ప.2ఆ.యు.కాం.

జాంబవంతుడు భానుడు కాడని సంజీవనీపర్వతమని చెప్పెను. సంజీవనీపర్వతముతో హనుమంతుడు వచ్చును. ఇందు నాటకీయత కలదు. వాత్సల్యరసము కలదు. మొల్ల కవితాచమత్కారమునకు కరదీపిక.

మొల్లరామాయణమునందును సుమతిశతకము, వేమనపద్యముల ప్రభావము కలదు.

"జాఱకుమా బీరము చెడి
పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనమున్
దూఱకుమా పేర్కొంచును
జీరకుమా కపులఁ దోడు చేకొని పోరన్." 45ప.3ఆ.యు.కాం.

"చంపవచ్చినట్టి శత్రువునైనను
శరణు చొచ్చునంత సదయుఁడగుచు
నభయమిచ్చి కాచు టాతని బిరుదంట
సీత నిచ్చి రాముఁ జేరి బ్రదుకు" 18ప.1ఆ.యు.కాం.

మొల్ల శ్రామికవర్గమునకు చెందినట్లు ఐతిహ్యము. పగలెల్ల శ్రమపడి రాత్రి స్నానము చేయుట శ్రామికుల దినచర్య. అది మొల్లరామాయణమునందు ప్రతిఫలించినది.

"పగలు ప్రాగ్భాగమున నుండి గగన వీథిఁ.
జరమదిక్కున కేఁగఁగా శ్రమము దోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయనరుగు
కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె."6ప.అ.కాం.

# యుగప్రాభవము

శ్రీనాథుడు యుగకర్త. నన్నయ ఉభయవాక్ప్రౌఢిని, తిక్కన రసాభ్యుచితబంధమును, ఎఱ్ఱన సూక్తివైచిత్రిని, వేములవాడ భీమన ఉద్దండలీలను నాచన సోమనాథుని నవీనగుణమును, శివకవుల దేశిలక్షణమును మేళవించి, అభినవకవితారసాయనమును సహృదయులకు అందించిన కవిధన్వంతరి శ్రీనాథుడు. సంస్కృతప్రాకృతసాహిత్యపాథోనిధిమంథనోత్థమహాకవితారసామృతమును విబుధులకు పంచిపెట్టిన విశ్వమోహిని శ్రీనాథుడు. శ్రుతిస్మృతిన్యాయసాంఖ్యపురాణాగమజ్ఞానమును జిజ్ఞాసువులకు చూఱలిచ్చిన సకలవిద్యాసనాథుడు శ్రీనాథుడు. సమకాలిక, సమీపకాలిక, సుదూరకాలికసుకవులపై కవితాసార్వభౌమాధికారము నెఱపిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. శ్రీనాథయుగము శ్రీనాథముద్రాముద్రితము.

# భాష

శ్రీనాథయుగములోని కవుల భాష అప్పటి కావ్యపాఠకుల అభిలాషను కాంక్షించినది. సంస్కృతప్రౌఢిప్రియంభావుకులు, తెనుగునుడికారము అనుగుబందుగులు, ఉభయవాక్ప్రౌఢి ఉత్కంఠారూఢులు, ఉద్దండలీల ఉద్దామస్పృహలు అప్పటి కావ్యపాఠకులు. ఇందుకు పూర్వోదాహృతములైన శ్రీనాథుని "ప్రౌఢిఁ బరికింప", పోతన "కొందఱకు", కొఱవి గోపరాజు "తెనుఁగున", మొల్ల "వలిపవు" మొదలైన పద్యములు నిదర్శనములు. శ్రీనాథుడు, పోతన, నిశ్శంక కొమ్మన, జక్కన, పినవీరనప్రభృతులు ఉభయవాక్ప్రౌఢికి, ఉద్దండలీలకు ప్రతినిధులు. అనంతామాత్యుడు, గౌరన, వేమన, భైరవుడు, అన్నమాచార్యులు, మొల్ల మొదలైనవారు తెనుగునుడికారమునకు పూటకాపులు. పూర్వోదాహృతములైన కవితారీతులలోని పద్యములు ఉదాహరణములు.

# ఛందస్సు

పూర్వయుగములలోని ఛందస్సులెల్ల శ్రీనాథయుగమునకు పురస్కారములే. అపూర్వమైన ఛందస్సు అల్పాక్కర. మడికి సింగన జ్ఞానవాసిష్ఠరామాయణము నందు కలదు. (223ప.2ఆ.) కావ్యభేదములైన రగడలు, వచనములు ఛందోభేదము లగుట విశేషము. పదసంకీర్తనము ప్రత్యేకపదము. పాలకుఱికి సోమనాథుని, చక్రపాణి రంగనాథుని రగడలు కావ్యభేదములు. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు రగడ కావ్యభేదముగానే కలదు. (40ప.4ఉల్లా.) అనంతరము రగడ ఛందోభేదముగ ప్రథమతః శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. తదుపరి పినవీరభద్రుని శాకుంతలమునందు కలదు. నంది మల్లయ, ఘంట సింగనల వరాహపురాణమునందు మూడు రగడలు కలవు. శ్రీనాథుని రగడ మణికర్ణిక వర్ణన. (125ప.6ఆ.) పినవీరభద్రుని రగడ ప్రయాణవర్ణన. (225ప.3ఆ.) నంది మల్లయ, ఘంట సింగనల ఒక రగడ పుష్పాపచయవర్ణన. (92ప.3ఆ.) మఱొక రగడ కైలాసవర్ణన. (144ప.10ఆ.) వేఱొక రగడ సరస్వతీప్రార్థన. (26ప.11ఆ.) రగడ కావ్యప్రవేశము చేయుటయే గాక, సంస్కృతభాషాప్రవేశమును చేసినది. అది కూడ ప్రథమతః శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమునందు. (21ప.5ఆ.) అది హరిగతి రగడ. దేశిరగడ మార్గరఘుట.

ఇక వచనములు - శివకవుల గద్యలు సంస్కృతభాషలో కలవు. కృష్ణమాచార్యుల వచనములు తెలుగు భాషలో కలవు. ఎఱ్ఱన హరివంశము మొదటి ముద్రణమునందు (1870) గద్య అని, తర్వాతి ముద్రణములందు (1904,1967) చూర్ణిక అని ఒక వచనము కలదు. (211వచ.10ఆ.ఉ.భా.) అది విష్ణుస్తుతి. "జయజయ" అని ప్రారంభమై, "నమస్తే నమః" అని ముగియును. అంతట ముక్తపదగ్రస్తాలంకారము కలదు. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు అట్టి వచనములు రెండు కలవు. (212వచ.3ఆ.;52వచ.5ఆ.) అందు మొదటివచనము పూర్వభాగము కృష్ణమాచార్యుల సింహగిరినరహరివచనములను అతిశయించునది. ఉత్తరభాగము ఎఱ్ఱన గద్య లేక చూర్ణికను అనుసరించునది. అంతట ముక్తపదగ్రస్తాలంకారము లేదు. అంత్యానుప్రాసాలంకారము కలదు. "జయజయ" అని ప్రారంభమై, "నమస్తేనమః" అని ముగియును. రెండవ వచనము "శ్రీ" కారముతో ప్రారంభమై, "నమస్తే నమః" అని ముగియును. రెండును భీమేశ్వరస్తోత్రములు. కాశీఖండమునందు, శివరాత్రిమాహాత్మ్యమునందు సంస్కృతగద్యలు కలవు. కాశీఖండములోని సంస్కృతగద్య (250వచ.6ఆ.) పాలకుఱికి సోమనాథుని నమస్కారగద్య వంటిది. శివరాత్రిమాహాత్మ్యములోని

సంస్కృతగద్య (90వచ4ఆ.) "నమః" అని ప్రారంభమై, "నమస్తే నమః" అని ముగియును. ఈ రెండును శివస్తోత్రములే. మొల్ల రామాయణమునందు చూర్ణిక అని ఒక వచనము (29వచ.3ఆ.యు.కాం.) కలదుగాని, అది బిరుదుగద్య. రావణబిరుదగద్య. ఇట్లు కావ్యభేదములైన గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనము శ్రీనాథయుగమునందు రగడల వలె కావ్యప్రవేశము చేసినవి. ఇవి యెల్ల తాళగంధులు.

తాళగంధము గాని, తాళబంధము గాని లేని, ఛందోవిరహితమైన వచన రచనకు శ్రీనాథయుగమునందు వైవిధ్యము కలదు. అగ్రతాంబూలము శ్రీనాథునిదే. సీసపద్యరచనమునందు సింహాసనాధ్యాసి శ్రీనాథుడే. పద్యరచనమునకు పట్టాభిషేకము, గద్యరచనమునకు కనకాభిషేకము శ్రీనాథయుగవిశేషములు.

## వస్తువు

శ్రీనాథయుగమునందు వస్తువైవిధ్యము కలదు. ప్రసిద్ధ, కల్పిత, మిశ్ర-భేదములు కలవు. పౌరాణిక, చారిత్రిక, సాంఘిక-భేదములును కలవు. పురాణప్రోక్తములు, చరిత్రసంబంధులు ప్రసిద్ధేతివృత్తములు. కవికల్పితములు కల్పితేతివృత్తములు. ప్రసిద్ధేతివృత్తమును, కల్పితేతివృత్తమును మిశ్రమము చేసినవి మిశ్రేతివృత్తములు. పురాణప్రోక్తములు పౌరాణికేతివృత్తములు. చరిత్రసంబంధులు చారిత్రికేతివృత్తములు. సంఘపరమైనవి సాంఘికేతివృత్తములు. శృంగారనైషధము, హరిశ్చంద్రోపాఖ్యానము పురాణప్రోక్తములైన ప్రసిద్ధేతివృత్తములు కలవి. భోజరాజీయము, విక్రమార్కచరిత్రము, పంచతంత్రము, సింహాసనద్వాత్రింశిక, షోడశకుమారచరిత్రము కల్పితేతివృత్తములు కలవి. భాగవత, వరాహ, పద్మపురాణములు పురాణములు. భీమేశ్వరపురాణ, కాశీఖండ, కాంచీపురీమాహాత్మ్య, శ్రీరంగమహత్త్వములు పురాణైకదేశములైన క్షేత్రమాహాత్మ్యములు. ప్రసిద్ధేతివృత్తములు కలవి. శ్రీనాథుని శాలివాహనసప్తశతి, వేమన పద్యములు, వల్లభామాత్యుని క్రీడాభిరామము సంఘస్పర్శ కల సాంఘికేతివృత్తములు కలవి. సప్తశతిలోని సంఘస్పర్శ శృంగారపరము. వేమనపద్యములలోని సంఘస్పర్శ సంస్కరణాత్మకము. క్రీడాభిరామములోని సంఘస్పర్శ విటసంబంధము. ఇంత వస్తువైవిధ్యము ఇతఃపూర్వయుగములందు లేదు. అంత వైవిధ్యమునకు శ్రీనాథుడే సూత్రధారి.

# ప్రక్రియ

ప్రక్రియావైవిధ్యమును శ్రీనాథయుగము ప్రత్యేకత. పూర్వప్రక్రియల పునరావృత్తి తోపాటు నూతనప్రక్రియల అవతరణము కలదు. అందు కావ్యాంధ్రీకరణము అగ్రేసరమైనది. శ్రీనాథుని శాలివాహనసప్తశతి, శృంగారనైషధము కావ్యాంధ్రీకరణములు. కావ్యాంధ్రీకరణము తోపాటు కావ్యీకరణమును నూతన ప్రక్రియ. అది పురాణమును కావ్యముగా రచించుట. అందుకు శ్రీనాథుని కాశీఖండము ప్రథమోదాహరణము. పోతన భాగవతము ప్రబలోదాహరణము. పద్మపురాణము, వరాహపురాణము, జైమినిభారతము కావ్యత్వసిద్ధి కలవి. స్వతంత్రకావ్యరచనము సాగినది. గౌరీకల్యాణము వినా హరవిలాసము స్వతంత్రకావ్యము. క్షేత్రమాహాత్మ్యకావ్యములు వికాసమునందినవి. శ్రీనాథుని భీమేశ్వరపురాణము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము, దుగ్గన కాంచీపురీమాహాత్మ్యము, భైరవుని శ్రీరంగమహత్త్వము క్షేత్రమాహాత్మ్యకావ్యములు. అందు సహజప్రకృతివర్ణనము, స్థానికప్రకృతిచిత్రణమును భీమేశ్వరపురాణ, కాశీఖండములందు క్షేత్రసాక్షాత్కారము కావించునవి. భీమేశ్వరపురాణ, శివరాత్రిమాహాత్మ్యములు స్వతంత్రకావ్యములు కూడ. దృశ్యకావ్యములైన సంస్కృత నాటకములు శ్రవ్యకావ్యములైనవి. వల్లభామాత్యుని క్రీడాభిరామము, నంది మల్లయ, ఘంట సింగనల ప్రబోధచంద్రోదయము శ్రవ్యకావ్యములు. పినవీరభద్రుని శాకుంతలము అభిజ్ఞానశాకుంతలమును అనుసరించినది. శ్రవ్యకావ్యములందు చంపూకావ్యములు ప్రధానము. ద్విపదకావ్యములు గౌణము. శ్రీనాథుని పలనాటివీరచరిత్ర, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథచరిత్ర; గణపతిదేవుని మనోబోధము పిడుపర్తి సోమనాథుని ప్రభులింగలీల, అన్నమాచార్యుల శృంగారమంజరి ద్విపదగ్రంథములు. శివకవియుగములోని ద్విపదకావ్యములు పద్యకావ్యములైనవి. శ్రీనాథుని పండితారాధ్యచరితము, పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణమును అట్టివి. సంకలనగ్రంథము సంఘటితమైనది. మడికి సింగన సకలనీతిసమ్మతము. పదసంకీర్తనప్రక్రియ ప్రారంభమైనది. పరాకాష్ఠదశనందినది. తత్త్వయోగశాస్త్రములు సాహిత్యభూమికలైనవి కొలను గణపతిదేవుని శివయోగసారము, మనోబోధమును. శతకప్రక్రియ విక్రియనందినది. వేంకటేశ్వరశతకము మాత్రము కలదు. నారాయణ శతకము, దేవకీనందనశతకము, రఘువీరశతకమును శ్రీనాథయుగములోనివి కావు. తదనంతరయుగములోనివగును.

హరవిలాసమునందు కళికోత్కళికలు లేని, కీసవెలితి ఉదాహణము కలదు. (93-99ప.7ఆ.) భీమేశ్వరపురాణమునందు "చంపూ చాటు నాటకోదాహరణజయ

ఘోషచక్రవాళచతుర్భద్రచతురాత్రిప్రబంధంబులు"(118వచ.1ఆ.) యక్షగానము (65ప.3ఆ.)చర్చరిగీతులు(103ప.5ఆ.) ప్రసక్తములైనవి. కాశీఖండమునందు తాళబద్ధమైన ప్రబంధములు (56ప.1ఆ.) మంద్రకమహాప్రబంధములు (37ప.2ఆ.) చాటుతోటకములు (255ప.4ఆ.) శివరాత్రిమాహాత్మ్యమునందు అష్టావధానములు, బిందుమతి, ప్రహేళికలు (47వచ.4ఆ.) పలనాటివీరచరిత్రయందు గీతములు (బా.యు.పు.19) ప్రసక్తములైవని. శివలీలావిలాసమునందు గీతప్రబంధములు (186వచ.1ఆ., 92ప.2ఆ.), విక్రమార్కచరిత్రమునందు మధురగీతికలు (51వచ.2ఆ.) నేపాళప్రబంధములు (50ప.2ఆ.) ప్రసక్తములైనవి. శ్రీరంగమహత్త్వమునందు చక్రబంధము, నాగబంధము, గోమూత్రికాబంధము (262-264ప.5ఆ.) కలవు. తెనుగు గద్యము (215వచ3ఆ.) సంస్కృతగద్య (221వచ.5ఆ.) కూడ కలవు. క్రీడాభిరామమునందు ద్విపదప్రబంధము తోపాటు జక్కులపాట (136ప.) ప్రసక్తమైనది. జైమినిభారతమునందు చంపూకావ్యము చంబూకావ్యమని ప్రాసఘటితముగ కలదు. (10ప.పీ.) వరాహపురాణమునందు చిత్రకవిత్వము (90ప.10ఆ.) గర్భకవిత్వము (112ప.11ఆ.) కలవు. సింహాసనద్వాత్రింశికయందు ధ్రువాప్రబంధములు (129ప.1ఆ.171ప.4ఆ.) ప్రసక్తములైనవి. అంతేకాదు. నిరోష్ఠ్యదండకము కలదు. (24వ.4ఆ.) బంధకవిత్వమును కలదు. (75ప.7ఆ.) ఇవియెల్ల శ్రీనాథయుగములోని వివిధప్రక్రియలు.

ఇట్లు గేయములైన ప్రబంధములు, మహాప్రబంధములు, కావ్యములైన ప్రబంధములు, మహాప్రబంధములు, లఘుప్రబంధములు, ఆశుమధురచిత్రవిస్తర గర్భబంధకవితాప్రభేదములు, అష్టావధానములు, ప్రహేళికలు మొదలైనవి శ్రీనాథ యుగమునందు తెలుగు సాహిత్యమునందు తేజరిల్లినవి.

## కవయిత్రి

నన్నయయుగము మొదలు శ్రీనాథయుగము చివఱి వఱకు లేని కవయిత్రి శ్రీనాథయుగము చిట్టచివఱ కలదు. ఆమె తాళ్లపాక అన్నమాచార్యుల భార్య తిమ్మక్క కాదు. సుభద్రాకల్యాణము పరమార్వాచీనకాలికము. తొలి తెలుగు కవ యిత్రి - ప్రథమాంధ్రకవయిత్రి - మొల్ల. జన్మ ధన్యముగ రామాయణము రచిం చినది. "మొల్ల రామాయణము" అది బండ్ల కొలది కాదు. పండ్ల కొలది. ఆకృతి చిన్న. గుణము మిన్న. బరువు తక్కువ. పరువు ఎక్కువ. ఆధునికపాఠశాలలు అవ తరించువఱకును, వీథిబడులందు వీనుల విందైనది, బాలబాలికలు పారాయణము చేసినది మొల్లరామాయణము.

# తత్త్వము

శ్రీనాథయుగమునందు తత్త్వము ద్వివిధము. 1. శైవము 2. వైష్ణవము. శైవము మఱల ద్వివిధము. 1. ఆగమశైవము. 2. నాథశైవము. ఆగమశైవమన ఆగమోక్తప్రకారమైన ఆహ్నికవిధానము కల శైవము. అందు లింగధారణముకలదు. లింగధారణము వినా ఆగమశైవము రెడ్డిరాజులు అవలంబించినది. అదే శ్రీనాథుడు ఆచరించినది. లింగధారణము వినా ఆగమోక్తప్రకారమైన ఆహ్నికవిధానము శ్రీనాథుని కృతులన్నిట ప్రతిఫలించినది. ఇది శ్రీనాథుని ఆత్మీయతను సోదాహరణనిరూపణము చేసినది. నాథశైవమన నాథసంప్రదాయము. అయిదవ శతాబ్ది ఔత్తరాహమైన నాథసంప్రదాయము, తొమ్మిదవశతాబ్దిని దాక్షిణాత్యమైన తమిళశైవమునందు సంపదించినది. పంద్రెండవశతాబ్ది కన్నడశైవమునందు కలిసిపోయినది. నాథశైవవ్యాప్తికి కేంద్రము ఆంధ్రదేశములోని శ్రీశైలము. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు, కాశీఖండమునందు నాథసంప్రదాయసరణి కలదు. గౌరన నవనాథచరిత్ర, కొలను గణపతిదేవుని మనోబోధ, శివయోగసారము, పిడుపర్తి సోమనాథుని ప్రభులింగలీల నాథసంప్రదాయగ్రంథములే. అనంతామాత్యుని భోజరాజీయమునందు, జక్కన విక్రమార్కచరిత్రమునందు, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికయందు నాథసంప్రదాయము ప్రతిఫలించినది. వేమన పద్యములు నాథసంప్రదాయానుసారములే. ఇది కూడ ఆయా కృతుల సమీక్షలందు సోపపత్తికనిరూపణము చేసినది. రెడ్డిరాజులు శివభక్తులు వలె, విజయనగరరాజులు మొదటి హరిహరరాయలు మొదలు మల్లికార్జునరాయల వఱకు అందఱును శివభక్తులే. విరూపాక్షరాయలు (1465-1485) మొదలు విష్ణుభక్తులు. అంతవఱకు తెరమఱుగైన వైష్ణవము రంగప్రవేశము చేసినది. అన్నమాచార్యుల వేంకటేశ్వరశతకము, శృంగారమంజరి, సంకీర్తనలు వైష్ణవగ్రంథములే. పోతన భాగవతము, పినవీరభద్రుని జైమినిభారతము, నంది మల్లయ, ఘంటు సింగనల వరాహపురాణము మొల్ల రామాయణము విష్ణుపరములు. పోతనాదులు వైష్ణవులు కారు. అన్నమాచార్యులును జన్మతః వైష్ణవుడు కాకపోయినను, వైష్ణవయతిచే పంచసంస్కారములందిన వైష్ణవుడే (అ.చ.పుటలు27-28) శైవమతమునందు మూఢభక్తి వలె వైష్ణవమతమునందు మధురభక్తి కలదు. కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశికయందు హరిభక్తి, హరభక్తి, హరిహరభక్తి ముప్పిరి గొన్నవి. ఇవియెల్ల పూర్వోక్తములు.

# అనుబంధము -I-

# వచనరచన

వచనము మూడు విధములుగ వామనుని కావ్యాలంకారసూత్రవృత్తియందు కలదు. నాలుగు విధములుగ విశ్వనాథుని సాహిత్యదర్పణమునందు కలదు.

> "కావ్యం గద్యం పద్యం చ. గద్యం వృత్తగంధి చూర్ణముత్కలికా ప్రాయం చ పద్యభాగవ ద్వృత్తగంధి. అనావిద్ధ లలితపదం చూర్ణమ్. విపరీతముత్కలికాప్రాయం చ"
>
> -కావ్యాలంకారసూత్రవృత్తి.

కావ్యము పద్యము. గద్యము. గద్యము త్రివిధము. 1. వృత్తగంధి. 2. చూర్ణము. 3. ఉత్కలికాప్రాయము. పద్యభాగములు కలది వృత్తగంధి. ఆవిద్ధము కాని, అనగా సమాసబంధము లేని లలితపదములు కలది చూర్ణము. తద్భిన్న మైనది అనగా ఆవిద్ధమైన (సమాసబంధము కల) పరుషపదములు కలది ఉత్కలి కాప్రాయము. చూర్ణమన పొడి. అది అనావిద్ధము. ఉత్కలిక అనగా ఉదాహరణ ప్రక్రియలోని రగడ నిలువుసగము కాదు. కలిక అన మొగ్గ. ఉత్కలిక అన విరిసిన మొగ్గ. అది అనావిద్ధము కాదు. ఆవిద్ధమే.

> "వృత్తబంధోజ్ఝితం గద్యం ముక్తకం వృత్తగంధి చ
> భవే దుత్కలికాప్రాయం చూర్ణకం చ చతుర్విధమ్
> ఆద్యం సమాసరహితం వృత్తభాగయుతం పరమ్
> అన్యాద్దీర్ఘసమాసాఢ్యం తుర్యం చాల్పసమాసకమ్."
>
> -సాహిత్యదర్పణమ్.

వృత్తబంధము వదలినది గద్యము. అది చతుర్విధము. 1. ముక్తకము. 2. వృత్తగంధి. 3. చూర్ణకము. 4. ఉత్కలికాప్రాయము. వృత్తగంధి వృత్తభాగ యుతము. ముక్తకము సమాసరహితము. చూర్ణకము అల్పసమాససహితము. ఉత్క లికాప్రాయము దీర్ఘసమాసభూయిష్ఠము. చూర్ణకము చూర్ణమే. లక్షణము మాఱి నది. సమాసరహితమైనది అల్పసమాససహితమైనది. సమాసరహితమైనది ముక్తక మైనది.

1. అసమాసకరచనము. 2. అల్పసమాసకరచనము. 3. అధికసమాస కరచనము 4. వృత్తగంధి అను విభాగము స్పష్టార్థప్రతిపాదకము.

గద్యశబ్దమునకు సంస్కృతభాషయందు వచనశబ్దము పర్యాయవాచిగ లేదు. తెలుగు భాషలోనే గద్య, వచనశబ్దములు పర్యాయపదములు.

వచనశబ్దమునకు "మృదుమధురసభావభాసురనవార్థవచనరచనావిశారదు లయిన మహాకవులును" అని నన్నయ ప్రయోగము కలదు గాని, అది గద్యార్థ కము కాదు. వాగర్థకము. (8వచ.1ఆ.ఆ.ప.) గద్యార్థకమైన వచనశబ్దము ప్రథమతః తిక్కన ప్రయోగమే.

"వచనము లేకయు వర్ణన
రచియింపఁ గఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్ప టార్యు లొప్పిద మనరే." 15ప:1ఆ.ఉ.రా.

వచనము లేకుండ వర్ణన రచించుట ప్రౌఢులకు కొంత సాధ్యము. కథను రచించుట ప్రౌఢులకును కొంత కూడ సాధ్యము కాదన్నట్లు, పద్యములందే కథా ప్రచయము కలయిక సముచితముగ రచించుట ఆర్యసమ్మతమని తిక్కన అభి ప్రాయము. గద్యశబ్దమును తిక్కన ప్రయోగమే. "మహాకవిత్వదీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" (30ప.1ఆ.వి.ప.) ఉత్తర రామాయణమునందు లేని వచనము, మహాభారతమునందు ఉన్న గద్యములును ఒక్కటే. గద్యవచనశబ్దములు పర్యాయపదములు. నిరుక్తబోధకమైన వచన శబ్దమును తిక్కన అపప్రయోగము చేసెనని ఒక అభిప్రాయము కలదు [326] గాని, వచనము "నిరుక్తనామభాసితమగున్" అని సంకీర్తనలక్షణగ్రంథమునందు కలదు. కాని ప్రసిద్ధము కాలేదు. వచన గద్యశబ్దములే ప్రసిద్ధములు.

"కావ్యము త్రివిధము. పద్యమయము. గద్యాత్మకము. పద్యగద్యమయము. పద్యమయము ఛందోనిబద్ధము. గద్యమయము వాక్యసంకలితము." అని విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు కలదు. (5-6ప.4ఉల్లా.)

"కనుఁ గొనఁ బాదరహితమై
పనుపడి హరి గద్దె వోలె బహుముఖరచనం
బున మెఱయు గద్యమది దాఁ
దెనుఁగుకృతుల వచనమనఁ గ దీపించుఁ గడున్." 2ప.2ఆ.

అని అనంతుని ఛందోదర్పణమునందు కలదు. "మఱి దీనికే (గ.గంఘ్నునకే)

వచననామం బయ్యె నాంధ్రంబునన్" అని అప్పకవీయమునందును కలదు. (23ప. 4ఆ.) కావ్యమధ్యమునందు వచనమనుట, కావ్యాంతమునందు గద్యమనుట పరిపాటి.

ద్విపదకావ్యములు, తిక్కన ఉత్తరరామాయణము వినా, తెలుగు కావ్యములు ప్రాధాన్యవివక్షను చంపూకావ్యములు. అనగా పద్యగద్యోభయకావ్యములు. అయినను కావ్యవిమర్శలందు పద్యపరిగణనమే కాని, గద్యపరిగణనము ప్రసిద్ధము కాదు. వచనము కూడ పరిగణనార్హము.

> "వచనరచనలకుఁ దండ్రియట్టివాఁడు నన్నయభట్టు. అతని ప్రౌఢిమ యన్యులకు లేదు ఒక్క చిన్నయసూరి మాత్రము ఇంకొక విధమైన వచన శైలిని బక్యమునకుఁ దెచ్చి నన్నయతో సమానుఁడై యున్నవాఁడు ..." అని ఒక అభిప్రాయము కలదు[327]. అది యథార్థము.

నన్నయ వచనము నవ్యనవనీతము. వర్ణనవచనములు వినా, కథాకథనవచనములు సరళములు. పాత్రసంభాషణవచనములు సహజములు. కథాకథనవచనములకు కతిపయోదాహరణములు:

> " ఆ ప్రదేశంబునకు సరమ యను దేవశుని కొడుకు సారమేయుం డను కుర్కురకుమారుండు క్రీడార్థంబు వచ్చి క్రుమ్మరుచున్న నలిగి జనమేజయు తమ్ములు శ్రుతసేనుండును భీమసేనుండును నుగ్రసేనుండును నను వార లా సారమేయు నడిచిన నది యఱచుచుం బఱతెంచి తమ తల్లికిం జెప్పిన నా సరమయు నతికోపాన్వితయై జనమేజయునొద్దకు వచ్చి యిట్లనియె" 83వచ.1ఆ.ఆ.ప.

> "పర్వతపారిజాతరైవతసుముఖులను మహామునులతో నిట్లు వచ్చిన నారదమహామునికిం బ్రత్యుద్గతుండయి ధర్మరాజు దమ్ములుం దానును నమస్కరించి తోడ్కొని తెచ్చి యున్నతాసనంబున నునిచి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించిన వారల కుశలం బడిగి నారదుండు రాజ నీతివిషయంబుల నయ్యుధిష్ఠిరు నిట్లని యడిగె." 24వచ1ఆ.స.వ.

> "ఇట్లపూర్వస్వయంవరలబ్ధయైన దమయంతి నత్యంతవిలాసంబుతో వివాహంబైన యానలునకు నింద్రుండు వాని యజ్ఞంబులయందు నిజరూపంబుం జూపను నగ్నియు వరుణుండును వాని వలచిన చోటున యగ్నిజలంబు లుత్పాదింపను ధర్ముండు

ధర్మువునంద వాని బుద్ధి వర్ధిల్లను వరంబు లిచ్చి దేవలోకంబున కరుగు వారెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని యెందులకుం బోయెదవని యడిగిన నింద్రాదులకుం గలి యిట్లనియె." 57వచ. 2ఆ.ఆర.ప.

పాత్రసంభాషణవచనమునకు కతిపయోదాహరణములు :

"బ్రాహ్మణుడు :- పెద్దకాలంబునకు నీ యిలు వరుస నేఁడు మాకు వచ్చిన నిచ్చిఱుతవాని నా రాక్షసునకు భక్ష్యంబుగాఁ బుచ్చనోప నేన పోయెదను.

కుంతి :- అయ్యా దీనికి సంతాపింపవలవ. దీ యాపద దలఁగు నట్టి యుపాయంబు గంటి. నీకుం గొడుకొక్కరుండ. వాఁడును గడు బాలుండు. బలి గొని పోవ నర్హుండు గాఁడు. నా కేవురు కొడుకులు గలరు. వారలలో నొక్కరుం డా రక్కసునకు భవదర్థంబుగా బలి గొనిపోయెడు." 269వచ.6ఆ.ఆ.ప.

"భీష్ముడు :- అవ్వా నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుండు సెప్ప వలయు. గాని నాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ గహనంబు. దీని ఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురు" 245వచ.6ఆ.స.వ.

"ఆశ్వినులు :- అవ్వా నీ వెవ్వని కూఁతుర వెవ్వని భార్యవు

"సుకన్య :- నేను శర్యాతి కూఁతుర-భార్గవుం డయిన చ్యవనుని భార్యను.

"ఆశ్వినులు :- (నగి) అక్కటా యిట్టి రూపవిభవంబులు వడసి కామభోగబాహ్యుఁ డయిన వృద్ధు భార్గవుని వరియించి నీ జవ్వనంబెల్ల వృథ చేసితింకనైనను నీ వయోరూపంబులకుం దగిన వరు వరియింపు మేము వానిఁ దెచ్చెదము." 184వచ.3ఆ.ఆ.ర.ప.

వర్ణనలు సమాసభూయిష్ఠములు. ఒక ఉదాహరణము :

"శాస్త్రవిహితప్రమాణోపేతవృత్తాయామంబును నపాకృతవృక్షగుల్మ వల్మీకవల్లీకంబును నంగీకృతపూర్వోత్తరప్లవంబును సమీకృతనిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృతకంటకపాషాణశల్యశకలంబును విరజీకృతరజోధూసరస్థలంబును విరచితబహువిధ ప్రేక్షాగారమంచకప్రపంచంబును నానా ధ్వజనవపల్లవతోరణచంద

నమాలాలంకృతద్వారదేశంబును ప్రతిదిశనిర్వర్తిత శాంతికబలి విధానంబునుంగా -" 4వచ.6ఆ.ఆ.ప.

ఇదికుమారాస్త్రవిద్యాప్రదర్శనరంగస్థలవర్ణనము. క్రీడారంగమునకు చూడా రత్నము. ఇట్లు ద్రౌపదీవివాహమండప, ద్వారవతీపుర, దైవతవన, హిమవత్పర్వతవర్ణనలు మాత్రమే కలవు.

యుద్ధవర్ణనమునందు ఆచ్ఛికమైన అసమాపకక్రియలను అనుప్రాస పూర్వకముగ అనుసంధానము చేయుట అలతిమాత్రముగ నన్నయ వచనమునందు కలదు.

"భీమజరాసంధు లెడ యుడుగక యొండొరుం బట్టియుఁ గొట్టియు నడచియుం బొడిచియుం దాఁచియుం ద్రోచియున్ మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశినాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధ కౌశలం బేర్పడం బెనంగునెడ -" 206వచ.1ఆ.స.ప.

ఇది తిక్కానాదులు ఇతోధికము చేసినది.

సుదీర్ఘసమాసఘటనము, అర్థాంతరసాదృశ్యకల్పనము బాణభట్టు కాదంబరియందు బాహాటముగ కలదు. అందు అర్థాంతరసాదృశ్యకల్పనము విలక్షణమైనది.

"శరత్కాల మివ క్షీణవర్షం శాన్త మివ ప్రియసత్యవ్రతం, అంబికా కరతల మివ రుద్రాక్షగ్రహణనిపుణం శిశిరసమయసూర్య మివ కృతోత్తరాసజ్గమ్, ఔర్వానల మివ సతతపయోభక్ష్యం శూన్యనగర మివ దీనానాథవిపన్నశరణం పశుపతి మివ భస్మపాణ్డురోమాశ్లిష్టశరీరం భగవన్తమ్ జాబాలి మపశ్యమ్."

ఇది శ్లేషమూలకము. ఇట్టి అర్థాంతరసాదృశ్యకల్పనము నన్నయ వచనమునందు ఒక్కచోట కలదు.

"ఉద్యానవనంబునుం బోలె విద్రుమలతాలంకృతంబైనదాని నాటక ప్రయోగంబునుం బోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యంబైన దాని దివంబునుం బోలె నహిమకరభరితంబైన దాని (మహోదధి)"

27వచ.2ఆ.ఆ.ప.

ఇది కూడ శ్లేషమూలకమైన సాదృశ్యకల్పనము. ఇట్టి అర్థాంతరసాదృశ్యకల్పనము ఎఱ్ఱనాదులు ఇతోధికము చేసినది. ఇట్టి రచనము నన్నయ వచనమునందు నామమాత్రమే.

నన్నయ వచనమునందు సంఖ్యావాచకములు వ్యావహారికసరణిని కూడ కలవు.

"తొమ్మిదివేలుం దొమ్మన్నూటయెనిమిది శ్లోకంబులు"34 వచ.
"నాలువేలుం దొమ్మన్నూరు శ్లోకంబులు" 48వచ.
"మూడువేలు నిన్నూటయిరువది శ్లోకంబులు." 50వచ1ఆ.ఆ.ప.

ఇందలి తొమ్మన్నూట, తొమ్మన్నూరు, ఇన్నూట వ్యవహారప్రసిద్ధములు.

మొత్తము మీద నన్నయ వచనము సహజసుందరము. సరళమంజులము. అధికసమాసరచనము కంటె, అసమాసకరచనము, అల్పసమాసకరచనమును అధికము. అంతేకాదు. వృత్తగంధివచనమును బహుళము. పద్యభాగముల కలిమి కంటె, వృత్తగంధముల చెలిమి ఎక్కువ.

"సరమ యదృశ్యయైన నతి విస్మితుఁ(ం)డై జనమేజయుండు" 86వచ.1ఆ.ఆ.ప.

"ఓడ నెక్క వచ్చువారి నిరీక్షించు
చున్న సత్యవతిం(ని) జూచి యాము।ని" 37వచ.3ఆ.ఆ.ప.

"కావున సర్వప్రకారంబుల [ను]నప
కారకారణులయి (లైన)వారిఁ బరుల" 119వచ.6ఆ.ఆ.ప.

"నీవు మెచ్చిన చోటికిఁ బోవ నోప।ము" 310వచ.8ఆ.ఆ.ప.

నన్నయ సరళవచనము మిరియములు కలిపిన చెఱుకు పానకము. తిక్కన సరళవచనము మిరియములు కలపని చెఱుకు పానకము. అది విరాటపర్వమునందు విరళము. ఉద్యోగపర్వమునందు ఉజ్వలము. యుద్ధపంచకము బద్ధసమాసకము. స్త్రీ పర్వము ఉభయకుశలము. శాంతిసప్తకము సమరసము.

"అల్ల నల్లన తెఱపి యిచ్చి యవులవులం జను నంధకారంబు దూరంబులయందును లేకునికి వలనం గడళ్లప్పళించి నెరసి విరసినం బొలుచు కలుకట్టులుం బోని దిక్తటంబులు దమ పాసిన కందువలు రోసి యెత్తిన మెడలును బచరించిన చూడ్కులు వేడ్కలం గ్రందైన డెందంబులుం గలిగి మెలంగుచు నొండొంటి బిట్టు గాంచి యొదవు సమ్మదంబునం బొదలు మేనులు బెరయించి పరమానందంబునం -" 240వచ.2ఆ.వి.ప.

"ఇవ్విధంబున విడిదల పయనంపు సంపదలు వొంపిరివోవం

దనకు సమకట్టిన సమస్తవస్తువుల యవైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం జూచి యిట్లు చతురంబుగా మనకు వలయు వాని సంపాదించుటకుం బ్రవర్తకులైన యుధిష్ఠిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాదదానంబున కర్హులని పలుకు నవసరంబున నటమున్న పలుదెఱంగులఁ బనులు సేయుచున్న తన పల్లాయనంబు వారిలోఁ గలసి మఱుగువడియున్న -" 94వచ.1ఆ.ఉ.ప.

ఇట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండగదాదండకుంతక్షురికాముసలముద్గరతోమరపరశుభిందివాలశూలప్రముఖనిఖిలహేతివ్రాతంబులను భర్మపరికర్మనిర్మాణ శోభితవర్మంబులను వివిధవర్ణవిచిత్రతనుత్రాణంబులను మణిగణోజ్జ్వలజ్వాలాజటిలకేతనంబులం బరమాభీలసుందరసమ్మర్దంబయ్యె" 95వచ.1ఆ.భీ.ప.

"అనుటయు నమ్మహాత్ముం డట్లగుట మేలని పలికి యంతర్ధానంబుం జేసె నిట్లు ప్రబోధితుండై యాంబికేయుండు గొండొక ప్రొద్దూరకుండి చేరుకొని పయనం బాయతంబు సేయుమని చెప్పి విదురుతో నీవు గాంధారిని గుంతినిం దక్కుఁ గల కౌరవభూవర్గంబును దోడ్కొని రావలయు మనము పొలికలనికిం బోవుచున్నవారమని యెఱింగించి వెలువరింపు మనిన నయ్యిరువురు నట్లు సేసిన" 95వచ.1ఆ.స్త్రీ.ప.

"అంత నాభిషేచనికద్రవ్యసంచయంబు సన్నిహితం బగుటయు మాధవానుమతుండయి ధౌమ్యుండు ప్రాగుదక్ప్లవనంబైన వేదికాతలం బలంకరించి యందు జాతరూపనవరత్నఖచితంబును దృఢపాదంబు నగు భద్రపీఠంబు ప్రతిష్ఠించి శార్దూలచర్మాస్తరణశోభితంబు సేసి యర్చించి కాంచనదామజుష్టంబులగు నుత్కృష్టఘనశంఖంబు సముచితస్థండిలంబున నిలిపి పూజించి దానును దాని చుట్టునుం బార్థివంబులు హైమంబులు రాజితంబులు రత్నమయంబులు నగు కుంభంబు లొనర్చి వానను గాంగంబులగు జలంబులు నించి యన్నింటికి రత్నమంగళతరుత్వక్పల్లవకుసుమంబులను బంచగవ్యంబులను సమంత్రకంబుగా సంస్కారంబు నిర్వర్తించి -" 313వచ1ఆ.శాం.ప.

ఆచ్ఛికమైన అసమాపకక్రియలను అనుప్రాసపూర్వకముగ అనుసంధానము చేసిన తిక్కన వచనమునకు ఒక ఉదాహరణము :

"ఆ సైనికులు రథ్యంబులు గూల్చియుఁ గేతనంబులు ద్రుంచియు బాణంబులు నఱికియు బాణాసనంబులు విఱిచియు సూతుల గీటడంచియు నరదంబులం జెక్కియు వైమఱువులు పొళ్లసేసియుఁ, జామరంబులు దునిమియు నాతపత్రంబులు రూపు మాపియు నెత్తురు లురలించియుఁ గండలు దొరఁగించియు నెమ్ములు వగిలించియుఁ గాళ్ల ద్రుంచియుఁ జేతులు దునిమియు వ్రయ్యలుగా వక్షంబులు సీఱియు మర్మంబులఁ జొచ్చియు మకుటంబులు డుల్చియుఁ దలలు రాల్చియుఁ బ్రాణంబులు పీల్చియు రౌద్రం బావహించిన లయకాల రుద్రుని సంక్రీడనంబు చందంబు దోఁచె" 211వచ.1ఆ.శ.ప.

అభినవదండి అనబడిన కేతన వచనము దండివచనము కాదు. సరళ వచనము. అభినవభారతి అనబడిన మంచన వచనము అభినవము. అంతకంటె సరళము. అంతేకాదు. దీర్ఘవచనములు పట్టుమని పది కలవు. సుదీర్ఘవచనములు లేవు. హ్రస్వవచనములు, హ్రస్వతరవచనములు, అందింపువచనములు- అనగా పూర్వాపరపద్యములకు వాక్యసాంగత్యము సేయు వచనములు- అత్యధికము. మారన వచనములు సరళము కంటె ప్రౌఢము. దీర్ఘ, సుదీర్ఘవచనములు కలవు. ఎఱ్ఱన వచనము మఱింత ప్రౌఢము. దీర్ఘసుదీర్ఘవచనములే కాదు; మహాదీర్ఘ వచనములును కలవు. అరణ్యపర్వశేషమునందు ఎఱ్ఱన వచనము నన్నయ రచన అనిపించునదియేగాని, నృసింహపురాణహరివంశములందు ఎఱ్ఱన రచన అత్యంత ప్రౌఢిమను పరిఢవించునది. అందు నృసింహపురాణములోని అంగవర్ణన వచనము (14వచ.3ఆ.) స్తంభోద్భవవచనము (82వచ.5ఆ.) హరివంశములోని గద్యలేక చూర్ణిక (211వచ.10ఆ.ఉ.భా.) అగ్రేసరభాసమానములు.

అంగవర్ణనవచనమునకు ఆరంభము:

"ఇట్లు సభామంటపప్రవేశం బొనరించి యనంతరంబ వా రగ్ర భాగంబున నుదగ్రభోగిభోగమహాశ్వేతశయనీయంబునఁ గమనీయ హిమశైలశృంగసంగతంబగు సతోయతోయదంబు చాయకు నుపమేయం బగుచు-"

స్తంభోద్భవవచనమునకు ప్రారంభము :

"అమ్మహాస్తంభంబున విజృంభమాణజిహ్వావివృతవదనగ హ్వరస్ఫురదసహ్యకహకహోత్తర్జనగర్జాస్ఫూర్జితంబును వికట కఠోరఘోరదంష్ట్రాదండదారుణదహనదందహ్యమానదశదిశాభాగం బును-"

గద్యలేక చూర్ణిక ఆద్యంతములు

"జయజయ జగదుద్భవస్థితసంహారహేతుగుణనిర్ధరణవ్యవహితానేకమూర్తి విలసన! సనకాదియోగీంద్రహృదయసరోరుహ ......... మాననీయమహిమానంద నందదిందిరాసుందరీహృషీక! హృషీకేశ! కేశవ! నమస్తే నమస్తే నమస్తే నమః."

సరళవచనమును సమధికముగ కలదు.

"వారలుం దానును ధర్మజు కడకుం జనిన నయ్యజాతశత్రుండు చిత్రసేను నతిప్రియంబునం బూజించి మహాత్మా యీ సుయోధనుండు సానుజామాత్యుండయి మా చేత వధియింపంబడ కునికి మేలయ్యె మీ కారణంబున మా వంశంబునకు నొడొక్క హాని వొందదయ్యె వీఁడెట్టి యపరాధంబు సేసినను నదియంతయు సహించి మాకుంగా వీని విడువవలయునని ప్రార్థించిన నతం డట్ల కాక యని" 5ఆ.ఆర.ప.

"అనిన సంతసిల్లి తండ్రి కొడుకు నా ప్రొద్దు రావించి చేరువ నునిచి కొని యన్నా! నిన్ను మీ యొజ్జ నయకళాపారంగతునిగా నుదాహరించినది మాకు దెల్లంబుగా నెఱుంగవలయు. రాజులకు మిత్రు లమిత్రులు నుదాసీనులను మూఁడు దెఱంగుల వారలు గలరు. వారలయందు భూపతి యెట్టియెడలం ప్రవర్తిల్లు, నభ్యంతరులు బాహ్యులు నగు నమాత్యులయెడ నెవ్విధంబుల వాఁడుగాఁ దగుఁ" 153వచ.4ఆ.నృ.పు.

"అచ్చోటి భూరజంబు వుచ్చి పిడిచి వైచి తూపొడిచిరి విశేషించి నందుండు బృందారకుల కెల్ల వందనంబు సేసి నందనునకు నభయప్రదులుగా నభ్యర్థించె నా లోనన యెల్లవారును వచ్చి యచ్చెరువు నొరిదుచు నబ్బాలు నభినందించి రా గోప ముఖ్యుండు శకటంబు క్రమ్మఱ సంఘటితంబు గావించి సుఖంబున నుండె." 192వచ.5ఆ.పూ.భా.హ.వం.

ఒకేవచనమునందు కొంత అచ్ఛికపదరచనము. కొంత సాంస్కృతికపదరచనము సమ్మేళనము చేయుపద్ధతికి ఎన్నిన వచనమే ఒరవడి.

"ఎల్లయెడలనుం ద్రుళ్లు గొల్ల పెల్లువలనను జనుకట్టులు గట్టి

భుజమూలంబుల జిగిసొంపు లంకిలి మెఱసి నెఱయుం జిలుమూరు నిత్తడి కడియంబులుం గంచుటుంగరమ్ములు నమరం గొమరారు నాఁచుఁదీఁగలు గలయం బ్రాఁకినం బోలుచు కెందామరలం దెగడు చేతులం గడవల వాతులు పదిలంబుగా నూఁది చెదరని చికిచికి వెంౘ్రుకలు పొదువుటం జిఱుమొగులు మొలకలు బలసిన గరువంబు డప్పి నొప్పు ఎనిదురయూర్పులుం దమలో బెరసి యాడు మాటల తమకంబున నినుమడియై నిగుడ నడనడవడంకుచున్న చన్నుఁగవలును వ్రేఁగుపడు పిఱుందులుం బోలయు చూడ్కులునై యొక్కొక్క తోయంబులం గూడి సరిత్తోయంబులం దెచ్చు జలవాహికలును గాంచన కంకణఝణఝణత్కారంబులం గంఠసూత్రవలనంబుల బాహులతాందోళనంబులం బయోధరసంఘర్షణంబుల శ్రోణిసన్నహనంబుల మృదుగీత మాధుర్యంబుల మనోహరంబులగు దధిమథనవ్యాపారంబులం జాలఁ బారీణ లగు బాలికలును ఘృతతక్రవిక్రయంబు గృహసమ్మార్జనంబు శిశుసమాశ్వాసంబు బాలకభృతకభుక్తిప్రదానంబు మొదలయిన పనులం -" 143వచ.5ఆ.పూ.భా.హ.వం.

విచిత్రమైన విరోధాభాసాలంకారము తోడి వచనమును ఎఱ్ఱన ఒజ్జబంతియే.

"అనేకనీలమణిప్రభావనివహాంధకారితగగనభాగంబయ్యును పీతాంబరవిలసితంబును శేషభోగాస్పదంబయ్యును అశేషభోగనివాసంబును బహుసంయమిజనాధిష్ఠితంబయ్యును పరమముక్తిప దంబును సముత్తుంగగాంగేయభవనభాసురంబయ్యును శిఖండివిహారహృద్యంబును వివిధ విలాసినీ విలసనోల్లసితంబయ్యును జితేంద్రియగమ్యంబును సముద్రోదరస్థితంబయ్యును సుకవిముఖవిరాజమానంబునై" 55వచ.1ఆ.వృ.పు.

"వేదంబునుం బోలె ననేకశాఖావలంబిద్విజగణసేవ్యంబును జలధరంబునుం బోలె గగనచ్ఛాదనాభోగంబును శైలంబునుం బోలె బహుపాదప పరివేష్టితంబును గృహస్థధర్మంబునుం బోలె నిరంతర శ్రాంతజనసమాశ్రయ ణీయంబును యోగనియమంబునుంబోలెఁ బవన పరిచయజనితకుండ ల్యుల్లాసనంబును మహాయుగ్యంబునుం బోలె ననర్ఘ్యాంధకారభరితాభ్యంతరం బును సేనావ్యూహంబునుం బోలె బహుళపత్రఫలమండలాగ్రశోభితంబును విష్ణువక్షస్థలంబునుం బోలె వనమాలాపరిష్కృతంబును బరబ్రహ్మంబునుం బోలె నారణ్యకోద్గీతమాహాత్మ్యంబును నగుచు" (భాండీరవటము)

183వచ.6ఆ.పూ.భా.హ.వం.

నన్నయ రచన అనిపించు ఎఱ్ఱన వచనము ఆరణ్యపర్వశేషమునందు అధికము.

"అవ్వియచ్చరుల విక్రమంబునకు నోర్వక బెదరి చెదరి కురురాజసైన్యంబు ధర్మనందనుం డున్న కందునకుఁ బాఱం దొడంగె నప్పుడు రాధేయుం డజేయుండై కులశైలంబునుం బోలెఁ దలరక నిలిచి గంధర్వులు గురియు శరవర్షంబున మునుఁగుచుఁ దన యోపినంత పెనంగుచుండె సోదరసౌబలసహాయుండై దుర్యోధనుండు గర్ణసాహాయ్యంబు వదలక నిలిచె నంత ననంతస త్త్వశాలిన గంధర్వు లనేకులు సుట్టి ముట్టి" 399వచ.5ఆ.

ఇట్టి సరళవచనము భాస్కరరామాయణమునందు ఇతోధికము.

"అమ్మారీచుండు దన మనంబున నిన్నిచుచేతం జచ్చుట కంటె రఘురాముచేతం జచ్చినం బరమగతి కలదు కావున నిదియ మేలుకార్యంబని పూని రావణున కనేకమాయోపాయంబు లుపన్య సించి చూపుచుం జనియె నతండు నీవు నాకుం బ్రాణమిత్రుండవు పూర్వామాత్యుండ విక్కార్యంబు సిద్ధించిన నర్ధరాజ్యంబిత్తునని యుపచరించుచు నెడనెడ గిరులు నదులు వనంబులుఁ గనుంగొ నుచుఁ బెక్కు దేశంబులు గడిచి దండకారణ్యంబు సొచ్చి నానాత రుశోభితం బగుచున్న పంచవటీతీరంబునం దేరు డిగ్గి ...." 23వచ. 2ఆ.అర.కాం.

నాచన సోమనాథుని ఉత్తరహరివంశమునందు అతిదీర్ఘమైన సమాసఘ టనము, అత్యంతవిస్తృతమైన ఆచ్ఛికపదసంయోజనము నవీనగుణములు.

"కుందగిరిమల్లికాకుముదసముదయదాయాదసదాదితేయ నదీసుమేరుశిఖర విసరవిసరదుదీచీముఖప్రవాహవిహరమాణ విరించిపురమహిళాపయో ధరకుంకుమపరాగరాగచ్ఛవిచ్ఛు రితతరంగపరంపరాపరార్థ్యఫేనపటల పల్లవితవిగతరజతరుచిరుచిర తరాధిత్యకాదిత్యకాత్యాయనీరమణశిరో భూషణశశాంకశకలవిలాస నిస్తంద్రచంద్రికావిచరదవాచీముఖరోచి ర్ఘరీపరీతపరిసరపరిహృత తపనీయతటద్యుతినిపతదితరేతరకాంతి వినిమయంబై" 160వచ.2ఆ.

"ఇట్లు తలపడి సాయకనికరంబులఁ గరంబుల మనికట్ల పట్లకుం దునిమిన మునుకొని కరవాలంబులు వదనంబులం

గఱచికొని కదనంబునకుం బఱచు వారలనుం గణఁగి గద
వ్రేసినం గినిసినట్లు దునిసిన చరణంబులతో మరగాళ్లం దిరుగు
వెరవరుల కైవడిం దిరిగి యడిదంబులం బొడిబొడిగా నడచు
నడజోదు భటులును దండతండంబులగు వేదండంబుల తొండం
బులు దండెలం దగిలినం గదలనేరని తురంగంబులపై మలంగి
దంతంబుల కొలందికిం దరువలి కత్తులం దుత్తురుముగా మెత్తి
విడిపించు రవుతులు దేరుల గముల చేరువల సారువులు గట్టు
వారువంబుల పక్కెరలపై నెక్కడఁ జూచినం గ్రిక్కిఱియ నాటిన
నెఱనారసంబులు వెఱికి పిఱుందు ముందఱగా నేసిన
విలుకాఱచేతం జీకాకు వడిన రథికులును ............." 229వచ.4ఆ.

శ్రీనాథుని వచనము నక్షత్రమాలారచనము. ఒక్కొక్క నక్షత్రమున ఒక్కొక్క కాంతిపుంజము. పూర్వసరళసంవాదసమాసాదికరచనమునకు సంగీతస్వర కల్పనము నూతనవిశేషము. అపూర్వప్రజ్ఞామూలకోపజ్ఞారచనమును అధికము.

1. కర్తృక్రియామాత్రవచనము : ఒక పదము కర్తగ, మఱొకపదము క్రియగ మాత్రమే కల వాక్యముల పోహళింపు కర్తృక్రియామాత్రవచనము.

"అప్సరస లాడిరి. మహర్షులు హర్షించిరి. చారణులు సంస్తుతించిరి. ప్రమథులు ప్రమోదించిరి. విద్యాధరులు పుష్పవర్షంబు గురియించిరి" 222వచ.7ఆ.కా.ఖం.

2. క్రియాపదరహితవచనము : క్రియాపదములేని వాక్యసమాపనము కలది క్రియాపదరహితవచనము. ఇది తెనుగు నుడికారము తేజరిల్లునది.

"అందుం బవనం బుద్గమించు కాలంబు రాత్రి. ప్రవేశించు కాలంబు పగలు. పింగళానాడియందు సూర్యుఁ డధివసించియుండుఁ గావున నందుం బవనం బుద్గమించు కాలంబు దివంబు." 129వచ.2ఆ.కా.ఖం.

3. నాటకీయపద్ధతి వచనము : ప్రయోగసూచనము తోపాటు పాత్రసంభాషణము కలది నాటకీయపద్ధతి వచనము.

"యజ్ఞదత్తుం డర్ధముండితంబైన మూర్ధంబున నీర్కావిదోవతి నఱిముఱిం జుట్టుకొని యింటి కేతెంచి మొగంబు గంటువెట్టుకొని "సోమిదమ్మ! ఏమిచేయుచున్నదాన విటురమ్ము. నీ కొడుకెక్కడం బోయెం బోవుంగాకేమి విను" ' మనియిట్లనియె."
102వచ.4ఆ.కా.ఖం.

4. అన్యావధారణవచనము: ముందు దోషప్రతిపాదనము చేసి, తర్వాత దానిని అన్యవిషయమునందు అవధారణముచేసి గుణప్రకాశము సేయు వచనము.

"వర్ణసాంకర్యంబు వాసపు కోదండంబునంద, యహిభయంబు వల్మీకంబులయంద, జీవనసంశయంబు వారిదంబులయంద, వృషాతిక్రమంబు గృహంబులయంద, పరదర్శనంబు యతుల యంద, దోషోల్లాసంబు కువలయంబులయంద, కౌరవపదానుస రణంబు కిరాతులయంద, తరళత్వంబు కరికరసంతానంబులయంద, విపక్షక్షోభంబు కొలంకులయంద, ఆత్తగంధత్వంబు చందనం బులయంద, తాని తనయందుం బొందనీక ..... యొప్పు నప్పట్ట ణంబునకు -" 110వచ.1ఆ.భీ.పు.

5. ప్రత్యాఖ్యానాత్మకవచనము : ప్రతిపాదితాంశమునకు ప్రతిభటుమైన ప్రసిద్ధ విషయమును ప్రత్యాఖ్యానము సేయు వచనము.

"ఆ చంచలాక్షుల దృగంచలస్ఫురణంబు లించు విలుకానికిం బంచ బాణంబులు. పువ్వు లనుట నవ్వుటాల మాట; యప్పణం తుల లలాటకర్పూర తిలకంబు దర్పకునకు ధవళాతపత్రంబు. శశాంకబింబమనుట బొంకు; ఆ పువ్వుంబోఁణుల కణివంక కనుబొమ్మలె యంగజునకు సింగిణివిం డ్లల్ల చెఱకు విల్లనుట కల్ల; యత్తొయ్యలుల నెత్తావియూర్పుగాడ్పులె పుష్ప బాణునకుఁ బ్రాణ సఖులు. చందనాచలసమీరణంబు సఖుం డనుట యకారణచిత్త ప్రత్యావహంబు" 80వచ.6ఆ.భీ.పు.

6. వర్ణవిన్యాసవక్రతావచనము: ఒకటి లేక రెండు మూడు వర్ణములు పునఃపున ర్బధ్యమానమైన వచనము.

"అసమసమరవిసృమరచమూమదాంధగంధసింధురఘటావ మధు శీకరాసారహారినీహారసమయకంపితారాతిహృదయకమండ లుండును మదవదరిచూడాకురువిందకందళకిరణసందోహసందీ పితచరణారవిందుం డును గరళకరాళకరవాలధారానికృత్తగళద్రక్త రిపుసుభటనటారబ్ధ నాట్యాద్భుతాలోకహృష్ట త్రివిష్టప నివాసుండును" 158వచ.5ఆ.శృం.నై.

7. విశేషణవిశేష్యాంత్యానుప్రాసవచనము: విశేషణమునకు, విశేష్యమునకు అంత్యానుప్రాసను పాటించు వచనము.

"విబుధమత్తకాశినీజనోత్తమయగు తిలోత్తమయు, వశీకృత కుసుమనారాచయగు ప్రమ్లోచయు, నలకూబరనఖాంకరేఖాంకి తస్తనకుంభయగు రంభయు, గుణపేశి యగు సుకేశియు, గలమంజు ఘోషయగు మంజుఘోషయు, శృంగారరసరాశి యగు నూర్వ శియు, రూపానురూపస్థానకయగు మేనకయు" 39వచ.5ఆ.హర.వి.

8. ముక్తపదగ్రస్తవచనము : ముక్తపదగ్రస్తాలంకారము కల వచనము.

"ఏ పాకంబునకు రాక రాకాచంద్రబింబంబునుం బోని నెమ్మోము వాంచి నిర్వికారుండై యూరకుండె నివ్విధంబున నయ్యూర్వసియు వసిమాలఁ బెనంగి యక్కిరీటి చక్కని మనంబు పక్కుగానక కానక కాసిన వెన్నెలయుంబోలె" 133వచ.

7ఆ.హ.ర.వి.

9. పదద్వయానుప్రాసవచనము : రెండేసిపదములకు అనుప్రాసమును పాటించు వచనము.

"సురాసురవ్యూహంబు లుత్సాహంబులు, మదంబులు ముదంబులు, శౌర్యంబులు ధైర్యంబులు, క్రౌర్యంబులు వీర్యంబులు, హంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు ప్రహాసంబులు, బలంబులు చలంబులు, జవంబులు రవంబులు నదల్పులు విదల్పులు, వీఁకులు తాఁకులు, జూఁకలు కూకలు, మూఁకలు వీఁకలు, తెగింపులు నగింపులు, నింపులు సొంపులు, పెంపులు గుంపులు, పరువులు మురువులు గెఱయ మెఱయ" 60వచ. 4ఆ.భీ.పు.

10. ఆద్యక్షరావృత్తివచనము : ఆద్యక్షరము పునఃపునః ఆవృత్తమగు వచనము.

"ఉంగడిగొన్న భంగి నూసరిల్లుచు నుస్సురనుచు నుమ్మలించుచు నుదిలగొనుచు నుపతాపం బందుచు నూటాడుచు నూర్వశీనందనుఁ డూర్ధ్వబాహుండై యుచ్చైస్స్వనంబున" 138వచ.2ఆ.కా.ఖం.

11. పర్యాయక్రియాపదవచనము : భిన్నభిన్నకర్తలకు ఏకార్థమున ఏకక్రియను గాక, పర్యాయక్రియాపదములను ప్రయోగించు వచనము.

"లోలార్కకేశవులకు నభివాదంబును, భాగీరథికి నంజలిబంధంబును, విశ్వనాథునకు వినుతియు, విశాలాక్షికిఁ బ్రార్థనంబును, మోక్షమంటపంబునకు జయకారంబును, నంతర్గేహంబున కామంత్రణంబును, గాలభైరవునకు జోహారును, ఢుంఠివినాయకునకు శరణార్థము, దండపాణికి దండప్రణామంబును గుక్కుటచతుష్టయంబునకు మ్రొక్కును సకలదేవతాకోటికి నేటికోళ్లను జేసి" 50వచ.2ఆ.భీ.పు.

12. పర్యాయకర్తృక్రియాపదవచనము : ఏకకర్తకు ఏకార్థమునందు ఏకకర్తృపదమును ఏకక్రియాపదమును గాక భిన్నభిన్నకర్తృపదములు భిన్నభిన్నక్రియాపదములును ప్రయోగించు వచనము.

"ముక్కంటీ! నీకు మ్రొక్కెదను; శివా! నీకునవాంజలి; భవా! నీకు నభివాదనంబు; పాండురంగా! నీకు దండంబు; రాజశేఖరా! నీకు జేజే; హరా! నీకు జోహారు; గిరీశా! నీకు వరివస్య; యష్టమూర్తీ! నీకుం బ్రతిష్ఠ; యీశానా! నీకుదాస్యంబు; త్రిపురహరా! నీకుపాసనన; మృడా నీకు శరణు; మృత్యుంజయా! నీకుం బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ! నీకు నమస్కారంబు; కైలాసనిలయా! నీకుం గోపులు; వశ్యల్లలాటా! నీకు నేటికోళ్లు; గౌరీమనోహరా! నీకు నమస్కారంబు" 212 వచ.3ఆ.భీ.పు.

13. అనేకక్రియాపదవచనము : అవస్థాద్యోతకముగ అనేకక్రియల వచనము.

"ప్రతిగేహంబును బరిభ్రమించి, విసికి, విసిమాలి, వేసరి, యలసి, యారటంబొంది, సొలసి, జుంకించి, తూలి, దూఁపటిలి యుల్లంబునం గ్రోధం బుద్భవించిన" 101వచ.2ఆ.భీ.పు.

14. విశ్లథవచనము : రెండు పదములతో గాని, ఒక పదము ఒ[illegible]దబంధముతో గాని వివరములు క్రియకు అన్వయించు విశ్లథమైన రచనము విశ్లథవచనము.

"కంది యందంబును, బెసర సిరియును, మినుము నలుపును, గోధూమశ్యామాక వరగయును, మాష తోరసమున్మేషంబును, గుళుత్థశుద్ధార్థ మానవృద్ధియుఁ బ్రత్తి సంపత్తియు, బొబ్బర యుబ్బరంబును గంద సందర్భంబును ....... దవ్వింందల సందడియు, గంటె కొఱ్ఱతఱుచును, గసగస లివయును జెంగలించు

జాంగలక్షేత్రంబున" 57వచ.3ఆ.భీ.పు.

15. అవస్థానుకారివచనము : పాత్ర మానసికావస్థను ప్రతిఫలించు వచనము.

"చెలువ! చెక్కుటద్దంబునం జేయిడి యేల చింతించెద? వేటికిం బల్లవపాటలంబైన యధరంబు బీఁట లెగయ వేఁడి నిట్టూర్పుగాడ్పులు నిగిడించెద? వే కతంబున గద్గదిక నొందెద? వే కారణంబున నశ్రుకణంబు లురుల నేడ్చెద? వీ సంతాపంబునకు నేది హేతువు? దప్పనాడంగదా! యాత్మనిహ్నవం బపరాధం బొక్కొ? శుద్ధాంతప్రవేశంబు దోసంబొ? దేవదూత్యంబు ప్రత్యవాయంబొ? చెపు ్పము. సేవకులకుం దపు ్ప గలదే? కలదేనియుం గిరీటమాణిక్యమయూఖపుంజంబులఁ జరణకంజంబుల నివాళించెద. నను గ్రహింపుము -" 91వచ.4ఆ.శృం.నై.

16. సంప్రశ్నవచనము : ప్రశ్నరూపమైన వచనము.

"మన్మథ! మధురాలాపవినిసర్గపండితంబులగు గండుఁగోయిలల నేలొకో భువనంబులకు రాయబారంబు పంపవు? ప్రణిపాతయాచితంబులగు గాఢోపగూహనంబుల మఱచితే? యార్తవంబగు కుసుమప్రధానంబు నా యంగంబులం దిది నీవు రచించినది కదా? దక్షిణేతరంబగు మదీయచరణంబు లాక్షారాగపరికర్మంబునకుం దగదొకో?" 91వచ.3ఆ.హర.వి.

17. సంబోధనక్రమవచనము : పాత్రల క్రమసంబోధనమున పరామర్శించు వచనము.

"అక్కటకటా! దైవంబ! నీ కంటికిం బేలగింజయుం బెద్దయయ్యెనే? జననీ! ముదిసి ముప్పు ్ప కాలంబున సుతశోకసాగరం బెబ్భంగి నీఁదఁ గలదానవు? ప్రాణేశ్వరీ! యే చందంబున మద్విరహవేదనాదవానలంబునఁ దరికొని యెదవు? సఖులార! యే ప్రకారంబునం బుటపాకప్రతీకాశంబైన కరుణరసంబునం బురపురం బొక్కెదరు? బిడ్డలార! యే లాఁగున నతిక్షుత్పిపాసాకులంబులై కులాయకూలంబులం గులగులం గూసెదరు?" 110వచ.1ఆ.శృం.నై.

18. సరళవచనము : అసమాసక, అల్పసమాసకరచనము.

"ఏనుంజేసిన ప్రశ్నంబునకు నుత్తరంబు నీమీఁద నప్పైప్పయున్నయది. యిపు ్పడైన నా ఋణంబు దీర్చుకొనుము. భవాదృశంబైన నాయకరత్నంబు నే వంశంబు భరించె? నేవర్ణంబులు నీ

పుణ్యనామమునకుం బ్రకాశకంబు లైనయవి? యని పరిమితంబు గాఁ బలికి కుండినరేంద్రనందన యూరకుండుటయు నన్నిషధ మండలాధీశ్వరుండు -" 53వచ.4ఆ.శృం.నై

19. సుదీర్ఘసమాసవచనము: అధికసమాసరచనము.

"జాహ్నవీనిర్ఘరధారార్ఘూత్కారఘుమఘుమాయితమణిగుహాకుహరంబును వనమహిషకోణాభిఘాతప్రస్నిగ్ధపాషాణస్థలనరోహిద్గర్భిణీ గర్భపాతంబును శబరపురంధ్రీనీరంధ్రకుచకలశలేపనముద్రా యోగ్య వర్ణవర్ణనీయగైరికశిలాచూర్ణంబును ....... విద్యాధరాభిసారికా మనోరథ పదానురోధనిర్ణిరోధనిరవగాథ సంబాధపృథులతమత మాలవీథీతిలంకంబును నైన యక్కొండ" 26వచ.5ఆ.హ.వి.

20. అతి దీర్ఘసమాసవచనము : అత్యధికసమాసరచనము.

"పంపావిరూపాక్షదేవదివ్యవికటపాటలజటాజూటకోటీపినద్ధముగ్ధేందు రేఖామయూఖకందళగళదమృతధారానిష్యందానేకసంవర్ధిత సుకుమారసరళ సహకారజంబుజంబీరనారికేళకేసరకురవకాశోకశాకోటకూటజపారిభద్ర ద్రాక్షాగుద్రాక్షసర్జఖర్జూరభూర్జబిల్వచిరిబిల్వాది తరులతాకుంజఖంజన్మిహిరకిరణపుంజంబులగు సామిమల"- 290వచ.5ఆ.కా.ఖం.

21. పట్టికాప్రాయవచనము : వివిధపదార్థములను పట్టికగా వ్రాయు వచనము. పూర్వోదాహృతము. (శ్రీనాథుని ఆత్మీయత-ఆంధ్రదేశాభిమానము).

22. అర్థాంతరసాదృశ్యకల్పితవచనము : ఇది నన్నయ మచ్చు చూపినది. ఎఱ్ఱన హెచ్చు చేసినది. శ్రీనాథుడు మితముగ అనుసరించినది.

"గుహ్యకనగరంబునుం బోలె వివిధమనుష్యధర్మచరిత పవిత్రంబును లంకానగరంబునుంబోలెం బుణ్యజనాధ్యుషితసన్నివేశంబును గార్తవీర్యార్జున మూర్తియునుం బోలె నవిరళకరభూషితంబును శరత్కాలంబునుం బోలె విలసత్ప్రకాశంబును బ్రాహ్మణ జాతిధర్మంబునుం బోలె నిగమశాలియునై - (పట్టణము)" 110వచ. 1ఆ.భీ.పు.

23. ఆచ్ఛికసాంస్కృతికపదవచనము : ఇది ఎఱ్ఱన ఒరవడి పెట్టినది.

"-తలతలం దొరంగు చినుకులం బుట్టు కట్టావితోడం గూడి పుడమిం బొడము కమ్మని నెత్తావి చిత్తంబుల కాహ్లాదం బాపా దింప విద్యున్నటీనటనారంభసంభ్రమోచితంబులగు పుష్పాంజలి విక్షేపంబులం బురిడించుచుండ డీలుకొనంబడు వడగండ్లగములు గిరికటకశిలావిటంకంబులం గ్రేంకారంబు లంకురింప నొరిడొరిడ మెండుకొని" 20వచ.2ఆ.హర.వి.

24. సంకీర్తనవచనము : ఇది కృష్ణమాచార్యుల వచనముల వంటిది.

"జయజయ జగన్నాథ! జగజ్జనస్థితి సంహారక! జంభారిప్రముఖ నిఖిలబర్హిర్ముఖశిఖామణీమయూఖమంజరీరంజితపాదపీఠ! జల జాసన! ...... అనంత! అద్వితీయ! నిరస్తసమస్తోపాధిక సచ్చిదా నందస్వరూప! నమస్తే నమస్తే నమః" 12వచ.3ఆ.హర.వి.

25. సంబోధనపర్యాయపూర్వకసంకీర్తనవచనము : ఇది అద్యతనసన్మాన పత్రికలకు ఆద్యప్రకృతి.

"కంఠేకాలా!

మీ కంఠమూలంబునం గలువదండ కైవడిం గనుపట్టు కరాళ కాలకూటవిషమషీకళంకపంకచ్ఛాయాచ్ఛటాగుళుచ్ఛంబుల వలన నిఖిలలోకసంరక్షణంబు నిగమవ్యాఖ్యాతంబు.

మహానటా!

మీ జటాజూటపటలంబున డిగిన వియద్గంగానిర్ఝర స్రోతశ్శలాకా నికాయంబులఁ ద్రిలోకీకంఠోపకంఠంబులుతారహార వల్లీమతల్లిభంగి నంగీకరించు

శంకరా!

నీవు సంరక్షణరుద్రావతారంబునం బాతాళగోళంబు వెడలి విష దహనవిస్ఫులింగవికటదంష్ట్రాటంకకిటకిటాత్కారఘోరంబును జిహ్మాలంబును నగు వదనగహ్వరంబునఁ బుండరీకభ వాండపిండ బుం లొండొరిడ నణంగఁ గవిసి మ్రింగుదు; -"

212వచ. 3ఆ.భీ.పు.

26. వచనాంతర్గత సంకీర్తనవచనము : వచనమునందు సంకీర్తనవచనము.

"ఇట్లు పూజ చేసి పరమపతివ్రతలు ముకుళితకరాంబుజలై "శ్రీదక్షవాటీపురాధ్యక్షభీమేశ్వరా! భీమనాథ! భీమశంకర! భీమలింగ!

మహాదివ్యలింగ ......... మహానుభావ! శశాంకశేఖర! నమస్తే నమస్తే నమ" యని యనేకప్రకారంబుల స్తుతియించిన" 52వచ.5ఆ.భీ.పు.

27. వచనాంతర్గతనమస్కారగద్య : తెనుగు వచనమునందు సంస్కృతనమస్కారగద్య.

"ఎయ్యది సంసారతారకంబగుటఁ దారకం బయ్యె నెయ్యది ప్రకర్షంబునం జేసి యశేషవిక్రియావిరహంబునం గూటస్థని త్యంబయ్యెను ...... ..... అట్టి యోంకారమంత్రత్వంబు దివ్యలింగ స్వరూపంబై యావిర్భవించినం గనుంగొని పంకజాసనుండు" నమో ఓంకారస్వరూపాయ, నమ స్సర్వరూపస్వరూపిణే, నమో రుద్రాయ, నమో భవాయ, నమశ్శర్వాయ, నమ ఉగ్రాయ ... ... ... ... ... ... ... నమో భక్తవిషాదహంత్రే నమో నమః"యని యనేక ప్రకారంబు లం బ్రస్తుతించిన" 250వచ.6ఆ.కా.ఖం.

ఇట్లు శ్రీనాథుని వచనము బహువిధభాసమానము. రీతిసౌభాగ్యము, గీతిమాధుర్యము ప్రతివచనమునందును ప్రతిఫలించును. అనేకవాద్యముల ఏకశ్రుతి వలె అనేకరీతుల ఏకవచనము రచనాశిల్పమునకు పరాకోటి. ఇందుకు భీమేశ్వరపురాణములోని వ్యాసుని భీమేశ్వరస్తోత్రము ప్రముఖోదాహరణము. శ్రీనాథుని కవిత్వము సీసపద్యమునకు ఎంత సీమావధియో, వచనమునకును అంత పరమావధి.

ఇంత వచనరచనావైవిధ్యము ఇతరకవులందు మృగ్యము.

పోతన వచనము సరళము సమాసభూయిష్ఠమును; సుదీర్ఘము అతిదీర్ఘమును, సమాసఘటనమున ఎఱ్ఱన పటిమ, శ్రీనాథుని మధురిమ కలదు. ఎఱ్ఱన స్తంభోద్భవవచనమునకు ప్రతిద్వంద్విప్రాయమైనది పోతన స్తంభోద్భవవచనము. (285వచ.7స్కం.) శ్రీనాథుని రీతివైవిధ్యమును గీతినైపథ్యమును సంతరించునది అమరావతీనగరవర్ణనము. (447వచ.8ఆ.) జగన్మోహిని వర్ణనము రసవాహిని (396వచ.8స్కం.) గంగాప్రవాహవర్ణనము రసగంగాప్రవాహము., పట్టికాప్రాయవచనము (24వచ.8స్కం.) అర్థాంతరసాదృశ్యకల్పితవచనమును (39వచ.1స్కం.) కలవు. యుద్ధవర్ణనములు బద్ధసమాసములే.

కొమ్మన వచనము సరళము. జక్కన వచనము సరళము కంటె ప్రౌఢము, అనంతామాత్యుని వచనము మఱల సరళము. ఆచ్ఛికపదసంయోజనమే అధికము.

"మఱియు నచ్చిఱుతయెలుక తన తొఱ్ఱటలోనన యుండి వెలుపలికిఁ దన మూతి సాఁపుచుఁ దల చూపి మఱలం దిరుగుచు నర్ధశరీరంబు దోఁప నిగుడి మగుడుచుం బుచ్ఛంబునుం దక్క దక్కటి శరీరం బంతయు బయలుపడ నించుకసేపు కంపంబు నొందుచు నుండి యుండి మఱచి తలఁచి నట్లుదరిపడి తిరిగి తొఱ్ఱ చొచ్చుచు వెండియు నుండలేక వెలువడి శాఖామార్గంబునం గొంత దవ్వరిగి ........ అలంతిపూస లంటించినట్లు దనరు కనుంగ వయును నుచ్చింతపువ్వులలోని కేసరంబుల క్రియ భాసురంబగు పలువరుసయుఁ దన వయోరూపంబున కనురూపంబు లగుచుం డఁ జెలంగి సెలగొమ్మలెక్కి వ్రేలుచు బలిష్ఠంబులగు తిర్యక్శాఖ లపైఁ ద్రుళ్లగింతలు వెట్టుచు నాకుజొంపంబుల సొచ్చి దాఁగుచు నిటు బహువిధంబుల విహరించుచుండ" 4ఆ.భో.రా.

దూబగుంట నారాయణ వచనము సరళము. దగ్గుబల్లి దుగ్గన వచనము సరళము. వచనసంకీర్తనమును కలదు. (28వచ.3ఆ.) వల్లభామాత్యుని వచనము సరళము. ప్రౌఢమును. నంది మల్లయ, ఘంట సింగనల వచనమును సరళము. ప్రౌఢమును. వచనాంతర్గతవచనసంకీర్తనములు కలవు. (45,97వచ.5ఆ.వ.పు.) సంస్కృతప్రబోధచంద్రోదయమునందు "జయజయభగవాన్ .... తుభ్యం నమః" అను గద్యము కలదు. (4అం.) గాని, తెలుగు ప్రబోధచంద్రోదయమునందు వచన సంకీర్తనము లేదు. వెన్నెలకంటి అన్నయ వచనము సరళము. కొఱవిగోపరాజు వచనము సరళము. మొల్ల వచనము చూర్ణిక వినా సరళము.

# అనుబంధము -2

# సంస్కృతభీమఖండము - సంస్కృతీకరణము

శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు "-సపాదలక్షగ్రంథంబై యైదు పదులు ఖండంబులతో సంధిల్లు", "స్కాందపురాణసారమగు శ్రీగోదావరీఖండమున్ బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీభాషాప్రబంధంబుగన్" అని బెండపూడి అన్న యామాత్యుడు పలికినట్లు కలదు. (26,27ప.1ఆ.)అంతేకాదు. "సపాదలక్షగ్రంథ సంఖ్యాసమన్వితంబై పంచాశత్ఖండమండితంబై బహుసంహితాసమాకీర్ణంబై యొప్పు శ్రీమహాస్కాందంబునందు గోదావరీఖండంబు శ్రీమద్దక్షారామభీమేశ్వర మాహాత్మ్యసంయుతంబగుటంజేసి భీమేశ్వరపురాణంబనం బరఁగు; నది యాంధ్ర భాషాప్రబంధంబుగఁ జెప్పం దొడంగితి" నని శ్రీనాథుని ఉపక్రమణము కలదు. (30వచ.1ఆ.) "-గోదావరీఖండంబునందుఁ జెప్పంబడిన భీమఖండంబు భీమేశ్వర మాహాత్మ్యంబును, భీమేశ్వరపురాణంబనం బరఁగు"నని శ్రీనాథుని ఉపసంహారమునందు కలదు. (107వచ.6ఆ.) ఉపక్రమణమునందు గోదావరీఖండమే భీమ ఖండమని కలదు. ఉపసంహారమునందు గోదావరీఖండమునందు భీమఖండము భాగమని కలదు. అది ఏకఖండము. ఇది అవాంతరఖండము. అయినను భీమేశ్వర పురాణము ఆంధ్రీకరణమని శ్రీనాథుని స్వవచనము. కాని,

"శ్రీనాథుఁడే సంస్కృతగ్రంథమును గూడఁ గల్పించెనని యొక కింవదంతి కలదు. అది సత్యము కాకపోవచ్చును ....... కింవదంతియే నిక్కమగునేని యీ (మఱొక) నిర్ణయము నిలువఁజాలకపోవును" అని ఒక అభిప్రాయము కలదు[328]. "భీమఖండాన్ని సంస్కృతములో కూడ శ్రీనాథుడే రచించాడేమోనని నేనప్పు డపుడు అనుకొంటూ ఉంటాను." అని మఱొక అభిప్రాయము కలదు[329]. "సంస్కృతభీమఖండము శ్రీనాథోపజ్ఞమే" అని ఇంకొక అభిప్రాయము కలదు[330]. "సంస్కృతమూలమును గూడ శ్రీనాథుఁడే తెలుఁగు కృతిని బట్టి వెలయించెననెడి వాదములో సత్యమేమియు లేదు." అని వేఱొక అభిప్రాయము కలదు[331]. "సంస్కృతభీమఖండమే సర్వథా మూలము" అని కొండొక అభిప్రాయము

కలదు[332]. ఇవి ఔగాములు కలవి[333].

అసలు స్కాందపురాణము అఖండము. నేపాలులో లభించిన, గుప్తుల నాటి లిపిలోని ప్రాచీనతరమైన స్కాందపురాణభూర్జపత్రప్రతియందు ఖండవిభాగము లేదు[334]. అనంతరము స్కాందపురాణము సప్తఖండసమన్వితమైనది[335]. అది ఏకాశీతిసహస్రగ్రంథసంఖ్యమని బ్రహ్మవైవర్తపురాణమునందు కలదు. అదే సంఖ్యను, "తత్ర ఖండాః సప్తైవ పరికీర్తితాః" అని బృహన్నారదీయపురాణమునందు కలదు. సప్తఖండములందు ఒకటైన ప్రభాసఖండమునందు "మండితం సప్తభిః ఖండైః స్కాందం"అని కలదు. సప్తఖండములు 1. మాహేశ్వరఖండము. 2. వైష్ణవఖండము, 3. బ్రహ్మఖండము, 4.కాశీఖండము, 5. అవంతీఖండము, 6. నాగరఖండము అని కూడ అందు కలదు. రేవాఖండాదులు అవాంతరఖండములు. అరుణాచల మాహాత్మ్యాదులు అవాంతరఖండప్రాయములు. అవి, ఇవి కలిపి ఇరువది మూడు కలవు. తదుపరి స్కాందపురాణము ఏకలక్షగ్రంథపరిమాణకలితమైనది. పంచాశత్ఖండమండితమైనది. శ్రీనాథుని కాశీఖండమునందు (71ప.1ఆ.) శివరాత్రి మాహాత్మ్యమునందును (47ప.1ఆ.) అట్లే కలదు. కాశీఖండమునందు ఏకవీరా ఖండము, మైలారఖండము, గోదావరీఖండము ప్రసక్తములైనవి. (80వచ.1ఆ.) ఏకలక్షగ్రంథపరిమాణకలితమైన, పంచాశత్ఖండమండితమైన మహాస్కాందములోని కాలికాఖండమునందు ఏబది ఖండముల పట్టిక కలదు[336]. అందు ఆంధ్ర దేశీయమైన శ్రీశైలఖండము కలదుగాని, ఆంధ్రదేశీయములైన ఏకవీరాఖండము, మైలారఖండము, గోదావరీఖండము లేవు. భీమఖండమును లేదు. కాని భీమేశ్వర ఖండమని కుమారసోమపీథి రత్నాపణమునందు కలదు. "స్కాందపురాణే భీమేశ్వరఖండే."

భీమఖండము ప్రథమతః 1879 వ సంవత్సరమునందు, తదుపరి 1943వ సంవత్సరమునందు ముద్రితమైనది. రెండు ముద్రణములును తెలుగులిపియందు దాక్షారామప్రాంతీయులు ప్రకటించినవి. అందు గోదావరీఖండమను మాటలేదు. భీమేశ్వరఖండమను మాట కూడ లేదు. "ఇతి శ్రీస్కాందపురాణే భీమఖండే" అని మాత్రమే కలదు. అట్లే కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందు తాళపత్రగ్రంథము కలదు. అది 1962 వ సంవత్సరము నాటికి పచ్చిదనము తరుగనిది పచ్చదనము సురుగనిది. 1879 వ సంవత్సరము కంటె ప్రాచీనము కాదు. పరమార్వాచీనము. ఇది శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతీకరణముగ కలదు.

శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు ప్రయుక్తములైన శ్రీనాథుని ప్రియతమపదములు పదబంధములు, సమాసములు- హేల, హేవాకము, ప్రౌఢిమ,

కుచకుంభపరిరంభము, పాణింధమము, నైపథ్యము, చక్రవాళము, ప్రాహుణకము, పాథేయము, షాడబము, కటాహము, ధూళిపాళి, ఘుసృణము, లీలాస్వయంవరము, ఛాయాదాయాదము, నూపురఝుళంఝుళనాదము, పుంస్కోకిలకుహూకారము, ప్రాసాదపంచాక్షరి, గమికర్మీభూతము మొదలైనవి - సంస్కృతభీమ ఖండమునందు ప్రయుక్తములు కాలేదు[337]. సంస్కృతభీమఖండము శ్రీనాథకృతమైనచో ప్రయుక్తము లగును. కాలేదు. కాఁబట్టి సంస్కృతభీమఖండము శ్రీనాథ కృతము కాదు. కాని, సంస్కృతభీమఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతీకరణమనుటకు కవితాసాక్ష్యము, చారిత్రికసాక్ష్యము సమృద్ధిగ కలదు.

## కవితాసాక్ష్యము

ఆంతరంగికమైన సాధనసంపత్తి కవితాసాక్ష్యము[338].

I. నుడికారములు భాషకు సహజభూషణములు. ఒక భాష నుడికారము మఱొక భాషకు కృతకము. తెనుగు నుడికారములు సంస్కృతభాషకు ఎరువు సొమ్ములు. అకారణముగ తెనుగు నుడికారములు సంస్కృతభాషయందు ఉండుట అసంభవము. అట్టిది శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని ఆనాటి తెనుగు నుడికారములు అదే స్థలములందు సంస్కృత భీమఖండమునందు కలవు.

1. "ముగురం గూర్చిన ముండదైవము" ఇది దయనీయస్థితిని "ముగ్గుర్ని కూర్చేడు ముండాదేవుడు" అను తెలుగు వాడుక మాటకు గ్రాంథికరూపము. ఇట్లు శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు, జక్కన విక్రమార్కచరిత్రమునందు (80ప. 8ఆ.) కలదు. శ్రీనాథుని తెనుగు నుడికారము సంస్కృతభీమఖండమునందు కలదు.

"ముగురం గూర్చిన ముండదైవమునకున్ మోమోట లేదో సుమీ"
6ప.3ఆ.

"త్రీ నేతా న్యోజితవతో దేవస్య ను కృపా న కిమ్." 47శ్లో.7అ.

2. "రాకింతుఁ జుమీ మొగంబు రాచట్టుపయిన్" ఇది ఉద్రేకస్థితిని "ముఖాన్ని రాతిని పెట్టి రాస్తాను" అను తెలుగు వాడుక వాక్యమునకు గ్రాంథికరూపము.

"పోక నడగొట్టితేనియు
రాంకింతుంజుమీ మొగంబు రాచట్టుపయిన్." 154ప.2ఆ.

"... ... ... త్వం స్థాతు మిచ్ఛసి
లపనం తవ పాషాణే పీడయిష్యామి పశ్య మాం." 27శ్లో. 7అ.

ఇందు ముఖమునకు లపనమనుట్లు అప్రసిద్ధవ్యవహారము. పాషాణమునందు పీడింతుననుట పరమకృతకము.

3. "కుడిచి కూర్చుండి" ఇది "తిని, కూర్చుని" అను ఇప్పటి వాడుకకు అప్పటి గ్రాంథికరూపము. కడుపునిండ భుజించి, హాయిగా కూర్చుండి అని కాదు అర్థము. వట్టినే, ఊరక, నిర్నిమిత్తముగ అనుటకు నుడికారము. ఇట్లు శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినిభారతమునందు (68ప.1ఆ.) కలదు. శ్రీనాథుని తెనుగు నుడికారము సంస్కృతభీమ ఖండమునందును కలదు.

"కుడిచి కూర్చుండి మీరేల కొఱఁతయైన
కుమ్మలాడెద రో యన్నదమ్ములార" 53ప.4ఆ.
"భుక్త్వోపవిశ్య దాయాదా స్సదా యూయం మదాకులాః"
47శ్లో.15అ.

ఇందు కుడిచి అను పదమునకు 'భుక్త్వా', కూర్చుండి అను పదమునకు 'ఉపవిశ్య' అని మక్కికి మక్కి అనువాదము కలదు. నిర్నిమిత్తముగ అని నిష్పన్నము కాదు.

4. "మాటలు వేయునేల?" ఇది "వెయ్యిమాటలెందుకు" అను తెలుగు పలుకు బడికి గ్రాంథికరూపము. ఇట్లు సంస్కృతభాషయందు పలుకుట అప్రసిద్ధము. "అలం వచోభి ర్బహునా", "కిం బహునా భాషణేన" అని పలుకుట సుప్రసిద్ధము. సహస్రమనుట సంస్కృతపద్ధతి కాదు. అయినను సంస్కృత భీమఖండమునందు కలదు.

"మాటలు వేయియు నేటికి?" 54ప.6ఆ.
"వచసా కిం సహస్రేణ?" 44శ్లో.30అ.

ఇట్లు శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని తెనుగునుడికారములు సంస్కృత భీమఖండమునందు కలవు గావున, శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృత భీమఖండము సంస్కృతీకరణమగుటకు సాధకము.

ఆంధ్రుడైన సంస్కృతభీమఖండకర్త తెనుగునుడికారములను ముందే ప్రయోగించెననుట సంగతము కాదు. కారణము సంస్కృతభీమఖండములోని తెనుగు నుడికారములు బలవంతపు భాషాంతరీకరణములు. కృతకములు. అన్యస్థలములందు లేవు. అవి ఉన్న స్థలములందు సంస్కృతీకరణములే.

II. సంస్కృతసమములు కొన్ని అర్థవిపరిణామమునందుట ఆంధ్రభాషయందు కలదు. విపరిణతార్థము సంస్కృతభాషయందు సముపపన్నము కాదు. ఉదాహరణమునకు శోభనమను శబ్దమున్నది. శోభించునది అని మాత్రమ్మే సంస్కృత భాషలోని అర్థము. తెలుగుభాషలో గర్భాధానమని విపరిణతార్థము కలదు. అది సంస్కృతభాషలోని అర్థము కాదు. సంస్కృతభాషయందు విపరిణతార్థమున ప్రయుక్తము కాదు. ఆంధ్రభాషలోని విపరిణతార్థమున సంస్కృతసమమును ప్రయోగించిన సందర్భము భీమఖండమునందు కలదు. అది కూడ అసంగతముగ.

"వండిన చొప్పు ఏనుం బొగపు వాసనయుం బొగ పాఱు చందమున్
భాండసమృద్ధిసంపదయుఁ బాకవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్త ప్రియమాడెడు నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె నసితోత్పలగంధియు నేమి మాయయో"

130ప.2ఆ.

ఇది శ్రీనాథుని పద్యము. ఇందు "వండిన గుర్తు, పోపు వాసన, పొగ జాడ, పాత్రల సందడి, పాకవిభూతి సర్వమంగళ"మని కలదు. సర్వమంగళ మనగా సంస్కృతమునందు సర్వము శుభమనియే అర్థము. తెనుగునందు లేదు అని విపరిణతార్థము. విపరిణతార్థమే. పద్యమునందు వివక్షితము.

"న దృశ్యతే పాకచిహ్నం న చ భక్ష్యాది వాసనా
న చ ధూమ స్తథా భాణ్డసమృద్ధి ర్నచ కస్యచిత్
సర్వం భద్రమిదం దేవీ వ్యర్థమేవం ప్రియం బత
బ్రవీ త్యస్మి న్నవసరే భోజనం నేతి తర్క్యతే." 49,50శ్లో.6అ.

ఇవి సంస్కృతభీమఖండములోని శ్లోకములు. ఇందు "పాకచిహ్నము కనబడుట లేదు. భక్ష్యాదుల వాసనలేదు. పొగ లేదు. భాండసమృద్ధి లేదు. మఱి యేమియును లేదు. సర్వము భద్రము" అని కలదు. పాకచిహ్నము లేక, భక్ష్యవాసన లేక, పొగ లేక, ఏమియును లేక సర్వము భద్రమనుట సంగతము కాదు.

"అభద్రం భద్రమితి బ్రూయాత్" అని కలదు."న దృశ్యతే పాక చిహ్నం, న చ భక్ష్యాదివాసనా, న చ ధూమః, న చ కస్యచిత్" అని నాలుగు నకారములు ప్రయోగించి , సర్వము భద్రమనుట అసందర్భము. "బియ్యము లేవు" అనుటకు "బియ్యము" "నిండుకొన్నవి" అన్నట్లు "అన్నియును లేవు" అనుటకు "లేదు" అను మాట లేకుండ "సర్వం భద్రమ్" అనవలయును. అట్లు శ్రీనాథుని పద్యమునందే కలదు. సంస్కృతభీమఖండశ్లోకములందు లేదు. కాఁబట్టి శ్రీనాథుని

పద్యములోని "సర్వమంగళ" శబ్దవిపరిణతార్థమును గాని, విశేషార్థమును గాని గమనింపకుండ "సర్వంభద్రమిదం" అని, సంస్కృతభీమఖండకర్త పర్యాయపద కల్పనము చేసినట్లు స్వయంవేద్యము. ఇది కూడ శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు సాధకము.

III. శ్రీనాథుడు భీమేశ్వరపురాణము రచించుటకు పూర్వము సంతరించిన శృంగారనైషధమునందు, హరవిలాసమునందును ఇట్లు కలదు.

"పాకశాసనపావకపరేతరాజపాశపాణులు" 18వచ.4ఆ.శృం.నై.

"పాకశాసనుండు పావకుండు పరేతపతి పాశహస్తుండు పంచముండనైన యేను నియ్యేవురముం బాండవులు పాంచాలినిం బోలెం బంచికొని యనుభవింతము గాని యప్పంకజాక్షిం బట్టికొని వత్తునే యని పరమకపటోపాయమాయా ప్రయోగపరిపాటీపాటవంబు దేటబడ బహుప్రకారంబులం బలికిన" 103వచ.7ఆ.శృం.నై.

"పాకశాసనపావకపరేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యపన్నగాభరణులం బరిభవించి" 9వచ.3ఆ.హర.వి.

భీమేశ్వరపురాణము తర్వాత రచించిన కాశీఖండమునందు ఇట్లు కలదు.

"పాకశాసనపావకపరేతరాజపలలాశిపాశిపవనపౌలస్త్యులు పరమహర్షంబున" 9వచ.3ఆ.

భీమేశ్వరపురాణమునందు ఇట్లు కలదు.

"పాకశాసనపావకపరేతరాజపలలాశి[పాశి]ప్రాచేతసపవనపౌలస్త్య పశుపతిప్రధానులగు వేల్పులు" 47వచ.4ఆ.

ఇందలి పకారపౌనఃపున్యము శ్రీనాథుని స్వీయకవిత్వము. ఇది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు అనుసరించినది. అది పూర్వోదాహృతము. ఇటు సంస్కృతభీమ ఖండమునందు ఇట్లు కలదు.

"మరుత్వా న్మారుతసఖో మార్తండి ర్మనుజాసనః
మకరాలయనాథశ్చ మరు న్మారారిబాన్ధవః" 30శ్లో.15అ.

ఇందలి మకారపౌనఃపున్యము శ్రీనాథుని పకారపౌనఃపున్యమునకు ప్రతిద్వంద్వికల్పనము. శ్రీనాథుని పకారాదిశబ్దములు ప్రసిద్ధములు. సంస్కృతభీమఖండములోని మకారాదిశబ్దములు - మరుచ్ఛబ్దము వినా - అప్రసిద్ధములు. కల్పితములు. ప్రయత్నపూర్వకమైన మకారపౌనఃపున్యము.

అప్రయత్నసిద్ధమైన పకారపౌనఃపున్యమునకు అనుకరణము. ఇది కూడ శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతభీమఖండము సంస్కృతీకరణ మగుటకు సాధకము.

IV. గృహయాళుశబ్దము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు గ్రహయాళుశబ్దముగ ప్రయుక్తము. అది సంస్కృతభీమఖండమునందు కలదు.

"- వేమాఱుం గలశీతనూభవవధూవేణీభరాంతఃప్రసూ
నామోదగ్రహయాళువుల్ పొలసె దక్షారామమధ్యంబునన్"

95ప.5ఆ.

"కలశీసంభవసతీకబరీపరిశోభినాం
నలినీనాం ప్రసూనానామామోదగ్రహయాళవః" 6శ్లో.25అ.

గృహయాళుశబ్దము వ్యాకరణసిద్ధము. గ్రహయాళుశబ్దము వ్యాకరణసిద్ధము కాదు. శుద్ధము కాదు. ప్రసిద్ధమును కాదు. శ్రీనాథుని ప్రయోగము పెద్దన అనుసరించినది. (38ప.4ఆ.మ.చ.) శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు వలె సంస్కృతభీమఖండమునందు కలదు. కారణము శ్రీనాథుని ప్రయోగమే కావలయును. ఇది కూడ శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు సాధకము.

V. శ్రీనాథుని భీమేశ్వరపురాణము తొలి ముద్రణములందు ఇట్లు కలదు.

"మగఁ టిమిఁ జెంద్రగుజ్జరస మంటిన వామపదాంబుజంబుపై
నిగళము నా సురాసురవినిర్జితమౌ బిరుదందె ఘల్లనం
బొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడ చొళ్ళియంబునన్
నిగిడిచి వీరభద్రుఁ డు చనెన్ శశిమౌళి సమీపభూమికిన్."

112ప.5ఆ.

ఇందు మొదటిపాదము సరిగా లేదు. మలిముద్రణములందు "చెంద్ర" బదులు "చంద్రు"అని మాత్రమే కలదు. కూచిమంచితిమ్మన సర్వలక్షణసారసంగ్రహమునందు "చంద్రుగుడ్డరకమట్టిన" అని కలదు. అది కూడ సరియైన పాఠము కాదు. "చంద్రు గుజ్జుఱుక మట్టిన" అని కవిపాఠము. "కొసర కెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున నుడురాజు పొట్ట గుజ్జుఱకనూఁదె" అని శ్రీనాథుని ప్రయోగాంతరము. (32ప.3ఆ.కా.ఖం.) ఇది సంస్కృతభీమఖండమునందు ఇట్లు కలదు.

"వామపాదే సుధాధామకళంకాగమకారణే
మంజీరలిఖితాశేషసురాసురవిరాజితే -" 43శ్లో.25అ.

ఇందు వీరభద్రుని వామపాదము చంద్రునికి కళంకము వచ్చుటకు కారణమని కలదు. అట్లు ప్రసిద్ధము కాదు. మగతనము కొలది చంద్రుని గుజ్జు - పొట్టలోని గుంజు- పైకి ఉఱుకునట్లు -ఊడిపడునట్లు మట్టినట్లు-ఎడమకాలితో త్రొక్కినట్లు-కలదు. అది బిరుదందెకు కారణము. ఇది తెలుగుదనము తేజరిల్లునది. చంద్రకళంకాగమకారణమనుటకు హేతువు, శ్రీనాథుని పద్యములోని తెలుగుపలుకుబడి అర్థము కాని సంస్కృతీకరణము కావలయును. ఇది కూడ శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు సాధకము.

VI. అసలు సీసము శ్రీనాథుని హాసము. అందు సీసపద్యరూపాంధ్రీకరణము హేలావిలాసము. కనీసమొక సీసపాదమైన స్వతంత్రరచనమగుట విశిష్టత. వరుస శ్లోకముల వంతపాటు లేకపోవుట ప్రత్యేకత. శృంగారనైషధ, హరవిలాస (గౌరీకల్యాణ) కాశీఖండ, శివరాత్రిమాహాత్మ్యము లిందుకు నిదర్శనములు. ఇందుకు భీమేశ్వరపురాణములోని సీసపద్యములు భిన్నము. సంస్కృత భీమఖండమునకు సంవదించు సీసపద్యములు నూటపదియేను కలవు. అందు డెబ్బది సీసపద్యములు అచ్ఛముగ వంతపాటలు. మఱి పదియేను సీసపద్యములు ఇంచుమించు వంతపాటలు. మొత్తము ఎనుబదియైదు. అవి, ఇవి పరికించిన శ్రీనాథుని సీసపద్యములే సంస్కృతభీమఖండశ్లోకములయినట్లు స్పష్టమగును. వంతపాటు లక్షణమేగాక, సంస్కృతీకరణచిహ్నమును కల సందర్భములును కలవు.

1., "భవు భవానీభర్త భావసంభవవైరి
భవరోగభంజను భాలనయను
భోగప్రదుని భోగి భోగిరాజవిభూషు
భూనభోభివ్యాప్తు భువనవంద్యు
భగవంతు భర్గుని భసితాంగరాగుని
భానుకోటి ప్రభాభాసమాను
భాగీరథీమౌళి భగదృగ్విపాటను
భూరథాంగుని భద్రభూతిధరుని
భామినీసువిలాసార్ధవామభాగు
భక్తితోడ భజింపరో భవ్యమతులు
భావనాభాజుల కతండు ఫలము లొసఁగు
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు" 83ప.3ఆ.

"భవం భవానీభర్తారం భావసంభవభంజనం

భవరోగాగదంకారం భాలాక్షం భోగమోక్షదం॥ 57

భుజంగభూషణం భర్గం భానుకోటిసమప్రభం
భగవంతం భూషితాంగం భగనేత్రవిపాటనం ॥ 58

భద్రదం భువనస్తుత్యం భక్తాభీష్ఠఫలప్రదమ్
భస్మాంగరాగదీప్తాంగం భూతేశం భూరివిక్రమం ॥ 59

భాగీరథీచారుమౌళిం భారతీపతిసేవితం
భామాసేవితవామాంగం భీమనాథం భజామ్యహం ॥ 60

భక్త్యా భజత భూయస్యా భీశాంత్యై భవ్యబుద్ధయః
భావనాతీతభద్రాణి భవంతి భజతాం భువి" 61శ్లో.10అ.

శ్రీనాథుని సీసపద్యములోని భకరావృత్యనుప్రాసము తెలుగు కావ్యమునకు సహజము. సీసపద్యమునకు అనుగుణము. సంస్కృతభీమఖండశ్లోకములలోని భకారవృత్యనుప్రాసము సంస్కృతపురాణమునకు సహజము కాదు. శ్లోకములకు అనుగుణము కాదు. పద్యపాదములందు అచ్చుల క్రమము కలదు. శ్లోకచరణములందు అచ్చుల క్రమము లేదు. పద్యములోని "భోగప్రదుని ... భోగిరాజవిభూషు" అక్షరమైత్రికి అనుగుణము. రెండు శ్లోకముల ఆద్యంతములందు "భోగమోక్షదం, భుజంగభూషణం" వృత్యనుప్రాసమునకే అనుగుణము కాదు. అక్షరమైత్రి అనావశ్యకము. పద్యములోని నాలుగు మీది సీసపాదములందును క్రియాపదము లేదు. శ్లోకములోని ఏడు చరణములందును క్రియాపదము లేదు. పద్యమునందు క్రియాపదములు కల స్థలములందే శ్లోకములందును క్రియాపదములు కలవు. "భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు" అని శృంగారనైషధమునందు (203ప.8ఆ.) హరవిలాసమునందు (3ప.1ఆ.) శ్రీనాథుని పూర్వప్రయోగములు కలవు. అది పై సీసపద్యమునందును కలదు. దానికి ప్రతిద్వంద్విప్రాయముగ "భావనాతీతభద్రాణి భవంతి భజతాం భువి" అని పయి శ్లోకములందు కలదు. అయిదు శ్లోకములకు పయి సీసపద్యము వంత పాటుగ కలదు. అది శ్రీనాథుని సీసపద్యరచనాపద్ధతికి విరుద్ధము. శ్రీనాథుని సీసపద్యమే అయిదు శ్లోకములయినట్లు అనుమేయము.

"త్ర్యంబకాచలశిఖాగ్రమునందు నుదయించి
పొదలి యార్యావర్తభూమి దఱిసి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి

పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తీరసోమేశు మందిరము డాసి
యేచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖక్షేత్రంబుఁ గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టి కొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గ్రాఁగిలించె" 21ప.3ఆ.

2. "త్ర్యంబకాద్రిశిఖోద్భూతా ప్రాప్తార్యావర్తమేదినీం
దండకారణ్యవసుధామధ్యమార్గ ముపేయుషీ ॥ 41

తరంగతాడితప్రస్థం కృత్వా ప్రస్రవణాచలం
దృష్ట్వా శ్రీపట్టిసస్థానవీరభద్రం మహాప్రభుం॥ 42

తీరసోమేశ్వరాగారసమీపధరణీం గతా
సంప్రాప్యానంతభోగేశస్థానాఖ్యాసవసుంధరాం. 43
రుద్రపాదస్థలం స్పృష్ట్వా కోటిపల్లీపురేశ్వరం
శ్రీ సోమనాయకం నత్వా కుండలాముఖతీర్థభాక్ 44

వామభాగసముద్దామభీమమండలశోభితా
పావనీగౌతమీగంగా ప్రావిశల్లవణాంబుధిం" 45శ్లో.8అ.

శ్రీనాథుని సీసపద్యములోని మీదినాలుగు సీసపాదములందు పాదమునకు రెండుచొప్పున ఎనిమిది అసమాపక్రియలు కలవు. ఎత్తుగీతములోని మూడు పాదములందు పాదమునకు ఒకటి చొప్పున మూడు అసమాపకక్రియలు కలవు. మొత్తము పదొకండు. పదకొండు అసమాపకక్రియలకు ఒక సమాపకక్రియ పద్యాంతమునందు కలదు. ఇట్లుండుట శ్రీనాథుని సీసపద్యరచనాపద్ధతికే కాదు; అసలు సీసపద్యరచనాపద్ధతికే అత్యంతసహజము. అయిదు శ్లోకములలోని తొమ్మిది చరణములందు తొమ్మిది అసమాపకక్రియలు, ఒక సమాపకక్రియ కలవు. ఇట్లు శ్లోకములు కుళకమైనను సంస్కృతశ్లోకరచనాపద్ధతికి సహజము కాదు. అంతే కాదు. సీసపద్యమునందు కాలాంతరసంక్రాంతములైన రెండు లేఖకపాఠకప్రమాదములు కలవు. అవి కూడ పయి శ్లోకములందు కలవు. 1. పద్యమునందు పట్టిసశ్రీవీరభద్రేశుడని కలదు. పట్టిసక్షేత్రములోని వీరభద్రుడని అర్థము. అది పట్టి సమని అర్వాచీనవ్యవహారము. అసలు పట్టిసము కాదు. పట్టసము. పట్టసక్షేత్రము.

"దక్షిణానందవిపిన మధ్యంబునందుఁ
గ్రతువిధిధ్వంసవేళ దేవతల నఱికి
వీరభద్రేశుఁ డీ యద్రి వెన్నుఁ దన్ని
గౌతమీవారిఁ దనవాలు గడిగినాఁడు." 30ప.3ఆ.

అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. వాలు అనగా పట్టసము. అది కడిగిన చోటి క్షేత్రము పట్టసక్షేత్రమగును గాని, పట్టిసక్షేత్రము కాదు. పద్యము నందలి పట్టిసశబ్దము లేఖకప్రమాదము. అది సంస్కృతభీమఖండమునందు కలదు. కావున సంస్కృతభీమఖండము కాలాంతరమునందు సంస్కృతీకరణము కావలయును.

2. పద్యమునందు "తీరసోమేశు మందిరము డాసి" అని కలదు. ఇది "తిల సోమనాథు నంఘ్రులకు నెరఁగి" అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. (16ప.3ఆ.) పట్టసక్షేత్రమునకు దిగువను గోదావరీనదికి పశ్చిమదిశను కల తాళ్ల పూడికి తిలతీర్థమని శాసనములందు కలదు[339]. అచటి సోమనాథుడు తిలసో మనాథుడు. తీరసోమనాథుడు, తీరసోమేశుడు కాడు. "తిలసోమనాథుని మంది రము డాసి" అని కవిపాఠము. "తీరసోమేశు మందిరము డాసి" అని పాఠక ప్రమాదము. అది సంస్కృతభీమఖండమునందు కలదు. కావున సంస్కృత భీమఖండము కాలాంతరమునందు సంస్కృతీకరణము కావలయును.

"భీమమండలి డాపలఁ బెట్టు కొనుచు" అను పద్యపంక్తి సహజము. "వామభా గసముద్దామభీమమండలశోభితా" అంత సహజము కాదు. కొంత కృతకము.

3. "భీమేశ్వరేశ్వరశ్రీమహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావరసలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టుమాలెలోఁ దిరమైన గణపతి
యేకాంతడుంఠివిఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశుఁ డూ
హింపంగ దండపాణీశ్వరుండు
భైరవస్వామి శ్రీకాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి నందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము గాదె
తీవ్రకరతేజ! సత్యవతీతనూజ! 31ప.3ఆ.

"శ్రీభీమనాయకస్వామీ భగవా న్విశ్వనాయకః

సప్తగోదావరం తీర్థం సాక్షా జ్జహ్నుతనూభవా 59
విఘ్నాధినాయకో దేవో డుండీదంతావళాననః
దక్షిణే దండపాణీశో దండపాణీశ్వర స్స్వయం 60

పాతాలభైరవస్వామీ తథా శ్రీకాలభైరవః
నందికేశ స్స ఏవాయం నందికేశో న సంశయః61

దక్షవాటీనగర్యేవ కాశికా నగరీ న కిం
జగతీవిశ్రుతోదారమతే సత్యవతీసుత" 62 శ్లో.8అ.

శ్రీనాథుని సీసపద్యములోని "తీవ్రకరతేజ! సత్యవతీతనూజ!" అను సంబుద్ధులు సీసపద్యమునకు సహజము. సీసపద్యశతకమకుటసదృశము. శ్లోకములలోని "జగతీవిశ్రుతోదారమతే సత్యవతీసుత" అను సంబుద్ధులు శ్లోకసంపుటికి కృతకము. శ్లోకసంపుటికి సీసపద్యము తెనుగుసేత కాక, సీసపద్యమునకే శ్లోకసంపుటి సంస్కృతీకరణముగ కలదు. ఇట్లు నూటపదియేను సీసపద్యములందు ఎనుబదియైదు సీసపద్యములకు సంస్కృతభీమఖండములోని శ్లోకసంపుటములు కలవు. సంవాదమిది సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు ప్రబల సాధకము.

VII. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు సీసపద్యము వలె సుదీర్ఘవచనములు కలవు. అవి సహజసుందరములు. వానికి సంవదించు సంస్కృతభీమఖండములోని శ్లోకసంపుటములు సహజతాదూరములు.

"ఇవ్విధంబున భీమనాథుండు త్రిపురదమనారంభ సంరంభంబున శాతకుంభకుంభినీధరకోదండం బుద్దండభుజదండచండిమంబునం గడుసుపడం దిగిచినఁ దత్సమాకృష్ట భారంబున భుజంగపుంగవుండు వేయిపడగలును విషంబుఁ గ్రక్కదృక్కర్ణవదననాసారంధ్రసముదీర్ణసముద్భవంబయిన యక్కాలకూటవిషంబు కృపీటభవజిహ్వాకలాపంబులు గ్రోయుచుఁ దోయధి మథనంబున సంభవించిన హాలాహలంబునుంబోలెఁ బ్రజ్వరిల్లి సముజ్జ్వల జ్వాలాజాలంబులఁ ద్రైలోక్యంబు నాక్రమింపం దొణంగినం దెగయుడిపి ఖట్వాంగ పాణి యుత్తమాంగంబు జాడించి గంగాంభఃప్రవాహనిర్ఝరవారిపూరంబులు చల్లియు వామలోచనహిమధామకిరణవ్రాతంబులం బ్రోక్షించియు నమ్మహోపద్రవం బుపశమింపంజేసి దుర్గాసహాయుండును విఘ్నరాజప్రసాదోపలబ్ధసంభావితుండును నై విషమలక్ష్యంబులైన త్రిపురంబులు

వీక్షించి వెండియు నాదినారాయణునిం బురాణపురుషునిం బురుషోత్తము ననాదినిధనుని బాణంబు చేసి యురింబోసి పాశుపతాస్త్ర సమంత్రకంబుగా నభిమంత్రించి యాకర్ణాంతంబుగా దిగిచి లలాటేక్షణజ్వాలాజాలంబు మునుముట్ట నిగిడించి బిట్టు హుంకరించి యట్టహాసంబు చేసి యేసిన నమ్మహాస్త్రంబు." 139వచ.4ఆ.

"ఇత్థం శ్రీభీమనాథేన భువనైకధనుర్భృతా
పురాసురవధారంభే నిర్భరోత్సాహశాలినా ॥ 28

గాఢాకృష్టనగేష్వాసజ్యాభుజంగమపుంగవే
వచనానాం సహస్రేణ వమత్యుగ్రతమం విషమ్ ॥ 29

తదాస్యనాసికారంధ్రసముదీర్ణం తథైధత
దుగ్ధాబ్ధిమథనోద్భూతహాలాహలవిషం యథా ॥ 30

సముజ్జ్వలమహాజ్వాలాజాలజిహ్వానిరర్గళమ్
త్రైలోక్యాక్రమణోదగ్రం బభూవ విషముద్భుతం ॥ 31

విషభృద్భూషణో దేవో విషాగ్నిం లోకభీషణమ్
తం వీక్ష్య తస్మింత్సమయే సమస్తజగదార్తిహృత్ ॥ 32

జటాకలాపం విపులం ప్రసార్య త్వరయాన్వితః
గంగానదీఝరానల్పసలిలప్రోక్షణే న చ ॥ 33

వామలోచనశీతాంశుధామగౌరవచారుణా
స్ఫురత్కటాక్షసంవీక్షాజాల ప్రసరణే న చ ॥ 34

ఉపద్రవస్య మహత శ్శాంతింకృత్వా సదాశివః
దుర్గాసహాయో విఘ్నేశప్రసాదపరితోషితః ॥ 35

దృష్ట్వా విమలకక్ష్యాణి తారామార్గచరాణి చ
లోకోపద్రవ కారీణి పురాణి త్రీణి ఫాలదృక్॥ 36

పురాణపురుషం దేవం నారాయణ మనామయం
మహాత్మానం శరం కృత్వా యోజయిత్వా శరాసనే ॥ 37

స పాశుపతదివ్యాస్త్ర మంత్రేణాదిధనుర్ధరః
అభిమంత్ర్య సమాకృష్య తమాకర్ణాంత మాశుగం ॥ 38

అముంచ దట్టహాసేన కఠోరేణ విజృంభితః

ఫాలనేత్రానలజ్వాలాజాలోజ్జృంభణపూర్వకం ॥ 39శ్లో. 19అ.

శ్రీనాథుని సుదీర్ఘవచనమునందు పందొమ్మిది అసమాపకక్రియలు, ఒక చేదర్థక క్రియ కలవు. ఇట్టి రచనము సుదీర్ఘవచనమునకు సహజము. సంస్కృతభీమఖండ శ్లోకములందు మొదటి మూడు శ్లోకములకు ఒక సమాపకక్రియ, నాల్గవశ్లోకమునందు ఒక సమాపకక్రియ, పంద్రెండవ శ్లోకమునందు ఒక సమాపక్రియ కలవు. పంద్రెండు శ్లోకములందును పదొకండు అసమాపకక్రియలు కలవు. ఇట్టి రచనము సంస్కృతశ్లోకరచనమునకు సహజము కాదు. ఎనిమిది శ్లోకముల కు శకమే ప్రశ్నార్థకచిహ్నాయోగ్యము. సుదీర్ఘవచనములను సంవదించు శ్లోకసంపుటములును శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు సాధకములు.

VIII. శ్రీనాథుని కవితాలక్షణము పూర్వకవితాచర్వణము. అందు సంస్కృతపూర్వకవితాచర్వణము సమధికము. వామనభట్టు వేమభూపాలచరితములోని గద్యపంక్తులకు భట్టుగోపాల, రాజశేఖర, అమరుకవి, పెదకోమటివేమారెడ్డి (సాహిత్యచింతామణి) మయూర, కాళిదాసాదుల శ్లోకములకు చర్వణము మాత్రమేగాక, అనవేమారెడ్డి దృుజ్జవరము శాసనములోని శ్లోకమునకు శ్రీనాథుని రసచర్వణము భీమేశ్వరపురాణము నందు కలదు. అందు వామనభట్టు వేశ్యావర్ణనము రేఖామాత్రముగ (80వచ.6ఆ, 4-11శ్లో.32అ.) కాళిదాసు విష్ణువర్ణనము యథాతథముగ (48ప.4ఆ.34 -40శ్లో.15అ.), దృుజ్జవరము శాసనములోని వసంత వర్ణనము విపులముగ (124ప.5ఆ.72-76శ్లో.25ఆ.) సంస్కృతభీమఖండమునందు కలవు. కాళిదాసు విష్ణువర్ణనమునకు శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి నైషధాంధ్రీకరణపద్ధతిని, కుమారసంభవాంధ్రీకరణపద్ధతిని కుస్తరించునది.

"దైత్యస్త్రీగణ్డలేఖానాం మదరాగవిలోపిభిః
హేతిభి శ్చేతనావద్భిరుదీరిత జయస్వనమ్ ॥ 12

ముక్తశేషవిరోధేన కులిశవ్రణలక్ష్మణా
ఉపస్థితం ప్రాఞ్జలినా వినీతేన గరుత్మతా ॥ 13

యోగనిద్రాన్తవిశదైః పావనై రవలోకనైః
భృగ్వా దీననుగృహ్ణాన్తం సౌఖశాయనికాన్మునీన్ ॥ 14

శ్రియః పద్మనిషణ్ణాయాః క్షౌమాన్తరితమేఖలే
అఙ్కే నిక్షిప్తచరణ మాస్తీర్ణ కరపల్లవే ॥ 8

భోగిభోగాసనాసీనం దదృశు స్తం దివౌకస

తత్ఫణామణ్డలోదర్చి ర్మణిద్యోతితవిగ్రహమ్ ||" 7శ్లో. 10సం. ర. వం.

"దివ్యాయుధము లైదు ధృతచేతనంబులై
శత్రుసంహారంబు సంస్తుతింపఁ
బులుఁగుఱేఁడు కరాబ్జములు రెండు మొగిడించి
భ్రూలతాదేశంబు పొలుపు నరయ
సౌఖశాయనికులై సనకాదియోగీంద్రు
లనురాగవీక్షణం బభిలషింప
నూరురంభాస్తంభయుగళంబుపై నుంచి
లక్ష్మి శ్రీపాదపల్లవము లొత్తఁ
బన్నగాధీశభోగతల్పంబు మీఁదఁ
దత్ఫణారత్నదీప్తి మై తళుకుఁ జూపఁ
బాలమున్నీటిలో నిద్రమేలు కొన్న
హరికిఁ బొడచూప నేతెంచె హరిహయుండు" 48ప. 4ఆ.

ఇటు సంస్కృతభీమఖండమునందు ఇట్లు కలదు.

"దివ్యాయుధై స్సేవ్యమానః పంచభి ర్దృఢచేతనైః
కదనోద్యోగవిద్వేషిజయోద్యోగాభిలాషిభిః || 35

సనకాద్యైః పీయమాన స్సౌఖశాయనికై ర్భృశా
కృపాకటాక్షసంవీక్షాసుధాలహరికాప్లుతైః || 36

కృతాంజలిపుటేనాగ్రే పక్షీంద్రేణ ప్రతిష్ఠితః
ప్రతీక్ష్యమాణభ్రూవల్లీచాలనామోఘశాసనః || 37

ఊరురంభాస్తంభయుగే చరణాంబురుహద్వయం
నిధాయ ప్రియయా దేవ్యా కృతసంవాహనక్రియః || 38

తస్మిన్ క్షీరపయోరాశిశయ్యాగారే మనోహరే
భోగిరాజమహాభోగశయనే శుభ్రరోచిషి || 39

రత్నప్రభాకీర్ణఫణాశ్రేణిచిత్రోపబర్హకే
కమనీయశుభాకారో భగవాన్ దదృశేతరామ్ || 40శ్లో. 15అ.

కాళిదాసు రఘువంశములోని శ్లోకములు, శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని సీసపద్యము పరికించిన ఆంధ్రీకరణమని తెల్లమగును. శ్రీనాథుని భీమేశ్వర పురాణములోని సీసపద్యము, సంస్కృతభీమఖండములోని శ్లోకసంపుటము తిలకించిన సంస్కృతీకరణమని స్పష్టమగును. కాళిదాసు విష్ణువర్ణనమునకు

శ్రీనాథుని విష్ణువర్ణనము క్రమశ్లోకాంధ్రీకరణము కాదు. క్రమశ్లోకాంధ్రీకరణము శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి కాదు. విప్రకీర్ణశ్లోకాంధ్రీకరణమే శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి. శ్రీనాథుని సీసపద్యములోని మొదటి పాదము రఘువంశములోని పండ్రెండవ శ్లోకమును ఉపలక్షించినది. రెండవ పాదము మూడవ శ్లోకమునకు సారము గ్రహించినది. మూడవ పాదము పదునాలుగవ శ్లోకమును మూదలించినది. నాలుగవ పాదము ఎనిమిదవ శ్లోకములోని ఏకదేశమును ప్రపంచీకరించినది. ఎత్తుగీతము ఏడవ శ్లోకమునకు తెనుగుసేత. భృగ్వాదులకు బదులు సనకాదులు అక్షరమైత్రికి ఆవశ్యకము. దివౌకసులు రఘువంశప్రకరణోచితము. హరిహయుడు భీమేశ్వరపురాణసందర్భోచితము. శ్రీనాథుని స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణపద్ధతి శిఖరాయమాణము. ఇక సంస్కృతభీమఖండశ్లోకసంపుటములోని మొదటి శ్లోకమునందు "కదనోద్యోగ విద్వేషిజయోద్యోగాభిలాషిభిః" అను ఉత్తరార్ధము శ్లోకపూరణార్థమైన వివరణము రెండవశ్లోకమునందు "కృపాకటాక్షసంవీక్షాసుధాలహరికాప్లుతైః" అను ఉత్తరార్ధము శ్లోకపూరణార్థమైన దీర్ఘీకరణము. కారణము సీసపాదములలోని అర్ధభాగములు హ్రస్వములు. శ్లోకములలోని ఉత్తరార్ధములు దీర్ఘములు. కాఁబట్టి శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని విష్ణువర్ణనము సంస్కృతభీమఖండములోని శ్లోకసంపుటమునకు ఆంధ్రీకరణము కాదు. సంస్కృతభీమఖండములోని శ్లోకసంపుటమే శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని సీసపద్యమునకు సంస్కృతీకరణము. ఇది సంస్కృతభీమఖండము సంస్కృతీకరణమగుటకు నిర్ధారకసాధనము.

ఇట్లు శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని తెనుగునుడికారములు, అర్థవిపరిణామము, పకారవృత్త్యనుప్రాసము, వ్యాకరణసిద్ధము కాని అప్రసిద్ధశబ్దము, అర్థముకాని అన్యథాకరణము, సీసపద్యరచనాపద్ధతి, వచనరచనాపద్ధతి, పూర్వకవితాచర్వణప్రతిఫలనము కవితాసాక్ష్యముగ సంస్కృతభీమఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతీకరణమగుట తథ్యము.

సంస్కృతాంధ్రభీమఖండములందు సంగ్రహవిస్తరములు, స్వతంత్రకల్పనములు, భ్రమప్రమాదాభాసములు కలవు[340] అవి ఉభయకుశలములు. ఆంధ్రీకరణమైన ఆంధ్రీకరణకర్త వి. సంస్కృతీకరణమైన సంస్కృతీకరణకర్త వి.

# చారిత్రికసాక్ష్యము

## బాహిరమైన సాధనసంపత్తి చారిత్రికసాక్ష్యము [341]

సంస్కృతభీమఖండము దక్షారామక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకమైన పురాణము. అందు ప్రసక్తమైన చరిత్రాంశములు సంస్కృతభీమఖండరచనాకాలమును నిర్ణయించు బాహిరమైన సాధనములు. అవి:

I. సంస్కృతభీమఖండమునందు దక్షారామక్షేత్రమాహాత్మ్యముతోపాటు జగన్నాథక్షేత్ర, కుమారారామక్షేత్ర, సర్పవరక్షేత్రవిశేషములు కలవు. అవి పరిశీలనార్హములు.

దక్షారామక్షేత్రమునందు దైవము భీమేశ్వరుడు. తీర్థము సప్తగోదావరము. సప్తగోదావరీతీర్థభీమేశ్వరుని ప్రసక్తి సంస్కృతకాశీఖండమునందు కలదు.

> "సప్తగోదావరీతీర్థా ద్దేవో భీమేశ్వరప్రభుః
> ప్రకాశతే లిఙ్గరూపీ భుక్త్యై ముక్త్యై ర్నృణామిహ" 119శ్లో.69అ.

సంస్కృతకాశీఖండము పది, పదకొండు శతాబ్దుల గ్రంథము కావచ్చును. పదకొండవ శతాబ్ది ప్రాకృతగ్రంథమైన లీలావతీకథయందు సప్తగోదావరీభీమస్థానము కలదు. సప్తగోదావరీభీమస్థానమునందు రాక్షసవశమునందున్న సింహళరాజకుమారి లీలావతిని శాలివాహనరాజైన హాలుడు రాక్షసుని సంహరించి వివాహమాడెనని కథ. సప్తగోదావరీభీమస్థానప్రసక్తి పదకొండవశతబ్ది చరిత్రాంశమే. భట్టుమురారి అనర్ఘరాఘవమునందును సప్తగోదావరీభీమేశ్వరుని ప్రసక్తి కలదు.

> "విభీ :- (దక్షిణతో దర్శయన్ ప్రణమ్యతా) మయ మన్ధ్ర విషయ లక్ష్మ్యాః సప్తగోదావరీహారకలాపైకనాయకో భగవాన్ భీమేశ్వరః అయం హి" 7అం.

అనర్ఘరాఘవము రచనాకాలము పదకొండవ శతాబ్ది. కావున దక్షారామక్షేత్రము పదకొండవశతాబ్దికి ప్రసిద్ధము కావలయును.

దక్షారామభీమేశ్వరాలయశాసనములందు ప్రాచీనతమశాసనకాలము 1038 వ సంవత్సరము. శాసనస్థకాలములను బట్టి పదకొండవశతాబ్దిని 16, పండ్రెండవశతాబ్దిని 164, పదమూడవశతాబ్దిని 49, పదునాల్గవశతాబ్దిని 4 శాసనములు కలవు. శాసనస్థవిషయమును బట్టి పదకొండవశతాబ్దిని 70, పండ్రెండవశతాబ్దిని 26

పదమూడవశతాబ్దిని 2, పదునాల్గవశతాబ్దిని 2 శాసనములు కలవు. మొత్తము పదొకం డవశతాబ్దిని 16+70=86, పండ్రెండవశతాబ్దిని 164+26=190, పదమూడవశతాబ్దిని 49+2=51, పదునాల్గవశతాబ్దిని 4+2=6 శాసనములు కలవు. శాసనములు ప్రకటించుటను బట్టి దక్షారామక్షేత్రము పదొకొండవశతాబ్దిని ప్రాముఖ్యమునంది, పండ్రెండవశతాబ్దిని మహాప్రాముఖ్యమునంది, పదమూడవశతాబ్దినుండి ప్రాము ఖ్యము తగ్గినట్లు కనిపించును. అసలు చాళుక్యరాజైన అమ్మరాజవిజయాదిత్యుని అమాత్యుడు, సామంతుడును అయిన విప్రనారాయణబిరుదాంకితుడు కుప్పనయ్య దక్షారామమునందు శివనిలయము నిర్మించినట్లు శాసనప్రమాణము కలదు.

"దాక్షారామే కృతశివనిలయో ......"

శివనిలయమన శివాలయము. దాక్షారామములోని శివాలయము భీమేశ్వరా లయమే అగును. అమ్మరాజవిజయాదిత్యుని కాలము 945-970. కావున దక్షారామభీ మేశ్వరాలయము పదవశతాబ్ది నిర్మాణము కావలయును. కా॥ బట్టి దక్షారా మక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకమైన సంస్కృతభీమఖండము రచనాకాలము పదవ శతాబ్ది తదనంతరమగును.

కుమారారామమునందు చాళుక్యభీమేశ్వరాలయము, రాజనారాయణస్వామి దేవాలయము కలవు. చాళుక్యభీమేశ్వరుడన చాళుక్యభీముడు ప్రతిష్ఠించిన ఈశ్వ రుడని అర్థము. చాళుక్యరాజైన మొదటి చాళుక్యభీముడు 360 యుద్ధములందు విజయము లంది తన పేర చాళుక్యభీమేశ్వరాలయములను కట్టించినట్లు శాసనప్రమాణము కలదు. మొదటి చాళుక్యభీముని కాలము 892-922. కావున చాళుక్యభీమేశ్వరాలయము కూడ పదవశతాబ్ది నిర్మాణము కావలయును. ఇక రాజ నారాయణస్వామి దేవాలయము మండయ అను వైశ్యుడు, రాజనారాయణబిరు దాంకితుడైన మొదటి కులోత్తుంగచోళుని పేర కట్టించినట్లు శాసనప్రమాణము కలదు. రాజనారాయణస్వామిదేవాలయశాసనములందు "మండసెట్టి శ్రీరాజ నారాయణ దేవర", "మణ్డయగుడి శ్రీకేశవదేవర" అని కలదు. అంతేకాదు. మండో నారాయణసామిగుడి, మాండవనారాయణస్వామి గుడి అని నేటికిని (1962) స్థానిక జనవ్యవహారము కలదు. ఆలయశాసనములందు ప్రాచీనతమశాసనకాలము 1078వ సంవత్సరము. చాళుక్యచోళరాజైన మొదటికులోత్తుంగచోళుని కాలము 1070-1118. కావున రాజనారాయణస్వామి దేవాలయము పదొకొండవశతాబ్ది నిర్మాణము కావలయును. కా॥ బట్టి రాజనారాయణాగారమని కల (48శ్లో.3అ.) సంస్కృత భీమఖండము రచనాకాలము పదొకొండవశతాబ్ది తదనంతరమగును.

జగన్నాథక్షేత్రమునందు జగన్నాథస్వామి ఆలయము కలదు. అది

గాంగవంశరాజైన అనంతచోడగంగదేవుడు నిర్మించినట్లు శాసనప్రమాణము కలదు. నిర్మాణకాలము 1112 ప్రాంతము. కావున జగన్నాథస్వామి ఆలయము పండ్రెండవశతాబ్ది నిర్మాణము కావలయును. కాఁబట్టి సంస్కృతభీమఖండము రచనాకాలము పండ్రెండవశతాబ్ది తదనంతరమగును.

సర్పవరక్షేత్రమునందు భావనారాయణస్వామి దేవాలయము కలదు. సర్పవ రాలయశాసనములు ముప్పది కలవు. అందు ప్రాచీనతమశాసనకాలము 1199వ సంవత్సరము. పదమూడవశతాబ్ది పర్యంతము సర్పవరాలయశాసనములందు దైవక్షేత్రనామములు "చతుర్వేదిమంగళమున పురుషోత్తమమున వీరచోడ విన్నగరాళ్వారు" అని కలదు. చతుర్వేదిమంగళమన అగ్రహారము. పురుషో త్తమము క్షేత్రనామము. వీరచోడవిన్నగరాళ్వారు దైవనామము. వీరచోడుడు ప్రతిష్ఠించిన విష్ణువని అర్థము. విన్నగరు వైకుంఠము. వీరచోడుడు మొదటి కులో త్తుంగచోళుని కుమారుడు. వేంగీదేశప్రతినిధి. విన్నగరాళ్వారు అని దైవనామము కల చిట్టచివఱి శాసనకాలము 1233వ సంవత్సరము. భావనారాయణస్వామి అని దైవనామము కల మొట్టమొదటి శాసనకాలము 1388వ సంవత్సరము. ఈ రెండు సంవత్సరముల మధ్య 1388-1233=155 , సంవత్సరముల కాలమునందు ఒక్క ఆలయశాసనమును లేకపోవుట ఆశ్చర్యము కలిగించును. తన్మధ్యకాలమునందు బహుశః పదమూడవశతాబ్దిని భావనారాయణస్వామి ప్రత్యక్షమగుట సంభవము. కాఁబట్టి సంస్కృతభీమఖండము రచనాకాలము పదమూడవశతాబ్ది తదనం తరమగును.

క్షేత్రనామము సర్పపురమని శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు కలదు. సర్ప వరమని సంస్కృతభీమఖండమునందు కలదు. సర్పపురము ప్రాచీననామము. సర్పవరము అర్వాచీననామము. 1502 వ సంవత్సరమునందలి శాసనమునందే సర్పవరమని కలదు. అతఃపూర్వశాసనములందు సర్పపురమని, సర్పనగరమని కలదు. భీమేశ్వరపురాణము ఆధునికముద్రణమున సర్పవరమని కలదు. అది పరి ష్కర్తృవ్యాపారము. సంస్కృతభీమఖండము ముద్రితగ్రంథములందు సర్ప వరమనియే కలదు. ఇది గ్రంథకర్తృవ్యాపారము. సర్పపురమునకు సర్పవరమని స్థానికవ్యవహారము అర్వాచీనము. అర్వాచీనవ్యవహారము కల సంస్కృ తభీమఖండము అర్వాచీనగ్రంథమే అగును.

II. పిఠాపురము స్థలనిర్దేశము సంస్కృతభీమఖండమునందు ఇట్లు కలదు.

"అథ విన్ధ్యాచలోపాంతే త్రిలింగోత్కళదేశయోః
సంధౌ ............ పీఠాపురమ్." 9-11శ్లో.3అ.

ఇందు పిఠాపురము త్రిలింగోత్కళదేశముల యొక్క సంధిస్థానమునందు కలదని ఇదమిత్థముగ కలదు. త్రిలింగదేశమన ఆంధ్రదేశము. ఉత్కళదేశమన ఒరిస్సాదేశము. ఆంధ్రదేశమునకు త్రిలింగదేశవ్యవహారము. ప్రథమతః విద్యానాథుని ప్రతాపరుద్రీయమునందు కలదు. రాజశేఖరుని విద్ధసాలభంజికలోనిది త్రిలింగదేశము కాదు. త్రికళింగదేశము. ప్రతాపరుద్రీయము పదునాల్గవశతాబ్ది పూర్వార్థములోని గ్రంథము. ఉత్తరార్థములోని శాసనములందు (1358, 1368) త్రిలింగదేశవ్యవహారము కలదు. పదునాల్గవశతాబ్దిని ప్రసిద్ధమైన త్రిలింగదేశవ్యవహారము. సంస్కృతభీమఖండమునందు బహుస్థలములందు కలదు. కాఁబట్టి సంస్కృతభీమఖండము రచనాకాలము పదునాల్గవశతాబ్ది తదనంతరమగును.

పిఠాపురము త్రిలింగోత్కళదేశముల సంధిస్థానమునందు ఎల్లకాలము లేదు. ఎలమంచిలి కళింగదేశమునందున్నట్లు మంచన కేయూరబాహుచరిత్రమునందు కలదు. (25,49ప.1ఆ.) ఆ కాలమునందు పిఠాపురము త్రిలింగోత్కళదేశముల సంధిస్థానమునందు ఉండదు. త్రిలింగకళింగదేశముల సంధిస్థానమునందు ఉండును. ఉత్కళకళింగదేశములు భిన్నములు. "ఉత్కళకళింగయవనకర్ణాటలాట-" అని శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు కలదు. (32వచ.1ఆ.) అంతేకాదు. పిఠాపురము మొదట కళింగదేశమునందు కలదు. "కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి" అని తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యమునందు కలదు. (4వచ.3ఆ.) అది చాళుక్యుల పరిపాలనమునందు కలదు. 1337వ సంవత్సరమునందు పిఠాపురరాజ్యము వెలసి కొప్పుల నాయకుల పరిపాలనమునందు 1388 వ సంవత్సరము వఱకును కలదు. 1388 వ సంవత్సరమునందు పిఠాపురరాజ్యము కొండవీటిసామ్రాజ్యమునందు విలీనమైనది. 1395 వ సంవత్సరమునుండి 1420వ సంవత్సరమువఱకు రాజమహేంద్రవరరాజ్యమునందు కలదు. అంతవఱకు రాజమహేంద్రవరరాజ్యాధిపతులు కాటయవేమారెడ్డి, అల్లాడరెడ్డి. అల్లాడరెడ్డి అనంతరము అతని అగ్రజుని పుత్త్రులు కుమారగిరిరెడ్డి, అనపోతారెడ్డి రాజమహేంద్రవరరాజ్యాధిపతులు. అనపోతారెడ్డి ఉత్కళరాజ్యాధిపతి నాల్గవభానుదేవుని ఆశ్రితుడు. కజ్జలభానుడు ఉరపు నాల్గవభానుదేవుడు కళింగదండయాత్ర కావించెను. అతడు పిఠాపురము వఱకు కళింగదేశమును జయించుట అవకాశము. అప్పుడది ఉత్కళదేశమగును. 1423వ సంవత్సరమునుండి రాజమహేంద్రవరరాజ్యాధిపతులు అల్లాడరెడ్డికుమారులు వేమవీరభద్రారెడ్లు. వీరు ఉత్కళరాజమిత్త్రులు. ఆ ఉత్కళరాజు నాల్గవ భానుదేవుడే. అతని చిట్టచివఱి శాసనకాలము 1430వ సంవత్సరము. 1430 వ సంవత్సరము తర్వాత అల్లాడవేమవీరభద్రారెడ్లు రాజ్యవిస్తీర్ణము కావించిరి. కాఁబట్టి పిఠాపురము

త్రిలింగోత్కళదేశసంధిస్థానమునందు కలదని గ్రంథస్థము చేసిన సంస్కృత భీమఖండము రచనాకాలము తన్మధ్యకాలమగుట తథ్యము.

III. దక్షారామము కాశికానగరమని, భీమేశ్వరుడు విశ్వేశ్వరుడని సంస్కృత భీమఖండమునందు కలదు.

"శ్రీ భీమనాయకస్వామీ భగవా న్విశ్వనాయకః

XXX XXX XXX

దక్షవాటీనగర్యేవ కాశికానగరీ న కిం" 59,62శ్లో.8అ.

దక్షారామము కాశికానగరమన దక్షిణకాశి అని అర్థము. దాక్షారామభీమేశ్వరుడు దక్షిణకాశికాధిపతి అని తదాలయశాసనమునందు కలదు[342].

"శ్రీయన్నయేంద్రాత్మజః పుణ్యే దక్షిణకాశికాధిపతయే భీమేశ్వ
రాయార్పయేత్."

ఇట్లు కల శాసనకాలము 1427 వ సంవత్సరము. 1427వ సంవత్సరమునాటికి దక్షారామము దక్షిణకాశి అని, దక్షారామభీమేశ్వరుడు కాశీవిశ్వేశ్వరుడని ప్రసిద్ధమైన విశేషము సంస్కృతభీమఖండమునందు కలదు. కాఁబట్టి సంస్కృతభీమఖండము రచనాకాలము 1427 ప్రాంతమగును.

IV. దక్షారామభీమేశ్వరాలయములోని విఘ్నేశ్వరుడు ఢుంఢివిఘ్నేశ్వరుడని సంస్కృతభీమఖండమునందు కలదు.

"విఘ్నాధినాయకో దేవో ఢుండీదంతావళాననః" 60శ్లో.8అ.

ఢుండివిఘ్నేశ్వరుడే ఢుంఠివిఘ్నేశ్వరుడు. ఢుండిశబ్దార్థము, ఢుండివిఘ్నేశ్వరుని విశిష్టత సంస్కృతకాశీఖండమునందు కలదు. శబ్దార్థము శ్రీనాథుని కాశీఖండము నందు లేదు. అందువలన భ్రమప్రమాదములు వాటిల్లినవి. శ్రీనాథుని కాశీఖండము పూర్వముద్రణమునందు "వాయవ్యదిగ్భాగంబుననుండు ఢుంఠివినాయకుండు" అని, తర్వాతి ముద్రణమునందు "ఉద్దండవిఘ్నేశ్వరునకు నాగ్నేయ దిగ్భాగంబున నుండు ఢుంఠివినాయకుండు" అని కలదు. (99వచ.6ఆ.) పూర్వ ముద్రణమును బట్టి కాఁబోలు "కాశిలో వాయవ్యదిక్కున నుండు విఘ్నేశ్వరుండు ఢుంఠి" అని సూర్యరాయాంధ్రనిఘంటువునందు కలదు. ఆ యా దిక్కుల ఢుంఠి విఘ్నేశ్వరుడు లేడు. ఢుంఠివిఘ్నేశ్వరుడు ప్రతిష్ఠించిన ఏబదియారుగురు వినాయకులు కలరు. వాయవ్యదిగ్భాగమున ఉద్దండవినాయకుని (58శ్లో.57అ.) ఆగ్నేయదిగ్భాగమున ముండవినాయకుని (84శ్లో.576) ఢుండి విఘ్నేశ్వరుడు

ప్రతిష్ఠించినట్లు సంస్కృతకాశీఖండమునందు కలదు. అట్లే శ్రీనాథుని కాశీఖండమునందును ఉండవలయును. దివోదాసు కాశీరాజ్యపదవీభ్రష్టతకు ఉపాయమును అన్వేషించుట వలన విఘ్నేశ్వరుడు డుండి విఘ్నేశ్వరుడని డుండి శబ్దార్థము సంస్కృతకాశీఖండమునందు కలదు.

"అన్వేషణే ఢుఢిరయం ప్రథితోऽస్తి ధాతుః
సర్వార్థఢుంఢితతయా తవ ఢుణ్ఢినామ
కాశీప్రవేశమపి కో లభతేऽత్ర దేహీ
తోషం వినా తవ వినాయక ఢుణ్ఢిరాజ" 33శ్లో.57అ.

అని విశ్వేశ్వరుని నిర్దేశము.

"కాశిలో డుంఢివిఘ్నేశ్వరునకు దక్షారామమునందలి యీ విఘ్నేశ్వరునకు తుండము కుడిచేతిమీఁది కుండును."

అని ఒకరి అభిప్రాయము కలదు[343]. కాని యథార్థము కాశిలోని డుంఢివిఘ్నేశ్వరునికి తుండము కుడిచేతిమీదికి లేదు. తుండము కుడిచేతి మీదికి ఉండు గణపతి లక్ష్మీగణపతి.

దక్షారామభీమేశ్వరాలయమునందు లక్ష్మీగణపతి, తాండవగణపతి, డుంఠి గణపతి విగ్రహములు కలవు. మూడు విగ్రహములును మూడు ప్రదేశములందు కలవు. డుంఠిగణపతి ప్రస్తుతస్థానము ప్రాచీనస్థానము కాదు. భీమేశ్వరాలయబహిః ప్రాకారములోని పశ్చిమగోపురము ప్రాచీనస్థానము. పశ్చిమగోపురమునకు సమీపమునందు కుంకుడుచెట్టు క్రింద పడియున్న డుంఠిగణపతి విగ్రహము 1930 వ సంవత్సరమునందు ప్రస్తుతస్థానమున పునఃప్రతిష్ఠితమయినది[344]. శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని పూర్వోదాహృతమైన సీసపద్యమునందు (31ప.3ఆ.) డుంఠిగణపతిస్థానము పశ్చిమదిశ అను సూచనము కలదు. మొదటి సీసపాదమునందు భీమేశ్వరుడు, రెండవ సీసపాదమునందు సప్తగోదావరము, మూడవ సీసపాదమునందు డుంఠివిఘ్నేశ్వరుడు, నాల్గవ సీసపాదమునందు దండపాణీశుడు, ఎత్తుగీతము మొదటి పాదమునందు భైరవస్వామి కలరు. భీమేశ్వరుని స్థానము కేంద్రము. సప్తగోదావరము స్థానము ప్రాగ్దిశ. దండపాణీశుని స్థానము దక్షిణదిశ. భైరవస్వామి స్థానము ఉత్తరదిశ. పరిశేషన్యాయమున డుంఠిగణపతి స్థానము పశ్చిమదిశ. తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము క్రమము.

పశ్చిమదిశను గణపతిప్రతిష్ఠను ప్రకటించు శాసనము కలదు[345].

"శ్రీశాకే కరబాణవిశ్వగణితే సాధారణే వత్సరే

వైశాఖ్యాం వరగౌతమాన్వయమణిః శ్రీకేశవార్యాత్మజః
వైద్యేంద్రో భువి దక్షవాటనగరీభీమేశితుః పశ్చిమ
ద్వారే చాన్నయపండితో గణపతే రమ్యాం ప్రతిష్ఠా మధాత్."

ఇందు 1352+78=1430 వ సంవత్సరమునందు అన్నయపండితుడు దాక్షారామభీమేశ్వరాలయపశ్చిమద్వారమున గణపతిని ప్రతిష్ఠించినట్లు ఇద మిత్థముగ కలదు. పశ్చిమద్వారము పశ్చిమగోపురద్వారమే. భీమేశ్వరాలయమునందు మఱొక పశ్చిమద్వారము లేదు. పశ్చిమగోపురద్వారమే నాడు ప్రవేశద్వారముకూడ.

"సూర్యవీథికిఁ జనిరి సంశుద్ధమతులఁ
బశ్చిమద్వారమునకునై పరమమునులు." 57ప.3ఆ.భీ.పు.

"తే భీమశంకరాగారపశ్చిమద్వారమాశ్రితాః" 3శ్లో.10అ.సం.భీ.ఖం.

ప్రవేశద్వారమునందు ఢుంఠిగణపతి ప్రతిష్ఠ కాశీప్రభావము కావలయును. కాశీక్షేత్రమునందు ఢుంఠివిఘ్నేశ్వరుని స్థానము విశ్వేశ్వరాలయము కాదు. విశ్వేశ్వరాలయప్రవేశమార్గము. అట్లు దక్షిణకాశీక్షేత్రమునందు ఢుంఠిగణపతి స్థానము భీమేశ్వరాలయము కాదు. భీమేశ్వరాలయప్రవేశద్వారము.

ఇంతకు 1430వ సంవత్సరమునందు ప్రతిష్ఠించిన ఢుంఠిగణపతి విషయము కల సంస్కృతభీమఖండము రచనాకాలము 1430వ సంవత్సరము కంటె పూర్వము కాదు. శ్రీనాథుని భీమేశ్వరపురాణము రచనాకాలము 1430వ సంవత్సరమని పూర్వోక్తము. కావున సంస్కృతాంధ్రభీమఖండములు సమకాలికగ్రంథములు కావచ్చును. కాని శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని లేఖకపాఠకప్రమాదములు, అర్వాచీనస్థానికవ్యవహారము కల సంస్కృతభీమఖండము శ్రీనాథుని భీమేశ్వర పురాణమునకు సమకాలికగ్రంథము కాఁజాలదు. సమీపకాలికగ్రంథమును కాఁజాలదు. కాలాంతరసంస్కృతీకరణమే కావలయును. అయిన శ్రీనాథుని ప్రతిపాదనములు ఆపాదనములే అగును. కుమారసోమపీథి వ్యాఖ్యానములోని భీమేశ్వరఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణము ప్రభావమే అగును. సోమపీథి మల్లినాథసూరి కుమారుడు. ఆంధ్రుడు. ఆంధ్రగ్రంథమైనను సంస్కృత వ్యాఖ్యానమునందు సంస్కృతభాషయందుండుట సహజము. సంస్కృత భీమఖండము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునకు సంస్కృతీకరణమగుట సత్యము.

# అనుబంధము -3

# శ్రీనాథుని సీసపద్యరూపాంధ్రీకరణము

శ్రీనాథుని సీసపద్యము నవరత్నపదకము. ఆ పదకమునకు శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి స్వర్ణనైపథ్యము.

శ్రీనాథుని నైషధాంధ్రీకరణము సీసపద్యముతో ప్రారంభమైనది. సీసపద్యముతోనే ముగిసినది. తొలి సీసపద్యము మూలవిధేయము. తుది సీసపద్యము స్వీయకవిత్వము. ఇది శ్రీనాథుని స్వతంత్రాస్వతంత్రపద్ధతికి శృంగగ్రాహిక. శృంగారనైషధములోని సీసపద్యరూపాంధ్రీకరణము బహువిధభాసమానము[346].

I. మూలవిధేయమైన ప్రతిసీసపద్యమును అటునిటు కల శ్లోకముల ఏకదేశానువాదము. ఇది శ్రీనాథుని సీసపద్యరూపాంధ్రీకరణపద్ధతికి అధికారసూత్రము. ఒక శ్లోకమొక సీసపాదముగ, ఒకటి రెండు శ్లోకములు ఎత్తుగీతముగ క్రమశ్లోకముల సమగ్రానువాదము - అనగా వరుస శ్లోకముల వంతపాట ఎక్కడను లేదు. క్రమ శ్లోకముల ఏకదేశానువాదమును కాదాచిత్కము. శృంగారనైషధము మొత్తము మీద 121 సీసపద్యములందును అట్టివి రెండే కలవు. అవి కూడ అభిప్రాయ ఘటనములే.

1. "రాజునొజ్జల-" 129ప.4ఆ; 11-16శ్లో.10స.
2. "అఖిలదిగ్దేశ-" 5ప.5ఆ; 92-96శ్లో.10స.

II. సీసపద్యము మొత్తము ఆంధ్రీకరణమైన సందర్భములు సకృన్మాత్రము. అవి కూడ ఏకదేశానువాదములే. అభిప్రాయఘటనములే. అట్టివి పండ్రెండు కలవు.

1. "తపనీయ-" 46ప.1ఆ; 2,3,4,5,9శ్లో.1స.
2. "రంభ విస్రంభ-" 36ప.3ఆ; 48, 50, 52, 49, 51, 49శ్లో.5స.
3. "ఈ మాటలు-" 68ప.3ఆ; 117,118,119,122,125శ్లో.5స.
4. "శ్రుతి నుతింపఁ గ-" 130ప.3ఆ; 91,91,92,92,94,95,96శ్లో.6స.
5. "హోమాగ్ని-" 123ప.7ఆ; 166,167,168,177,179,187,180శ్లో.17స.

6. "సవనయూపస్తంభ-" 124ప.7ఆ.172,170,180,181,179శ్లో.17స.
7. "ఆత్మఘాతకు-" 125ప.7ఆ.202, 186, 203,182,199శ్లో.17స.
8. "అమరవల్లభుఁ డు-" 151ప.7ఆ; 21, 23, 25,20,24శ్లో.18స.
9. "అధరంబు-" 176ప.7ఆ;59,59,60,60,56శ్లో.18స.
10. "ప్రాణేశు-" 191ప.7ఆ..127,126,130,132,138శ్లో.18స.
11. "దంతక్షత-" 192ప.7ఆ. 135,134,136,139శ్లో.18స.
12. "అభినవాజ్య-" 104ప.8ఆ.23,28,29,31,25,30,25,31శ్లో.18స.

III. కనీసమొక సీసపాదమైనను, అమూలకముగ ఉండుట కనిష్ఠలక్షణము. అట్టి సీసపద్యములందు అమూలకములైన సీసపాదములివి :

1. "అభ్యాసవశమునఁ బ్రాణేశ్వరుని మీఁది
యించుగీతములు వాయించు వీణ" 76ప.1ఆ.

2. "యువమనోమృగరాజిఁ దవిలింపఁ దీర్చిన
మదనవాగుర లిందువదన కురులు" 15ప.2ఆ.

3. "ఆవహసంవహోద్యనిలఘట్టనముల
శతతంతిమూర్ఛనాస్వనము లీన" 6ప.3ఆ.

4. "ఎఱుఁగుదో నీవు మమ్మిందఱ లెస్సగా?
నెఱుఁగకుండిన నేమి? యెఱిఁగికొనుము" 46ప.3ఆ.

5. "ఎదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల
కొయ్యనం దెరువిచ్చి యోసరిల్లు" 84ప.3.ఆ.

6. "పవడంబుమీఁది కోపముననో యీకాంత
పాదంబు లత్యంతపాటలములు" 202ప.3ఆ.

7. "యాగాదిదుర్లభంబైన దేవత్వంబు
నీ కొల్లఁ బాటయ్యెఁ నేఁడు సూడ" 74ప.4ఆ.

8. "వర్ణింపు నిషధభూవరుని నోపితివేని
నీ దోష మఖిలంబు వెడలుఁ గాని" 82ప.4ఆ.

9. "అంగుళీముఖపీడితాక్షివిక్రియయొక్కొ?
మకరాంకు శాంబరీ మహిమయొక్కొ? 178ప.6ఆ.

10. "ఒకచోట సాలభంజిక గీలు వన్నిన
మురిపెంపు రవ గొండ్లి పరిఢవించు" 149ప.7ఆ.

11. "మార్తాండమండలీమధ్యభాగంబున
నీడెందమునఁ బోలె నిలిచె శివుఁడు" 91ప.8ఆ.

12 "ధాత్రి నిక్ష్వాకు సంతతి నుద్భవం బొంది
యాశ్రయించినవారి కమృత మిత్తు" 129ప.8ఆ.

IV. రెండు మూడు శ్లోకములు మాత్రమే గ్రహించి, రెండు సీసపాదములను అమూలకముగ రచించుట ఒక విశేషము. అమూలకములైన అట్టి సీసపాదములు:

1. "సమరూపలావణ్యసౌందర్యమగు మిథు
నంబుఁ గూర్పకపోఁడు నలినభవుఁడు
కన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మి
మ్మిరువుర దేవిదేవరను బోలె" 86ప.2ఆ.

2. "గ్రహణవేళలయందు రాహు వాహారించి
తృప్తిమైఁ గబ్బునఁ ద్రేఁచెనేని
విషమనేత్రుఁడు చేతి విష మారగించుచోఁ
బ్రతిపాకముగఁ జేసి త్రావెనేని" 123ప.2ఆ.

3. "అవధారు దేవి! దివ్యకిరీటకోటిసం
దానితవికచమందారదామ
సందోహమకరందబిందుధారాధౌత
సందీప్త చరణారవిందుఁడైన" 120ప.3ఆ.

4. "ఆకాశహర్మ్యాగ్రహస్తదీపంబులు
ప్రాలేయజలరాశిబాడబములు"
"రాజమండలకాంతి రాజయక్ష్మము లంధ
కారవేదండకంఠీరవములు" 11ప.8ఆ.

V. మూడు శ్లోకములు గ్రహించి, మూడు సీసపాదములు అమూలకముగ రచించుట కలదు.

"మధురాక్షరములు నీ మహితభాషణములు
కీర్తనీయంబు నీ వర్తనంబు
ప్రౌఢియుక్తంబు నీ ప్రతిభావిశేషంబు
కమనీయతరము నీ కల్కితనము
శ్లాఘనీయంబు నీ సౌహార్దగరిమంబు
ప్రార్థనీయంబు నీ ప్రాభవంబు" 62ప.2ఆ.

VI. మూలశ్లోకములు మూడు, నాలుగు మీది సీసపాదములుగ సంతరించి, ఎత్తుగీతమును అమూలకముగ రచించుట ప్రముఖలక్షణము. ఇట్టి సీసపద్యములు 121లోను 21కలవు.

1. "తీక్కించికొనియున్న-" 5ప.2ఆ; 2,4,5శ్లో.2స.
2. "ప్రత్యర్థిసార్థ-" 9ప.2ఆ; 16,17,18శ్లో.2స.
3. "నలినసంభవు-" 49ప.2ఆ; 16,17,19,16శ్లో.3స.
4. "అతఁడు-" 66ప.2ఆ; 71,72శ్లో.3స.
5. "విను మింతి! -" 86ప.2ఆ; 100,101శ్లో.3స.
6. "నిబిడశైశవ-" 170ప.3ఆ; 37,38,37,49శ్లో.7స.
7. "రాహుదంష్ట్రా-" 182ప.3ఆ; 52,58,39శ్లో.7స.
8. "సకలశాస్త్రౌఘ-" 183ప.3ఆ; 62,61,65,64శ్లో.7స.
9. "ప్రణతమౌళి-" 5ప.4ఆ; 20,21,22శ్లో.8స.
10. "ఏ దేశమున నుండి-" 8ప.4ఆ; 25,27శ్లో.8స.
11. "అని శారదంబైన-" 11ప.4ఆ; 14,15శ్లో.9స.
12. "రజ్జువల్లరి మీఁద-" 75ప.4ఆ; 40, 41, 42, 44శ్లో.9స.
13. "వెలఁది యైరావత-" 78ప.4ఆ; 65,66,69శ్లో.9స.
14. "హరి కల్పవృక్షంబు-" 85ప.4ఆ; 74-78శ్లో.9స.
15. "పైపై మహైశ్వర్య-" 134ప.4ఆ; 40, 39, 41శ్లో. 10స.
16. "దవ్వుదవ్వుల-" 9ప.5ఆ; 107-110శ్లో.10స.
17. "తెలివ! ప్రత్యర్థి-" 96ప.5ఆ; 1 శ్లో.10స.
18. "తగునయ్య కలిరాజ! -" 100ప.7ఆ; 116,117శ్లో.17స.
19. "నముచిసూదను-" 13ప.8ఆ; 41,16శ్లో.19స.
20. "తను సృజించిన-"128ప.8ఆ; 69,70,71,74శ్లో.21స.
21. "ఓషధీసందేశ-" 178ప.8ఆ; 78,80,77శ్లో.22స.

VII. మీఁది సీసపాదములు నాలుగును అమూలకముగ సంతరించి, ఎత్తుగీతమును ఒక్క శ్లోకమునకు ఏకదేశానువాదముగ సంతరించుట మఱొక విశేషము. ఇట్టి సీసపద్యములు 8 కలవు. ఇవి భావోపలక్షణములు.

1. "కోరి లీలా గేహ-" 70ప.1ఆ; 31శ్లో.1స.
2. "జాగరోద్భూత-" 86ప.1ఆ; 49శ్లో.1స.
3. "కదళికాచంపక-" 12ప.7ఆ; 122శ్లో. 16స.
4. "అర్ఘ్యమెవ్వని-" 105ప.7ఆ; 143శ్లో.17స.
5. "పతిపాణిపల్లవ-" 177ప.7ఆ; 62శ్లో. 18స.

6. "సీమంతమేర్పడ-" 103ప.8ఆ; 21శ్లో.21స.
7. "పద్మాసనస్థు౯డై-" 110ప.8ఆ; 40శ్లో. 21స.
8. "కీలుకొప్పు వ్రేన-" 112ప.8ఆ; 42శ్లో. 21స.

VIII. రెండు శ్లోకములు నిమిత్తమాత్రముగ గ్రహించి, స్వతంత్రకల్పనమున ప్రపంచీకరించి, సమగ్రసుందరముగ సీసపద్యమును సంతరించుట మఱొక ప్రముఖలక్షణము. ఇట్టి సీసపద్యములు పదియేను కలవు. అవి:

1. "విలులితజంబాల-" 100ప.1ఆ; 121,122శ్లో.1స.
2. "చిగురు౯ దామరపాకు-" 119ప.2ఆ; 32,30శ్లో.4స.
3. "విరహిణీవధ-" 122ప.2ఆ; 62,61శ్లో.4స.
4. "భువనమోహన" 138ప.2ఆ; 83,86శ్లో.4స.
5. "పద్మిని! కన్నీరు-" 141ప.2ఆ; 112,113శ్లో.4స.
6. "చెలువారు-" 96ప.3ఆ; 47,46శ్లో.6స.
7. "వామాక్షి! మాక్షిక-" 63ప.4ఆ; 17,18శ్లో.9స.
8. "అతినిర్ఝర-" 45ప.5ఆ; 38,41శ్లో.11స.
9. "సకలపుణ్యాంగనా-" 28ప.6ఆ; 93,94శ్లో.14స.
10. "యామవేదండ-" 82ప.6ఆ; 7,8శ్లో.16స.
11. "సర్వతోముఖ-" 110ప.6ఆ; 48, 49శ్లో.16స.
12. "జ్ఞానప్రదీపికా-" 59ప.7ఆ; 31,32శ్లో.17స.
13. "అప్పరాకు౯డు-" 130ప.7ఆ; 178, 175శ్లో.17స.
14. "చూర్ణాలకంబుల-" 172ప.7ఆ; 48,46శ్లో.18స.
15. "చంద్రాతపంబులు-" 5ప.8ఆ; 4,5శ్లో.19స.

IX. ఒక్క శ్లోకమునే ప్రపంచీకరించి మొత్తము సీసపద్యమును సంతరించుట కూడ ప్రముఖవిశేషము. ఇట్టి సీసపద్యములును పదియేను కలవు. అవి:

1. "తల్లి మదేకపుత్త్రిక-" 109ప.1ఆ; 135శ్లో.1స.
2. "సమనుభూత-" 88ప.3ఆ; 14శ్లో.6స.
3. "నందనోద్యాన-" 126ప.3ఆ; 83శ్లో.6స.
4. "ఇతని హేతి-" 145ప.5ఆ; 58శ్లో.12స.
5. "కార్తాంతికుల౯-" 36ప.6ఆ; 8శ్లో.15స.
6. "కలికిచూపులు-" 68ప.6ఆ; 76శ్లో.15స.
7. "సుద్యుమ్ను౯డను-" 72ప.6ఆ; 83శ్లో.15స.
8. "చెక్కుటద్దములపై-" 103ప.6ఆ; 41శ్లో.16స.
9. "కడుపు మండించు-" 53ప.7ఆ; 25శ్లో.17స.

10. "ఇన్ని యింద్రియములు-" 55ప.7ఆ; 28శ్లో.17స.
11. "ఐకమత్యంబు- " 73ప.7ఆ; 51శ్లో.17స.
12. "బౌద్ధులఁ బాటించు-" 128ప.7ఆ; 185శ్లో.17స.
13. "ప్రథమానురాగంబు-" 160ప.7ఆ; 32శ్లో.18స.
14. "ఒకదీప మార్పిన-" 169ప.7ఆ; 88శ్లో.18స.
15. "ఇందుకాంతంబుల-" 168ప.8ఆ; 61శ్లో.22స.

ఇట్లు శ్రీనాథుని సీసపద్యరూపాంధ్రీకరణము, కుమారసంభవాంధ్రీకరణమైన హరవిలాసములోని గౌరీకల్యాణమునందును కలదు[347]. గౌరీకల్యాణమునందు మొత్తము ముప్పదిమూడు సీసపద్యములు కలవు. అందు మూడు సీసపద్యములు అమూలకములు. ముప్పది సీసపద్యములు సమూలకములు. అందు క్రమశ్లోకముల సమగ్రానువాదము. అనగా వరుస శ్లోకముల వంతపాటు- మచ్చునకు లేదు. క్రమ శ్లోకముల ఏకానుదేశానువాదమును క్వాచిత్కము.

I. క్రమశ్లోకముల ఏకానుదేశానువాదము : రెండు సీసపద్యములు కలవు.

1. "స్థావరంబగు-" 59ప.4ఆ; 58-62శ్లో.6శ్లో.6స.
2. "ఏ వేల్పులకు-" 64ప.4ఆ; 75-79శ్లో.6స.

II. అటునిటు శ్లోకముల ఏకదేశానువాదము : రెండు సీసపద్యములు కలవు.

1. "ఆకాశగంగలో-" 42ప.4ఆ; 5,7,8,9,11శ్లో.6స.
2. "భసితంబు-" 91ప.4ఆ; 32,34,33, 35శ్లో.7స.

III. కనీసమొక సీసపాదమైన అమూలకమైన సీసపద్యములు రెండు కలవు.

"కలితముక్తాఫలగ్రైవేయకంబుతోఁ
దులఁ దూఁగుఁగాక పెంజిలువపేరు" 28ప.4ఆ.

"మందాకినియును గాళిందియు నిరువంక
రమణమై వింజామరంబు లిడిరి" 99ప.4ఆ.

IV. ఎత్తుగీతములు అమూకలముగ రచించిన సీసపద్యములు రెండు కలవు.

1. "వెఱవకుండు-" 18ప.4ఆ.
2. "హస్తయుగ్మము-" 49ప.4ఆ.

V. రెండుశ్లోకములు మాత్రమే ప్రపంచీకరించిన సీసపద్యములు తొమ్మిది కలవు.

1. "సృష్టికి నటమున్ను-" 13ప.3ఆ; 4,6శ్లో.2స.
2. "ఎవ్వండు-" 44ప.3ఆ; 4,5శ్లో.2స.
3. "సంకల్పసంభవ-" 49ప.3ఆ; 13,16శ్లో.3స.
4. "వలదకెంజడ-" 65ప.3ఆ; 47,48శ్లో.3స.
5. "నాగభూషణు-" 83ప.3ఆ; 74,75శ్లో.3స.
6. "మదిరారసాస్వాద-" 89ప.3ఆ; 12,13శ్లో.4స.
7. "ముత్యాల మొలనూలి-" 11ప.4ఆ; 10,11శ్లో.4స.
8. "కమనీయలోధ్ర-" 81ప.4ఆ; 10,11శ్లో.4స.
9. "సంబంధబాంధవ-" 100ప.4ఆ;93,94శ్లో.7స.

VI. ఒక్క శ్లోకమునే ప్రపంచీకరించిన సీసపద్యములు పది కలవు.

1. "అటమున్ను-" 20ప.3ఆ; 21శ్లో.1స.
2. "ఈ నీరజాతాక్షి-" 25ప.3ఆ; 50శ్లో.1స.
3. "గంగాప్రవాహ-" 30ప.3ఆ; 54శ్లో.1స.
4. "పాటించి పువ్వులు-" 36ప.3ఆ; 60శ్లో.1స.
5. "కాంతాజనంబుల-" 38ప.3ఆ;64శ్లో.2స.
6. "క్రొమ్ముడి కైపెక్కి-" 92ప.3ఆ; 26శ్లో.4స.
7. "సలిలంబు త్రిషవణ-" 18ప.4ఆ; 33శ్లో.5స.
8. "ప్రథమప్రజా-" 23ప.14ఆ; 41శ్లో.5స.
9. "రాయంచ-" 28ప. 4ఆ; 88శ్లో.6స.
10. "బ్రాహ్మీ సంపాదించె-" 90ప.4ఆ; 30శ్లో.7స.

ఇదే ప్రణాళిక ఇతోధికముగ కాశీఖండమునందు, శివరాత్రిమాహాత్మ్యమునందును కలదు. సంస్కృతకాశీఖండములోని, ఈశానసంహితలోని వరుస శ్లోకములకు వంతపాటు లేదు. క్రమశ్లోకముల తెనుగుసేత క్వాచిత్కము. అందును శ్రీనాథుని స్వీయకవితాముద్ర సిద్ధము. ఒక ఉదాహరణము:

"శ్రీశైలో మోక్షదః సర్వః కేదారోzపి తతోzధికః
శ్రీశైలాచ్చాపి కేదారా త్ప్రయాగం మోక్షదం పరం ॥ 69

ప్రయాగాదపి తీర్థాగ్ర్యాదవిముక్తం విశిష్యతే
యథావిముక్తే నిర్వాణం న తథా క్వా ప్యసంశయం ॥ 70

అన్యాని ముక్తిక్షేత్రాణి కాశీప్రాప్తి కరాణి చ
కాశీం ప్రాప్యాపి ముచ్యేత నాన్యథా తీర్థ కోటిభిః ॥" 71శ్లో.6అ.

చెలువ! శ్రీగిరియందు శిఖరేశ్వరంబను

చెలువ! శ్రీగిరియందు శిఖరేశ్వరంబను
　　శిఖరంబుఁ జూచినఁ జేరు ముక్తి
కాంత! శ్రీశైలంబు కంటె వేగంబునఁ
　　గేదార మీఁ జాలుఁ గేవలత్వ
మంతకంటెను వేగ మరవిందలోచన!
　　యమృత మీనోపుఁ బ్రయాగతీర్థ
మా ప్రయాగము కంటె నతివేగమునఁ జేయు
　　నపవర్గ మింతి! మహాశ్మశాన
మతివ! యానందకానన ప్రాప్తికరము
లఖిలతీర్థంబులును సందియంబు లేదు
కాశికాతీర్థమాడక కదియరాదు
లక్షతీర్థంబు లాడిన మోక్షలక్ష్మి" 78ప.3అ.

ఇందు చెలువ, కాంత, అరవిందలోచన, ఇంతి, అతివ అను పర్యాయపదముల సంబోధనములు; ముక్తి, కేవలత్వము, అమృతము, అపవర్గము అను పర్యాయపదముల ప్రతిపాదనములు; శిఖరేశ్వరదర్శనవివక్ష, లక్షతీర్థనిష్కర్ష, మోక్షలక్ష్మీరూపకము శ్రీనాథుని స్వీయకవితాస్మితరేఖలు.

ఇట్లు శ్రీనాథుని సీసపద్యరూపాంధ్రీకరణము నవరత్నస్థగితసువర్ణపదకము.

# అనుబంధము - 4

# కుమారసంభవాంధ్రీకరణము

కవుల పరిగణనమున కాళిదాసు కనిష్ఠికాధిష్ఠితుడు. కావ్యముల కంఠహారమున కుమారసంభవము నాయకమణి. కవికులతిలకుడైన కాళిదాసుని రసమయమైన కుమారసంభవమునకు, శ్రీనాథుని హరవిలాసములోని గౌరీకల్యాణము స్వతంత్రమైన, సంగ్రహమైన ఆంధ్రీకరణము[348].

పురాణాంధ్రీకరణము కంటె కావ్యాంధ్రీకరణము కష్టము. అందు నైషధాంధ్రీ కరణమున ప్రతిశ్లోకము పరీక్షానికషప్రాయము. కుమారసంభవాంధ్రీకరణమున ప్రతిపదము పరీక్షానికషప్రాయము. పదప్రయోగము ద్వివిధము. 1. ప్రవృత్తినిమిత్త కము. 2.వ్యుత్పత్తినిమిత్తకము. ఫలితార్థము మాత్రము ప్రసక్తమగునది ప్రవృత్తి నిమిత్తకము. వ్యుత్పత్త్యర్థమును వివక్షితమగునది వ్యుత్పత్తినిమిత్తకము. ప్రవృత్తి నిమిత్తకమైన పదప్రయోగము శబ్దసౌందర్యప్రతిపాదకము. వ్యుత్పత్తి నిమిత్తకమైన పదప్రయోగము అర్థగౌరవప్రయోజకము. అంతేకాదు. అర్థగౌరవప్రయోజకమైన పదప్రయోగమే పదౌచిత్యము. క్షేమేంద్రుని పదౌచిత్యమునకు, విశ్వనాథుని వ్యుత్పత్తినిమిత్తకపదప్రయోగమునకు ప్రయోజనము సమానము.

"తవ ప్రసాదాత్ కుసుమాయుధోऽపి
సహాయ మేకం మధుమేవ లబ్ధ్వా
కుర్యాం హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోऽన్యే" 10శ్లో.3స.

ఇందు "కుసుమాయుధోऽపి, హరస్యాపి, పినాకపాణేః" అను కాళిదాసు పద ప్రయోగములు వ్యుత్పత్తినిమిత్తకములు. మన్మథుడు కుసుమాయుధుడు. కుత్సిత ములైన సుమములే - అల్పిష్ఠములైన పువ్వులే ఆయుధములుగా కలవాడని వ్యుత్పత్త్యర్థము. ప్రత్యర్థి హరుడు. హరించువాడని వ్యుత్పత్త్యర్థము. పినాకపాణి అనగా మహాశక్తిమంతమైన త్రిశూలము చేతియందు కలవాడైనను తాను అల్పా యుధుడైనను ధైర్యచ్యుతి కలిగింతునని మన్మథుని ప్రగల్భము. అపిశబ్దద్వ యమును అర్థవంతము. మన్మథుని కుసుమాయుధమునకు, హరుని పినాకాయుధ మునకు గల అంతరము శ్లోకమునకు ప్రాణము.

"నీ ప్రసాదంబును మలయానిలంబు ప్రాపును వసంతంబు సహా యంబును నిండువెన్నెల చెలిమియుం గలుగఁ బినాకపాణి యగు హరునైన జయింపంజాలుదునని తలంతుం దక్కినవారు నా కెవ్వరు నెంత?-"

ఇందు "కుసుమాయుధోzపి" అనునది లేదు. అంతేకాదు. అనంతరకథలో మన్మథుడు కలిగించినది హరునికి ధైర్యచ్యుతి మాత్రమే. "హరస్తు కించిత్ప రిలుప్తధైర్యః" అని కాళిదాసు వివరణము. అట "శమనారాతి నివృత్తధైర్యుఁ డగుచు" అనియే శ్రీనాథుని తెనుగుసేత. ఇట మాత్రము "జయింపంజాలుదు" నని కలదు. జాగ్రత్తయోగము కాదు. "పినాకపాణియగు హరునైన" అను తెనుగుసేత వ్యుత్పత్తినిమిత్తకము.

"కియ చ్చిరం శ్రామ్యసి" అను కాళిదాసు శ్లోకమునకు (50శ్లో.5స.) "ఏనును బ్రహ్మచారి" అను శ్రీనాథుని ఆంధ్రీకరణమును (25ప.4ఆ.) సంతృప్తి గొలుపునది కాదు. ఇట్టి నీహారలేశములు వదలిన శ్రీనాథుని కుమారసంభవాంధ్రీకరణము సమర్థముగనే గాక, సముజ్జ్వలముగను సాగినది. అందు నైషధాంధ్రీ కరణప్రణాళికయే అంతట కలదు.

**శబ్దానుసరణము** : ఇది గద్యమునందు, పద్యమునందును కలదు.

"నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం
మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారమ్భ మివావతస్థే" 42శ్లో.3స.

"శిలాదనందను దివ్యశాసనంబునఁ గాననంబెల్ల నిష్కంప వృక్షంబును నిభృతద్విరేఫంబును మూకాండజంబును బ్రశాంత మృగప్రచారంబునై చిత్రార్పితరూపావస్థానంబునుం బోలె నుండి" 64వచ.3ఆ.

"సా గౌరసిద్ధార్థ నివేశవద్భి ర్దూర్వాప్రవాలైః ప్రతిభిన్నశోభమ్
నిర్నాభికౌశేయ ముపాత్తబాణ మభ్యఙ్గ నేపథ్య మలంచకార." 7శ్లో.7స.

"గౌరసిద్ధార్థవినివేశకలితమగుచుఁ
దరుణదూర్వాప్రవాళ సంభరితమగుచు
నాత్మరక్షాశిలీముఖంబగుచునపుడు
బాల కభ్యంగ నైపథ్యలీల యమరె." 79ప.4ఆ.

**అభిప్రాయఘటనము** : కాళిదాసు సర్గలకు సర్గలు వర్ణించిన పార్వతీ పరమేశ్వరుల శృంగారఘట్టము, శ్రీనాథుని కుమారసంభవాంధ్రీకరణమున అభిప్రాయఘటనమే.

"గంగాధరుండు భృంగిరిటువికారంబులకు గూఢంబుగా నవ్వించియు, భావసాధ్వసపరిగ్రహంబున నలరియు, నమందమందాక్ష భారంబుగా గారవించియు, సంవ్యానపల్లవగ్రహణంబులును నీవీ బంధస్పర్శనంబులును బింబాధరచుంబనంబులును నఖాంకురవ్యాపారంబులును దంతక్షతవేదనా ప్రపంచిత కిలికించితంబులును వెల యు బాహ్యాభ్యంతరరతోత్సవంబు లనుసంధించి మన్మథుం గృతార్థుం జేసి యనేక కాలంబు పరమానందంబు నొంది" 101వచ4.ఆ.

శబ్దశక్తిమూలకధ్వనివిశేషము కల శ్లోకమునందలి అభిప్రాయమునే శ్రీనాథుడు సంఘటించిన సందర్భమును కలదు.

"కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
గన్తుం ప్రవృత్తే సమయం విలఙ్ఘ్య
దిగ్దక్షిణా గన్ధవహం ముఖేన
వ్యళీక నిశ్వాస మివోత్ససర్జ." 25శ్లో.3స.

ఇందు ఉత్తరాయణము, మలయమారుతము వర్ణింపఁబడినవి. ఉత్తరాయణము కలిగించు సూర్యుని గమనమున నాయకుని పరదారాగమనము, మలయమారుతప్రసారమున నాయిక విరహావస్థయును కలవు. సూర్యుడు ఉత్తరదిక్కున కేగుట యందు నాయకుడు కుత్సితపురుషునిచే ఉంచుకొనఁబడిన ఉత్తరదిక్కను స్త్రీని గవయుట ధ్వనితము. మలయమారుతము దక్షిణదిక్కు అను స్త్రీ విరహదుఃఖ నిశ్వాసమని ఉత్ప్రేక్షితము. ఉత్తరదిక్కునకు కుబేరగుప్తమను విశేషణము, సమయమును అతిక్రమించి అను విషయము శబ్దశక్తిమూలకధ్వనివిశేషమునకు సాధకములు. అవి వదలి ప్రధానమైన అభిప్రాయమును మాత్రమే కూర్చిన శ్రీనాథుని పద్యమిది:

"ఉత్తరాభిముఖుండైన యుష్ణరశ్మి
చంద మీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధవాహంబు పేర దీర్ఘంబు గాఁగఁ
జాఁగ విడిచెను విరహనిశ్వాసధార" 55ప.3ఆ.

**భావోపలక్షణము** : శ్లోకము బీజప్రాయముగ పద్యము పుష్పితవల్లి.

"తస్మిన్ వనే సంయమినాం మునీనాం తపస్సమాధేః
ప్రతికూలవర్తీ
సంకల్పయోనే రభిమానభూత మాత్మాన మధాయ మధుర్జజృమ్భే".
24శ్లో.3స.

"సకలవనంబులందుఁ గల సంయమికోటి తపస్సమాధిని
ష్ఠకుఁ బ్రతికూలవర్తియయి షట్పదకోకిలరాజకీరజా
లకములు తోడఁ, గూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడు వచ్చె వా
రక మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁడై" 54ప.3ఆ.

ఇందు మధుమూర్తి రాజు. రాజు మందిమార్బలముతో వచ్చుట సహజము. షట్పదకోకిలరాజకీరజాలకములు మధుమాసరాజపరివారము. అంతేకాదు. రాజు శస్త్రాస్త్రధారి. మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుడు. కెంజిగురాకులు అస్త్రములుగా కలవాడని అర్థము. అభినవరాగముతో ఒప్పు పల్లవులు = విటులు అస్త్రములుగా కలవాడని అర్థాంతరము. అట్టి మధుమాసరాజు రాకకు స్థాణ్వాశ్రమ వనములోని సంయములే గాక సకలవనములలోని సంయములును సంచలించుట కూడ సంభవము.

శ్లోకము పుండరీకముకుళమైన పద్యము సంఫుల్లసరసీరుహము.

"అథ మౌళిగతస్యేన్దో ర్విశదై ర్దశనాంశుభిః
ఉపచిన్వన్ ప్రభాం తన్వీం ప్రత్యాహ పరమేశ్వరః"
25శ్లో.6స.

"లలితజటాకిరీటసమలంకృతమైన శశాంకరేఖ కో
మలరుచిదంతదీధితిసమాజముతోఁ బొదలంగఁ జేయుచున్
బలికె లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునివ్రజంబుతోఁ
దొలకరి మేఘఘోషములతోఁ బురణించు సమంచితధ్వనిన్."
47ప.4ఆ.

ఇట "మౌళిగతస్యేన్దుః" అనుదానికి "లలితజటాకిరీటసమలంకృతమైనశశాంక రేఖ" అనునది చక్కని వివరణము. అట్టి శశాంకరేఖను కోమలరుచిదంతదీధితి సమాజముతో పొదలంగంజేయుట ముఖకవళికలను మూర్తి కట్టించునది. "తొలకరి మేఘఘోషములతోఁ బురణించు" అను సాదృశ్యకల్పనము శ్రీనాథుని స్వతంత్రకల్పనము. జలదగంభీరస్వనము పురుషకంఠస్వరమునకు ప్రసిద్ధము.

అంతేకాదు. తొలకరి మేఘమెట్లు సస్యాభివృద్ధికరమో, శివుడు ప్రస్తుతకథాసందర్భమున ప్రజా(దేవతా)భివృద్ధికరుడు. ప్రస్తుతకథాసందర్భము పార్వతీపరమేశ్వర పరిణయసంధానము. తారకాసురసంహారనిమిత్తము.

**రసపోషణము** : శాంతరసవిషయమైన పార్వతి తపోవేషధారణము రసపోషణమునకు రమ్యనిదర్శనము.

"ప్రతిక్షణం సాకృతరోమవిక్రియాం
వ్రతాయ మౌంజీం త్రిగుణాం బభార యామ్,
అకారి తత్పూర్వనిబద్ధయా తయా
సరాగమస్యా రశనాగుణాస్పదమ్" 10శ్లో.5స.

"ముత్యాల మొలనూలి మురువు సూపెడు నట్టి
జఘనంబుపై మౌంజి సవదరించెఁ,
గందుకక్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు
తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలి పాటఁ బ్రొద్దుపుచ్చునెలుంగు
నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చెఁ,
బసిఁడికమ్మల యందంపుఁ బట్టుచేల
కొంగుచాటున వర్ధిల్లు కుచభరమున
గంతగా వైచెఁ బులితోలుకళవసంబు
పరమకల్యాణి గిరిసార్వభౌమతనయ" 11ప.4ఆ.

**అలంకారభూషణము** : "ఉపమా కాళిదాసస్య" అని ప్రసిద్ధమైన ఆభాణకము. కాళిదాసు ఉపమాలంకారములను భూషించుట తోపాటు. అమూలకమైన ఉపమాలంకారములను కైసేయుట కూడ శ్రీనాథుని అలంకారభూషణము.

"బభౌ చ సంపర్కముపేత్య బాల నవేన దీక్షావిధిసాయకేన
కరేణ భానో ర్బహులావసానే సంధుక్ష్యమాణేవ శశాంకరేఖా"
8శ్లో.7స.

బంగారు కంకపత్రముఁ
గెంగేల ధరించి యొప్పె గిరినందన య
భ్యంగము తటి భాస్కరకర
సంగతయగు విదియ నాఁటి శశికళ వోలెన్." 80ప.4ఆ.

ఇందు "విదియనాఁటి శశికళ" అను వివక్ష హృదయంగమము. ఇక అమూల కోపమాలంకారము.

"మగువా! నీ పెంచిన లత
చిగురున ముకుళంబు లుల్లసిలెనె చెపుమా
పగడపుఁ గెమ్మోవి పయి
న్నగ వుదయించిన విధంబునం బ్రస్ఫుటమై." 19ప.4ఆ.

**ఔచిత్యసమాదరము** : క్షేమేంద్రుడు ప్రస్తరించిన సర్వవిధౌచిత్యములును కాళిదాసు కుమారసంభవమునందు కలవు. అందు క్షేమేంద్రుడు ప్రత్యేకముగ సోదాహరణనిరూపణము చేసిన కుమారసంభవములోని రసౌచిత్యమిది:

"యథా వా కాళిదాసస్య-
బాలేన్దువక్రాణ్యవికాసభావా
ద్బభుః పలాశాన్యతిలోహితాని
సద్యోవసన్తేన సమాగతానాం
నఖక్షతానీవ వనస్థలీనామ్." 29శ్లో.3స.

పార్వతి యొక్క పరమేశ్వరాభిలాషరూపమైన శృంగారరసమునకు ఉద్దీపనవిభావమైన వసంతవర్ణనమునందు, వసంతునియందు కాముకత్వారోపము చేసి, వనస్థలి ఒక లలన వలె, కుటిలలోహితపలాశకలములు నఖక్షతములని ఉత్ప్రేక్షితములైనవి. ఈ ఉత్ప్రేక్ష పరమౌచిత్యచారుతాప్రతిపాదకము.

"నవకములగు ములు మోదువుఁ
బువుమొగ్గలు విపినవీథిఁ బొల్పెసలారన్
దివుటు వసంతుండను ప
ల్లవుఁ డిడిన నఖక్షతంబులకు సరియగుచున్." 58ప.3ఆ.

శ్రీనాథుడు స్వతంత్రముగ రచించిన ఆశీర్వచనౌచిత్యమిది:

"ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి
గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుశగ్రంథియైన
యంగుళీపల్లవముతోడి హస్తమెత్తి." 16ప.4ఆ.

**అనౌచిత్యపరిహారము** : కుమారసంభవమునందు క్షేమేంద్రుడు అనౌచిత్యములన్నవి రెండు శ్లోకములు కలవు.

"వర్ణప్రకర్షేసతి కర్ణికారం ధునోతి నిర్గంధతయాస్మ చేతః
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః
ప్రవృత్తిః" 28శ్లో.3స.

ఇందు కర్ణికారవర్ణనము, అందు బ్రహ్మనింద ప్రస్తుతశృంగారరసమునకు ఉప యోగి కాదని రసానౌచిత్యమని క్షేమేంద్రుని ప్రతిపాదనము.

ఇది శ్రీనాథుని కుమారసంభవాంధ్రీకరణమున పరిహృతము.

"కోపం ప్రభో సంహర సంహరేతి యావద్గిరః ఖే మరుతా చరన్తి
తావత్సవహ్ని ర్భవ నేత్రజన్మా భస్మావశేషం మదనం చకార"
72శ్లో.3స.

రుద్రునకు సంహారసమయమునందు భవనామ మనుచితమనియు, ఇది నామా నౌచిత్యమనియు క్షేమేంద్రుని ప్రతిపాదనము. కాని, అనంతరకథలో మన్మథుడు పునర్జీవితుడగును గావున భవనామమిట సముచితమనియు, అట్లు సమన్వయిం చుట దూరానేయమగుననియును వాదప్రతివాదములు కలవు. అయినను క్షేమేం ద్రుని ప్రకారము నామానౌచిత్యమే.

"-అవ్వేళ భ్రూభంగదుష్ప్రేక్షంబగు విరూపాక్షుని లలాటేక్ష ణంబు
నం జనియించి సముజ్జ్వలజ్వాలాజాలంబైన కృపీటయోని భువనం
బు లెల్ల భయభ్రాంతంబులై హాహాకారంబులు సేయ నమ్మీన కేతు
శరశరాసనతూణీరంబులతోడంగూడ భస్మంబుసేసిన" 82వచ.3ఆ.

ఇట "భవనేత్రజన్మా"అను దానికి"విరుపాక్షుని లలాటేక్షణంబునం జనియించి" అను శ్రీనాథుని ఆంధ్రీకరణమున నామౌనౌచిత్యము పరిహృతము. విరూపాక్ష నామము లలాటాక్షేణజన్మము ప్రకరణోచితములు. అనంతరకథలో మన్మథుడు పునర్జీవితుడగుటకు విరూపాక్షనామమునకు విప్రతిపత్తి లేదు.

ఇట్లు శ్రీనాథుని నైషధాంధ్రీకరణప్రణాళిక, శ్రీనాథుని కుమారసంభ వాంధ్రీకరణమునందును కలదు. మొత్తము మీద శ్రీనాథుని కావ్యాంధ్రీకరణపద్ధతి స్వతంత్రా స్వతంత్రము. పురాణాంధ్రీకరణపద్ధతి పరమస్వతంత్రము.

# అనుబంధము - 5

# దేవకీనందనశతకము

జక్కన విక్రమార్కచరిత్రమునందు తత్కృతిభర్త సిద్ధమంత్రి తండ్రి జన్న మంత్రి గుఱించి ఇట్లు కలదు.

"-పరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసి
రసికత్వమున దేవరాయమహారాయ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచె-" 44ప.1ఆ.

ఇది మొదటిదేవరాయల కాలము (1406-1422)లోని జన్నమంత్రి దేవకీనంద నశతకము రచించెననుటకు సాధకము. ఒక దేవకీనందనశతకమును ఉపలబ్ధము. అదే జన్నమంత్రి రచించిన దేవకీనందనశతకమను అభిప్రాయములు కలవు. కాని బాధకములు కలవు.

1. ఉపలబ్ధమైన దేవకీనందనశతకమునకు - కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కా ర్యాలయమునందు, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు, అడ యారు గ్రంథాలయమునందు, గద్వాలసంస్థానమునందు తాళపత్రప్రతులు, కాగి తపుప్రతులును కలవు. బహుముద్రణములును కలవు. పరిషత్కార్యాలయప్రతి యందు, అడయారు గ్రంథాలయప్రతియందు, ఆంధ్రగ్రంథమాలముద్రణమునందు, గద్వాలముద్రణమునందు అలతిపాఠభేదమున క్రిందిపద్యము కలదు[349].

"సదయస్ఫూర్తి కళల్ ఘటించు కవిరక్షఃశ్రేష్ఠుఁ డుత్సాహియై
పదివేల్పద్యములందు నూటపదియొౕపద్యంబు లర్పించి మీ
పదనీరేజములందు దివ్యతటినీపాథఃప్రపూరాభిము
ఖ్యదశన్ గాంచినఁ దక్కు నీ కరుణ కృష్ణా! దేవకీనందనా!" 117ప.

ఇందు "కవిరక్షఃశ్రేష్ఠుఁ డుత్సాహియై" అనునెడ "కవిరక్షశ్రేష్ఠుఁ డామోదియై" అని అలతిపాఠభేదము. కవిరక్షఃశ్రేష్ఠుడన కవిరక్షకశ్రేష్ఠుడను అర్థము రాదు. కవిరక్షః శ్రేష్ఠుడన కవిరాక్షసశ్రేష్ఠుడను అర్థము వచ్చును. అదే కవిపాఠము. కావున దేవకీ నందనశతకము కవిరక్షఃశ్రేష్ఠకృతము కావలయును.

కవిరాక్షసశ్రేష్ఠుడన కవిరాక్షసులందు శ్రేష్ఠుడు. కవిరాక్షసుడు పేరు కాదు. బిరుదు. ఒక సంస్కృతకవి కవిరాక్షసుడు కలడు. దక్షవాటికవిరాక్షసుడని (46ప.పీ.) కవిరాక్షసీయమని (5వచ.1ఆ.) అప్పకవీయమునందు కలదు. కవిరాక్షసుని ఆదినారాయణచరిత్రములోని పద్యమొకటి మఱొక లక్షణగ్రంథమునందు కలదు[350]. ఆతడు, ఈతడు ఒకడో? ఇద్దఱో? అనిశ్చయము. కవిసార్వభౌముల వలె కవిరాక్షసులు బహుళసంఖ్యాకులు కావచ్చును. అట్టి కవిరాక్షసులందు శ్రేష్ఠుడనని శతకకర్త ఆత్మప్రత్యయము.

2. దేవకీనందనశతకమునందు పోతన ప్రభావము పుష్కలముగ కలదు.

1.ద్రుతద్విత్వము: చిత్రంబులు న్నొనర (22) బలభేదిన్నలయించి (35) ఇద్దరకు న్నగ్రజు (50) అరయన్నాతని (65) వేసారుచున్నెన్నన (66) ఎక్కెన్నదెట్టన్న (67) రణమున న్నర్పింతు (79) చన్నన్నేమగు (85) అరయన్నచ్చెరువు (108.)

2. పద్యరచనము :

"అమరుల్మ్రొక్కులచే మునుల్ స్తుతులచే నార్యుల్మహానిష్ఠచే
సమరోత్సాహజనుల్ పురశ్చరణచే సాధుల్ దయాంభోధిచే
నమితోదారకళాఢ్యు లర్పణముచే నధ్యాత్ము లైక్యంబుచే
సమతం గాంచిరి మీ పదాబ్జములు కృష్ణా! దేవకీనందనా!" 7.

"సుకరంబై సురసేవ్యమై సులభమై సువ్యక్తమై సూక్తమై
ప్రకటంబై పరమాప్తమై ప్రమదమై ప్రద్యోతమై పథ్యమై
యకలంకామృతమై యఘాపహరమై యానందమై యందమై
సకలంబున్ ఫలియించు మీ మహిమ కృష్ణా! దేవకీనందనా!" 9.

3. భావజాలము:

"చరణాబ్జంబులు వీడ్వడ న్నిలిచి యోజన్ దట్టిలోఁ, బిల్లఁగ్రోల్
కరమొప్పారఁగ నుంచి యింపొదవఁ, జంకన్ గోల నందిచ్చి ప
ల్వురు గోపాలురు చుట్టునుం గొలువ వేల్పుల్ గ్రుక్కలున్
మ్రింగఁగా
నరయం జల్ది భుజింపవే యడవిఁ, గృష్ణా! దేవకీనందనా" 25.

"విలసత్కావ్యకళాధురీణతలు తద్విద్యాపరిజ్ఞానవే
త్తలకుంగా కవి యేలమూర్ఖులకు సిద్ధం బెందు భాగీరథీ
దళితాంభోరుహషండమండిత మరంద గ్రాస మాధుర్యవాం
ఛలు జోరీఁగల కేల తేటిగతిఁ, గృష్ణా! దేవకీనందనా!" 31.

"అరయన్ శంతను పుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి న్నందవ్రజస్త్రీలపైఁ
బరంగం గల్గు భవత్కృపారసము నాపైం గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి! కృష్ణా! దేవకీనందనా!" 92ప.

ఇది "జగదీశా! కృష్ణ! భక్తప్రియా!" అను మకుటము కల మఱొక శతకము నందు మకుటభేదమున మాత్రము కలదు. ఇందలి పద్యమే అందలి పద్యమైనదో, అందలి పద్యమే ఇందలి పద్యమైనదో అనిశ్చయము. ఇందలి పద్యమే అందలి పద్యము కావచ్చును.

3. దేవకీనందనశతకమునందు ధూర్జటి ప్రభావమును స్థూలముగ కలదు.

1. వ్యాకరణవిరుద్ధప్రయోగములు : కూడీకూడని (4) విహరించే తఱి (39) కొలిచేదిన్ (42) వెఱచైనన్ మఱచైన (66) అంతా మూర్ఖము (76) గత్రాలన్, వత్రా, చుత్రా, చత్రా(78) ఏలింది, ఇచ్చింది, చేపట్టింది (101)

2.రాజనింద:

"వరయోగాధ్వరదానధర్మగుణముల్ వర్జించి తృష్ణారతిన్
నరు లత్యంతవిమూఢలోభమతులై నారీరతిం గూర్తురౌఁ
దరముంగాని ధనంబు తస్కరవరున్ ధాత్రీశులుం జేకొనన్
సరఘువ్రాతముచేర్చు తేనె క్రియఁ గృష్ణా! దేవకీనందనా!" 70

"ఖలవాక్యప్రతిపాలకుల్ పరధనాకాంక్షుల్ పరస్త్రీరతుల్
కులధర్మౌఘనిబద్ధచిత్తులు నయాకూపారపారంగతుల్
కలుషుల్ రాజులు వారి సేవకుల కెల్లం గల్గు నత్యంతని
శ్చలసౌఖ్యంబులు నిన్భజింపఁ గను గృష్ణా! దేవకీనందనా!" 71

"బొంకు లక్షలు నిత్యసంభరితసంభోగారతుల్ దుర్మదా
హంకారంబులు కోట్ల సంఖ్యయగు మోహంబా యనంతంబు దు
ష్పంకాభార మపార మిన్ని గల భూపవ్రాతసర్పాళిని
శ్శంకం బ్రాజ్ఞులు చేరనోపుదురె కృష్ణా! దేవకీనందనా!" 72

3. భావజాలము :

"అంతశ్శత్రుల గెల్వలేరు మమతాహంకారము ల్మానలే
రంతా మూర్ఖము వీడలేరు భవదీయాంఘ్రిద్వయీచింత నా
చింతారత్నముఁ గాన లేరిలను దుశ్చిత్తు ల్వృథా వేదవే
దాంతంబుల్ చదువంగ నేమియగుఁ గృష్ణా! దేవకీనందనా!" 76

"అతిమోహాంధులఁ బాపకర్ముల మహాహంకారులన్ దోషదూ
షితులన్ గర్వితదుర్విచారులఁ బ్రశంసింపంగ నా శక్యమా
వితతవ్యాప్తి దినంబు లేగెఁ ద్రిజగద్విఖ్యాత యుష్మత్పము
న్నతసేవాభిముఖుండనైతినిఁ కఁ గృష్ణా! దేవకీనందనా!" 80

"బాలక్రీడలఁ గొన్ని నాళ్ల పిదపన్ భామాకుచాలింగనా
లోలాభ్యున్నతిఁ గొన్ని నాళ్ల మఱి యిల్లున్ ముంగిలిం గొన్ని నా
ళ్లీలీలన్ విహరించితిన్ సుఖఫలం బెందేనియున్ లేదుగా
చాలున్ నీ పదభక్తిఁ జేసెదను గృష్ణా! దేవకీనందనా!" 83

ఇట్లు పోతన ప్రభావము చేతనమైన, ధూర్జటి ప్రభావము స్ఫూర్జితమైన దేవకీనందనశతకము పదునారవశతాబ్ది పూర్వార్ధము కంటె పూర్వగ్రంథము కాదు. కాఁబట్టి దేవకీనందనశతకము దేవరాయల కాలములోని జన్నమంత్రి రచించిన శతకము కాదు. అది మఱొకటి అగును. అనుపలబ్ధము.

అప్పకవీయమునందు దేవకీనందన శతకపద్యము కలదు.

"చతరంభోధిపరీతభూవలయరాజన్యాలికోటీరరం
జితమాణిక్యవిరాజితచ్చరణరాజీవుండు ధర్మాత్మజుం
డతికార్పణ్యముతోడ మత్స్యపతిఁ దానాసింపఁ డే నీదు శా
శ్వతకారుణ్యము గల్గునంతకును గృష్ణా! దేవకీనందనా!"
209ప.3ఆ.

ఇది దేవకీనందనశతకమునందు అలతి పాఠభేదముల కలదు. (32) అప్పకవీయము రచనాకాలము 4-8-1656 వ తేదీ. పదునేడవశతాబ్ది ఉత్తరార్ధము. కావున దేవకీనందనశతకము రచనాకాలము పదునాఱవశతాబ్ది పూర్వార్ధమునకు, పదునేడవశతాబ్ది ఉత్తరార్ధమునకు మధ్యకాలము కావలయును. అది స్థూలముగ 1600 ప్రాంతము. ఇది పోతన ప్రభావమునకు, ధూర్జటి ప్రభావమునకు అనుకూలము.

# సంఖ్యాసూచిక

## శ్రీనాథయుగము


1. శ్రీనాథుడు. 1971. పుటలు 6-7.
2. History of Reddikingdoms. 1948. PP 194-195.
3. శ్రీనాథకవితాసమీక్ష. ద్వితీయభాగము. ప్లవ. పుట 240.
4. As 2. P 104.
5. Ibid. P 110.
6. Ibid. P 120.
7. Ibid. P 512.
8. శృంగారశ్రీనాథము. 1923. పుట 55.
9. శాసనపద్యమంజరి. ప్రథమభాగము. 1930. పుటలు 89-90.
10. Annual Report. 20. /1915.
11. తొమ్మిది వలె. పుటలు 92-93.
12. అదే. పుట. 112.
13. ఒకటి వలె. పుటలు 12-13.
14. Epigraphia Indica. Vol. IV.
15. ఒకటి వలె. పుట. 13.
16. ఎనిమిది వలె.
17. As 2. P. 467.
18. తొమ్మిది వలె. పుట 93.
19. ఆంధ్రకవితరంగిణి. నాలుగవసంపుటము. 1960. పుట 158.
20. తెలుగుసాహిత్యచరిత్ర. ప్రథమభాగము. 1991. పుట. 500.
21. ఒకటి వలె. పుట 11.
22. తొమ్మిది వలె. పుట 90.
23. As 14. No. 46.
24. మూడు వలె.
25. South Indian Inscriptions. Vol. VI. No. 781 PP: 256-257
26. As 2. P 251.

27. Ibid. P 122.
28. పదునాల్గు వలె.
29. అదే.
30. అదే.
31. As 2. P 150.
32. Ibid. P 157.
33. ఎనిమిది వలె. పుట 119.
34. As14. Vol. XI.
35. Ibid.
36. తొమ్మిది వలె. పుట 96.
37. As 2. PP 463-465.
38. ఎనిమిది వలె. అనుబంధము. పుట 12.
39. అదే. పుట 14.
40. అదే. పుట 12.
41. అదే. గ్రంథము. పుటలు 121-122.
42. అదే. అనుబంధము. పుటలు 15-16.
43. అదే. పుటలు 16-17.
44. అదే.
45. అదే.
46. అదే. పుట 12.
47. అదే.
48. అదే.
49. As 2. P 170.
50. Ibid.
51. Ibid. PP 173-174.
52. Ibid. PP 174, 179-180.
53. రెడ్డిసంచిక. 1947. పుట 348.
54. As 2. PP 183, 187.
55. Ibid. PP 187-189.
56. Ibid. PP 190, 192-193.
57. As 25. Vol. V. No. 34. PP 12-13.
58. As 14. Vol. XIII. P 237.
59. As 25. Vol. VI.
60. As 58.

61. As 14. Vol. XXI. P 27.
62. As 25. Vol. IV. No. 1381. P 486.
63. Ibid. No. 1357.
64. As 2. P 193.
65. Ibid. F.N. 59.
66. Velugoti Vari Vamsavali. Introduction. P 10.
67. Ibid. P38.
68. As 66.
69. మూడు వలె. పుట 159.
70. As 66. PP 43-44.
71. Ibid. P 44.
72. పందొమ్మిది వలె. పుటలు 156-157.
73. ఎనిమిది వలె.
74. తెలుగు విజ్ఞానసర్వస్వము. మూడవ సంపుటము. 1959. పుటలు 369-378.
75. అదే. పుట 559.
76. Early Vijayanagara Studies in its History & Culture. 1988. P 53.
77. ఎనిమిది వలె. పుటలు 160-180.
78. As 2. P 528.
79. Ibid. P 520.
80. Ibid. P 521.
81. ఒకటి వలె. పుటలు 51-67.
82. అదే. పుటలు 275-282.
83. Early Telugu Inscriptions. 1971. P 199.
84. ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము. 1963. పుట 212.
85. ఎనిమిది వలె. పుట 83.
86. అదే. అనుబంధము. పుట 86.
87. అదే. పుట 12.
88. అదే. పుట 110-127.
89. పందొమ్మిది వలె. ఐదవ సంపుటము. 1960. పుటలు 127-128.
90. ఒకటి వలె. పుటలు 264-265.
91. ఎనిమిది వలె. పుటలు 132-133.
92. As 2. P 167.
93. క. ఎనిమిది వలె. పుటలు 160-180, 187, 193.
    చ. ఒకటి వలె. పుటలు 241-261.

94. As 2. PP 526-528.
95. ఎనిమిది వలె. పుట 191.
96. త్రిలింగరజతోత్సవసంచిక. 1941. పుటలు 249-259.
97. ఒకటి వలె. పుటలు 249-254.
98. అదే. పుట 257.
99. As 76. P 54.
100. Ibid. PP 53, 57.
101. ఏబది మూడు వలె. పుట 276.
102. పూర్వగాథాలహరి. 1977. పుటలు 338-340.
103. చరిత్రచర్చ. 1989. పుట 82.
104. కాకతీయసంచిక. 1935. పుట 292.
105. సాహిత్యసంపద. 1989. పుటలు 149-154.
106. అనర్ఘమణులు. 1991. పుటలు 22-23.
107. అదే. పుటలు 15-16.
108. ఒకటి వలె. పుటలు 73, 93-94, 97.
109. అదే. పుటలు 74-94.
110. అదే. పుట 8.
111. A Critical Study of Sriharsha's Naishadhiyacharita. . P 128.
112. ఒకటి వలె. పుటలు 487-504.
113. అదే. పుటలు 505-533.
114. ఆంధ్రసాహిత్యచరిత్ర (లిఖితము)
115. అదే.
116. ఒకటి వలె. పుటలు 106-134.
117. అదే. పుటలు 105-106.
118. నూటపదునాలుగు వలె.
119. డెబ్బదినాలుగు వలె. పుట 557.
120. అదే.
121. A History of South India. 1984. P 423.
122. డెబ్బదినాలుగు వలె. పుట 556.
123. As 121. P 339.
124. Periapuranam (Condensed English Version) 1985. PP 353-364.
125. Ibid. P 8.
126. ఒకటి వలె. పుటలు 724-765.

127. నూటరెండు వలె పుట 891.
128. ఈశ్వరార్చనకళాశీలుఁ డు. 1974. పుటలు 37-43; 1985. పుటలు 29-34.
129. As 2. PP 409-413.
130. Ibid.
131. Ibid.
132. Ibid. PP 405-406.
133. తొమ్మిది వలె. పుటలు 94-96.
134. అదే. పుట 96.
135. ఒకటి వలె. పుటలు 149-153.
136. అదే. పుటలు 153-156.
137. నెల్లూరు మండలశాసనములు. రెండవ సంపుటము. పుటలు 950-951.
138. ఒకటి వలె. పుటలు 156-159.
139. అదే. పుటలు 139-166.
140. As 25. Vol. IV. No. 1381.
141. ఒకటి వలె. పుటలు 287-427.
142. అదే. పుటలు 948-968.
143. తొమ్మిది వలె. పుటలు 29-30.
144. శ్రీనాథకవితావైజయంతి. 1986. పుటలు 51-52.
145. As 25. Vol. IV. No. 1353. P. 475.
146. ఒకటి వలె. పుటలు 162-163.
147. అదే. పుట 168.
148. అదే. పుటలు 167-168.
149. అదే. పుట 168.
150. పందొమ్మిది వలె. పుటలు 91-92.
151. ఒకటి వలె. పుటలు 320-21.
152. అదే. పుటలు 766-770.
153. అదే. పుటలు 731-844.
154. అదే. పుటలు 844-855.
155. అదే. పుటలు 874-891.
156. నూటఅయిదు వలె. పుటలు 106-131.
157. As 2. P 525.
158. నూటఅయిదు వలె. పుటలు 131-145.
159. తెలుఁ గు వీరగాథాకవిత్వము. రెండవసంపుటము. 1983. పుటలు 240-241.

160. అదే. పుట 242.
161. ఒకటి వలె. పుటలు 175-235.
162. నూటఅయిదు వలె. పుటలు 42-73.
163. ఇరువది వలె. పుటలు120-121.
164. నూటఅయిదు వలె. పుటలు 74-148.
165. నూటిరువదియెనిమిది వలె. 1974. పుటలు 53-82; 1985. పుటలు 42-64.
166. An Alphabetical Index of Telugu Books in the Government Oriental Manuscripts Library Madras. P 135. Nos. 2944, 2945 , 2945.
167. శ్రీనాథుడు శృంగారియా? - చాటువులు. వికారి. పుట 8.
168. ఎనిమిది వలె. పీఠిక. పుట 31.
169. క్రీడాభిరామము. 1909. పీఠిక. పుట 3.
170. నూటఅరువదియేడు వలె. పుట 54.
171. ఇరువది వలె. పుటలు 190-191; 304-312; 434-438.
172. అదే. పుటలు 114-120.
173. శ్రీనాథునికవిత్వతత్త్వము. 1964. పుటలు 4-5; 48-49; 50-80.
174. ఇరువది వలె. పుటలు 434-435.
175. నూటఅయిదు వలె. పుటలు 74-148.
176. నూటయిరువదియెనిమిది వలె. 1974. 9-10; 1985. 7-8.
177. ఒకటి వలె. పుట 12.
178. అదే. పుట 30.
179. నూటయిరువదియెనిమిది వలె. పుటలు 1974. 83-108; 1985. 65-85.
180. అదే. పుటలు 1974. 109-130; 1985. 86-104.
181. ఆంధ్రకవులచరిత్రము. ప్రథమభాగము. 1937. పుట 558.
182. పందొమ్మిది వలె. ఆఱవ సంపుటము. 1961. పుట 187.
183. అదే. పుట 190.
184. As 2. P 193. F.N. 59.
185. నూటయెనుబదియొకటి వలె. పుట 559.
186. ఇదువది వలె. పుట 186.
187. మానవల్లికవి - రచనలు. 1972. పుటలు 396-397.
188. శతకసంపుటము. అక్షయ. నారాయణశతకము. పీఠిక. పుటలు 1-2.
189. పోతన సాహిత్యగోష్ఠి 1984. పుట 2.
190. నూటయెనుబదియేడు వలె. పుటలు 230-235.
191. నూటఅయిదు వలె. పుటలు 185-210.

192. లక్ష్మణరాయవ్యాసావళి. 1923. పుటలు 70-121.
193. ఇరువది వలె. పుట 502.
194. డెబ్బదినాలుగు వలె. పుటలు 281, 284.
195. అదే. పుట 295.
196. The Bahminis of the Deccan. P 201-204.
197. Ibid. PP 219-220. N. 47.
198. As 66. PP 43-44.
199. As 196. PP 209.
200. As 66. P 44.
201. The Suryavamsi Gajapatis of Orissa. 1957. P 54.
202. Mediaeval History of the Deccan. 1974. PP 63-65 & 99-109.
203. డెబ్బదినాలుగు వలె. పుట 365.
204. As 202. P 113.
205. Ibid.
206. Ibid.
207. Ibid.
208. Ibid. PP 3-114.
209. Ibid. P 114. F.N. 2.
210. శ్రీమహాభాగవతము. అకాడమిప్రచురణ. మొదటి సంపుటము. పుట 3.
211. డెబ్బదినాలుగు వలె. పుట 383.
212. అదే.
213. As 202. PP 176-182.
214. As 66. P 44.
215. Ibid. F.N. 75A.
216. డెబ్బదినాలుగు వలె. పుట 304.
217. As 201. PP 43-48.
218. Further Sources of Vijayanagara Empire. Vol. II. 1946. P 67.
219. As 202. P 67.
220. నూటయెనుబదితొమ్మిది వలె. పుటలు 16-17.
221. పందొమ్మిది వలె. పుట 174.
222. సకలనీతిసమ్మతము. 1970. పీఠిక. పుటలు 11-12.
223. The Kakatiyas. 1978. P 105.
224. మడికి సింగన. 1988. పుట 4.

225. అదే.
226. A Corpus of Inscriptions in the Telingana Districts. Vol. II. P 113
227. ఇరువది వలె. పుటలు 506-507.
228. రెండువందల ఇరువదిరెండు వలె. పుట 8.
229. అదే. ఉపోద్ఘాతము. పుట 92.
230. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా? ! 1983. పుటలు 7-8.
231. ఆంధ్రుల చరిత్రము. ద్వితీయభాగము. 1912. పుటలు 106-107.
232. As 2. PP 500-501.
233. Ibid.
234. A. As 14. Vol. VII. Appendix. P 83. F.N.
B. Mysore Inscriptions. No. 23. P 39
235. పందొమ్మిది వలె. ఐదవ సంపుటము. 1960. పుట 285.
236. అదే. పుటలు 123-125.
237. As 2. P 525.
238. నాథయోగి మన వేమన. 1987. పుటలు 174-201.
239. అదే. పుటలు 201-245.
240. అదే. పుటలు 139-173.
241. పందొమ్మిది వలె. పుట 249.
242. రెండువందల ముప్పదియెనిమిది వలె. పుటలు 168-172.
243. అదే. పుటలు 11-19.
244. అదే. పుటలు 2025.
245. అదే. పుటలు 31-34.
246. అదే. పుటలు 34-36.
247. అదే. పుటలు 36-39.
248. అదే. పుటలు 50-51.
249. అదే. పుట 51.
250. అదే.
251. అదే. పుటలు 52-54.
252. అదే.
253. అదే.
254. అదే. పుటలు 96-138.
255. అదే. పుటలు 139-173.
256. అదే. పుటలు 204-233.

257. వేమన. 1971. పుటలు 121-122.
258. రెండువందల ముప్పదియెనిమిది వలె. పుటలు 262-263.
259. అదే. పుటలు 71-74.
260. History of Hindu Chemistry. Vol. II. PP XLI; XXXVII.
261. Saivism and the phallic world. Vol II. P 745.
262. రెండువందల ముప్పదియెనిమిది వలె. పుటలు 125-126.
263. అదే. పుటలు 244-268.
264. అదే. పుటలు 269-283.
265. అదే. పుట 284.
266. అదే. పుటలు 292-293.
267. అదే. పుటలు 247-248.
268. Gujarat And Its Literature. 1967. PP 232-234.
269. రెండువందల ముప్పదియెనిమిది వలె. పుటలు 174-205.
270. అదే. పుట 248.
271. క. పందొమ్మిది వలె. ఆఱవ సంపుటము. 1961. పుటలు 94-95.
చ. నూటముప్పదియేడు వలె. పుటలు 1373-1376.
272. క. పందొమ్మిది వలె. ఆఱవ సంపుటము. 1961. పుటలు 95-96.
A. As 25. Vol. IV. No. 789. PP 260-265.
273. అముద్రితసిద్ధాంతగ్రంథము. శ్రీకృష్ణదేవరాయవిశ్వవిద్యాలయము.
274. నాసికేతోపాఖ్యానము. 1972. ఆలోకనము. పుటలు 23-25.
275. విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము.
ప్రథమభాగము. 1933. పుట 135.
276. అదే. పుటలు 135-137.
277. As 121. P 272.
278. స్రవంతి. 1959. మే. పుటలు 37-50.
279. క. క్రీడాభిరామము. 1909. పీఠిక. పుటలు 2-5.
చ. నూటయెనుబదియొకటి వలె. పుటలు 408-409.
ట. రెండువందల ముప్పదియొకటి వలె. పుట 344.
త. ఆంధ్రపత్రికసారస్వతానుబంధము.
ప. శ్రీనాథకవిజీవితము. 1918, 1930. పుటలు 197-210.
గ. ఎనిమిది వలె. పుటలు 261-267.
జ. సారస్వతసర్వస్వము. 1924-25.
డ. భారతి. 1927. ఏప్రిల్. సంపుటి 4. సంచిక 4. పుటలు 21-28.
ద. అదే. సంపుటి 4. సంచిక 6. పుటలు 21-29.

